# ఆంధ్రకవులచరిత్రము

ప్రథమ భాగము

(పూర్వాంధ్రకవులు)

కీ. శే. కందుకూరి వీరేశలింగము

ప్రకాశకులు

హితకారిణీ సమాజము

రాజమహేంద్రవరము

కృతికర్త
నవ కవితా వైతాళికుడు



## కీ. శే. శ్రీ కందుకూరి వీరేశలింగం గారు

తీగ తెగి మూగవోయిన రాగవీణ
లెన్ని తీయగా మరల మ్రోయింపఁబడియె,
ఎన్ని నిర్గంధ కుసుమమ్ము లెగసె వలపు
అతని చేతి విన్యాస మహస్సు వలన,

— శ్రీసహదేవ

*To*

*Sri Rajah Ravu*

*Venkata Kumara Mahipathi Surya Rao*

*Bahadur Garu,*

*Maharajah of Pithapuram,*

*This book is most respectfully dedicated*

*by the author.*

---

ఏను శ్రీపీఠికాపురాధీశ్వరునకు
నాంధ్రకవులచరిత్రంబు నతిశయాను
రాగమున నంకిత మొనర్తు రావు శ్రీకు
మారమహిపతిసూర్యరాణ్మనుజపతికి.

కందుకూరి వీరేశలింగం

ప్రాప్తిస్థానము
హితకారిణీ సమాజము
రాజమహేంద్రవరము

# ప రి చ య ం

శ్రీ కందుకూరి వీరేశలింగంగారు ఆంధ్రకవుల చరిత్ర రచనను 1886-వ సంవత్సరంలో ఉపక్రమించి 1894-వ సంవత్సరంలో పరిపూర్తి చేసినారు. వారు కవుల చరిత్రను వ్రాస్తూ ఎప్పటికప్పుడు " వివేకవర్ధని, చింతామణి " పత్రికలలో ప్రచురిస్తూ వచ్చారు.

ఆంధ్రకవుల చరిత్ర ప్రథమభాగమును నేను 1887-వ సంవత్సరమునందు ప్రకటించితిని." అని శ్రీ కందుకూరి వారు తమ జీవితచరిత్రలో పేర్కొన్నారు. 1894-వ సంవత్సరములో ఒకసారి, 1897-వ సంవత్సరంలో మరి యొక సారి ప్రచురించినారు.

ఆంధ్రకవుల చరిత్రను - పూర్వాంధ్రకవులు - మధ్యకాలపుకవులు - ఆధునిక కవులు - అని మూడు భాగాలుగా విభజించి 1890-వ సంవత్సరములో ఒకే ఒక్క సంపుటముగా వెలువరించినారు. ఆనాడు ఆంధ్రకవుల చరిత్రమీద వచ్చిన సమీక్షల్ని పరికించి, పండితమిత్రుల సలహాలను పాటించి శ్రీ వీరేశలింగంగారు కొన్ని మార్పుల్ని చేర్పుల్ని చేసి నన్నపార్యుని మొదలు కవిరాక్షసుని వరకు పూర్వాంధ్రకవులుగా విభజించి 1917-వ సంవత్సరంలో ప్రథమభాగముగా ప్రకటించారు. వృద్ధాప్యకారణముచేత ఆంధ్రకవులచరిత్ర తక్కిన రెండుభాగాల్ని శ్రీ వీరేశలింగంగారు తమచేతిమీదుగా పరిష్కరించ లేకపోయినారు.

శ్రీవీరేశలింగంగారికన్నా మున్నుగా గురుజాడ శ్రీరామమూర్తిగారు, ఆంధ్రకవుల జీవితాల్ని రచించి 1876 వ సంవత్సరంలోనే ప్రచురించారు. పెద్దాపురంనుండి ప్రకటింపబడే " శ్రీ ప్రబంధ కల్పవల్లి " అనే పత్రికలో ప్రచురిస్తూ ఉండేవారు. వారికవుల జీవితరచనలో కాలక్రమాన్ని పాటించ లేదు. భారతాంధ్రకవులు-రామాయణాంధ్రకవులు - ఆంధ్రపంచకావ్యకవులు- ఇత్యాదిగా విభాగించి రచించారు. ఆ కవుల జీవితరచన సమగ్రంగా లేక

జనశ్రుతిలోని కథలతో గాథలతోనిండి ఉంది. అయినా గురుజాడ శ్రీరామ మూర్తిగారి కవిజీవితాలు శ్రీవీరేశలింగంగారి కవులచరిత్ర రచనకు ప్రేరక మని చెప్పవచ్చు.

శ్రీ కందుకూరి వారు తమ కవులచరిత్రలో కవులకాలనిర్ణయాలకు ఎక్కువ ప్రాధాన్యమిచ్చారు. కవుల కావ్యాల గుణదోషాలను కూలంకషంగా కాక పోయినా దిఙ్మాత్రంగా నయినా సమీక్షించారు వారు నిర్ణయించిన కొందరి కవుల కాలనిర్ణయాలను ఆధునికులంగీకరింపక విమర్శించారు. ఆ విమర్శనల్ని పరికించిన శ్రీ వీరేశలింగంగారు అలా జరగడానికి హేతువుల్ని తమ కవుల చరిత్ర పీఠికలోను తమ జీవితచరిత్రలోను ఉల్లేఖించు కొన్నారు. ప్రథమ ప్రయత్నంలో ప్రమాదాలు దొరలడం వింతకాదు. విమర్శనీయం కాదు.

ఆనాటికి-అనగా శ్రీవీరేశలింగంగారు కవులచరిత్ర వ్రాసేనాటికికన్నా నేడు అనేక శిలాశాసనాలు, తామ్రశాసనాలు బాహిరిల్లినవి. అనేక తాళపత్ర గ్రంథాలు వెలుగులోనికి వచ్చాయి. క్రొంగ్రొత్త రీతులలో విశిష్ట పరిశోధ నలు దారులు తీశాయి. స్థిరంగా కవుల కాలనిర్ణయాలు, చేయడానికి వలను పడుతున్నది. అయినా యింకా కొందరి కవుల కాలనిర్ణయాలు ఊహగానాలే, ఆనాటికవులుతమకావ్యాల్ని నృపాలాంకితించేస్తూ వారి సాహసౌదార్యాంకాలను వారివంశానుక్రమణికలను తమరచల్ని తమవంశాల్ని ఉటంకించుకొన్నారే కానితమ జీవితచరిత్రాంశాలను లవలేశమైనా ఉల్లేఖించుకొన్నారుకాదు. ఆకార ణంగా వారి అభిరుచులు, అలవాట్లు, దినచర్య జీవితంలోని రసవత్తర ఘట్టాలు, అన్నీ విస్మృతి కుహరంలోనే వుండిపోయినాయి. అది ఆంధ్రుల దురదృష్టం. ఈనాటి వారివలె ఆనాటి కవీశానులు స్వీయచరిత్ర ప్రస్తావనా ప్రలోభలోలుపులుగారేమో.

శ్రీ వీరేశలింగంగారి మరణానంతరం వారి ఆంధ్రకవులచరిత్ర సమగ్రంగా సంస్కరింపబడకుండగానే 1937 వ సంవత్సరంలో యథాతథంగా ముద్రణ పొందింది. తదుపరి 1940 వ సంవత్సరంలో ఆంధ్రకవులచరిత్ర ద్వితీయ భాగాన్ని 1950వ సంవత్సరంలో తృతీయ భాగాన్ని హితకారిణీ సమాజం అచ్చొత్తించింది.

ఆంధ్రకవుల చరిత్రలో కొట్టవచ్చినట్లు కానిపిస్తున్న కొన్ని లోపాలను చక్కదిద్ది ప్రచురించాలనే ఉద్దేశంతో మధురకవి శ్రీ నాళము కృష్ణారావు, శ్రీ దంగేటి నారాయణస్వామి అధ్యక్ష కార్యదర్శులుగానున్న హితకారిణీ సమాజం 1950 వ సంవత్సరంలో ఆంధ్రకవుల చరిత్రను పరిష్కరించే బృహత్కార్య భారాన్ని ఆంధ్రచరిత్రపరిశోధక వైదుషీధురంధురులయిన శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మగారి భుజస్కంధాలమీదనుంచింది. సహృదయంతో ఆకార్యభారాన్ని స్వీకరించి సువిమృష్టంగా పరిశీలించి వారాంధ్ర కవుల చరిత్రను సంస్కరించి 1952 వ సంవత్సరప్రాంతాలలో అవతారికతో పాటు హితకారిణీ సమాజం వారికందచేశారు.

ఆనాటినుండి హితకారిణీ సమాజంవారు ఆంధ్రకవులచరిత్రను పునః ముద్రించడంకోసం బహుళప్రయత్నాలు చేసినారు. నేటికి దైవమనుకూలించింది. ఆంధ్రప్రదేశ ప్రభుత్వం ఆర్థికసహాయం చేసింది. ఆంధ్రకవుల చరిత్ర ప్రథమభాగం వెలుగుచూచింది.

శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు ఆంధ్రకవుల చరిత్రలో నూతనంగా సంతన చేసిన కవుల నామాలముందు విషయసూచికలో చుక్కల గుర్తులుంచినాము.

వారిందులో చేర్చిన నూత్న విశేషాల్ని, అధస్సూచికల్ని [ ] ఈ బ్రాకెట్లచే సూచించినాము.

వారు చేర్చిన విశేషాంశాలు, అధస్సూచికలు ఎంత అమూల్యాలో విద్వద్వర్యులకు వివరింపనక్కరలేదు.

ఓం తత్ సత్

రాజమహేంద్రవరం<br>12 - 2 - 1978

విద్వాన్ సహదేవ సూర్యప్రకాశరావు<br>ఉపాధ్యక్షులు<br>హితకారిణీ సమాజము

# ప్రస్తావన

సంఘ సంస్కర్తలు. నవకవితా వైతాళికులు శ్రీకందుకూరి వీరేశలింగంగారు రచించిన ఆంధ్రకవుల చరిత్ర ప్రతులకోసం తెలుగునాడు నాల్గు చెరగుల నుండి మాకు త్తరాలు పుంఖాను పుంఖాలుగా వచ్చినవి. వస్తున్నవి. అప్పటికే ఆంధ్రకవులచరిత్ర మూడు భాగముల ప్రతులన్నియు చెల్లుబడి యయి పోయినవి.

పుస్తకాపేక్షితులయిన ఆంధ్రపుత్రుల అభ్యర్థనల ననుసరించి. ఆనాటికి ఆంధ్ర కవులచరిత్ర మీది విమర్శనలను గమనించి దానిని సమగ్రంగా సంస్కరించి ప్రచురింప ఆనాటి హితకారిణీ సమాజంవారు కృతనిశ్చయు లైనారు

ఆనాటి హితకారిణీ సమాజమునకు అధ్యక్షులు మధురకవి శ్రీ నాళము కృష్ణారావు కార్యదర్శి శ్రీ దంగేటి నారాయణస్వామి, శ్రీ నాళము కృష్ణారావు అధ్యక్షతను 30-10-50 నాడు జరిగిన హితకారిణీ సమాజ కార్య నిర్వాహక వర్గ ప్రత్యేకసభలో ఈ క్రింది తీర్మాన మామోదింపబడినది.

"ఆంధ్ర కవులచరిత్ర సవరణలో అత్యవసరమని తోచిన సవరణలు, మార్పులు, చేర్పులు, ఈ వగైరా మార్పులు చేర్చుట లేక Foot Notes లో చేర్చుట, అనే మొదలగు సూచనలన్నియు శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మగారికే వదలివేయుటకు తీర్మానింపబడినది. అతి ముఖ్యమని తోచిన చోట్ల మార్పులుచేస్తూ వీరేశలింగంగారి ప్రత్యేకతకు భంగం రానివ్వరని కమిటీవారు విశ్వసించుచున్నారు."

ఆ తీర్మానము ననుసరించి శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు ఆంధ్రకవుల చరిత్రను సమగ్రంగా పరిశీలించి పరిష్కరించి హితకారిణీ సమాజం వారికి అందచేశారు.

శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మగారిని ఆ బృహత్కార్యం నిర్వర్తించి నందులకు - మా హితకారిణీ సమాజం 500 రూపాయలు పారితోషిక మిచ్చి ఘనంగా సన్మానించింది.

ఆ నాటినుండి ఆంధ్రకవులచరిత్రను ప్రచురించడంకోసం ప్రయత్నాలు చేస్తున్నాము, ప్రధానంగా ధనాభావమే మా ప్రయత్నానికి అవరోధమని మనవి చేయనవసరంలేదు. నేటికి మా ప్రయత్నం సఫలీకృతమయింది. గౌరవనీయులు, ఆంధ్రప్రదేశ, ప్రభుత్వ విద్యాశాఖామాత్యులు శ్రీ మండలి వేంకట కృష్ణారావుగారి సహృదయత వల్లనే ఆంధ్రప్రదేశ ప్రభుత్వం నుండి ఆంధ్ర కవులచరిత్ర ముద్రణకోసం రు 10,000 విరాళమందనది. వారికి మా మనః పూర్వక కృతజ్ఞతాభివందనాలు, ఆంధ్రకవుల చరిత్ర ప్రథమ భాగాన్ని ముద్రించినాము. ఇటులనే ఆంధ్రకవుల చరిత్ర ద్వితీయ భాగాన్ని (మధ్యకాలపు కవులు) తృతీయ భాగాన్ని (ఆధునిక కవులు) ప్రచురించడానికి విరాళ మందీయుమని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వాన్ని అభ్యర్థించుచున్నాము,

పాఠకుల ఉపయోగార్థం పూర్వ ప్రచురణల పీఠికల్ని ఈ గ్రంథంలో పొందు పఱచినాము.

ఇందులో ఇంకను ఏమయిన మార్పులు చేయవలసి యున్నను, పొసగిన దొసగులను మలి ముద్రణలో సవరించగల వారము.

సాకల్యంగా ఆంధ్ర కవులచరిత్రమును పరిష్కరించి ఇచ్చిన చరిత్ర చతురాననులు కీ. శే. శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మగారికి మా శ్రద్ధాంజలి. మమ్ము ప్రోత్సహించి, మాతో సహకరించి ఈ గ్రంథమును సర్వాంగ సుందరముగా తీర్చి దిద్ది పరిచయవాక్యాలు వ్రాసిన మా హితకారిణీ సమాజోపాధ్యక్షులు విద్వాన్ శ్రీ సహదేవ సూర్యప్రకాశరావుగారికి కృతజ్ఞతా పూర్వకంగా మా సుమాంజలి.

పుస్తక మచ్చువేసి యిచ్చిన శ్రీ సుజన రంజనీ ముద్రాశాల వారికి మా అభి నందనాలు.

మొండ్రేటి లక్ష్మీవతి
అధ్యక్షులు

దంగేటి లక్ష్మణరావు
కార్యదర్శి

హితకారిణీ సమాజము

రాజమహేంద్రవరం
12—2—1978

# పీఠిక

నే నీకవులచరిత్రమును వ్రాసి ప్రకటించి యిప్పటికి ముప్పది సంవత్సరములు దాఁటి పోయినది. నేనప్పటికి దొరికినసాధనకలాపముతో కవులకాలనిర్ణయాదులను జేయుచు నేదో యొకరీతిని గ్రంథము సాంతముచేసితిని. ఇప్పటివలె నప్పుడు గ్రంథాలయములు లేవు; ఇప్పుడు ముద్రింపఁబడి యెల్లవారికిని సుసాధ్యము అయి యున్నగ్రంథములలో నూఱులకొలఁది కాకపోయినను పదులకొలఁది యైనను తెలుఁగుగ్రంథము లప్పు డముద్రితము అయి తాళపత్రైకశరణ్యములయి దుస్సాధ్యము అయి యుండెను; ఇప్పుడు ప్రకటింపఁబడియున్న శిలాతామ్ర శాసనాదులలో ననేకము లప్పుడు ప్రకటింపఁబడకుండెను. ఇట్టిస్థితిలో కవులచరిత్రమును వ్రాయుట యెప్పు డెంతకష్టకార్యముగా నుండునో నేను చెప్పనక్కఱ లేకయే బుద్ధిమంతు లూహించుకోవచ్చును. అయినను నేను వ్యయప్రయాసములకు వెనుకదీయక పుస్తకసంపాదనమునకయి చెన్నపురి తంజాపురి మొదలయినదూరప్రదేశములకు సహిత మరిగి యిచ్చినవారియొద్దనుండి తాళపత్రపుస్తకములను సంపాదించియుఁ గొన్నిటికి మాతృకలకు ప్రతికలు వ్రాయించియు నియ్యనివారికడ జీర్ణతాళపత్రపుస్తకముల నెరవుగాఁ గొని చదివి వానినుండి కావలసిన చరిత్రాంశములను వ్రాసికొనియు నెలలకొలఁది చెన్నపట్టణములో నుండి యచ్చటి ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారమున కనుదినమును బోయి యందలిపుస్తకముల నెల్లఁ బరిశోధించి వానిలోనుండి యావశ్యకభాగములను వ్రాసికొనియు శక్తివంచనలేక పాటుపడి నా కప్పటికి లభించిన పరికరసాహాయ్యమున నాంధ్రకవులను గూర్చి యేదో తోఁచినదానిని వ్రాసి ప్రకటించి కవులచరిత్రమనిపించితిని. క్రొత్తగా పూనుకొని పనిచేయుట కష్టము; చేసినదానిలో తప్పులు పట్టుట సులభము. నేను వ్రాసినదానిలో తప్పులు కుప్పలుగాఁ గలవని నే నెఱుఁగుదును; బహుస్థలములయందు మార్పులు చేయుట యావశ్యకమనియు నే నెఱుఁగనివాఁడను గాను. అయినను నాకంతకంతకు వృద్ధత్వమునకు తోడు వ్యాధిబాధలును శరీరదౌర్బల్యములును గూడ హెచ్చగుచు వచ్చుటచేత నేమి చేయుటకును శక్తుఁడను గాక పోయితిని. అందుచేత నేను పుస్తకమును మరలముద్రింపవలసివచ్చినప్పుడు మార్పులు చేయుట మాట యటుండఁగా ప్రూఫులు దిద్దుటకు సహితము సమర్థుఁడను గాక సమస్తమునకును ముద్రాశాలలవారి నేనమ్మి పుస్తక మున్న దాని నున్నట్టుగానే పలుతడవలు ముద్రింపింపవలసినవాఁడ నయితిని, ఇఁక నేను పుస్తకమును సవరింపఁగలుగుదు నన్న యాశను చిరకాలము క్రిందటనే వదలుకొని నిరాశతో నాయొద్ద నప్పటి కుండిన

వ్రాఁతపుస్తకములను సహితము వారు మంచియుపయోగమునకుఁ దెత్తు రన్న యుద్దే
శముతో నితరులకిచ్చి వేసితిని; కవులను గొందఱిని గూర్చి తరువాతివా రప్పుడప్పుడు
పత్రికలలో వ్రాయుచు వచ్చినవానిని జాగ్రత్తచేసి యుంచక చదివినవాని నెప్పటి
కప్పుడే యొకమూల పాఱవైచి యశ్రద్ధచేసి వాని వలనిలాభమును బోఁగొట్టుకొంటిని.
ఇట్లుండఁగా నీనడుమ నొక రిద్దఱు భాషాభిమాను లొకానొకయాంధ్రకవిని గూర్చి
పత్రికలలో వ్రాయుచు తత్కవులను గూర్చి నేను పడినప్రమాదములను నాపుస్త
కమునందలిలోపములను సుహృద్భావముతో వ్యక్తీకరింపఁ బ్రయత్నింపక తాము
వ్రాసినవ్యాసములలో నాయజ్ఞతను గూర్చి యించుక నిందాగర్భముగా వ్రాయఁ
జొచ్చిరి. నే నట్టినిందకు సంపూర్ణార్హుఁడ నే యయినను నాకు మహోపకారము
లయినవారిదూషణభాషణములు ప్రకృతిదౌర్బల్యదోషమునుబట్టి నాకుఁ గొంతరోష
మును పుట్టించి యీసారి నాకవులచరిత్రమును చేతనైనంతవఱకు సంస్కరించి మఱి
ప్రకటింపవలె నన్న బుద్ధిని నా హృదయములో నంకురింపఁ జేసినవి. ఈబుద్ధి పుట్టుట
చేత నావఱకే కొంతకాలమునుండి పునర్ముద్రణము నపేక్షించి యున్నకవులచరిత్రము
నీసారి దిద్ది మఱి ప్రకటింపవలె నని నిశ్చయము చేసికొంటిని. ఇట్లు నిశ్చయము చేసి
కొన్నదినముననే యీశ్వరమహిమ యేమోకాని కారణము లేకయే యాకస్మికముగా
నాయారోగ్యములో మంచికి మార్పు కనఁబడెను. ఈయారోగ్యాభివృద్ధివలనఁ
గొంతయుత్సాహవంతుఁడ నయి నే నీపనికిఁ బూనుట యీశ్వరేచ్ఛ యన్నవిశ్వాస
మును బొందినవాఁడ నయి శక్యాశక్య విచారము చేయక "తలఁచుకొన్నప్పుడే తాత
పెండ్లి" యన్నట్లా దినముననే పని నుపక్రమించితిని. ఇట్లు జరగుట కడచినఫాల్గుణ
మాసారంభమున. నా కప్పటి కఱువదితొమ్మిదేండ్లు నిండవచ్చు చుండినవి. ఈపని
లో మిత్రులను భాషాభిమానులును నాకు తోడ్పడకమాన రన్నవిశ్వాసముతో
నాంధ్రభాషావిషయమునఁ బనిచేయు చున్నయైదాఱుగురుమిత్రులకు లేఖలను వ్రాసి
మార్చినెలనడుమను వార్తాపత్రికలలో నొకచిన్నవిన్నపమును బ్రకటించితిని. ఈవిజ్ఞా
పనమునకు కొరాపుట్టినుండి భాస్కరరావుగా రొక్కరు మాత్రమే స్వాభిప్రాయము
నిచ్చుచు బదులు వ్రాసిరి. నేను లేఖలను వ్రాసినమిత్రులలో నొక రీక్రొత్తకూర్పులో
నాంధ్రభాషావాఙ్మయచరిత్రమునుగూడఁ జేర్పవలసినదని వ్రాసిరి; ఇం కొకరు
ప్రబంధములకంటె శతకములే జనసామాన్యములో నెక్కువగా వ్యాపించియుండుట
చేత శతకములను జేసినకవులను గూర్చికూడ నిందొకప్రకరణమును జేర్పవలసిన దని
వ్రాసిరి. చేయుట చెప్పినంతసులభము కాక పోవుటచేత నేనీడెబ్బదవయేట నీ
దేహదౌర్బల్యముతో మిత్రులు కోరినంతచేయఁగలనో లేనో కాని చేత నైనంతవఱకుఁ
జేయఁ బ్రయత్నించెదను. వృద్ధత్వదోషముచేత నాయవయవపటుత్వములో విశేష

భాగము తగ్గిపోయినను నాబుద్ధిబల మింకను పూర్ణముగా తగ్గిపోలే దని నే నీప్ర
యత్నమువలనఁ దెలిసికొనుచున్నాఁడను. వ్రాయునప్పుడు నా చేతులు వడఁకు
చున్నవి; కన్నులు మండుచున్నవి. అయినను కలము చేతఁ బుచ్చుకొన్నప్పుడు
మునుపటివలెనే చిత్తక్కులేకయే వ్రాయఁగలుగుచున్నాను. ఈప్రథమభాగ మేదో
యొకవిధముగా నిప్పటికి ముగింపఁబడెనుగదా! దీనియం దీవఱ కితరుఁ లెఱుఁగని
నూతనవిషయములును చరిత్రాంశములును విశేషముగా లేకపోయినను పుస్తక పరి
మాణముమాత్ర మేలాగుననో మూఁడురెట్లకంటె నధికముగా పెరిగి యీయొక్క
భాగమే యొక్క ప్రత్యేకసంపుటముగాఁ జేయఁబడ వలసినదయ్యెను.

ఈపనిలో నాకుఁ దోడ్పడినవారిలో నామిత్రులును విజ్ఞానచంద్రికాసంస్థాపకులును
నయినశ్రీకొమఱ్ఱాజు వేంకటలక్ష్మణరావుగారగ్రగణ్యు లని చెప్పవలసియున్నది.
వారు గ్రంథసంస్కారమునుగూర్చి యనేకసూచనలు చేయుటయేకాక నేను కోరిన
శాసనములను గ్రంథభాగములను వ్రాసినవెంటనే పంపి నాకృతజ్ఞత కత్యంత పాత్రు
లయి యున్నారు. ఆంధ్రపరిషత్సంస్థాపకులును పరిషత్పత్రికా సంపాదకులు నయిన
మన్మిత్రులు జయంతి రామయ్యపంతులుగారు యుద్ధమల్లునిశాసనములోనిపద్యములను
వ్రాసి పంపియు తాము ప్రకటించుచుండినకవిజనాశ్రయఛందస్సుయొక్క పీఠికను
ముద్రింపఁబడక ముందే జేయునట్లు చేసియు నాకు సాయము చేసిరి. ఆంధ్రపరిషత్ప
త్రికాకార్యనిర్వాహకు లైనకొత్తపల్లి సూర్యారావుగారును, చెన్నపురి ప్రాచ్యలిఖిత
పుస్తకభాండాగార కార్యస్థానమునందు పండితులుగానున్న వేటూరి ప్రభాకర
శాస్త్రిగారును, పంచాగ్నుల దక్షిణామూర్తి శాస్త్రిగారును, తమగ్రంథాలయము
లలో నున్నపుస్తకభాగములను పద్యములను నేను కోరినవానిని వ్రాసి పంపి నా
కెంతో తోడుపడిరి. పిఠాపురములోని యాంధ్రపుస్తకపరిశోధకమండలివారి గ్రంథా
లయ కార్యనిర్వాహకులైనవంగూరిసుబ్బారావుగారుతమగ్రంథాలయములోని పుస్తక
ములను నేనుకోరినవానినిదెచ్చి యిచ్చియు కవులనుగూర్చి తాము వ్రాసిన సేకరించిన
యంశములను దెలిపియు నాకు సాహాయ్యము చేసిరి. వారి కందఱికి నిందుమూలమున
నాకృతజ్ఞతాపూర్వకములైన వందనములను సమర్పించుచున్నాను. వారు చేయవలసిన
సాయ మింతటితో తీఱిపోలేదు. ఇప్పు డన్నిటిలో చిన్న దయిన ప్రథమభాగ
మొక్కటిమాత్రమే ముగిసి యింకను పెద్దభాగములు రెండును మిగిలియే యున్నం
దున వారు చేయవలసినసాయ మంతయు నించుమించుగా ముందే యున్నదని చెప్ప
వచ్చును. మధ్యకవులలోను, ఆధునికకవులలోను, క్రొత్తగా చేరవలసినవారి పేరులను
చరిత్రములను దెలుపవలెను; ఉన్నవానిలో తాఱుమాఱుగాఁ బడియున్నవానిని
జా[illegible]రోగాక యందలిలోపములను గనఁబఱుపవలెను. ఇంకను బహువిధములఁ

జేయవలసినమార్పులను సూచింపవలెను. పైని పేర్కొనఁబడినవారు గాక గిడుగు
రామమూర్తి పంతులుగారును బుట్టా శేషగిరిరావుపంతులుగారును గూడఁదమకుఁ
దోఁచినయభివృద్ధిమార్గములను నాకుపదేశించి నాకృతజ్ఞత కర్హులైరి. అందఱికంటె
నెక్కువగా నాకు చిరకాలమిత్రులును, ఆంధ్ర భాషా వాఙ్మయము నందు విశేషకృషి
చేసినవారును, దేశాటనముచేసి యపూర్వపుస్తకసంపాదనము చేసినవారును నైన
శ్రీమానవల్లి రామకృష్ణకవిగారు నాకెంతో సాయపడుదురని కొండంతయాశ పెట్టు
కొంటిని గాని వారిసాయమును బొందుభాగ్యము నాకింకను లభింపకుండుటకుఁ జింతిల్లు
చున్నాను. కడచినమార్చి నెలలో మిత్రుల కైదాఱుగురికి వ్రాసినప్పుడే వీరికిని
వ్రాయఁగా జూన్ నెలవఱకును తాము సాయము చేయుటకు పనులతొందరచేత నవ
కాశ ముండ దని వారప్పు డుత్తర మిచ్చిరి. ఒకపనిని చేయవలె నని సంకల్పించు
కొన్నతరువాత దాని నారంభించి ముగించువఱకును నాకు నిద్రపట్టదు. కాల
మమూల్య మయినది. నేఁడు వ్యర్థముగాఁ బోఁగొట్టఁబడినకాలము రేపు కలిసిరాదు.
చేయఁదలఁచుకొన్నపనిని మఱునాఁటికని నిలిపి యుంచక నేఁడన్నదినముననే చేయవలె
నని తొందరపడుస్వభావముగలవారిలోఁ జేరినవాఁడను నేను. బ్రతు కస్థిరమగుటచేత
మఱునాఁటిదినము మన దగునో కాదో యన్న సందేహముతో వారు పెట్టినగడువు వచ్చు
వఱకు నేను వేచియుండక తోడనే కవిచరిత్రమును సవరింప నారంభించి సవరించిన
భాగము నెప్పటికప్పుడే ముద్రింపింపఁ దొడఁగితిని. అందుచేత నేను పుస్తకము
యొక్క సవరణము ముగించునప్పటికి పుస్తకముయొక్క ముద్రణము సహితమించు
మించుగా ముగిసెను. ఈలోపల నేను చెన్నపురిమీఁదుగా కడచిన యేప్రిల్ నెలలో
బెంగుళూరికిఁ బోవుచుఁ ద్రోవలో నీపనిమీఁదనే చెన్నపట్టణములో రెండుదినములు
నిలిచి ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారమునకుఁ బోయినప్పుడు వారిపను లనుకొన్న
దానికంటె శీఘ్రముగానే తీఱి శ్రీరామకృష్ణకవిగారు చెన్నపట్టణము చేరఁగలిగినందున
వారినక్కడఁ దలవనితలంపుగాఁ జూడఁ దటస్థించెను. ఆకాలమున లేఖామూలమునఁ
జేసిన ప్రార్థనమునే నే నప్పుడు వారికి స్వయముగాఁ గూడఁ జేసితిని. నేను
బెంగుళూరు చేరి పనిచేయుచు నేప్రిల్ నెలకడపట వారివాగ్దానమును జ్ఞప్తికిఁ
దెచ్చుచు వారి కుత్తరములు వ్రాసితిని. నాయుత్తరములకుఁ బ్రత్యుత్తరముగా వారు
తాము జూన్ నెలతరువాతనే సాయము చేయఁగలుగుదు మని వాగ్దానము చేసితి
మనియు, తమకార్యస్థానపుపని సామాన్యముగా నుండుదానికంటె నత్యధికముగా
నుండిన దనియు, తమపుస్తకము లన్నియు వనపర్తిలోనే విడిచిపెట్టఁబడిన వనియు,
అయినను దమశక్తిలో నున్నంతవఱకు నేను గోరినసమాచారమును మఱునాఁటి
టపాలోఁ బంపెద మనియు, నేను వేగిరపాటుతో ప నడుపుచున్నందులకు చింతిల్లు
చున్నా మనియు, మొదటిభాగములోఁ జేయఁబడిన ప్రాంతనిర్దేశము లనేకములు
మార్పఁబడవలసి యున్నవనియు, నూఱుగురు నవకవులు మొదటిభాగములోఁ జేర్పఁ

బడవలసి యున్నారనియు, తెలుపుచు మెయి నెల రెండవ తేదీని వారు నాపేర వ్రాసిరి. నేను వారిని పంపుఁడని కోరినవానిలో విక్రమసేనము, విజయసేనము, అథర్వభారతము, అథర్వచ్ఛందస్సు మొదలయినవాని యవతారికలు చేరి యున్నవి. వారు మఱునాఁడే పంపెదమన్న సమాచారమే హేతువుచేతనో నా కీవఱకును జేరనే లేదు. అట్లు చేరకపోవుట ప్రోషణకార్యస్థానభటులలోపమువలన నయియుండును. క్రొత్తగా నేను భోజరాజీయమును వరాహపురాణమును ముద్రింపఁబూనినప్పుడు వాని ప్రత్యంతరములను గద్వాలసంస్థానమున సంపాదించి తెచ్చి నాకిచ్చి ౧౯౦౮ వ సంవత్సరమునకుఁ బూర్వమునందే నా కృతజ్ఞతకుఁ బాత్రులైన పరమమిత్రులు శ్రీమానవల్లి రామకృష్ణయ్యగారు నేను కోరినపుస్తకము అప్పుడు తమయొద్ద లేకుండుటచేతనే పంపలేకపోయియుందురు గాని నామీఁదియనాదరముచేతఁ బంపక యుండియుండరు. వారు నాకియ్యఁదలఁచుకొన్న కవులనుగూర్చిన సమాచారము నిప్పుడిచ్చినను నేను దానిని కృతజ్ఞతాపూర్వకముగా నంగీకరించి దీని కనుబంధముగాఁ బ్రచురించెదను. ఆంధ్రపరిషత్పుస్తకభాండాగారములోని యసమగ్రమైన యుదాహరణపుస్తకమును నేను వ్రాయించి తెప్పించుటచేత నా కనేకపూర్వకవులనామములును వారి గ్రంథనామములను దెలిసినవి. శ్రీరామకృష్ణకవిగారియొద్ద నున్న జగ్గనకృతమైన ప్రబంధరత్నాకరముకూడ లభించి యుండినయెడల నింకను నెక్కువగాఁ బూర్వకవులపేరులును వారిగ్రంథములపేరులును నాకుఁ దెలిసియుండును. ఆపుస్తకమునకుఁ బ్రతికైనను వ్రాయించి తెప్పించుకొనుటకయి నేను ప్రయత్నములు చేసియు సఫలమనోరథుఁడను గాలేక పోయితిని. దానిని ముద్రింపించుచుండినట్లు కొన్నిమాసముల క్రిందట శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు కృష్ణాపత్రికలోఁ బ్రకటించిరి గాని గ్రంథముద్రణము పరిసమాప్తమయి కొనఁగోరువారికది లభ్యమయినట్లింతవఱకును గానఁబడదు. ఇటువంటిపుస్తకములను గలవారు తాము వానిని తమయొద్దనే యడఁచిఁ పెట్టుకొని యుంచక మాతృక నియ్యకపోయినను ప్రతికలనైనను వ్రాయించి ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారములవంటి ప్రసిద్ధపుస్తకాలయములయం దుంచినచో వానిని జదువఁగోరెడునావంటివారి కవి సుసంపాద్యములగును.

ఉదాహరణగ్రంథాదులవలన నాకిప్పుడు పూర్వకవులగ్రంథములపేరులును వానిలోని పద్యములును పెక్కులు తెలిసినను, ఆకవులు నేను చేసికొన్న సంకేతమునుబట్టి పూర్వకవులలోఁ జేర్పఁదగినవారో మధ్యకవులలోఁ జేర్పదగినవారో యిప్పుడు స్పష్టముగా తెలియరానందున వాని నీప్రథమభాగమునందుఁ జేర్పక తెలిసినవారాకవులకాలనిర్ణయాదులు చేసి తెలుపుదు రన్నయపేక్షతో వారిలోఁ గొందఱి నీ పీఠికలోఁ దెలుపుఁచున్నాను.

1. పెదపాటి సోమనాథుఁడు— ఈతనినే కవిలోకబ్రహ్మయందురు. ఇతఁ డరుణాచలపురాణము, శివజ్ఞానదీపిక, కేదారఖండము మొదలగు గ్రంథము లను జేసెను.

అరుణాచలపురాణములో 'వాక్ప్రౌఢితోషితదక్షవాటీమహాస్థాన భీమువేములవాడభీము'' అని భీమకవిని స్తుతించియుండుటచేత నాతని తరువాత నుండిన వాఁడు.

ఉ. రాజులు విక్రమోగ్రమృగరాజులు విశ్రుతదివ్యకాంతి రే
రాజులు రూపురేఖ రతిరాజులు మౌనగుణంబునందు రా
రాజులు దానశక్తి ధనరాజులు వైభవభోగవృద్ధి స్వా
రాజు లనంగ నొప్పుదురు రాజితతేజులు తత్పురంబునన్.

అరుణాచలపురాణము.

ఉ. కన్నియ రూపు గోరుఁ గనకంబును గోరును దల్లి బుద్ధిసం
పన్నతఁ గోరుఁ దండ్రి కులభవ్యత గోరు బంధుకోటి ప
క్వాన్నఫలాదిభక్షణము లన్యులు గోరుదు రిట్టు లిన్ని యుం
బన్నగ నొక్కచో నొదవ భాగ్యము చేసితిఁ గన్య నిచ్చెదన్.

కేదారఖండము.

2. నూరన్న — ఇతఁడు వనమాలీవిలాసము, ఉదయనోదయము, అనుగ్రంథము లను రచించెను.

ఉ. ఆతఱి రాజమంచనివహాంచలవీథుల కేగుదెంచున
జ్ఞాతదశాక్షిఁ బల్కె నటుచంద్రనిభానన దాదిపట్టి వి
జ్ఞాతసమస్తభూరమణజాతగుణాన్వయ వేత్రదండమున్
జేతఁ దమల్చి మోపు జనసింధురవం బెడలించె వేడ్కతోన్. —వన.

చ. సరభసలీలఁ గేళిసితసౌధము లొక్కట నిర్గమించి చ
ల్లిరి నరనాథుమీఁదఁ బురిలేమలు లాజలు దోయిలించి చె
చ్చెర శరదంబువాహములు చించి బయల్పడుచంచలాలతల్
పరిమితవృష్టిబిందువులఁ బర్వతరాజముఁ గప్పునాకృతిన్—

ఉదయనోదయము.

3. పొన్నాడపెద్దన్న — ఇతఁడు ప్రద్యుమ్న చరిత్రమును రచించెను.

క. పురగోపురశిఖరంబుల
గర మరుదై పద్మరాగకలశము లమరున్
జరమాచరమాద్రులపై
సరిపున్నమఁ దోఁచుసూర్యచంద్రులభంగిన్.

4. పెదపాటియెఱ్ఱాప్రెగడ — ఇతఁడు కుమారనైషధము, మల్హణచరిత్రము, లక్ష్మీపరిణయము చేసెను.

సీ. అలరెడుతెప్ప లలార్చినయందాఁక
యనిమిషకన్య కా దనఁగ వశమె ?
యమృతంబు చిలుక మాటాడినయందాఁకఁ
గనకంపుఁబ్రతిమ కా దనఁగ వశమె ?

కుమారనైషధము.

సీ. కువలయకమలాభినవమనోజ్ఞం బయ్యుఁ
బంకజీవనపరిప్లవము గాక
ఘనసారపున్నాగకమనీయ మయ్యును
గతవదుష్కలికసంయుతము గాక - మల్హణచరిత్రము.

5. చైతరాజుముమ్మయ్య — ఇతఁడు విష్ణుకథానిధానము చేసెను.

చ. వలపెటువంటిదో ముసలివాఁ డనవచ్చునె ? యద్దిరయ్య! ప
ల్కులజవరాలు దాఁ జదువులోన జపంబులలోనఁ బాయ ద
గ్గలమున నెల్లప్రొద్దును మొగంబునఁ గట్టినయట్లు యుండు నా
నలువను నంచుఁ గాముకులు నవ్వువిధాత శుభంబు నీవుతన్.

విష్ణుకథానిధానము.

6. కాకమానిగంగాధరుఁడు — ఇతఁడు బాలభారతము చేసెను.

శా. ఆలజ్జావతి ధౌమ్యపంపున శిఖిజ్వాలాలోలకీలాళిపై
నోలిన్ వేల్చినలాజరాజిపవనప్రోద్ధూతవారాశివీ
చీలోలోద్ధతివిద్రుమోష్ఠవి నధిక్షేపించుకట్టాణిము
త్యాలో నాఁ కనుపట్టె నట్టియెడ నందద్రాజహంసంబుగాన్.

బాలభారతము.

7. రాయసముగణపయ్య — ఇతఁడు సౌగంధికాపహరణము చేసెను.

శా. అంతంతం గబళింపఁగాఁ గడఁగె బాలార్కున్ ఫలభ్రాంతి వే
శంతోల్లంఘనకేళి దాఁటెను సరస్వంతున్ మహాదానవా
క్రాంతారామమహీరుహంబుల నుదగ్రక్రీడఁ ద్రుంచెన్ హనూ
మంతుండుం గపి యన్యమా ర్గిపులె సామాన్యాటవీచారముల్.

సౌగంధికాపహరణము.

8. పోతరాజువీరయ్య — ఇతఁడు త్రిపురవిజయము చేసెను.

సీ. తమ్ముల బెదరించుతళుకువెన్నెలసోగ
కన్నె గేదఁగిరేకు గారవింప
పదినూఱుపడిగెలఁ బరపైనపదకంబు
పవడిముత్యపుఁబన్నసరముఁ బ్రోవ — త్రిపురవిజయము.

9. వాసిరాజురామయ్య — ఇతఁడు బృహన్నారదీయమును జేసెను.

సీ. మల్లికానవసముత్ఫుల్లపాటలపుష్ప
వల్లరీసౌరభ్యవాసితంబు
కాసారనీరజవ్యాసక్త మధుకరీ
ఝుంకారముఖరితాశాముఖంబు — బృహన్నార.

10. గంగరాజుచౌడప్ప — ఇతఁడు నందచరిత్రమును జేసెను.

చ. ముదిమికి మందు వాగ్మితకు మూంగలిజిహ్వా తపఃఫలంబు స
మ్మదమునివాస మింపుగని మారవికారము పాది కామినీ
వదనవిభూషణంబు జనవశ్యము హాస్యరసాబ్ధి లాస్యసం
పదయుదరస్థలంబు మధుపానసుఖంబు జగత్త్రయంబునన్ —

నందచరిత్రము.

ఈప్రకారముగా సంకలితగ్రంథములలోను లక్షణగ్రంథములలోను బేర్కొనఁబడిన వారు జినేంద్రపురాణమును రచించినపద్మకవి (ప్రభాచంద్రుఁడు), ముద్రామాత్యము రచించినశివదేవయ్య, ప్రద్యుమ్నవిజయము రచించినఫణిభవుఁడు, జలపాలిమహాత్మ్యము రచించిన నడివానిమల్లుభట్టు, పద్మినీవల్లభము శంకరవిజయము మంగళగిరివిలాసము రచించినబొడ్డపాటిపేరయ్య, వాసవదత్తోపాఖ్యానము రేవతీపరిణయము రచించినమద్దికాయలమల్లయ్య, ఆదిపురాణము రచించినసర్వదేవయ్య, కుశలవోపాఖ్యానము ఐరావతచరిత్రము రచించిన చిరుమూరిగంగాధరుఁడు, పద్మావతీకళ్యాణము

రచించినముత్తరాజు, పరమభాగవత చరిత్రము రచించినయప్పన్న, మొదలైనవారు పలువురున్నారు. ఇటువంటివారికాలము చరిత్రము తెలిసినవారు సకారణముగాఁ దెలిపి నాయుద్యమమునకుఁ దోడ్పడుదురు గాక!

వెనుకటికూర్పులలో నెల్ల ౧౪౫౦ వ సంవత్సరమువఱకు నుండిన కవులను మాత్రమే పూర్వకవులలోఁ జేర్చితిని, ఈకూర్పునం దిప్పుడు కొంచెము మార్చి ౧౪౫౦ వ సంవత్సరము మొదలుకొని ౧౫౦౦ వ సంవత్సరము వఱకును నుండిన కవులను గూడ నీ ప్రథమభాగమునందేఁ జేర్చి పూర్వకవులనుగాఁ జెప్పియున్నాను. అందుచేత నింత వఱకును మధ్యకవులుగా పరిగణింపఁబడి ద్వితీయభాగములోఁ జేర్పఁబడి యుండిన వారు పలువురైనను రిప్పుడు పూర్వకవులుగా నీ ప్రథమభాగములోనికిఁ దీసికొనఁబడిరి. ఇట్టి మార్పు చేయుటకుఁ గల కారణమును గూర్చి విశేషముగాఁ జెప్పవలసినపని లేదు. ౧౫౦౦ వ సంవత్సరప్రాంతమువఱకునుగల కాలము పురాణయుగమని కాని భాషాంతరీకరణకాల మని కాని చెప్పఁబడఁదగినదిగానున్నది. ౧౫౦౯ వ సంవత్సరమునందు రాజ్యమునకు వచ్చి తెలుఁగు కవిత్వమునకు నూతన జీవమును గల్గించి యాంధ్రభోజుఁ డని పేరొందినకృష్ణదేవరాయని కాలమునుండియు నాంధ్ర వాఙ్మయమున కొకనూతనశక మారంభమైనది. కేవలభాషాంతరీకరణములు గాక రాజాదరమువలన నూతనకల్పనలతో ప్రబంధరాజములు పుట్టనారంభ మయిన యీ కాలమును ప్రబంధయుగ మని చెప్పవచ్చును. ఈ నూతన ప్రబంధనిర్మాణమునకు మార్గదర్శి యయినవాఁడు కృష్ణదేవరాయలయాస్థానకవి యయి మనుచరిత్రమును రచియించి యాంధ్రకవితాపితామహుఁ డని బిరుదొందిన యల్లసాని పెద్దన్న. పెద్దనయే యనేలా విష్ణుచిత్తీయ మను నామాంతరము గలయాముక్తమాల్యద యనెడి మహా ప్రబంధమును రచించి కృష్ణదేవరాయలే మార్గదర్శి యయ్యె నని చెప్పినను చెప్పవచ్చును. ఆంధ్రసారస్వతమునందలి యీనూతనశకారంభమునకుఁ బూర్వమునం దుండినవారిని పూర్వకవు లనియు, ఆ కాలమునకు నిప్పటికాలమునకు మధ్యకాలమునం దుండినవారిని మధ్యకవులనియు, విభాగముచేయుట యుక్తసహము కాక పోదు.

కవులచరిత్రమును సంస్కరింప వలె నన్నబుద్ధి పుట్టినమార్చి నెలలోనే పనికి బూని మార్చుట కారంభించి యిప్పు మార్చినదాని నప్పుడె ముద్రణమున కచ్చుచు వచ్చితి నని యీవఱకే చెప్పి యుంటిని గదా! మార్చుట కారంభించినప్పుడు పుస్తకమునంతను సకల వ్రాయఁ గలుగును నన్నధైర్యము లేనివాఁడ నయి ప్రాంత భాంతకు క్రొత్తచుతుకులు వేసిన ట్లక్కడక్కడ నచ్చుపుస్తకములోనే క్రందను మీఁదను క్రొక్కలయు హంసపాదములతో క్రొత్తముక్కల నతికించుచు గ్రంథమును సాగింప నారంభించితిని. అందుచేతఁ గొన్నిచోట్ల నీక్రొత్తముక్కలు పూర్వోత్తర సందర్భమున కనుకూలముగునట్టు చక్కఁగా నతుకక కొందఱిచరిత్రములు కొంతవఱకు తుకుల బొంతలుగానే యుండుట తటస్థించెను. తరువాతచరిత్రములను మార్చుటకయి గ్రంథపరిశోధనము చేయుచు వచ్చినప్పుడు కొన్నిచోట్ల వెనుకటివారి చరిత్రములలో వేసినయతుకులలోఁ గొన్ని తీసివేసి క్రొత్తమాసికలు వేయవలసినయావశ్యకము కనబడుచు వచ్చెను గాని ముద్రిత మయినదానిని మొదలంటఁ దీసివేయక

యట్టిపని సాధ్యము కానందున నొక్కొక్కచోట నెందేని పూర్వాపరవిరుద్ధాంశ
ములు సహిత మిందు పడి యున్నవి. అట్టి వేవేని కనఁబడినపక్షమున మొదటఁ
జెప్పఁబడినదానికంటెఁ దరువాతఁ జెప్పఁబడినది యధిక ప్రమాణ మని చదువరులం
గ్రహింతురు గాక! ఈ ప్రకారముగా చిన్నవో పెద్దవో యతుకులు వేయుచు
బెంగుళూరిలో గ్రంథమును శ్రీనాథునివఱకు నెట్లో యీడ్చుకొని వచ్చితిని గాని
యక్కడకు వచ్చు నప్పటి కెంతపెద్దయతుకులు వేసినను గుదరక క్రొత్తయల్లిక
విశేషముగా కావలసి వచ్చెను. అందుచేత శ్రీనాథునిచరిత్రములో ముప్పాతిక
మువ్వీసము క్రొత్తగా వ్రాయవలసినవాఁడ నైతిని. ఈ ప్రకారముగానే యీభాగము
నందు మున్ను లేనివయి యిప్పుడు క్రొత్తగాఁ జేర్పఁబడినవన్నెచోడుఁడు మొద
లైనవారిచరిత్రము లన్నియు నూతనముగానే వ్రాయఁబడినవి. ఇవి యన్నియు
బెంగుళూరిలోనే వ్రాయఁబడిన వగుటచేత నచ్చటఁ గర్ణాటకకవిచరిత్రాదులను
జదివి వానివలని లాభమును గొంతవఱకుఁ బొందుట తటస్థించెను. నన్నెచోడునిచరి
త్రమునందును భీమకవిచరిత్రమునందు నథర్వణాచార్యునిచరిత్రమునందును నేనచ్చటఁ
బొందినయీలాభము కొంతవఱకు తేటపడ వచ్చును. శ్రేయాంసి బహువిఘ్నాని
యన్నట్లు బెంగుళూరిలో సహితము నాపని నిర్విఘ్నముగా సాగినది కాదు. అక్కడ
నావెంట వచ్చినవారియొక్క చిన్నదానికి స్ఫోటకము వచ్చెను. ఈయంటురోగమునకు
భయపడి మే మక్కడ కుదుర్చుకొన్న బాలసేవకుఁడును పరిచారికయుఁ గూడ నొక్క
సారిగా మమ్ము విడిచి పోయిరి. వారిస్థానమున క్రొత్తసేవకులు దొరకరైరి. అందుచేత
నసహాయుల మయి నేనును నావెంట నాసంరక్షణనిమిత్తము వచ్చిన లోకాను
భవము చాలనియువతీమణియు సదా రోగిని కనిపెట్టుకొని యుండి యుపచారము
లను చికిత్సలను జేయవలసినవార మయితిమి. ఈశ్వరానుగ్రహమువలన రోగి స్వస్థ
పడెను గాని మనోవ్యాకులతచేతను రాత్రులు నిద్రలేకపోవుటచేతను నేను జ్వరపడి
యత్యంతదుర్బలుండ నయి రాజమహేంద్రవరమునకు వచ్చినతరువాత సహితము నెల
దినములకంటె నెక్కువకాలము నేనేమియు పనిచేయ లేక పోతిని. అయిన
నాయెడ నీశ్వరానుగ్రహము పూర్ణముగా నుండినందున నేను మరల స్వస్థపడి విఘ్న
మృగముల బారికి తప్పి బైలపడి యీ ప్రథమభాగము నొకవిధముగా ముగింప
శక్తుఁడ నయితిని. నాయెడఁ జూపినయీయసాధారణానుగ్రహమునకై నేనీశ్వరు
నకు భక్తిపూర్వకము లైనవందనసహస్రములను సమర్పించుచున్నాను. మిగిలిన
రెండుభాగములను గూడ సంస్కరించి ప్రకటించు శక్తిని మానసోత్సాహమును
భక్తాభీష్టప్రదాయకుఁ డైనపరమేశ్వరుఁడు నాకు ప్రసాదించును గాక! జరాభారము
వలనను రోగభారమువలనను ప్రూఫులను తిన్నఁగా దిద్దలేకపోవుటవలన ననివార్య
ముగా పడినయచ్చుపొరపాటులను సరకుగొనక చదువరులు నన్ను మన్నింతురు గాక!

నేను బెంగుళూరిని విడుచుటకు రెండుమూఁడుదినములు ముందు శ్రీనాథునిచరిత్ర
సంబంధమున సర్వజ్ఞబిరుదాంచితుఁ డైన శ్రీరావుసింగభూపాలుని కాలనిర్ణయమును
గూర్చి యాలోచించుచుండినప్పుడు నా కాకస్మికముగా తద్వంశజులును ప్రస్తుత
పీఠికాపురాధీశ్వరులును సాధారణముగా సమస్తసత్కార్యాభివృద్ధులకొఱకును విశేష

ముగా నాంధ్రభాషాభివృద్ధికొఱకును సహజనిరంతరాదరౌదార్యములను జూపుచున్న వారును నైనమహారాజశ్రీశ్రీరాజా రావు వేంకటకుమారమహీపతిసూర్యారావు బహదురుగారు నాకుస్మరణకు వచ్చి యీకవులచరిత్రమును వారి కంకితము చేయవలె నన్నబుద్ధి పుట్టినది. అది యీశ్వరాదేశ మని భావించి యీకవిచరిత్రమును వారికిఁ గృతి యిచ్చుట కప్పుడే నిశ్చయము చేసికొంటిని. వారిసుగుణసంపదను గూర్చి యిందుచెప్పుట స్తోత్రపాఠముగాఁ గనఁబడ వచ్చును. గాన నిం దింతకంటె నధికముగా వ్రాయను. లోకరక్షకుఁ డైనయీశ్వరుఁడు లోకోపకారార్థముగా వారికి దీర్ఘాయురారోగ్యైశ్వర్యములను బ్రసాదించును గాక!

నే నీకవులచరిత్రమును శీఘ్రకాలములోఁ బ్రచురింపవలె నని కోరఁగా ప్రతిదినమును రెండేసిఫారములచొప్పున నచ్చుగూర్చియిచ్చి పుస్తక మింత శీఘ్రముగా వెలువడుటకు హేతుభూతులైన శ్రీమనోరమాముద్రాక్షరశాలాధికారులకు వందనములు చేయుచున్నాను.

రాజమహేంద్రవరము<br>
౧౧ వ అక్టోబరు ౧౯౧౭ సం॥ } కందుకూరి-వీరేశలింగము.

# రెండవకూర్పునకుఁ బీఠిక.

---

ఆధునికాంధ్రసారస్వత పితామహుఁడును శతాధిక గ్రంథకర్తయు నాంధ్రవచన రచనాచక్రవర్తియు నైన రావుబహాదూర్ కందుకూరి వీరేశలింగముపంతులుగారు, చిరకాలము క్రిందట నాంధ్రకవులచరిత్రము మూడుభాగములుగా రచియించి, యీమూడుభాగముల నొక సంపుటముగానే మొదట ప్రకటించిరి పిమ్మట మొదటి భాగములోని కవులనుగురించి నూతనాంశములు పెక్కులు లభించుటచే బ్రథమభాగమును విపులముగాఁజేసి దాని నొక ప్రత్యేకసంపుటముగాఁ బ్రకటించిరి ఆ సంపుటము పండితులయొక్కయు, భాషాభిమానులయొక్కయు, నాదరణముఁబడయుటచే నప్పుడు ప్రచురించిన గ్రంథములన్నియు విక్రయింపఁబడియెను. అందుచేత మూడు సంవత్సరముల క్రిందటనే యీ సంపుటము పునర్ముద్రణము కావలసియుండెను. ఈ గ్రంథమునుఁ బంపుమని యాంధ్ర దేశమునందలి నానాభాగములనుండి పలువురు వ్రాయుచున్నారు. ఆకారణమున నిప్పుడీగ్రంథము రెండవసారి ముద్రింపఁబడి హితకారిణీసమాజమువారిచేతఁ బ్రకటింపఁబడినది

జగమెఱుంగు బ్రాహ్మణునకు జందె మెందుకన్నట్లు శ్రీ వీరేశలింగంపంతులుగారి గ్రంథముయొక్క గుణములు వర్ణింపనక్కరలేదు. అవి పాఠకమహాశయులకే స్వయం వ్యక్తములుగదా?

చిలకమర్తి లక్ష్మీనరసింహం,<br>
హితకారిణీసమాజోపాధ్యక్షుఁడు.<br>
పెద్దాడ సుందరశివరావు,<br>
హితకారిణీసమాజగౌరవకార్యదర్శి.

రాజమహేంద్రవరము,<br>
20—1—1937 }

# మొదటికూర్పు ఉపోద్ఘాతము

కవిచరిత్రములను వ్రాయఁబూను నావంటివారికి గ్రంథసామగ్రి తక్కువయగుటచేత కవులకాలనిర్ణయాదులను సరిగా వ్రాయుటకాని, అందఱి చరిత్రములను వ్రాయఁగలుగుటగాని, సాధ్యముకాదు. అయినను ముందువారికి మార్గదర్శకముగా నుండు నన్న యపేక్షతో నాకు దొరకిన యల్పాధారములతోను పరిమిత గ్రంథ సాహాయ్యముతోను నాశక్తి కొలఁది నేదో యొకరీతి చరిత్రము వ్రాయఁబూనినాను. ఇందు తప్పులు తప్పులుగా నుండవచ్చును. విద్వాంసులగువారు నన్ను పరిహసింపక వాత్సల్యముతో నా లోపములను జూపి దిద్దించియు, నా యొద్దలేని గ్రంథములను నాకుఁ బంపియు నాయుద్యమమును గొనసాగింతురని విశ్వసించుచున్నాను. నేనిందు వ్రాసిన చరిత్ర సంగ్రహములో ౧౬౫౦ వ సంవత్సరమునకుఁ బూర్వమునందుండిన కవులందఱియొక్క చరిత్రమును జేర్చితినని చెప్పఁజాలనుగాని యిందుఁ జేర్పఁబడిన కవులందఱును మాత్రమాకాలమునకుఁ బూర్వపువారేయని నిశ్చయముగాఁ జెప్పఁగలను. కృతికర్తయొక్కగాని, కృతిపతులయొక్కగాని కాలమును దెలిసికొనుట కాధారములు చిక్కకపోవుటచేతను, అప్పకవీయాది లక్షణ గ్రంథములలో నుదాహరింపబడి యుండకపోవుటచేతను, ఇప్పుడు నాకు లభించియున్న గ్రంథములలోనే కొన్ని యప్పకవి కాలమునకుఁ బూర్వమునందు రచింపఁబడినవియున్నను నేనవి విడచిపెట్టియుండవచ్చును.

* * *

*

రాజమహేంద్రవరము<br>
౭ వ నవంబరు ౧౮౮౭ వ సం. } కం. వీరేశలింగము

# రెండవ కూర్పు

ఇందు మొదటి నూఱుపుటల గ్రంథము ప్రథమశాస్త్రపరీక్షకుఁ బఠనీయముగా నేర్పడియున్నందున, ఆ భాగమునందు మార్పులు చేయుటకు వలనుపడలేదు.

ఆ భాగములో జేర్చఁదలఁచుకొన్న యంశములలోఁ గొన్ని యీ పుస్తకాంతమున ననుబంధముగాఁ జేర్పఁబడినవి. మొదటి కూర్పునందు విడువఁబడిన యనేక కవుల చరిత్రములిందుఁ గడపటిభాగమునఁ జేర్పఁబడి యుండుట, యీ కూర్పుయొక్క పుటలసంఖ్యవలననే తెలియవచ్చును. ఇందుఁగనఁబడెడి లోపములను నాకుఁ జూపుటకును, నాకు లభింపని గ్రంథములు తమయొద్దనున్నచోఁ బంపుటకును, ఇందుండఁదగిన నూతనాంశములను దెలుపుటకును ఆంధ్రభాషాభిమానులనెల్ల సవినయముగాఁ బ్రార్థించుచున్నాను.

రాజమహేంద్రవరము<br>
౫ వ ఫిబ్రవరు ౧౮౯౭ } కం. వీరేశలింగం

---

* ఈ పీఠిక సమగ్రముగా మా కుపలబ్ధము కాలేదు.

# విషయసూచి

సంఖ్య పుటసంఖ్య


| సంఖ్య | | పుటసంఖ్య |
|---|---|---|
| | అవతారిక | 1 |
| 1 | నన్నయభట్టు | 8 |
| 2 | నారాయణభట్టు | 88 |
| 3 | మల్లియరేచన | 89 |
| 4 | గోకర్ణదేవుడు | 91 |
| 5 | మల్లికార్జున పండితుడు | 92 |
| 6 | నాగదేవభట్టు | 96 |
| 7 | అమృతనాథుఁడు | 97 |
| 8 | మంత్రిభాస్కరుఁడు | 98 |
| 9 | యథావాక్కుల అన్నమయ్య | 101 |
| 10 | పెద్దయామాత్యుడు | 104 |
| 11 | వెన్నెలకంటి అన్నయ | 105 |
| 12 | క్షేమేంద్రుఁడు | 106 |
| 13 | ఆంధ్రభోజుఁడు | 107 |
| 14 | పంచతంత్ర రచయిత | 108 |
| 15 | కామందకకర్త | 801 |
| 15a | శివదేవయ్య | 109 |
| 16 | తిక్కన సోమయాజి | 111 |
| 17 | గణపనారాధ్యుఁడు | 173 |
| 18 | ఎఱ్ఱాప్రగడ | 174 |
| 19 | పావులూరి మల్లన | 200 |
| 20 | నన్నెచోడకవి | 206 |

| | | |
|---|---|---|
| 21 | ప్రతాపరుద్రుఁడు | 242 |
| 22 | పాలకురికి సోమనాథుఁడు | 245 |
| 23 | రంగనాథుఁడు | 254 |
| 24 | కేతన | 261 |
| 25 | బద్దెనకవి | 269 |
| 26 | నండూరి కేతనమంత్రి • | 276 |
| 27 | మంచన | 277 |
| 28 | అథర్వణాచార్యుఁడు | 283 |
| 29 | కాచవిభుడు, విట్ఠలరాజు. | 301 |
| 30 | మారన | 305 |
| 31 | విన్నకోట పెద్దన్న | 310 |
| 32 | చిమ్మపూడి అమరేశ్వరుఁడు | 317 |
| 33 | హుళక్కి భాస్కరుఁడు | 327 |
| 34 | నాచన సోముఁడు | 346 |
| 35 | వేములవాడ భీమకవి | 365 |
| 36 | మడికి సింగన్న | 399 |
| 37 | అప్పనమంత్రి • | 407 |
| 38 | దోనయామాత్యుఁడు • | 408 |
| 39 | పశుపతి నాగనాథుఁడు • | 409 |
| 40 | భవదూరుఁడు • | 410 |
| 41 | కొఱవి సత్యనారన • | 411 |
| 42 | శ్రీగిరి కవి • | 412 |
| 43 | ప్రకాశ భారతయోగి • | 412 |
| 44 | మడికి అనంతయ్య • | 413 |
| 45 | జక్కయకవి | 414 |
| 46 | అనంతామాత్యుఁడు | 422 |
| 47 | రావిపాటి తిప్పన్న | 431 |
| 8 | శరభాంకకవి | 440 |

| | | |
|---|---|---|
| 49 | కమలనాభామాత్యుడు • | 440 |
| 49a | వినుకొండ వల్లభరాయఁడు | 441 |
| 50 | శ్రీనాథుఁడు | 450 |
| 51 | బమ్మెరపోతరాజు | 581 |
| 52 | నిశ్శంక కొమ్మన్న | 615 |
| 53 | వెలిగందల నారయ • | 621 |
| 53a | సదానందయోగి • | 621 |
| 54 | గంగనార్యుఁడు • | 622 |
| 55 | శ్రీధరుఁడు • | 622 |
| 56 | కృష్ణమాచార్యుఁడు • | 623 |
| 57 | అయ్యలరాజు తిప్పయ్య • | 623 |
| 58 | ఏర్చూరి సింగన • | 624 |
| 59 | పిడుపర్తి బసవన • | 624 |
| 59a | తాళ్లపాక అన్నమాచార్యులు • | 625 |
| 60 | రేవణూరి తిరుమల కొండయార్యుఁడు | 625 |
| 61 | పిడపర్తి నిమ్మనాథుఁడు • | 626 |
| 62 | ప్రోలుగంటి చెన్నశౌరి • | 626 |
| 63 | గౌరనమంత్రి | 627 |
| 64 | దగ్గుపల్లి దుగ్గయ్య | 642 |
| 65 | భైరవకవి | 648 |
| 66 | పిల్లలమఱ్ఱి పినవీరన్న | 654 |
| 67 | నంది మల్లయ్య - ఘంట సింగయ్య | 669 |
| 68 | దూబగుంటి నారాయణకవి | 683 |
| 69 | వెన్నెలకంటి సూరన్న | 688 |
| 70 | ఫణిభట్టు | 698 |
| 71 | మనుమంచిభట్టు | 704 |
| 72 | కేతనమంత్రి | 710 |
| 73 | కవిభల్లటుఁడు | 712 |
| 74 | కవిరాక్షసుఁడు | 714 |

# ఆంధ్రకవుల చరిత్రము

## అవతారిక

దేశాభ్యున్నతికిని, భాషావాఙ్మయముల తత్త్వపరిశీలనమునకును చరిత్రము మిక్కిలి యావశ్యకము. చరిత్రలేని దేశము గాని, భాష గాని, వాఙ్మయము గాని నాగరకతా ముద్రను పొందఁజాలవు. భారతదేశము నందేగాక దేశాంతరములందును పేరుప్రతిష్ఠలు సంపాదించిన ఆంధ్రభాషావాఙ్మయముల చరిత్ర మందఱికిని ఉపాదేయము. ఈ గ్రంథమునందుఁ బ్రత్యేకముగ ఆంధ్ర వాఙ్మయాభివృద్ధికి దోహద మొనర్చి, పోషించిన కవుల గూర్చిన విషయములు విపులముగ నీయఁబడినవి.

ప్రాచీన కాలమునుండియు నాంధ్రులు సుప్రసిద్ధులయి, తమ విశిష్టతను నిలుపుకొనుచున్నారు. వేదకాలమునందును ఆంధ్రులు ప్రసిద్ధులు. ఆంధ్రులొకప్పుడు భారతదేశమునందలి విశాల భాగమునకుఁ బ్రభువులై యవిచ్ఛిన్నముగ రాజ్యపాలన మొనర్చుటయేగాక, పెక్కు ఘనకార్యముల నొనర్చినట్లును. భాషా వాఙ్మయములను పోషించినట్లును తెలియుచున్నది.

ప్రాచీనాంధ్ర ప్రభువులగు శాతవాహనులు సుప్రసిద్ధులు. శక కర్తలు. హాలుఁడు ప్రాకృతమున గొప్ప విద్వాంసుఁడై గాథా సప్తశతిని గూర్చిన యంశము విద్వద్విదితము. ఇట్లే ప్రాచీనాంధ్రులగు ప్రభువర్యులు సంస్కృతమును, ప్రాకృతమును బోషించి, ఆ వాఙ్మయములందు పెక్కు ఉద్గ్రంథములు వెలువడుటకుఁ గారణభూతులయిరి.

అతి ప్రాచీనకాలము నుండియు ఆంధ్రుల ప్రశంస శ్రుతి పేయమగుచున్నను క్రీస్తు శకము ౧౦ శతాబ్దులు గడచిన వఱకును, — అనగా నన్నయభట్టు మహాభారత రచనకుఁ బ్రారంభించు వఱకును చెప్పుకొనఁదగిన వాఙ్మయ మాంధ్రమున వెలయకుండుట కడుంగడు విచారహేతు వగుచున్నది. అంతకుఁబూర్వము వెలువడిన వాఙ్మయము లభ్యము కానంతమాత్రమున నన్నయకుఁ బూర్వ మాంధ్ర వాఙ్మయము లేనేలేదని చెప్ప వలనుపడదు. నన్నయ రచనయే ఆంధ్ర వాఙ్మయమున కారంభమైనచో, అట్టి యుత్కృష్ట కవిత వెలువడుట అసంభావ్యమని విమర్శకుల యాశయము.

నన్నయకుఁ బూర్వమున గ్రంథ రూపమున తెలుఁగు వాఙ్మయము వెలువడ కున్నను శాసనములందుఁ గొన్ని పద్యములును, గద్యలును కానవచ్చుచునే యున్నవి. వానిని పరిశీలించినచో, శాసన రచయితలు విద్వత్కవులవి తెలియకమానదు. వారు సంస్కృతమునందును నిష్ణాతలని యా శాసనములే చాటుచున్నవి.

శాసన రచయితలను కొందఱిని కొందఱు చరిత్రకారులు కవులుగాఁ బరిగ ణించిరి. [1]శాసనమునఁ గొలఁది పద్యములను గూర్చినంతమాత్రమున — అట్టి రచయితలను రచయితలనుగాఁ బరిగణింపనక్కఱలేదని కొందఱు విమర్శకుల యాశయము అట్టి వారు కవుల పట్టిక కెక్కినను — ఎక్క కున్నను — నన్నయకుఁ బూర్వమున నుండిన తెలుఁగు వాఙ్మయము స్వరూప మును దెలిసికొనుటకు — అట్టి శాసన కర్తలను గూర్చి కొంతవఱకుఁ దెలిసి కొనుట యప్రస్తుతము కాఁజాలదు.

(1) ఉపలబ్ధములగు శాసనములలో క్రీ. శ 848 ప్రాంతమునాఁటి 'అద్దంకి' శాసనము మొదటిది. ఇది చాళుక్య వంశీయుఁడగు గుణగవిజయాదిత్యుని ప్రథమ రాజ్య సంవత్సరమునాఁటిదఁట ' పండరంగఁడను సేనాధిపతి తన ప్రభువు గుణగవిజయాదిత్యుని పేరిట ఆదిత్యభట్టారకునికి కొంత నేల దానము చేసినట్లిందుఁ గలదు. దీని కర్త యెవ్వరో తెలియరాలేదు పండరంగఁడే

(౧) చూడుఁడు — శ్రీ నిడుదవోలు వేంకటరావుగారి 'తెనుఁగు కవుల చరిత్ర'

శాసనకవియయి యుండునని శ్రీ నిడుదవోలు — వేంకటరావుగా రూహించు చున్నారు.౨ ఇందు తరువోజయును, కొంత గద్యభాగమును గలవు.

(2) దీని తర్వాతిది కందుకూరిలో లభించిన పద్యమయ శాసనము ఇది పూర్తిగా లేదు. ఇందలి లిపి తూర్పు చాళుక్యులనాఁటిదఁట; ఇందలి పద్యము సీసపద్యమని కీ. శే. శ్రీ కొమఱ్ఱాజు — వేంకట లక్ష్మణరావుగారు గుర్తించిరి. ఇయ్యదియు గుణగవిజయాదిత్యునకు సంబంధించినదని శ్రీ నిడుదవోలు — వేంకటరావుగారు తెల్పుచున్నారు ౩

(3) గుణగవిజయాదిత్యుని నాఁటిదే యని చెప్పఁబడుచున్న ధర్మవరము శాసన మొకటి పద్యమయము కలదు. ౪ఈ శాసనము ప్రారంభమున 'స్వస్తి సర్వలోకాశ్రయ .. (క్య) భీమమహారా (జులవి) జయరాజ్యస (ం) వత్సరంబు — (యే) నగునే (డ్డీ) ఉత్త (రా) యనస (ంక్రాన్తి) స్థితి' అని యుండుటం బట్టి యిది చాళుక్యభీమమహారాజు శాసనమని ప్రసిద్ధము. ఇది యత్కర్తృకమో తెలియదు

(4) ఏడువాడలపాలెపు శాసనము నొకదానిని కీ. శే. పెండ్యాల — వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రిగారు పరిచయము చేసిరి. ౫శాసనములోని 'స్వస్తి — సకాబ్దంబు ల్దొంభ నూటానల్వదియగు నేణ్డి —' అను దానినిబట్టి యిది క్రీ. శ. 1018 నాఁటిదని తెలియుచున్నది.

(5) నన్నయ కంటెఁ బ్రాచీనములగు శాసనములలో ముఖ్యమైనది 'యుద్ధ మల్లుని బెజవాడ శిలాశాసనము'. ఇది యుద్ధమల్లుఁడను చాళుక్యరాజు బెజవాడలోఁ గుమారస్వామికి గుడియు, దానిఁ జేర్చి యొక మఠమును కట్టించి, ఆ మఠములో శైవేతరులు నివసింపరాదని యేర్పాటుచేసి చెక్కించిన శాసనము బాగుగఁ బరిశీలించినచో నిది యొక్క శాసనము కాదనియు,

---

(౨) చూ. తెనుఁగు కవుల చరిత్ర — పుట 25.

(౩) చూ. తెనుఁగు కవుల చరిత్ర పుట 33

(౪) డా నేలటూరి—వేంకటరమణయ్యగారి 'గుణగవిజయాదిత్యుని వర్తమానములు.' భారతి ౨౩, ౨౪ సం.

(౫) చూ. రాజరాజనరేంద్ర పట్టాభిషేక సంచిక,

రెండు శాసనములనియు, ఇందలి చివఱి భాగమును బట్టి యుద్ధమల్లుఁడు, తన తాత మల్లపరాజు కట్టించిన గుడికి గోపురమును గట్టించెనని స్పష్టమగుచున్నదనియు శ్రీ వేంకటరావుగారు వ్రాయుచున్నారు. [౬]ఈ శాసనము గుణగవిజయాదిత్యుని శాసనమున కించుమించుగా ఏఁబదియేండ్లకుఁ దర్వాత పుట్టినదని కీ. శే. శ్రీ జయంతి - రామయ్యపంతులుగారు వ్రాసిరి. [౭]ఇయ్యది యసమగ్రము.

శాసనమును బట్టి దీని కర్త యెవ్వరైనదియుఁ దెలియదు. వీరశైవ పండిత త్రయములోఁ దొలివాఁడగు శ్రీపతి పండితుఁడే యీ శాసనమును గూర్చెనని శ్రీ వేంకటరావుగారు చెప్పుచున్నారు. శ్రీపతి పండితుఁడు బెజవాడ వాస్తవ్యుఁడగుటయు, కవి యగుటయు, మల్లేశ్వరాలయమున నిప్పులు మూటగట్టి శివభక్తి మహిమను బ్రదర్శించుటయుఁ దమ యూహకుఁ గారణముగా వివరించినారు[౮] ఈయూహ కింకను ప్రబలములగు హేతువు లావశ్యకములు.

(6) కీ. శే శ్రీ వేటూరి-ప్రభాకరశాస్త్రిగారు సంతరించిన 'ప్రబంధరత్నావళి' లో పద్మకవి రచనగా నొక సీసపద్య మీయఁబడినది. అది 'జినేంద్రపురాణము' లోనిది. 'జినేంద్రపురాణము' ను రచించిన పద్మకవియే కన్నడవాఙ్మయమున ఆదికవి యని చెప్పఁబడు పంపమహాకవి యని శ్రీ వేంకటరావుగారి యభిప్రాయము. [౯]ఉపలబ్ధమగు పద్యము ప్రాచీనతర రచనగాఁ దోఁచలేదని శ్రీ ప్రభాకర శాస్త్రిగారు తెల్పియున్నారు.[౧౦] పద్మకవియే పంపకవి యని నిశ్చయమైనచో, అతఁడు నన్నయ కంటెఁ బ్రాచీనుఁడు కావచ్చును.

(7) **మడికి సింగన** సమకూర్చిన 'సకల నీతిసమ్మత' మను గ్రంథమున నీయఁబడిన కృతి, కృతికర్తృ నామములో 'గజాంకుశ' ప్రశస్తి కలదు.

---

(౬) చూ. తెనుఁగు కవుల చరిత్ర, పుట 55.

(౭) చూ. శాసనపద్యమంజరి — పీఠిక

(౮) చూ. తెనుఁగుకవుల చరిత్ర పుటలు 68, 69.

(౯) చూ. తెనుఁగుకవుల చరిత్ర. పుటలు 83, 84.

(౧౦) ప్రబంధ రత్నావళి, పీఠిక. పుట 27.

కన్నడ కవి సుప్రసిద్ధుఁడు. 'గజాంకుశుఁడు' కలఁడని కన్నడ కవి చరిత్ర కారులు తెల్పుచున్నారు. ఈ కన్నడ కవి క్రీ శ. 1000 ప్రాంతపువాఁడు. ఆంధ్ర కవియు, నీ కన్నడ కవియు నభిన్నులని శ్రీ వేంకటరావుగారి యాశయము.౧౧

మఱియు నీతనిం గూర్చి తెనుఁగు కవుల చరిత్రలో నిట్లు వ్రాయఁబడినది— " గజాంకుశుఁడనునది బిరుదమే కాని స్వతస్సిద్ధమగు పేరు కాదు. ఈతని పేరు నారాయణుఁడు. ఈతఁడు రాష్ట్రకూటరాజగు మూఁడవ కృష్ణచక్రవర్తి కాలమున నాతని ప్రధానియై ప్రసిద్ధికెక్కెను. మూఁడవ కృష్ణచక్రవర్తి క్రీ.శ. 939 నుండి 965 వఱకును 29 యేండ్లు పరిపాలించినాఁడు.

*　　　*　　　*　　　*

రామపార్యసుత శ్శ్రీమాన్ వగాన్యోఽయం ప్రతాపవాన్
నారాయణాభిధానేన నారాయణ ఇవాపరః,
విఖ్యాతో భువి విద్యావాన్ యో గజాంకుశ సంజ్ఞయా
ప్రధానః కృష్ణరాజస్య మంత్రీసన్ సంధి విగ్రహో—

*　　　*　　　*　　　*

పారగోరాజవిద్యానాం కవిముఖాః ప్రియంవదాః (?)
యస్తు ధర్మరతోభాతి ధర్మోవిగ్రవానివ."

గజాంకుశుఁడు కవి యని తెలియనగునను భావమున శ్రీ వేంకటరావుగారు 'కవిముఖాః' అను దాని నధోరేఖాంకితము చేసినారు. కాని వా రొసఁగిన యా భాగము అనన్వితమగుటచే, అది సరియైన పాఠముగాఁ దోఁచుటలేదు. ఇంతకును గజాంకుశుని రచన యాంధ్రమున లభ్యము కాలేదు. కావున ఆంధ్ర, కన్నడ గజాంకుశుల యభిన్నతను గాని, ఆంధ్ర గజాంకుశుని - లేదా - నారాయణుని కాలమును గాని నిర్ణయింపఁదగిన కారణము లపేక్షణీయములు.

(8) 'ప్రబంధ రత్నావళి' యందలి యుదాహృతులను బట్టి సర్వదేవుఁడను నొక కవి యుండెననియు, అతఁడు 'ఆదిపురాణ' మను జైన గ్రంథమును,

(౧౧) చూ. తెనుఁగుకవుల చరిత్ర. పుటలు 88, 89.

భారతమునందలి విరాటపర్వమును రచించినట్లు తెలియుచున్నది. రాయల కాలము నాఁటివాఁడగు 'ఎడపాటి - ఎఱ్ఱన' తన 'మల్హణచరిత్ర' లో సర్వదేవుని స్తుతించి యున్నాఁడు. కన్నడమున సుప్రసిద్ధుఁడగు పొన్నకవి సర్వదేవుఁడని ప్రసిద్ధుఁడనియు, రాష్ట్రకూటరాజగు మూఁడవ కృష్ణచక్రవర్తి కాలమున నుండినవాఁడనియు, పంపకవి 'ఆదిపురాణము' ను కన్నడమున రచింపఁగా పొన్నకవి దానిని తెలుఁగున రచించి యుండుననియు శ్రీ వేంకట రావుగా రభిప్రాయపడుచున్నారు.[౧౨] లభించిన పద్యములను జూడఁగా నవి ప్రాచీనతర రచనముగాఁ దోపఁకున్నదని శ్రీ ప్రభాకరశాస్త్రిగారు తెల్పఁగా 'మనకు దొరకిన రెండు మూఁడు పద్యములతోడనే కావ్యకవితా ప్రాచీనతా నవీనతలను నిర్ణయింపరా' దని డాక్టరు నేలటూరి - వేంకటరమణయ్య గారును, శ్రీ వేంకటరావుగారును తెల్పుచున్నారు[౧౩]

(9) విజయాదిత్యుఁడను నామాంతరముగల బాదపమహారాజు పదియవ శతాబ్ది చివఱి భాగమున నుండినట్లు అయ్యనభట్టు రచించిన 'ఆరుంబాక' శాసనము వలనఁ దెలియుచున్నది. శాసనమంతయు సంస్కృతమయము. అయినను కందపద్య లక్షణముతోఁ గూడిన యొక పద్య మందుండుటఁ బట్టి అయ్యనభట్టాంధ్ర కవి యగునని శ్రీ వేంకటరావుగా రనుచున్నారు.[౧౪] కాని, శాసనరచయిత యాంధ్రుఁడనుటలో నిది హేతువు కావచ్చును. ఆతఁ డాంధ్రకవి యనుట కింకను ప్రబలమగు హేతువు కావలసి యున్నది.

(10) క్రీ. శ. 1000 ప్రాంతమునందలిదగు విరియాల కామసాని గూడూరు శాసనము తెలుఁగుపద్యములగు చంపకోత్పలమాలికలతోఁ గూడియున్నది. శాసనమునందుఁ బ్రస్తుతింపఁబడిన మొదటి బేతరాజు శా. శ 950 నాఁటి వాఁడు. కావున అతని కాలము క్రీ. శ. 1028 అని చెప్పవచ్చును. అందు వలన నీ శాసనము క్రీ. శ. 1000 ప్రాంతములోనిదని చెప్పవచ్చును. శాసన కర్త యెవ్వరైనదియుఁ దెలియుటలేదు.

---

(౧౨) చూ. తెనుఁగుకవుల చరిత్ర. పుట 94.

(౧౩) చూ. ఉదయని, మేనెల సంచిక 1936. తెనుఁగుకవుల చరిత్ర పుట 93.

(౧౪) తెనుఁగుకవుల చరిత్ర. పుట 98.

(11) రాజరాజనరేంద్రుని రాజ్యకాలమునఁ బొలిదసముంతో బేతనభట్టను శాసనరచయిత యుండెను. ఇతని కాలము క్రీ శ. 1022 ప్రాంతమనుట సుస్పష్టము. ఇతఁడు కోరుమిల్లి శాసనమునకుఁ గర్త. ఈ శాసనము, రాజనరేంద్రుఁడు చంద్రగ్రహణకాలమున పినమార్యుఁడను సద్బ్రాహ్మణు నికి కోరుమిల్లి గ్రామ మగ్రహారముగా నొసరించి దానము చేసిన విషయ మును తెల్పుచున్నది. ఇది సంస్కృతమయము. కాని యిది దేశీయచ్ఛం దస్సగు రగడ యొక్క లక్షణములను గలిగియుండుటవలన— బేతనభట్టు తెనుఁగుకవి యగుట స్పష్టమని శ్రీ వేంకటరావుగారు తెలుపుచున్నారు (౧౫) కాని దీనిం బట్టి బేతనభట్టు తెనుఁగులక్షణ సంప్రదాయముల నెఱిఁగినవాఁడని మాత్రము నిశ్చయింపవచ్చును.

ఈ రీతిని పద్యమయశాసనములేకాక గద్య శాసనములును పెక్కు కానవచ్చు చున్నవి. అయ్యవి క్రీ. శ. 575 ప్రాంతము నుండియు వెలసినవి లభ్యము లగుచున్నవి. కాని యవి యన్నియు వాఙ్మయఖండములని గాని, శాసన కర్తలు రచయితలని గాని చెప్పుట కవకాశము తక్కువ. ఇట్లే నన్నయకుఁ బూర్వమున నుండిన పద్యశాసనములను బట్టియు గవులను నిర్ణయించుట కింకను పరిశోధనలు జరుగవలసి యున్నవి.

పయి యంశములను బట్టి నన్నయకుఁ బూర్వము కూడ తెలుఁగుకవిత వెలసి యుండెననియు, అయ్యది గ్రంథరూపముగ నుండినచో అనుపలబ్ధమనియు మాత్రము చెప్పవచ్చును

---

(౧౫) చూ. తెనుఁగు కవుల చరిత్ర. పుట 112.

# ఆంధ్రకవుల చరిత్రము

## పూర్వకవులు

### నన్నయభట్టు

నన్నయభట్టారకుఁడు * సంస్కృతభారతమును దెనిఁగింప నారంభించిన కవి. ఇతఁడు ముద్గలగోత్రజాతుఁడగు వైదికబ్రాహ్మణుఁడు. ఒకానొక రీతఁడు వైదికబ్రాహ్మణుఁడు కాఁడనియు, తెలుఁగు కవిత్వమునకు మొదటినుండియు నియోగులే ప్రసిద్ధులయి యుండుటచేత నీతఁడును నియోగియేయయి యుండుననియు, భట్ట శబ్దధారణ మాత్రముచేత నీతఁడు వైదికియని భ్రమింపగూడదనియు, నియోగియైన శ్రీనాథకవి గూడ తన కాశీఖండము లోని "చిన్నారిపొన్నారి చిఱుతకూఁకటినాఁడు" అను పద్యములోఁ దన్నుఁ గూర్చి "శ్రీనాథభట్టసుకవి" యని చెప్పికొనియెననియు, వ్రాసియున్నారు. నన్నయభట్టారకుని కాలమునాఁటికే యాంధ్రస్మార్తబ్రాహ్మణులలో వైదిక నియోగి భేద మేర్పడియుండినను, నియోగివైదికుల కిరువురకును సమానము

---

* భారతమునందలి యొక పద్యము [ఆది–1–25] ను బట్టి యితనికి 'నన్నయభట్టు' అనియు, ఆదిపర్వమునందలి వేఱొక [1–9] పద్యమును బట్టి 'నన్నపార్యుఁ' డనియు నామములు ప్రసిద్ధములైనట్లు తెలియుచున్నది. శాసనములంబట్టి 'నన్నియభట్ట' ను నామమున్నట్లు తెలియుచున్నది. కొందఱు విమర్శకులు భారత రచయితయగు నన్నయ కంటె శాసనరచయిత భిన్నుఁడను నభిప్రాయమును దెల్పియున్నారు. కాని యిర్వురు నభిన్నవ్యక్తులు. 'నన్నియ' ప్రాచీనరూపము; 'నన్నయ' నవీనరూపము.

గానే "భట్ట" శబ్దము చెల్లుచుండినను, నన్నయభట్టు తాను రాజు యొక్క కులబ్రాహ్మణుఁ డయినట్టు "తన కులబ్రాహ్మణు ననురక్తు నవిరళజప హోమతత్పరు . . .... ....నన్నపార్యు జూచి పరమధర్మవిదుఁడు వరచళుక్యాన్వయాభరణుఁ డిట్టు లనియెఁ గరుణతోడ" నని యాదిపర్వములోఁ జెప్పుకొని యుండుటచేత నన్నయ వైదికశిఖామణి యనియే నిశ్చయింపవలసియున్నది. కులబ్రాహ్మణులయి వంశపరంపరగా రాజపురోహితత్వము నిర్వర్తించుచుండుట వైదికులలోనేకాని నియోగులలో లేదు. ఇంకొకరు, చాళుక్యులు పశ్చిమమునుండి వచ్చినవా రగుటచేత నన్నయభట్టు మహారాష్ట్రదేశ ప్రాంతములనుండి రాజరాజనరేంద్రుని పూర్వుల వెంట వచ్చిన మహారాష్ట్రబ్రాహ్మణులసంతతివాఁ డయి యుండునని వ్రాసి యున్నారు. అదియు విశ్వసనీయము కాదు. * నన్నయ వేఁగినాటి బ్రాహ్మణుఁ డని యూహించుటకుఁ దగిన నిదర్శనములు నన్నయార్య విరచితమైన భారత భాగములోనే కనుపట్టుచున్నవి. ఇతఁ డర్జునుని తీర్థయాత్రలను వివరించుటలో నీ క్రింది వర్ణనము నాదిపర్వమునందుఁ జేసియున్నాఁడు.

"సీ. దక్షిణగంగ నాఁ దద్దయు నొప్పిన గోదావరియు జగదాది యైన
భీమేశ్వరంబును బెడఁగగుచున్న శ్రీపర్వతంబునుజూచి యుర్విలోన
ననఘమై శిష్టాగ్రహారభూయిష్ఠమై ధరణీసురోత్తమాధ్వరవిధాన
పుణ్యసమృద్ధమై పొలుచు వేఁగీదేశవిభవంబుఁ జూచుచు విభుఁడు దక్షి

గీ. ణాంబురాశితీరంబున కరిగి దురిత
హారియైన కావేరీమహాసముద్ర
సంగమంబున భూసురేశ్వరుల కభిమ
తార్థదానంబుఁ జేసి కృతార్థుఁ డగుచు."

స్వదేశమునం దభిమాన మెల్లవారికిని సహజమయి యుండును గదా! ఈతఁడు వేఁగినాటివాఁ డగుటచేతనే మూలగ్రంథమైన సంస్కృతమహాభారతములో లేని వేఁగిదేశ మహత్త్వవర్ణన ముత్తమ విశేషగుణములతోఁ

* నన్నయభట్టు కర్ణాటకుఁడని కొందఱు తలఁచుచున్నారు. ఈ యభిప్రాయము కూడ సరికాదు.

దెలుఁగుభారతమునఁ జొప్పించి తనయనూనదేశాభిమానమును గనఁబఱిచి యున్నాఁడు.

నన్నయ వేదాధ్యయన సంపన్నుఁడు ఇతఁడు సంస్కృతాంధ్రభాషల యందసమానపాండిత్యము కలవాఁడయి, ఉభయభాషలయందును గవిత్వము చెప్పుటకు సమర్థుఁడయి యుండెను. తక్కిన తెలుఁగు గ్రంథములయందువలెఁ గాక యితఁ డాంధ్రభారతాదియందు దేవతాస్తుతి నిట్లు సంస్కృతశ్లోకముతోఁ జేసి యున్నాడు

శ్లో. శ్రీవాణీగిరిజా శ్చిరాయ దధతో వక్షోముఖాంగేషు యే
లోకానాం స్థితి మావహ న్త్యవిహతాం స్త్రీపుంసయోగోద్భవామ్
తే వేదత్రయమూర్తయ స్త్రీపురుషా స్సంపూజితా వ స్సురై
ర్భూయాసుః పురుషోత్తమాంబుజభవశ్రీకంధరా శ్శ్రేయసే

ఇతఁ డవతారికలో షష్ఠ్యంతపద్యములు వేయలేదు. భాస్కరరామాయణ మీ విషయమున దీనిని బోలి యున్నది. స్వప్నకధను షష్ఠ్యంతములను మొట్టమొదట జేర్చినవాఁడు తిక్కనసోమయాజియే. ఆతనిని జూచి యించుమించుగాఁ దరువాతికవు లందఱును దమకు స్వప్నములో నిష్టదేవతా సాక్షాత్కారమును షష్ఠ్యంతపద్యములను దమ గ్రంథములలో వెట్టిగా నేఁటి వఱకును వేసికొనుచున్నారు. నన్నయభట్టారకుఁడు భారతములోఁ దన్ను గూర్చి యీ యొక్క పద్యమును మాత్రము వేసికొన్నాఁడు.*

సీ. తనకులబ్రాహ్మణుల ననురక్తు నవిరళ
జపహోమతత్పరు విపులశబ్ద
శాసను సంహితాభ్యాసు బ్రహ్మాండాది
నానాపురాణవిజ్ఞాననిరతుఁ
బాత్రు నాపస్తంబసూత్రు ముద్గలగోత్ర
జాతు సద్వినుతావదాతచరితు
లోకజ్ఞు నుభయభాషాకావ్యరచనాభి
శోభితు సత్ప్రతిభాభియోగ్యు

* నన్నయభట్టు తన పూర్వులను గూర్చి యేమియు తెలుపలేదు. నన్నయే రణస్థిపూఁడి శాసనము వ్రాసిన భీమనభట్టు యొక్క కాని, కోరుమిల్లి శాసనమును రచించిన వేతనభట్టు యొక్క కాని కుమారుఁడయి యుండునని 'ఆంధ్రకవి తరంగిణి' కర్త శ్రీ చాగంటి శేషయ్యగారు తెలిపియున్నారు.

ఆ. నిత్యసత్యవచను మత్యమరాధిపా
చార్యు సుజను నన్నపార్యుఁ జూచి
పరమధర్మవిదుఁడు వరచళుక్యాన్వయా
భరణుఁ డిట్టులనియెఁ గరుణతోడ.

ఈ భారతమును దెనిఁగించుటలోఁ దనకు నారాయణభట్టు* సహాయుఁడుగా నున్నట్టు కవియే చెప్పుకొనుచున్నాఁడు. నన్నయ వేఁగిదేశమునకు రాజయిన రాజనరేంద్రుని యాస్థానపండితుఁడు పూర్వ మాంధ్రదేశమునకుఁ గొంత కాలము వేఁగిదేశ మని వ్యవహారము కలదు. నిజమైన వేఁగిదేశము

---

* ఉ పాయక పాకశాసనికి భారతఘోరరణంబునందు నా
రాయణునట్టు, తానును ధరామరవంశవిభూషణుండు నా
రాయణభట్టు వాఙ్మయధురంధరుఁడుం దనకిష్టుఁడు న్సహా
ధ్యాయుఁడు నైనవాఁ డభిమతంబుగఁ గోడయి నిర్వహింపఁగన్ ॥ఆ॥ పర్వ

[ఈ పద్యము యొక్క రెండవపాదమున 'తానును ధరామరవంశ విభూషణుండు' అనుచోట 'తానును' కు బదులుగా 'వానస' అను పాఠమున్నది దానినే పలువురంగీకరించి యున్నారు 'వానస' వంశమున హారితసగోత్రులు, కౌస్యప గోత్రులు, వసిష్ఠగోత్రులు గలరు. నారాయణభట్టు హారితసగోత్రుఁడు. కావున 'వానస' అనునది గ్రామనామము గాని, పౌరుషనామము గాని యయియుండ వచ్చునని కొందఱి మతము

ఈ పద్యము పెక్కు భారతప్రతులయందుఁ గన్పట్టుటలేదనియు, అప్పకవి మాత్రము దీని నుదాహరణముగా గ్రహించెను గాని, తత్పూర్వము వ్రాయఁబడిన భారతప్రతులు లభించనందున, ఏ సంగతిని ఇదమిత్థమ్మని నిశ్చయింపవలనుపడదనియు శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు భారతరచనలో నారాయణభట్టు నన్నయకు సాయపడెనను విషయమును సందేహించుచున్నారు కాని నారాయణభట్టు నన్నయ సమకాలికుఁడని మాత్ర మంగీకరించుచు ఈ పద్య విషయమెట్లున్నను నారాయణభట్టు నన్నయ సమకాలికుఁ డగుటకు నందమపూఁడి శాసనమే ప్రమాణము' అని వ్రాయు చున్నారు. [చూ. తెనుఁగుకవుల చరిత్ర పుటలు 158, 159.

నారాయణభట్టు భారతరచనమున నన్నయభట్టునకు సాయపడెనని శ్రీ కావలి వెంకటరామస్వామిగారు (Biographical Sketches of Dekkan Poets గ్రంథకర్త), 'కవి జీవితము' లను రచించిన శ్రీ గురజాడ శ్రీరామమూర్తిగారు, 'ఆంధ్రకవి తరంగిణి' ని రచించిన శ్రీ చాగంటి శేషయ్యగారు మున్నగువారభి ప్రాయపడుచున్నారు.]

(వేఁగినాడు) ౮౦౦౦ చదరపుమైళ్ళ వైశాల్యము కలదయి పడమటను తూర్పుకనుమలకును, తూర్పున సముద్రమునకును, ఉత్తరమున గోదావరీ నదికిని, దక్షిణమునఁ గృష్ణానదికిని మధ్యస్థమయిన తెలుఁగుదేశము. మొట్టమొదట నీ వేఁగిదేశమునకు వేఁగి యను పట్టణము రాజధానిగా నుండెను. ఆ వేఁగీపురము హేలాపుర మనబడెడి యేలూరున కుత్తరమున నేడుమయిళ్ళదూరమున నున్నది ఇది పూర్వము రెండుక్రోశముల పొడవును వెడల్పును గల గొప్ప పట్టణమయి యుండియు, మహమ్మదీయులు దండెత్తి వచ్చి నాశనము చేయుటచేతనో మఱి యే హేతువుచేతనో యిప్పుడు బొత్తిగా పాడుపడిపోయి పూర్వ పట్టణముయొక్క రెండుకొనలయందును వరుసగా పెదవేఁగి చినవేఁగి యను పల్లెలను మాత్రము కలిగియున్నది. ఇక్కడ నిప్పటికిని పాడుపడిపోయిన దేవాలయము లేఁబదికంటె నధికముగా నున్నవి. ఇక్కడి దేవాలయములను పడఁగొట్టి మహమ్మదీయు లాఱాళ్ళతో నేలూరునం దొక కోటను గట్టిరి ఈ పెదవేఁగి రాజమహేంద్రవరమునకు దక్షిణమున నలుబదియైదుమైళ్ళ దూరమున నున్నది. పెదవేఁగి కైదుమైళ్ళ దూరములో నున్న దెందులూరివఱకును గూడ పడిపోయిన దేవాలయాదుల చిహ్నములు కొన్ని కనఁబడుచున్నవి వేఁగీరాజ్యము నిజమైన వేఁగినాటనుమాత్రమేకాక దక్షిణమునఁ గాంచీపురము రాజధానిగాఁగల పల్లవవంశజులదైన చోళ మండలము వఱకును, నుత్తరమున గంగావంశజుల దయిన కళింగరాజ్యము వఱకును, వ్యాపించి యుండెను. రాజ్యమునకు మధ్యగా నుండునిమిత్తమయి రాజధాని వేఁగీపురమునుండి రాజమహేంద్రవరమునకు రాజమహేంద్రుఁ డను బిరుదునామము వహించిన యమ్మరాజుకాలములో మార్పఁబడిన దని చెప్పుదురు. ఈ పట్టణమునకు రాజమహేంద్రవరపుర మన్న పే రీతనిని బట్టియే వచ్చినదనియుఁ జెప్పుచున్నారు "వేఁగీదేశంబునకు నాయక రత్నంబునుబోని రాజమహేంద్రపురంబునందు" అని భారతమునందుఁ జెప్పఁబడుటచేతనే చాళుక్యరాజులచేఁ బాలింపఁబడుచుండిన వేఁగీరాజ్యములో రాజమహేంద్రపురము మధ్యభాగమున నున్నట్టు స్పష్టమగుచున్నది. ఆ కాలమునందు వేఁగిదేశమున కధీశ్వరుఁడును చళుక్యవంశసంభవుఁడును విమలాదిత్యుని పుత్త్రుఁడును నగు రాజరాజనరేంద్రుఁడు రాజమహేంద్ర

వరము తనకు రాజధానిగా విష్ణువర్ధనుఁ డను బిరుదు పేరితోఁ జిరకాలము రాజ్యము చేసెను. ఈ పట్టణమునందలి కోటను కట్టినవాఁ డితఁడే. ఇతఁడు విమలాదిత్యుని పుత్రుఁ డయినట్టును చాళుక్యవంశజుఁ డయినట్టును భారతము లోని యీ క్రింది పద్యము చెప్పుచున్నది.

క. విమలాదిత్యతనూజుఁడు,
విమలవిచారుఁడు కుమారవిద్యాధరుఁడు
త్తమచాళుక్యుఁడు వివిధా
గమవిహితశ్రముఁడు తుహినకరుఁ డురుకాంతిన్.

ఈ రాజమహేంద్రుఁడు శివభక్తుఁడును జంద్రవంశ్యుఁడును నయినట్టు కవిని గూర్చి యతఁడు పలికినరీతిగా నాదిపర్వమునఁ జెప్పఁబడిన యీ పద్యముల వలనఁ దెలియవచ్చుచున్నది.

మ. ఇవి యేనున్ సతతంబు నాయెడఁ గరం బిష్టంబులై యుండుఁ బా
యవు భూదేవకులాభితర్పణమహీయఃప్రీతియున్ భారత
శ్రవణాసక్తియుఁ బార్వతీపతిపదాబ్జధ్యానపూజామహో
త్సవమున్ సంతతదానశీలతయు శశ్వత్సాధుసాంగత్యమున్.

చ. హిమకరుఁదొట్టి పూరు భరతేశ కురుప్రభు పాండుభూపతుల్
క్రమమున వంశకర్త లనఁగా మహి నొప్పినయస్మదీయవం
శమునఁ బ్రసిద్ధులై విమలసద్గుణశోభితు లైనపాండవో
త్తములచరిత్ర నాకు సతతంబు వినంగ నభీష్ట మెంతయున్.

ఆపస్తంబసూత్రుఁడును భారద్వాజగోత్రుఁడును నయిన చీదమార్యుఁడను బ్రాహ్మణునకు రాజరాజనరేంద్రుఁడు చంద్రగ్రహణ పుణ్యకాలమునందు గోదావరీమండలములోని కోరుమిల్లి యగ్రహారము నిచ్చినప్పటి తామ్రదాన శాసనమునుబట్టి చూడఁగా రాజరాజనరేంద్రుఁడు సింహాసనమునకు వచ్చిన కాలము మొదలగునవి తేటపడుచున్నవి ఆ శాసనమందు రాజరాజనరేంద్రుని పూర్వుఁడైన విజయాదిత్యుఁ డయోధ్యానగరమునుండి దక్షిణదేశము మీఁద

దండెత్తి వచ్చి యీ దేశమును పాలించుచుండిన త్రిలోచనపల్లవునితో యుద్ధము చేసి రణనిహతుఁ డయినట్టును, భర్త వెంట వచ్చిన యాతని భార్య గర్భవతియై యుండియు నా యాపత్సమయములోఁ బురోహితునిని గొందఱు పరిచారికలను వెంటఁగొని ముదివేము అగ్రహారమునకుఁ దప్పించుకొని పాఱిపోఁగా విష్ణుభట్టసోమయాజి యను బ్రాహ్మణుఁ డామె నాదరించి తన యింటఁ బెట్టుకొని తానుగన్న కొమార్తెనువలెఁ జూచి యామె గర్భమున జనించిన పురుషశిశువునకు రాజోచితము లయిన జాతకర్మాది సంస్కారములు నడిపి విష్ణువర్ధనుఁ డని పేరు పెట్టి పెంచినట్టును, ఆతడు తన తల్లి వలన సర్వవృత్తాంతమును విని చళుక్యపర్వతమునకుఁ బోయి తపస్సుచేసి తన తండ్రి రాజ్యమును వహించి, కదంబులను గాంగులను జయించి నర్మద మొదలుకొని సేతువు వఱకునున్న యేడుకోట్ల యేఁబదిలక్షల గ్రామములుగల దేశమునంతను పాలించినట్లును, చెప్పఁబడి యున్నది. అప్పటినుండియు నాతని వంశమువారికి విష్ణువర్ధనుఁ డను బిరుదు పేరు పరంపరగా వచ్చు చున్నది. ఈ చళుక్యవంశపురాజులు రెండు శాఖలవారయి యొక శాఖవారు కళ్యాణపురమునందును రెండవశాఖవారు రాజమహేంద్రవరమునందును రాజ్యము చేయుచుండిరి. వీరిలోఁ గళ్యాణపురము రాజధానిగాఁగల పడమటి చాళుక్యులు కుంతలరాజులనియు, రాజమహేంద్రవరము రాజధానిగాఁ గల తూర్పుచాళుక్యులు వేఁగిరాజు లనియు, వ్యవహరింపఁబడుచు వచ్చిరి. ఈ విష్ణువర్ధనునిముమ్మనుమఁడయిన కుబ్జవిష్ణువర్ధనుఁడు క్రీస్తుశకము ౬౧౫ వ సంవత్సరమునందు వేఁగిదేశమునకు మొదటఁ దనయన్నయైన సత్యాశ్రయునిచేఁ బాలకుఁడుగా నియమింపఁబడి పిమ్మట దానేఁ రాజయ్యెను. అతని కిరువదియేడవతరమువాఁడయిన విమలాదిత్యుఁడు ౧౦౧౫ వ సంవత్సరమున సింహాసనమునకు వచ్చి యేడుసంవత్సరములు రాజ్యముచేసి మృతినొందఁగాఁ దెలుఁగుభారతమును గృతినందిన యాతని కొడుకు విష్ణువర్ధనుఁ డను రాజనరేంద్రుఁడు శాలివాహనశకము ౯౪౪ వ సంవత్సరము శ్రావణ బహుళ

ద్వితీయాగురువారమునాఁ డుత్తరభాద్రానక్షత్రమున *సింహాసన మెక్కినట్లు చెప్పఁబడి యున్నది. లెక్కవేసిచూడఁగా నీకాలము క్రీస్తుశకము ౧౦౨౨ వ సంవత్సరము జూ[illegible]యినెల పందొమ్మిదవతేదితో సరియగును రాజనరేంద్రుని మమ్మనుమఁడైన రెండవ కులోత్తుంగచోళదేవుఁడు గోదావరీమండలము లోని కోరంగికి సమీపముననుండు చెల్లూరుగ్రామమును కొలనికాటము

---

* స్రగ్ధర తస్మాచ్చాళుక్యచూడామణి రథ విమలాదిత్యదేవా న్మహీశా
చ్చోడక్ష్మాపాలలక్ష్మ్యా ఇవ రచితతనోః కుండవాయాశ్చ దేవ్యా
జాతశ్శ్రీరాజరాజో రజనికరకులశ్రీమదంభోధిరాజో
రాజద్రాజన్యసేవ్యా మభృత భుజబలా ద్రాజ్యలక్ష్మీం పృథివ్యాః.

వసంతతిలక. యో రక్షితుం వసుమతీమ్ శకవత్సరేషు
వేదాంబురాశి విధివర్తిషు సింహగేర్కే
కృష్ణద్వితీయదివసోత్తరభాద్రికాయాం
వారే గురోర్వణిజలగ్న వరేభిషిక్తః.

శ్లో. యస్యోత్తమాంగం పట్టేన సమబంధి మహీయసా
భర్తుం విశ్వంభరాభారం జనైరారోపితం చిరమ్.

* * * *

శా. పిత్రోర్వంశగురూ బభూవతు రలం యస్య స్ఫురత్తేజసౌ
సూర్యాచంద్రమసౌ నిరస్తతమసౌ దేవౌ జగచ్చక్షుషీ
దంష్ట్రాకోటిసముద్ధృతాఖిలమహీచక్రం మహత్క్రీడయా
విష్ణో రాదివరాహరూప మభవ ద్యచ్చాసనే లాంఛనమ్.

స్రగ్ధర. ఆద్యంతాత్యంతదూరాత్ సమజని జగతాం జ్యోతిషో జన్మహేతు
ర్బ్రహ్మధామప్రజానా మభవ దథ తతః కాశ్యపో నామ వేధాః
భారద్వాజస్తతో భూన్మునిరధికతపస్తస్య గోత్రే పవిత్రే
తత్రాపస్తంబసూత్రే శ్రుతిని థిరుదగా చ్చీదమార్యక్రమేణ.

గద్య... . ... .. ...సకలమునిగణనుతాపస్తంబసూత్రాయ తత్ర సంగీత
భారద్వాజగోత్రాయ ... ...ధారాకరేణాగ్రహారీకృతః కోరుమల్లి
నామాగ్రామ ఇందూపరాగేదత్తో మయాచంద్రతారకం హితిష్ఠేత్.

* * * *

నాయకుని కిచ్చినట్టియు, కాలేరగ్రహారమును దాక్షారామపీఠికాపురసత్రములను జరుపుటకయి ముద్గలగోత్రుఁడును పోతనార్యపుత్రుఁడును నయిన మేడమార్యుఁడను బ్రాహ్మణున కిచ్చినట్టియు, దానశాసనములనుబట్టి రాజరాజనరేంద్రుని పుత్రుఁడైన ప్రథమ కులోత్తుంగచోళదేవుఁడు శాలివాహనశకము ౯౮౫ వ సంవత్సర మనఁగా క్రీస్తుశకము ౧౦౬౩ వ సంవత్సరమున రాజ్యమునకు వచ్చినట్టు చెప్పఁబడి యున్నది. ఇందువలన రాజరాజనరేంద్రుఁడు ౧౦౨౨ వ సంవత్సరము మొదలుకొని ౧౦౬౩ వ సంవత్సరము వఱకు ౪౧ సంవత్సరములు రాజ్యపాలనము చేసినట్లు సిద్ధాంత మేర్పడుచున్నది. కనుక, * తదాస్థానపండితుఁ డయిన నన్నయభట్టారకుఁడును ౧౦౨౨ వ సంవత్సర ప్రాంతము మొదలుకొని యున్నవాఁడనుట స్పష్టము. ♦ కాఁబట్టి నన్నయభట్టు కాల మిప్పటికి ౮౫౦ సంవత్సరములయి యున్నది. భారత రచనమునందు నన్నయభట్టున కత్యంత సహాయుఁడుగా నుండిన నారాయణభట్టునకు రాజరాజనరేంద్రుఁడు తన రాజ్యపాలనముయొక్క ముప్పదిరెండవ సంవత్సరమునందు నందమపూడి యను గ్రామము నగ్రహారముగా నిచ్చెను. ఈ గ్రామము గౌతమీ వైనతేయనదుల మధ్యమున నప్పుడు రెండేరులవాడి విషయమనఁబడెడి యిప్పటి యమలాపురము తాలూకాలో నున్నది. "ద్వాత్రింశత్తమే విజయ రాజ్యవర్షే వర్ధమానే కృత మిదంశాసనమ్" అని ముప్పదిరెండవయేట ననియు, "సోమగ్రహణనిమిత్తే . . ...దత్తమ్" అని చంద్రగ్రహణసమయమునం దనియు, దానశాసనమున దుఁ జెప్పఁబడి యుండుటచేత దానకాలము శాలివాహనశకము ౯౭౬ వ సంవత్సరము మార్గశీర్ష శుద్ధ పూర్ణిమాభానువార మనఁగా క్రీస్తుశకము ౧౦౫౪ వ సంవత్సరము నవంబరునెల ౨౮ వ తేది యగుచున్నది. ఈ శాసనమునందు నారాయణభట్టిట్లు వర్ణింపఁబడి యున్నాఁడు.

---

* తదనుజో విమలాదిత్య స్సప్త, తత్పుత్రో రాజరాజదేవ ఏకచత్వారింశత్. తత్పుత్రశ్శ్రీకులోత్తుంగచోడదేవ ఏకోనపంచాశత్ ... .. .. రాజ్యంప్రశాసతి.

♦ ఇది క్రీ. శ 1022 వ సం॥రము ఆగస్టునెల 16 వ తేదీకి సరిపడునని చరిత్రకారుల యభిప్రాయమైనట్లు 'ఆంధ్ర కవితరంగిణి' లో గలదు. [పుట 109.] ఈ ఆంధ్రకవుల చరిత్రమునను ౫౩వ పుటలో నిట్లే కలదు.

"ప. యస్సంస్కృతకర్ణాటప్రాకృతపైశాచికాంధ్రభాషాసు
కవిరాజశేఖర ఇతి ప్రథిత స్సుకవిత్వవిభవేన

ప. కవీన్మనీషాలవదుర్విదగ్ధాన్ మనోహరాభి ర్నిజసూక్తిభి ర్యః
కుర్వన్నగర్వా న్పటుభి ర్బిభర్తి కవీభవజ్రాంకుశనామసార్థమ్

గ. తస్మై సకలజగదభినుతగుణశాలినే సరస్వతీకర్ణావతంసా యాష్టా
దశావధారణచక్రవర్తినేనన్నినారాయణాయ భవద్విషయే నందమ
పూణ్డినామగ్రామోగ్రహారీకృత్య సోమగ్రహణనిమిత్తే ధారాపూ
ర్వక మస్మాభి స్సర్వకరపరిహారేణ దత్త మితి విదిత మస్తు వః" *

ఇతఁడు సుకవిత్వవిభవముచేత సంస్కృతకర్ణాటప్రాకృతపైశాచికాంధ్ర భాషాకవిశేఖరుఁ డనియు, మనీషాలవదుర్విదగ్ధు లయిన కవులను మనోహరము లైన నిజసూక్తులచేత గర్వభంగము నొందినవారినిగాఁ జేసి కవీభవజ్రాంకుశబిరుదమును సార్థకము చేసికొన్నవాఁ డనియు, అష్టాదశావధానచక్రవర్తి యనియు, పయి వాక్యములు తెలుపుచున్నవి ఇతఁడు హారీతగోత్రుఁడును ఆపస్తంబసూత్రుఁడును పురోడాశపవిత్రవక్త్రుఁడును నగు కాంచనసోమయాజి ప్రపౌత్రుఁడును, కంచనార్యుని పౌత్రుఁడును శౌచాంజనేయసామికొంబలపుత్రుఁడును, అయినట్టు పై శాసనమే చెప్పుచున్నది. ఈ నారాయణభట్టాంధ్రసంస్కృతముల యందుమాత్రమేకాక కన్నడమునందును మహాకవి యయి యుండెను చాళుక్యులు కర్ణాటదేశమునకును వేఁగిదేశమునకునుగూడ పరిపాలకులయి యుండుటచేత రాజాస్థానముల యందుండిన యాకాలపు విద్వాంసులు సాధారణముగా కర్ణాటాంధ్రభాషా పండితు లయి కన్నడమునందును తెనుఁగునందు ఁ గవిత్వము చెప్పఁగలవా రయి యుండిరి కర్ణాటకభాషయందు సుప్రసిద్ధకవియైన నాగవర్మ తన ఛందోంబుధిలోఁ దన జన్మస్థలము వేఁగీదేశ మని చెప్పుకొనెను. బహుభాషల

* ఈ శాసనము శాలివాహనశకము ౯౭౫ న చంద్రగ్రహణమునాఁడు అనఁగా క్రీ శ. 1053 నవంబరు 3వ తేదిని వ్రాయఁబడినట్లు తేలుచున్నదని 'ఆంధ్రకవి తరంగిణి' యందుఁ గలదు [చూ. పుట 106]

యందసమానపాండిత్యము గల నారాయణభట్టు భారతాంధ్రీకరణమునందు భారతరణమునం దర్జునునికి శ్రీకృష్ణుఁడు సహాయుఁ డయినట్టే విశేష సహాయుఁడయి యుండును. భారతాంధ్రీకరణమునందు సాహాయ్యపడు చుండిన హేతువుచేతఁ గూడ రాజరాజనరేంద్రుఁడు నారాయణభట్టున కీ దానము చేసియుండవచ్చును ! ఈ దానశాసనమును రచించినవాఁడు నన్నయభట్టు; రాగితేకులమీఁదఁ జెక్కినవాఁడు గండాచార్యుఁడు. "కావ్యానాం కర్తా నన్నియభట్టో లేఖకో గండాచార్యః" అని శాసనము యొక్క కడపటి భాగమునం దున్నది. దీని వలన రాజరాజనరేంద్రుని పరిపాలనము నందు ముప్పది రెం డేండ్లవఱకును నన్నయభట్టారకుఁడు జీవించియుండుట నిశ్చయము. ఇతఁడిప్పటికే భారతాంధ్రీకరణము నారంభించి యుండును. ఈతని మరణముచేతనో కొందఱు చెప్పినట్టు మతిభ్రమణముచేతనో రాజనరేంద్రుని జీవితకాలములోనే యాంధ్రభారతరచనము నిలిచిపోయి యుండును ఈ విషయమయి చెప్పఁబడెడు కథ లన్నియు విశ్వాసార్హములు కాకపోయినను, తరువాత రాజరాజనరేంద్రుఁడు తెనుఁగుభారతమును బూర్తిచేయింపఁ బ్రయత్నించె నన్నకథను స్థాపించుచున్నవి. మరణమునకుఁ గాని మతిభ్రమణమునకుఁ గాని మనవారు కథలలోఁ జెప్పిన కారణములు గాక వేఱుకారణము లుండవచ్చును మరణము గాని మతిభ్రమణము గాని కవి యొక పర్వమును సాంతముగా విరచించువఱకును నిలిచియుండవు అవి కవిని సగము చేయుచుండఁగానే నడుమ నెప్పుడో వాత వేసికొన వచ్చును. ఆశ్వాసమధ్యమున "శారదరాత్రులు" అన్న పద్యమును రచించు నప్పటికే మృత్యు వాసన్న మయి నన్నయభట్టారకుని గ్రంథరచనమున కసమర్థునిఁ జేసి యుండును. ఈ శాసనానంతరమున రాజనరేంద్రుఁడు సహితము చిరకాలము జీవింపక తొమ్మిది సంవత్సరములలోనే మృత్యు ముఖగతుఁ డయ్యెను. రాజనరేంద్రుఁడు నారాయణభట్టునకు నందముపూడి యగ్రహారమును, పావులూరి మల్లన్నకు నవఖండవాడ యగ్రహారమును, ఇచ్చినను నన్నయభట్టున కగ్రహారాదు లేవియు నిచ్చినట్టు కానఁబడదు. భారతాంధ్రీకరణసమాప్తి యైనతరువాత నియ్యఁదలఁచెనేమో ! ఇట్లియ్యక

పోవుట రాజుకాలములోనే నన్నయభట్టాంధ్రభారతరచనమధ్యమున లోకాంతరగతుఁ డగుటను సూచించుచున్నది తిక్కనసోమయాజి విరాట పర్వము నందు

ఉ. ఆదరణీయసారవివిధార్థగతిస్ఫురణంబు గల్గి య
ష్టాదశపర్వనిర్వహణసంభృత మై పెనుపొంది యుండ నం
దాదిఁ దొడంగి మూఁడుకృతు లాంధ్రకవిత్వవిశారదుఁడు వి
ద్యాదయితుం డొనర్చె మహితాత్ముఁడు నన్నయభట్టు దక్షతన్

అని చెప్పుట నాధారము చేసికొని యిప్పటివారు కొందఱు నన్నయభట్టారణ్యపర్వమునంతను సంపూర్ణముగానే చేసె ననియు, అందుచేతనే తిక్కన విరాటపర్వముతో నారంభించె ననియుఁ దిక్కన కాలమునాఁటి కారణ్యపర్వాంతమువఱకు నుండినను దరువాత నేకారణముచేతనో యది నశింపఁగాఁ ఎఱ్ఱాప్రెగడ నన్నయభట్టుపంవలి గౌరవముచేత నాతని పేరనే పూరించెననియు, మున్నెవ్వరు కనని వినని క్రొత్తవాదము నొకదాని నారంభించిరి. ఈవాద మపూర్వమయినదే నన్నయభట్టు మరణానంతరమున నిన్నూఱుసంవత్సరములకుండిన తిక్కనసోమయాజి వఱకును నారణ్యపర్వము సంపూర్ణముగానే యుండిన దఁట! అట్లయినచో వీరి వాదానుసారముగా

ఉ. సారకథాసుధారస మజస్రము నాగళపూరితంబుగా
నారఁగఁ గ్రోలుచున్ జనులు హర్షరసాంబుధిఁ దేలునట్లుగా
భారతసంహితన్ మును త్రిపర్వము లెవ్వఁ డొనర్చె నట్టివి
ద్యారమణీయు నంధ్రకవితాగురు నన్నయభట్టుఁ గొల్చెదన్

అని మారన తన మార్కండేయపురాణములో నన్నయభట్టును స్తుతించుచు నతఁడు త్రిపర్వము లొనర్చెనని చెప్పి యుండుటచేత, ౧౩౨౩ వ సంవత్సరమువఱకును రాజ్యము చేసిన ప్రతాపరుద్రుని దండనాథుఁ డైన నాగనగన్న దండనాథున కంకితము చేయఁబడిన మార్కండేయపురాణ గ్రంథకర్త కాలము వఱకు ననగా ౧౩౨౩ వ సంవత్సర ప్రాంతము వఱకు నన్నయభట్ట కృతారణ్యపర్వము పూర్ణముగ నుండెనని చెప్పవలెను ఎఱ్ఱాప్రెగడ వలన

హరివంశమును గృతిఁగొన్న పోలయవేమారెడ్డి ౧౩౪౯ వ సంవత్సరము వఱకు రాజ్యపాలనము చేసినవాఁడు వీరి వాదమును బట్టి తిక్కనసోమయాజి తరువాత నేఁబదిసంవత్సరముల కుండిన యెఱ్ఱాప్రెగడ కాలమునాఁటికిఁ దిక్కన భారతము పదునేనుపర్వములు నశింపకుండఁగా, గతించిన యిన్నూట యేఁబదిసంవత్సరములనుండి నన్నయభారతములోని రెండుపర్వముల మూఁడా శ్వాసములు నశింపకుండఁగా, నిరువది ముప్పదిసంవత్సరముల లోపల నారణ్యపర్వము నాల్గవయాశ్వాసములోని "శారదరాత్రు" లన్న పద్యము నుండి మాత్రము కారణము లేకయే యొక్కసారిగా నాంధ్రదేశములో నున్న యన్నిప్రతులలోను మాయ మయ్యె నఁట! ఇది వివేకులు నమ్మఁదగిన మాట గాదు. నన్నయభట్టు మూఁడవపర్వమునఁ గూడ మూఁడాశ్వాసములు పైఁగా రచియించి యుండుటచేతఁ దిక్కనసోమయాజి రెండుపర్వముల మూఁడాశ్వాసముల ౧౪౨ పద్యము లని విశేషముగాఁ జెప్పక సామాన్య ముగా మూఁడుకృతులని చెప్పినవాఁడు. అంతే కాని వేఱేమియు లేదు. లోక వ్యవహారమునందు సహిత మొక సభకు వచ్చిన జనులు లెక్కకుసరిగా ౧౦౩౬ గురే యున్నను మనము సామాన్యముగా వేయిమంది వచ్చి రనియే చెప్పుదుము. మిగిలిన భాగమును రచియించిన యెఱ్ఱాప్రెగడ,

క. ధీరవిచారుఁడు తత్కవి
తారీతియుఁ గొంత దోఁపఁ దద్రచనయకా
నారణ్యపర్వశేషము
పూరించెఁ గవీంద్రకర్ణపుటపేయముగాన్.

అని తా నారణ్యపర్వశేషమును బూరించితినని చెప్పెను. శేష మనఁగా మిగిలినది యని యర్థము గదా! నన్నయభట్టారకుఁడు రచింపఁగా మిగిలిన దనక పోయినయెడల నిచ్చట శేషశబ్దమున కర్థ మే మగును? ఎఱ్ఱాప్రెగడ సహితము నన్నయభట్టారణ్యపర్వమును గొంత చేసెననియు, చేయఁగా మిగిలిన దానిని దాను జేసితిననియు, తెలుపుట కొఱకే శేషశబ్దమును ప్రయోగించెను,

ఉ. ఆదిని శబ్దశాసనమహాకవి చెప్పిన భారతంబులో
నేది వచింపఁగాఁబడియె నేఁదును దానినె కాని సూత్రసం
పాదన లేమిచేఁ దెలుఁగుబల్కు మ యొక్కటి గూర్చి చెప్పఁగా
రా దని దాశవాటికవిరాక్షసుఁ డీనియమంబు చేసినన్.

క. ఆమూఁడుపర్వములలో
నామాన్యుఁడు నుడువుతెనుఁగు లరసికొని ? కృతుల్
తాము రచించిరి తిక్కను
ధీమణి మొద లైన తొంటితెలుఁగుకవీంద్రుల్.

అని యెఱ్ఱాప్రెగడ యారణ్యపర్వశేషమును రచించిన తరువాత నున్న యప్పకవి మొదలైనవారు సహితము మూఁడుపర్వము లని సామాన్యముగాఁ జెప్పుచున్నారే కాని మూఁడుపర్వములు పూర్తిగా నని చెప్పుట వారియుద్దేశ మెంతమాత్రమును గాదు. పూర్వకాలమునుండియు లిఖింపఁబడుచు వచ్చిన భారతతాళపత్రపుస్తకము లన్నిఁటిలోను "స్ఫురదరుణాంశురాగరుచి" యన్న పద్యమునకు ముందు "ఇక్కడనుండి యెఱ్ఱాప్రెగడ కవిత్వము" అని వ్రాయఁబడుచువచ్చుటచేత నన్నయభట్టంతవఱకు మాత్రమే చేసె నని తెల్లమగుచున్నది. కలియుగాదిని భారతము తెనిఁగింపఁబడె నని కాకునూర్యప్పకవి వ్రాసి యున్నాఁడు, కాని యావ్రాఁత కాధారము లేవియుఁ గనఁబడవు.

[ఆంధ్రభారతములోని యేయేభాగముల నెవ్వరెవ్వరు పూరించిరి? అను విషయమున పలువురు రచయితలు విభిన్నములును, విచిత్రములు నగు నభిప్రాయములను వెల్లడించి యున్నారు

నన్నయభట్టు భారతములోని యాది, సభాపర్వములను, అరణ్యపర్వములోని కొంతభాగమును తెలిఁగించెననియు, ఎఱ్ఱాప్రెగడ అరణ్యపర్వశేషమును పూర్తిచేసెననియు, తిక్కనసోమయాజి విరాటపర్వము మొదలు పదునైదుపర్వముల నాంధ్రీకరించి, భారతమును పూర్తిచేసెననియు సామాన్యముగ నందఱు నంగీకరించుచున్నారు కవి కవుల చరిత్రములను రచించిన కొందఱు వేఱువిధముగఁ దలంచుచున్నట్లు తెలియుచున్నది.

'Biographical sketches of Dekkan Poets' రచించిన శ్రీ కావలి వేంకటరామస్వామిగారు నన్నయ మరణమువలనఁ బూర్తికాక నిలిచిపోయిన అరణ్యపర్వము నాతని శిష్యుఁడగు బాలసరస్వతి పూరించెనని యభిప్రాయపడిరి. వారి మాటలను గమనింపుఁడు—

"This poet also translated two Volumes of the Mahabharat, into Telugu in conjunction with Narainbhat, a bramin of the Indra sect but while employed in translating the third Volume, Nannaya unfortunately died, and as no other poet would undertake to complete the translation, a disciple of Nannaya Bhatt named Balasaraswati who was a fellow student, with Sarangadhara the son of Raja Rajnaraindra completed the work after intense labour and application"
[Page 80]

కాని యిది విశ్వాసార్హము కాదు. రాజరాజునకు సారంగధరుఁ డను పుత్రుఁడే లేనట్లును, చిత్రాంగి వృత్తాంతము కల్పితమైనట్లును చరిత్రకారులు నిర్ణయించి యున్నారు కాఁగా అతఁడు నన్నయభట్టునకు శిష్యుఁడై యుండుటయు పొసఁగదు అప్పకవి తన గ్రంథమున 'సిద్ధుఁ డయిన సారంగధరుఁడు బాలసరస్వతి కాంధ్రశబ్దచింతామణి నొసఁగఁగా, అతఁడు దానికి టీకను వ్రాసె' నని చెప్పగా, శ్రీ వేంకటరామస్వామిగా రింకను ముందునకు సాగి, బాలసరస్వతి సారంగధరుని సహపాఠియనియు, తన గురువైన నన్నయభట్టు పూర్తిచేయక విడిచిన యరణ్యపర్వమును తెనిఁగించె ననియుఁ జెప్పుటలో వింతలలో వింత!

"కవి జీవితము" లను రచించిన శ్రీ గురుజాడ శ్రీరామమూర్తిగారు- అధర్వణునికిఁ దాను చేసిన ద్రోహమును దలంచి పశ్చాత్తప్తుఁడై విరాగియై భారతాంధ్రీకరణమునకు వేఱొకరిని నియమింపఁగోరినట్లును, తిక్కనను ప్రార్థింపఁగా—అతఁడు సమ్మతించి విరాటపర్వమునుండి ప్రారంభించి భారతము నాంధ్రీకరించినట్లును—పిదప ఎఱ్ఱాప్రెగడ అరణ్యపర్వమును పూర్తి చేసినట్లును తెలిపియున్నారు

కాని యిట్లూహించుట సరికాదు. నన్నయ, తిక్కనలు సమకాలికులు కానందునను. వీరిర్వురికిని నడుమ రెండుశతాబ్దులకాలము వ్యవధానముండుటఁ బట్టియు యూహ యుక్తము కాదు.

అరణ్యపర్వము కొంతవఱకును వ్రాయునప్పటికి నన్నయ మృతిఁ జెందెనని కాని, అతనికిఁ జిత్తవిభ్రాంతి కలిగెనని కాని కొంద ఱందురు

నన్నయభట్టు మృతికిఁ బూర్వమే రాజరాజు మరణించుటవలనను, ఆతని కుమారుఁడగు కులోత్తుంగచోడుఁడు దక్షిణదేశమునందే యుండుటవలన, అతని కాంధ్రభాషయం దభిమానము లేకుండుటవలనను నన్నయభట్టునకు విరక్తికలిగి భారతరచన నిలిచిపోయి యుండవచ్చునని "ఆంధ్రకవి తరంగిణి" రచయిత లభిప్రాయ పడుచున్నారు

నన్నయ భారతరచనను క్రీ. శ. [illegible] ల నడుమ సాగించెనని 'ఆంధ్ర కవి తరంగిణి' లోఁ గలదు. [పుట. 13] కీ శే నడకుదుటి వీరరాజుగారు, నన్నయ క్రీ శ. 1055 ప్రాంతమున మరణించెనని యభిప్రాయపడిరని, అందే తెల్పఁబడినది. భారతరచన క్రీ. శ 1025–1030 ల నడుమ జరిగిన దనియు, నన్నయభట్టు నందంపూఁడి శాసనరచయితకంటె భిన్నుఁడనియు శ్రీమారేమండ రామారావుగా రభిప్రాయపడుచున్నారని 'ఆంధ్రకవితరంగిణి' [పుట 14] లోఁ దెల్పఁబడినది.]

ఆంధ్ర భారతరచనారంభకాలమునం దాంధ్రదేశమునకుఁ బ్రభువుగా నుండిన రాజనరేంద్రుని యొక్క పూర్వులరాజ్యక్రమము నిందు సంక్షిప్తముగాఁ దెలుపుట యనావశ్యకము కాదు. విష్ణుశర్మచేత సంరక్షింపఁబడి చళుక్య పర్వతమున గౌరిని గూర్చి తపస్సుచేసి సేనలను గూర్చుకొనివచ్చి దక్షిణ హిందూస్థానము నంతను జయించిన (విజయాదిత్య పుత్రుఁడగు) విష్ణు వర్ధనుఁడు తాను పొందిన జయములను బట్టి జయసింహుఁ డను బిరుద నామమును బొందినట్టు కనఁబడుచున్నది. ఈ విజయములు నాల్గవశతాబ్దాంత మున జరిగి యుండును ఇతఁడు కాంచీపురము రాజధానిగాఁ గల పల్లవరాజు కొమార్తెను వివాహ మాడి, యామెవలన విజయాదిత్యుఁ డనుకుమారుని గనెను. ఈ విజయాదిత్యునికి రణరాగుఁ డనుబిరుదనామము కల దఁట.

విజయాదిత్యునికుమారుఁడు పులికేశివల్లభుఁడు. ఈ పులికేశివల్లభుని జ్యేష్ఠ
పుత్రుఁడు కీర్తివర్మ పృథివీవల్లభుఁడు. ఇతఁడు క్రీస్తుశకము ౫౬౭ వ సంవ
త్సరమువఱకును రాజ్యము చేసెను. కీర్తివర్మ యొక్క ప్రథమపుత్రుఁడగు
సత్యాశ్రయుఁడన్న బిరుదనామము గల (రెండవ) పులికేశివల్లభుఁడు తన
పినతండ్రియైన మంగళేశుని తరువాత ౬౧౦ వ సంవత్సరమున రాజ్యమునకు
వచ్చెను. ఈ సత్యాశ్రయుఁడు మిగుల బలవంతుఁడయి బహుదేశములను
జయించి, యాకాలమునందు పిష్టపుర మనఁబడెడి పీఠికాపురమునందలి
దుస్సాధ్యమయిన దుర్గమును పట్టుకొనెను. ఈ యుద్ధములయందీతనికిఁ
దమ్ముఁడును యువరాజు నయిన కుబ్జవిష్ణువర్ధనుఁడు మిక్కిలి సహాయుఁ
డయి యుండెను. కీర్తివర్మయొక్క ద్వితీయపుత్రుఁడయిన కుబ్జవిష్ణువర్ధనుఁడు
౬౧౫ వ సంవత్సరమునందు వేఁగిదేశమును బాలించుటకయి యన్నగా
రయిన సత్యాశ్రయునిచే నియమింపఁబడెను. కాని యతఁడు కొంతకాలము
లోనే స్వతంత్రుఁడయి తూర్పుచాళుక్యరాజులకు మూలపురుషుఁడయి
పూర్వచాళుక్యరాజ్య స్థాపకుఁడయ్యెను. వేఁగిదేశము బౌద్ధమతస్థులగు
సాలంకాయనరాజులనుండి కైకొనఁబడిన దగుటచే, ఈ కుబ్జవిష్ణువర్ధనుని
రాజ్యములోనే యాంధ్రదేశమునందు బౌద్ధమతమునకు క్షీణత్వమును
బ్రాహ్మణ మతమునకుఁ బ్రాబల్యమును బ్రారంభ మయ్యెను. ఈ చాళుక్య
రాజులు శైవులగు బ్రాహ్మణమతస్థులు, మానవ్యగోత్రులు.

౧. కుబ్జవిష్ణువర్ధనుఁడు — ఇతఁడు పైనిజెప్పినట్టు ౬౧౫ వ సంవత్సరమున
చైత్రశుద్ధ పూర్ణిమ తరువాత రాజ్యమునకు వచ్చి ౬౩౩ వ సంవత్సరము
వఱకును బదునెనిమిదిసంవత్సరములు రాజ్యము చేసెను. ఇతఁడు మొదటి
విష్ణువర్ధనుఁడు. ఈ విష్ణువర్ధనుఁడు తిమిలిసీమలోని కలవకొండగ్రామమును
తనరాజ్యకాలముయొక్క పదునెనిమిదవసంవత్సరమున శాలివాహనశకము
౫౫౫ శ్రావణశుద్ధ పూర్ణిమనాఁటి (క్రీస్తుశకము ౬౩౨ వ సంవత్సరము
జూలయినెల యేడవతేది) చంద్రగ్రహణ సమయమునందు విష్ణుశర్మ
మాధవశర్మ యను బ్రాహ్మణులకు దానము చేసినట్లున్న దానశాసనమునుబట్టి
యీతని రాజ్యము విశాఖపట్టణమండలములోని సర్వసిద్ధితాలూకాలోని
తిమిలిసీమ పైవఱకును వ్యాపించి యుండినట్టు స్పష్టమగుచున్నది.

కుబ్జవిష్ణువర్ధనుకును తత్పూర్వులకును రణాధిదేవత యయి షాణ్మాతురుఁడయిన కార్త్తికేయుఁడు (కుమారస్వామి)ను, ఆదిశక్త్యులైన మాతృకలును, కులదైవతము లయినట్టును, తత్కులమువారు వారిచే రక్షింపఁబడుచుండు నట్టును ౬౧౬ వ సంవత్సరమునందుఁ జేయఁబడిన సతారాదానశాసనము చెప్పుచున్నది. బ్రాహ్మి, మాహేశ్వరి, కౌమారి, వైష్ణవి, వారాహి, ఇంద్రాణి, చాముండ—సప్తమాతృకలు.

౨. జయసింహుఁడు—విష్ణువర్ధనుని జ్యేష్ఠపుత్రుఁడయిన (మొదటి) జయసింహుఁడు ౬౩౩ వ సంవత్సరము మొదలుకొని ౬౬౩ వ సంవత్సరమువఱకును ముప్పది యేండ్లు రాజ్యము చేసెను ఇతనికి సర్వసిద్ధి యను బిరుదనామము కలదు. ఇతఁడు గుడివాడ తాలూకాలో పెణుకపఱ్ఱుగ్రామము నొకబ్రాహ్మణుని కిచ్చినట్లు దానశాసన మున్నందున, ఇతనిరాజ్యము నెల్లూరిమండలమువఱకును వ్యాపించి యుండెను

౩. ఇంద్రభట్టారకుఁడు- ఇతఁడు కుబ్జవిష్ణువర్ధనుని ద్వితీయ పుత్రుఁడు; జయసింహుని తమ్ముఁడు. ఈ యింద్రరాజు ౬౬౩ వ సంవత్సరములో నేడుదినములుమాత్రమే రాజ్యము చేసి మృతుఁ డయ్యెను

౪. విష్ణువర్ధనుఁడు- ఇతఁ డింద్రభట్టారకునికొడుకు. ఇతనికి సర్వలోకాశ్రయుఁ డనియు విషమసిద్ధి యనియు బిరుదుపేళ్ళు గలవు ఇతఁడు ౬౬౩ వ సంవత్సరము మొదలుకొని ౬౭౨ వ సంవత్సరము వరకును తొమ్మిదిసంవత్సరములు రాజ్యము చేసెను. ఇతఁడు చేసిన యొక దాన శాసనమునందు "ఆత్మనో విజయరాజ్యపంచమే సంవత్సరే ఫాల్గునమాసే అమావాస్యాయాం సూర్యగ్రహణనిమిత్తం" అని శకసంవత్సరము ౫౮౫ ఫాల్గున బహుళామావాస్యకు సరియైన ౬౬౪ వ సంవత్సరము ఫిబ్రవరినెల ౧౨ వ తేది యితనిరాజ్యములో నైదవయేడని చెప్పఁబడి యుండుటచేత, ఈతనిరాజ్యము ౬౬౩ వ సంవత్సరము ఫాల్గునబహుళములో నారంభమయినట్టు తోఁచుచున్నది.

4

౫ మంగియువరాజు- ఇతఁడు రెండవవిష్ణువర్ధనుని పుత్రుఁడు. సర్వలోకాశ్రయుఁ డనియు విజయసిద్ధి యనియు బిరుదనామములు గలవాఁడు. ఇతఁడు ౬౭౨ వ సంవత్సరము మొదలుకొని ౬౯౬ వ సంవత్సరము వఱకును, ఇరువదియైదు సంవత్సరములు రాజ్యపరిపాలనము చేసెను.

౬ జయసింహుఁడు- ఇతఁడు మంగియువరాజునకు ప్రథమపుత్రుఁడు; మొదటి జయసింహుని పౌత్రుఁడు. ఈ రెండవ జయసింహుఁడు ౬౯౬ మొదలుకొని ౭౦౯ వఱకును పదుమూఁడు సంవత్సరములు రాజ్యపాలనము చేసెను

౭. కొక్కిలిరాజు- ఇతఁ డీరెండవజయసింహుని సవతితమ్ముఁడు మంగియువరాజునకు ద్వితీయకళత్రమువలనఁ బుట్టిన రెండవకొడుకు; ఇతఁడు ౭౦౯ వ సంవత్సరములో * తొమ్మిదినెలలు మాత్రము ప్రజాపాలనము చేసెను.

౮. విష్ణువర్ధనుఁడు- ఇతఁడు కొక్కిలికి జ్యేష్ఠభ్రాత. సవతియన్నయగు జయసింహుని మరణానంతరమున రాజ్యము సక్రమముగా నాక్రమించుకొన్న కొక్కిలిరాజును సింహాసనవిహీనుని జేసి ౭౦౯ మొదలుకొని ౭౪౬ వఱకును ముప్పదియేడు సంవత్సరములు దేశము నేలెను. ఇతఁడు మూఁడవవిష్ణువర్ధనుఁడు.

౯. విజయాదిత్యుఁడు - ఇతఁడు మూఁడవవిష్ణువర్ధనుని కొడుకు. విక్రమరాముఁ డనియు విజయసిద్ధి యనియు బిరుదములు గలవాఁడు. ౭౪౬ మొదలుకొని ౭౬౪ వఱకును పదునెనిమిదేండ్లు భూపరిపాలనము చేసెను ఇతఁడు విజయాదిత్యనామముగల వారిలో మొదటివాఁడు

౧౦. విష్ణువర్ధనుఁడు - ఇతఁడు విజయాదిత్యుని కుమారుఁడు. ౭౬౪ మొదలు ౭౯౯ వఱకు ముప్పదియాఱుసంవత్సరములు రాజ్యభారము వహించెను. ఇతఁడు నాల్గవ విష్ణువర్ధనుఁడు

[* 6 మాసములు మాత్రము రాజ్యముచేసి వట్లాంధ్రకవితరంగిణిలోఁ గలదు. (పుట 84)]

౧౧. విజయాదిత్యుఁడు - ఇతఁడు నాల్గవ విష్ణువర్ధనుని కొడుకు; విజయాదిత్యుని మనుమఁడు. ఈ రెండవవిజయాదిత్యుఁడు నరేంద్రమృగరాజనియు, సమస్త భువనాశ్రయుఁడనియు, చాళుక్యార్జునుఁడనియు బిరుదుపేరులు వహించి, ౭౯౯ మొదలు ౮౪౩ వఱకును నలువదినాలుగు సంవత్సరములు రాజ్యపాలనము చేసెను ఇతఁడు గాంగులతోను రాష్ట్రకూటులతోను బహుయుద్ధములు చేసి వారిని జయించి, తన రాష్ట్రమునందు నూటయెనిమిది శివాలయములు గట్టించెను

౧౨. విష్ణువర్ధనుఁడు - ఈ యైదవ విష్ణువర్ధనుఁడు విజయాదిత్యుని కొడుకు. సర్వలోకాశ్రయుఁడు, విషయసిద్ధి యను బిరుదాంకములను గలవాఁడు. ఇతఁడు ౮౪౩ మొదలు ౮౪౪ వఱకు పదునెనిమిదినెలలు రాజ్యము చేసెను. ♦ ఈతని కాలమునఁ బుట్టిన శాసనములలోఁ గొంతభాగము తెలుఁగు భాషలో నున్నది.

౧౩ విజయాదిత్యుఁడు - ఈ మూఁడవ విజయాదిత్యుఁడు (ఐదవ) విష్ణువర్ధనుని పెద్దకొడుకు. ఇతఁడు గణితశాస్త్రమునందు పండితుఁ డగుటచేత గణకవిజయాదిత్యుఁడని పిలువఁబడుచు వచ్చెను. *ఇతఁడు రాష్ట్రకూటులను జయించి, మంగిరాజు శిరస్సు ఖండించి, ౮౪౪ మొదలు ౮౮౮ వఱకు నలువదినాలుగు సంవత్సరములు ప్రజాపరిపాలనము చేసెను ఈతనికి యువరాజవిక్రమాదిత్యుఁ డనియు, యుద్ధమల్లుఁ డనియు నిద్దఱు తమ్ములుండిరి

౧౪ చాళుక్యభీముఁడు - ఇతఁడు యువరాజవిక్రమాదిత్యుని కొమారుఁడు. ఇతఁడు తన పెద్దతండ్రియైన విజయాదిత్యుని పిమ్మట రాజ్యమునకు వచ్చి, రాష్ట్రకూటరాజయిన రెండవ కృష్ణుని జయించి యావఱ కన్యాక్రాంతమైన

---

[♦ ఈతఁ డొక్క సంవత్సరమే రాజ్యము పాలించెనని 'ఆంధ్రకవితరంగిణి'. (పుట 89)

* గణక విజయాదిత్యుఁ డనుటకుఁ దగిన యాధారములేదనియు, ఇతఁడు గుణాంకవిజయాదిత్యుఁడు, గుణగాంక విజయాదిత్యుఁడు నని చెప్పబడుచున్నాఁడనియు 'ఆంధ్రకవితరంగిణి.' (పుట 89)]

వేఁగిదేశముయొక్క భాగమును మరల నాక్రమించుకొని, ౮౮౮ మొదలు ౯౧౮ వఱకు ముప్పది సంవత్సరములు నేల యేలెను.

౧౫. విజయాదిత్యుఁడు - చాళుక్యభీముని జ్యేష్ఠపుత్రుఁ డైన యీ నాల్గవ విజయాదిత్యుఁడు కళింగులను జయించి, ౯౧౮ వ సంవత్సరములో నాఱు మాసములు రాజ్యముచేసి దేహవియోగము నొందెను. ఈతఁడు కొల్లభిగండ విజయాదిత్యుఁడని పిలువఁబడుచుండెను

౧౬. అమ్మరాజ విష్ణువర్ధనుఁడు - ఇతఁడు నాల్గవ విజయాదిత్యుని పెద్ద కుమారుఁడు. ఈతఁడు రాజమహేంద్రుఁడన్న బిరుదనామము గలవాఁడు. ఈతని కాలములోనే రాజధాని వేఁగీపురమునుండి రాజమహేంద్రవరమునకు మార్పఁబడెననియు, ఈతనిపేరనే యా పట్టణమున కాపేరు కలిగినదనియు చెప్పుదురు. ఆఱవ విష్ణువర్ధనుఁ డైన యీ యమ్మరాజు ౯౧౮ మొదలు ౯౨౫ వఱకు నేడేండ్లు భూపరిపాలనము చేసెను.

౧౭. విజయాదిత్యుఁడు - ఈ యైదవ విజయాదిత్యునికి బేటరాజని నామాంతరము గలదు. ఇతఁ డమ్మరాజుయొక్క జ్యేష్ఠపుత్రుఁడు. ౯౨౫ వ సంవత్సరములో పదునేను దినములు రాజ్యము చేసిన తరువాత నీతనిని యుద్ధమల్లుని కొడు కైన♦తాళరాజు రాజ్యపదభ్రష్టునిజేసి చెఱసాలయందుఁబెట్టి రాజ్యమును గైకొనెను

౧౮. తాళరాజు- యుద్ధమల్లునికొడు కైన యీ తాళరాజు రాజ్య మాక్రమించుకొని ౯౨౫ వ సంవత్సరములో నెల దినములు రాజ్యపాలనము చేసిన తరువాత చాళుక్యభీముని ద్వితీయపుత్రుఁడును నాల్గవ విజయాదిత్యుని యనుజుఁడు నైన విక్రమాదిత్యుఁ డీతనిని జంపి రాజ్యమును గైకొనెను.

౧౯ విక్రమాదిత్యుఁడు- చాళుక్యభీమునికొడు కైన యీ రెండవ విక్రమాదిత్యుఁడు వేఁగి త్రికళింగదేశములను ౯౨౫-౨౬ సంవత్సరములలో పదునొక్కమాసములు పాలించినతరువాత అమ్మరాజ విష్ణువర్ధనుని కొడుకగు భీముఁ డీతనిని సింహాసనవిహీనుని జేసి రాజ్యముఁ గైకొనెను

[♦ ఈతనికే తాలపుఁడు తాడపుఁడు నను నామాంతరములు గలవని 'ఆంధ్ర కవితరంగిణి' (పుట 95)]

౨౦ భీముఁడు- అమ్మరాజవిష్ణువర్ధనుని కొడుకును నయిదవ విజయాదిత్యుని తమ్ముఁడును నైన యీ మూఁడవ భీముఁడు విక్రమాదిత్యుని జయించి ౯౨౬-౨౭ సంవత్సరములలో * నెనిమిది మాసములు రాజ్యము చేసిన తరువాత, తాళరాజుకొడు కైన యుద్ధమల్లుఁ డీతనిని జంపి రాజ్యమును జేకొనెను.

౨౧ యుద్ధమల్లుఁడు- ఈరెండవ యుద్ధమల్లుఁడు తాళరాజు కొడుకు. ఇతఁడు ౯౨౭ మొదలుకొని ౯౩౪ వఱకు నేడు సంవత్సరములు రాజ్యము చేసినతరువాత నాల్గవ విజయాదిత్యుని ద్వితీయపుత్రుఁడైన చాళుక్య భీమునిచే జయింపఁబడి రాజ్యపదభ్రష్టుఁ డయ్యెను ఈతనికాలపు బెజవాడ శాసనములో తెలుఁగుపద్యము లున్నవి. [(మొదటి) యుద్ధమల్లుఁడను ప్రసిద్ధిగల మల్లపరాజు బెజవాడలోఁ గుమారస్వామికి ఒకఆలయమును, దానింజేర్చి యొకమఠమును కట్టించెను. ఈ యంశములుగల శాసనమే యుద్ధమల్లుని బెజవాడ శిలాశాసనముగాఁ బ్రసిద్ధము. ఈ (రెండవ) యుద్ధమల్లుఁ డతని మనుమఁడు. ఇతఁడు పయి గుడికి ముఖమండపమునో, గోపురమునో కట్టించెను.]

౨౨ చాళుక్యభీమవిష్ణువర్ధనుఁడు - రెండవ చాళుక్యభీముఁడును నేడవ విష్ణువర్ధనుఁడు నైన యితఁడు నాల్గవ విజయాదిత్యుని రెండవ భార్య కొడుకు; అమ్మరాజు విష్ణువర్ధనుని సవతితమ్ముఁడు. ఇతఁడు గండమహేంద్రుఁడు, రాజమార్తాండుఁడు, అను బిరుదులు గలవాఁడై, చోళరాజైన లోవబిక్కి, రాష్ట్రకూటప్రభువైన యైదవగోవిందరాజు మొదలైన వారిని జయించి, ౯౩౪ మొదలు ౯౪౫ వఱకు పండ్రెండు సంవత్సరములు రాజ్యపాలనము చేసెను.

౨౩. అమ్మరాజవిజయాదిత్యుఁడు- రెండవ యమ్మరాజును నాఱవ విజయాదిత్యుఁడును నైన యితఁడు రెండవ చాళుక్యభీముని చిన్నకొడుకు. ఈతని కాలమునందలి యొక దానశాసనములో నితఁడు శాలివాహనశకము ౮౮౪ వ సంవత్సరము మార్గశీర్షబహుళత్రయోదశీ శుక్రవారమునాఁ డనఁగా

[* రెండునెలలు మాత్రమే రాజ్యమేలెనని కవితరంగిణి. (96)]

క్రీస్తుశకము ౯౪౫ వ సంవత్సరము డిసెంబరు నెల ౫ వ తేదిని పట్టాభిషిక్తుఁ డయినట్టు చెప్పఁబడి యున్నది. ఇతఁడు రాజపరమేశ్వర త్రిభువనాంకుశాదిబిరుదాంకములను గలవాఁడై ౯౪౫ మొదలు ౯౭౦ వఱకు నిరువదియైదు సంవత్సరములు భూపరిపాలన మొనర్చెను.

౨౪. దానార్ణవుఁడు- ఇతఁడు రెండవ చాళుక్యభీముని జ్యేష్ఠపుత్రుఁడు; అమ్మరాజ విజయాదిత్యుఁని సవతియన్న. ఇతఁడు ౯౭౦ మొదలు ౯౭౩ వఱకును మూఁడు సంవత్సరములు రాజ్యము చేసెను. ఒకశాసనములో నితఁడు ముప్పది సంవత్సరములు రాజ్యము చేసినట్లున్నదిగాని ౯౭౩ మొదలు ౧౦౦౩ వఱకు ముప్పది సంవత్సరములు దేశ మరాజకమై యున్నట్లు బహుశాసనములవలనఁ దెలియ వచ్చుచున్నది ఈ కాలములో చోళు లీదేశమునకు దండెత్తివచ్చి గెలిచినట్టును, కొంతకాలము వేఁగిదేశమును పాలించినట్లును కనఁబడుచున్నది *

౨౫. శక్తివర్మ- ఇతఁడు దానార్ణవుని పెద్దకొడుకు. చాళుక్యచంద్రుఁ డన్నబిరుదుపేరు గలవాఁడు. ఇతఁడు ౧౦౦౩ మొదలు ౧౦౧౫ వఱకు పండ్రెండేండ్లు దొరతనము చేసెను. ఈతని బంగారునాణెములు అరకాను దేశమునందును సయాము దేశమునందును గనఁబడినవి.

౨౬ విమలాదిత్యుఁడు- ఇతఁడు శక్తివర్మ తమ్ముఁడు, దానార్ణవుని రెండవకొడుకు ఇతఁడు రాజేంద్రచోడుని చెల్లెలును గంగయికొండ రాజ రాజ రాజకేసరివర్మ కూఁతురును నగు కుందవాంబాదేవి ♦ యను చోడరాజ కన్యను వివాహమాడి యామెవలన నాంధ్రభారత కృతిపతి యగు రాజ నరేంద్రునిఁ గనెను. ఈ రాజనరేంద్రునిది మాతామహుని పేరు విమలాదిత్యుఁడు ౧౦౧౫ మొదలు ౧౦౨౨ వఱకు నేడు సంవత్సరములు ప్రభుత్వము చేసెను.

౨౭. రాజరాజవిష్ణువర్ధనుఁడు- ఇత డే భారతకృతిపతి. విమలాదిత్యుని పుత్రుఁడైన యితఁడు రాజరాజు లనఁబడెడువారిలో మొదటివాఁడును,

---

* రాజ్యమరాజకమైనదేశాని, చోళులు దీనిని జయించి పాలించిరనుట నిరాధారమని 'ఆంధ్రకవితరంగిణి' (పుట 101)

♦ ఈమె కుందవదేవి యని కవితరంగిణి. (పుట 103)

విష్ణువర్ధనులలో నెనిమిదివవాఁడును అయి యుండెను "విష్ణువర్ధనుఁడు వంశవర్ధనుండు" అని యాంధ్రభారతములో సహిత మీ రాజనరేంద్రునకు విష్ణువర్ధననామ మున్నట్టు చెప్పఁబడియున్నది ఇతఁడు తన మేనమామ యగు రాజేంద్రచోళునికూఁతు రయిన యమ్మంగదేవిని వివాహ మాడెను. ఈ రాజరాజు శకసంవత్సరము ౯౪౪ భాద్రపద బహుళ ద్వితీయాగురు వారము ఉత్తరాభాద్రపదనక్షత్రమున ననఁగా క్రీస్తుశకము ౧౦౨౨ సంవత్సరము ఆగష్టునెల ౧౬ వ తేదిని పట్టాభిషిక్తుఁ డయ్యెను. ఇతని తమ్ముఁడు విజయాదిత్యుఁడు ఈ యేడవ విజయాదిత్యుఁడు కులోత్తుంగచోడదేవుని కాలములో ౧౦౬౩ వ సంవత్సరము మొదలుకొని ౧౦౭౭ వ సంవత్సరము వఱకును వేఁగిదేశమునకు పాలకుఁడుగా నుండెను. ఈ రాజనరేంద్రుఁడు ౧౦౨౨ మొదలుకొని ౧౦౬౩ వఱకు నలువదియొక్క సంవత్సరములు రాజ్యపాలనము చేసెను. ఈతని పేరు గల యీతనిరాజ్యకాలపు బంగారు నాణెము లీ నడుమను ఆరకాను, సయాము దేశములలోఁ గనిపెట్టబడినవి.

౨౧. కులోత్తుంగ చోడదేవుఁడు- ఇతఁడు రాజనరేంద్రుని ప్రథమ పుత్రుఁడు. ఇతఁడే రాజేంద్రచోడుఁడు. ఇతని మొదటిపేరిదియే యైనను, ఇతఁడు వేఁగిదేశరాజ్యభారమును వహించిన మొదటి సంవత్సరము లోనే చోళదేశమునకు దండెత్తి దానిని జయించి స్వాధీనపఱచుకొన్న తరువాత కులోత్తుంగచోడదేవుఁ డనఁబడుచు వచ్చెను. ఇతనికి రాజనారాయణుఁడని బిరుదుపేరు. ఈతనిని కరికాలచోళుఁడనియు వాడుచు వచ్చిరి. మూఁడుతరములనుండి చోళరాజులకూఁతులను వివాహమాడుచు వచ్చుటచేత తమతల్లులనుబట్టియు భార్యలనుబట్టియు చాళుక్యుల కంతకంతకు వేఁగి దేశమునకంటె చోళదేశముమీఁద నభిమాన మెక్కుడగుచు వచ్చెను. విమలాదిత్యుఁడు రాజరాజుకూఁతురైన కుందవాంబాదేవిని వివాహ మాడి తన కుమారునకు రాజరాజని పేరుపెట్టెను; రాజరాజు తన మేనమామ యైన రాజేంద్రచోళుని కూఁతురైన అమ్మంగదేవిని పెండ్లియాడి తనపుత్రు నకు రాజేంద్రచోడు డనియే నామకరణము చేసెను. తరువాత రాజేంద్ర చోడుఁడును రాజేంద్రచోడుని కూఁతురైన మధురాంతకదేవిని పరిణయము

చేసికొని, చోళదేశముమీఁదనే యధికాదరము గలవాఁడయి తా నా దేశమును జయించినతోడనే తనరాజధానిని చోళదేశమునకు మార్చుకొని, వేఁగిదేశమును పాలించుటకయి పాలకులను నియమించి రాజ్యాధికారమును వారికి విడిచిపెట్టెను ౧౦౬౩ వ సంవత్సరమునందు వేఁగిదేశమును పాలించుటకయి కులోత్తుంగ చోడదేవుఁడు తన పినతండ్రియైన విజయాదిత్యుని నియమింపఁగా నతఁడు పదునేను సంవత్సరములు రాజ్యపాలనము చేసి వార్ధకదశలో ౧౦౭౭ వ సంవత్సరమునందుఁ జోడదేశమునకుఁబోయి చేరెను; అటుతరువాత ౧౦౭౭ వ సంవత్సరములోనే వేఁగిదేశపరిపాలనము నిమిత్తము తన రెండవకొడుకైన రాజరాజును బంపి యతఁ డక్కడ నుండ నొల్లక మరుసటి సంవత్సరములోనే తల్లిదండ్రులవద్దకు లేచి రాఁగా, ౧౦౭౮ వ సంవత్సరమునందు శ్రావణమాసములో తన మూఁడవ కొడుకైన వీరచోడదేవుని వేఁగిదేశపాలకునిగాఁ బంపెను. ఈవీరచోడదేవుఁడు (తొమ్మిదవ) విష్ణువర్ధనుఁ డను బిరుదుపేరితో ౧౧౦౦ సంవత్సరము వఱకును వేఁగిదేశాధిపుఁడుగా నుండెను కులోత్తుంగచోడదేవునికి విక్రమచోడుఁడు,రాజరాజు,వీరచోడదేవుఁడు మొదలుగాఁ గల కొడుకులును, రాజసుందరి యను కూఁతురును గలిగిరి. ఈ రాజసుందరి కళింగరాజయిన రాజరాజునకు భార్యయయ్యెను. కులోత్తుంగచోళదేవుఁడు ౧౦౬౩ మొదలు ౧౧౧౨ వఱకును నలువదితొమ్మిది సంవత్సరములు రాజ్యపాలనము చేసెను. చాళుక్యులు తాము చంద్రవంశజుల మనియు, చోళులు తాము సూర్యవంశజుల మనియు, చెప్పుకొనుచుండినవా రయినను, తండ్రివంశమున శుద్ధచాళుక్యుఁ డయి చోళమండలమును జయించి చోళరాజ్యమును పాలించుచు చోళదాయాదుఁ డనఁబరఁగిన కరికాలచోడుఁ డను కులోత్తుంగచోడుని సంతతివారు తాము సూర్యవంశ్యుల మని చెప్పుకొనసాగిరి ఆ కాలమునందు చరిత్రాంశములను దెలిపెడు పుస్తకములు రెండు పుట్టినవి. అందొకటి జయనకొండనిచే నఱవములోఁ జేయఁబడిన "కళింగట్టుపరణి"; మఱి యొకటి బిల్హణునిచే సంస్కృతమునఁ జేయబడిన "విక్రమాంకదేవచరిత్ర" ఇందు మొదటిది ౧౦౬౩ మొదలుకొని ౧౧౧౨ వ సంవత్సరమువఱకును

చోళదేశమును పరిపాలించిన కులోత్తుంగచోడదేవుని విజయములను దెలుపుచున్నది. రెండవది ౧౦౭౬ మొదలుకొని ౧౧౩౬ వ సంవత్సరము వఱకును కుంతలదేశమును పాలించిన పశ్చిమచాళుక్యరాజయిన (యాఱవ) విక్రమాదిత్యునివిజయములను దెలుపుచున్నది. ఈరాజు లిద్దఱును జిరకాలము సమకాలీనులుగా నుండుటయేకాక ౧౦౭౬ మొదలుకొని ౧౧౧౨ వరకును ౩౬ సంవత్సరములు సమకాలిక ప్రజాపాలకులుగాఁగూడ నుండిరి. "కళింగవిజయ" మనునర్థ మిచ్చెడి పూర్వోక్తమయిన యఱవకావ్యములో రెండు సంవత్సరములు కళింగరాజు కప్పము కట్టుట మానివేయఁగాఁ గులోత్తుంగచోడదేవుఁ డతనిని దండించుటకయి తన దండనాథులలో నొకఁడయిన కరుణాకరపల్లవుని సైన్యముతో దండయాత్ర పంపిన ట్లొకచోటఁ జెప్పఁబడినది. చోళరాజ్యవిషయమున విక్రమాదిత్యునకును గులోత్తుంగచోడునికిని పలుమాఱు యుద్ధములు జరుగుచువచ్చి జయాపజయములు పర్యాయమున మాఱుచు వచ్చెను. తండ్రియైన ప్రథమసోమేశ్వరుఁడు రాజ్యపాలనము చేయుచుండఁగానే యన్న యయిన ద్వితీయసోమేశ్వరుఁడు యువరాజుగా నుండఁగానే యీ విక్రమాదిత్యుఁడు చోళదేశముమీఁదికి జనకునిచే విజయయాత్రకుఁ బంపఁబడినట్టు విక్రమాంకదేవచరిత్రము చెప్పుచున్నది. మఱియొకసారి యితఁడు చోళులపై దండయాత్ర వెడలినప్పుడు చోళమండలాధీశ్వరుఁ డీతనిధాటికి భయపడి తనకూఁతు నాతని కిచ్చి వివాహము చేసి సంధిచేసికొన్నట్టు చెప్పఁబడియున్నది. ఇటీవల నత్యల్పకాలములోనే దేశవిప్లవము సంభవించి చోళరాజు మరణము నొంది దేశ మరాజకముకాఁగా వెంటనే విక్రమాదిత్యుఁడు కాంచీనగరమునకు సేనలతో వచ్చి రాజద్రోహులను పాఱఁద్రోలి తనభార్య సోదరుని చోళసింహాసనమునందు నిలిపి కంచిలోఁ దాను నెలదినములుండి స్వరాజ్యసీమయైన తుంగభద్రాతీరమునకుఁ బోయెను అతఁ డట్లడుగు తీయఁగానే కొన్నిదినములలోపలనే మరల నూతనదేశవిప్లవ మొకటి తటస్థించి యందు రాజయిన తన శ్యాలకుఁడు ప్రాణములు గోలుపోయెననియు, వేఁగిదేశా

ధీశుఁ డయిన రాజేంద్రచోడుఁడు కాంచీపురరాజ్య మాక్రమించుకొనియె నని ను, వార్తయాతనిచెవిసోఁకెను. ఇది ౧౦౭౩ వ సంవత్సరమున నను టకు సందేహము లేదు. ఈసారి శత్రుఁ డల్పుఁడు కాకుండుట తలపోసి మహాప్రయత్నముచేసి విక్రమాదిత్యుఁడు వెంటనే తన యన్నయైన ద్వితీయసోమేశ్వరునితోఁ గలిసి రాజేంద్రచోడుఁ డనఁబడెడు కులోత్తుంగ చోడదేవునిమీఁదికి దండెత్తివచ్చెను ఇరువురు రాజులకును ఘోరసంగ్రామము జరిగినమీఁదట తాత్కాలికజయము విక్రమాదిత్యునకే కలిగి రాజేంద్రచోడుఁడు పలాయనము నొందవలసినవాఁ డయ్యెను; కాని సోమేశ్వరుఁడు ప్రతిపక్షిచేతిలోఁ జిక్కి కారాబద్ధుఁడుగాఁ జేయఁబడెను. ఇటీవల చోళులకును చాళుక్యులకు ననఁగా పూర్వచాళుక్యులకును పశ్చిమచాళుక్యులకును చోళరాజ్యసంబంధమున యుద్ధములు పలుమాఱు జరగుచు వచ్చెను. ఈ యుద్ధములు చోళదేశముతో నిలువక వేఁగిదేశమువఱకును గూడ వ్యాపించినట్టు కనఁబడుచున్నవి. ఈ యుద్ధములలో నొకసారి విక్రమాదిత్యుఁడు వేఁగిదేశమును సహితము స్వాధీనము చేసికొన్నట్టు చెప్పఁబడినది గోదావరీమండలములోని దాక్షారామములోఁ గల శాలివాహనశకము ౧౦౪౫, ౧౦౫౨ సంవత్సరములనాఁటి విక్రమాదిత్యుని శాసనము లీ విషయమును గొంత స్థిరపఱుచుచున్నవి. సాధారణముగా "కళింగట్టుపరణి" కులోత్తుంగచోడుని విజయములను, "విక్రమాంక దేవచరిత్ర" విక్రమాదిత్యుని విజయములను పొగడుచుండును.

౨౯. విక్రమచోడుఁడు- ఇతఁడు కులోత్తుంగచోడు డనఁబడెడు రాజేంద్రచోడుని జ్యేష్ఠకుమారుఁడు, ఇతఁడు కొంతకాలము వేఁగిదేశపాలకుఁడుగా నుండెను. ఇతఁడు తండ్రియొక్క మరణానంతరమున వేఁగిదేశము విడచి చోళరాజ్యమును వహించుటకుఁ బోయెనని యొక శాసనమున నున్నది. ఈతఁడు ౧౧౨౨ మొదలు ౧౧౩౩ వఱకు పదునేను సంవత్సరములు రాజ్యము చేసెను.

౩౦. కులోత్తుంగ చోడదేవుఁడు- ఈ రెండవ కులోత్తుంగుఁడు విక్రమచోడునికొడుకు ఇతఁడు ౧౧౩౩ వ సంవత్సరమున రాజ్యమునకు

వచ్చెను. ఇతఁడు చోళరాజ్యమును ౧౧౪౮ వ సంవత్సరమువఱకును పాలించెను. ఇతనికొడుకు రాజేంద్రచోడుఁడు పన్రెండవ శతాబ్ద్యంతము వఱకును, రాజేంద్రచోడునికొడుకు రాజరాజచోడుఁడు ౧౨౩౨ వ సంవత్సరము వరకును, చోడరాజ్యమును పాలించినట్టు కనఁబడుచున్నది. ఈ రెండవ కులోత్తుంగచోడదేవుని కాలములోనే వేఁగిదేశ మితరచాళుక్యుల యధీన మయినట్టు స్పష్టముగాఁ గనఁబడుచున్నది. ౧౨౦౨ వ సంవత్సరమునందు మల్లవిష్ణువర్ధనుఁడు వేఁగిదేశప్రభువుగా నుండిన ట్టొక శాసనమునం దున్నది. ఆ శాసనమునందే యాతనితండ్రి విజయాదిత్యుఁడు చిరకాలము వేఁగిదేశమును బాలించినట్టును జెప్పఁబడియున్నది. దీనినిబట్టి చూడఁగా రెండవ కులోత్తుంగ చోడదేవునికాలములోనే విజయాదిత్యుఁడు వేఁగిదేశరాజ్యమును వహించినట్టు తోఁచుచున్నది. ఈ విజయాదిత్యుఁడు పైని వివరింపఁబడిన పదునేఁడవ తూర్పుచాళుక్యరా జగు బేటవిజయాదిత్యుని కాఱవతరమువాఁడు బేటవిజయాదిత్యుని కొడుకు సత్యాశ్రయుఁడు; సత్యాశ్రయునికొడుకు విజయాదిత్యుఁడు, విజయాదిత్యునికొడుకు విష్ణువర్ధనుఁడు; విష్ణువర్ధనునికొడుకు మల్లప్పదేవుఁడు; మల్లప్పదేవుని కొడుకు వేఁగిదేశప్రభు వైన విజయాదిత్యుఁడు. ౧౨౨౮ వ సంవత్సరమునందు కృష్ణాగోదావరీ మధ్యమునందున్న వేఁగిదేశమంతయు గణపతి రాజుల యధీన మైనది. కులోత్తుంగచోడదేవునికాలమునుండియు చాళుక్య చోడు లందఱును తాము వేఁగిదేశమును విడిచి చోళుల బిరుదావళులను వహించి తాము చోళులుగానే పరిగణింపఁబడుచు వచ్చుటచేత వారినిగూర్చి యిందు వివరించుట యనావశ్యకము. చాళుక్యులు చంద్రవంశపురాజులు; చోళులు సూర్యవంశపురాలు * ఈ క్రిందిది చాళుక్యుల వంశవృక్షము.

---

[* ఈ చాళుక్యులు సూర్యవంశమువారు గాని, చంద్ర వంశమువారు కాని కారనియు, వీరు దాక్షిణాత్యులును ద్విజేతురులునైయుండి తమ వంశమునకు గౌరవము నాపాదించుటకై యీ గాథలను కల్పించుకొని వానిని శాసనములలోని కెక్కించికొనిరనియు నవీనచరిత్రకారులను చున్నారనియు అది సత్యమే కావచ్చుననియు 'ఆంధ్రకవి తరంగిణి' లోఁగలదు ] ( పుట 71 )

1 కుబ్జవిష్ణువర్ధనుఁడు (615-633)

2. జయసింహుఁడు (633-663)

3. ఇంద్రభట్టారకుఁడు (663).

4. విష్ణువర్ధనుఁడు (663-672).

5. మంగియువరాజు (672-695).

6. జయసింహుఁడు. (996-709)

8 విష్ణువర్ధనుఁడు (709-746)

7. కొక్కిలి (709)

9. విజయాదిత్యుఁడు (746-764)

10. విష్ణువర్ధనుఁడు. (764-799)

11 విజయాదిత్యుఁడు (799-843)

నృపరుద్రుఁడు.

12. విష్ణువర్ధనుఁడు (843-844)

13. గణక విజయాదిత్యుఁడు (844-888)

విక్రమాదిత్యుడు

యుద్ధమల్లుడు

14 చాళుక్యభీముఁడు. (888-918)

18. తాళరాజు (925)

21. యుద్ధమల్లుఁడు (927-934)

15. విజయాదిత్యుఁడు (918)

19 విక్రమాదిత్యుఁడు (925-926)

16. అమ్మరాజవిష్ణువర్ధనుఁడు. (918-925)

22 చాళుక్యభీముఁడు (934-945)

17. బేటవిజయాదిత్యుఁడు (925)

20 భీముఁడు (926-927)

24. దానార్ణవుఁడు (970-973)

23. అమ్మవిజయాదిత్యుఁడు (945-970)

సత్యాశ్రయుఁడు

విజయాదిత్యుఁడు

25 శక్తివర్మ (1003-1015)

26 విమలాదిత్యుఁడు (1015-1022)

విష్ణువర్ధనుఁడు
|
మల్లప్పదేవుఁడు
|
విజయాదిత్యుఁడు
|
మల్లవిష్ణువర్ధనుఁడు (1202)

27. రాజరాజు (1022-1063)  —  విజయాదిత్యుఁడు
|
28. రాజేంద్రకులోత్తుంగచోడదేవుఁడు. (1063-1112)
|
29. విక్రమచోడుఁడు. (1112-1127)  —  రాజరాజు  —  వీరచోడదేవుఁడు.
|
30. కులోత్తుంగ చోడదేవుఁడు (1127-1158)
|
31. రాజేంద్రచోడుఁడు (1158-1200?)
|
32. రాజరాజచోడుఁడు (1200?-1235?)

[ఈ వంశవృక్షములో నీయఁబడిన రాజులకాలము 'ఆంధ్రకవితరంగిణి' లో క్రిందిరీతి నీయఁబడియున్నది.

1) కుబ్జవిష్ణువర్ధనుండు 616-633 2) జయసింహుఁడు 634-666. 3) ఇంద్రభట్టారకుఁడు 666. 4) విష్ణువర్ధనుఁడు 667-675. 5) మంగియువరాజు 676-700. 6) జయసింహుఁడు 701-713. 7) కొక్కిలి 714. 8) విష్ణువర్ధనుఁడు 714-750 9) విజయాదిత్యుఁడు 751-768 10) విష్ణువర్ధనుఁడు 768-803 11) విజయాదిత్యుఁడు 804-848. 12) విష్ణువర్ధనుఁడు 849. 13) గణక (గుణగ) విజయాదిత్యుఁడు 850-892. 14) చాళుక్యభీముఁడు 892-918. 15) విజయాదిత్యుఁడు 919. 16) అమ్మరాజవిష్ణువర్ధనుఁడు 919-925. 17) బేటవిజయాదిత్యుఁడు 926. 18) తాళరాజు 925. 19) విక్రమాదిత్యుఁడు 925-926. 20) భీముఁడు 926. 21) యుద్ధమల్లుఁడు 925-933 22) చాళుక్యభీముఁడు 934-945. 23) అమ్మరాజవిజయాదిత్యుఁడు 945-970 24) దానార్ణవుఁడు 970-973 25) శక్తివర్మ 1000-1011. 26) విమలాదిత్యుఁడు 1011-1022. 27) రాజరాజు 1022-1063]

ఈనన్నయభట్టారకుఁడు భారతమునందలి యాదిపర్వమును, సభాపర్వమును, ఆరణ్యపర్వములోని నాల్గవ యాశ్వాసము మూడవవంతు వఱకును రాజనరేంద్రున కంకితముగా తెనిఁగించెను. ఈతఁడు రచించిన దానిలో

ఉ. శారదరాత్రు లుజ్జ్వలలసత్తరతారకహారపంక్తులన్
జారుతరంబులయ్యె వికసన్నవకైరవగంధబంధురో
దారసమీరసౌరభము దాల్చి సుధాంశువికీర్యమాణక
ర్పూరపరాగపాండురుచిపూరము లంబరపూరితంబులై.

అనునది కడపటి పద్యము. ఈ పద్యమునందలి నాలవ చరణములోని "రుచిపూరము లంబరపూరితంబులై" యని యున్నచోట "రుచిపూరములు+అంబరపూరితంబులై" యనుటకు మాఱుగా "రుచిపూరములం+బరపూరితంబులై" యని పదవిభాగము చేసి యక్కడనుండి పయి పద్యములన్నియు నన్నయవి గాక పరపూరితము లన్న యర్థము స్ఫురించుచున్నదని యొకానొకరు చమత్కారముగా వ్రాసియున్నారు. ఈతనిది మృదువయిన సులభశైలి; కవిత్వము ద్రాక్షాపాకమయి మిక్కిలి రసవంతముగా నుండును. ఈయన కవనమందించుమించుగా రెండు వంతులు సంస్కృతపదములును, ఒకవంతు తెలుఁగుపదములును నుండును. ఈ యంశము లీయనకవిత్వధోరణిని జూపుటకయి యిందు క్రింద నుదాహరింపఁబడిన పద్యములవలనఁ దెలిసికోవచ్చును.

క. అడవులు నేఱులు నవి నీ
పడసినయవి యెట్లు పుణ్యభాగీరథి యి
ప్పుడమిఁ గలవారి కెల్లను
నెడపక సేవ్యంబకాక యిది నీయదియే. [ఆది. అ ౭-౪౧]

ఉ. వీరుఁడు వీఁడు పాండవుఁడు వృష్ణికులోత్తములైన సీరిదై
త్యారు లెఱుఁగకుండఁగ మహారథుఁడై తరుణిన్ సుభద్ర నం
భోరుహనేత్రఁ దోడ్కొనుచుఁ బోయెడు నీతనిఁబోవ నిచ్చినన్
ధీరుఁడు మాధవుండు బలదేవుఁడు నల్గుదురంచు నడ్డమై
(ఆది. అ ౮-౧౯౯)

మ. కురువృద్ధు ల్గురువృద్ధబాంధవు లనేకు ల్చూచు చుండ న్మదో
ద్ధురుఁడై ద్రౌపది నట్లు చేసిన ఖలున్ దుశ్శాసనున్ లోకభీ

కరలీలన్ వధియించి తద్విపులవక్షశ్శైలరక్తౌఘని
ర్ఘర ముర్వీపతి చూచుచుండ నని నాస్వాదింతు నుగ్రాకృతిన్.
(సభా. ఆ ౨-౨౩౩)

ఈయనకవిత్వమంతయు మెత్తముమీఁద రసపుష్టి కలదిగానే యున్నను, అరణ్యపర్వమునందలి కొన్ని భాగములుమాత్రము నిస్సారములుగాఁ గనఁబడుచున్నవి. అవసానకాలమునకు ముందు రోగబాధచేతనో చిత్తవైకల్యముచేతనో బుద్ధిబలము తగ్గియున్నప్పు డవి చేయఁబడియుండవచ్చును. కవిత్వనైపుణి యెట్లున్నను కథమాత్రము మూలగ్రంథ మగు వ్యాసవిరచితసంస్కృతభారతమునకు సరియైన భాషాంతరముకాదు. ఈ కవియొక్కఁడు మాత్రమేగాక సంస్కృతపురాణములను తెనిఁగించిన యాంధ్రకవు లందఱునుగూడ తమయిష్టానుసారముగాఁ గొన్నిచోట్ల మూలగ్రంథములోని కథలను సంగ్రహపఱిచియు కొన్నిచోట్ల పెంచియు, కొన్నిచోట్ల కథలను మార్చి వేఱుకథలను చేర్చియు, కొన్నిచోట్ల కథలు తాఱుమాఱు చేసియు, కొన్నిచోట్ల నూతనకథలను గల్పించియు, కొన్నిచోట్ల మును పున్నవానిని బొత్తిగా తీసివేసియు యథేచ్ఛము లయిన వర్ణనలు పెట్టి ప్రధానకథాంశమునుమాత్రము వదలక నానావిధముల మూలగ్రంథములకంటె తమ గ్రంథములు భిన్నములుగా నుండునట్లు చేసిరి. ఈ హేతువుచేతనే సంస్కృతమున లక్ష యిఱువదియైదువేలు గల భారతము తెనుఁగున నేఁబదివేల గ్రంథమునకు దిగినది. ప్రతిపదార్థభావప్రధానము లైన కావ్యనాటకములందు మాత్రమే భాషాంతరము సరిగా మూలానుసారముగా నుండవలెను గాని కేవలకథామాత్రప్రధానములైన పురాణేతిహాసములయం దట్లుగాక వినువారి వీనుల కింపుగా నుండునట్లు కథను యథేచ్ఛముగా వ్రాయుటయే సముచిత మని కొంద ఱనుచున్నారు అట్లే కావచ్చును. నన్నయభట్టాదిపర్వమునందు సంస్కృతమున శకుంతలకథతరువాత నున్న యయాతిచరిత్రమును శకుంతలోపాఖ్యానమునకు ముందుంచుటయు, ధృతరాష్ట్రునకు కణికుఁడు చెప్పినట్లున్న జంబుకాదులకథ మొదలయినవానిని తెనిఁగింపక విడిచివేయుటయు, పయివానికి దృష్టాంతములుగా గ్రహింపవచ్చును.

తిక్కనసోమయాజినిగూర్చి వ్రాయునపుడీ విషయము కొంత వివరింపఁబడును దుష్యంతునికంటె యయాతి యెంతో పూర్వుఁడగుటచేత ముందుగా యయాతిచరిత్రమును జెప్పుటయే సమంజసము కావచ్చును. నన్నయకాలపుభారతప్రతులలోఁ గూడ నొకవేళ పారసుల్లే యుండిన నుండవచ్చును. ఈ కవులు సంస్కృతశ్లోకములను తెలిఁగించెడు రీతిని తెలుపుటకయి రెండు మూడు శ్లోకములను, వానికి సమములయిన పద్యములును మాత్రమిక్కడ నుదాహరింపఁబడుచున్నవి——

సంస్కృతసభాపర్వము

శ్లో॥ కదళీదండసదృశం సర్వలక్షణసంయుతమ్,
గజహస్తప్రతీకాశం వజ్రప్రతిమగౌరవమ్.
అభ్యుత్స్మయిత్వా రాధేయం శకునిం ప్రసమీక్ష చ,
ద్రౌపద్యాః ప్రేక్షమాణాయాః సవ్యమూరు మదర్శయత్.
భీమసేన స్తమాలోక్య నేత్రే ఉత్ఫాల్య లోహితే
ప్రోవాచ రాజమధ్యే తం సభాం విశ్రావయ న్నివ.
పితృభి స్సహ సాలోక్యం మా స్మ గచ్ఛే ద్వృకోదరః,
యద్యేతమూరుం గదయా న భింద్యాం తే మహాహవే.

తెలుఁగు సభాపర్వము

ఉ. అమ్మదిత న్నిభీతహరిణాక్షిఁ గలాపవిభాసికేశభా
రమ్మన నొప్పుదానిఁ దన రమ్యపృథూరుతలంబు నెక్కఁగా
రమ్మని సన్న చేసె ధృతరాష్ట్రసుతాగ్రజుఁ డప్పు డాని దూ
రమ్మునఁ జూచి కౌరవకురంగమృగేంద్రుఁడు భీముఁ డల్కతోన్.

క. భయశోభమునుదధరని।
ర్దయుఁడై ధరణీశు లెల్లఁ దన పలుకులు వి
స్మయసంభ్రమసంభృతులై।
భయమున వినుచుండ నా సభం దగఁ బలికెన్.

ఉ. ధారుణి రాజ్యసంపదమదంబునఁ గోమలిఁ గృష్ణఁ జూచి రం
భోరు నిజోరుదేశమున నుండఁగఁ బిల్చిన యిద్దురాత్ము దు
ర్వార మదీయబాహుపరివర్తితచండగదాభిఘాతభ
గ్నోరుతరోరుఁ జేయుదు సుయోధను నుగ్రరణాంతరంబునన్.

(సభా. ఆశ్వా ౨-౨౪౭-౨౪౯)

సంస్కృతమున మొదటిశ్లోకమునందుఁ గదళీస్తంభసదృశమనియు సర్వలక్షణసంయుత మనియు గజహస్తప్రతీకాశ మనియు వజ్రప్రతిమగౌరవ మనియు దుర్యోధనునితొడ వర్ణింపబడినది. దానితెనుఁగు నందో రమ్యపృథూరుతలం బని మాత్రము చెప్పఁబడినది. చూచుచున్న ద్రౌపదికని సంస్కృతమున నుండఁగా తెనుఁగున ద్రౌపదికి విభీతహరిణాక్షి యనియు కలాపవిభాసికేశభారమున నొప్పుదాని యనియు క్రొత్తవిశేషణములు చేర్పఁబడినవి. రెండవ శ్లోకముయొక్క పూర్వార్ధములోని రాధేయున కుబ్బు పుట్టించి భీమునకుఁ దిరస్కారము కలుగునట్లుగా నన్నమాటలు బొత్తిగా వదలివేయఁబడినవి. మూఁడవ శ్లోకములోని భీమసేనుఁడు కనులెఱ్ఱచేసి దానిని తేఱిపాఱఁ జూచి యన్నవాక్యము 'దానిదూరమ్మునఁజూచి కౌరవకురంగమృగేంద్రుఁడు భీముఁ డల్కతో' నని తెనిఁగింపఁబడి మూలములో లేని ''కౌరవకురంగమృగేంద్రుఁ'' డను విశేషణ మధికముగాఁ జేర్పఁబడినది. అటుతరువాత సభవారు వినునట్లుగా రాజమధ్యమునం దిట్లు పలికెనని యున్న శ్లోకముయొక్క యుత్తరార్ధమునకు ''లయసమయదండధరనిర్దయుఁ డయి, ధరణీశు లెల్లఁ దనపలుకులు విస్మయసంభ్రమసంభృతులై భయమున వినుచుండ నా సభన్ దగఁబలికె'' నని తెనుఁగుచేయఁబడినది. ఈ వాక్యము 'లయసమయదండధరనిర్దయుఁ డయి' యనియు 'విస్మయసంభ్రమసంభృతులయి' యనియు మూలములో లేని మాటలు కవిచేఁ గల్పింపఁబడినవి. నీ యీ తొడను గదచేత మహాయుద్ధమునందు విఱుగఁగొట్టినయెడల వృకోదరుఁడు పితృపితామహాదులతోడి సాలోక్యమునకుఁ దప్పినవాఁ డగునన్నకడపటి శ్లోకమును 'ధారుణి రాజ్యసంపదమదంబున'

నన్నపద్యమునుగాఁ దెనిఁగించుచో "ధారుణి రాజ్యసంపద మదంబునఁ గోమలిఁ గృష్ణఁజూచి రంభోరునిజోరుదేశమున నుఁడగఁ బిల్చిన యిద్దురాత్ము" నన్నంతవఱకు క్రొత్తగాఁ జేర్పఁబడినది. గదతోనని మూలములో నున్నదానికి "దుర్వారమదీయబాహుపరివర్తిత చండగదాభిఘాత"ముచేత నని పెంచి చెప్పఁబడినది. పితృపితామహులలోకమునకుఁ దప్పినవాఁడ నగుదు నన్నమూలములోని వాక్యము విడువఁబడినది. పరిశీలించి చూచిన పక్షమున భాషాంతరమంతయు నిద్దేప్రకారముగా నుండునుగాని సరిగా మూలము ననుసరించి యుండదు. మూలముతో సరిపోల్పక ప్రత్యేకముగాఁ జూచునప్పుడు మాత్ర మాంధ్రభారతము మనోహరముగా నుండుననుటకు సందేహము లేదు. కొన్నిచోట్ల మూలమునకంటెను హృద్యతరముగానుండి రసాతిశయము పుట్టించుననుటయు నిర్వివాదాంశమే !

నన్నయభట్టారకుఁడు తాను రచియింప నారంభించిన శ్రీమహాభారతమును సంపూర్ణముగా నాంధ్రీకరింపలేకపోవుటకుఁ గారణములు పలువురు పలు విధములుగాఁ జెప్పుదురు కొందఱు వేములవాడ భీమకవి శాపముచేతఁ గలిగిన మరణము కారణ మందురు. మఱికొందఱ అధర్వణాచార్యులు తెలిఁగించుచుండిన భారతమును తగులఁబెట్టించుట చేతఁ గలిగిన చిత్తచాంచల్యము కారణ మందురు. ఈ రెండు కారణములలో నేది నిజమైనను, ఈకవి పరోత్కర్షము సహింపఁజాలని దుస్స్వభావము కలవాఁడయిన ట్లూహింపఁదగి యున్నది. ఈయనతోడి సమకాలికుఁడైన వేములవాడ భీమకవి రాఘవపాండవీయమును, కవిజనాశ్రయములోఁ జేర్చి యొకవ్యాకరణమును జేసి రాజసన్మానమును బొందుటకయి రాజమహేంద్రపురమునకుఁ దెచ్చి విష్ణువర్ధనుని యాస్థానపండితుఁడయి యున్న నన్నయభట్టునకుఁ జూపఁగా నతఁ డాతనికవిత్వము మిక్కిలి శ్లాఘాపాత్రముగా నుండుట చూచి యోర్వలేక యా పుస్తకములు లోకములో వ్యాపించినయెడలఁ దన పుస్తకములకుఁ బ్రసిద్ధి రానేరదనియెంచి వానిని తగులఁబెట్టించినట్లును, అటు మీఁదట నతఁడింట లేనప్పుడు భీమకవి వచ్చి యాతనిభార్యను నీభర్త యేమి చేయుచున్నాఁ డని యడిగి యామె తనభర్త రహస్యస్థలమున నుండి

యరణ్యపర్వము రచించుచున్నాఁ డని చెప్పినమీఁదట నతఁ డింకను నరణ్యములోనేయున్నాఁడా ? యట్లే యుండునుగాక' యని శపించి తన పుస్తకముల నడఁగఁద్రొక్కె-నన్న కోపముచేత నన్నయభట్టు రచించిన ఛందస్సును, వ్యాకరణమును అతనిభార్య నడిగి పుచ్చుకొని వానిని చించి గోదావరిలోఁ గలిపివేసి తాను చిరకాలము కష్టపడి చేసిన గ్రంథములు పోయినవన్న దుఃఖముచేత బెంగపెట్టుకొని కాలధర్మము నొందినట్లును, ఆతని శాపము తగిలి నన్నయభట్టు వనములో మృతినొందినట్లును, అట్లు నశించిన వ్యాకరణము సిద్ధులలోఁ గలిసిన సారంగధరుఁడు తాను చిన్న తనములో నేర్చుకొని యుండుటచేత మరల బాలసరస్వతి యను బ్రాహ్మణు నకుఁ జెప్పినట్లును, లోకప్రవాదము కలిగియున్నది. దీని కుపబలముగా నప్పకవీయమునందు

"గీ. ఆంధ్రశబ్దచింతామణి వ్యాకరణము
ముందు రచియించి తత్సూత్రములఁ దెనుంగు
బాసచేఁ జెప్పె నన్నయభట్టు తొల్లి
పర్వములు మూఁడు శ్రీమహాభారతమున. [ఆ. ౧-౪౨]

గీ. భారతముఁ దెనిఁగించుచుఁ దా రచించి
నట్టి రాఘవపాండవీయము నడఁచె
ఛందము నడంప నీఫక్కి సంగ్రహించె
ననుచు భీమన యెంతయు నడఁచె దాని. [ఆ. ౧-౪౪]

గీ. రాజరాజనరేంద్రతనూజుఁ డార్య
సఖుఁడు సారంగధరుఁడు శైశవమునందు
నన్నయ రచించునెడఁ బరనం బొనర్చె
నన్యు లెవ్వ రెఱుంగ రీయాంధ్రపక్కి. [ఆ. ౧-౪౭]

క. ఆ లోకనుతుఁడు మున్నటి
కీలకసమ నామతంగగిరికడ నొసఁగెన్
బాలసరస్వతులకు నతఁ
డోలిఁ దెనుఁగుటీక దాని కొప్పుగఁ జేసెన్, [ఆ ౧-౫౦]

క. ఆదిని భీమకవీంద్రుడు
గోదావరిలోనఁ గలిపెఁ గుత్సితమున నా
మీఁదట రాజనరేంద్ర
క్ష్మాదయితునిపట్టి దాని మహి వెలయించెన్" [ఆ. ౧-౩౧]

అను పద్యములు కనఁబడుచున్నవి. అంతేకాక పింగళిసూరకవి విరచితమైన రాఘవపాండవీయమునందును దత్కృతిపతి యగు వేంకటాద్రిరాజు కవి నుద్దేశించి,

"శా. రెండర్థంబులపద్య మొక్కటియు నిర్మింపంగ శక్యంబు గా
కుండుం దద్గతిఁ గావ్య మెల్ల నగునే నోహో యనం జేయదే!
పాండిత్యం బిఁక నందునుం దెనుఁగుకబ్బం బద్భుతం బంద్రు ద
క్షుం డెవ్వాఁ డిల రామభారతకథ ల్జోడింప భాషాకృతిన్.

ఉ. భీమన తొల్లి చెప్పె నను పెద్దలమాటయెకాని యందు నొం
డేమియు నేయెడ న్నిలుచు టెవ్వరుఁ గాన; రటుండ నిమ్ము నా
నామహితప్రబంధరచనాఘనవిశ్రుతి నీకుఁ గల్గుటన్
నామదిఁ దద్వయార్థకృతినైపుణియుం గల దంచు నెంచెదన్."
[రాఘవ-పీఠిక-10, 11]

అని యన్నట్టు చెప్పఁబడి యున్నది ఈరెండు పుస్తకములలోను వ్రాయఁబడినదానినిబట్టి చూడఁగా భీమకవి రాఘవపాండవీయమును రచించినట్టును అది యే హేతువుచేతనో నశించినట్టును స్పష్ట మగుచున్నది. ఆ పుస్తకము నశించుట కప్పకవి చెప్పినదానినిబట్టి యొకవేళ నన్నయభట్టు కారకుఁడయిన నయి యుండు ననుకొన వచ్చును గాని యీ యిరువురు కవులును సమకాలీనులు కాకపోవుటచేత నీయూహ కవకాశము లేశమును లేదు.

ఈ ప్రకారముగానే యధర్వణాచార్యుని భారతమును గూడ నన్నయభట్ట డఁగఁద్రొక్కినట్టు లోక ప్రతీతి కలదు. అధర్వణాచార్యుఁడు భారతమును దెనిఁగించి దానికి రాజనరేంద్రుని కృతిభర్తనుగాఁ జేసి బహుమానమును [illegible] వచ్చి రాజమహేంద్రవరమునకు వచ్చి నన్నయభటునకు

గ్రంథమును జూపి తనకు రాజసందర్శనము చేయింపుమని వేఁడె ననియు, ఆ గ్రంథము సర్వోత్కృష్టముగా నున్నందున దానిని ప్రకటనపఱిచినయెడల స్వగ్రంథప్రాశస్త్యము చెడు నని యతఁడాలాగుననే యని చెప్పి త్రిప్పుచు నొకనాఁ డథర్వణాచార్యుఁడింట లేని సమయమునం దతఁడు బసచేసియున్న యింటివారికి లంచ మిచ్చి యాపుస్తకమును గాల్పించెననియు, ఇల్లు విడిచి పోవునప్పు డథర్వణాచార్యుఁడెవ్వరికో చూపుటకయి తనతోఁగూడఁ దీసికొని పోయిన విరాటపర్వమొక్కటి మాత్రము నశింపక మిగిలె ననియు, ఈ దుర్నయము నన్నయభట్టువలన జరిగిన దని తెలిసికొని యథర్వణాచార్యుఁ డాతనిని శపించుచు దుఃఖముతో లేచిపోయె ననియు, సాధుపురుషునకు నిష్కారణముగ ద్రోహము చేసిన చింతచేత నన్నయభట్టు మతిచెడి వెఱ్ఱివాఁడయి గ్రంథరచనకు సమర్థుఁడు కాకపోయె ననియు, చెప్పుదురు. కాని యీ కథ యెంతమాత్రము విశ్వాసార్హ మయినది కాదు. అథర్వణాచార్యుఁడును నన్నయభట్టును సమకాలీను లని నిర్ణయించుటకుఁ దగిన నిదర్శనము లేవియుఁ గానరావు. అథర్వణాచార్యకృతమయిన వికృతివివేక మను వ్యాకరణకారికావళిని నన్నయభట్టువిరచిత మనెడి యాంధ్రశబ్దచింతామణిని విమర్శించి చూడఁగా నథర్వణాచార్యుఁడు నన్నయభట్టునకుఁ దరువాతివాఁ డని యూహింపఁ దగియున్నది. అయినను, ఈ యూహను వేఱువిధముగాఁగూడ చేయవచ్చును. నన్నయభట్టారకుఁడు భారతము నారణ్యపర్వమువఱకును దెనిఁగించి కాలధర్మము నొందిన తరువాత తిక్కనసోమయాజి పూరింపఁ బూనుకొనకమునుపో, పూనుకొన్న సంగతి యెఱుఁగకమునుపో మిగిలిన భాగమును తా నాంధ్రీకరింపఁ బూని విరాటపర్వమునుమాత్రమే చేసి యథర్వణాచార్యుఁడు తక్కినభాగమును ముగింపకయే లోకాంతరగతుఁ డయి యుండవచ్చును.

నన్నయభట్టు రచియించిన వన్న యితరగ్రంథములు లక్షణసార మను తెలుఁగుఛంద స్సొకటియు, ఆంధ్రశబ్దచింతామణి యనఁబడు తెలుఁగు వ్యాకరణ మొకటియు, ఇంద్రవిజయ మను గ్రంథ మొకదానినిఁగూడ నన్నయ రచియించిన ట్లానందరంగరాట్ఛందములో నుదాహరింపఁబడిన యొక

పద్యమువలనఁ దెలియవచ్చుచున్నది. భీమన నశింపఁజేయుటచేతఁ గాక పోయినను మఱియే హేతువుచేతనో నన్నయభట్టకృత మైన ఛందస్సిప్పు డెక్కడను కానబడదు నన్నయభట్ట విరచితమైన లక్షణసార మిప్పుడున్న దవియు, దానిలో నితరలాక్షణికు లుదాహరించిన పద్యము లన్నియు నున్న వనియు తిక్కనకృతమైన కవివాగ్బంధనమునందువలెనే దీనియందును విశేషవిషయము లేవియు లేవనియు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రులవారు వ్రాయుచున్నారు లక్షణసారమును, ఇంద్ర విజయమును, నన్నయభట్ట విరచితములుగాక యన్నయభట్టవిరచితము లని మఱియొక మిత్రులు నాపేర వ్రాయుచున్నారు వేఱొకరు నన్నయభట్టు రాఘవాభ్యుదయములోని దని యొక పద్యము నుదాహరించి యున్నారు ఆంధ్రశబ్దచింతామణికి ప్రక్రియా కౌముది యని మఱియొక పేరు కలదు దీనిని రచించుట చేతనే నన్నయ భట్టునకు వాగనుశాసనుఁ డను బిరుదుపేరు కలిగిన దందురు, గాని, యీ యంశము విశ్వసనీయము కాదు ఈ తెలుఁగు వ్యాకరణము సంస్కృతభాషలో నెనుబదిరెండార్యావృత్తములలో రచియింపఁ బడినది. దీనిని నన్నయభట్టీయ మని సాధారణముగా జనులు వాడుదురు. ఈ యాంధ్ర వ్యాకరణమున కెలకూచి బాలసరస్వతి యను పండితుఁడు మొట్టమొదట తెలుఁగున టీక యొకటి వ్రాసెను దానికి బాలసరస్వతీయ మని పేరు అటుతరువాత వాసుదేవుఁ డను మఱియొక పండితుఁ డీ వ్యాకరణమునకు వార్త్తిక మొక్కటి వ్రాసెను. దానిని వాసుదేవవృత్తి యని వ్యవహరింతురు. తదనంతరము కాకునూర్యప్పకవి యీ వ్యాకరణమును దెనిఁగింపఁ బూని సంజ్ఞా సంధిపరిచ్ఛేదములను మాత్రము తెనుఁగున నయిదాశ్వాసములుగల పద్యకావ్యమునుగా రచించెను. ఈతనియనంతర మహోబలపండితుఁ డాంధ్రశబ్దచింతామణికి సంస్కృతభాషలో నొక వ్యాఖ్యానము చేసి దానికిఁ గవిశిరోభూషణ మని పేరుపెట్టెను. దానినిప్పు డహోబల పండితీయ మని పిలుతురు. పిమ్మట నృసింహపండితుఁ డను మఱియొకఁడుకూడ నన్నయభట్టీయమున కొక వ్యాఖ్యానము చేసెను. దానికి నృసింహ పండితీయ మని నామము.

ఆంధ్రశబ్దచింతామణి నన్నయభట్టారకవిరచితము కా దనుటకుఁ గల హేతువులనుగూర్చి యిప్పుడుఁ గొంత విమర్శింతము. అప్పకవీయము పంచమాశ్వాసమునందు శబ్దానుశాసన మూలసూత్ర మని "ను మ్మ్వాతో హల్యథర్వణాచార్యమతాత్" అని యొక సూత్ర ముదాహరింపఁబడి యున్నది. ఇది నిజముగా నన్నయభట్టీయసూత్రమే యయినయెడల, అథర్వణాచార్యుఁడు నన్నయభట్టునకుఁ బూర్వకాలికుఁ డనియే చెప్పవలెను. అదియే నిజమయినపక్షమున, "అప్రయుక్తత్వదోష స్తున విరుద్ధో హరే ర్మతే" యని యథర్వణకారికలలోఁ జెప్పఁబడి యుండుటచేత హరికారికలును నన్నయభట్టీయమునకుఁ బూర్వపువే యయి యుండవలెను ఇప్పుడు శిష్టు కృష్ణమూర్తిగారిచేత వ్యాఖ్యానము చేయఁబడి చిన్నయసూరిగారి బాలవ్యాకరణములోని సర్వాంశములను గలిగి యున్న హరికారికలే * నిజమయిన హరికారికలయి యీ హరికారికలును అథర్వణకారికలును గూడ నన్నయభట్టీయ వ్యాకరణమునకుఁ బూర్వపు వయినపక్షమున నన్నయభట్టీయమున కంత ప్రసిద్ధివచ్చుటకుఁ గాని విశేషాంశములతో నిండియున్న యటువంటి యుత్తమ కారికావళు లుండగా నల్పాంశములను మాత్రమే కలిగి వాని ముందర నిష్ప్రయోజకమని చెప్పఁదగిన యాంధ్రశబ్దచింతామణి నన్నయభట్టు రచించుటకుఁ గాని హేతు వుండదు. శబ్దానుశాసన మూలసూత్రమని యప్పకవీయములోఁ బేర్కొనఁబడిన, పయి సూత్రమును, మరి కొన్ని సూత్రములును ప్రత్యేకముగా నున్న యిప్పటి యాంధ్రశబ్దచింతామణియందుఁ గానఁబడకపోవుటచేత నప్పకవి యుదాహరించిన యాసూత్రములు ప్రక్షిప్తములని కొందఱు చెప్పుచున్నారు. ఈ సూత్రముమాత్రమే కాక గ్రంథమంతయు ప్రక్షిప్తమగుట మరింత యుక్తముగా నుండును. ఈ ప్రకారము గానే శిష్టు కృష్ణమూర్తిగారును బాలవ్యాకరణము రచియింపఁబడిన తరువాతనే హరికారికలని పేరుపెట్టి తాన్గ్రంథమును రచించి ♦ వ్యాఖ్యానము

[ (* హరికారికావళి శిష్టు కృష్ణమూర్తిశాస్త్రి రచన, అది యాంధ్రశబ్దచింతామణికి వివరణమని, జ్యోత్స్న్య నామాంతరమని తెలియవగును )

( ♦ శిష్టు కృష్ణమూర్తిశాస్త్రిగారు కారికలను రచించిరేగానీ, వానికి వ్యాఖ్యానము చేయలేదు.)]

చేసెననియు, అట్లు కానియెడల కేతన, తాతంభట్టు, ముద్దరాజు రామన్న, అప్పకవి, కూచిమంచి తిమ్మకవి, మొదలయిన లక్షణగ్రంథకర్త లొక్క-రయిన నీ హరికారికలమాటయయినఁ దలపెట్టకపోరనియు, ఇప్పటివారు కొందఱనుచున్నారు ఇది యట్లుండఁగా మఱికొంద ఱాంధ్రశబ్దచింతామణి నన్నయభట్ట విరచితము కాదనియు, అతఁడు చేసినదైన పక్షమున కేతనాది కవుల కది తెలియక పోవుటయు, కేతన తన యాంధ్రభాషాభూషణమునందు

క. మున్ను తెలుఁగునకు లక్షణ
మెన్నఁడు నెవ్వరును జెప్ప, రేఁ జెప్పెద వి
ద్వన్నికరము మది మెచ్చఁగ
నన్నయభట్టాదికవిజనంబులకరుణన్

గీ సంస్కృతప్రాకృతాదిలక్షణము చెప్పి
తెలుఁగునకు లక్షణము మున్ను దెలుప కునికి
కవిజనంబులనేరమి గాదు నన్ను
ధన్యుఁ గావింపఁ దలఁచినతలఁపు గాని.

అని చెప్పుట తటస్థింప దనియు, అప్పకవి చెప్పినట్లుగా భీమన యాంధ్ర శబ్దచింతామణిని గోదావరిలోఁ గలిపినయెడల నాలుగయిదువందలసంవత్సర ములవఱకు నడఁగి యుండి యిప్పటికి మూఁడు నాలుగు వందల సంవత్సర ముల క్రిందట బయలఁబడుట సంభవింప నేరదనియు, బాలసరస్వతులో మరియెవ్వరో దీనిని రచించి తమ గ్రంథప్రసిద్ధికై కర్తృత్వమును నన్నయభట్టునం దారోపించి సారంగధరుఁడు తమకిచ్చె నన్న కథ కల్పించి రనియు, అభిప్రాయపడుచున్నారు ఇది సత్యమనియే తోఁచుచున్నది. కాని యెడల, "నుమ్యోతో" ఇత్యాదిసూత్ర మాంధ్రశబ్దచింతామణియందుఁ జొచ్చుటకు హేతువు లేదు. * ఈ యసందర్భము నాలోచించియే యిటీవలి వారీ సూత్రమును పుస్తకమునుండి తొలఁగించి యుండ వచ్చును.

( * అథర్వణుని కారికావళి చింతామణికి శేషగ్రంథమని పలువురి యభి ప్రాయము.)

మొట్టమొదట రాజరాజనరేంద్రునకు సారంగధరుఁ డన్న కొడుకుండె నన్న మాటయే సంశయింప వలసి యున్నది. రాజనరేంద్రుని శాసనములలోఁ గాని యాతని సంతతివారి శాసనములలోఁ గాని రాజనరేంద్రునకు రత్నాంగి యను భార్య కాని సారంగధరుఁ డను పుత్రుఁడుగాని యుండి నట్లెచ్చటను జెప్పఁబడి యుండలేదు అందుచేత సారంగధరనామము గల రాజరాజపుత్రుఁడే లేఁడనియు, ఇటీవలి కవులు చమత్కారార్థముగా సారంగధర చరిత్రమును సారంగధరునిఁ గూడా గల్పించిరనియు, చెప్పవలసి యున్నది. మొదట సారంగధరుఁడే లేనప్పుడు వ్యాకరణము నతఁడు పఠించుటయు, బాలసరస్వతి కిచ్చుటయు కల్లలే యగును వేములవాడ భీమకవి నన్నయభట్టు కాలమునకుఁ దరువాత బహుసంవత్సరములకుఁగాని యుండిన వాడు కాకపోవుటచేత నా తఁ డా వ్యాకరణమును గోదావరిలోఁ గలిపె ననుటయు పెద్దకల్లయే.

నన్నయభట్టు క్రీ. శ. ౧౦౨౩ వ సంవత్సర ప్రాంతముల యందున్న వాఁడు. ఆ కాలమునం దాంధ్రశబ్దచింతామణి రచియింపఁబడ్డ ట్లెవ్వరు నెఱిఁగినట్లు నిదర్శనము కానరాదు. తరువాత రెండువందల సంవత్సరములకుఁ బిమ్మటఁ దిక్కనసోమయాజి కాలములో నున్న యభినవదండి యావఱ కెవ్వరును దెనుఁగునకు శబ్దలక్షణమును (వ్యాకరణమును) జెప్పలేదు గనుక నాంధ్రభాషాభూషణంబును రచియించెద ననుటచేతఁ దిక్కనాదుల కాలమునందును నన్నయభట్టీయ వ్యాకరణము లేదు. శ్రీనాథులకాలము వఱకును ఆంధ్రభాషాభూషణమే లక్షణగ్రంథముగా వాడబడుచుండఁగా కేతనకు రెండు వందల సంవత్సరముల తరువాత వెల్లంకి తాతంభట్టు 'కవిచింతామణి'

---

(* సారంగధరుని చరిత్రము బోలిన కథలు భారతదేశమునందలి వివిధ ప్రాంతములకు సంబంధించినవి కలవు. గౌరన "నవనాథ చరిత్రము" నందును, చేమకూర వేంకటకవి "సారంగధర చరిత్ర" యందును ఇయ్యది మాళవదేశమునకు సంబంధించినట్లు చెప్పబడినది. సారంగధరుని తండ్రి రాజమహేంద్రుఁ డగుటచే - వేంగి ప్రభువగు రాజరాజున కీకథ యంటఁగట్టబడి యుండవచ్చును. సారంగధరుఁడు రాజరాజ పుత్రుడు కాఁడని చరిత్రకారులు నిర్ణయించి యున్నారు.)

యను లక్షణగ్రంథమును వ్రాసెను అప్పటికి నన్నయభట్టీయముయొక్క యునికి యెవ్వరికిని దెలియదు. తరువాత నూఱు సంవత్సరములకు రాఘవ పాండవీయమునకు వ్యాఖ్యానము చేసిన ముద్దరాజు రామన్న కాలమునందుఁ గూడ కవిచింతామణియు, నాంధ్రభాషాభూషణంబును దప్ప తెలుఁగునకు వేఱు లక్షణగ్రంథములు లేవు. ముద్దరాజు రామన 'కవిలోక సంజీవని' యను లక్షణమును రచియించెను. తరువాత నేఁబది సంవత్సరముల కుదప్ప వించిన బాలసరస్వతుల కాలమునం దనఁగా నన్నయభట్టారకుని మరణా నంతరమున దాదాపుగా నాఱు వందల సంవత్సరముల కాంధ్రశబ్దచింతామణి బయలఁబడినది అది బాలసరస్వతులకు లభించిన దన్న విధము కూడ మిక్కిలి యాశ్చర్యకరముగా నున్నది * అప్పకవీయములోని యీ క్రింది పద్యములనుబట్టి నన్నయ భట్టీగ్రంథమును రచించుట యొక్క సారంగ ధరుఁడు తప్ప మఱియెవ్వరు నెఱుంగరఁట! అతఁడు దండ్రిచేతఁ గాళ్ళు చేతులు నఱికి వేయఁబడి సిద్ధులలోఁ గలిసిన యైదువందల యేఁబది సంవ త్సరములకుఁ దరువాత నెల్లూరిమండలములోని మతంగగిరియొద్దకు వచ్చి పుస్తకము రచింపబడు నప్పుడు తాను జిన్ననాఁడు పఠించి జ్ఞప్తినిబట్టి దానిని బాలసరస్వతుల కేకరువు పెట్టెనఁట! నిపుణముగాఁ బరిశీలించినచో నింతకంటె విరుద్ధమైన కథ మఱియొకటి యుండదు. అప్పకవీయములోని పద్యములను జూడుఁడు——

'గీ రాజరాజనరేంద్రుఁ తనూజుఁ డార్య
సఖుఁడు సారంగధరుఁడు శైశవమునందు
నన్నయ రచించునెడఁ బఠనం బొనర్చె
నన్య లెవ్వ రెఱుంగ రీ యాంధ్రఫక్కి. [అ. ౧-౪౮]

క ఆ లోకసుతుఁడు మున్నటి
కీలకసమ నామతంగగిరికడ నొసఁగెన్
బాలసరస్వతులకు నతఁ
డోలిఁ దెలుఁగుటీక దాని కొప్పుగఁ జేసెన్.' [అ ౧-౫౦]

(* చింతామణిలో అప్పకవి పాఠములు వేఱు, బాలసరస్వతి పాఠములు విభిన్న ముద్రణములలో విభిన్నరీతుల నున్నవి.)

దీనినిబట్టి చూడఁగా నాంధ్రభాషాభూషణాదులను, అథర్వణ కారికావళిని సహాయపఱుచుకొని బాలసరస్వతియే యాంధ్రశబ్ద చింతామణిని జేసి దానికి గౌరవము కలుగుటకయి నన్నయభట్టారకుని పేరుపెట్టినట్లు నిశ్చయింప వలసియున్నది. అప్పకవి యాంధ్రశబ్దచింతామణి వ్యాఖ్యానము నారంభించి నది శాలివాహన శకవర్షములు ౧౭౭౭ మన్మథ సంవత్సర మనఁగా హూణశకము ౧౬౨౬ వ సంవత్సరము బాలసరస్వతికిఁ బుస్తకము దొర కిన దన్న కీలకసంవత్సరము హూణశకము ౧౬౦౫ వ సంవత్సర మగును. ఆంధ్రశబ్ద చింతామణి నన్నయభట్ట ప్రణీతము కాదనుట కా పుస్తకములోనే నిదర్శనము లున్నవి. అప్పకవికాలమునం దా పుస్తకములో "నుమ్మోచ్ఛతో హల్య ధర్వణాచార్యమతాత్" అను సూత్రముండుట చేతను, దాని నప్పకవి

గీ. సమసనమున నామాంతశృంగముల కెల్ల
హల్లు గదియ స్వార్థంబునఁ బొల్లుద్రుతము
వికృతి నాగమమై ద్రుత ప్రకృతిపగిది
గాంచు సంధి నథర్వణకవిమతమున.

అని తెనిఁగించుటచేతను నన్నయభట్టారకుని తరువాతి కాలపు వాఁడైన యథర్వణాచార్యుని పే రాంధ్రశబ్ద చింతామణియం దుండుట యొక్క టియే యది నన్నయభట్ట విరచితము కాదని స్థాపించుచున్నది. ఈ బాధక మును తొలగించుటకై తరువాతివారు పయి సూత్రములోని "యథర్వణా చార్యమతా" త్తను భాగమును దీసివేసినారు. భారతమును జదివిన బాలురకు సహితము తెలుఁగున పదాదియందు యకారము లేదని నన్నయభట్టమత మగుట కరతలామలక మగును అట్లయ్యు నాంధ్రశబ్ద చింతామణి యందు "అవ్యయః క్రియాసు భూతార్థ ద్యోతిన మాద్యగం వినా సర్వః" అను సూత్రములోఁ బదాది యకారమున్నట్లు చెప్పఁబడినది.

"సర్వత్రాఽస్య త్వాకార్యం జ్ఞేయం యస్య ద్రుతప్రకృతి కేభ్యః"

అని యీ ఆంధ్రశబ్ద చింతామణి సూత్రము ద్రుతప్రకృతికముల కంటె బర మగుచున్న యకారమున కంతట నచ్చువచ్చుటే కార్యమగునని చెప్పుచున్నది.

ఇది భారత ప్రయోగముల కెల్ల విరుద్ధమయిన దని యెల్లవారికిని దెలియును. కాఁబట్టి యీరెండు సూత్రములును నన్నయభట్టు వయి యుండవు.

"నిత్య మను త్తమ పురుషక్రియా స్వితః"

అనెడి యీ యాంధ్రశబ్ద చింతామణి సూత్రము ప్రథమ మధ్యమ పురుష క్రియాపదములయం దికారమున కచ్చు పర మగునప్పుడు సంధి నిత్యమని చెప్పుచున్నది. ప్రథమ పురుష క్రియాపదముల యికారమునకు సంధి వైకల్పిక మయినట్లు భారతమునందలి నన్నయభట్టారకుని ప్రయోగములే చెప్పుచున్నవి ఆ ప్రయోగములకు విరుద్ధముగా నున్నయిది నన్నయభట్టు సూత్రము కానేరదు. అరణ్యపర్వములోని యీ క్రింది పద్యభాగమును జూడుఁడు.

> "అంతఁ గొంద ఱధికహాస్యంబుచేసిరి
> యడవి సేమి రోసె దనిరి కొంద
> ఱవఁ నీవు వేల్పు వౌ దని కొందఱు
> మోడ్పుఁగేలితోడ మ్రొక్కిరంత" [ఆ. ౨-౧౦౨]

సమస్తభాషల యందును గ్రియలలో ననుబంధ మక్కఱలేకయే వర్తమానార్థకమును దెలిపెడి రూప ముండును. "పలికెడు" అనునది వర్తమానార్థక రూపకముగాను, "పలుకును" అనునది భవిష్యదర్థక రూపముగాను, ఉన్నట్టు భారతాది గ్రంథములలోని ప్రయోగములు తెలుపుచున్నవి.

క. అఱపొఱడు కుఱుచచేతులు
నొఱవ శరీరంబు గలిగి యొరులకుఁ జూడం
గొఱ గాకుండియు మన్మథు
నొఱవులఁ బడిమెడు నితండు యువతి ప్రియుఁడై.

[అరణ్యపర్వము, ఆ. ౨-౧౩౪]

క. నాయొద్ద నుండు దేనియుఁ
జేయు రథాశ్వముల గతులు చిత్రంబులుగా

సీయెడ నావుడు నట్టుల
చేయుదు నని నలుఁడు వాని సేవించెఁ దగన్.

[ ఆరణ్యపర్వము, ఆ. ౨-౧౩౦ ]

అని నన్నయభట్టారకుఁ డారణ్యపర్వమునందు వర్తమానార్థమున "పడియెడు" ననియు భవిష్యదర్థకమున "చేయుదు" ననియు, వాడియున్నాఁడు ఈ ప్రకారముగానే సభాపర్వమునందును

చ. ఇది యుచితంబు గాదనక యిక్కురుముఖ్యులు చూచుచుండ దు
ర్మదుఁడయి వీఁడు నన్ను నపమానము "చేసెడి" సర్వధర్మస
విదు లన నున్నయీ భరతవీరుల యీమనేఁ డధర్మసం
పద నతినింద్య మయ్యెనని భామిని కృష్ణ దలంచె భీతయై.

[ఆ. ౨-౨౧౮]

అని వర్తమానార్థమునఁ "చేసెడి" ననియు,

మ. కురువృద్ధు ల్గురువృద్ధబాంధవు లనేకుల్ చూచుచుండ న్మదో
ద్ధురుఁడై ద్రౌపది నట్లుచేసిన ఖలున్ దుశ్శాసనున్ లోకభీ
కరలీల న్వధియించి తద్విపులవక్షశ్శైలరక్తౌఘని
ర్ఝరముర్వీపతి చూచుచుండ నని యాస్వాదింతు నుగ్రాకృతిన్

[ఆ ౨-౨౩౩]

అని భవిష్యదర్థమున "నాస్వాదింతు" ననియు, ప్రయోగించెను ఈ రీతినే యాదిపర్వమునందును

చ. అమిత జగద్భయంకర విషాగ్నియు నప్రతిహతవిక్రమానవీ
ర్యముఁ గలయట్టి సర్పముల కాననమేజయుచేయు సర్పయా
గమున నుదగ్రపావక శిఖాశతులం దొరఁగంగఁ గారణం
బమల చరిత్ర యేమి చెపుమంచు వినంగను వేడ్క యయ్యెడున్.

అని వర్తమానార్థకమున "నయ్యెడు" ననియు

క. తనసతి కపకారము చే
సిన పాముల కలిగి బాధ చేయుదు నని చి

క్కని దండము గొని పాములఁ
గనినప్పుడ యడువఁ దొడఁగె గహనములోనన్. [ఆ. ౧-౫౨]

అని భవిష్యదర్థమున "చేయుదు" ననియు, నన్నయభట్టు ప్రయోగించెను. శబ్దశాసను కవిత్వములో నుండి వర్తమానార్థకమున కున్నాను బంధముగానిఁ భవిష్యదర్థమునకు కలానుబంధముగాని, వచ్చిన రూపము నొక్కదానినైనను జూపగలరా ? ఇది యొక్కటియే యాంధ్రశబ్ద చింతామణి నన్నయభట్ట విరచితము కాదని స్థాపింపుటకుఁ జాలినంత ప్రబల ప్రమాణము కాదా ?

"ఉ. ఆదిని శబ్దశాసనమహాకవి చెప్పిన భారతంబులో
నేది వచింపఁగాఁబడియె నెందును దానినెకాని సూత్రసం
పాదనలేమిచేఁ దెలుగుఁపల్కు మఱొక్కటి గూర్చి చెప్పఁగా
రాదని దాక్షవాటికవిరాక్షసుఁడే నియమంబు చేసినన్."

క. ఆ మూఁడు పర్వములలో
సామాన్యుఁడు నుడువు తెలుఁగు లరసికొని కృతుల్
దాము రచించిరి తిక్కను
భీమణి మొదలైన తొంటి తెలుగు కవీంద్రుల్.
[అప్పకవీయము, పీఠిక ౪౽, ౪౭]

అనునట్లు తెలుఁగు వ్యాకరణము లేకపోవుటచేత నన్నయభట్టారకుఁడు చేసిన ప్రయోగానుసారముగానే కాని వేఱు విధముగా పదప్రయోగము చేయఁగూడ దని కవిరాక్షసుఁడు చేసిన నియమమునుబట్టి తన్మతానుసారముగానే తిక్కనాదులు తెలుఁగుకావ్యములు రచించి రనుటయు,

"శ్లో. అధర్వణాని కాణ్వాని బార్హస్పత్యాని సంవిదన్
కౌముదీ మాంధ్రశబ్దానాం సూత్రాణి చ కరోమ్యహమ్"

అని యాంధ్రకౌముది కర్తయు,

"శ్లో. బార్హస్పత్యాని సర్వాణి కాణ్వం వ్యాకరణం విదన్
కరో మ్యాథర్వణం శబ్దం సర్వలక్షణలక్షితం."

అని త్రిలింగ శబ్దానుశాసనకర్తయు, లక్షణ గ్రంథకర్తలైన యితరాంధ్రి లాక్షణికులును పూర్వాంధ్ర వ్యాకరణ కర్తలపేరు లుదహరించి బాలసరస్వతి

కాలమువఱకు నెవ్వరును నన్నయభట్టు పేరెత్తక పోవుటయు, ఇప్పటి యాంధ్రశబ్ద చింతామణి నన్నయకృతము కాదని సహస్రముఖముల ఘోషించుచున్నది. పై శ్లోకములలో నుదాహరింపఁ బడిన బృహస్పతి శారదాదర్పణ గ్రంథకర్తయని చెప్పుచున్నారు

తిక్కనసోమయాజి కాలమునం దివియే వర్తమాన భవిష్యదర్థక రూపములుగాఁ బరిగణింపఁబడుచున్నట్లు కేతన కృతియైన యాంధ్రభాషా భూషణ మీ క్రింది పద్యములతో ఘోషించుచున్నది

క. డును, దరు, లౌరుఁ కు, నెదిరికిఁ
దనరంగాదు, దవు, దరులు, తనకుఁ దను, దముల్,
చను నేకబహువచనముల
మనుసన్నిభ ! క్రియల వర్తమానార్థములన్. [ప. ౧౪౨]

క. అడిగెడు నడిగెద రనఁగా
నడిగె దడిగెదవు ధనంబు నడిగెద రనఁగా
నడిగెద నడిగెద మనఁ బో
ల్పడరంగా వరుసతో నుదాహరణంబుల్. [ప. ౧౪౩]

క. ఉను, దురు, లౌరులకుఁ జెప్పను;
ననరఁగ దువు, దురు, లెదిరికిఁ, దనకు దును, దుము్ల్,
తనరఁగ నివి యేకబహువ
చనము లగు భవిష్యదర్థకసంసూచకముల్. [ప. ౧౪౪]

క. పలుకును బలుకుదు రనఁగాఁ
బలుకుదువు పలుకుదువు రనఁగఁ బలుకుదు నర్థిన్
బలుకుదు మనఁగా నివ్వియు
నలఘుమతీ ! వరుసతో నుదాహరణంబుల్. [ప. ౧౪౫]

ఈ ప్రకారముగానే విన్నకోట పెద్దన తన కావ్యాలంకార చూడామణి యందు

"వ ప్రథమ పురుషంబునకు వర్థమానార్థమునందు నేకవచన బహువచనంబులకు నెడినెదరులును మధ్యమపురుషంబులకు నెదవెదరులును నుత్తమ

పురుషంబునకు నెవనెద లనును మధ్యమంబున నా దేశంబులయ్యెఁ దన్ని
రూపణం బెట్లనిన

క. అరిగెడి నరిగెద రనఁగా
నరిగెద వరిగెద రనంగ నతిపురికై
యరిగెద నరిగెద మనఁగాఁ
బరువడి నిది వర్తమానభవితార్థ మగున్

వ. ప్రథమ పురుష మధ్య భవిష్యదర్థంబునందు నేకవచన బహువచనంబులకు నుదురు నను మధ్యమపురుషంబునకు దుదువుదురులును నుత్తమ పురుషంబునకు దునుదుములును ననిని నాదేశంబులయ్యెఁ దన్నిరూపణంబు లెట్లనిన

క. చేయును జేయుదు రనఁగాఁ
జేయుదు చేయుదువు మీరు చేయుదు రనఁగాఁ
జేయుదు జేయుదు మనఁగా
నాయనముగ నిది భవిష్యదర్థం బయ్యెన్.
[నవమోల్లాసము - పరిషత్ప్రతి పుటలు 64, 65]

అని చెప్పియున్నాఁడు. ఇది యిట్లుండఁగా నాంధ్రశబ్ద చింతామణియందు
"వసతి రనుబంధక స్స్యాద్యత్ర లడర్థో వివక్షిత స్తత్ర"
అని క్రియాపదంబునకు వర్తమానార్థము వివక్షిత మగునప్పుడు 'వస' ధాత్వర్థమైన "యున్న" యనుబంధక మగు ననియు
"అస్తి రనుబంధక స్స్యాద్యత్ర లృడర్థో వివక్షితోధాతోః"
అని క్రియాపదంబునకు భవిష్యదర్థము వివక్షిత మగునప్పుడు 'అస'ధాత్వర్థమైన "ఁల"యనుబంధక మగుననియు చెప్పఁబడియున్నవి. అనుబంధము లేక వర్తమాన భవిష్యదర్థక రూపము లున్నట్లు చెప్పనట్టియు భవిష్యదర్థ

మునం దెప్పుడో గాని రాని కలఙ్యను ప్రబంధమును నిత్యముగా విధించు నట్టియు నివి నన్నయసూత్రము లయి యుండవు

"కవిభల్లటైః క్రియాణాం నామ్నాం చోల్లోప ఇష్యతే హ్యాషు,
ప్రథమైక వచనమాత్రేవిక్కృతౌ నాన్తాదయోపి కథ్యన్తే"

అనెడి యాంధ్రశబ్ద చింతామణి సూత్రము (చూడర్జనులు, విల్వాని, ఇత్యాది స్థలములలో) క్రియాపదములయొక్కయు నామపదముల యొక్కయు ఉకారము లోపించునని కవిభల్లటులచేత విధింపఁబడినట్లు చెప్పుచున్నది. నన్నయ్యభట్టునకుఁ బూర్వమునందే యిట్టి సూక్ష్మాంశములను సహితము దెలుపు తెలుగుఁ వ్యాకరణము లుండిన యెడల నాంధ్రశబ్ద చింతామణితోఁ బ్రయోజనమే యుండదు కవిభల్లటుఁడు నన్నయ్యభట్టునకుఁ దరువాతివాఁడయినట్టు తెలియ వచ్చుచున్నది ఈ కవి విక్రమార్కచరితమును రచించి యున్నాఁడు ఇట్లాంధ్రశబ్ద చింతామణికో నిటీవలివారిపేరు లుండుట యది నన్నయభట్టవిరచితము కాదని నిర్వివాదముగా స్థాపించు చున్నది.

( * ఆంధ్రశబ్ద చింతామణి నన్నయభట్ట విరచితమే యని శ్రీవజ్ఝల - చిన సీతారామస్వామిశాస్త్రిగా రభిప్రాయపడుచున్నారు శ్రీశాస్త్రిగారు తమ 'చింతామణి విషయ పరిశోధనము'లో శ్రీవీరేశలింగము పంతులుగారు చూపన యాక్షేపణలకు సమాధానములను వ్రాయుచు నిట్లనుచున్నారు- 'సర్వత్రాజ్వత్కార్యం జ్ఞేయం యస్య ద్రుతప్రకృతి కేభ్యః అను సూత్రము ద్రుతప్రకృతికము కంటె బరమందున్న యకారమున కంతటను నచ్చువలెఁ గార్యమగునని చెప్పుచున్న దనియు, నిది భారత ప్రయోగ విరుద్ధమగుటచే చింతామణి నన్నయ రచితము కానేరదనియు నొక యుక్తిని ప్రంతులుగారు) చెప్పిరి ఎప్పుడు మొదలగు శబ్దములలోఁ బదాది నచ్చే యున్నదని కొందఱ యాశయము అచట యకారము పదముకంటెఁ బరమగునపుడు సంధి వేళలో లోపించుననియుఁ జింతామణికారుని యభిప్రాయము. ఉచ్చారణములోనున్న యకారము లేదనుట సరికాదనితలఁచి చింతామణికారుఁ డద్దానిని సంగికరించుచుఁ బ్రయోగ విషయమున బాధలేకుండఁ బైరీతిని సరిపెట్టెను. [చూ. విషయము ౪౭]

'చింతామణి ప్రథమ పురుషైకార సంధియు నిత్యమే యని చెప్పుచున్నదనియు నయ్యాది నన్నయ భారతప్రయోగములకు విరుద్ధమనియు నుక్కొక యుక్తిని జెప్పుచు వీరేశలింగము పంతులుగా రుదాహరించిరి .. తెలుగునఁ బాబాంతమగు నవుడు

ఇవి యన్నియు నాంధ్రశబ్దచింతామణి నన్నయకృతము కాదని యూహించు టకుఁ దోడుపడుచున్నవి. బాలసరస్వతికిఁ బూర్వము నందుండిన కవులు కొందఱు నన్నయభట్టారకుని "శబ్దశాసన" పదముతోను తదర్థబోధకము లయిన "వాగనుశాస' నాది పదములతోను వ్యవహరించుచు వచ్చినందున నాంధ్రశబ్ద చింతామణియొక్క యునికి వారికిఁ దెలియునని కొందఱు భ్రమ పడుచున్నారు. వ్యాకరణము జేయుటచే నీ బిరుదాతనికి వచ్చినట్లు దేని వలనను గనఁబడదు. భాషననుశాసించి సలక్షణ మయిన యాంధ్రకవిత్వము నకు దారి చూపుటచేతనే యీ బిరుదము నతఁడు వహించి యుండవచ్చును. జక్కనకవి తన విక్రమార్కచరిత్రమునందు నన్నయభట్టు నీ క్రింది పద్య ముతో స్తుతించి యున్నాఁడు.—

---

వాక్యాంత మయ్యేనేని సంధి వైకల్పికమని నన్నయాభిప్రాయము [చూ. విషయము ౨౮]

'నన్నయ భారతభాగములోని ప్రయోగములకు సరిగా నాంధ్రభాషా భూష ణము, కావ్యాలంకార చూడామణి మున్నగు ప్రాచీన లక్షణ గ్రంథములలో 'ఎడ్యెడు' ప్రత్యయాంత రూపములును, ఎదగాగమ యుక్తరూపములును వర్తమానా ర్థకములనియు, దుగాగమ యుక్తరూపములు భవిష్యదర్థము లనియుఁ జెప్పఁబడి యున్నట్లును, నాంధ్రశబ్ద చింతామణిలో నట్లు ప్రాచీన పద్ధతిని చెప్పఁబడక 'ఉన్నాను బంధ' యుక్తరూపములు వర్తమానార్థకములనియు, 'కలానుబంధ' యుక్తరూపములు భవిష్యదర్థకములనియు నవీనపద్ధతిని జెప్పఁబడినట్లును, నకారణమున నాంధ్రశబ్ద చింతామణి ప్రాచీన మనుటకు కలను పడినట్లును నాంధ్రకవుల చరిత్రమున వ్రాయబడియున్నది.

'ఆంధ్రభాషా భూషణ, కావ్యాలంకార చూడామణికర్తలు భారతమునే గాక యా కాలమునందలి యాంధ్రవాఙ్మయమునే బాగుగఁ బరిశీలింపక యే క్రియారూప ముల కాలముల నుపదేశించిరనుట సాహసము కాదు. వీరేశలింగము పంతులుగారు స్వవాదోపయుక్తములగు ప్రయోగములను మాత్రమే భారతమునుండి చూపి బాధక ప్రయోగములను జూపకుండుట యుక్తము కాదు. పురాతన సాధు సాత్త్వ వాఙ్మయములో నెచ్చటను దుగాగమ యుక్తరూపములకుఁ గాని, ఎదగామ యుక్తరూపములకుఁ గాని కాలనియామ మగపడదు. ద్వివిధరూపములను వర్తమాన,భవిష్యత్కాలములు రెండింటి యందును నన్నయభట్టారకుఁడే వాడి యున్నాఁడు. ఇంకను దుగాగమ యుక్తరూప ములకు భూతకాలమునందును నరుదగ వాడుక కలదు [విష. ౫౪, ౬౦]

ఉ. వేయి విధంబులందుఁ బదివేవురు పెద్దలు సుప్రబంధముల్
పాయక చెప్పి రట్లు రసబంధురభావభవాభిరామ ధౌ
రేయులు శబ్దశాసనవరేణ్యులు నాఁగఁ బ్రశస్తి కెక్కిరే
యేయెడ నన్నపార్యగతి నిద్ధర నట్టి మహాత్ముఁ గొల్చెదన్.

(అశ్వా. ౧-౧౨)

ఈ కవి నన్నయభట్టును స్తుతించిన పయిపద్యములో సుప్రబంధములుచేసిన వారు పదివేవు రుండఁగా వారెవ్వరును గాక యతఁ డొక్కఁడే శబ్దశాసనవరేణ్యుఁ డయ్యెనని వర్ణించుటచేతఁ గొందఱనుకొను నట్లాతనికి శబ్దశాసన బిరుదము వ్యాకరణ రచనచేత రాలేదనియు, సలక్షణమైన ప్రౌఢ కవిత్వ రచనచేతనే వచ్చినదనియు స్పష్టపడుచున్నది * తాను విపుల శబ్దశాసనుఁడ

---

(* శ్రీనిడుదవోలు - వేంకటరావుగారి 'తెనుఁగు కవుల చరిత్రలో' క్రిందియాశయమును వెల్లడించుచున్నారు

నన్నయ భారతమునఁ దాను శబ్దశాసనుఁడ నని చెప్పుకొనుటచే, నాతఁడు వ్యాకరణ రచయిత యని చెప్పవీలులేదు. శబ్దశాసన బిరుదము నన్నయకు లేదు. అది తర్వాతి వారిచే నాతని కారోపింపఁ బడియున్నది.

నన్నయ వ్యాకరణమును రచించినచో - అనఁగా 'అనుశాసనము' చేసినచో 'శబ్దాను శాసనుఁడు' కావలయును. 'శాసనుఁడు, అనుశాసనుఁడు' అనునవి వేఱు వేఱర్థములు కలవి. 'శబ్దశాసనుఁడ'నునది బిరుదమని నన్నయ చెప్పుకొనలేదు. ఇది బిరుదైనచో 'జపహోమ తత్పరుఁడు, సంహితాభ్యాసుఁడు, నానాపురాణ విజ్ఞాననిరతుండు' మున్నగునవియు నతని బిరుదములే యని యనవలసి వచ్చును నన్నయకు 'శబ్దశాసన' బిరుద మున్నట్లు తిక్కన, ఎఱ్ఱాప్రెగ్గడ, మడికిసింగన పోతన - మున్నగువారు చెప్పలేదు. వసుచరిత్రను రచించిన రామరాజభూషణుఁడు 'మహిమున్ వాగనుశాసనుండు సృజియింపన్' అని 'శబ్దశాసనుండు' అను దానిని 'వాగనుశాసనుఁడు'గా మార్చెను. అప్పటినుండియు నిదియే నన్నయ బిరుదుగా వాడుకలోనికి వచ్చెను. నిజముగా 'శబ్దశాసనుఁడు' బిరుదైనచో దానికి బర్యాయపదముండుటకు వీలులేదు. బిరుద పదములు పర్యాయపదా సహిష్ణువులగుట భాషాసంప్రదాయాభిజ్ఞులకు గ్రొత్తకాదు పర్యాయములను వాడవచ్చుచున్నచో 'శంభుదాసు'ను 'శంకరదాసు'గను. 'ఉభయకవిమిత్రుని' 'ద్విభాషా కవిమిత్రుఁ' డనియు నీరీతిగాఁ జెప్పవలసి వచ్చుచుండును కాన 'శబ్దానుశాసనుఁడు' బిరుదు కాదనియే చెప్పవలెను )

నని భారతములోనే నన్నయభట్టారకుఁడు చెప్పుకొని యున్నాఁడు. ఈ పద ప్రయోగమునుబట్టియే యాతని కితర కవులు వాగనుశాసనాది విశేషణములు చేర్చి యున్నారు ఇటీవల నాంధ్రశబ్ద చింతామణిని రచియించినవారును "విపులశబ్ద శాసన" నన్న ప్రయోగము నాధార పఱుచుకొనియే యది నన్నయభట్ట కృతమని లోకమును మోహపెట్టి యున్నారు "విపులశబ్దశాసన' బిరుదము వ్యాకరణ రచనచేతనే వచ్చిన దనెడు పక్షమున, ఆంధ్రశబ్ద చింతామణిలోని "ఇతి శ్రీసకల భాషావాగను శాసన నన్నయభట్టు విరచితాంధ్ర శబ్ద చింతామణౌ" అను పరిచ్ఛేదాంత గద్యమునుబట్టి యతఁడు సకల భాషలకును వ్యాకరణములు చేసెనని చెప్పవలసి వచ్చుగదా ! అట్లతఁడు చేసి యుండక పోవుట స్పష్టము. అతఁడు తనకుఁగల పాండిత్య విశేషాదులను భారతములోనే తెలుపుకొని యుండుటచేతఁ దద్విరుద్ధముగా నున్న "సకల భాషావాగను శాసన" పదప్రయోగమువలననే యీ పుస్తకము నన్నయభట్ట విరచితము గాక తదన్య కల్పి, మనియు, పుస్తకమున కౌత్కృష్ట్యమును కలిగించుటకయి గ్రంథకర్త లీ విశేషణమును నన్నయభట్టునకుఁ జేర్చి రనియు, గ్రంథము నన్నయభట్ట కృతిమేయయిన పక్షమున, నిట్టి విశేషణ ముండదనియు, దీనినిబట్టిఁ సులభముగాఁ దెలిసికొనవచ్చును. ఆంధ్రశబ్ద చింతామణి నన్నయభట్టవిరచిత మని తమ స్వప్నదర్శన వృత్తాంతమునుబట్టి మొట్టమొదటఁ జెప్పినవారుకూడ నేతద్గ్రంథ రచనము నొక్క సారంగ ధరుఁడు తక్క నన్యు లెవ్వరు నెఱుఁగ రనియు, దాని నతఁ డొక్క బాల సరస్వతి కిచ్చెననియునే కదా చెప్పుచున్నారు ! వారి మాటలను విశ్వసించి నను, నన్నయభట్టాంధ్రశబ్ద చింతామణిని రచించిన ట్లాతని తరువాతకవుల కెవ్వరికిని దెలిసి యుండనట్టు స్పష్టమగుచున్నది. ఇది యిట్లుండగా నప్ప కవికిఁ తరువాత నాంధ్రశబ్ద చింతామణికి సంస్కృత వ్యాఖ్య చేసిన యహోబల పండితుఁడు "నుమ్యోచ్ఛతో" ఇత్యాది సూత్రమునందుఁ గల "హల్యాథర్వణాచార్యమతాత్' అను భాగమును వదలివేసి (హల్యథర్వణ స్యమత ఇత్యప్పకవి పుస్తక పాఠస్తు నైతత్పార సామంజస్యం లభ్యత ఇత్యుపేక్షితః) హ ల్లథర్వణ మతప్రకారముగా లభించిన దన్న యప్పకవి పాఠ మ్మీ

పాఠముతో సరిపోవనందున నుపేక్షింపఁబడినదని వ్రాసియున్నాడు. అంత యల్పకాలములో నిన్ని పాఠభేదము లెట్లు గలిగెనో దురూహ్యముగా నున్నది. అప్పకవి మతానుసారముగా సారంగధరుని యనుగ్రహము వలన బాలసరస్వతి కొక్క పుస్తకము మాత్రమే లభించి యతఁడు చేసిన తెలుఁగు టీకతో నతని కది స్వప్నములో సాక్షాత్కరించిన గోపాలకృష్ణుని యనుగ్రహమువలన నొక బ్రాహ్మణునిచే లభించినది అప్పటికిఁ బాఠభేదములు లేవు. అంతటి యల్పకాలములో బహుపాఠభేదములు కలుగుట కవకాశము సహితము లేదు ఇఁక నహోబల పండితుని మతానుసారముగా (పాఠభేదాస్తు బహవోదృశ్యంతేపుస్తకద్వయేమయాప్రాయస్సరస్వత్యాః పుస్తకం గృహ్యాతే) పాఠభేదము లనేకములు కనఁబడుచుండగా నందు బాలసరస్వతి పాఠమే యతనిచేఁ దఱచుగా గ్రహింపబడుచు వచ్చినది ఈ రెండు మతములలో నప్పకవి చెప్పినట్లు సారంగధరుఁ డొక్క పాఠము నొక బాలసరస్వతి కిచ్చిన మాట నిజమో! అహోబలపండితుఁడు చెప్పినట్లు పెక్కుపాఠభేదములుండి యందు బాలసరస్వతి దొక్కటి యగుట నిజమో! ఏది యెట్టి దయినను బాలసరస్వతినో, మఱియెవ్వరిచేతనో యాంధ్రశబ్ద చింతామణి యాకాలము నందే రచియింపఁబడుట మాత్రము నిజము. అందుఁ గనఁబడుచు వచ్చిన దోషముల నప్పుడప్పుడు వారువారు తమకుఁ దోచినట్లుగా దిద్దుచు వచ్చుట చేత నేర్పడినవే యీ పాఠభేదము లయియుండును. "అద్యః క్రియాసు భూతార్థద్యోతిన మాద్యగం వినాసర్వః" అను దానిలోని దోషమును గనిపెట్టి యప్పకవిదానిని "అద్యః క్రియాసుభూతాద్యర్థసముద్యోతి సంవినా సర్వః" అని సంస్కరించినాఁడు అట్లే యహోబలపండితుఁడును మఱియొక దోషమును గనిపెట్టి "హల్యధ్వరణాచార్యమతాత్" అన్న దానిని వదలివేసి యింకొక సంస్కారమును జేసినాఁడు కలవన్న పాఠభేదము లన్నియు నిట్టివే ఈ పాఠభేదములను గూర్చి యిందింత కంటె నధికముగా చర్చించుట యనావశ్యకము ఆంధ్రశబ్ద చింతామణి నన్నయ కృతము కాదని చూపుట కింతయే చాలియుండును ఇది యిట్లుండఁగా నీ నడుమ ననంతపురమండల పండితు లిరువురు తమకుఁ గ్రొత్తగా నన్నయభట్టీయ ముద్రాపకులు మొద

లైన వారి కెవ్వరికివి దొరకని బాలసరస్వతి కృతటీకాసహితాంధ్రశబ్ద చింతామణి లభించినదనియు, తన్మూలమున నప్పకవి మొదలైన వారికథ లబద్ధములయి సత్యము తేటపడినదనియు, ఆ గ్రంథమును జూచి యుండిన యెడల నేను నా కవులచరిత్రములో నట్లు వ్రాసియుండననియు, నుడువుచు బాలసరస్వతి కా గ్రంధము లభించిన మార్గమునుగూర్చి యప్పకవ్యాదులు చెప్పిన దానికంటెను నెక్కుడు యసంగతముగా నున్న కథతోఁ గూడిన యీ క్రింది యవతారిక నుదాహరించుచు నాంధ్రసాహిత్య పరిషత్పత్రిక కొక వ్యాసము వ్రాసియున్నారు.* —

"ఉ. ఏమి మహాద్భుతం బది ! హరిహరి ! యెక్కడియాంధ్రశబ్ద చిం
తామణి ఫక్కి ? యెక్కడి మతంగనగంబు ? యుగాదిసంభవుం
డై పని చన్న నన్నయమహాకవి యెవ్వడు ? సిద్ధుఁ డెవ్వడా
హా ! మదగణ్యపుణ్యసముదగ్రతఁ జేకుఱెఁగా దె యిన్నియున్.

మ. ఇలఁ బ్రజ్ఞానిధులౌ కవు ల్మనుపు లేరే ? వారు వ్యాఖ్యాన క
ర్తలు గానోపరె ? పెక్కువత్సరము లంతర్భూతమై యున్నయీ
తెలుఁగువ్యాకరణంబు నా కొసఁగె బ్రీతిం డీక గావింపుమం
చల సిద్ధుండు మదిష్టదేవత విరూపాక్షుండు నిక్కంబుగన్.

వ. ఆంధ్రశబ్ద చింతామణిఁ దెనిఁగించెద నిది తొల్లి సకల కవితా ప్రవర్తకుండగు శబ్దశాసనుండు సకలహితంబుగా యథోచిత సూత్రగర్భితంబు లగు నార్యావృత్తంబుల బంచ పరిచ్ఛేదంబుగా సమకట్టె. నేను నా నేర్చుకొలఁదిఁ దత్సూత్ర విభాగంబును, దత్ప్రమేయ వివరణంబును, దదుదాహరణ స్వరూపంబులును నంధ్రమయ గద్యపద్యంబుల నేర్పరించి నా యాత్మదేవత యగు నంబాదేవి కర్పించువాఁడ."

(* శ్రీమల్లాది సూర్యనారాయణ శాస్త్రిగారు, శ్రీరాళ్ళపల్లి గోపాలకృష్ణ శర్మగారును అనంతపురమండలమున సంపాదించిన బాలసరస్వతీయము 1932లో ఆంధ్రసాహిత్య పరిషత్తువారిచేఁ బ్రకటితము.)

పయి వాక్యము లందుండినవో లేవో కాని బాలసరస్వతీయము మాత్రము వా రనుకొన్నట్లుగాక యెల్లవారికిని నెల్లచోటులను లభ్యమగుచునేయున్నది. బాలసరస్వతీయము చెన్నపురి ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమునం దున్నది పూర్వ మాంధ్రశబ్దచింతామణిని చెన్నపట్టణములో ముద్రించినవారు పుస్తక ముఖపత్రమునందు

"ఆంధ్రభాషను సలక్షణముగా నభ్యసించుటకు
ముఖ్యసాధనముగా నుండెడు నన్నయభట్ట ప్రణీ
తాంధ్రశబ్ద చింతామణి
యను నాంధ్ర వ్యాకరణ గ్రంథము
ఎలకూచి బాలసరస్వతి యను నుత్తమ పండితునిచే
నాంధ్రంబున రచియింపంబడిన బాలసరస్వతీయమను
టీకతోఁ జేర్చి
పురాణం హయగ్రీవ శాస్త్రులుగారిచే
లేఖక ప్రమాదజనితదోషంబులవల్లం బరిష్కరింపంబడి
ప్లవంగసంవత్సరాశ్వయుజ శుద్ధాష్టమియందు
వివేకాదర్శ మనుస్వకీయ ముద్రాక్షరశాలలో
అచ్చు వేయింపంబడెను.
దీని మూల్యము అణాలు ౧౨"

అనియు, పుస్తకాంతమునందు

"బాలసరస్వతీయ టీకా సహితాంధ్రశబ్ద
చింతామణి గ్రంథము సంపూర్ణము"

అనియు, ముద్రించి యున్నారు. అది యటుండనిండు.

అప్పకవియు నహోబలపండితుడును చెప్పిన ప్రకారముగా నన్నయభట్టు రచించి నప్పుడు పఠించిన సారంగధరుడే సిద్ధులలో గలిసి తనకు ముఖస్థ మయి స్వాధీనములో నుండిన పుస్తకమును దెచ్చి మతంగగిరికడ బాలసర స్వతుల కిచ్చెను. ఈ పుస్తక పీఠికను బట్టి పుస్తకముతో సంబంధమేమియు

లేని సిద్ధుఁ డొక్కఁడు తిక్కనకేతనాద సుప్రసిద్ధాంధ్రకవులకున్ను పెద్దనాది లక్షణవేత్తలకును నెవ్వరికిని బహుశత సంవత్సరముల నుండి పేరైనను దెలియకుండిన తెలుఁగు వ్యాకరణ సూత్రములను దెచ్చి డీక చేయుమని మతంగగిరికడనే తానావఱకెఱుఁగని బాలసరస్వతుల కిచ్చెను. దేశాటనము చేయుచుండిన సిద్ధుఁ డీ యపూర్వాంధ్ర వ్యాకరణమును మోక్షదాయకమైన యోగసిద్ధాంత గ్రంథమని సంపాదించి తెచ్చి యిచ్చెనా? తనకుఁ గల సామాన్యాంధ్ర భాషాభిమానమునుబట్టి వెదకి తెచ్చి యిచ్చెనా? మఱి యే హేతువుచేత తెచ్చి యిచ్చెను? నిజ మారయఁగా బాలసరస్వతియే తాను దీనిని రచియించి గ్రంథప్రామాణ్య సంసిద్ధిని కథను గల్పించి యుండును. గ్రంథ ప్రాశస్త్యార్థమైన యెడల, కర్తృత్వమును తానే వహించి యాకీర్తిని తానే పొందక నన్నయభట్టున కేల యారోపింపవలయు ననియు, ఆరోపింప దలఁచిన యెడలఁ దనవంశములోనివాఁడైన నన్నయ కారోపింపక నన్నయ భట్టునకే యేల యారోపింపవలయుననియు, మన మిత్రు లడుగుచున్నారు. పుస్తకమునకుఁ గలిగిన ప్రమాణత్వ మంతయు నన్నయభట్టుయొక్క గొప్పతనమువలన వచ్చినదే కాని స్వయోగ్యత వలన వచ్చినది కాదు దీనినే బాలసరస్వతి కృతమని కాని తత్ప్రపితామహకృతమని కాని చెప్పినచో నెవ్వరు ప్రామాణికబుద్ధితో నాదరించి దానిని బహూకరింతురు? గ్రంథము యొక్క యర్హతను బట్టియే చూచెడు పక్షమున, అథర్వణకారికావళి దీనికంటె శతగుణము లధిక గౌరవార్హ మయినదిగా నుండును నే నీ పుస్తకము నన్నయ కృతము కాదన్నది పుస్తకములోని యంతస్సాక్ష్యమునుబట్టిగాని పీఠికలోఁ జెప్పఁబడిన దానినిబట్టి కాదు ఇఁకఁ బీఠికలోని విషయ విచారమునకు వత్తము.

మొదటి పద్యములో "యుగాది సంభవుండై మనీ చన్న నన్నన మహాకవి యెవ్వఁడు?" అని యున్నది. అప్పటి కయిదాఱునూఱుల సంవత్సరముల క్రిందట నుండిన నన్నయ యెక్కఁడ? యుగాది యెక్కఁడ? ఈతడు కలిగించిన భ్రమలోనే పడి యప్పకవి కలియుగమున కాదిని నన్నయ రాజమహేంద్రవరములో నుండెనని చెప్పెను. రెండవ పద్యములో "పెక్కు

వత్సరము లంతర్భూతమైయున్న యీ తెలుఁగు వ్యాకరణంబు నాకొసఁగె” నని యున్నది. పెక్కు సంవత్సరము లనఁగా నప్పటి పెక్కువందల సంవత్సరము లని యేమో! రచియింపఁబడిన తరువాత గ్రంధము నిజముగానే పెక్కు సంవత్సరము లంతర్భూతమై యుండెనేమో! తెలుఁగు వ్యాకరణ మనుచో మొదటి దేగణము? గువర్ణ మెటు గురువగును? కడపటి వచనములో “సకల కవితా ప్రవర్తకుండగు శబ్దశాసనుం” డనుట ఆంధ్రశబ్ద చింతామణి గద్యములో నున్న “సకల భాషావాగనుశాసన”యను దాని కనుకూలముగా నుండుట కొఱకా? మఱి యెందుకొఱకు? “తత్సూత్ర విభాగంబును . .. దదుదాహరణ స్వరూపంబును సంగ్రథమయ గద్య పద్యంబుల నేర్పరించి” యని యున్నది గదా? ఇది సత్యమా యసత్యమా? సూత్ర విభాగములు మొదలయినవి యెన్ని పద్యములుగా నున్నవి? పుస్తకములోని యంతస్సాక్ష్యమును నిరాకరించి యీ పీఠికలోఁ జెప్పఁబడిన దానినే వేదవాక్యముగా నంగీకరించుట యీ కల్పనలుకుఁను నమ్మియా?

నన్నయవట్టారకుఁడు భీమకవియొక్క రాఘవపాండవీయము నడఁచుటచే నతఁడు నన్నయభట్టీయమును గోదావరిలోఁ గలిపె నన్న యప్పకవి కథ కల్పిత మనుటనుగూర్చి యీ సందర్భమున నింక గొంచెము చెప్పవలసి యున్నది. ఈ క్రింది శ్లోకములతో నప్పకవికథనే యహోబలపండితుఁడును జెప్పి యున్నాఁడు.

శ్లో. నే యం కృతి ర్వేములవాడ భీమప్రబంధకర్త్రా హిపమత్సరేణ
గోదాజలే నాశ మవాపితాభూ దిత్యూర్ధ్వతాసీ ద్భువి కింవదంతీ.

* * * *

రాజరాజ తనూజాతః సారంగధర బాలకః
స కృతః పాణిపాదేన రహితోజని హేతునా.
మత్స్యేంద్ర నామసిద్ధేంద్ర మహిమ్నా సిద్ధతాంగతః
జగ్రాహ వ్యాకృతిం తస్మా త్కవివాలసరస్వతీ.
ఎలకూచి కులాంభోధిశరద్రాకానిశాకరః
సమస్త కవితాదక్షో వత్సరే కీలకాహ్వయే

ఈ కథ యబద్ధమని చూపుటకు భీమకవి కృతమైన కవిజనాశ్రయ ఛంద మొకటి కనబడుచున్నది. ఈ ఛందస్సు మల్లయరేచఁడను కోమటిపేర భీమకవిచే రచియింపఁబడినది. ఈ కవిజనాశ్రయములో

క. పరఁగిన విమలయశోభా
సురచరితుఁడు భీమనాగ్రసుతుఁ డఖిలకళా
పరిణతుఁ డయ్యెను భూసుర
వరప్రసాదోదిత ధ్రువశ్రీయుతుడై

(కవిజనాశ్రయము అధస్సూచిక పుట. 2)

క. అసమానదానరవితన
యసమానోన్నతుఁడు వాచకాభరణుఁడు ప్రా
ణ సమానమిత్రుఁ డీ కృతి
కి సహాయుఁడుగా నుదాత్తకీర్తి ప్రీతిన్.

(కవిజ. పుట 2 అధస్సూచిక)

క. అనవద్య కావ్యలక్షణ
మొనరంగాఁ గవిజనాశ్రయుఁడు మల్లయరే
చనసుకవి కవిజనాశ్రయ
మను ఛందముఁ దెలుఁగుబాస నరుదుగఁ జెప్పెన్.

(కవిజ సంజ్ఞా ప. 3)

అని భీమనాగ్రసుతుని తోడ్పాటుతో గ్రంథమును మల్లయరేచన రచించి నట్లు చెప్పబడినది. భీమనాగ్రసుతుఁ డనుపో "దాక్షారామభీమేశ నందనుఁడన్" అని కవి చెప్పుకొన్నట్లు భీమేశ్వర పుత్రుడగు భీమకవి యనియే యర్థము చేయవలెనుగాని భీమకవి పుత్రుఁ డనిచేయఁ గూడదు. భీమకవి పుత్రుఁ డని యర్థము చేసెడు పక్షమునఁ గవిజనాశ్రయము భీమకవి కృతమని

గీ.	వికటకవులు కొన్ని వింతలు కల్పించి
	కవిజనాశ్రయమునఁ గలిపినారు
	వానిఁ గైకొనంగ వల దప్రయుక్తంబు
	నేల చెప్పు భీముఁ డెఱిఁగి యెఱిఁగి.

ఇట్లప్పకవి లోనగువారు చెప్పిన వచనము లన్నియు నిరర్థకము లగును గదా? ఇందలి గద్యమునందు "ఇతి శ్రీవాగీంద్ర చూడామణి చరణ సరసీరుహ మధుకరాయమాన శ్రావకాభరణాంక విరచితం బయిన కవిజనాశ్రయంబున"నని యున్నది కవిజనాశ్రయములో నీమన కొన్నిచోట్ల

క.	విత్రస్తాఘ పవిత్రచ
	రిత్రత్రిదశవర వరధరిత్రీసురస
	న్మిత్రాంబుజ మిత్ర గుణా
	మాత్ర యనుప్రాస మిది యు మల్లయరేచా

(కవిజ సంజ్ఞాధికారము ౪౦)

అని యిట్లు మల్లయరేచని సంబోధించియు, కొన్నిచోట్ల

సీ.	వివిధచతుష్షష్టి విద్యల నజుఁ డని
		విమలనయోపాయవిమల బుద్ధి
	నమరేంద్రగురుఁ డని యధికతేజంబున
		నాదిత్యుఁ డని సుందరాంగయుక్తి
	నంగజుం డని యొఱిఁగి నంగాధిరా జని
		యలఘున నభిమన్యుఁ డని సమస్త
	జనులు ముదంబున శ్రావకాభరణాంకు
		సత్కవికవిజనాశ్రయగుణాంకుఁ
	బొగడుచుండుదు రని యిట్లు పూర్వరచన
	నలరఁ జెప్పిన వడి సీస మయ్యె దీని
	పశ్చిమార్ధంబు వడి యొండుపాట నిలువ
	నదియొ యంకిలివడిసీస మయ్యెఁ గృతుల

(కవిజ జాత్యధికారము ౹౭)

అని యిట్లు రేచనను బొగడియు, కొన్నిచోట్ల

సీ. ప్రాసంబు నాలుగు పాదంబు లందును
బన్నుగా నిడి పెఱపాదములను
బ్రాసంబు లిడక తత్పాదంబులం దెల్లఁ
బన్నుగా వడు లిట్లు పరఁగ నిలిపి
తెలిసి తెలుంగునఁ దియ్యనినుడువులఁ
దెల్లఁబుగా సర్వద్మష్టి దెలుపఁ
బ్రాససీసము దీని పశ్చిమార్ధంబునఁ
బ్రాసంబు వేఱొక ప్రాసమైన
శ్రీసమేతుఁడైన శ్రీపాదపంకజ
వాసమధుకరుఁడు వాసవప్ర
హాసభాసి రేచఁ డను పండితుం డిటు
ప్రాససీస మరసి పఁరగఁ జెప్పె.

( కవిజనా - జాత్యధికారము 16 )

అని రేచఁడు రచించినట్లు చెప్పియు, నానావిధ పద్యములను జేర్చియున్నాడు. ఇట్టి భీమకృతమైన కవిజనాశ్రయములోని యతిచ్ఛందోధికారమునందు

క ద్వీపమునకు నాకమునకు
నాపై శాస్త్రోక్తి నచ్చు లాదేశసమా
సాపత్తి గలుగుటయు వళు
లాపాదింపుదురు కొంద ఱచ్చును హల్లున్. రాజ

అను లక్షణమును జెప్పి లక్ష్యము లనుగఁ గావ్యాలంకార చూడామణి నుండి

ఉ ద్వీపుల ద్రుంచి విశ్వజగతీపతి యుత్తమశక్తి జాంబవ
ద్వీపమునందు గోవులకు నిమ్మగఁ జేయుటకుం బ్రసన్నుఁడై
గోపతిధేను వవ్విభునకుం దనవైభవ మిచ్చెఁ గాక యే
భూపతు లీ వదాన్యగుణబుద్ధుల నిట్లు వహించి రుర్వరన్.

క. నీకరవాలము పాలై
నాకంబున కరిగి రాజనారాయణ యా
భూకాంతు లెంతచనువో
నాకవితోత్తముల దూల నడచెదరు కడిమిన్ * రారా

అను పద్యములను కవియుదాహరించి యున్నాడు. దీనినిబట్టి వేములవాడ భీమకవి కావ్యాలంకార చూడామణిని కృతి నందిన విశ్వేశ్వరరాజు కాలము లోనో, తరువాతనో యుండి యుండవలెను. విశ్వేశ్వరరాజు రాజనరేంద్రుని కేడవ మనుమఁ డగుటచేత, రాజరాజనరేంద్రుని కాలములోనున్న నన్నయ భట్టారకుని తరముల తరువాతఁ బుట్టిన విశ్వేశ్వరరాజు కాలములో నుండిన భీమ కవి చేసిన రాఘవపాండవీయము నడఁచుట సంభవింపనేరదు. కాఁబట్టి తన రాఘవపాండవీయము నడఁచినట్లుగ మనసులోఁ బెట్టుకొని భీమకవి నన్నయభట్టారకుని యాంధ్రశబ్దచింతామణిని గోదావరిలోఁ గలిపెననుటయు దానిని సారంగధరుఁడు వారల నుద్ధరించె ననుటయు నిరాధారము లయిన యసత్యకల్పనము లనుటకు లేశమాత్రమును సందేహము లేదు. కవి జనాశ్రయములోని యీ పద్యములు భీమకవి నన్నయభట్టున కాఱుతర ముల ననఁగా నించుమించుగా నిన్నూఱు సంవత్సరముల తరువాత నున్నట్టు నిరాక్షేపముగా స్థాపించుచున్నవి. భీమకవియు నథర్వణాచార్యుఁడును గూడ నన్నయభట్టారకునికిఁ దరువాతి కాలమువారని యేర్పడుటచేత నిర్ష్యాగ్రస్తుఁ డని జను లన్యాయముగా నారోపించిన నిందనుండి విముక్తుఁడయి నన్నయ భట్టారకుఁ డనింద్య చరిత్రుఁ డగుచున్నాఁడు.

నన్నయభట్టే యాదికవి యైనట్టుగా నిటీవలి తెలుఁగుకవులచేత గొనియాడఁ బడుచు వచ్చినను, వాగనుశాసనునకుఁ బూర్వమునందుఁ దెలుఁగుకవులు లేకపోలేదు. అయినను పూర్వకవులు చేసిన గ్రంథములు మాత్ర మిప్పు డేవియు నేత్రగోచరములు కాకున్నవి. ఏ హేతువుచేతనో యా కాలపు పుస్తకము లన్నియు నశించి యుండును. ఆంధ్రదేశమంతయు నొకసారి

* ఈ లక్ష్యములు కొన్నిప్రతులలో లేవనియు, తరువాత నెవ్వరో కవిజనా శ్రయములోఁ గలిపినారనియు, ఒకరు వ్రాయుచున్నారు.

పరరాష్ట్రాధిపతులచేత దగ్ధము చేయఁబడినట్టును, అందుచేతనే యీ దేశము
నకు దగ్ధరాష్ట్రమనియు, వేగిదేశ మనియు నామములు కలిగినట్టును చెప్పఁ
బడి యున్నది ఆ మహాదహనసమయమునం దావఱ కున్న పుస్తకము
లన్నియు తగులఁబడిపోయి యుండవచ్చును. అట్లుగాక యావఱ కేమియుఁ
బుస్తకములే లేక యుండిన పక్షమున నన్ని కట్టుదిట్టములతో నంత నిర్దుష్ట
ముగా నూతనముగా గ్రంథరచన చేయుట నన్నయభట్టునకు గాని మరియెవ్వ
రికిఁ గాని సాధ్యమై యుండదు. అయినను మనవారు కొందఱు భారత
మునకుఁ బూర్వము తెనుఁగు కవిత్వము లేదనియు, నన్నయభట్టే భారత
రచనచేత నాంధ్రకవనమును బుట్టించెననియు, పట్టుదలతో వాదించుచున్నారు.
భారతరచనారంభమునకు ముందే రాజరాజనరేంద్రుఁ "డుభయ భాషాకావ్య
రచనాభిశోభితుఁ" డని తన్నుఁగూర్చి భావించినట్లు నన్నయభట్టే చెప్పుకొని
యుండుటచేత నప్పటికే సంస్కృత కవిత్వమువలెనే తెనుఁగు కవిత్వముకూడ
నున్నట్టు స్పష్ట మగుచున్నది ఇది గాక నన్నయ కాలమునందే గణితమును
రచించిన పావులూరి మల్లన్నయు, ఆంధ్రభారత రచనకుఁ దోడుపడిన నారా
యణభట్టును, తెనుఁగుకవు లుండి యున్నారు. కుమారసంభవమును రచిం
చిన నన్నెచోడుఁడు తన పుస్తకమునందుఁ బ్రథమాశ్వాసములో

"క మును మార్గకవిత లోకం
బున వెలయఁగ దేశికవిత బుట్టించి తెనుం
గు నిలిపి రంధ్ర విషయ*మున
జనసత్యాశ్రయుని దొట్టి చాళుక్యనృపుల్." (ప. ౨౩)

అను ౨౩వ పద్యమున సత్యాశ్రయాదులైన చాళుక్యరాజులు తెలుఁగు కవి
త్వమును బుట్టించి వెలయఁజేసి రని చెప్పియున్నాఁడు. ఇక్కడ మార్గకవిత
యనఁగా సంస్కృత కవిత్వ మని యర్థము. ♦

( * గున నిలిపి రంధ్ర విషయంబున జన చాళుక్యరాజు మొదలుగఁ బల్వుర్ - సరియైన పాఠము.)

(♦ ఈ విషయమును గూర్చి మద్రాసు విశ్వవిద్యాలయమువారు ప్రకటించిన "కుమార సంభవము" యొక్క 'పాఠభేదములు - లఘువ్యాఖ్య'లో నిట్లున్నది-

శ్లో. మార్గదేశివిభాగేన సంగీతం ద్వివిధం మతమ్।
ద్రుహిణేన యదుద్దిష్టం యదుక్తం భరతేన చ॥
తద్దేశీ హి యయా రీత్యా యత్స్యా ల్లోకానురంజనమ్।
దేశేదేశే తుసంగీతం తద్దేశీత్యభిధీయతే॥

అని సంగీత దర్పణమునం దుదాహరింపబడినది. బ్రహ్మచేతను భరతుని చేతను సంస్కృతమున విధింపబడినది మార్గకవిత యనియు, కర్ణాటాది దేశములయందు నా యా దేశభాషలలో నేర్పఱుపఁ బడినది దేశికవిత యనియు, పయిదానితాత్పర్యము. ఈ సత్యాశ్రయుఁడు పూర్వ చాళుక్య రాజ్యమును స్థాపించిన కుబ్జవిష్ణువర్ధనుని యన్నయే యైనచో నన్నయభట్టు నకుఁ బూర్వ మాఱు నూఱుసంవత్సరముల క్రిందటనే తెలుఁగు కవిత్వ మారంభమయినట్టు తెలియవచ్చుచున్నది. కుబ్జవిష్ణువర్ధనుఁడు వేఁగీదేశము నకుఁ బరిపాలకుఁడుగా నియమింపఁబడుటకు ముందు సత్యాశ్రయుడు కర్ణాట వేఁగి దేశములకు రెంటికిని నేకచ్ఛత్రాధిపతియయి, తన రాజ్యకాలములో కర్ణాటాంధ్ర భాషలను రెంటిని బ్రోత్సాహపఱిచెను. ఈతని తరువాతివారైన కుబ్జవిష్ణువర్ధనాది చాళుక్యరాజులు సహిత మట్లే చేయుచు వచ్చినందున వారి యాస్థానములయందలి విద్వాంసులు సామాన్యముగ సంస్కృత కర్ణాటాంధ్ర భాషావేత్తలగు చుండిరి. నారాయణభట్టువలెనె నన్నయభట్టును తెలుఁగునందు మాత్రమె కాక కన్నడమునందును పాండిత్యము కలవాఁ డయి యుండెను. కర్ణాటక భాషా సంసర్గముచేతనె యా కాలమునందలి తెలుఁగు కవిత్వములో నక్కరలు మొదలైనవి విశేషముగా వాడఁబడుచుండెను. రాజ నరేంద్రునకుఁ బూర్వము నూఱు సంవత్సరముల క్రిందట బేటవిజయాది త్యుఁ డనువాఁడైన రెండవ సత్యాశ్రయుఁ డుండెను గాని యతఁడు

---

(మార్గకవిత = ప్రాచీన సంస్కృత సాహిత్యమార్గానుసార లక్షణయుక్తమగు దేశ భాషా కవిత దేశికవిత = దేశీయ సంప్రదాయ బహుళమగు కవిత మును మార్గకవిత లోకమున వెలయఁగా దేశికవితయను తెనుంగునఁ బుట్టించి ఆంధ్రదేశమున నిలిపిన వారు చాళుక్యరాజులు మొదలుగ పలువురు (చోళాదులును) అట్లు చేసిరి. ఆంధ్రము విషయము. అందు తెనుంగున దేశికవిత పుట్టించి తెనుంగుభాషను నిలిపిన వారు చాళుక్యరాజులు. "సత్యాశ్రయుని వొట్టు" యను 'చాళోని పారమునకమూల మెట్టిదో తెలియరాదు)

రాజుగాక కేవలమాండలిక పరిపాలకుఁడై యుండుటచేతఁ కుమారసంభవము నందుఁ జేర్కొనఁబడిన సత్యాశ్రయుఁ డీతఁడయి యుండడు. క్రీస్తు శకము ౯౭౨ మొదలుకొని ౯౩౪ సంవత్సరమువఱకు ననఁగా రాజరాజనరేంద్రుని కంటె నూఱు సంవత్సరములు ముందుగా రాజ్యము చేసిన యుద్ధమల్లుని దానశాసనములలో నొక దానియందు

మధ్యాక్కరలు

1 స్వస్తి నృపాంకుశాత్యంతవత్సల సత్యత్రిణేత్ర
విస్తరణ శ్రీయుద్ధమల్లు డనవద్య విఖ్యాతకీర్తి
ప్రస్తుతరాజాశ్రయుండు త్రిభువనా భరణుండు సకల
వస్తు సమేతుండు రాజసల్కిభూవల్లభుం డరి.

2. పరగంగ బెజవాడ గొమరుసామికి భక్తుఁడై గుడియు
నిరుపమమతి నృపధాము డెత్తించె నెగిదీర్చె మరము
గొరగ ల్గా కొరులిందు విడిసె బృందంబు గొనియుండువారు
వరిగాక యవ్వారణాసి ద్రవ్విన పాపంబు గొంద్రు.

3 వెలయంగ నియ్యొట్టు డస్సి ములినురై విడిసిన బ్రోల
వల తానపతులును రాజు పట్టముం గట్టిన పతియు
నలియం బైవారల వెల్వరించిన నశ్వమేధంబు
ఫల ముపేక్షించి నాగలింగఁబడసిన పాపంబు దమకు.

4. జననుత చేబ్రోలనుండి బెజవాడజాత్రకు వచ్చి
త్రిణయనసుతుఁ డొండుచోటు మెచ్చక తివిరి యిన్నెలన
యనఘుండు వేకొని యిందు ప్రత్యక్షమై యున్న నచ్చ
టని మల్ల డెత్తించె గుడియు మఠమును గార్తికేయునకు.

5. రమణతో బెజవాడ కెల్ల బెరగును రక్షయుం గాను
నమతాత మల్లపరాజు వేర్వెఱ దాను గట్టించె
నగమమున దానికి కలశ మిడ్డట్లుగా మొగమాడు
నమరంగ శ్రీయుద్ధమల్లు డెత్తించె నమితతేజుండు.

మొదలుగాఁ గల పద్యము లున్నవి. ఇత్యాది నిదర్శనములనుబట్టి నన్నయ [illegible]
మహాకావ్యరచనమునం దితఁ డాదికవియే నన్నయభట్టకృతము లయిన
లక్షణ సారములోనివియు నింద్రవిజయములోనివియు [illegible]
నం దుదాహరింపబడిన పద్యములలో నొక్కొక్క దాని నిం దుదహరింపుఁ
చున్నాను :—

గీ. అచ్చు హల్లును లాపశబ్దాదివర్ణ
మునకుఁ జెప్పిన ఘట్ యతి యనగఁ దనరు
నంబురుహ గేహిని సమనులాప యనగ
లక్ష్మి వాగ్జితకోకిలాలాప యనఁగ —లక్షణసారము

చ. ఒకపలు వాతఁ గొన్నకిటియున్ దల లోనిడు కూర్మ భర్త నా
లిక లిరుగొన్న సీదరపు జేఁడు బయోధరధారఁ బొట్ట పెం
చుకులనగాళి యీడు ప్రతి జోడని యెంచఁగ గూడ దేరి కె
న్నికగ యయాతియంచె ధరణీభర ముంచి చెలంగుదానికిన్:—

ఇంద్ర విజయము.

ముందు జెప్పినట్లు నన్నయభట్టు రాఘవాభ్యుదయ మను నొక గ్రంథమును జేసినట్టు వ్రాసి యా గ్రంథములోని దని యీ క్రింది పద్యము నొకానొక రుదాహరించి యున్నారు.

క. వికలుని ఖరదూషణముఖ
సకలవనచరులు పొదివిరి సమ్మదముగ ని
ష్పకకుష్పకు మూఁగెడు మిడు
తుకపిండువితాన బాఁతి తోచెడు బుద్ధిన్.

ఈ పద్యము నన్నయ్యభట్టారకుని కవిత్వమును బోలి యుండక పోవుట చేత సీఁత డా నామము గల మఱియొక యప్రౌఢకవి యయి యుండ వచ్చును

నన్నయభట్టు విరచితమైన "చాముండికావిలాస" మను పద్యకావ్య మొకటి నూతనముగా లభించిన ట్టినడుమ నాంధ్ర పత్రికయందుఁ బ్రకటింప బడినది దుర్మతినామ సంవత్సరమునం దనఁగా నిప్పటి కేఁబదియైదు సంవత్సరముల క్రిందట పూర్వపు మాతృకనుజూచి దొర్ని పేరయ్య యను నాతనిచే వ్రాయ బడిన పుత్రికను దెప్పించి సావధానముగా నే నామూలాగ్రముగాఁ జదివి తిని. చదివినకొలఁదిని నాకదినన్నయభట్టకృతము కాదన్న యభిప్రాయము బలపడసాగినది చాముండిక యనఁగా గౌరీదేవి చాళుక్య వంశజులకు తర ములనుండి వచ్చిన కులదైవత మగుటచేతను, గద్యమునందు నన్నయభట్టు విరచిత మని యుండుటచేతను, రాజనరేంద్రుని ప్రీతికయి నన్నయభ ట్టొకవేళ భారతాంధ్రీకరణారంభమునకు ముందు దీనిని రచియించి యుండు నేమో యని యూహింపవలసి యున్నను కవిత్వవిధమునుబట్టి యాలోచిం పఁగా నా యూహ కవకాశము కలుగకున్నది. ఈ గ్రంథమును రచించిన కవి వేఱొక నన్నయభ ట్టనుకొనుటకును వీలులేకుండఁ బ్రథమాశ్వాసా రంభమున నున్న యీ క్రింది సీసపద్యము బాధించుచున్నది.—

సీ. వ్యాసాదిఋషులకు వందన మొనరించి
  కవిమల్లులను జాల ఘనత నెంచి
సుకవీశ్వరుల నెల్ల సొంపుగా వినుతించి
  గురుపాదయుగ్మము ల్సరవిఁ గొలిచి
యిష్టదేవాళి సంతుష్టత సేవించి
  మంత్రాధిదేవత మది దలంచి
సర్వజనాళికి సంతోష మొనరించి
  పార్థివసభల వైభవము గాంచి

యాంధ్ర వాక్యానుశాసనం బతిశయిల్ల
జేసి లోకోపకారార్థసిద్ధిఁ జేసి
ఘనత రాజనరేంద్రునికరుణఁ బడసి
నట్టివాడను నన్నయభట్టు నేను.

రాజనరేంద్రుని కరుణ బడసిన యీ కవి యీ పుస్తకమును రాజనరేంద్రున కేల యంకిత మొనర్పలేదో! చాముండికావిలాసము శ్రీరాముస కంకితము వేయబడినది. ఇందలి మొదటి పద్యము "శా. శ్రీవాణీ గిరిజా సమన్వితుల .. .... ........ .. .. ........ ...—సేవింతు స్మరి నా త్రిమూర్తులను నా చిత్తంబులో నెప్పుడున్." అని యుండుమించుగా నాదిపర్వము "శ్రీవాణీ గిరిజా శ్చిరాయ" యను శ్లోకమునకు భాషాంతరము వలె నున్నది. రెండవ పద్యము నందుకవి "యిందిరను వాణిని పార్వతిని" తలంచెను. మూఁడవ పద్యమునందు "విఘ్నదేవుఁడు"ను నాల్గవ పద్యమునందు "నాంజనేయుఁడు"ను స్తుతింపబడిరి. పయి సీసపద్య మయిదవది. "ఆ జనకసుతావిభు"నకు మొదలుగాఁ గల నాలుగు కందపద్యములును (౬, ౭, ౮, ౯) రాముని గూర్చిన షష్ఠ్యంతములు. ఆరంభ పద్యము రామునిఁ బేర్కొనక, తాను నన్నయభట్టు నని చెప్పుకొన్న వెంబడినే రాముని గూర్చిన షష్ఠ్యంతములు వేయుట వింతగా గనఁబడుచున్నది ఈ గ్రంథము నన్నయభట్టకృతము గాదని తలంచుటకు నాకుఁగల కారణముల నిందు క్రింద సంగ్రహము దెలుపుచున్నాను.

(౧) నన్నయభట్టుకాలము మొదలుకొని యించుమించుగా తిక్కనకాలము వఱకునుగల కవులు తమగ్రంథమున కాదియం దొక సంస్కృత శ్లోకమును వేసి తరువాత తెలుఁగు పద్యములను వేయుట యాచార మయి యున్నది. నన్నయభట్టాది పర్వము మొదట

"శ్రీవాణీ గిరిజా శ్చిరాయ దధతో వక్షోముఖాంగేషు యే"

* * * *

భూయాసుః పురుషోత్తమాంబుజభవశ్రీకంధరా శ్శ్రేయసే"

అను శ్లోకమును వేసెను ఆ కాలములోనే యున్న * పావులూరి మల్లన్న తన గణితశాస్త్రమనందు మొదట

(* పావులూరి మల్లన్న 12-వ శతాబ్దివాఁడని విమర్శకుల యాశయము. ఆయంత మతని చరిత్రమున వివరింపఁబడును.)

"శ్రీకంఠం సగుణం సమస్తజగతాంకర్తార మీశం గురుం
భూతో హానలసోమచంద్ర సూర్యపవనవ్యోమాత్మమూర్తిం విభుం
నిత్యానందమయోపయో గిరిజయా సార్ధం ప్రజావృద్ధయే
మాయాయోగ ముపైతి తం శివకరం వందే శివం శ్రేయసే"

అను శ్లోకమును వేసెను. కావ్యాలంకారచూడామణిని రచియించిన విన్నకోట పెద్దన్న తన పుస్తకముమొదట

"శ్రీవాగాస్పదయోః పరస్పరయుజోః శ్రుత్యుత్సవశ్లాఘయోః
రాగాలాపనిరూఢయో ర్యతిగణవ్యాపారపారీణయోః
సారస్యంగిరిజేశయో రివ సదా సంగీతసాహిత్యయో
ర్విద్వద్విశ్రమహేతుకం విరహతాం చాళుక్యవిశ్వప్రభౌ."

అను శ్లోకమును వేసెను. తిక్కన తన నిర్వచనోత్తరామాయణము మొదట

శ్రీరాస్తాం మనుమక్షితీశ్వరభుజాస్తంభే జగన్మండల
ప్రాసాదస్థిరభారభాజి దధతీసా సాలభంజీ శ్రియమ్
శుండాలోత్తమగండభిత్తిషు మదవ్యాసంగవశ్యాత్మనాం
యాముత్తేజయతేతరాం మధులిహా మానందసాంద్రా స్థితిః"

అను శ్లోకమును వేసెను. ఇట్లుండగా చాముండికావిలాసమునం దాదిని సంస్కృతశ్లోకము లేకుండుటచే నది నన్నయకాలపుది కా దనుట స్పష్టము.

(౨) నన్నయభట్టుకాలమునం దాచారములో లేని షష్ఠ్యంత పద్యము లిందుండుట.

(౩) నన్నయ్యభట్టుకాలమునందు విశేషముగా వాడఁబడుచుండిన మధ్యాక్కర మొదలగు పద్యము లిందు లేకపోవుట.

(౪) నన్నయ సీసపద్యములకంటె భిన్నవిధమైన సీసపద్యము లిందుండుట. నన్నయ సాధారముగా తన సీసపద్యమును వడితో నారంభించిన పక్షమునఁ

దుదవఱకుమ వడులనే పెట్టియు, ప్రాసముతో (ప్రాసయతితో) నారంభించిన పక్షమునఁ దుద వఱకును ప్రాసములనే పెట్టియు, ఉన్నాఁడు. దీని కొక్కొక్కలక్ష్యమును జూపెదను

వడిసీసము.

సీ. అడవిలో నేకాంత మతిఘోరతపముమై
నున్నమా గురులపై సురగళవము
వైచుట విని యల్గి వారి తనూజుండు
శృంగి యన్వాఁడు కార్చిచ్చువంటి
శాపంబు నీ కిచ్చె సప్తాహములలోన
నా పరిక్షితుఁడు నా యలుకఁ జేసి
తక్షకువిషమున దగ్ధుఁ డయ్యెడు మని
దానికి గురులు సంతాప మంది

భూతలేశ ! నన్నుఁ బుత్తెంచి రిప్పుడు
తద్భయంబు లెల్లఁ దలఁగునట్టి
మంత్ర తంత్రవిధు లమర్చి యేమఱకుండు
సది నిరంతరంబు నవియుఁ గఱప. (ఆ. ౧-౧౮౧)

ప్రాస సీసము

సీ. పాండు కుమారులు పాండుభూపతిపరో
క్షంబున హస్తిపురంబునందు
ధృతరాష్ట్రునొద్ద దత్సుతులతో నొక్కటఁ
బెరుఁగుచు భూసురవరులవలన
వేదంబులును ధనుర్వేదాది విద్యలుఁ
గఱచుచుఁ గడలేని యెఱుకఁ దనరు
చున్నఁ దద్విపులగుణౌన్నతి సైపఁక
దుర్యోధనుండు దుష్కార్య మెత్తి

దుర్జయమున శకుని కర్ణ దుశ్శాసనుల్
గఱపఁ బాండవులకు నఱయ చేయఁ
గడఁగె బాండవులును గడు ధార్మికులు గానఁ
బొరయ రైరి వారిదురితవిధుల. (ఆ ౩-౧౨)

పయి రెండు సీసపద్యములును జదివినచో నాది పర్వము ద్వితీయాశ్వాసము లోని మొదటి దానియందు మొదటినుండి కడవరకును వడులే యుండు టయు. తృతీయాశ్వాసములోని రెండవ దానియందు మొదటినుండి కడవర కును ప్రాసములే యుండుటయు, మీరు కనిపెట్టి యుందురు. నన్నయ భట్టారకుని సీసపద్యము లిట్లుండగా, చాముండికావిలాసములోని సీసపద్య ములు వడిప్రాససంకరము లయి యుండునట్లు మీరీ క్రింది సీసపాదముల వలనఁ దెలిసికోవచ్చును.

సీ. పా. ఇష్టదేవాళి సంతుష్టత సేవించి
మంత్రాధిదేవత మదిఁ దలంచి—ఆ౧౨ పద్యము ౫.

సీ. పా. ఘోరంబులైన యాకారము ల్గను నట
భయపడి భీషణబాహుయుద్ధ—ఆ ౨౨ పద్యము ౫.

నన్నయ నియమమునకు కేవల విరుద్ధముగా పయి సీసపాదములు పూర్వార్ధ మునందు ప్రాసమును, ఉత్తరార్ధమునందు వడిని, కలవిగా నున్నవి.

(౫) రాజమహేంద్రవరపు తెలుఁగును గాక దత్తమండలములలో వాడు కలో నున్న "బుద్ధి బుద్ధీ" త్యాది పదప్రయోగములను దరచుగాఁ గలిగి యుండుట—

౧. దేవా! బుద్ధిబుద్ధి మహాప్రసాదంబనియట్లనే యొనర్చెదము. ఆ౨., ౪౦.
౨. తల్లీ! బుద్ధిబుద్ధి మహాప్రసాదంబ నీ యాజ్ఞాధారకులము ఆ ౩. ౧

(౬) ఒక వర్ణమును జేయునప్పుడు దానికి ముందు క్రొత్తగా నేఁటికి యిఱువది సంవత్సరముల క్రిందట చెన్నపురినుండి వచ్చిన యక్షగాన రూపకము లయిన ప్రహ్లాదాది నాటక పుస్తకములయం దుండిన రీతిగా "ఎట్టు లనిన" "ఎట్లుంగి ననిన" లోనగు పదప్రయోగములను జేయుట.

౧ "ఒకయాడుఁబడుచు పుట్టె నెట్టు లనిన.

సీ.　ఘనకరాళవరాస్యగహ్వరంబులు గల్గి
　　　పరఁగు చతుశ్శీర్ష పంక్తిమెరయ

*　　*　　*　　*

రూప మైనట్టి పడుచును రూఢి గాఁగఁ
దాము దర్శించి పూర్వంబు దలఁచి తలఁచి" ఆ. ౨., ౨౧.

౨. అట్టి దానియందు మహాశక్తి యుదయించి వచ్చె నెట్లనిన,

ఉ. భీకరసింహ వక్త్రములు పేర్మిఁ జతుష్టయ మొప్పుచుండఁగా
లోకభయంకరంబు లయి లోచనముల్దనరారఁ బాటల
ప్రాకటవర్ణము ల్గలిగి భాసిలి మీఱుచు నాల్గు హస్తముల్
వీఁక నెసంగఁగా నపుడు వీరమహాద్భుత శక్తి చెల్వుగన్." ఆ. ౩., ౩.

౩. "తా మంతఃపురంబులకు బోయి రెట్లుంగి ననిన,

వ. వదలిన కేశబంధములు వక్షువగుబ్బల మీఁది హారముల్
చెదరిన కుంకుమంబులును జెక్కుల వ్రాసిన పత్రవల్లులున్
బిదిలిన నీవిబంధములు విశ్లథమైన ముసుంగు లెంతయుం
గదలఁగ వేమముఁడుచుఁ గాంచిలు పోయి గృహాంతరంబులన్."

ఆ ౩, ౨౨.

చాముండికా విలాసములోని మూఁడాశ్వాసములలోను ప్రథమాశ్వాసమునం దాఱువేల వారియొక్కయు. నందవరీకుల యొక్కయు వృత్తాంతమును,

ద్వితీయ, తృతీయాశ్వాసములయందు తొలగు కులమువారనఁ బడెడి దేవాంగుల కథయు చెప్పఁబడినవి. ఇందు మొదటి యాశ్వాసమునందు ౫౪ పద్యములును, రెండవ యాశ్వాసమునందు ౫౦ పద్యములును, మూఁడవ యాశ్వాసమునందు ౩౦ పద్యములును మొత్తముమీఁద పుస్తకమునందు ౧౩౫ పద్యగద్యము లున్నవి. "ఇది శ్రీసకల భాషావాగను శాసన శ్రీ నన్నయభట్ట విరచితంబైన చాముండికావిలాసంబునందుఁ బ్రథమాశ్వాసము' అనియు, "ఇది శ్రీసకల సుకవిజన శ్రేష్ఠ నన్నయభట్ట విరచితంబైన చాముండికావిలాసంబను మహాప్రబంధంబునందు ద్వితీయాశ్వాసము' అనియు "ఇది శ్రీసకల కవి బుధవినుత సర్వవిద్యా విచక్షణ నన్నయభట్ట విరచితంబైన చాముండికావిలాసం బను మహాప్రబంధంబునందుఁ దృతీయాశ్వాసము అనియు, ఆశ్వాసాంత గద్యములు వేఱువేఱు విధముగా నున్నవి పయిని జెప్పఁబడిన హేతువులనుబట్టి విచారింపఁగా నీ చాముండికా విలాసమును నూఱు సంవత్సరముల క్రిందట దత్తమండలములలోని నందవరీకు లెవ్వరో నన్నయభట్టు పేరుపెట్టి రచించినట్టు నాకుఁ దోఁచుచున్నది కర్నూలులోని చంద్రమౌళీశ్వర ముద్రాయంత్రములో ౧౯౧౬వ సంవత్సరమునందు ముద్రింపఁబడిన "చౌడేశ్వరీ విలాస" మను పుస్తకమును నేను గొన్ని దినముల క్రిందటఁ జూడ తటస్థించినది. ఈచౌడేశ్వరవిలాసము సరిగా చాముండికావిలాసమే; చాముండికావిలాసమని యున్నచోట్లనెల్ల చౌడేశ్వరీ విలాసమని మార్చఁబడి యుండుట తప్ప భేదమేదియు లేదు. వ్రాఁత పుస్తకమునందువలెనే యచ్చుపుస్తమునందును తప్పులు కుప్పలుగా నున్నవి. ఇది నన్నయభట్టు కవిత్వ మగునో కాదో తామే నిర్ణయించు కొనఁగలుగుట కనుకూలముగా నుండునని యీ రెండు పుస్తకములనుబట్టి సవరించి నందవరచరిత్రము నిందు క్రిందఁ బొందుపఱుచుచున్నాను.

"............ . .సోమవంశసంభవుండైన నందచక్రవర్తి యన్మహారాజ శ్రేష్ఠుండు నందవరపురంబున సకల ధర్మాభిజ్ఞుండై సర్వవేదవేదాంగ

పురాణేతిహాసార్థజ్ఞ కౌశలమనీషావిరాజిత మహాయశుండై యొక్కనాఁడు విబుధకవిగాయక సారకమాగధవంది బృందసమేతంబుగాఁ బేరోలగం బున్నసమయంబున. 26.

సీ. వెన్నెల నదలించి విఱ్ఱవీఁగు విభూతి
పూఁత శృంగారమై పొల్పు మీఱ
మహనీయదండ కమండలంబులు హస్త
పద్మంబులను రూఢిఁ బరిఢవిల్ల
మేఘంబులో నుండు మెఱుపుఁదీగలరీతిఁ
బరఁగుచుండెడు జటాపంక్తి మెఱయ
సిద్ధౌషధంబులఁ జెలువొందు కంథయుఁ
గాషాయ వస్త్రము ల్గరిమఁ జెలఁగఁ

గీ. జూపరులకు నద్భుతంబుగఁ జూచుచుండ
నాకసంబుననుండి తా నతిముదమున
వచ్చి తపసునిభంగి సభాస్థలంబుఁ
జేర వచ్చెను నపు డొక్క సిద్ధయోగి.

వ. వచ్చిన నాశ్చర్యానందభయభక్తి సమేతుండై దిగ్గన లేచి యెదుర్కొని జాంబూనదరత్నమయ సింహాసనమున సుఖాసీనుంజేసి యర్ఘ్యపాద్యంబు లొసంగి తత్పాదోదకంబు శిరంబున నిడుకొని పుణ్యశరీరుండునై తి దేవా మీరు వేంచేయుటకు నిమిత్తం బెయ్యది యది సవిస్తరంబుగ నానతీయుం డని విజ్ఞాపన పూర్వకంబుగాఁబలికిన నమ్మహాసిద్ధ లోకేశ్వరుం డిట్లనియె.28

మ. కమనీయాత్ములఁ జూచి తెంతయును నే గాళింగకాంభోజమ
త్స్యమహారాష్ట్ర పుళిందహూణ శకవంగాంగాదిభూమీశులన్
క్షమలో వారలు నిన్నువంటి సుగుణస్థైర్యాధికు ల్గారు నిన్
గొమరొప్పన్మరి గంటి సంతసిలి నీగోష్ఠంతయుం జూచితిన్. 29.

వ. నీవు పుణ్యాత్ముండవగుటం జేసి నీకు రేపటినుండి వారణాసియందు [illegible] స్నానంబు చేకూరంగలది యని యభిమంత్రి [illegible] నొసంగి నీ వర్ధరాత్రంబున మేల్కాని యాచమనంబుచేసి దృఢభక్తి నొక్కసారి యీ మంత్రంబు పరియించి మనస్సున గంగాతీరంబునం బుణ్యస్థలంబున నుండవలయు మంత్రాధి దైవతంబా! యవిధ్యానంబుఁజేర్చి నేత్రంబులు మోడ్చి క్షణమాత్ర ధ్యానంబుచేసి నమస్కరించి ముహూర్తమాత్రంబునకుఁ గన్నులు విచ్చి చూచిననంతఁ గాశియందు నీ మనస్సంకేతిత పుణ్యస్థలంబునందుఁ బ్రవేశంబైయమ్మహాగంగాప్రవాహినియందు సుస్నాతుండవై యచ్చటి వేదవేదాంగ శాస్త్రపురాణపారంగతు లయిన భూసురోత్తముల కనేక స్వర్ణముద్రిక లొసంగి వారలచే నాశీర్వచనంబులఁ బుచ్చుకొని మగుడ నీ పురంబునకు వచ్చి నిత్యం బీరీతి నొకండవె పోయి వచ్చుచు సకల ధర్మంబు లాచరించుచు విప్రోత్తములకు షోడశదానంబులు చేయుచుఁ బుణ్యాత్ముండవై యుండు, మిందుల కనృతంబు రాదీ వాక్యంబమోఘం బని యవి యొసంగి యతండు తిరోహితుండయ్యె నంతట 38

మ. అతఁ డాశ్చర్యముతోడ దారుమయమౌ నప్పాదుకాద్వంద్వ మా
తతభక్తిం గయికొంచుఁ బూర్వకృత విస్తార ప్రపుణ్యంబు నం
చితమై కన్పడురీతి నీతఁ డెవడో సిద్ధేంద్రుఁ డత్యంత స
మ్మతితో న న్గరుణించి యిచ్చె నవి నమ్మన్వచ్చుఁ జిత్తంబులోన్

వ. అని మనంబున వితర్కించుకొనియే నీ మేటిమంత్రంబు పరియించిన నిదర్శనంబు గనిపించెనేని సులభంబున గంగాస్నాన ఫలంబు లభియించు నని విచారం బొనర్చుకొని యున్నయంతమధ్యాహ్నంబున గగనమధ్యంబున దినమణి ప్రకాశమానుండయ్యె నట్టియెడ సమీప స్థితులైనవారలు దేవా! స్నానంబునకు వేంచేయవలయునని విన్నవించిన లేచి సకల సామంత కవి గాయకాది సభాస్థితులైన వారలను గృహంబులకుఁ బొండని యనుజ్ఞ యొసంగి తానును గృహాంతరంబునకు వచ్చి జలంబులాడి ధౌతవస్త్రధరుండై

వేళొక సద్మంబున నూర్ధ్వ పుండ్రాలంకృతుండై మధ్యాహ్న విహిత సంధ్యాతర్పణాదికాలోచితకృత్యంబు లనిర్వర్తించి [illegible] నేఁగిపత్నీకరపచనంబైన షడ్రసోపేతంబైన [illegible] బారగించి లేచి ప్రక్షాళిత గదనకర పదుండై [illegible] యొక్క విహిత స్థలంబున గూర్చుండి జాంబూనద [illegible] యావికాసినాగ వల్లీదళంబును మౌక్తిక చూర్ణసమే[illegible] మెసవి ముహూర్తంబు వామభాగంబున శయని[illegible] నిద్రించి మగుడి లేచి యాస్థానమండపంబునకుం [illegible] ప్రొద్దు పుచ్చుచున్న యెడ నీ రాజురాక [illegible] వేగఁ గాశికిం బోయి తత్తంవాసులకపు యేగనో యపుఁ [illegible] నంతర్ధానంబునొందె. సంధ్యారాగా క్రాంత విచిత్రంబైన గగనంబునందు నక్షత్రంబులు గననయ్యె; నంత జంద్రుండు పూర్వదిగ్భాగంబున నుదితుం డయ్యె. ధాత్రీవుండు కొలువు చాలించి సదనంబునకేగి భోజనంబు చేసి యెప్పు డెప్పుడని తిమురుమ శయ్యపై యవళించి [illegible] పాదఘట్టనం బొనర్ప నీషన్నిద్రాభరంబున మేల్కాంచిదిగ్గనలేచి ప్రభాతంబయ్యెనోయని తలంచి బహిరంగణంబులకువచ్చి నక్షత్రదర్శనంబు సేసి ప్రహరత్రయంబగుట నికాయంబునకుం బోయి నిష్కాది ద్రవ్యం బనేకంబు గ్రహించి యా సిద్ధోక్త ప్రకారంబుగా నాచమనీయం బొనర్చి యర్ధ నిమీలితలోచనుండై తన్మంత్రపఠనం బొనర్చిన విశ్వేశ్వరమాధవకుండిదండపాణిభైరవ విరాజితం బైన వారణాసిం జేరి తద్గంగాతీరంబున సూర్యోదయం బగుటయు మదీయ పూర్వపుణ్యఫలంబని యత్యంతాశ్చర్యంబునొంది కృతస్నానుండై సంధ్యాద్యనుష్ఠానంబులు నిర్వర్తించి తత్తీరస్థితులైన మేదినీ నిర్జరులకు బహుసువర్ణ ముద్రిక లొసంగి వారివలన నాశీర్వచనంబులు గైకొని మగుడి యొక్క రహస్య స్థలంబునకు వచ్చి పావలు మెట్టి కన్నులు మొగిడ్చి మంత్రపఠనం బొనర్చి తన పురంబునకు వచ్చి యథాప్రకారంబున నొరులకు దేటపడకుండ వర్తింపుచు నిట్లు బహుదినంబులు సంతోషంబున నుండె నొక్క దినంబున స్నానప్రయాణంబు చేయుచున్న పతిం జూచి,

గీ. ఏకళయ్య యందు జోకతో శయనించు
[illegible] కిగేమి
మాయయో యటంచు మన్ననతోడ నా
తనికి నిట్టు లనియె వినయమునను. 33

వ. నిరంతరం బరుణోదయపూర్వంబున నెక్కడ కేగెద వీ యాశ్చర్యం బేమి? యిది సవిస్తరంబుగాఁ దెలియఁజెప్పుమనిన నతఁడు దరహసితవద న [illegible] ఁగూడ దనియును గామినుల బుద్ధులు నమ్మరాదనియును బెక్కులైన నీతిమార్గంబులు చిత్తంబునఁదలపోసియేమియు ననక యూరకున్న నతనిభార్య యత్యంతానుకూలిని గావున నీతోడుతఁ పుణ్యపాపంబులకు బాధ్యనైన నన్ను నిర్దయ చేయుట ధర్మంబే? ప్రాణ వల్లభా! యని బహువినయోక్తులఁ బలికిన నతండు ప్రత్యుత్తరంబుతోఁచక యుండి యెట్టకేలకు నిట్లనియె,

గీ ఎవ్వరికిఁ జెప్పరాదు సుమీ రహస్య
మిదియు నీ కెఱిగిఁనెద నిష్టమునను
సిద్ధవర్యుఁ డొక్కఁడు కాశీస్థలంబు
నందు స్నానం బొనర్పు మం చతిశయముగ. 35

వ. మంత్రంబు చెప్పి యిప్పావలొసంగి చనియె, నాఁటనుండియు గాశికిం బోయి గంగ నాడి వచ్చి సుఖంబుగా నుండినవాఁడ నిప్పుడును దత్కార్యార్థినై పోయి వచ్చెద ననిన 'నన్నెడఁబాసి పోవుట నీకు ధర్మంబగునే? యని బహుకరినోక్తులు పలికి వచ్చెదననిన నతండు కూడదని పల్కి వినక పోవ నేమగునో యని తలంచి యరుణోదయ సమయం బగుటయు భార్య తోడన మంత్రపఠనం బొనర్చి నిమిషమాత్రంబున వారణాసీస్థలంబుఁ జేరి జలంబులాడి విప్రులకు ననేక దానంబులొనర్చి శీఘ్రంబున మగిడగమనంబు దలంచుచున్న సమయంబున. 36

గీ. పొల్పుగాఁ దీరమున శుచిర్భూతయైన
యతనిసుందరి పుష్పిణియై ప్రియుండు
వినిన నే మనునో యని ప్రేమ దక్క
పిలిచినను బల్కకుండెను ప్రియునితోడ. 37

వ. అది యెఱుంగక యా రాజు సమీపంబునకు వచ్చి పోదము లెమ్మన్న నేను పుష్పవతినైతినని సదరహసితభయంబుగఁ బలికిన విని గుండె జల్లన ధరిత్రీపతి రాజ్యంబుపరుఁ లాక్రమించుటకు సమయంబయ్యె నిక్కడ నాల్గు దినంబులునికికి హేతువయ్యెగదా యని చింతించుచున్న యతనిం జూచిఁ యక్కడ నుండెడు బ్రాహ్మణు లిట్లనిరి. 38

గీ. నీదుభార్య పుష్పిణియైన నిత్యదోష
మెల్లఁ బరిహార మొనరించి మేము శీఘ్ర
ముగను బరిశుద్ధఁ జేసెద మొగిని మాకు
నేమి యొసఁగంగఁ గలవాఁడ వీవు చెపుము 39

వ అనిన మీర లీ దివసంబున నన్ను నా కాంతతోఁ గూడఁ పురంబు ప్రవేశింపఁ జేసితిరేని మీకు నా రాజ్యంబులో నర్థంబు నొసంగి యుండం జేసెదనవిన వారలు నట్ల కాక యని యమ్మహాస్థలంబున నదీతీరంబున నుండెడు చాముండికయును నద్దేవాలయంబున నుండెడు నర్జున మాలూర వృక్షంబులును సాక్షులని ధర్మంబుగాఁ బలికి వారలు రాజకాంతను గంగాతీరం బున గూర్చుండ నియమించి చతుర్వేదంబుల యందలి మహామంత్రంబులు పఠియించి తద్భామిని కుదకంబు దేహంబున బ్రోక్షించి స్నానంబులొనరించి యా మంత్రంబునఁ బరిశుద్ధంజేయ శుద్ధియైన యత్తన్వి నతనికిం జూపిఁ తోడ్కొని పురంబునకుం జనుమనిన నతండుసంతుష్టాంతరంగుండై మునుపు వచ్చినయట్లు నిజపత్నితోడఁ పురంబు ప్రవేశంబై నాఁటనుండియు నిది మోసం బని గంగాస్నానంబు విసర్జించి తచ్చింతాంతరంగ మగ్నుండయి యుండెఁ గొన్ని సంవత్సరంబు లరగిన గాశియందు దుర్భిక్షంబు వచ్చిన

బ్రాహ్మణులకన్న వస్త్రంబులు లేక కఠినదినంబు లొంఎవినఁ బూర్వఁబున నంవవరంబున నుండి నందచక్రవర్తి యను విశ్వంభరేశ్వరుండువచ్చి చిక్కు-పడి యిచ్చిన మాట దలంచి తద్భామాదోషనివారకులైన వారం లార్వేలేనూటికి నా దేశంబునకుఁ బోద మా భూమీశుం డర్ధరాజ్యంబు నొసంగం గలవాఁడని యన్యోన్యంబుగా ననుకొని యమ్మహాస్థలంబు వెడలి కతిపయదినంబులకుఁ జేరవచ్చి యతనికిఁ దమరాక యెఱింగించిన నతండు విని దీనికి సాక్షులం దోడ్కొని రావలయుననిన వారలు "దురాత్మా ! చాముండికాసమీపంబున నీ వాడినమాట లేదనిన నమ్మహాశక్తి యధర్మంబు పల్కు-నే తోడితెచ్చెదము తదనంతరంబ యర్థదేశం బిత్తువుగాక" యని కోపంబున మగిడిపోయి రందుఁ గొందఱు విప్రులు మనముపోవుట యెట్లు ! తచ్ఛక్తి వచ్చుట యేలాగున మేమార్వేలవార మీదేశంబుననె యుండెదము మా యదృష్టం బుండునట్లు కాఁగలదని మగిడి వచ్చి దక్షిణదేశంబున వృత్తులు నుద్యోగం బులు ననుసరణ పూర్వకంబుగా సంపాదించు కొనిరి తక్కి-న యేనూఱు గురు విప్రులు నభిమానంబునఁ బోయి కాశిఁ బ్రవేశించి చాముండికా సమీపంబున బహు తపం బొనర్చిన నద్దేవి కరుణించి వరం బొసంగెద వేఁడు డనిన వారలు దుష్టాత్ముండైన రాజు పూర్వంబున నీ ముందట నిచ్చిన మాట మాకొసంగడయ్యె నట్లు గావున నీవు స్వస్వరూపంబున వచ్చి మా కర్థరాజ్యం బొసగునట్లుగాఁ జేయవలయుననిన నేను బహుదినంబుల నుండి యీ పుణ్యస్థలంబున వసియించుదాన నెట్లు రావలతునని చింతించి మీ ఘోర తపంబునకు మెచ్చితి నింకేమి చేయుదునైనఁ బోదము లెం డనవుడు వార లమ్మహాశక్తినింద్రదుబిల్వ వృక్షసహితంబుగా దోడ్కొ-ని వచ్చి నంద పురంబునకు నర్ధక్రోశంబున నిల్పిన నా శక్తి యా దుష్టుని దోడ్కొ-ని రమ్మనిన వారలు వచ్చి 'పాపాత్మా శక్తి నిన్ను రమ్మని నియమించె, నీ గ్రామసమీపంబునకు వచ్చిన' దనిన విని సంతసిల్లి యతి త్వరతోడ వచ్చి యా దేవికి సాష్టాంగదండ ప్రణామంబు లాచరించి.

గీ. నేఁడు నానోము ఫలియించె నిక్కముగను
నేఁ గృతార్థుండ నైతి నిన్నిపుడు చూచి
నన్నుఁ బ్రోవుము నాతల్లి నిన్ను భజన
చేయుచుండుదు నేవేళఁ జిత్తమునను. 41

వ. అని బహుస్తోత్రంబు లొనర్చి మీరిందు వసియింపవలయు, వీరల కర్ధ రాజ్యం బొసంగెద; గంగాస్నానంబునకు వచ్చి బహుప్రయాసంబు నొం దుట మీకుఁ దెలియుంగదా యని నాటనుండి రాకుండితి మీ దర్శనం బపే క్షించి యీ బ్రాహ్మణులతో నన్నృతంబు పలికి మిమ్ముం దోడ్కొని రం డనిన సమర్థులైన వార లగుటంజేసి మిమ్ముం దోడ్కొనివచ్చి రది కారణం బుగ మీర లీ స్థలంబునన యునికి యొనర్ప వలయునని బహుభంగులఁ బ్రార్థించినఁ బ్రసన్నయై యమ్మహాశక్తి యట్లగాక యనియె దక్షిణంబున వారల కర్ధరాజ్యం బొసంగి నందపురంబు నొసంగి తాను దగ్రామంబునకు నిమిత్తమాత్రుండై చాముండికా దర్శనంబు నిరంతరంబును జేసికొనుచు సంతోషంబున నుండె, నంత నవ్విప్రులు నందవరం బగ్రహారంబుగా వరించుట నందవరీకులను సంజ్ఞగలవారలైరి; మున్ను వారి వెంబడిం బోక నిల్చిన వార లార్వేల వారనం దగిరి.''

పయి నుదాహరింపఁ బడిన పుస్తకభాగమునుబట్టి యొక్కొక్క చిన్న పద్య మును, పద్యమునకుఁ దరువాత బెద్దవచనమును నుండుచు వచ్చినట్టు చదు వరులు తెలిసికొని యుందురు. ఈప్రకారముగానే పుస్తకమంతయు నత్యల్ప పద్యభాగముతోడను నత్యధిక గద్యభాగముతోడను గూడి యున్నది.

నన్నయభట్టారకుని గూర్చి-

శ్లో॥ వాచాం మాంధ్రమయీనాం యః
ప్రవక్తా ప్రథమోఽభవత్
ఆచార్యం తం కవీంద్రాణాం
వందే వాగనుశాసనమ్ ''

అను శ్లోకము పండితులలో పరంపరగా వాడఁబడుచున్నది.

* * *

# నారాయణభట్టు

నారాయణభట్టు భారత రచనమున నన్నయభట్టునకు సాయపడెనని 'పాయక పాకశాసనికి' అను పద్యము వలనఁ దెలియుచున్నది. ఆ పద్యము కొన్ని ప్రతులలోఁ గానరాదని చెప్పిన వారుకూడా నన్నయ రచించిన నందమపూఁడి శాసనమును బట్టి నారాయణభటు నన్నయ సమకాలీనుఁ డనుట నంగీకరింతురు.

నారాయణభట్టు కుమార్తె కుపమ దాక్షారామ భీమేశ్వరున కఖండదీపమునకై లోహపు దివియ నొసంగి క్రీ శ. 1050 లో నొక శాసనము వేయించెను. దానింబట్టి నారాయణభట్టు క్రీ. శ. 1044 మొదలు 1058 వఱకును కల్యాణ కటకము నేలినవాఁడును, త్రైలోక్యమల్లాది బిరుదాంకితుఁడును అగు ప్రథమ సోమేశ్వరునివద్ద ప్రధానిగా నుండినట్లు తెలియుచున్నది. ఈ యంశమును కీ. శే. శ్రీకొమర్రాజు - వేంకట లక్ష్మణరావుగారు మున్నగువారు తెల్పియున్నారు.

నారాయణభట్టు త్రైలోక్య మల్ల సోమేశ్వరుని ప్రధానియేయైనచో. ఆ ప్రభువుని సామంతుండగు రాజరాజువలన దానమును పరిగ్రహింపనేల? యనియు, కావున ప్రధాని నారాయణభట్టును, నన్నయ సహాధ్యాయుఁడును విభిన్న వ్యక్తులనియు—'ఆంధ్రకవితరంగిణి' కారులు విపులముగఁ దెల్పియున్నారు. [పుట 138]

కర్ణాటభాషలో 'రెట్టమతము' ను రచించిన రెట్టఁడను కవి తన గ్రంధమునకు నారాయణభట్టు రచించిన గ్రంథ మాధారమని చెప్పెనఁట! ఈయంశము—అయ్యల భాస్కరకవి రచించిన 'రెట్టమతశాస్త్రము' నందలి ఉదిత కీర్త్యాఖ్యచే నొనరు నారాయణ భట్టమతంబును' అనుదానివలనఁ దెలియుచున్నదఁట! [చూ. ఆంధ్రకవితరంగిణి—పుట 139]

# మల్లియ - రేచన

భీమకవి కృతిగాఁ బ్రసిద్ధిచెందిన 'కవిజనాశ్రయ'మను ఛందోగ్రంథమును రచించినవాఁడు మల్లియ రేచన. కవిజనాశ్రయము ప్రథమలక్షణగ్రంథ మని పండితలోకమునఁ బ్రసిద్ధము. ఇయ్యది వేములవాడ భీమకవి కృతి కాదని 'వేములవాడ-భీమకవి' చరిత్రమున వివరింపఁబడును.

భీమకవి కాలము నిర్వివాదముగ క్రీ. శ. 1150-1180 ప్రాంతముగ స్పష్టపడి యున్నది. కవిజనాశ్రయము క్రీ. శ 1100 ప్రాంతమందలిది.

కవిజనాశ్రయమునందలి భాగములగు 'అధికారము'ల గద్యలయందు 'ఇది శ్రీవాదీంద్రచూడామణి చరణ సరసీరుహ మధుకరాయమాన ..'' అని యున్నది. ఈ 'వాదీంద్రచూడామణి' అను జైన సమయాచార్యుని, నన్నెచోడమహాకవి రచించిన కుమారసంభవమునకుఁ గృతిపతియైన జంగమ మల్లికార్జునయోగి వాదమునందోడించినట్లు 'పరవాదీంద్రఘనాఘనానిలు' అను పద్యపాదము [కుమార. ౮-౧౯౮] ధ్వనించుచున్నదనియు, కుమారసంభవమునఁ గవిజనాశ్రయపుటనుసరణములు కానవచ్చుచున్న వనియు 'తెనుఁగు కవుల చరిత్ర' (పుట 171) లోఁ గలదు. * నన్నెచోడుఁడు 1130-40 ప్రాంతమువాఁ డగునప్పుడు కవిజనాశ్రయము 1100 ప్రాంతము ననే వెలసినదని చెప్పుటకు వీలు కలుగుచున్న' దని ఆ పుటయందే శ్రీ వేంకటరావుగారు తెల్పియున్నారు.

ఈ క్రిందియంశము 'తెనుఁగు కవుల చరిత్ర' ననుసరించియే తెలుపఁబడు చున్నది.

'అఱవభాషలో 12 వ శతాబ్దికిఁ బూర్వమే 'యాప్పిరుంగలమ్ కారికై' అను లక్షణగ్రంథము ప్రసిద్ధమైయున్నది. ఇందు అఱవమునందలి ఛందోగ్రంథ

* కుమారసంభవమున నవమాశ్వాసాంతమున నున్నట్లు 'తెనుఁగు కవుల చరిత్ర' లోఁ గలదు. కాని యిది అందలి ౧౦వ ఆశ్వాసమున 197 వ పద్యముగాఁగలదు.

ములే కాక కర్ణాటాంధ్రచ్ఛందోగ్రంధములను పేర్కొనఁబడినవి. అందు "రేచియార్ శెయ్‌ద వడుగచ్ఛందము' కలదు. ఇది కవిజనాశ్రయమే! ఈయంశమును కీ శే. శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారే తొట్టతొలుత ఆంధ్ర లోకమున తెలుకపఱచిరి.

క్రీ. శ. 990 ప్రాంతములో నుండిన కన్నడకవి నాగవర్మ రచించిన 'ఛందోంబుధి' కిని, కవిజనాశ్రయమునకును పెక్కు పోలికలు కలవు కావున 'ఛందోంబుధి' ననుసరించి కవిజనాశ్రయము రచింపఁబడిన దనవచ్చును. ఇందలి పద్య మొకటి మదికి-సింగన కూర్చిన 'సకల నీతి సమ్మతము' లో నుదాహరింపఁబడినది సింగన క్రీ. శ. 1400 ప్రాంతపువాఁ డగుటచే నియ్యది తత్పూర్వమనుటలో సందేహమేలేదు. 'యాప్పిరుంగ లమ్ కారికై లో నిది పేర్కొనఁబడుటఁబటి, కవిజనాశ్రయము క్రీ. శ. 1100 ప్రాంత మందలిదని నిర్ణయింపవచ్చును.

కవిజనాశ్రయుఁడు మలియ రేచన, విమల యశోభాసుర చరితుఁడు, భీమనాగ్రసుతుఁడు సహాయుఁడుగా నీ కవిజనాశ్రయమును రచించినట్లు స్పష్టముగఁ గలదు.

# గోకర్ణదేవుఁడు

గౌరన, అప్పకవి మున్నగువారిచేఁ బేర్కొనఁబడిన 'గోకర్ణచ్ఛందస్సు'ను రచించిన గోకర్ణదేవుఁడు—చోడవంశపురాజు. గోకర్ణదేవుని పేరిట నొక శాసనము కలదు. ఆశాసనమును నిల్పినవాఁడును, ఛందస్సుకర్తయు నభిన్నులనియే అందఱు నంగీకరింతురు. పయి ఛందో గ్రంథములోని 'భాస్కర కులవిలసితవార్ధిచంద్ర! గోకర్ణనృపా!' అను పద్యభాగము పయి యభిప్రాయమును దృఢపఱచుచున్నది. శాసనమునుబట్టి గోకర్ణ దేవుఁడు క్రీ. శ. 1127 ప్రాంతపువాఁడని స్పష్టమగుచున్నది.

గోకర్ణ చ్ఛందస్సులోని కొన్నిపద్యములు మాత్రము లభించినవి. వానిం బట్టి-కవిజనాశ్రయకర్తయగు రేచనవలెనే గోకర్ణదేవుఁడును తన్ను తాను సంబోధించుకొన్నట్లు తెలియుచున్నది.

ఈ గోకర్ణదేవుఁడే కవిజనాశ్రయకర్తయైనట్లు శ్రీ మానవల్లి రామకృష్ణ కవిగారును, కీ. శే. శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారును తలంచుట పొరపాటయి యుండవచ్చును.

# మల్లికార్జున పండితుఁడు

శైవమతవ్యాప్తి నొనర్చిన శ్రీపతి, మంచెన, మల్లికార్జున పండితులు ముగ్గురికిని పండితత్రయమని పేరు. ఆ పండితులలో నితఁడు మూఁడవ వాఁడు. గొప్ప మతసంస్కర్త. ఆంధ్రదేశమునందలి లింగధారుల మత సంప్రదాయముల కీతఁడే మూలపురుషుఁడు. ఈ మల్లికార్జునపండితుని చరిత్రను దెలిసికొనుటకు—ఈతని వెనుక 40 ఏండ్ల నాఁడుండిన పాల్కురికి సోమనాథుఁడు రచించిన 'పండితారాధ్యచరిత్ర' మను ద్విపదకావ్యమే యాధారము ఈ 'పండితారాధ్యచరిత్రము'నే శ్రీనాథమహాకవి క్రి శ. 14వ శతాబ్దిలో పద్యకావ్యముగా రచించినట్లు తెలియుచున్నది

మల్లికార్జునుఁడు గోదావరిమండలములోని దాక్షారామ భీమేశ్వరుని యర్చకుఁడగు భీమనపండితునకును, గౌరాంబకును పుత్రుఁడు. ఇతఁడు ఋగ్వేది యనియు, గౌతమ గోత్రజుఁడనియు "చతుర్మరనిర్ణయ' మను నొక సంస్కృతగ్రంథమునందుఁ జెప్పఁబడినదఁట! (చూ. తెనుఁగు కవుల చరిత్ర పుట 251) వానసవంశీయుఁడని పండితారాధ్యచరిత్రమున నున్నది. కోటిపల్లిలో నివసించుచుండిన 'ఆరాధ్యదేవర' యీతని గురువు. ఇతఁడు గురువునొద్ద శైవదీక్షఁ గైకొని, శైవమతరహస్యములను సాకల్యముగా గుర్తెఱిఁగి, శ్రుతిపురాణోక్తిసహితముగ శైవమత మహత్త్వమును ప్రచారము చేసెడివాఁడు. తాను శివపూజానియమమున నున్నను, జంగములు వచ్చినచో వెంటనే వారిని పూజించెడివాఁడు:

మల్లికార్జున పండితుఁడు సనదవోలు (చందవోలు) రాజగు వెలనాటి చోడుని సభలో మతాంతరుల వాదములను ఖండించి శైవమతమును నిల్పెనఁట! ఇతఁడు కల్యాణపురమున నున్న బసవేశ్వరునిఁ జూచుటకు కుటుంబముతోను, శిష్యులతోను బయలుదేరి దారిలో 'నిడుగుము' లనుచోటఁ దనశిష్యుఁడు దోనయ్యగారికి అన్నయైన వీరచాకి రాజయ్యగారిచే

గౌరవింపఁబడి పానుగంటికిఁ బోయెను. ఆ యూరి నపుడు 'ఉదయనుఁడు' పాలించుచుండెను. పింగళి గోవింద ప్రధాని యాతని మంత్రి. పండిత భక్తుఁడగు గోవిందుఁ డితనిని మిక్కిలి గౌరవించెను. ధవళేశు నామయ్య యను భక్తుఁ డీతని సేవలో మగ్నుఁడయి రాజసేవయందుఁ బ్రమత్తుఁడై తుద నాత్మహత్య చేసికొనెనఁట.

వనిపురమునఁ శంకరదాసయ్య యను భక్తుని పూజలు గొని ప్రయాణము కానుండఁగా, అంతకు ముందెనిమిది దినముల క్రిందటనే ఉపవేశ్వరుఁడు [illegible] మిక్కిలి దుఃఖించి పండితుఁడు శ్రీశైలమునకుఁ బ్రయాణమయ్యెను. తాను వెల్లటూరిలో నిలిచి తనశిష్యుఁడైన [illegible] గిరిప్రదక్షిణము చేసి, శివరాత్రికి శ్రీశైలమునకేఁగి, తనవ్రత పరిసమాప్తి నొందింపుమని కోరెను. అతఁడు తిరిగి వచ్చిన తర్వాత పండితారాధ్యుఁడు భార్యాపుత్రాదులతో లింగైక్యముఁ జెందెను.

ఈతని 'శివతత్త్వసారము'నకు విపులముగ నుపోద్ఘాతమును వ్రాసిన శ్రీ కొమఱ్ఱాజు వేంకట లక్ష్మణరావుగారే యీతని కాలమును నిర్ణయించిరి. క్రీ. శ. 1163--1189 నడుమనున్న వెలనాఁటి చోడుఁడు, 1162 ప్రాంతమున నున్న ఉదయావనీశుఁడు, 1171 ప్రాంతమున నుండిన బిజ్జలుఁ డితని సమకాలికులు. కావున నితఁడు 1120—1190 ల మధ్యకాలమున నుండవలయును.

మల్లికార్జున పండితుఁడు శివతత్త్వసారము, మహిమ్నస్తవము, మలహరణము, పంచగద్యలు, రుద్రమహిమ, శంకరగీత, రక్షోధ్వారము, నానాష్టకము తుమ్మెదపదములు, ఆనందపదములు, శంకరపదములు మున్నగు పెక్కు గ్రంథములను రచించినట్లు సోమనాథుని 'పండితారాధ్యచరిత్రము' వలననే తెలియుచున్నది. ఇతఁడు కన్నడమున 'గణసహస్రనామ' మను కావ్యము రచించెనని కన్నడకవిచరిత్రమునం దున్నది. కాని యిప్పటికి లభించిన దొక్క 'శివతత్త్వసారము' మాత్రమే.

ముద్రితమైన 'శివతత్త్వసారము'న 489 కందపద్యము లున్నవి. ఇందు వేయి పద్యము లుండియుండవలెనని కొందఱి యభిప్రాయము. 'శివతత్త్వ

సారము' కన్నడమునను గలదు. అందలి కొన్నిపద్యములు మద్రాసు ప్రభుత్వ ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారమువారు ప్రచురించుచున్న పత్రికలో (Vol II No. 1, 2. 1949) ప్రకటింపఁబడినవి [184 నుండి 491 వఱకు, 715 నుండి 740 వఱకును] కన్నడగ్రంథమునకు మూలము తెనుఁగు గ్రంథమని స్పష్టముగాఁ దెలియుచున్నది. ఈ గ్రంథమును బట్టియు తెలుఁగు గ్రంథములోని పద్యసంఖ్య సహస్రమై యుండవచ్చునని తోఁచుచున్నది.

పాల్కురికి సోమనాథుఁడు తన యనుభవసారములో సీతనింగూర్చి

'... ......... ......... .. శివతత్త్వ
సార గద్య పద్య సమితి శివుని
మహిమఁ దెలిపినట్టి మల్లికార్జున పండి
తయ్యగారిఁ దలఁతు ననుదినంబు'

అని చెప్పియున్నాఁడు. 'ఆంధ్రకవితరంగిణి' కారులు పైయంశము నుటంకించుచు 'పండితయ్య రచించిన శివతత్త్వసారము గద్య పద్యాత్మకమని యీ పద్యమునఁ జెప్పఁబడినది. కాని యాగ్రంథమున పద్యములేగాని గద్యలు లేవు' [రెండవసంపుటము-పుట 34] అని వ్రాసిరి కాని పయి పద్యభాగము 'మల్లిఖార్జునపండితయ్య శివతత్త్వసారమును, గద్యలను, పద్యములను రచించె' ననియే చెప్పుచున్నది; కాని శివతత్త్వసారము గద్య పద్యాత్మకమని తెల్పుటలేదు.

'శివతత్త్వసారము' శతకమని కవి స్వయముగాఁ జెప్పకున్నను— దీని లక్షణము లన్నియును శతకలక్షణములే యగుటవలన నిది శతకమే యన దగు నని శ్రీ వేదము వేంకటకృష్ణశర్మగారు తమ 'శతకవాఙ్మయ సర్వస్వము' లోఁ జెప్పియున్నారు. 'శతకంబు శివతత్త్వ సారమాదిగను- గద్య పద్యంబు లాకాంక్షఁ జదువుచును'—(దీక్షాప్రకరణము) శతకము శివతత్త్వసారము దీప-కళిక, మహానాటకము నుదాహరణ' (పర్వతప్రకరణము)' అను సోమనాథుని గ్రంథభాగములను దానికిఁ బ్రమాణముగా నిచ్చియున్నారు. [పుటలు 11, 12]

శ్రీ శర్మగారు 'శతక' మనుదానిని 'శివతత్త్వసార' మనుదానికి విశేషణముగా గ్రహించినందున, ఆరీతిఁ దలఁపవలసివచ్చినది. కాని 'శతక' మనునది విశేషణమే యనుటకుఁ బ్రమాణములేదు. నూఱుపద్యములు కలదే శతకము. వేయి పద్యములు గలది శతకమనుట సంప్రదాయసిద్ధముకాదు. సోమనాథుఁడు పేర్కొనిన 'శతకము' శ్రీ విడుదవోలు వేంకటరావుగారు (తారణ-ఫాల్గుణమాస భారతి) భావించినట్లు పండితారాధ్యుని 'శ్రీ గిరి మల్లికార్జునశతక'మై యుండవలెను. అందలి పద్యమొకటి 'తెనుఁగు కవుల చరిత్ర' అనుబంధమునందు (పుట 388) ఈయఁబడినది. మఱియు, తెలుఁగు శతకములకుఁగల మకుటనియమము శివతత్త్వసారమునఁ గానరాదు.

మల్లికార్జునపండితుఁడు పెక్కుగ్రంథములను రచించినను, అవి లభింపక పోవుటయు, లభించిన 'శివతత్త్వసార' మసమగ్రముగా నుండుటయు నాంధ్రుల దురదృష్టము.

# నాగదేవభట్టు

ఇతఁ డమరకోశమునకు వ్రాసిన తెలుఁగు టీక యొకటి లభ్యమగుచున్నది. అం దది 'నాగదేవభట్టోపాధ్యాయ' కృత మని యున్నది. విద్వాంసుఁడగు నాగదేవభట్టారకుని ప్రశంస శ్రీనాథుని క్రీడాభిరామమునఁ గలదు క్రీ. శ. 1134 ప్రాంతమున నుండిన సుప్రసిద్ధవ్యాఖ్యాత మల్లినాథసూరి తన 'వైశ్యవంశసుధార్ణవము'న నీతని యమరటీకను పేర్కొనియున్నందున, ఇతఁ డతనికంటెఁ బూర్వుఁడనుట స్పష్టము.

కీ శ 1149 నాఁటి దాక్షారామ శాసనములోను, క్రీ. శ. 1154 నాఁటి ప్రేంపల్లి భావనారాయణసామి యాలయములోనున్న శాసనమునందును పేర్కొనఁబడిన నాగదేవకవియే యీ నాగదేవభట్టారకుఁడని 'తెనుఁగు కవుల చరిత్ర' (పుట 285) వలనఁ దెలియుచున్నది.

ఇతని గ్రంథము లేవియును లభించలేదు. కాని మైలమభీమనను గూర్చి చెప్పిన పద్యమొకటి 'కాచనబసవన' యొక్క 'కవిసర్పగారుడము' నం దుదాహరింపఁబడినది. ఈ మైలమ భీమననే వేములవాడ భీమకవి కొని యాడియున్నాఁడు. మైలమ భీమనయే చిక్కభీముఁడు. ఇతని శాసనము క్రీ. శ. 1168 నాఁటిది ద్రాక్షారామమునఁ గలదు. భీముని తల్లియగు మైలమ దేవియొక్క శాసనము క్రీ. శ. 1099 నాఁటిది కలదు. కావున భీముని కాలమునుబట్టి యమృతనాథుఁడును క్రీ. శ. 1150-60 ప్రాంతమునందలివాఁ డగునని చెప్పవచ్చునని 'తెనుఁగు కవుల చరిత్ర'యందుఁ గలదు [పుట287]

# మంత్రి భాస్కరుడు

మంత్రి భాస్కరుఁడు సుప్రసిద్ధుఁడును, కవిబ్రహ్మయునగు తిక్కన సోమ యాజి పితామహుఁడు. తిక్కన యాతనిని తన నిర్వచనోత్తర రామాయణమునందు 'నాపితామహుఁడగు మంత్రి భాస్కరునిఁబట్టియే నాకృతికి ఆదరము కలుగు'నని ప్రశంసించియున్నాఁడు. తిక్కనకు 'దశకుమార చరిత్రము నంకిత మొసఁగిన కేతన యీ మంత్రి భాస్కరుని –

'శాపానుగ్రహ శక్తియుక్తుఁడమలా
చారుఁడు, సాహిత్య వి
ద్యాపారీణుఁడు ధర్మమార్గపథికుం
డర్థార్థి లోకావన
వ్యాపారవ్రతుఁ డంచుఁ జెప్ప సుజన
వ్రాతంబు గౌరీపతి
శ్రీపాద ప్రవణాంతరంగు విబుధ
శ్రేయస్కరున్ భాస్కరున్''

అని కొనియాడియున్నాఁడు మంత్రి భాస్కరుఁడు క్రీ. శ. 1190–1220 నడుమ నుండి వాఁడు

ఇప్పుడు 'భాస్కర రామాయణ' మని ప్రచారమున నున్న గ్రంథములోని అరణ్యకాండ మీతఁడు రచించినదై' తాళపత్రప్రతుల పరిశీలనమువలన బాల, అయోధ్యాకాండలను గూడ నీతఁడే రచియించి యుండవలెనని చెప్పవచ్చును. కాండముల చివరి గద్యలు, రణ్యకాండమందలి అశ్వాసవిభాగము, రచనా వైలక్షణ్యము. ఇట్టి యూహ కాధారములు. మంత్రి భాస్కరుఁడు రచించిన కాండముల చివరి పద్యములు విభక్త్యంతములతో నుండఁగా, తక్కినవి సంబోధనాంతములై యున్నవి ప్రక్షిప్తములు ఎక్కువగా చేరినవి.

మంత్రి భాస్కరుడు రచించిన రామాయణము మూలము ననుసరించినది కాదు. ఇందు కథాంశములు, వర్ణనలును సంగ్రహింపఁబడినవి కావుననే మఱల ఎఱ్ఱాప్రెగడ మూలానుసారముగ 'రామాయణము'ను రచింపవలసి వచ్చినది. భాస్కరుని రచనలో సంస్కృతపదము లెక్కువ. ఎఱ్ఱన రచనలో సంస్కృతాంధ్ర పదములు సమానముగ నుండును.

మంత్రి భాస్కరుఁడు రామాయణమును సమగ్రముగా రచింపలేదు. అసమగ్రమైన యారామాయణమును హుళక్కి భాస్కరుఁడు మున్నగు వారు పూరించిరి కాని, ప్రారంభించిన కవి పేరును, పూర్తిచేసిన కవి పేరును 'భాస్కరుఁడే' అగుటచే దీనికి 'భాస్కరరామాయణ' మని పేరు కలిగినది; మఱియు రామాయణకర్తృత్వమునుగూర్చి వివాదములు చెల రేఁగుట కవకాశము నేర్పడినది.

భాస్కర రామాయణములోని కొంతభాగము మంత్రి భాస్కర రచితమని 'తెనుఁగు కవుల చరిత్ర' కారులును వ్రాసియున్నారు. (పుటలు 313, 314) 'ఆంధ్రకవితరంగిణి' కర్తయు దీనికి సమ్మతించిరి [చూ. 2 వ సంపుటము-మంత్రి భాస్కరుఁడు]

మఱియు 'ఆంధ్ర కవితరంగిణి' లో నిట్లున్నది—'కవిజీవితకారులగు శ్రీ గురుజాడ శ్రీరామమూర్తి పంతులుగారును, ఆంధ్ర కవులచరిత్ర ప్రథమముద్రణమున శ్రీ వీరేశలింగము పంతులుగారును, మంత్రి భాస్కరుఁడు రామాయణమునఁ గొంతభాగమును రచియించి యుండెనని యభిప్రాయపడియున్నారు అందుపైని శ్రీ కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రిగారు భాస్కరోదంతమను ౨౪ పేజీల గ్రంథమున నీవిషయమును విమర్శించి, భాస్కర రామాయణముతో మంత్రి భాస్కరునకు సంబంధము లేదనియు, హుళక్కి భాస్కరుఁడే రామాయణ గ్రంథకర్త యనియు నిరూపించి యున్నారు. దానినిబట్టి కాఁబోలు శ్రీ వీరేశలింగము పంతులుగారు తమ యభిప్రాయమును మార్చుకొని కవుల చరిత్ర రెండవ ముద్రణమున రామాయణకర్త హుళక్కి భాస్కరుఁ డని వ్రాసియున్నారు

భాస్కరోదంతము క్రీ. శ. ౧౮౯౭ వ సంవత్సరమున ననఁగా దాదాపు యేఁబది సంవత్సరముల క్రిందట ముద్రితమైనది. పంతులుగారి కవుల చరిత్రము రెండవ ముద్రణమును, భాస్కరోదంతమును, జదివిన పిమ్మటఁగూడ నాయభిప్రాయము మారలేదు. మంత్రి భాస్కరుఁడు రామాయణములోఁ గొంతభాగమును రచియించి యుండెననియే నా నిశ్చితాభిప్రాయము. భాస్కరోదంతమునందలి విషయములు కొన్ని సత్యమునకు విరుద్ధముగా నున్నవి. ఎఱ్ఱాప్రెగ్గడ రచించిన రామాయణ కృతికర్త అనవేమారెడ్డి యని భాస్కరోదంతము తెలుపుచున్నది. అది వాస్తవముకాదు. ఆ రామాయణ కృతికర్త ప్రోలయ వేమారెడ్డికాని అనవేమారెడ్డి కాఁడు. మంత్రి భాస్కరునియొక్కయుఁ, దిక్కన సోమయాజి యొక్కయు కాలమును భాస్కరోదంతము సరిగా నిర్ణయింపలేదు [రెండవ సంపుటము-పుటలు 126,127]

భాస్కర రామాయణమునకు పీఠికను వ్రాసిన శ్రీ మేడేపల్లి వేంకట రమణాచార్యులుగారు భాస్కర రామాయణముతో మంత్రి భాస్కరునకు సంబంధములేదని తెలిపి యున్నారు.

# యథావాక్కుల అన్నమయ్య

ప్రాచీనులగు శివకవులలో యథావాక్కుల అన్నమయ్య యొకఁడు' ఇతఁడు 'సర్వేశ్వరా!' అను మకుటముతో శివస్తుతి నొనరించుచు నొక కృతిని రచించెను. అది 'సర్వేశ్వరశతకము'గా ప్రసిద్ధమైయున్నది. ఇందలి పద్యసంఖ్య వివిధములగు వ్రాఁతప్రతులలో విభిన్నముగ నున్నది కొన్నింట ౧౨౩, కొన్నింట ౧౩౩, పరిషత్తువారు ముద్రించిన ప్రతిలో ౧౨౮ పద్యములు, మఱికొన్నింట ౧౪౨ పద్యములును కానవచ్చుచున్నవి. ఇందలి పద్యములు కొన్ని యితరగ్రంథములందును (అప్పయామాత్యుని కవిరాజమనోరంజనమునను కలదు. ప్రబంధరత్నావళియందు, ముమ్మయ జైతరాజు రచనగా నొకపద్యముకలదు) కానవచ్చుచున్నవి. ఇతరులు పై మకుటముతో వ్రాసిన పద్యములు కొన్ని యిందుఁజేరినట్లు విమర్శకు లభిప్రాయపడుచున్నారు. కావున ఇందలి పద్యసంఖ్యను నిర్ణయించుట కష్టము. కవి, తాను శతకమును వ్రాసితినని చెప్పనందున—ఇది శతక మగునో, కాదో నిర్ణయించుటయు కష్టము. అన్నమయ్య తాను 'సర్వేశ్వర ప్రాకామ్యస్తవము'ను జెప్పినట్లును. 'సర్వేశ్వరస్తోత్రంబు' చెప్పినట్లును తెల్పియున్నాఁడు. మఱియు 'సర్వేశ్వర స్తోత్రం బన్నయచెప్పె' నను పద్యభాగమునుబట్టి యితనికి 'అన్నయ' అను పేరు నున్నట్లు స్పష్టము.

> 'శాకాబ్దంబులు వార్ధి షట్క పురజి
> త్సంఖ్యం బ్రవర్తింపఁగా
> శ్లోకానందకరంబుగా మహిమతో
> శోభిల్ల సర్వేశ్వర
> ప్రాకామ్యస్తవ మొప్పఁజెప్పె శుభకృ
> త్సువ్యక్తవర్షంబునన్
> శ్రీకంఠార్పితమై వసుంధరపయిం
> జెన్నొంద సర్వేశ్వరా!'

అను నీతని పద్యమునుబట్టి యేతద్గ్రంధరచనాకాలము ౧౧౬౪ నకు సరియగు క్రీ. శ. ౧౨౪౨ గా తెలియుచున్నది.

ఆంధ్ర సాహిత్య పరిషత్తువారు ప్రకటించిన 'సర్వేశ్వరశతక' పీఠికనుబట్టి యీ యన్నమయ్య ఆత్రేయసగోత్రుఁడగు నారాధ్యబ్రాహ్మణుఁ డనియు, యజుశ్శాఖాధ్యాయి యనియు, గోదావరీ తీరవాసియనియు, పట్టిసమున వెలసిన వీరభద్రేశ్వరస్వామి యీతని యిలవేలుపనియుఁ దెలియుచున్నది. ఈ వృత్తాంతము పరిషత్తువారికి శ్రీ శేషగిరిరావుగారు సంపాదించి యిచ్చినట్లును సోమరాజు, వేంకట శివునిచే వ్రాసియుంచఁబడినట్లును తెలియుచున్నది.

అన్నమయ్య ప్రాచీనుఁ డగుటచే 'సమూహి, విగుర్వించు, సురంగము, బహురూపమాడు' మున్నగు పదములను ప్రయోగించెననియు, ఇట్టివి సోమనాథాదుల గ్రంధములందును గలవనియు 'తెనుఁగు కవుల చరిత్ర'లోఁ గలదు.

పెక్కువిషయములలో అన్నమయ్య కృతికిని, సోమనాధుని గ్రంధములకును పోలిక కానవచ్చుచున్నది. సోమనాధుఁడు క్రీ. శ. 1190-1260 ల నడుమ నుండెనని నిశ్చయించిన శ్రీ వేంకటరావుగారు సోమనాధు ననుసరించియే అన్నమయ్య గ్రంధరచన సాగించెననియు, అన్నమయ్య అతి రమ్యంబుగ దూదికొండ మహనీయారాధ్య సోమేశ్వర, ప్రభుకారుణ్య వసంతసంజనితమత్పద్య ప్రసూనావళిన్'—అనునెడ పేర్కొనిన దూదికొండలోని ఆరాధ్య సోమేశ్వరుఁడు పాలకుఱికి సోమనాధుఁడే యయియుండుననియు తెలియఁజేసియున్నారు

సోమనాధుఁడు ద్వితీయ ప్రతాపరుద్రుని కాలమున నుండెనని తలఁచుచున్న 'ఆంధ్రకవితరంగిణి' కర్త 'శతకవాఙ్మయ సర్వస్వ' కర్త మున్నగువారు ఆరాధ్య సోమేశ్వరుఁడు సోమనాధుఁడు కాఁడనియు, అన్నమయ్య కృతి ననుసరించియే సోమనాధుఁడు తనగ్రంథములను రచించెననియు నభిప్రాయపడుచున్నారు. ఏదియెట్లున్నను, అన్నమయ్య 13 వ శతాబ్ది నడుమ నున్నవాఁ డనుట నిశ్చయము.

అన్నమయ్య రచించిన వేఱొకకృతి 'లీలానంద సర్వేశ్వర శతక' మున్నట్లు శ్రీ వేంకటరావుగారు 'తెనుఁగు కవుల చరిత్ర'లోఁ దెల్పియున్నారు. (పుట 377) ఈ 'లీలానందసర్వేశ్వరశతకము'న అన్నమయ్య శైలి ననుసరింపని పద్యములున్నందున, ఇది అన్నమయ్య కృతి కాదని 'ఆంధ్రకవి తరంగిణి' కారుల యభిప్రాయము ప్రాచీన భాషా సంప్రదాయము లిందుండుటచే, అన్నమయ్య రచనయే యగునని శ్రీ వేంకటరావుగా రనుచున్నారు.

సర్వేశ్వర స్తుతిలో నెన్నిపద్యములున్నదియు నిశ్చయము కాలేదు. ఒకవేళ నివి యందలి పద్యము లేమో! 'లీలానంద' అనునది 'సర్వేశ్వరా!' అనుదానికి విశేషణమని గ్రహించినచో—అది ప్రత్యేకకృతి యనుటకంటె— ఉపలబ్ధములగు పద్యములు 'సర్వేశ్వర శతకము'లోనివే యని యూహించుటకును అవకాశము లేకపోలేదు.

# పెద్దయామాత్యుఁడు

ఇతనింగూర్చి 'తెనుఁగు కవుల చరిత్ర'లో వ్రాయఁబడినది. తెలుఁగు కవులలో పెద్దయలు పెక్కురు కలరు. ఇతఁడు విక్రమార్కచరిత్రమును రచించిన జక్కనకు పితామహుఁడు నెల్లూరిని పాలించిన మనుమసిద్ధి రాజునకుఁ దండ్రియగు చోళతిక్కరాజు కాలమున నున్నట్లు జక్కన చెప్పిన '....నెల్లూరి తిరుకాళ మనుజవిభుని, సమ్ముఖమ్మున సాహిత్యసరణి మెఱసి' అను పద్యభాగమువలననే తెలియుచున్నది. తిక్కరాజే తిరుకాళత్తి యని శ్రీ వేంకటరావుగారు తెలిపిరి. కావున నీకవి క్రీ. శ 1208-1239 ల నడుమ నుండెనని చెప్పవచ్చును.

పెద్దయామాత్యుని గ్రంథములు లభింపలేదు. ఇతఁడు 'ఆశు-మధుర-చిత్ర-విస్తరము'లను చతుర్విధ కవిత్వములందు నాఱితేఱినవాఁడు.

# వెన్నెలకంటి అన్నయ

ఇతఁడు 'షోడశకుమారచరిత్రము'ను రచించెను. దీనికి 'బేతాళపంచవింశతి' అను నామాంతరము కలదు. బేతాళపంచవింశతి కవిభల్లట రచనగా లాక్షణికులు చెప్పుచున్నారు. ముద్రిత షోడశకుమారచరిత్రములోని భాగములను, అముద్రిత బేతాళ పంచవింశతిలోని భాగములును అభిన్నములయి యున్నవి.

అన్నయ తనగ్రంథమును తండ్రియగు సూరనామాత్యుని కంకిత మిచ్చెను. సూరనామాత్యుని, పశ్చిమ చాళుక్య చక్రవర్తియగు సోమేశ్వరుని (క్రీ శ. 1126-1138) తోడను, జగదేకమల్లుని (క్రీ. శ. 1148) తోడను, కృష్ణకంధారుఁ డను యాదవరాజు (క్రీ. శ. 1250) తోడను, కవి పోల్చి యుండుటచే నీతఁడు క్రీ. శ. 1250 ప్రాంతమువాఁడయి యుండవచ్చునని 'తెనుఁగు కవుల చరిత్ర'లోఁ దెలుపఁబడి యున్నది.

# క్షేమేంద్రుఁడు

సంస్కృతమున సుప్రసిద్ధుఁడగు క్షేమేంద్రుఁడు కాశ్మీరదేశవాసి. క్రీ.శ.1060 ప్రాంతమున నుండెను. ఆ క్షేమేంద్రుని నామమునే బిరుదముగా ధరించిన 'లక్కాభట్టను ఆంధ్రకవి యొకఁడుండెను. (క్షేమేంద్రుఁడే లక్కాభట్టని శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు 'సకలనీతిసమ్మతము' యొక్క పీఠికలో తెలిపియున్నారు.) ఇతఁడు సంస్కృత క్షేమేంద్రునికిఁ దర్వాతివాఁడు. క్రీ. శ. 1250 ప్రాంతమున నుండిన తిక్కన రచించిన 'కవివాగ్బంధము'న నీతనింగూర్చియు, ఇతనిగ్రంథమును గూర్చియు నుండుటవలన నీతఁడు క్రీ. శ. 1250 కి పూర్వుఁడని 'తెనుఁగు కవుల చరిత్ర' లోఁ గలదు. (పుట 381) కవి వాగ్బంధము తిక్కనకృతి కాదని 'ఆంధ్రకవితరంగిణి'కారులు నిరూపించియున్నారు. (రెండవ-సంపుటము పుట 185.)

ఈ క్షేమేంద్రుఁడు 'శూద్రకరాజుచరిత్రము, శతపక్షిసంవాదము, ముద్రామాత్యము' నను కృతులను రచించెనని 'సకలనీతిసమ్మత' పీఠికలో శ్రీ రామకృష్ణకవిగారు తెల్పియున్నారు. శూద్రకరాజుచరిత్రము కవిభల్లట కృతిగా లక్షణగ్రంథములనుబట్టి తెలియుచున్నది. పయి గ్రంథములలోని పద్యములు కవివాగ్బంధము, వెల్లంకి తాతంభట్టు రచించిన కవిచింతామణి, సకలనీతిసమ్మతము మున్నగు గ్రంథములలో నుదాహరింపఁబడి యున్నవి.

# ఆంధ్రభోజుఁడు

పదునొకండవ శతాబ్దిలో ధారానగరము రాజధానిగా మాళవదేశమును పాలించిన భోజమహారాజు మహావిద్వాంసుఁడై సంస్కృతభాషా వాఙ్మయములను పోషించెను. ఈ యంశమెల్లరకు నెఱుక. ఆ రీతినే యాంధ్రభాషావాఙ్మయములను పోషించిన యొక ప్రభువు 'ఆంధ్రభోజ' బిరుదము నొందెను. అతని నామ మిపుడు మఱుగుపడి బిరుదనామమే నిలిచెను. ఇతఁడు 'నీతిభూషణ' మను రాజనీతి గ్రంథమును రచించినట్లు శ్రీ రామకృష్ణకవిగారు 'సకలనీతిసమ్మత' పీఠికలోఁ దెల్పియున్నారు ఆ గ్రంథమునందలి కొన్ని పద్యములు 'సకలనీతిసమ్మతము' న ఉదాహృతములైనవి.

'ఆంధ్రభోజుఁడు' భోజునికంటె భిన్నుఁడు. ఇతఁడు భోజునికిఁ దర్వాతను, మడికి సింగనకుఁ బూర్వమున నుండి యుండవలెను. 16 వ శతాబ్దిలో నుండిన లింగమగుంట తిమ్మకవి 'నీతిభూషణము' లోని పద్యములను తన 'బాలబోధచ్ఛందము'న నుదాహరించియున్నాఁడు.

# పంచతంత్రి రచయిత

మడికి సింగన కూర్చిన 'సకలనీతిసమ్మతము'లో 'పంచతంత్రి' నుండి కొన్ని పద్యము లుదాహరింపఁబడినవి; కాని తత్కర్త పేర్కొనఁబడలేదు. ఈ గ్రంథము లభింపలేదు. పంచతంత్రికర్త క్రీ. శ. 1250 ప్రాంతమువాఁడై యుండునని 'తెనుఁగు కవుల చరిత్ర'లోఁ జెప్పఁబడినది. (పుట 383)

# 'కామందక' కర్త

'కామందకము' నుండి కొన్నిపద్యములు 'సకలనీతిసమ్మతము'న నుదాహృతములైనవి. కర్తపేరు తెలియలేదు. గ్రంథమును లభ్యముకాదు. ఈ గ్రంథకర్త పదునాల్గవ శతాబ్ది చివరివాఁడై యుండవచ్చునని శ్రీ వేంకటరావుగారనుచున్నారు.

# శివదేవయ్య

శివదేవయ్య గొప్ప విద్వాంసుఁడు. రాజ్యతంత్రజ్ఞుఁడు; ఇతఁ డోరుగంటిని పాలించిన గణపతిదేవుని యొద్దను, ఆతని పుత్రికయగు రుద్రమదేవి యొద్దను మంత్రిగానుండెను. మనుమసిద్ధిని తిరిగి రాజ్యమును నిలుపుటలోఁ దిక్కనకు మిగుల తోడ్పడెనఁట. ఇతఁడు గణపతిదేవుని దీక్షాగురువగు విశ్వేశ్వరదేశికుల కంటె విభిన్నుఁడు.

ఇతఁడు 'పురుషార్థసార' మను గ్రంథమును రచించెనని 'సకలనీతి సమ్మతము'న నుదాహరింపఁబడిన యందలి పద్యములనుబట్టి తెలియుచున్నది. ఆ గ్రంథముమాత్రము లభింపలేదు.

శివదేవయ్య 'శివదేవధీమణీ!' అను మకుటముతో నొక శతకమును రచించెనని తెలుపుచు శ్రీ మానవల్లి రామకృష్ణకవిగా రందలి పద్యము నొకదానిని తమ 'త్రిపురాంతకోదాహరణ' పీఠికలో నుదాహరించియున్నారు

ఈతనికి 'ఆంధ్రకవితాపితామహ' బిరుదము కలదు. తర్వాత అల్లసాని పెద్దన మున్నగువారి కీబిరుద మీయఁబడినది. ఈ బిరుదు పొందినవారిలో నీతఁడే ప్రథముఁడని తెలియుచున్నది.

# తిక్కన సోమయాజి

తిక్కనసోమయాజి యనియెడి యీ కవి యించుమించుగా నన్నయ భట్టారకునికి రెండువందల సంవత్సరముల తరువాత నున్నట్టు కనఁబడుచున్నాఁడు. తిక్కనసోమయాజి నన్నయభట్టుతోడి సమకాలికుఁ డని జనులు వాడుకొనుచు, ఆ విషయమయి పెక్కుకధలు చెప్పుకొనుచున్నారు. * కాని యవి యవిచారమూలకము లగుటచేత మనము విశ్వసింపఁ దగినవి కావు. ఈ కవి తన నిర్వచనోత్తరరామాయణము నంకితము చేసిన మనుమభూపాలుఁడు పదుమూఁడవ శతాబ్దమధ్యమున నున్నట్లు కొన్ని శిలాశాసనములవలనఁ దెలియవచ్చుచున్నది. ఈ మనుమరాజు తాతయును సిద్ధిరా జని సామాన్యముగాఁ బిలువఁబడువాఁడును నయిన మనుమసిద్ధి పన్రెండవ శతాబ్దమునం దుండుట నిశ్చయము. అది గాక కృష్ణామండలములో నందిగామ సీమలోని అనమంచిపల్లె గ్రామమునందలి శివాలయముయొక్క గర్భాలయముముందఱి రాతి పలకమీఁది నాలిగింటిలో నొక శిలాశాసనమునందు శాలివాహనశకము ౧౧౭౨ వ సంవత్సరమం దనఁగా క్రీస్తుశకము ౧౨౫౦ వ సంవత్సరమునందు "మన్మభూపతి" యున్నట్టు వ్రాయఁబడియున్నది. మఱియును కృష్ణామండలములోని నూజివీడు సంస్థానములోని కొండనాయనివర గ్రామములోని చెఱువుగట్టు మీఁద నున్న దేవాలయ సమీపమునందలి యొక రాతిమీఁద చెక్కఁబడిన దానశాసనములో శాలివాహనశకము ౧౧౮౩ వ సంవత్సరమునం దనఁగా క్రీస్తుశకము ౧౨౬౧ వ సంవత్సరమునందు "మనుమరాజు" భూదానము చేసినట్టు చెప్పఁబడి యున్నది. పైవి గాక మనుమసిద్ధిరాజుయొక్క శాసనములు కందుకూరిసీమలోని పెంట్రాల గ్రామములో ౧౨౪౮ వ సంవత్సరము మొదలుకొని ౧౨౫౦ వ సంవత్సరమువఱకును నున్నవి కానిపించుచున్నవి. ౧౨౪౮ వ సంవత్సరములోని నందలూరు శాసనములో మనుమ

[* చూ. శ్రీ గురజాడ శ్రీరామమూర్తి గారి 'కవిజీవితములు']

సిద్ధి కోడూరుగ్రామము నొక బ్రాహ్మణునకు దానము చేసినట్లును, కాకతీయగణపతిదేవునికరుణను కాంక్షించుచుండినట్లును చెప్పఁబడి యున్నది వీనినిబట్టి చూడఁగా గణపతిదేవుఁడు ౧౨౫౭ వ సంవత్సరమువఱకును మనుమసిద్ధికి సాయము చూపినట్టు కానఁబడదు. చూపినచో ౧౨౫౦ వ సంవత్సరమునకును ౧౨౬౦ వ సంవత్సరమునకును నడుమ చూపి యుండ వలెను. ౧౨౬౨ వ సంవత్సరమునకుఁ బయిని మనుమసిద్ధిశాసనము లెందును గానరావు. అందుచేత నాతఁ డా తరువాత నల్పకాలములోనే కాల ధర్మము నొందియుండును. అంతేకాక కృష్ణామండలచరిత్రసంగ్రహము నందు * యఱ్ఱగడ్డ రాజయిన కాటమరాజును పల్నాడుప్రభువైన పద్మ నాయకుఁడును గలిసి పశువులమేఁతబీళ్ళవిషయమయి పదుమూఁడవ శతాబ్దమునందు నెల్లూరిప్రభువైన సిద్ధిరాజుతో యుద్ధము చేసినట్లును, సిద్ధిరాజు సేనలు కవితిక్కన తమ్మునికుమారుఁడైన తిక్కనమంత్రిచే నడుపఁ బడినట్లును, చెప్పఁబడి యున్నది కవి తిక్కనతమ్ముఁ డనుటకుఁ దమ్ముని కుమారుఁ డని పొరపాటునఁ బడి యుండవచ్చును. ఈ రణతిక్కన్న మన తిక్కన్నకు సాక్షత్సహోదరుఁడు కాక పెదతండ్రికొడుకయి యున్నాఁడు. ఇవి యన్నియు నిటుండఁగా తిక్కనసోమయాజిశిష్యుఁడయిన మారన తాను తెనిఁగించిన మార్కండేయపురాణమును ప్రతాపరుద్రదేవునిమంత్రులలో నొకఁ డయిన నాగయగన్నమంత్రి కంకితము చేసిన ట్లా పురాణములోని యీ క్రిందిపద్యమువలనఁ దేటపడుచున్నది.—

సీ. తన సముజ్జ్వలమూర్తి జనలోచనాంభోజ
ములకు మార్తాండుని మూర్తిగాఁగ
తన నయోపార్జితధనమున కర్థి దో
స్థలులు విక్షేపణస్థలులుగాఁగ
తనభూరితరతేజ మనుపమనిజవంశ
భవనంబునకుఁ బ్రదీపంబుగాఁగ
తన వినిర్మలయశంబునకు దిశాతటం
బులు దృఢశాసనశిలలుగాఁగ

[* ఇది యెఱ్ఱగడ్డపాడుగాని యఱ్ఱగడ్డ కాదు.]

ప్రకటగుణగణసంపదఁ బరఁగుచున్న
ధన్యుఁ డథగతవృషుఁడు ప్రతాపరుద్ర
దేవసామ్రాజ్యవర్ధనస్థిరవినీతి
కరణకుశలుండు నాగయగన్నవిభుఁడు.'

మార్కండేయపురాణ గద్యమునందు మారన "శ్రీమదుభయకవిమిత్ర తిక్కనసోమయాజిప్రసాదలబ్ధసరస్వతీపాత్ర తిక్కనామాత్యపుత్ర" యని వ్రాసికొని యుండుటచేత నతఁడు తిక్కనసోమయాజిశిష్యుఁ డగుటకు సందేహము లేదు మారనతండ్రి యైన తిక్కనామాత్యుఁడు కవితిక్కన్న గాక వేఱొక్కతిక్కన్న యయి యున్నాఁడు

ప్రతాపరుద్రదేవుఁడు ౧౨౯౫-వ సంవత్సరము మొదలుకొని ౧౩౨౩-వ సంవత్సరమువఱకును రాజ్యము చేయుటయు, ఈ కడపటి సంవత్సరమునం దతఁడు ఢిల్లీచక్రవర్తియైన జిల్లాలుద్దీనుమేనల్లుఁడును అయోధ్యనబాబు నయిన అల్లా-ఉద్దీన్‌చేత పట్టుకోఁబడి ఢిల్లీనగరమునకుఁ దీసికొని పోఁబడుటయు, సుప్రసిద్ధములు. ఈ పయి నిదర్శనముల నన్నిఁటిని పరిశీలించి చూడఁగా తిక్కనసోమయాజి పదుమూడవశతాబ్ద మధ్యమున నుండె ననియు ఈ కవికిని నన్నయభట్టారకునికి మధ్య రెండు వందల సంవత్సరము లెడ మున్నదనియు, నిశ్చయింపవలసి యున్నది. కాబట్టి తిక్కనసోమయాజి యిప్పటి కాఱువందలయేఁబది సంవత్సరములక్రిందట నుండి యున్నాఁడు.

తిక్కనసోమయాజి నన్నయభట్టు కాలములోనివాఁడు కానట్టును, హూణశకము పదుమూడవ శతాబ్దమునందే యుండినట్టును స్థాపించుటకయి మరి కొన్ని నిదర్శనములు కూడఁ గనఁబడుచున్నవి. మెకాంజి దొరగారు సంపాదించి చెన్నపురి రాజకీయప్రాచ్యలిఖితపుస్తకనిలయమునం దుంచిన వ్రాఁతప్రతులలో నొకదానియందుఁ దిక్కనసోమయాజి శాలివాహనశకము ౧౧౭౦-వ సంవత్సరమునం దనఁగా హూణశకము ౧౨౪౮-వ సంవత్సరమునందు మృతినొందెనని చూపెడి యీ క్రింది పద్య మొకటి కానఁబడుచున్నది.'

క. అంబర రవి శశిశాకా
బ్దంబులు చనఁ గాళయుక్తి భాద్రపదపుమా
సంబున నంబరమణిబిం
బం బనఁదగు తిక్కయజ్వ బ్రహ్మముఁ జేరెన్. *

ఈ కవి కాకతీయగణపతిదేవునికాలములో నుండినట్లు ప్రబల నిదర్శనము లున్నందునను, గణపతిదేవుఁడు పదుమూఁడవ శతాబ్ద మధ్యమువఱకు రాజ్యము చేసినందునను, ఈ పద్య మంతగా విశ్వాసార్హ మయినది కాదు. ఈ పద్యముయొక్క సత్యమెట్టి దయినను, మన్మరాజును, దిక్కనసోమయాజియుఁ గాకతీయప్రభువైన గణపతిదేవుని కాలమునందుండుట నిశ్చయము. గణపతిదేవుఁడు ౧౨౬౦ వ సంవత్సరమువఱకును రాజ్యము చేసినట్టును, ఆ సంవత్సరము మొదలుకొని యాతని కొమారితయగు రుద్రమదేవి పరిపాలనము చేసినట్లును, చరిత్రమును, శిలాశాసనాదులును తెలుపుడు చేయుచున్నవి. అక్కన, బయ్యన లనువారు మన్మరాజును రాజ్యవిహీనునిగాఁ జేయఁగాఁ దన ప్రభువుపక్షమునఁ దిక్కనసోమయాజి గణపతిదేవునిసభకుఁ బోయినట్లు సిద్ధేశ్వచరిత్ర మను నామాంతరము గల ప్రతాపచరిత్రమను శైవ గ్రంథమునందు వ్రాయఁబడి యున్నది ♦ ఈ యంశమే యిటీవల నిప్పటికి నూటయేఁబది సంవత్సరములకు లోపఁ

---

* విల్సనుదొరవారు తమపుస్తక వివరణపట్టికలో నీపద్యమునే యుదాహరించి "అంకానాం వామతోగతిః" అనియున్న న్యాయమునుబట్టి పంద్రెండని యర్థమిచ్చెడు రవిశబ్దము తెలిపెడి ౧౨ అంకెలను కుడినుండి యెడమకు ౨౧ గాఁ బెట్టి ౧౨౧౦ శాలివాహనశకమునుగాఁ జేసెరి. అప్పుడది క్రీ శ ౧౨౮౮ అయి యించుమించుగా తిక్కనమరణకాలము సరిపోవచ్చును గాని కాళయుక్తి సంవత్సరము కాదు.

[కొందఱు 'రవిశశి' అను దానిని 'శశిరవి' గాఁ జదువవలెననిరి. అప్పుడును ౧౨౧౦ యే యగును. అది సరికాదు]

♦ దీని రచయిత కాసె సర్వప్ప, ఇతఁడు ౧౩౦౦ ప్రాంతమువాఁడని 'ఆంధ్ర కవి తరంగిణి'.

గూడిమంచి జగ్గకవి రచియించిన సోమదేవరాజీయమునందును జెప్పబడి యున్నది. ఏతదంశమును దేటపఱిచెడి యా గ్రంథభాగముల నిం దుదాహరించుచున్నాను

(సిద్ధేశ్వరచరిత్ర, ద్విపదకావ్యము.)

సారెసారెకుఁ గేరి సన్నుతుల్ చేయ
సారపారావారసరసగంభీర
సారుఁడై కీర్తివిస్తారుఁడై యలరు
నా రీతి గణపతి నటు చూచు వేడ్కఁ
దిక్కనసోమయా జక్కడ కొకట

* * *

దిక్కుదిక్కులనుండి తెరలి విద్యార్థు
లక్కడక్కడను గావ్యముల శ్లోకార్థ
మొక్కొక్కవిధమున నొగి వినిపింపఁ
జక్కన వినుచును నొక్క యందలము
నెక్కి తిక్కనసోముఁ డక్క డేతెంచె
నా రీతిగా సోమయాజుల రాక
వారక చని ఫణిహారులు దెల్ప

* * * *

అప్డు మహాత్ముని నా సోమయాజి
నెప్డున నెదురేగి నేర్పుతో రాజు
తెచ్చి యర్ఘ్యాసనస్థితునిఁగా జేసి
మెచ్చి తాంబూలాది మెప్పుగా నిచ్చి

* * * *

అగు భారతాఖ్యాన మాపీఠవరులు
తగఁ జేసినట్టి యుద్ధప్రకారములు
వినియు సంతోషించెఁ గనినట్లు చెప్ప

* * *

అంతఁ దిక్కనసోమయాజికి మెచ్చి
వింతవస్త్రంబులు వివిధభూషణము
లత్యంతభక్తితో నప్పు డిచ్చుచును
సత్యసంధుడును సభ్యవర్తనుఁడు
నగు సోమయాజి తా నా రాజు కనియెఁ
దగుమాట విను మొక్కధర్మకార్యంబు
సూర్యవంశంబున సొంబగొందుసట్టి
యార్యపూజితవర్యుఁ డా మన్మసిద్ధి
రాజు దా నెల్లూరు రమణతో నేల

*    *    *    *

అక్కన బయ్యన లధికబలిష్ఠు
లక్కట ! సిద్ధిరాయనిఁ బాఱఁదోలి
దక్కిన రాజ్యంబు తామె యేలుచును
నొక్క కా సైనను జిక్కఁగ నీరు
వారల దండించి వారినెల్లూరు
వార కిప్పింపు మవారణఁ బ్రీతి
ననిన గణపతిరా జట్ల కా కనుచు

*    *    *    *

వెడలి గణపతియు విజయంబునకును
గుడియెడమల సేన కొలిచి యేతేర
వెలనాడు చేరియు వీ డెల్లఁ గాల్చి
వెలనాటిరాజును వెస గెల్చి వాని
యప్పనంబులు గొని యటఁ జని రాజు
గుప్పున నెల్లూరు కూడ నేతెంచి
యక్కన బయ్యన నచట సాధించి

*    *    *    *

నెల్లూరిప్రజలకు నేర్పు వాటిల్లఁ
జెల్లించె మన్మనసిద్ధిరాజునకు
నెల్లూరుపట్టంబు నేర్పుతోఁ గట్టి
సల్లలితాదృతి సమదుర్గములను
నఖువదెనిమిదియు నగు పట్టణముల
నరుదొంద సాధించి యా మన్మసిద్ధి
రాజు కిచ్చియుఁ దనతేజంబు దిశలఁ

బూజ కెక్కఁగ ఘనరాజితయశుఁడు
ఘనతటాకంబుఁ దాఁ గట్టించె నచటఁ
గొనకొని నెల్లూరఁ గొన్నెల లుండి
మనుమసిద్ధికి రాజ్యమహిమలు దెల్పె'

ఈగ్రంథము కొంత పురాతనమైనను దీనియందు లక్షణదోషము లనేకములు కానవచ్చుచున్నవి. సంగతులు సత్యములే యైనను, ఇందుఁ జెప్పిన సంవత్సరములు మాత్రము చాలవఱకు సరియైనవికావు. ఈ పుస్తకము గణపతిదేవునికాలములోఁ గాక నూఱు నూటయేఁబదిసంవత్సరములకుఁ దరువాత విన్న కథలనుబట్టి వ్రాయఁబడిన దగుటచేత నిందుఁ జెప్పఁబడిన విషయములు సహితము కొన్ని వ్యత్యస్తములుగా నున్నవి. తిక్కన్న గణపతిదేవునియొద్దకుఁ బోవునప్పటికి యజ్ఞముచేసి యుండలేదు. భారతమును రచియించి యుండలేదు. ఈ పుస్తకము చేయునప్పటికి తిక్కనసోమయాజి యజ్ఞము చేసి భారతము రచియించి యుండుట కవి విని యెఱిఁగినవాఁ డగుటచేత కాలభేదమును నిర్ణయింపలేనివాఁ డయి వెనుక జరిగినదానిని ముందు జరిగినట్టు వ్రాసి యుండును సోమదేవరాజీయము నందుఁ జెప్పిన సంవత్సరములును దీని ననుసరించియే వ్రాయఁబడినవి.

(సోమదేవరాజీయము)

గీ॥ చేయఁ దక్కువయైన దేవాయతనము
లపుడు పూర్తిగఁ గట్టించి యలరుచున్న
చోట నొకనాఁడు తిక్కనసోమయాజి
వచ్చె నెల్లూరినుండి భూవరునికడకు.

సీ॥ వచ్చిన యయ్యార్యవర్యు నెదుర్కొని
　　　　　వినయసంభ్రమభక్తు లినుమడింప
నతిథిపూజ లొసర్చి యతనిచే భారతా
　　　　　ర్థమును ద్వైతాద్వైత తత్త్వములును
విస్మృతచిదచిద్వివేకలక్షణములుఁ
　　　　　బ్రకటధర్మాధర్మపద్ధతులును
రాజనీతిప్రకారంబును భారత
　　　　　వీరుల మహిమంబు వినుచునుండి

యనుమకొండనివాసు లైనట్టి బౌద్ధ
జనుల రావించి వారిఁ దిక్కనమనీషి
తోడ వాదింపఁజేసినఁ దొడరి వారిఁ
జులకఁగా సోమయాజులు గెలుచుటయును.

వ. అప్పుడు బౌద్ధదేవాలయంబులు గూలం ద్రోయించి గణపతి దేవరాజు సోమయాజుల పటువాక్యశక్తికి మెచ్చి యతనిన్ బహు ప్రకారంబుల బూజించి యెనిమిది గ్రామంబు లొసంగి యతఁడు వచ్చిన కార్యం బడిగిన నా భూవరునకుఁ గవివరుం డిట్లనియె.

గీ. ఇనకులోద్భవుఁ డైనట్టి మనుమసిద్ధి
రాజు నెల్లూరు పాలించుచోఁ జెలంగి
యతనిదాయాదు లతని నుక్కఱఁగఁ బట్టి
యునిచి రాజ్యంబుఁ దమ రేలుచున్నవారు

క. కావున మీ రిపు డచటికి
వేవేగం దరలి వచ్చి విడకుండఁగ నా
భూవరుఁ బునరభిషిక్తునిఁ
గావింపఁగవలయు ననిన గణపతివిభుఁడున్.

గీ. 'అట్ల కాక' యనుచు నా పని కొడఁబడి
యుత్తుదారగుణసమగ్రుఁ డగుచుఁ

దవిలి యప్పు డొక్క నవలక్ష ధనమును
యజ్ఞకుండలములు నతని కిచ్చె.

క. పనుచు నెడఁ దిక్కమఖి యా
జనవరుసింహాసనమున సచివాగ్రణియై
తనరెడు శివదేవయ్యన్
గనుఁగొని యా రాజుతోడఁ గడఁకం బలికెన్.

గీ. 'వసుమతీనాథ! యీతఁ డీశ్వరుఁడు గాని
మనుజమాత్రుండు గాఁడు పల్కు లితని
యనుమతంబున నీవు రాజ్యంబు నెమ్మి
నేలు'మని చెప్పి యా ఘనుఁ డేగుటయును.

సీ. గణపతిదేవుఁ డా ఘనుననుమతిఁ గాంచి
యతిసత్వరమునఁ బ్రయాణభేరి
వేయించి చతురంగపృతనాసమేతుఁడై
తరలి ము న్వెలనాటిధరణిపతుల
గెలిచి వారలచేత లలి నప్పనముఁగొని
వారి నందఱఁ దనవశము చేసి
కొని చని నెల్లూరు గొబ్బునఁ జొచ్చి య
క్కనయు బయ్యనయు నన్ఖిలులఁ దఱిమి.

మనుమసిద్ధిరాజుఁ బునరభిషిక్తుఁగా
వించి మించి రెండువేలు నైదు
నూఱు గ్రామములు మనోవృత్తి కతనికి
నిచ్చి కడమఁ దాను బుచ్చుకొనియె.

ఈ పుస్తకమునందుఁ గణపతిదేవుఁడు రెండువేలయేనూఱు గ్రామములు మనుమసిద్ధి కిచ్చినట్లు గొప్పగాఁ జెప్పినను, ప్రతాపచరిత్రమునుబట్టి యఱువదెనిమిది గ్రామములను మాత్రమే యాతని కుంచినట్లు స్పష్టమగు చున్నది. దీనినిబట్టి చూడఁగా మన్మసిద్ధియొక్కయుఁ దిక్కనయొక్కయు

కాలము విర్ధారణ మగుటయే కాక సిద్ధిరాజొక్క చిన్న సంస్థానాధిపతి యైనట్లు కూడఁ దేటపడుచున్నది అటుపయినిగూడ మనుమసిద్ధికి నెల్లూరు రాజ్యము స్థిరపడినది కాదు. గణపతిదేవుని మరణానంతరము సిద్ధిరాజునకును పల్నాటిప్రభువైన కాటమరాజునకును బసులమేపు బీళ్లనిమిత్తమయి వివాదము వచ్చి జరగిన పోరాటములో సిద్ధిరాజును కాటమరాజును గూడఁ బ్రాణములు గోలుపోయినట్లు కాటమరాజుకథవలనఁ దెలియ వచ్చుచున్నది. [కాటమరాజునకును, మనుమసిద్ధిరాజునకును జరగిన యుద్ధమును గూర్చి యీ క్రింది విషయమును చెప్పుట గలదు.

కవిగిరిసీమలోని ఎఱ్ఱగడ్డపాటి ప్రభువు కాటమరాజు కఱవుల కారణమున తమ పశువులబీడులు ఎండిపోఁగా, మనుమసిద్ధిరాజు పాలనలోనున్న బీడులలో తమపశువులను మేతకు విడిచి, కొంతపుల్లరిని చెల్లించుట కంగీకరించెను. కాని కాటమరాజు మనుమసిద్ధికి పుల్లరినీయక ఎదిరింపఁగా యుద్ధము సంభవించెను కాటమరాజు పల్నాటిప్రభువుకాఁడు.

కాటమరాజు పుల్లరి నీయకుండుటకుఁ గారణమును కొందఱిట్లు చెప్పుదురు— 'మనుమసిద్ధి యుంపుడుకత్తె పెంచుచున్న చిలుక యొకటి పంజరమునుండి తప్పించుకొనిపోయి కాటమరాజు పశువులు మేయుచున్న యడవికేఁగి మనుష్యులవలె మాటలాడుచుండఁగా పశువులు బెదరి చెదరి మేఁతను మానినవఁట! పశువులకాపరులు చిలుకను చంపివేయఁగా, సిద్ధిరాజు మనుష్యులా పసులకాపరులను చీకాకుపఱచిరఁట! ఆ కారణముననే కాటమరాజు పుల్లరినీయక యుద్ధమునకు సిద్ధపడెనఁట!

యుద్ధములో పల్నాటిప్రభువైన పద్మనాయకుఁడు మున్నగువారు కాటమరాజునకు సాయపడిరఁట!] ఈ యుద్ధములోఁ దిక్కనసోమయాజికి (పెదతండ్రి సిద్ధనకుమారుఁడు) సహోదరుఁడైన ఖడ్గతిక్కన సేనానియై యుండి సేనలను నడిపినట్లును, ఆ యుద్ధములో నతఁడు ప్రాణములు కోలుపోయినట్లును ఖడ్గతిక్కన చరిత్రమువలన విదిత మగుచున్నది. మొదట నీ రణతిక్కన శత్రువుల కోడి పాఱివచ్చినట్లును, అప్పు డాతనితల్లి యాతనిని జూచి కోపపడి కోడలితో 'నీవును నీ భర్తయు నేనును మనయింట ముగ్గు

రాఁడువార మయితి' మని హేళనముగాఁ బలికినట్లును, నందుపయి నాతనికి రోషము వచ్చి మరల యుద్ధమునకుఁ బోయి వీరమరణము నొందినట్లును, పయి చరిత్రమునందే చెప్పఁబడి యున్నది ఆ పుస్తకమునందలి కొన్ని పద్యములు విం దుదాహరించుచున్నాను —

సీ. వీరవికాయంబు వేదనినాదంబుఁ
బాయక యేప్రొద్దు మ్రోయుచుండు
భూసురప్రకరంబు నేసలు చల్లంగఁ
బాయ కెన్నియొ కుటుంబములు బ్రదుకు
బ్రాహ్మణావళికి ధారలు పోసినజలంబు
సతతంబు మంగిట జాలువాఱు
రిపుల కొసఁగిన పత్రికల పుత్రికలను
బాయక కరణముల్ వ్రాయుచుంద్రు
మానఘనుఁడైన తిక్కనమంత్రియింట
మదనసముఁ డైన తిక్కనమంత్రియింట
మహితయశుఁ డైన తిక్కనమంత్రియింట
మంత్రిమణి యైన తిక్కనమంత్రియింట.

* * * *

క. పగఱకు వెన్నిచ్చినచో
నగరే నిను మగతనంపునాయకులందున్
ముగు రాఁడువార మైతిమి
వగ పేటికి జలక మాడ వచ్చినచోటన్. *

* రణతిక్కన స్నానమునకు వచ్చినప్పుడు భార్య స్త్రీలకు పెట్టినట్లుగా రహస్యస్థలమున నీళ్ళబిందె యుంచి దానికి నులకమంచము చాటుపెట్టి దానిమీఁద పసుపుముద్ద యుంచె ననియు, అది చూచి యతఁడు వ్యసనపడుచుండఁగా భార్య యీమాట లనినొ ననియు, చెప్పుదురు.

క॥ అసదృశముగ నరివీరుఁడు
మసి పోవఁగ విఱిగి వచ్చె మగపంద క్రియన్
గసవున్ మేయఁగ బోయిన
పసుల న్వెలిఁ ద్రొబ్బి తిక్కపాలుఁడు దిరుగన్. *

చ. పదటున వాజి రాహుతులపై దుమికింపుమఁ దిక్కఁ డార్చినన్
బెదరి పరిభ్రమించి కడుఁ బిమ్మట వీరులు భీతచిత్తులై
యదె యిదె డాలు వాల్మెఱుఁగు లల్లదె యల్లదె యాతఁ డంచనన్
గొదుకక యాజిఁజేసె రిపుకోటుల కందఱ కన్నిరూపులై.

* * * *

ఉ. చిక్కక మన్మసిద్ధివిభుచే మును గొన్న ఋణంబుఁ దీర్చె మా
తిక్కనమంత్రి సోమశిలదేవర సాక్షిగఁ బెన్న సాక్షిగా
నెక్కిన వాజి సాక్షిగ మహి న్నుతికెక్కిన కీర్తి సాక్షిగా
స్రుక్కక మాఱుకొన్న రణశూరులు సాక్షిగఁ గొండ సాక్షిగన్.

* * * *

సీ. ధైర్యంబు నీమేనఁ దగిలి యుండుటఁజేసి
చలియించి మందరాచలము తిరిగె
గాంభీర్య మెల్ల నీకడన యుండుటఁజేసి
కాకుత్స్థుచే వార్ధి కట్టువడియె
జయలక్ష్మి నీయురస్స్థలినె యుండుటఁజేసి
హరి పోయి బలి దాన మడుగుకొనియె
నాకార మెల్ల నీయందె యుండుటఁజేసి
మరుఁడు చిచ్చునఁ బడి మడిసి చనియెఁ

---

* క. అసదృశముగ నరివీరులఁ । బసమీఱఁగ నిలువలేక పంద క్రియ న్నీ
వసెవైచి విఱిగివచ్చినఁ । బసులు న్విఱిగాప, తిక్క ! పాలు న్విఱిగెన్ —
అని పాఠాంతరము. అన్నములోఁ బోయుటకై పాలు విఱిగిపోఁగా చెల్లి యతనితో పరిహాసముగా నీవాక్య మన్నదందురు.

తిక్కదండనాథ దేవేంద్రపురికి నీ
వరుగ నెఱిఁగి నగుచు నసుర గురుఁడు
బద్ధి కట్టువిడుచు సమ్మోహితోల మాను
మనఁడు మరలఁ గలుగు మంగలరాజ!

సీ. చందుని బుత్తెంచు నిందుశేఖరుఁడు నీ
వన్న! యేతెమ్ము తారాద్రికడకు
గరుడుని బుత్తెంచె నరహరి రావయ్య
వడి సిద్ధతిక్క! కైవల్యమునకు
హంసను బుత్తెంచె నజుఁడు నీకడకు ను
భయకులమిత్ర రా బ్రహ్మసభకు
నైరావతముఁ బంపె నమరేంద్రుఁ డిప్పుడు
దివమున కేతెమ్ము తిక్కయోధ!

యనుచు వేఱువేఱ సర్థితోఁ బిలువంగ
వారు వీరుఁ గూడ వచ్చి వచ్చి
దివ్యయోగి యైన తిక్కనామాత్యుండు
సూర్యమండలంబుఁ జొచ్చి పోయె!

బ్రహ్మశ్రీ గురుజాడ శ్రీరామమూర్తిపంతులుగారు తిక్కన సోమయాజి కాలనిర్ణయమునుగూర్చి యీ పైని నేను వ్రాసినది స్థిరమార్గము కాదని నిర్ణయించి తిక్కన నన్నయభట్టుతోడి సమకాలికుఁ డని సిద్ధాంతము చేయుటకయి యేమేమో వ్రాసి యున్నారు అందలి ముఖ్యాంశముల నిందించుక చర్చింతము. తిక్కన తన నిర్వచనోత్తర రామాయణము నంకితముచేసిన మనుమసిద్ధిరాజు క్రీస్తుశకము ౧౨౫౮-వ సంవత్సరమున భూదానము చేసిన ట్టున్న శిలాశాసనమునుగూర్చియు, ౧౨౬౦-వ సంవత్సరమునందు రాజ్యము చేయుచుండినట్లున్న శిలాశాసనమునుగూర్చియు, స్యూయల్ దొరవారి ప్రాచీనశాసనపట్టికనుండి నే నుదాహరించిన చరిత్రాంశముల మాట తలపెట్టక వానినుపాయముగా జాఱవిడిచి, వా రటు తరువాత "కృష్ణామండల చరిత్ర సంగ్రహమునం దెఱ్ఱగడ్డరాజయినకాటమరాజును

పల్నాడు ప్రభువైన పద్మనాయకుఁడును గలిసి పశుపులమేఁతబీళ్ళవిషయమయి పదుమూడవ శతాబ్దమున నెల్లూరు రాజయిన సిద్ధిరాజుతో యుద్ధము చేసినట్లును, సిద్ధిరాజుసేనలు కవితిక్కన తమ్మునికుమారుఁడైన తిక్కన మంత్రిచే నడుపఁబడినట్లును, చెప్పఁబడి యున్నది." అని నేను వ్రాసిన వాక్యము నింతవఱకు మాత్రమే గ్రహించి, "కవితిక్కనతమ్ముఁ డనుటకుఁ దమ్మునికొమారుఁ డని పొరపాటునఁ బడి యుండవచ్చు" నన్న తరువాతి వాక్యమును బుద్ధిపూర్వకముగా నుపేక్ష చేసి, రణతిక్కన తిక్కన సోమయాజికి పితృవ్యపుత్రుఁ డయిన తమ్ముఁ డని మెఱిఁగి యుండియు* తమ్మునికొడు కని సిద్ధాంతముచేసి, పదుమూడవ శతాబ్దము ౧౨౦౦ లు మొదలుకొని ౧౩౦౦ ల సంవత్సరమువఱకు నుండవచ్చును, గాన రణతిక్కన ౧౨౦౧-వ సంవత్సరమున యుద్ధములోఁ జచ్చి ౧౧౭౦ లోనో ౧౧౮౦ లోనో ౧౧౯౦ లోనో తన తండ్రి కఱువదవ పడిలోనో యెప్పుడో పుట్టి యుండవచ్చు ననియు, ఆ ముసలితండ్రికంటె నలువదియేండ్ల పెద్దవాఁడయిన సవతియన్న యైనచోఁ దిక్కన తన తమ్మునికుమారునికంటె నూఱేండ్లుపెద్దవాఁడు కావచ్చు ననియు, అందుచేతఁ దిక్కన ౧౨౩౦-వ సంవత్సరప్రాంతమున నన్నయభట్టు కాలములో నుండవచ్చు ననియు, ఊహలమీఁది యూహలతో బయలఁ బందిరి వేసిరి. రణతిక్కన కవితిక్కన తమ్మునికుమారుఁడు కాకపోవుటచే నిది యంతయు నేల విడిచి సాము చేయుట గాని వేఱుకాదు

"ఉ. ఏమి తపంబు చేసి పరమేశ్వరు నేమిటఁ బూజ చేసిరో
రామునితల్లియుం బరశురామునితల్లియు భీముతల్లియున్
గామునికన్నతల్లియును గంజదళాక్షుననుంగుదల్లియున్
శ్రీమహితప్రతాపుఁ డగు సిద్ధనతిక్కనఁ గన్నతల్లియున్ ॥

అనెడి (ఖడ్గతిక్కన యనఁబడు) రణతిక్కనచరిత్రములోని యీ పద్యమును బట్టి రణతిక్కన సోమయాజికి (కేవలసహోదరుఁడుగాక) మూఁడవ పెద్ద

* మఱి యిరువదిపంక్తులతరువాత నే రణతిక్కన "తండ్రి సిద్ధయ. ఈసిద్ధయ సోమయాజికి మూఁడవపెత్తండ్రి" అని వ్రాసియున్నారు.

తండ్రియైన సిద్ధనకొడుకయినట్టు స్పష్ట మగుచున్నది. కవితిక్కనకును రణతిక్కనకును గల యీబంధుత్వమే కాటమరాజచరిత్రమునందును జెప్పఁబడి యున్నది.

తిక్కనసోమయాజికి శిష్యుఁడైన మారన్న క్రీస్తుశకము ౧౨౯౫-వ సంవత్సరము మొదలుకొని ౧౩౨౩-వ సంవత్సరము వఱకును రాజ్యము చేసిన ప్రతాపరుద్రుని దండనాథుఁడయిన నాగయగన్నమంత్రికిఁ దన మార్కండేయపురాణము నంకితము చేసినందునఁ దిక్కనసోమయాజి పదుమూడవశతాబ్దమధ్యమునం దున్న వాఁ డని నేను వ్రాసినదానికి ప్రతాపరుద్రు లనేకు లున్నందున వారిలో నెవ్వరి మంత్రియైన నాగయగన్నయకుఁ గవి కృతి యిచ్చెనో యని శంక తెచ్చుకొని దానినిబట్టి తిక్కన కాలనిర్ణయము చేయ వలనుపడ దనిరి. మార్కండేయపురాణమునందుఁ జెప్పఁబడిన ప్రతాపరుద్రుఁడు కాకతీయగణపతిదేవునకు దౌహిత్రుఁడయిన రెండవప్రతాపరుద్రుఁడు. మొదటి కాకతీయ ప్రతాపరుద్రుఁడు టిక్కన కాలమునకు నుండిన గణపతిదేవునితండ్రి మార్కండేయపురాణములోఁ గృతిపతియొక్క వంశానువర్ణనము చేయుచో—

క. కులరత్నాకరచంద్రుం
డలఘుఁడు నాగాంకుఁ డన్వయస్థితికొఱకున్
గులశీలరూపగుణములు
గలకన్నియఁ బెండ్లియాడఁగా దలఁచి మదిన్.

సీ. ఏరాజు రాజుల నెల్ల జయించి ము
న్నొట్టిియ గొనియె దోర్విక్రమమున
నే రాజు సేతునీహారాద్రిమధ్యోర్వి
నేకచ్ఛత్త్రముగ నేలె వాసి
నే రాజు నిజకీర్తి యెన్మిదిదిశల ను
ల్లాసంబు నొంద నలంకరించె
నే రాజునవతేజ మీజగంబునకు న
ఖండకదీపంబు గా నొనరె

నట్టి శ్రీరుద్రగణపతిక్ష్మాధినాథు
ననుగుదలవరి ధర్మాత్ముఁ డఖేకపుణ్యుఁ
డయిన మేచకనాయకప్రియతనూజ
నతులశుభలక్షణస్ఫురితామలాంగి

చ. శివుఁ దగజాత, రాఘవుఁడు సీతఁ, గిరీటి సుభద్రఁ బెంపు సొం
పు వెలయఁ బ్రీతిఁ బెండ్లి యగుపోలిక నాగచమూవిభుండు భూ
రివిభవ మల్లసిల్లఁగ వరించె సమంచితరూపకాంతిభా
గ్యవిభవగౌరవాదిసుగుణానుకృతాంబిక మల్లమాంబికన్.

శా. ఆ మల్లాంబకు నాగశౌరికి విశిష్టాచారు లుద్యద్గుణ
స్తోమాకల్పు లనల్పకీర్తిపరు లస్తోకస్థిర శ్రీయుతుల్
శ్రీమంతు ల్సుతులుద్భవించి రొగిఁ గౌంతేయప్రతాపోన్నతుల్
రామప్రఖ్యులు వహ్నితేజులు జగత్ప్రఖ్యాతశౌర్యోజ్జ్వలుల్.

వ. అం దగ్రజుండు.

సీ. తన సుందరాకృతిఁ గని మది వెఱఁగంది
వనిత లంగజునొప్పు వక్రపఱుపఁ
దన కళావిశదత్వమున కద్భుతము నొంది
బుధులు భోజునినేర్పు పొల్లుసేయఁ
దన నయాభిజ్ఞత వినిప్రాజ్ఞులు దివి
జేశవితద్జ్ఞత యేపు డింపఁ
దన యాశ్రయంబున మనుబంధుమిత్రవ
ర్గము కల్పతరువునాశ్రమము దెగడ

నెగడె నెంతయు జగమునఁ బొగడు వడసి
కాకతిక్ష్మాతలాధీశకటకపాలుఁ
డతులసితకీర్తిధవలోలుఁ డన్వయాబ్జ
షండదినవల్లభుఁడు గంగనైన్యవిభుఁడు.

చ. ఎలమిఁ బ్రతాపరుద్రమనుజేంద్రునిచేఁ బడసెం బ్రవీణుఁడై
కొలిచియు శౌర్యశీల రిపుకోటి రణావని గీటడంచియున్
బలరిపుతుల్యవిక్రముఁడు నాగయగన్నవిభుండు తేజమున్
విలసితరాజచిహ్నములు విశ్రుతలక్ష్మియు నాయకత్వమున్.

అను పద్యములయందుఁ గవి కృతిపతియొక్క మాతామహుఁడైన మేచ నాయకుఁడు కాకతీయగణపతియొక్క తలవరి యైనట్టును, కృతిపతి యగు గన్నదండనాథుఁడు కాకతీయప్రతాపరుద్రుని దళవాయి యయినట్టును, స్పష్టముగాఁ జెప్పి యున్నాఁడు. తిక్కనసోమయాజి శిష్యుఁ డయిన మారనవలన మార్కండేయపురాణమును గృతి నందిన గన్నమంత్రియొక్క ప్రభువగు ప్రతాపరుద్రుఁ డీతఁడనియు, ఆ ప్రతాపరుద్రునికాల మిది యనియు, స్పష్టపడినప్పుడు తిక్కన కాలమును నిశ్చయముగా తెలిసినట్టే! గణపతిదేవుని కూఁతురయిన రుద్రమదేవి యనంతరమునందు రాజ్యమునకు వచ్చిన యా యోరుగంటి ప్రతాపరుద్రుఁడు ౧౨౯౫-వ సంవత్సరము మొదలుకొని * ౧౩౨౩-వ సంవత్సరమువఱకును రాజ్యపాలనము చేయుటయు, ౧౩౦౯-వ సంవత్సరమునందు మహమ్మదీయు లేకశిలానగర మనఁబడెడి యోరుగంటిమీఁదికి దండెత్తి వచ్చి మొట్టమొదటఁ బ్రతాప రుద్రునిచే నోడఁగొట్టఁబడి, పలాయితులయ్యును, రెండవ యుద్ధమునం దాతనిని జయించి ఢిల్లీ పాదషాకుఁ గప్పము గట్టునట్లు చేయుటయు, తరువాత నతఁడు దేవగిరిరాజును దనకు సహాయునిగాఁ జేకొని మహమ్మదీయులకుఁ గప్పము కట్టుట మానివేయఁగా నప్పటి టోగ్లాకు చక్రవర్తి ప్రతాపరుద్రుని శిక్షించుటకయి ౧౩౨౧-వ సంవత్సరమునందుఁ దన కొడు కగు ఉలగ్‌ఖానును సేనలతోఁ బంపినప్పు డతఁడువచ్చి కోటను ముట్టడించి కడపటఁ బరాజితుఁడయి చెల్లాచెద రయిన తనసేనలతోఁ బాఱిపోవుటయు, ఈ యవమానమును దీర్చుకొనుటకయి మహమ్మదీయులు ౧౩౨౩-వ సంవత్సరమునందు మరల దండెత్తి వచ్చి ప్రతాపరుద్రుని నోడించి

* [ ౧౩౨౬-వ సంవత్సరమువఱకు రాజ్యపాలనము చేసినట్లు 'ఆంధ్రకవి తరంగిణి'లోఁ గలదు. (ద్వితీయసంపుటము 47 పుట) ]

కారాబద్ధునిగాఁ జేసి ఢిల్లీనగరమునకుఁ గొనిపోవుటయు, సుప్రసిద్ధములైన చరిత్రాంశములు ప్రతాపరుద్రునికిఁ బూర్వమునం దాతనితల్లి తల్లియైన రుద్రమదేవి తన తండ్రి మరణానంతరము క్రీస్తుశకము ౧౨౬౦-వ సంవత్సరము మొదలుకొని ౧౨౯౫-వ సంవత్సరము వఱకును ముప్పది యైదు సంవత్సరములు రాజ్యపాలనము చేసినట్లు దానశాసనములవలనను, చరిత్రకారులు వ్రాసినదానివలనను స్పష్టముగాఁ దెలియవచ్చుచున్నది. సోమదేవరాజీయమునందును రుద్రమదేవి ముప్పదియెనిమిది సంవత్సరములు రాజ్యపాలనము చేసినట్లీ క్రిందిపద్యమునఁ జెప్పఁబడినది—

సీ. 'తదనంతరమునఁ బ్రతాపరుద్రక్షమా
జాని సింహాసనాసీనుఁ జేయఁ
దలఁచి రుద్రమదేవి తా శివదేవయ్య
గారిని రావించి కడఁక [illegible]
పాదంబులకు నా నృపాలుచే మ్రొక్కించి
యా యయ్యచే భూతి యతని నొసలఁ
బెట్టించి ధరణికిఁ బట్టాభిషిక్తునిఁ
గావించి యా రుద్రదేవనృపుని

నాయనకు నప్పగించి యయ్యమ్మ యట్లు
బుధజనంబులుఁ బ్రజలును బొగడ నవని
ముప్పదియు నెన్మిదేఁడులు మోద మొదవ
నేలి కైలాసశిఖరికి నేఁగుటయును'

కాఁబట్టి యామె తండ్రి యైన గణపతిదేవుఁడు ౧౨౬౦ వఱకును రాజ్యభారము వహించి యుండవలెను. "గణపతిదేవమహారాజచంద్రుం డేఁబది యెనిమిది హాయనంబులు మహామహిమతోడ రాజ్యంబు పాలించె" నని సోమదేవరాజీయము ద్వితీయాశ్వాసమునఁ జెప్పఁబడియుండుటచేత గణపతిదేవుఁడు పదుమూఁడవ శతాబ్దారంభమునుండియు భూపరిపాలనము చేసి యుండవలెను. ఇప్పుడు దొరకినంతవఱ కాతని దానశాసనము లన్నియు

౧౨౦౧-వ సంవత్సరమునకు ౧౨౬౦-వ సంవత్సరమునకును నడిమివిగా నున్నవి. తిక్కనసోమయాజి తనప్రభుని కార్యమునిమిత్తమై గణపతిదేవుని యాస్థానమునకుఁ బోయియుండుట నిర్వివాదాంశ మగుటచేత నాతఁడు ౧౨౦౦ లకును ౧౨౬౦ కును మధ్య నెప్పుడో యోరుగంటికిఁ బోయి యుండవలెను. ౧౨౪౭, ౧౨౬౨ సంవత్సరములకు మధ్య పోయినట్టు కనఁబడుచున్నది. ఈ కాలమునం దుండిన తిక్కనసోమయాజి యింతకుఁ బూర్వమునం దిన్నూఱు సంవత్సరముల క్రిందట నుండిన నన్నయభట్టారకునితో సమకాలికుఁ డని సాధించుట యే తర్కముచేతను సాధ్యము కానేరదు. దానశాసనాదులవలె నంత విశ్వాసార్హములైనవి కాకపోయినను, కాకతీయ వంశమునుగూర్చి యిటీవలివారు వ్రాసిన గ్రంథములనుబట్టి చూచినను దిక్కనసోమయాజి నన్నయభట్టుకాలమునం దున్నట్టు చూపుట యసాధ్యమే! సర్వప్పచేత రచియింపఁబడిన ద్విపద సిద్ధేశ్వరచరిత్రములోను, మల్లపరాజ పుత్రుఁడైన వీరనార్యునిచే రచియింపఁబడిన ప్రతాపచరిత్రములోను, జగ్గకవికృతమైన సోమదేవరాజీయములోను, కాకతిప్రళయుఁ డోరుగంటి కోటను గట్టి రాజధానిని అనమకొండనుండి యోరుగంటికి శాలివాహన శకము ౯౯౦ కి సరియైన క్రీస్తుశకము ౧౦౬౮-వ సంవత్సరమునందు మార్చుకొన్న ట్లైకకంర్యముతోఁ జెప్పఁబడి యున్నది. ఈ విషమును గూర్చిన సోమదేవరాజీయములోని పద్యము నిం దుదాహరించుచున్నాను—

సీ. 'అవనిపై శాలివాహనశకాబ్దంబులు
తొమ్మిదినూఱుల తొంబదియగు
వరశుభకృన్నామవత్సరంబునను గా
ర్తికశుక్లపంచమితిథిని దివిజ
గురువాసరంబునఁ గరమొప్పురోహిణీ
నక్షత్రమున నా ఘనప్రభుండు
మానుగా నేకశిలానగరంబుఁ గ
ట్టించె నెంతేనియు రీవి మెఱయ

కారాబద్ధునిగాఁ జేసి ఢిల్లీనగరమునకుఁ గొనిపోవుటయు, సుప్రసిద్ధములైన చరిత్రాంశములు వ్రాయఁబడియున్నవి. పూర్వమున నాతనితల్లి తల్లియైన రుద్రమదేవి తన తండ్రి మరణానంతరము క్రీస్తుశకము ౧౨౬౦-వ సంవత్సరము మొదలుకొని ౧౨౯౫-వ సంవత్సరము వఱకును ముప్పది యైదు సంవత్సరములు రాజ్యపాలనము చేసినట్లు దానశాసనములవలనను, చరిత్రకారులు వ్రాసినదానివలనను స్పష్టముగాఁ దెలియవచ్చుచున్నది. సోమదేవరాజీయమునందును రుద్రమదేవి ముప్పదియెనిమిది సంవత్సరములు రాజ్యపాలనము చేసినట్లీ క్రిందిపద్యమునఁ జెప్పఁబడినది—

సీ. 'తదనంతరమునఁ బ్రతాపరుద్రక్షమా
జాని సింహాసనాసీనుఁ జేయఁ
దలఁచి రుద్రమదేవి తా శివదేవయ్య
గారిని రావించి కడఁక నుసి
పాదంబులకు నా నృపాలుచే మ్రొక్కించి
యా యయ్యచే భూతి నునినొసలఁ
బెట్టించి ధరణికిఁ బట్టాభిషిక్తునిఁ
గావించి యా రుద్రదేవనృపుని

నాయనకు నప్పగించి యయ్యమ్మ యట్లు
బుధజనంబులఁ బ్రజలను బొగడ నెవని
ముప్పదియునెన్మిదేఁడులు మోద మొదవ
నేలి కైలాసశిఖరికి నేఁగుటయును'

కాఁబట్టి యామె తండ్రి యైన గణపతిదేవుఁడు ౧౨౬౦ వఱకును రాజ్య భారము వహించి యుండవలెను. "గణపతిదేవమహారాజచంద్రుం డేఁబది యెనిమిది హాయనంబులు మహామహిమతోడ రాజ్యంబు పాలించె" నని సోమదేవరాజీయము ద్వితీయాశ్వాసమునఁ జెప్పఁబడియుండుటచేత గణపతి దేవుఁడు పదుమూఁడవ శతాబ్దారంభమునుండియు భూపరిపాలనము చేసి యుండవలెను. ఇప్పుడు దొరకినంతవఱకు కాతని దానశాసనము లన్నియు

సీ. 'అంతటఁ బాండ్యదేశాధీశ్వరునిమీఁద
దండెత్తి వానిమస్తకము దునిమి
దత్తుఁడావప్పని సంపదముగఁ బట్టము గట్టి
వానిచేఁ గోటిసువర్ణనిష్క
ములు పన్ను గొని రయంబున సేతుబంధరా
మేశ్వరంబున కేగి యెలమితో ధ
నుష్కోటిలోనఁ బొందుగఁ దీర్థమాడి యె
న్మిదితులాపురుషము ల్గొదుక కచటఁ
దూఁగి క్రమ్మఱ నిజపురి కేగి రీవి
వఱల నెమ్మది నఱువదివత్సరములు
రాజ్య మెన్నంగ నమ్మహారాజమౌళి
కీర్తి మెఱయంగ ధాత్రిఁ బాలించె నంత'

పయి పద్యముప్రకారము కాకతిప్రళయుని పుత్రుఁడయిన యీ మొదటి ప్రతాపరుద్రుదురాజ్యకాలము శాలివాహనశకవత్సరములు ౧౦౭౨ మొదలు ౧౧౨౨ వఱకును అగును ప్రతాపరుద్రుని యనంతరమునందే యాతని పుత్రుఁడయిన గణపతిదేవుఁడు రాజ్యమునకు వచ్చినందున, ఈతనిరాజ్యారంభకాలము శాలివాహనశకము ౧౧౨౨-వ సంవత్సర మనఁగా క్రీస్తుశకము ౧౧౯౯-వ సంవత్సరమగును. పయిని చెప్పిన ట్లితఁడేఁబది యెనిమిది సంవత్సరములు రాజ్యము చేసినందున, సోమదేవరాజీయమును బట్టి సహితము గణపతిదేవుఁడు ౧౧౯౯-వ సంవత్సరము మొదలుకొని ౧౨౫౭-వ సంవత్సరమువఱకును రాజ్యము చేసినట్లే యేర్పడుచున్నది ఈ కాలము శాసనములవలనఁ దెలియవచ్చెడు కాలముతో నించుమించుగా సరిపోవుచున్నది గణపతిదేవుని రాజ్యకాలములోఁ దిక్కనసోమయాజి తనప్రభువగు సిద్ధిరాజుపనిమీఁద నాతనియాస్థానమునకుఁ బోయి యుండినందునఁ దిక్కన తప్పక ౧౨౦౦-౧౨౫౭ సంవత్సరముల మధ్యమున జీవించి యుండవలెను. సత్యమి ట్లుండఁగా శ్రీరామమూర్తిపంతులుగారు రామాయణకర్తయగు భాస్కరుని కాలనిర్ణయము చేయుటలో సోమదేవ

రాజీయమునుబట్టి కాకతిరాజు శా॥ శ॥ ౧౦౫౫-వ సంవత్సరములో రాజ్యము నకు వచ్చినట్టు వ్రాసి యున్నారు నాయొద్ద నున్న సోమదేవరాజీయము వ్రాతప్రతిలోను, శ్రీరామమూర్తిగారి యాజ్ఞానుసారముగా ముద్రింపఁబడిన యచ్చుప్రతిలోనుగూడ తొమ్మిదివందలతొంబది యని యున్నదిగాని వారు వ్రాసినట్లు తొమ్మిదివందలతొమ్మిది యని లేదు. తమవద్దనున్న పుస్తకాను సారముగా ముద్రింపఁబడిన తరువాత, ౧౦౫౫ ఉన్న ప్రత్యంతరము వారి కెక్కడ లభించినదో?

తిక్కన నన్నయభట్టుకాలములోనివాఁడు కాఁడని నేను జూపిన గ్రంథ నిదర్శనముల నీ ప్రకారముగా ఖండించి పంతులువారు తిక్కనసోమయాజి నన్నయభట్టారకునికాలములోనివాఁడే యని కొన్ని యద్భుతమార్గములచేత సిద్ధాంతము చేసి యున్నారు అందు మొదటిమార్గము వాసిష్ఠరామాయణ గ్రంథకర్త యగు సింగనకవి తనతండ్రి తిక్కనసోమయాజులమనుమరాలి కొడుకనియు, అతఁడు (తనతండ్రి) శా॥ శ॥ ౧౨౭౭ మొదలు ౧౨౮౭ వఱకును రాజ్యము చేసిన తొయ్యేటి యనపోతభూపాలునిమంత్రి యనియు, వ్రాసినందున తల్లిపితామహుఁ డగు తిక్కనసోమయాజి యతని కంటె నూటయేఁబది సంవత్సరములు పూర్వమునం దుండవలెనని. ఒకఁడు డెబ్బదిసంవత్సరములు బ్రతికినట్టయిన దనకాలములోనే మనుమరాలిబిడ్డలను జూడవచ్చును. హిందువులలో నొకయువతి బిడ్డను గనునప్పటి కామెతాత నూటయేఁబదిసంవత్సరముల క్రిందట మృతుఁడగుట యెప్పుడును సంభ వింపదు శ్రీరామమూర్తిగారు చెప్పినప్రకారముగానే తొయ్యేటి యనపోత రెడ్డి రాజ్యకాలము క్రీస్తుశకము ౧౩౫౫ మొదలు ౧౩౬౪ వఱకు నగు చున్నది ఆతని మంత్రియు నాకాలములోనివాఁడేకదా? ఆ యయ్యలమంత్రి యొక్క మాతామహునితండ్రి యగు తిక్కనసోమయాజి యయ్యలమంత్రి కంటె నూటేఁబదియేండ్లముందే పరమపదము నొందె ననుకొన్నను, తిక్కన సోమయాజి ౧౨౨౭వ సంవత్సరమువఱకైన జీవించి యుండవలెను పంతులవారు చూపిన యీ మార్గమువలన గూడ నే నేర్పఱిచినకాలమే

సిద్ధాంత మగుచున్నది కాని తిక్కనసోమయాజిని మఱి యిన్నూఱు సంవత్సరములు వెనుకకు నన్నయభట్టుకాలమునకుఁ దీసికొని పో నెంచినవారి కోరిక సఫలము కాకున్నది

వారు చూపిన రెండవమార్గము దాక్షారామ దేవాలయముమీఁది యొక శిలాశాసనములో గణపతిదేవుని యల్లుడు ౧౦౭౫ వ సంవత్సరములో దానము చేసినట్లున్నందున గణపతిదేవుఁ డా కాలమునకు ముప్పది సంవత్సరములు పూర్వమున నుండి యుండవలె ననియుఁ, దిక్కనసోమయాజియు నా కాలము లోనివాఁడే యనియు, ఈ యూహలలెక్క ప్రకారమయినను దిక్కనసోమయాజికంటె నన్నయభట్టు నూఱు సంవత్సరములు పూర్వపువాఁడే యగును గాని వారియభీష్ట మందువలనను సిద్ధింపలేదు. పయి శాసనముయొక్క కాలము సరియైనది కాదు. ఈ శాసనమును శ్రీరామమూర్తిపంతులుగారు స్యూయల్‌దొరగారి పూర్వశాసనముల పట్టిక రెండవ సంపుటము ౧౧౫-వ పుటనుంటి గ్రహించినారు. ఈ శాసనములపయిని స్యూయల్‌దొరగారు తాము వానిలోని కాలమును శోధింప లే దనియు, అందుచేత "చరిత్రకార్యములకయి యీ క్రింది సంవత్సరముల నాధారపఱుచుకొనఁగూడదు" అనియు శీర్షికగా వ్రాసియున్నారు మఱియు నా క్రిందనే ౧౨౦౧-వ సంవత్సరము మొదలుకొని ౧౨౫౮-వ సంవత్సరమువఱకును గల గణపతిదేవునికాలము లోని శాసనము లనేకము లుదాహరింపఁబడి యున్నవి ఇట్లు ప్రత్యక్షముగా గణపతిదేవునికాలమును తెలుపు శాసనము లనేకము లుండఁగా వానిని గైకొనక వాని కన్నిఁటికిని విరుద్ధముగా నున్న మఱియొకరినిగూర్చిన యీ తప్పుశాసనము నొక్కదానిని మాత్రము సత్యమునుగా స్వీకరించి దాని పైని వింతయూహల నేల యల్లవలయునో తెలియరాకున్నది.

పంతులవారు చూపిన మూడవ మార్గము కాకతీయగణపతిరాజు మంత్రులలో నొకఁడగు గన్నమంత్రి వసిష్ఠరామాయణకృతికర్త యగు సింగనకవివలనఁ బద్మపురాణోత్తరఖండమును గృతినందిన కందనమంత్రి కాఱవ పురుషుఁ డయినందున, గణపతిదేవునికాలములో నుండిన తిక్కనసోమయాజి మిక్కిలి పూర్వుఁడని, కందనమంత్రికిని గన్నమంత్రికిని నడుమను ముగ్గురు పురుషులే

యున్నారు; కాని వారన్నట్లాఱుగురు లేరు. కందనమంత్రి ౧౩౫౦-వ సంవత్సర ప్రాంతములయందుండినవాఁ డయినందున. ఆతనితాతతాత యగు గన్నమంత్రి యతనికంటె నూఱు సంవత్సరములు ముం దనఁగా ౧౨౫౦-వ సంవత్సర ప్రాంతములయం దుం-డి యుండవలెను. గన్నమంత్రి గణపతి దేవులమంత్రులలో నొకం డయినందున నిది యాతనికాలముతో సరిపోవు చున్నది. దీనినిబట్టి విచారించినను గణపతిదేవునికాలములో నున్న తిక్కన సోమయాజి ౧౨౫౦ సంవత్సర ప్రాంతములయందే యున్నటు స్థిరపడు చున్నది తిక్కనసోమయాజుల ప్రార్థనమీఁద గణపతిదేవుఁడు సేనలతో దండయాత్ర బై లుదేఱి పెలనాఁటిరాజులను జయించి నెల్లూరు పోయి మను మసిద్ధికి మరల రాజ్యమిచ్చినట్లు సోమదేవరాజీయమునందుఁ జెప్పఁబడి యున్నదిగదా? కృష్ణామండలములోని యినమళ్ళగ్రామమునందలి శాసనము వలన ౧౨౫౪-వ సంవత్సరమున గణపతిదేవుఁడు చోళులను జయించినట్టు తెలియవచ్చుచున్నది. అప్పుడు జయింపఁబడిన చోళులక్కన బయ్యన లేమో! అయినపక్షమున సోమయాజులు ౧౨౫౩-వ సంవత్సరమున నోరు గంటికి గణపతిదేవుని దర్శింపఁబోయినట్టు కనబడుచున్నది. కాని యతఁడు గణపతిదేవుని దర్శింపఁబోయిన కాలము ౧౨౬౦-వ సంవత్సరమునకుఁ దరువాత.

వారు చూపిన కడపటిదగు నాలవమార్గము నే మదహరించిన "అంబర రవిశశిశాకాబ్దంబు" లన్న పద్యమునుబట్టి తిక్కనకాలమును నిర్ణయించుట. ఈ పద్యమునుబట్టి తిక్కనమరణకాలము శాలివాహనశకము ౧౧౨౦-వ సంవత్సరము కాఁగా. తిక్కన నూఱేండ్లు బ్రతికెననుకొన్నచో నాతని జన్మ కాలము శాలివాహనశకము ౧౦౨౦ అనఁగా క్రీస్తుశకము ౧౦౯౮-వ సంవత్సర మగునఁట! నిజముగా నట్లయినను దిక్కనసోమయాజి నన్నయ భట్టు కాలములోనివాఁ డను వారివాదమున కిది పరిపడక నన్నయమరణా నంతరమున నేఁబది సంవత్సరములకుఁగాని తిక్కన పుట్టనే లేదని చూపు చున్నది. ఈ పద్యము విశ్వాసార్హమయినది కా దని యీవఱకే చెప్పి యున్నాను. ఘెకంజిధోరవారి లిఖిత పుస్తకములపట్టికయం దీ పద్యమునే

యుదాహరించి విల్సన్‌దొరగారు దీనినిబట్టి శాలివాహనశకము ౧౨౧౦-వ సంవత్సరమునం దనఁగా హూణశకము ౧౨౮౮-వ సంవత్సరమున దిక్కన సోమయాజి మృతుఁడయినట్టు వ్రాసి యున్నారు. మరణముగూర్చిన యీ పద్యమును వలెనే యొకానొకరు జన్మమునుగూర్చి కూడఁ జెప్పి సోమయాజిగారు శాలివాహనశకము ౧౦౪౨-వ శార్వరీసంవత్సర ఫాల్గున బహుళదశ మీకుజవాసరంబున జనన మొంది రని వ్రాసి యున్నారు. మరణమునుగూర్చిన యీ పద్య మెంత నిజమో జననమునుగూర్చిన యీ పద్యము నంతే నిజమయి యుండును

ఇవి గాక నిర్వచనోత్తరరామాయణమునుబట్టి కూడఁ దిక్కన కాల నిర్ణయమును జేయవచ్చును.

మ. 'కమలాప్తప్రతిమానమూర్తి యగునా కర్ణాటసోమేశు దు
ర్దమదోర్గర్వము యేపుమాపి నిజదర్పంబుం బ్రతిష్ఠించి లీ
లమెయిం జోళుని భూమిపై నిలిపి చోళస్థాపనాచార్యనా
మము దక్కం గొని తిక్కనభూవిభుఁడు సామర్థ్యంబు చెల్లింపఁడే '

అను పద్యమునుబట్టి మనుమరాజుయొక్క తండ్రి యైన తిక్కనృపాలుఁడు కర్ణాటసోమేశుని జయించినట్టు కనఁబడుచున్నది. ఈ జయింపఁబడిన సోమేశుఁడు పశ్చిమచాళుక్యుఁ డయిన నాలవ సోమేశుఁ డయి యుండును. [ ఇయ్యెడ 'ఆంధ్రకవి తరంగిణి' కర్తలు క్రింది విధమున వ్రాసి యున్నారు—

'ఈ జయింపఁబడిన సోమేశుఁడు పశ్చిమచాళుక్యుఁడైన నాలవ సోమేశుఁ డయి యుండును' అని శ్రీ వీరేశలింగము పంతులుగారాంధ్రకవుల చరిత్రలో వ్రాసి యున్నారు. కాని యది సరియైనట్లు కన్పట్టదు ఈ పశ్చిమ చాళుక్యుఁడగు నాలవ సోమేశుఁడు శా. శ. ౧౧౦౪-౧౧౧౧ వఱకు రాజ్యము చేసిన వాఁడు. ఈ కాలములో తిక్కరాజు లేఁడు ఉన్నను, పదేండ్ల లోపు వయసు కలవాఁడై యుండును. ఏమనిన-వెలనాటి పృథ్వీశ్వరుని ఈ తిక్కరాజు తన శైశవముననే చంపియుండెననియు, నది శా. శ. ౧౧౨౮కు తరువాతనై యుండుననియుఁ బైన వ్రాసియుంటిని.

........ ... . .. ఇంతేకాదు. చాళుక్య నాల్గవ సోమేశ్వరుని కాలములో చోళరాజ్యమును బరిపాలించుచున్నవాఁడు మూఁడవ కులోత్తుంగచోళుఁడు. ఇతఁడు మిగుల పరాక్రమశాలి చోళదేశమే కాకుండ, ఆంధ్రదేశముకూడ నీతని యేలుబడిక్రింద నుండెను అట్టివాని నీ నాల్గవసోమేశుఁడు చోళ సింహాసనమునుండి తఱిమివేయుట తటస్థింపదు .... . . . ఇందు (పద్యమునందు) చూపఁబడిన సోమేశ్వరుఁడు (హొయ్సలవంశీయుఁడు) కర్ణాటదేశమును శా. శ ౧౧౫౬ మొదలు ౧౧౮౫ వఱకును పాలించినట్లు శాసనాధారములు కన్పించుచున్నవి . .. .. . ఈకాలములో చోళ రాజ్యమును బరిపాలించుచున్నవాఁడు మూఁడవ రాజేంద్రచోళుఁడు. ఇతఁడు బలహీనుఁడై రాజ్యసంరక్షణమునం దసమర్థుఁడై యుండెననియు. నీ సమయమున నీ వీరసోమేశ్వరుఁడు బలవంతుఁడై యాతనిని జయించి చోళసింహాసనము నాక్రమింపఁగా, మన తిక్కరాజు వీరసోమేశ్వరు నెదుర్కొని పోరాడి, చోళసింహాసనమున మూఁడవరాజేంద్రుని నిలిపె ననియుఁ జరిత్రకారులు తలంచుచున్నారు ఇది సత్యమనుటకు సంశయింప నక్కఱలేదు. ఈమూఁడవ రాజేంద్రచోళుఁడు, శా శ. ౧౧౬౮ మొదలు ౧౧౯౯ వఱకును చోళ సింహాసనమునం దున్నవాఁడు కావున తిక్కరాజు శా. శ. ౧౧౬౮ సంవత్సరమునకుఁ బిమ్మట ననఁగా శా. శ. ౧౧౮౦ ప్రాంతమున సోమేశ్వరుని జయించి యుండవచ్చునని తలంపవలసియున్నది. ఈ సోమేశ్వరునిచే జయింపఁబడినవాఁడు మూఁడవ రాజేంద్రచోళుఁడు గాక మూఁడవ రాజరాజని తలంచితిమేని, యాతని పరిపాలనాకాలము శా. శ. ౧౧౩౮ మొదలు ౧౧౮౦ వఱకునునై యున్నది. కావున తిక్కన సోమేశ్వరుని జయించినది శా. శ ౧౧౬౦ ప్రాంతమైయుండును. ఇదియే సత్యమని నాఅభిప్రాయము. (చూ రెండవసంపుటము పుటలు 203—205 )"]

అయియుండినపక్షమున ఈ యుద్ధము ౧౧౯౯-వ సంవత్సరప్రాంతముల యందు జరిగి యుండవలెను. దీనినిబట్టి తిక్కనృపాలుఁడు ౧౨౦౦-వ సంవత్సరప్రాంతమువఱ కయినను రాజ్యము చేసి యుండును. దీనినిబట్టి యీ తిక్కనృపాలునిపుత్రుఁడును, నిర్వచనోత్తరరామాయణకృతిపతియు

నగు మనుమరాజు ౧౨౭౦-వ సంవత్సరప్రాంతములయందు రాజ్యము కోలుపోవుటలో వింత యేమియు లేదు. మనుమరాజుకాలములోనివా డయిన తిక్కన ౧౩-వ శతాబ్దారంభముననుండి యుండి యుండవలెను. ఈ సందర్భమున శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారు తమయాంధ్రులచరిత్రము ద్వితీయభాగమున నిట్లు వ్రాసియున్నారు

"ఈపై పద్యములలో నితఁడు... .. ... . చోడునిసింహాసనముపై నుంచి చోడస్థాపనాచార్యబిరుదమును గైకొనియె ననియుఁ జెప్పఁబడి యున్నది. ఈ పద్యములలోఁ జెప్పఁబడిన విషయము లన్నియు సత్యము లనుటకు సందియము లేదు మూఁడవ కులోత్తుంగచోడచక్రవర్తి వెనుక రాజ్యపదవిని వహించిన మూఁడవ రాజరాజచోడుఁడు సమర్థుఁడు గాక మిక్కిలి బలహీనుఁ డగుటవలనను, గృహకలహములవలనను, మధ్యఁ గొంతకాలము రాజ్యమును బోఁగొట్టుకొనవలసినవాఁడయ్యెను ఇతని కాలమున మారవర్మ సుందరపాండ్యమహారాజువలనను, కర్నాటక వీర సోమేశ్వరునివలనను, పల్లవుండైన కొప్పెరింజింగదేవుఁ డను మహామండ లేశ్వరునివలనను, రాజ్యమున కుపద్రవము సంభవించెను మహామండ లేశ్వరుఁడైన యీ తిక్కభూపాలుఁడు పాండ్యులను, కర్ణాటక వీర సోమేశ్వరుని జయించి, రాజరాజచోడుని సింహాసనమున నిలిపి చోళ స్థాపనాచార్యుఁ డను బిరుదమును వహించెను. గాంగవాండిదేశమును బరి పాలించుచుండిన హొసలరా జయిన వీరసోమేశ్వరునిశాసనములు క్రీ. శ. ౧౨౩౪ మొదలుకొని ౧౨౫౩ వఱకును గానంబడుచుండుటచేతను, అతనితోఁ దిక్కభూపతి సమకాలికుం డని చెప్పఁబడి యుండుటచేతను, తిక్కరాజుకాలము మనకు స్పష్టముగాఁ దెలియుచున్నది వీరసోమేశ్వరుఁడు గూడ చోళుని సింహాసనమునఁ గూర్చుండఁబెట్టె ననియు, అతఁడును తిక్కభూపాలుఁడు నొండొరులతోఁ బోరాడుచుండి రనియును, దెలియు చుండుటచేత, నిరువురును చోళసింహాసనమునకై పోరాడువారిలోఁ జెఱి యొకపక్కను జేరి యుద్ధము చేసిరని యూహింపనగు."

నేను మొదట చెప్పినది గాక ౧౨౩౪ నకు తరువాత నని పైనిఁ జెప్పఁబడినకాలమే యెక్కువ సరియైనదని నమ్ముచున్నాను. ఏలయన ౧౨౩౪-వ సంవత్సరము నం దీ తిక్కభూపాలుని పేర కాంచీనగరమునఁదలి యొక దేవాలయములో దానశాసన మొకటి కలదు. తిక్కన నిర్వచనోత్తర రామాయణములోనే యీ తిక్కనరపాలుఁడు తనశైశవమునందే పృథ్వీశ రాజుతల చెండాడె నని యీక్రింది పద్యమునఁ జెప్పఁబడినది.

"ఉ. కేశవసన్నిభుండు పరిగీతయశోనిధి చోళతిక్కధా
 త్రీశుఁడు కేవలుండె? నృపు లెవ్వరి కా చరితంబు కల్గునే?
 శైశవలీలనాఁడె పటుశౌర్యధురంధరబాహుఁడై న పృ
 థ్వీశనరేంద్రుమస్తకము నేర్తెఱఁ గందుకకేళి సల్పదే"

ఈ పృథ్వీశరాజు పండ్రెండవ శతాబ్దాంతమునం దుండిన వెలనాటి చోడ సామంతరాజు. ఈతని శాసనములు ౧౧౭౦ వఱకును గానఁబడుచున్నవి. ఇతఁడు తరువాతఁ గూడ బహుసంవత్సరములు జీవించియుండినట్టు నిదర్శనములు కనఁబడుచున్నవి. అందుచేత నీ తిక్కనృపతి తన యౌవనారంభదశలో ౧౧౫౦ సంవత్సరప్రాంతముల రణరంగమునందు పృథ్వీశరాజుతలఁ దునిమి యుండును, * ఇవి యన్నియుఁ దిక్కనసోమయాజి ౧౨౫౦ సంవత్సరప్రాంతమునం దుండెనని స్థాపించుచున్నవి.

తిక్కనసోమయాజికాలము నింకను బహువిధములచేత నిర్ణయింపవచ్చును. భోజరాజీయాదికావ్యరత్నములను రచించిన యనంతకవి తన ప్రపితామహుఁ

[ * 'ఆంధ్రకవి తరంగిణి' లో నిచ్చట క్రింది రీతిని గలదు —

'ఈ పృథ్వీశ్వరుఁడు వెలనాటి చోడుఁడు, మూఁడవ గొంకరాజునకును, జయాంబికకును కుమారుఁడు ....... .. .. పృథ్వీశ్వరుని శాసనములు శా. శ. ౧౧౦౪ మొదలు ౧౧౨౨ వఱకును కన్పట్టుచున్నవి . .... ౧౧౨౨ తరువాత నీతని శాసనములు గన్పట్టుటలేదు. తిక్కరాజు తన శైశవమునందే యీతనిని జంపెనని పై పద్యమునందుఁ జెప్పియుండుటచే ౧౧౨౨-వ యేట నీతఁడు పృథ్వీశ్వరుని సంహారించెననియు, దానినిబట్టి తిక్కరాజుయొక్క జననము ౧౧౧౦ ప్రాంతమై యుండుననియు నిశ్చయింపవచ్చును.' (రెండవ సంపుటము, పుట 201)

దైన బయ్యనమంత్రినిగూర్చి వ్రాయుచు నతఁడు తిక్కనసోమయాజిచేత భవ్యభారతి యని పేరు గాంచినట్లు భోజరాజీయములో నీక్రిందిపద్యమునఁ జెప్పి యున్నాఁడు.

"చ. క్షితిఁ బ్రగతుకర్తనా వినుతి కేకొని పంచమవేదమైన భా
రతముఁ దెనుంగుబాస నభిరామముగా రచియించినట్టి యు
న్నతచరితుండు తిక్కకవినాయకుఁ డాదట మెచ్చి భవ్యభా
రతి యనఁ బేరుగన్నకవిరత్నము బయ్యనమంత్రి యల్పుడే."

ఈ బయ్యన్న మంత్రికొడుకు ముమ్మఁడన్న, ముమ్మఁడన్న కొడుకు తిక్కన; తిక్కనకొడుకు భోజరాజీయాది గ్రంథకర్త యైన యనంతకవి. ఈ యనంతకవి తనరసాభరణమునందు తా నా గ్రంథమును రచించిన కాలము శాలివాహనశకము ౧౩౫౬-వ సంవత్సరమనఁగా క్రీస్తుశకము ౧౪౩౪-వ సంవత్సర మైన ట్లీ క్రిందిపద్యమునఁ జెప్పి యున్నాఁడు.

"శా. జానొందన్ శకవర్షముల్ ఋతుశరజ్వాలేందులై యొప్ప న
య్యానందాబ్దమునందు మాఘమునఁ గృష్ణైకాదశీ భౌమయు
క్తానామామృతవేళ నీ కృతి యనంతాఖ్యుండు సమ్యగ్గస
శ్రీ నిండం ధ్రువపట్టణాధిపున కిచ్చెన్ భక్తిపూర్వంబుగన్."

ఈ కవికిని, తిక్కనసోమయాజికిని నడుమ ముగ్గురు పురుషులుమాత్రమే యున్నారు. ఒక్కొక్క పురుషాంతరమునకు నలువదియైదేసి సంవత్సరములు చూచినను సోమయాజులు ౧౩౦౦ సంవత్సరప్రాంతమువఱకును జీవించి యుండెనని తేలుచున్నది. తిక్కనసోమయాజులు ౭౦ సంవత్సరములు జీవించెనని ప్రసిద్ధి గలదు. అదియే నిజమైనపక్షమున నతఁడు ౧౨౩౦-వ సంవత్సరప్రాంతమున జననమొంది ౧౩౦౦ సంవత్సరప్రాంతమువఱకును జీవించి యుండవలెను. అప్పు డతఁడు ముప్పది నలువది యేండ్ల ప్రాయమున మనుమసిద్ధిజీవితకాలములో నిర్వచనోత్తరరామాయణమును రచించినట్లును, భారతమును మనుమరాజు మరణానంతరముననే రచియించినట్లును, ఏర్పడుచున్నది తిక్కనసోమయాజి తన నిర్వచనోత్తరరామాయణము

నందు కృతిపతి యైన మనుమసిద్ధియొక్క పరాక్రమమును వర్ణించుచు మహారాష్ట్రసారంగునిఁ దోలి తురంగమును గొనినట్లీ క్రిందిపద్యమునఁ జెప్పి యున్నాఁడు.—

"శా. శృంగారంబు నలంగ దేమియును బ్రస్వేదాంకురశ్రేణి లే
దంగంబుల్ మెఱుఁగేద వించుకయు మాహారాష్ట్రసామంతసా
రంగుం దోలి తురంగముం గొనిన సంగ్రామంబునం దృప్త స
ప్తాంగస్ఫారయశుండు మన్మవిభుపంపై చన్న సైన్యంబునన్."

ఇందు బేర్కొనఁబడిన మహారాష్ట్రసారంగుఁ డద్దంకిసీమకుఁ బాలకుఁడుగా నుండి కాకతీయగణపతిదేవునికి లోఁబడి యుండిన సామంతరాజు. పయి పద్యమునందు మనుమసిద్ధి మహారాష్ట్రసామంతుఁడైన సారంగుని దోలి తురంగముం గొనినప్పుడు శృంగారంబు చెడలేదనియు దేహమునఁ జెమ్మట పట్టలేదనియు నంగములు మెఱుఁగు విడువలేదనియుఁ జెప్పెనేకాని సారంగుని గెలిచి రాజ్యమును గైకొన్నట్టుగాని, యాతనిని పట్టుకొన్నట్లు గాని చెప్పలేదు ఈపోరాటమునందు సంపూర్ణవిజయము నొందకయే యాతనితోడ సంధి చేసికొన్న గణపతిదేవుని యనుగ్రహమునకు పాత్రుఁ డయ్యెనని తోఁచుచున్నది. * ఈ మనుమసిద్ధి మొదటినుండియు స్వతంత్ర రాజు గాక మొదట కాంచీపురచోడచక్రవర్తులకును, కడపట కాకతీయ గణపతికిని లోఁబడిన సామంతరాజుగా నుండెను. మహారాష్ట్రసామంతుని తోడి యీ యుద్ధము ౧౨౫౭-వ సంవత్సరప్రాంతమునందలి దయి యుండును. ఈ మనుమరాజు పలుమాఱు శత్రువుల కోటువడి రాజ్యమును పోఁగొట్టుకొనుచు వచ్చెను. కడపట దాయాదులచేత రాజ్యపదభ్రష్టుఁ డయినప్పుడు ౧౨౬౦-వ సంవత్సరము లోపలనే తిక్కనప్రార్థనపైని గణపతిదేవుఁ డీతనికి తోడుపడి శత్రువుల నడఁచి రాజ్యమునందు మరల నిలిపి యుండును ౧౨౫౭-వ సంవత్సరము వఱకును జరిగిన వృత్తాంతము లుత్తరరామాయణమునందు పేర్కొనఁబడి యుండుటచేత నా పుస్తక మా

[ * సారంగుఁడు మనుమసిద్ధిచే యుద్ధమున నోడింపఁబడినట్లు శ్రీ చిలుకూరి వీరభద్రరావుగా 'రాంధ్రులచరిత్రము'న వ్రాసియున్నారు.]

కాలమునందే రచియింపఁబడి యుండును పసులమేఁతబీళ్ళపుల్లరివిషయమున జరిగిన జగడములో కాటమరాజువలెనే మనుమసిద్ధియు ౧౨౬౩-వ సంవత్సరప్రాంతమున రణ నిహతుఁ డయ్యెను అంతటితో సీతనిరాజ్య మంతరించెను. అప్పటికి భారతము రచింపఁబడలేదు. అందుచేత సోమదేవ రాజీయాదుల యందుఁ జెప్పఁబడిన భారతశ్రవణకథ కవికల్పిత మనుటకు సందేహము లేదు. [సోమదేవరాజీయాదులయందలి వాక్యములనుబట్టి భారతరచన యంతకుమున్నే జరిగిన ట్లూహింపవీలులేదు. తిక్కన సంస్కృత భారతమును జదివి వినిపించి గణపతిదేవుని మెప్పించి యుండును. కావున పయిగ్రంథములోని వాక్యములు విరుద్ధములని యనుకొననక్కఱలేదు ]

కవియొక్క కాలనిర్ణయమునుగూర్చి యింకొక చిన్న యాధారమును మాత్రము చూపి యీ విషయము నింతటితో విడిచిపెట్టెదను. పద్మపురాణోత్తరఖండము మొదలైన బహుకావ్యములను రచియించిన మడికి సింగన్న తన పితామహుఁడైన యల్లాడమంత్రికి తిక్కనసోమయాజితోఁ గల బంధుత్వమును తన వాసిష్ఠరామాయణములో నీ క్రింది పద్యమునఁ దెలిపి యున్నాఁడు.

సీ. అతఁడు తిక్కనసోమయాజులపుత్రుడై
కొమరారు గుంటూరికొమ్మవిభుని
పుత్రిచిట్టాంబిక బుధలోకకల్పక
వల్లి వివాహమై వైభవమున
భూసారమగు కోట భూమిఁ గృష్ణానది
దక్షిణతటమున ధన్యలీల
నలరు రావెల యను నగ్రహారము తన
కేకభోగంబుగా నేలుచుండి

యందుఁ గోవెల గట్టి గోవిందునన్న
గోపినాథుఁ బ్రతిష్ఠయుఁ గోరి చేసి
యఖిలభువనంబులందును నతిశయిల్లె
ననుజమందారుఁ డల్లాడమంత్రివిభుఁడు.'

ఈ యల్లాదమంత్రి తిక్కనసోమయాజిమనుమరాలిభర్త: కవి సింగన్న యల్లాదమంత్రి మనుమడు. తిక్కనసోమయాజిపుత్రుఁడు కొమ్మన; కొమ్మనకూఁతురు చిట్టాంబ కల్లాదమంత్రివలనఁ గలిగిన పుత్రుఁడయ్యలమంత్రి; అయ్యలమంత్రి పుత్రుడు గ్రంథకర్త యైన సింగన్న. ఈ కవి తాను పద్మోత్తరఖండమును రచించిన కాలము శకవర్షము ౧౩౪౪ అయినట్లా పురాణమునం దీక్రిందిపద్యమునఁ జెప్పియున్నాడు.

మంగళమహాశ్రీ వృత్తము

"ఆకరయుగానలమృగాంకశకవత్సరములై పరఁగు శార్వరిని బాహ్య
ప్రాకటితమార్గశిరపంచమిని బొల్పు నుడుపాలసుతవాసరమునందున్
శ్రీకరముగా నుడికి సింగన చెనుంగున రచించెఁ దగఁ బద్మపురాణం
బాకమలమిత్రశశిరాఁతువుగఁ గందసచివాగ్రణికి మంగళమహాశ్రీ."

ఈ పుస్తకము శాలివాహనశకము ౧౩౪౪ శార్వరి సంవత్సర మార్గశిర పంచమీ బుధవారమునం దనఁగా క్రీస్తుశకము ౧౪౨౨-వ సంవత్సరము నందు ముగింపఁబడెను. ఈ కవికిని తిక్కనసోమయాజికిని నడుమను మూఁడు తరములుమాత్రము చెల్లినవి. ఒక్కొక్క తరమున కంతరము నలుబదేసి సంవత్సరములచొప్పునఁ జూచినను తిక్కనసోమయాజి ౧౩౦౦ సంవత్సరప్రాంతమున నుండి యుండవలెను పయి పద్యములలో మొదటి దానియందు "తిక్కనసోమయాజులపౌత్రుఁడై కొమరారు గుంటూరికొమ్మ విభుని" అను పాఠము కొన్ని ప్రతులలోఁగానఁబడు చున్నది. అది ప్రమాదజనితమైన యపపాఠము కొమ్మన్న సోమయాజుల పుత్రుఁడు గాని పౌత్రుఁడు గాడు. సోమయాజులవంశజులలో నిప్పుడు జీవించియున్న పాటూరి శరభరాజుగారిచే నీయఁబడిన వంశానుక్రమణిక యీ విధముగా నున్నది

సీ. 'భారతపర్వము ల్పదియేను వరుసగాఁ
　　　దెనిఁగించె గుంటూరితిక్కయజ్వ
యా మహాత్మునిపుత్రుఁడౌ కొమ్మనఘనుండు
　　　కల్పించెఁ బాటురికరిణీకంబు

నా కొమ్మనకుఁ గల్గె హరిహరామాత్యుండు
నెమ్మితో నతనికిఁ గొమ్మఘనుఁడు
రహిమీఱ నతనికి రామన తిప్పన
యా రామనకు సోమయాహ్వయుండు
ఆ ఘనునకు వీరనామాత్యుఁ డతనికి
సోమలింగమంత్రి యా మహాత్మ
నకును సోమరాజనామఁడుఁ జిటివీర
ఘనుఁ డనంగ సుతులు గలిగి రందు.

సీ. సోమమంత్రికిఁ గల్గె సుతుఁడు పాపనమంత్రి
యతనికి వీరన యా ఘనునకుఁ
గూరిమితనయులు గోపాలభద్రార్య
నరసింహమంత్రు లనంగ ముగురు
వారిలో నరసింహవరునకు శరభార్యుఁ
డును భాస్కరామాత్యుఁడు నరసింహ
ఘనుఁ డనఁ బుత్రులు కలిగిరి మువ్వురు
వారిలో శరభార్యవర్యునకును
వీరఘనుఁడు గలిగె వేడ్కనా మంత్రికి
శరభమంత్రి వరుఁడు జననమొందె
ప్రబలి యున్నవాఁడు పాటూరిలోఁ దన
కులము వర్ధిలంగఁ గొమరుమీఱ'

ఈ పద్యములు రెంటిలో మొదటిది పూర్వరచిత మని చెప్పి శరభరాజు గారిచ్చినది; రెండవది శరభరాజుగా రిచ్చిన వంశానుక్రమణికను బట్టి బ్రహ్మశ్రీ శతఘంటము వేంకటరంగశాస్త్రిగారిచే రచియింపఁబడినది. ఇప్పుడున్న శరభరాజుగారికిని తిక్కనసోమయాజిగారికిని నడుమ ౧౩ తర ములు చెల్లినవి. ఆద్యంతములయం దున్న వీరి నుభయులనుగూడఁ గలుపుకొని తరమొకటికి నలువదేసి సంవత్సరములచొప్పున పదునేనుతర

ముల కాలమునాలు సంవత్సరములు లెక్క వేసినను తిక్కనసోమయాజి
కాలము ౧౩౦౦ ల సంవత్సరముకంటె మునుకకు పోదు. ('ఆంధ్రకవి
తరంగిణి' కారులు తిక్కనసోమయాజి చరిత్రములో కవి కాలమును గురించి
విపులముగాఁ జర్చించి, యీ 'ఆంధ్రకవుల చరిత్రము' నందలి విషయము
లను గూర్చి తమ యభిప్రాయమును తెల్పిరి. తమ సిద్ధాంతమును వివ
రించిరి. దాని సారము మాత్ర మిచట తెలుపఁబడుచున్నది.

'బ్ర. శ్రీ వీరేశలింగము పంతులుగారాంధ్రకవుల చరిత్రమునఁ దిక్కన
కాలమును సరిగానే నిర్ణయించిరి కాని, వారు గైకొనిన యాధారములు
సంశయాస్పదములుగా నున్నవి వారాధారముగాఁ గైకొనిన పెంట్రాల
శాసనములు మన మనుమసిద్ధివి గావనియు, ముక్కంటికాడువెట్టి వంశ
యుఁడైన భుజ బల వీర మనుమసిద్ధివనియుఁ దోఁచుచున్నది. మనుమ
సిద్ధి నామధారులు పెక్కురున్నారు? (రెండవ సంపుటము పుట 196)

'బ్ర. శ్రీ వీరేశలింగము పంతులుగారీ (వాటూరి శరభరాజుగారిచ్చిన)
వంశావళినిబట్టి తిక్కనకాలమును నిర్ణయింప యత్నించిరి. ఇప్పుడు శాసన
సాహాయ్యమున నీ మహాకవికాలము స్పష్టముగాఁ దెలియుచున్నది. కావున
నందుల కీ వంశావళితోఁ బనిలేదు' (రెండవ సంపుటము పుట 155)

తిక్కన నిర్వచనోత్తర రామాయణమును కీ శ. 1253-1258 నడుమ రచించి
యుండుననియు ఇతఁడును, కృతిపతియగు మనుమసిద్ధియు నించుమించుగ
సమవయస్కులనియు, అప్పటికి తిక్కన వయస్సు నలువది సంవత్సరము
లుండుననియు, నందుచే నీతని జననము క్రీ శ. ౧౨౨౦ ప్రాంతమున
నుండుననియు మనుమసిద్ధి నిర్యాణానంతరము భారతరచన ప్రారంభింపఁ
బడి యుండుననియు, ఆ రచన క్రీ శ. 1270-1280 ల నడుమ జరిగి
యుండుననియు నందు వివరింపఁబడియున్నది. తిక్కన నిర్యాణమును
గూర్చిన 'అంబర రవి శశి ..? అను పద్యము ప్రమాణము కానందున,
దానింబట్టి తిక్కన నిర్యాణకాలమును నిర్ణయించుట సరికాదని అందఱు
నంగీకరింతురు. తిక్కన 78 ఏండ్లు జీవించియుండెనని వాడుక యున్నందున
అతనికాలము క్రీ. శ. ౧౨౨౦ మొదలు ౧౩౦౦ వఱకు నుండవచ్చునని
యూహింపవచ్చును.)

కవితిక్కన నియోగిబ్రాహ్మణుఁడు ఈతనిపూర్వుల నివాసస్థలము మొట్ట మొదట కృష్ణామండలములోని వెల్లటూరుగ్రామమనియు, ఉద్యోగధర్మము చేత వా రీతనితాతకాలమున గుంటూరునకు వచ్చిరనియు, తరువాత నెల్లూరిరా జగు మనుమసిద్ధి యీతనికుటుంబము నాదరించి నెల్లూరికిఁ దీసికొనివచ్చి పూర్వము హరిహరదేవాలయ ముండిన యిప్పటి రంగనాయకస్వామి యాలయసమీపమున గృహము కట్టించి యిచ్చి తిక్కనసోమయాజుల నం దుంచె ననియు, మనుమసిద్ధిమరణముతో నా రాజవంశ మంతరింపఁగా సోమయాజుల కొడుకు కొమ్మన్న పాటూరి కరిణీకము సంపాదించి నెల్లూరు విడిచి యందు వసించెననియు, చెప్పుచున్నారు ఈ పాటూరిగ్రామము నెల్లూరికి పడమట రెండు మూఁడుక్రోసులదూరమున నుత్తరపినాకినీతీర మునం దున్నది. ఈ కవియొక్క పితృపితామహులది గుంటూ రగుటచేత నీతనియింటిపేరు గుంటూరివా రని చెప్పుదురు. నా కిటీవల లభించిన కేతనకృత మైన దశకుమారచరిత్రమునుబట్టి చూడఁగా దిక్కనసోమయాజి యింటిపేరు కొట్టరువువా రయినట్టు తెలియవచ్చినది. తిక్కనసోమయాజి కంకితముచేయఁబడిన యీ గ్రంథమునం దీతనివంశావళి సమగ్రముగా వర్ణింపఁబడినది. దశకుమారచరిత్రమునందు సోమయాజి తాత యైన మంత్రిభాస్కరుఁ డిట్లు వర్ణింపఁబడెను.

శా. 'శాపానుగ్రహశక్తియుక్తుఁ డమలాచారుండు సాహిత్యవి
ద్యాపారీణుఁడు ధర్మమార్గపథికుం డర్థార్థిలోకావన
వ్యాపారవ్రతుఁ డంచుఁ జెప్పు సుజనవ్రాతంబు గౌరీపతి
శ్రీపాదప్రవణాంతరంగు విబుధశ్రేయస్కరున్ భాస్కరున్.'

కృతికర్త యీ భాస్కరమంత్రి గ్రంథరచన చేసినట్టు చెప్పకపోయినను "శాపానుగ్రహశక్తియుక్తుఁడు" అనియు, "సాహిత్యవిద్యాపారీణుఁడు" అనియు చెప్పుటచేతనే యాతఁడు కవియైన ట్లూహచేయవచ్చును.

కవి యటుతరువాత భాస్కరునికి నలుగురు పుత్రు లయిన ట్లీ క్రింది పద్యములలోఁ జెప్పెను.

ఉ. ధీనిధి భాస్కరార్యునకు ధీరగుణాన్విత కొమ్మమాంబకునున్
మానవకోటిలోపల సమస్తగుణమ్ములఁ వాఁడు పెద్దనా
వానికి వాఁడు పెద్ద యన వానికి వానికి వాఁడు పెద్దనా
వానికి వార లందఱకు వాఁ డధికుం డనఁ బుట్టి రాత్మజుల్.

సీ. వివిధవిద్యాకేళిభవనభావంబున
జలజజుముఖచతుష్టయముఁబోలి
విబుధవిప్రతిపత్తివిదళనక్రీడమై
జలశాయిభుజచతుష్టయముఁబోలి
ధర్మమార్గక్రియాదర్శకత్వంబున
సమ్నుతాగమచతుష్టయముఁబోలి
పృథుతరప్రథితగాంభీర్యగుణంబున
శంబరాకరచతుష్టయముఁబోలి

సుతచతుష్టయంబు నుతి కెక్కె గుణనిధి
కేతనయును బారిజాతనిభుఁడు
మల్లనయును మంత్రిమణి సిద్ధనయు రూప
కుసుమమార్గణుండు కొమ్మనయును

తిక్కనసోమయాజియొక్క పెద్దతండ్రులలో మొదటివాఁడును, రెండవ వాఁడును నయిన కేతనను మల్లనను వారి తనయులను వర్ణించినతరువాత, సోమయాజికి మూఁడవపెదతండ్రియు, మనుమభూపాలుని తండ్రియైన తిక్కరాజుమంత్రియు నైన సిద్ధనామాత్యునిని, అతని యగ్రపుత్రుఁ డయిన రణతిక్కనను ఇట్లు వర్ణించెను.

ఉ. స్థాపితసూర్యవంశవసుధాపతినాఁ బరతత్త్వభూతవా
ణీపతినా నుదాత్తనృపనీతిబృహస్పతినా గృహస్థగౌ
రీపతినాఁ గృపారసపరిత్పతినాఁ బొగడొందె సిద్ధసే
నాపతిప్రౌఢ తిక్కజననాథశిఖామణి కాప్తమంత్రియై.

క. సామాద్యుపాయపారగుఁ
డాముష్యాయణుఁడు సిద్ధనామాత్యునకున్
గామితవవిసుత్రాణన
భూమిజనితకల్పవల్లి ప్రోలాంబికకున్.

సీ. విపులనిర్మలయశోవిసరగర్వీకృత
దిక్కండు నాఁదగు తిక్కనయును
దర్పితక్రూరశాత్రవసముత్కరతమో
భాస్కరుం డనఁదగు భాస్కరుండు
నప్రతిమానరూపాధరీకృతమీన
కేతనుం డనఁదగు కేతనయును
నిజభుజాబలగర్వనిర్జితోగ్రప్రతి
మల్లుండు నాఁదగు మల్లనయును
శ్రీయుతుండు చౌహత్తనారాయణుండు
మల్లనయు నీతివిక్రమమండనుండు
పిన్నభాస్కరుండును బుధప్రీతికరుఁడు
పెమ్మనయు నుదయించిరి పెంపు వెలయ.

వ. అందగ్రసంభవుండు.

సీ. వేఁడిన ః ర్థార్థి వృథపుచ్చనేరని
దానంబు తనకు బాంధవుఁడు గాఁగ
నెదిరిన జమునైన ట్రవికి పోవఁగనీని
శౌర్యంబు తన కిష్టసఖుఁడు గాఁగ
శరణువొచ్చిన శత్రువరునైన రక్షించు
కరుణయె తనకు సంగాతి గాఁగఁ
బలికినఁ బాండవప్రభునైన మెచ్చని
సత్యంబు తనకు రక్షకుఁడు గాఁగ

జగతి నుతికెక్కె రాయవేశ్యాభుజంగ
రాజ్యరత్నాకరస్ఫూర్తి రాజమూర్తి
గంధవారణబిరుదవిఖ్యాతకీర్తి
దినపతేజుండు సిద్ధయతిక్కశౌరి.'

అటుపిమ్మట గృతికర్త యయిన యభినవదండి సోమయాజుల తల్లిదండ్రుల నిట్లు వర్ణించెను——

సీ. స్వారాజ్యపూజ్యుఁడో! కౌరవాధీశుఁడో
నాఁగ భోగమున మానమున నెగడె
రతినాథుఁడో దినరాజతనూజుఁడో
నాఁగ రూపమున దానమున నెగడె
ధరణీధరేంద్రుఁడో ధర్మసంజాతుఁడో
యనఁగ ధైర్యమున సత్యమున నెగడె
గంగాత్మజన్ముఁడో గాండీవధన్వుఁడో
యనఁగ శౌచమున శౌర్యమున నెగడె

సూర్యవంశకభూపాలసుచిరరాజ్య
వనవసంతుండు బుధలోకవత్సలుండు
గౌతమాన్వయాంభోనిధిశీతకరుఁడు
కులవిధానంబు కొట్టరుకొమ్మశౌరి.

క. అతఁడు రతిఁ జిత్తసంభవు
గతి రోహిణిఁ జంద్రుమాడ్కిఁ, గమలావాసన్
శతదళలోచను క్రియ, న
ప్రతిమాకృతి నన్నమాంబఁ బరిణయ మయ్యెన్.

సీ. పతిభక్తి నలయరుంధతి పోలెనేనియు
సౌభాగ్యమహిమ నీ సతికి నెనయె?
సౌభాగ్యమున రతి సరియయ్యెనేని భా
గ్యంబున నీ యంబుజాక్షి కెనయె?

భాగ్యంబునందు శ్రీపతి యయ్యెనేనియుఁ
దాలిమి నీ లతాతన్వి కెనయె?
తాలిమి భూదేవి తగుపాటి యగునేని
నేర్పున నీ పద్మనేత్ర కెనయె?

యని యనేకవిధంబుల నఖిలజనులు
పొగడ నెగడెఁ గృపాపరిపూరితాంత
రంగ కొమ్మనామాత్యునర్ధాంగలక్ష్మి
యఖిలగుణగణాలంకృత యన్నమాంబ'

ఇట్లు వంశాభివర్ణనము చేసినతరువాతఁ గేతనకవి తిక్కనజన్మాదికమును జెప్పి యాతని నిట్లు వర్ణించెను—

వ. * * * అతండు జాతకర్మ ప్రముఖసంస్కారానంతరంబున వేదాదిసమస్తవిద్యాభ్యాసియగుచు ననుదినప్రవర్ధనంబుఁ జెంది తుహినభానుండునుంబోలె బహుకళాసంపన్నుండును, గార్తికేయుండునుంబోలె నసాధారణశక్తియుక్తుఁడును నధరీకృతమయూరుఁడునునై, పరమేశ్వరుండునుంబోలె లీలావిసర్జితకుసుమసాయకుండును నకలంక విభూత్యలంకృతుండునునై, నారాయణుండునుం బోలె ననంతభోగసంశ్లేష శోభితగాత్రుండును శ్రీమత్పురుషోత్తమత్వ ప్రసిద్ధుండును లక్ష్మీసమాలింగితవక్షుఁడునై వెలసె, నా తిక్కనామాత్యుగుణవిశేషంబు లెట్టి వనిన.

సీ. సుకవీంద్రబృందరక్షకుఁ డెవ్వఁ డనిన వీఁ
డను నాలుకకుఁ దొడవైనవాఁడు
చిత్తనిత్యస్థితశివుఁ డెవ్వఁ డనిన వీఁ
డను శబ్దమున కర్థమైనవాఁడు
దశదిశావిశ్రాంతయశుఁ డెవ్వఁ డనిన వీఁ
డని చెప్పుటకుఁ బాత్రమైనవాఁడు
సకలవిద్యాకళాచణుఁ డెవ్వఁ డనిన వీఁ
డని చూపుటకు గుఱియైనవాఁడు

మనుమసిద్ధిమహీశసమస్త రాజ్య
భారాధౌరేయుఁ డభిరూపభావభవుఁడు
కొట్టరువుకొమ్మనామాత్యుకూర్మిసుతుఁడు
దీనజనతానిధానంబు తిక్కశౌరి.

క. అగు ననఁ గొమ్మయతిక్కఁడు
జగతి నపూర్వార్థ శబ్దచారుకవితమై
వెగడిన 'బాణోచ్ఛిష్టం
జగత్రయం' బనిన పలుకు సఫలం బయ్యెన్.

క. కృతులు రచియింప సుకవుల
కృతు లొప్పఁ గొనంగ నొరునికిం దీరునె? వా
కృతనిభుఁడు వితరణశ్రీ
యుతుఁ డన్నమసుతుఁడు తిక్కఁ డొకనికిఁదక్కన్.

క అభినుతుఁడు మనుమభూవిభు
సభఁ దెనుఁగున సంస్కృతమునఁ జతురుండై తా
నుభయకవిమిత్రనామము
త్రిభువనముల నెగడ మంత్రితిక్కఁడు దాల్చెన్.

సీ. సరసకవీంద్రుల సత్ప్రబంధము లొప్పఁ
గొను నను టధికకీర్తనకుఁ దెరువు
లలితనానాకావ్యములు చెప్పు నుభయభా
షలయందు ననుట ప్రశంసత్రోవ
యర్థిమైఁ బెక్కూళ్ళ నగ్రహారంబుల
గా నిచ్చు ననుట పొగడ్త పొలము
మహితదక్షిణ లైన బహువిధయాగంబు
లొనరించు ననుట వర్ణనముదారి

పరుని కొక్కని కిన్నియుఁ బ్రకటవృత్తి
నిజములై పెంపు సొంపారి నెగడునట్టి
కొమ్మనామాత్యతిక్కనకొలఁదిసచివు
లింక నొక్కరుఁ డెన్నఁగ నెందుఁ గలఁడు?

ఈ పద్యములలో స్పష్టముగాఁ జెప్పకపోయినను తిక్కన రామాయణాది గ్రంథములను జేసినట్టును, క్రతువులు చేసినట్టును గవి సూచించియున్నాఁడు. దశకుమారచరిత్రమును కృతి నందునప్పటికి తిక్కన భారతరచన మారంభించి యుండఁడు; కేతన యెక్కడను తిక్కన్నను సోమయాజి యని చెప్పి యుండకపోవుటచేత నతఁ డప్పటికి యజ్ఞము సహితము చేసియుండఁడు. ఆధానమును జేసి యుండునేమో! తిక్కన్న మనుమసిద్ధిమంత్రిగా నుండి సంపదలతోఁ దులదూఁగుచున్న కాలముననే కేతన యాతనికి దశకుమార చరిత్రము నంకితము చేసెను. మఱియు నీతని వంశాభివర్ణనమునుబట్టి ముగ్గురు తిక్కనులు లే రనియుఁ గవితిక్కనయే మంత్రితిక్కన యనియు రణతిక్కన యనియు ఖడ్గతిక్కన యనియుఁ జెప్పఁబడునతఁడు కవితిక్కనకుఁ బితృవ్యపుత్రుఁడనియు స్పష్టపడితది.

కొమ్మన్ననుండి యాతని సంతతివారు పాటూరివా రయినారు. ఈ తిక్కన కవి గౌతమగోత్రుఁడు. ఈతని తండ్రి కొమ్మన; తల్లి అన్నమ్మ. కేతన, మల్లన, సిద్ధన, అనువా రీతని పెదతండ్రులు. * ఈ కవిగ్రామణియొక్క

---

* సీ. మజ్జనకుండు సన్మాన్యగౌతమగోత్ర
మహితుండు భాస్కరమంత్రితనయుఁ
డన్నమాంబాపతి యనఘులు కేతన
మల్లన సిద్ధనామాత్యవరుల
కూరిమితమ్ముండు గుంటూరివిభుఁడు కొ
మ్మనదండనాథుఁడు మధురకీర్తి
విస్తరస్ఫారుఁ డాపస్తంబసూత్రప
విత్రశీలుఁడు సాంగవేదవేది
యర్థిఁ గల వచ్చి వాత్సల్య మతిశయిల్ల
నస్మదీయప్రణామంబు లాదరించి
తుష్టి దీవించి కరుణార్ద్రదృష్టిఁ జూచి
యెలమి నిట్లని యానతి యిచ్చె నాకు. —విరాటపర్వము.

మ. అమలోదాత్తమనీష నే నుభయకావ్యప్రౌఢిఁ బాటించుశి
ల్పమునం బారగుఁడం గళావిదుఁడ నాపస్తంబసూత్రుండ గౌ
తమగోత్రుండ మహేశ్వరాంఘ్రికమలధ్యానైకశీలుండ న
న్నమకుం గొమ్మనమంత్రికిన్ సుతుఁడఁ దిక్కాంకుండ సన్మాన్యుఁడన్.
—నిర్వచనోత్తరరామాయణము.

తండ్రిదితాతలు రాజాస్థానములయందు గొప్పకొలువులు చేసి ప్రభుసన్మా నము పొంది మిక్కిలి ప్రసిద్ధి కెక్కినవారు. కవితండ్రి యైన కొమ్మన మంత్రి కృష్ణామండలములోని గుంటూరునకు దండనాథుఁడయి యుండెను. తాతయైన భాస్కరుఁడు గుంటూరి కధిపతిగా నుండి విద్యలయం దసమానుఁ డయి మంత్రిభాస్కరుం డని విఖ్యాతి కెక్కెను. మొట్టమొదట రామాయణ మును పద్యకావ్యమునుగా తెనిఁగించిన మహాకవి యితఁడే యని చెప్పుదురు. ఆ గ్రంథ మీయనపేరనే భాస్కరరామాయణమని నేఁటివఱకును ప్రసిద్ధి చెందుచున్న దనియుఁ జెప్పుదురు ఇప్పుడున్న భాస్కరరామాయణమున కాపేరు హుళక్కిభాస్కరునివలననే కలిగినదిగాని మంత్రిభాస్కరునివలనఁ గలిగినదిగా కనఁబడదు *

రామాయణ మంతకు ముందు రచియింపఁబడి యుండుటచేతనే తిక్కనసోమ యాజి రామాయణముయొక్క యుత్తరకాండమును తెనిఁగింప నారంభించె ననియు పోతరాజకృతభాగవతములోని కొన్నిభాగము లాతని యనంతర మున నుత్సన్నము లయి పోఁగా పోయిన భాగములను వెలిగందల నారాయ ణాదులు పూరించినట్లె భాస్కరవిరచితరామాయణమునహిత మొక్క యారణ్యకాండము తక్క తక్కినభాగములు కొంతకాలమున కుత్సన్నములు కాఁగా మిగిలినకాండములను హుళక్కి భాస్కరాదులు పూరించిరనియు కొంద ఱందురు కాని యీ యంశమును స్థాపించుటకు నిర్బాధకము లైన యాధారము లేవియుఁ గానరావు ఈ మంత్రిభాస్కరుఁడు రామాయణమును రచియించి యుండినయెడల, తిక్కన తన నిర్వచనోత్తరరామాయణమునం దా మాట నేల చెప్పియుండఁడు ? ఇది యింకను విమర్శనీయ మయిన వివాదాంశము. ♦

---

[ * 'మంత్రిభాస్కరుఁడు' అను శీర్షికక్రింద నీవిషయము చర్చింపఁబడినది. మంత్రిభాస్కరునిఁబట్టియు 'భాస్కరరామాయణ' మను పేరు కలుగవచ్చును ]

[ ♦ ఇందలి 'మంత్రిభాస్కరుఁడు, హుళక్కిభాస్కరుఁడు' అను శీర్షికలలోని విషయములను గమనించునది ]

తిక్కన తాను రచియించిన నిర్వచనోత్తర రామాయణమునందు

గీ. 'సారకవితాభిరాము గుంటూరివిభుని
మంత్రిభాస్కరు మత్పితామహునిఁ దలఁచి
యైన మన్ననమెయి లోక మాదరించు
వేఱ నా కృతిగుణములు వేయునేల ?'

అవి తన కావ్యము స్వగుణముచేతఁ గాకపోయినను తన తాత యైన మంత్రి భాస్కరునిసారకవిత్వమహిమచేత నయినను లోకాదరణమునకు పాత్ర మగునని చెప్పియున్నాఁడు మంత్రిభాస్కరుని వితరణాదులను గుఱించి కవులు పెక్కండ్రు పెక్కు పద్యములను జెప్పి యున్నారు. వితరణమును గూర్చి ప్రసిద్ధుఁ డయిన మంత్రిభాస్కరుఁడు రాయనభాస్కరుఁడు ఈ క్రింది చాటువు రామయామాత్యభాస్కరుని ప్రఖ్యాతిని జెప్పు నదియె యైనను మనోహరముగా నుండుటచే నిందుఁ జేర్పఁబడినది

మ. సరి బేసై రిపు డేల భాస్కరులు భాషానాథపుత్రా ', వసుం
ధరయం దొక్కఁడు మంత్రియయ్యె నినుకొండన్, రామయామాత్యభా
స్కరుఁడో, యా, నయినన్ సహస్రకరశాఖ ల్లే, వవే యున్న వే
తిరమై దానము చేయుచో రిపుల హేతి న్వ్రేయుచో వ్రాయుచోన్.'

రావిపాటి తిప్పరాజు.

ఈ కవిపూర్వులు లౌకికాధికారధూర్వహు లగుటయే కాక యీతనిది పండిత వంశ మనియు నిందువల్ల తేటపడుచున్నది. ఈయన తండ్రి యయిన కొమ్మన్న శివలీలావిలాస మను గ్రంథమును రచించినట్టు చెప్పుచున్నారు. శివలీలావిలాసమును రచియించిన కొమ్మన్న తిక్కనసోమయాజుల తండ్రి కాక శ్రీనాథునికాలములో రాజమహేంద్రవరమును పాలించుచుండిన వీర భద్రారెడ్డియొక్క తమ్ముఁడైన దొడ్డభూపతికిఁ దన పుస్తకము నంకిత మొనర్చిన నిశ్శంక కొమ్మనామాత్యుఁడని యిటీవల లభించిన యా పుస్తక మునుబట్టి తెలియుచున్నది. నెల్లూరికి రా జయిన మనుమనృపాలుని యాస్థానకవీశ్వరుఁడుగా నుండిన యీతఁడు కవితిక్కన యనియు, ఆ రాజు కడ మంత్రిగా నుండిన యీతని పెదతండ్రి పెద్దకుమారుఁడు కార్యతిక్కన

యనియు, సేనానాయకుఁడుగా నుండిన యాతనితమ్ముఁడు ఖడ్గతిక్కన యనియు, ప్రసిద్ధి చెందినట్లు చెప్పుదురుగాని పూర్వోదాహృతపద్యములను బట్టి తిక్కన లిరువురే యైనట్టు స్పష్టపడుచున్నది.

తిక్కనసోమయాజికొమారుఁడు కొమ్మన్న. తిక్కనసోమయాజి సూర్యవంశపురాజై నెల్లూరిమండలమున కధినాథుఁడుగా నుండిన మనుమసిద్ధికడ నాస్థానకవిగా నుండినను, ఆ రాజున కాశ్రితునివలె నుండక యాతనిచే సమానుఁడుగాఁ జూడఁబడి గౌరవింపఁబడుచుండెను. రాజునకును, కవికిని మామవరుస ఈ కవీంద్రుఁడు రచియించిన నిర్వచనోత్తరరామాయణము కృతి నందిన మనుమభూపాలుడు

క. 'ఏ నిన్ను మామ యనియెడు
దీనికిఁ దగ నిమ్ము భారతీకన్యక నా
కీ నర్హుఁడ వగు దనినను
భూనాయకుపలుకు చిత్తమున కింపగుడున్'

'నిన్ను మామా! యని పిలుచుచున్నందునకై భారతీకన్యను నాకిమ్మని యడిగినట్లు చెప్పఁబడి యున్నది తిక్కన నిర్వచనోత్తరరామాయణము నందు నన్నపార్యుని పూర్వకవిని గా వర్ణింపలేదు, అనంతరమున రచియించిన భారతమునందైనను,

ఉ. ఆదరణీయసారవివిధార్థగతిస్ఫురణంబు గల్గి య
ష్టాదశపర్వనిర్వహణసంభృతమై పెనుపొందియుండు న
ద్దాదిఁ దొడంగి మూఁడు కృతు లాంధ్రకవిత్వవిశారదుండు వి
ద్యాదయితుండు దొనర్చె మహితాత్ముఁడు నన్నయభట్టు దక్షతన్.

ఆంధ్రకవితావిశారదుండైన నన్నయభట్టు మొదటి మూఁడు పర్వములను తెనిఁగించెనని చెప్పెనేకాని యాతని నాదికవినిగాఁ జెప్పి స్తుతింపలేదు. అందుచేతఁ దిక్కన నన్నయభట్టారకుని నూత్నకవినిగాఁ బరిగణించినట్టు స్పష్టమగుచున్నది. ఇది యిట్లుండఁగా నిర్వచనోత్తరరామాయణమునందు

వ 'హరిహరపద్మగర్భులను నాదికవీంద్రుల నూత్నసత్కవీ
శ్వరులను భక్తిఁ గొల్చి మఱి వారికృపన్ గవితావిలాసవి
స్తరమహనీయుఁడైన నను సర్వగుణోత్తరమూర్తి మన్మభూ
వరుఁడు తగంగ రాఁబనిచి వారనిమన్నన నాదరించుచున్.'

అని యాదికవీంద్రులను, నూత్నకవీంద్రులను స్తుతించుటచేత నన్నయాదు లకుఁ బూర్వమునందుఁ గూడ నాంధ్రకవీంద్రు లనేకు లున్నట్టు స్పష్టపడు చున్నది *

తిక్కన రచియించిన తెనుఁగుకావ్యములు రెండు, అందు మొదటిది నిర్వచ నోత్తరరామాయణము ఈ గ్రంథము రచించునప్పటి కీతఁడు యజ్ఞము చేయలేదు. తక్కిన తెనుఁగుపుస్తకములవలెఁ గాక రఘువంశాది సంస్కృత కావ్యములవలె దీని నీ కవి నడుమ నడుమ వచనము లుంచక సర్వమును పద్యములుగానే రచించెను. ఈతఁడు రచించిన భారతమువలె నీ యుత్తర రామాయణ మంత రసవంతముగాను, ప్రౌఢముగాను లేకపోయినను, పద వాక్య సౌష్ఠవము కలిగి మొత్తముమీఁద సరసముగానే యున్నది. ఇది బాల్యమునందు రచియింపఁబడినదగుటచే నిట్లుండి యుండును. ఈ గ్రంథమునందు పదకాఠిన్య మంతగా లేకపోయినను, బహుస్థలములయం దన్వయ కాఠిన్యము గలదు ఇందలి కథ సంస్కృతములో నున్నంత లేక మిక్కిలి సంగ్రహపఱుపఁబడినది శైలి పలుచోట్ల నారికేళపాక మనియే చెప్పవచ్చును. అందుచేతనే యీ గ్రంథము భారతమువలె సర్వత్ర వ్యాపింపకున్నది ఇతఁడు పది యాశ్వాసములగ్రంథమును వ్రాసినను పుస్తకమునుమాత్రము ముగింపలేదు. రామనిర్యాణకథను చెప్పుట కిష్టము లేక గ్రంథపూర్తి చేయలే దని పెద్దలు చెప్పుదురు రామనిర్యాణకథను జెప్పుటకు భీతిల్లి దానిని వదలిపెట్టినయెడల, తిక్కన భారతమునందు స్త్రీపర్వకథయు, కృష్ణనిర్యాణమును జెప్పుట కేల భయపడ లే దని యొకరు ప్రశ్న వేయుచున్నారు !, ప్రతిమరణకథకును భయపడి దానిని విడుచుచు

* ఈకవులు తెలుఁగుకవులని నిశ్చయింప నాధారములులేవు సంస్కృతకవు లైన గావచ్చును, సంస్కృతకవులనుగూడ నాంధ్రకవులు స్తుతించుట పరిపాటి,

వచ్చినచో భారతమును రచింపకయే యుండి యుండవలెను. మరణమును జెప్పుట కిష్టము లేకుండుటయు భయపడుటయు కొందఱివిషయమునసే యుండును. ఏదియు లేకపోయినయెడల భారతమును రచించునంతటి దీర్ఘ కాలము జీవించియుండియు తిక్కన దాని నేల ముగించి యుండఁడు? తిక్కన సంపూర్ణముగానే రచించెననియు, తరువాత నా భాగ ముత్సన్న మయ్యెననియు నొకరు చెప్పుచున్నారు. ఈ యుత్సన్నకథ మనవారికి ప్రతివిషయమునందును చక్కఁగా తోడుపడుచున్నది. తరువాతఁ గొంత కాలమునకు మిగిలిన భాగము నేకాశ్వాసముగా రచియించిన జయంతి రామ భట్టు తిక్కన సోమయాజి మనుమరాజున కిచ్చినట్టుగా నరాంకితము చేయక తాను జేసిన కడపటి యాశ్వాసమును శ్రీ భద్రాద్రిరామున కంకితము చేసెను. తాను రచించిన యేకాదశాశ్వాసమున రామభట్టీక్రింది పద్యమును జెప్పి యున్నాఁడు.

ఉ తిక్కనసోమయాజి మును తెల్గున నుత్తరకాండ చెప్పి యం
దొక్కటి చెప్పఁ డయ్యెఁ గడు నొద్దిక నే రచియింప వేడ్కచే
నిక్కము సంస్కృతంబు విని నెమ్మది భక్తిని నే రచించితిన్
జక్కని దేవళంబుతుద స్వర్ణఘటం బిడుపోల్కి దోఁపఁగన్.'

నిర్వచనోత్తరరామాయణముయొక్క శైలిని గనఁబఱుచుట కయి రెండు పద్యము లిందు క్రిందఁ బొందుపఱుచుచున్నాను:

శా. మాలిం జంపిన మాల్యవంతుఁ డుదితామర్షప్రకర్షంబునం
గాలాగ్నిప్రతిమానుఁడై నిజభుజాగర్వంబుమై లీల ను
న్మీలజ్జ్వాలకరాళశక్తిఁ గొని మే మే దాఁకి వక్షస్స్థలిన్
గీలించెన్ జలదంబుపై మెఱుఁగుమాడ్కిన్ శౌరికిం జెన్నుగాన్.

ఆ. ౩.

చ. ఎఱుఁగవుగాక భోగముల కెల్లను నెచ్చెలి జవ్వనంబ యి
త్తఱి నుడి వోవకుండ నుచితంబుగ జక్కవదోయిఁబోని క్రి
క్కిఱిసిన చిన్ని చన్నుఁగవ యిం పెసలారఁగ నాదువక్ష మ
న్వఱలు సరోవరంబున నవారణఁ గేళి యొనర్పు కోమలీ!'

ఆశ్వాసము ౫.

ఈ కవి రచించినరెండవగ్రంథము భారతశేషము అరణ్య పర్వమువఱకును నన్నయభట్టు తెనిఁగించి మృతి నొందఁగా తరువాత నీ మహాకవి యారణ్య పర్వశేషమును మాత్రము విడిచిపెట్టి విరాటపర్వము మొదలుకొని తక్కిన పదియేను పర్వములను తెనిఁగించెను. ఆరణ్యపర్వము నాంధ్రీకరించుట చేతనే నన్నయభట్టు మతిభ్రమణము కలిగి మృతి నొందె నని తలఁచుకొని తాను దానిని తెలిఁగించినచో తన గతియు నట్లే యగు నన్న భీతిచేత నితఁడు దానిని తెనిఁగింపఁ డయ్యెను. అందుచేత తెనుఁగుభారతము కొంత కాలము పూర్ణముగా లేక కొఱఁతపడి యుండెను. ఆ కాలమునందు వ్రాయఁబడిన తాళపత్రగ్రంథములు కొన్ని యిప్పటికిని వనపర్వశేషము లేకయే కానఁబడుచున్నవి. తిక్కన భయపడి యరణ్యపర్వశేషమును తెనిఁగింపక విడిచి పెట్టలే దనియు, ఆతనికాలమునాటికి నన్నయభట్టుచేత రచియింపఁబడి యారణ్యపర్వము పూర్ణముగా నుండుటచేతనే యతఁడు విరాటపర్వ మారంభించి చేసె ననియు, తరువాత నారణ్యపర్వశేషము శంభుదాసుని కాలమునాఁటి కుత్సన్నము కాఁగా దాని నతఁడు పూరించె ననియు బుద్ధిమంతు లొకరు వ్రాయుచున్నారు. ఈ యుత్పన్నసిద్ధాంత కథ యిప్పుడు ప్రతిపూర్వగ్రంథవిషయములోను మనవారిచేతిలో నమూల్యసాధన మయి నిలిచి తోడుపడుచున్నది. శంభుదాసుఁడు తిక్కనసోమయాజికి తరువాత నేఁబది సంవత్సరముల లోపలనే యుండినవాఁడు నన్నయభట్టే నిజముగా నారణ్యపర్వమును పూర్ణముగాఁ దెలిఁగించి యుండినచో నిన్నూఱు సంవత్సరములు తిక్కనకాలమువఱకు చెడక యుండి నిలిచిన యా భాగము తరువాత నేఁబది సంవత్సరములకు శంభుదాసునికాలమునకు దేశములోని యన్ని ప్రతులలో నొక్కసారిగా నశించుట సంభవించి యుండదు. నన్నయ దానిని చేయనే లే దనుటయే యుక్తియుక్త మయి విశ్వాసార్హమయిన పక్షము. తిక్కన తా నెంతటి పండితుఁ డయినను తన కాలపువిశ్వాసములను భయములను లేనివాఁ డగుట సాధారణముగా సంభవింపనేరదు ఈ కవిని బట్టిన భీతియే తరువాత నారణ్యపర్వశేషమును జేసిన యెఱ్ఱాప్రెగడకును పట్టి తన పేరిట గ్రంథరచన చేయక రాజనరేంద్రున కంకితముగా నన్నయభట్టు

పేరు పెట్టియే దానిని రచించెను. అంతేకాక భారతమును చదువువారు సహి తము నేఁటి వఱకును ఆరణ్యపర్వములోని కొంతభాగము వదలియే మఱి గ్రంధపఠనము చేయుచున్నారు.

నన్నయభట్టు పోవునప్పటికిని పోయిన తరువాత రాజరాజనరేంద్రు డున్నప్పు డును తిక్కనసోమయాజి యున్నాఁ డని చెప్పెడు కధలు నమ్మఁదగినవి కాకపోయినను వినుటకు మాత్రము సొంపుగా నుండును. గనుక వానిలో నొక కధ నిందుఁ జెప్పుచున్నాను

తన కంకితముగా నాంధ్రీకరింప నారంభించిన భారతమును పరిసమాప్తి నొందింపకయే నన్నయభట్టు మృతి నొందినందుకు చింతాక్రాంతుఁడయి రాజనరేంద్రుఁడు దానిని తా నెట్లయిన సాంతము చేయింపవలె నని బహు ప్రయత్నములు చేసి బహుపండితులను రావించి చూపఁగా వా రెవ్వరును తన్మహాకార్యమునకు సమర్థులు కారైరఁట! నిర్వచనోత్తరరామాయణమును జేసి ప్రసిద్ధి నొందిన యొక యాంధ్రకవీంద్రుఁడు నెల్లూరియం దుండె నవియు, అతనివలన గ్రంధపరిసమాప్తికాఁగలదనియు. విని పండితుల యనుమతిమీఁద సభాపర్వములోని

మ. 'మదమాతంగతురంగకాంచనలసన్మాణిక్యగాణిక్యసం
　పద లోలిం గొని తెచ్చి యిచ్చి ముద మొప్పం గాంచి సేవించి ర
　య్యుదయాస్తాచలసేతుసీతనగమధ్యోర్వీపతు ల్వంతతా
　భ్యుదయున్ ధర్మజుఁ దత్సభాసితు జగత్పూర్ణప్రతాపోదయున్.'

అను పద్యమును తాటాకులమీఁద వ్రతులు వ్రాసి దానితో సమానమయిన పద్యమును వ్రాయుఁడని తక్కిన రాజాస్థానములయందలి పండితులకును, సిద్ధిరాజుసభయం దున్న తిక్కనకునుగూడఁ బంపినట్టును, మిగిలినవా రందఱును తమ తమకు తోఁచిన పద్యములను వ్రాసి పంపగాఁ తిక్కన మాత్ర మట్లు చేయక తా నా పద్యమునే మరల మఱియొక తాటాకుమీఁద వ్రాసి దానికి వర్ణమువేసి పంపినట్టును, రాజరాజనరేంద్రుఁడు మిగిలిన కవుల పద్యముల నన్నిఁటిని జదివి వానిలో నేదియు నన్నయపద్యముతో సరి

రాకపోయినందున వానిని నిరాకరించి తాను రచింపఁబోయెడు గ్రంథము నన్నయభట్టారకునికవిత్వమువలెనే యుండినను తన దంతకంటె మెఱుఁగుగా నుండునని సూచించుటకయి తిక్కన యట్లు చేసెనని గ్రహించి యాతనిని పిలిపించినట్లును, గ్రంథరచనకుఁ బూర్వమునం దాతనిచేత గౌతమీతీరమున యజ్ఞము చేయించి భారతము సంపూర్ణము చేయించినట్లును చెప్పుదురు. మఱికొంద అట్లు పంపిన పద్య మాదిపర్వములోని

ఉ. 'నిండుమనంబు నవ్యనవనీతసమానము, పల్కు దారుణా
ఖండలశస్త్రతుల్యము, జగన్నుత ! విప్రులయందు; నిక్క మీ
రెండును రాజులందు విపరీతము, గావున విప్రుఁ డోపు, నో
పం డతిశాంతుఁడయ్యు నరపాలుఁడు శాపముఁ గ్రమ్మఱింపఁగన్'

అనునది యనియు, రాజనరేంద్రుఁడు తిక్కనయభిప్రాయమును దెలిసి కొన్నమీఁదట తనవద్ద కా కవీంద్రునిఁ బంపుమని సిద్ధిరాజునకు విజ్ఞాపన పత్రమును పంపగాఁ నతఁ డా ప్రకారము చేసెద నని వాగ్దానము చేసె ననియు, పిమ్మటఁ దిక్కనను రప్పించి రాజనరేంద్రునికిఁ దాను జేసిన వాగ్దానమును జెప్పి నెల్లూరినుండి రాజమహేంద్రవరమునకుఁ బోవఁ బ్రార్థించె ననియు, ఆ రా జెన్నివిధముల జెప్పినను వినక తిక్కన రాజమహేంద్రవరము పో నని మూర్ఖపుపట్టుపట్టగా తనమాటకు భంగము వచ్చునని కోపించి రా జాతనితో నీవు నా యాజ్ఞప్రకారము పోని పక్షమున నీ మీసములు గొఱిగించి వాద్యములతో నగరివీధులవెంబడిని ద్రిప్పి యూరిబయల వేసిన తాటాకులపాకలోఁ బెట్టి నీచేత మాంసము తినిపించెద నని బెదరించెననియు, ఆగ్రహావేశముచేతఁ బలికిన యా రాజుతర్జనభర్జనము లకు భయపడక తిక్కన తనపట్టును వదలక స్థైర్యముతో నుండఁగా రాజ నరేంద్రుఁ డా సంగతి తెలిసికొని యెట్లయిన భారతమును తెనిఁగించినఁ జాలునని నెల్లూరిరాజయిన మనుమసిద్ధికి వర్తమానము పంపెననియు, తరు వాత సిద్ధిరాజు తిక్కనను బతిమాలుకొని తాఁ జేసిన ప్రతిజ్ఞ బొంకు గాకుండునట్లుగా, యజ్ఞదీక్షకు ముందు విధివిహిత మయిన క్షురకర్మ

చేయించి తిక్కనను వాద్యములతో నూరేగించి యూరివెలుపట వేయించిన యజ్ఞశాలయందు ప్రవేశపెట్టి యాతనిచేతను యజ్ఞముచేయించి పురోడాశము తినిపించె ననియు, అట్లు చేసినను రాజుమీఁది కోపము పూర్ణముగా తీఱక తిక్కన తన భారతము నా రాజునకుఁ గృతియియ్యక నెల్లూరియందున్న హరిహరనాథదేవున కంకితము చేసెననియు చెప్పుదురు. హరిహరనాథుని గుడి నెల్లూరియం దిప్పుడు శిథిలమయిపోయినదఁట! పయి కథ యెట్టి దయినను, తిక్కన నిర్వచనోత్తరరామాయణము చేయునప్పటికి యజ్ఞము చేయకుండుటయు, భారతమును రచించునప్పటికి యజ్ఞముచేసి యుండుటయు మాత్రము సత్యము. దీని సత్యమును "బుధారాధన విధేయ తిక్కననామధేయప్రణీతంబైన" యను నిర్వచనోత్తరరామాయణమునందలి గద్యమును బట్టియు "బుధారాధనవిరాజి తిక్కనసోమయాజి ప్రణీతం బయిన" యను భారతమునందలి గద్యమునుబట్టియు స్థాపింపవచ్చును. మిగిలిన యీ కథాంశమునం దేమాత్రము సత్యమున్నను తిక్కనసోమయాజి విరాటపర్వము యొక్క పీఠికయందే వ్రాసియుండును. ఆ పీఠికయందు రాజనరేంద్రుని పేరైన నెత్తఁబడి యుండక పోవుటయే తిక్కన రాజనరేంద్రుని కాలము వాఁడు కాఁ డనుటను సిద్ధాంతీకరించుచున్నది

తిక్కనసోమయాజి యీ భారతమును జెప్పు నప్పుడు దీనిని వ్రాయుటకయి నిర్ణయింపఁబడినవాఁడు * కుమ్మరగురునాథుఁడని చెప్పుదురు. ఆతనికి చెప్పిన

* ఈ కుమ్మర గురునాథుఁడు తిక్కనసోమయాజితండ్రియైన కొమ్మనామాత్యునకే పుట్టెననియు, కొమ్మనామాత్యుఁడు గర్భాధానార్థము మంచిముహూర్తము పెట్టుకొని తన యత్తవారింటికిఁ బోవుచుండఁగా నాకస్మికముగా పెన్నపొంగి నదిదాటుటకు శక్యముగాక తెడుగుపా డను గ్రామసమీపమున నిలిచిపోవలసి వచ్చెననియు, అప్పు డా గ్రామమునందున్న కుంభకారుఁ డొకఁ డాతని ప్రార్థించి తన యింటికిఁ గొనిపోయి యాదరించి యా సుముహూర్తమునందు సంపూర్ణయౌవనవతియు ఋతుస్నాతయు నయి యున్న తన కొమార్తెకు పుత్రదానము చేయవలెనని వేఁడుకొనెననియు, అతఁడు వాని ప్రార్థనను త్రోచివేయలేక యంగీకరించి యా రాత్రి యా కులాలయువతితో సంభోగింపఁగా గురునాథుఁ డను పుత్రుడు కలిగెననియు, ఒక కథ చెప్పుదురు. అది యెంతవఱకు నమ్మఁదగియుండునో దీనిని జదివెడువారే నిశ్చయించుకోవలెను.

దానిని మరల నడుగక వ్రాయఁగల శక్తి యున్నదట. దీనినిబట్టి చూడఁగాఁ బూర్వకాలమునందు బ్రాహ్మణేతరులలో సహితము చక్కఁగా చదువుకొన్నవా రుండియున్నట్టు విదిత మగుచున్నది. ఈ భారతమును రచియించునప్పుడు తిక్కనసోమయాజి తడవుకొనకుండ కవిత్వమును జెప్పెదననియు, తా నొక్కసారి చెప్పిన దానిని మరలఁ జెప్పననియు చెప్పినదాని నెప్పుడును మరల మార్చుకొనననియు ప్రతిజ్ఞ చేసినట్లును, చెప్పిన మాటను మరల నడుగక గురునాథుఁడు వ్రాయుచుండఁగా శల్య పర్వములో ప్రథమాశ్వాసము కడపట సహదేవుఁడు శకునిని చంపినతరు వాత దుర్యోధనుఁడు తొలఁగి పోయెనని ధృతరాష్ట్రునితో చెప్పు భాగమున

క. పలపలనిమూఁకలోఁ గా
   ల్నిలువక గుఱ్ఱంబు డిగ్గి నీ కొడుకు గదా
   కలితభుజుఁడగుచు నొక్కఁడుఁ
   దొలఁగి చనియె.'

అన్నంతవఱకు పద్యమును చెప్పి తరువాత నేమియు తోఁచక తిక్కన "యేమిచెప్పుదు గ్గురునాథా" యని కుమ్మర గురునాథు నడిగినట్లును, అతఁ డది తన్నడిగిన ప్రశ్నగా భావింపక పద్యముతోఁ జేర్చి

"తొలఁగి చనియె నేమిచెప్పుదు గ్గురునాథా!"

యని వ్రాసినట్లును, అప్పుడు తిక్కనసోమయాజి తన ప్రతిజ్ఞకు భంగము వచ్చెనని చింతించుచుండఁగా "నేమి చెప్పుదు గ్గురునాథా" యని కవి లేఖకునిగూర్చి యుద్దేశించినది "కురునాథా!" యని ధృతరాష్ట్రున కన్వయించి యా ప్రశ్నయే పద్యపూరణమున కనుకూలించెనని గురునాథుఁ డాతని నూరార్చినట్లును, ఒక కథను జెప్పుదురు. శ్రీమహాభారతము నాంధ్రీకరించిన యీ మహాకవి కీ చిఱు పద్యములోని యల్పభాగము తోఁచకపోయె నని సాధించుట కీ కథ పనికిరాదు గాని తిక్కనకవి యాశుధారగా కవిత్వము చెప్పఁగలవాఁడని స్థాపించుటకయి కల్పింపఁబడెనని మాత్ర మూహింపఁదగి యున్నది.

ఈ తెలుఁగుభారతము కష్టపడి సావకాశముగా నాలోచించి వ్రాయఁగాఁ జేయఁబడిన గ్రంథమే కాని జను లనుకొనునట్లు మూలగ్రంథమును ముట్టక తెరలోఁ గూర్చుండి నోటికి వచ్చినట్లెల్లను చేయఁబడినది కాదు. తిక్కన సోమయాజి పూర్వోత్తరసందర్భములు చెడకుండుటకయి ముందు వెనుక రచియించినదానిని మరల మరలఁ జూచుకొనుచు, సమానవర్ణనలు గలిగిన భాగములను రచియింప వలసినచో పూర్వము వ్రాసినదానిని జూచి తదను గుణముగాను కొన్నిచోట్ల పూర్వము రచించిన పద్యములనే కొంత మార్చియు, మార్పకయు మరల వేసికొనుచు వచ్చెను ఈ ప్రకారముగాఁ జూచుకొనుచు వచ్చినది భారతములోని యుత్తరపర్వములను రచించు నప్పుడు పూర్వపర్వములను మాత్రమే కాక భారతమును రచించునప్పుడు తత్పూర్వరచితమైన నిర్వచనోత్తర రామాయణమును గూడఁ జూచుచు వచ్చెను. ఇట్లు చేసినందున కిందుఁ గొన్నియుదాహరణము లిచ్చెదను.

౧. శ్రీకృష్ణుని కౌరవులయొద్దకుఁ బంపునప్పుడు భీముఁడు చెప్పిన యుద్యోగ పర్వములోని

గీ. "అన్నదమ్ములమై యుండి యింట మనకు
నొరులు తలయెత్తి చూడ నొండొరులతోడఁ
బెనఁగనేటికి? నిసేల పెద్దవారి
బుద్ధి విని సంధి కుదుచుట పోలు బావ"

అను పద్యమే పుత్రమరణదుఃఖార్తయైన గాంధారికి కోపశాంతి కలుగు నట్లుగా భీముఁడు చెప్పినట్లు స్త్రీపర్వమున వేయఁబడినది.

౨. విరాటుఁడు తన కూఁతురైన యుత్తరను నాట్యవిద్యాభ్యాసార్థము బృహన్నల కప్పగించుటకు రప్పించునప్పుడు దానిని వర్ణించిన విరాట పర్వములోని

సీ. అప్పుడప్పుడు నసువు మైపొసఁ జూచు
  సడపుకాంతికె వింత తొడవు గాఁగ
పెడపెడ నూగారి వింతమై మేర్పడఁ
  దారని వళులలో నారు నిగుడ
నిట్టలు ద్రోమచు నెలవులు కలమేర
  తెల్లను జిగియెక్కి యేర్పడంగఁ
దెలుపును గప్పును వెలయంగ మెఱుఁగెక్కి
  తారకంబులఁ గల్కితనము తొడరఁ

చరణములును నడుముఁ జన్నులుఁ గన్నులు
జవ్వనంబు చెన్ను నివ్వటిల్లు
"దునికిఁ దెలుపుచుండ నుత్తర చసుదెంచె
నలరు మరునిపువ్వుటమ్ముఁ బోలె."

అను పద్యమే సృంజయరాజపుత్త్రిని నారదుఁడు మోహించిన కథా సందర్భమున గీతపద్యమునందలి మూడు నాల్గు చరణములుమాత్రము "ఉనికిఁ దెల్పు సృంజయునిపుత్త్రి మెలఁగు విధంబు నారదునకుఁ దగులొనర్చె" నని మార్పఁబడి శాంతిపర్వమున వేయఁబడినది.

౩. దేవదానవయుద్ధసంబంధమున నుత్తరరామాయణములో నున్న

మ. పటువేగంబున శాతభల్లవయసంపాతంబున న్మింట మి
  క్కుటమై పర్వ ధగద్ధగీయ మగుచుం గోపంబు రూపంబులై
  చటులక్రీడఁ జరించున ట్లిరువురున్ శౌర్యోన్నతిం బోరి రు
  త్కటదర్పోద్ధతులై పరిస్ఫురజయాకాంక్షాప్రచండంబుగన్.'

అను పద్యమే "పర్వ ధగద్ధగీయమగుచున్" అని యున్న పదములు "మంట ధగద్ధగద్ధగ యనన్" అనియు, "పరస్ఫురజయాకాంక్షాప్రచండంబుగన్" అనుపదము "పరస్పరజయాకాంక్షం బ్రచండంబుగన్" అనియు మార్పఁబడి, వేయఁబడి యున్నది.

౪. నిర్వచనోత్తరరామాయణములో రావణకుబేరయుద్ధవర్ణనమునందున్న

శా. శ్రావ్యంబై చెలఁగన్ గభీరమధురజ్యానాద ముద్దామపీ
రవ్యాపారనిరూఢతం బ్రతిశరారంభంబు మర్దించుచున్
సవ్యప్రౌఢి దృఢాపసవ్యతిగ నాశ్చర్యంబుగా నేయుచున్
దివ్యాస్త్రంబులఁ బోరి రిద్దఱును సాదృశ్యం బదృశ్యంబుగన్.'

అను పద్యము మార్పేమియు లేకయే విరాటపర్వమున నుత్తరగోగ్రహణమునందు ద్రోణాచార్యయుద్ధవర్ణనములో వేయఁబడెను.

తిక్కన మొదట రచించిన పర్వములను జూచి వానియందు విశేషవృత్తములు లేకపోఁగా పండితు లాతఁడు సామాన్యవృత్తములతో కాలము గడుపుచున్నాఁడే కాని యపూర్వవృత్తరచనాకుశలుఁడు కాఁడని యాక్షేపించినమీఁదట నతఁడు స్త్రీపర్వమునందు బహువిధ వృత్తములను రచియించెనన్న వాడుక కూడ తిక్కనసోమయాజులు తాను రచియించుచు వచ్చిన గ్రంథమును పండితులకుఁ జూపుచు వచ్చెననుటను స్థాపించుచున్నది. తిక్కనసోమయాజి రచియించిన పదునేను పర్వములలోను నలువది యాఱాశ్వాసములకంటె నెక్కువగ్రంథము లేదు. ఒక్కొక్క యాశ్వాసమునకు నాలుగువందల యేఁబదేసి పద్యముల చొప్పున లెక్క చూచినను శ్రీమహాభారతములో తిక్కనసోమయాజి రచియించిన భాగ మంతలోను వించుమించుగా నిరువదివేల పద్యములకంటె నధిక ముండవు. దినమునకు పది పద్యముల చొప్పున రచియించినను, ఇంత గ్రంథము నయిదాఱు సంవత్సరములలో రచియింపవచ్చును కాఁబట్టి యిట్టిగ్రంథరచన యొక యసాధ్యములోనిది కాదు. కాని తిక్కనసోమయాజిశైలితో సమానముగా వ్రాయుట మాత్ర మెవ్వరికిని సాధ్యము కాదు. తెలుఁగుభాషయందెన్నో గ్రంథములున్నను, తిక్కనసోమయాజికవిత్వముతో సమానముగాఁగాని దానిని మించునట్లుగాఁగాని కవిత్వము చెప్పఁగలిగినవారు నేఁటివఱకు కొక్కరును కనఁబడలేదు; తిక్కనకవిత్వము ద్రాక్షాపాకమయి మిక్కిలి రసవంతముగా నుండును; ఈతని కవిత్వమునందు పాదపూరణమునకయి తెచ్చిపెట్టుకొనెడు

వ్యర్థపదము లంతగా నుండవు; పదములకూర్పుమాత్రమేకాక యర్థసందర్భ మును మిక్కిలి పొందికగా నుండును. ఏ విషయము చెప్పినను యుక్తి యుక్తముగాను, ప్రౌఢముగాను నుండును; ఎక్కడ నే విశేషణము లుంచి యే రీతి నే పదములు ప్రయోగించి రసము పుట్టింపవలయునో యీకవికిఁ దెలిసినట్లు మఱి యొకరికి తెలియదు. ఈయన కవిత్వము లోకోక్తులతోఁ గూడి జాతీయముగా నుండును; ఈయన పదలాలిత్యమును, యుక్తిబాహుళ్యమును, అర్థగౌరవమును, రచనాచమత్కృతియు, శయ్యావిశేషమును, సందర్భశుద్ధియు, కల్పనాకౌశలమును, అన్యులకు రావు. ఈ కవిశిఖామణి యొక్క కవిత్వమునం దెంతవంతు సంస్కృతపదములును, రెండువంతులు తెలుఁగు పదములు నుండును ఇటీవలి యాంధ్రకవులు కొందఱు తాము రచియించెడివి తెలుఁగు పుస్తకము లన్నమాట మఱచియో తమ పాండిత్యమును కనఁబఱుపవలెననియో తమ గ్రంథములను సాంస్కృతికదీర్ఘ సమాసములతోను, కఠినములయిన సంస్కృతపదములతోను నింపివేసిరి నన్నయ భట్టువలెనే యీ కవియుఁ దన గ్రంథమును మూలమునకు సరిగాఁ దెనిఁగింపలేదు విరాటపర్వమునందుమాత్రము కథ తగ్గింపక కొంత పెంచినను, తక్కిన పర్వములయందు కథను మిక్కిలి సంగ్రహపఱిచెను. ఉద్యోగ పర్వమునందలి సనత్కుమారోపదేశమును మూలములో పది పండ్రెండు పత్రము లున్నదానిని తెనుఁగున రెండు మూడు పద్యములతో సరి పెట్టెను; భగవద్గీతలు, ఉత్తరగీతలు, మొదలయిన వానిని తెలిఁగింపనే లేదు. భగవద్గీతలు తెలిఁగింపలేదనుట సరిగాదనియు, కొన్ని పద్యములలో దానిని సంగ్రహ పఱిచెననియు, విమర్శకు లొకరు వ్రాయుచున్నారు. పదునెనిమిదధ్యాయముల మహాగ్రంథములో

శ్లో॥ 'ధర్మక్షేత్రే కురుక్షేత్రే సమవేతా యుయుత్సవః,
మామకాః పాండవాశ్చైవ కిమకుర్వత సంజయ!'

అను ప్రథమశ్లోకమును

క. 'మానుగ ధర్మక్షేత్రం
బైన కురుక్షేత్రమున మహోహోవమునకుఁ
బూని మనబలముఁ బాండవ
సేనయు నిటు వన్ని యేమి చేసెం జెపుమా?'

అనియు,

శ్లో. 'యత్రయోగేశ్వరః కృష్ణో యత్రపార్థో ధనుర్ధరః।
తత్రశ్రీర్విజయో భూతి ర్ధ్రువా నీతి ర్మతిర్మమ॥'

అను నంత్యశ్లోకమును

గీ. 'అధిప యోగేశ్వరేశ్వరుండైన కృష్ణుఁ
డును ధనుర్ధరవర్యుఁ డర్జునుఁడు నెపట
నిలిచి రచ్చట విజయంబు నీతి సిరియు
భూతి నిత్యంబు లగు నిది నాతలంపు'

అనియు, తెలిఁగించి నడుమ నాలుగయిదు పద్యములు వేయుట గ్రంథ మును భాషాంతరీకరించుట కానేరదు ఇది గుహ్యమైన యోగశాస్త్ర మవియో యుద్ధమధ్యమున శత్రువు లెదుటనుండఁగా పదునెనిమిది యధ్యాయములు గల మహాగ్రంథమును గృష్ణుఁ డర్జునునకుఁ జెప్పెననుట విశ్వాసయోగ్య ముగా నుండదని భావించియో, తిక్కన భగవద్గీతలను దెలిఁగింపఁడయ్యెను.

ఈయన సంస్కృతమును తెలిఁగించిన రీతిని దెలుపుటకయి మూలగ్రంథము లోని కొన్ని శ్లోకములను వానియర్థమును దెలుపు పద్యములను కొన్నిటిని క్రింద వివరించుచున్నాను—

విరాటపర్వము శ్లోకము

శ్లో. ఆలోకయసి కిం వృక్షం సూద! దారుకృతేన వై,
యది తే దారుభిః కృత్యం బహిః స్వ క్షౌన్ని గృహ్యతామ్.

పద్యము

మ. వలలుం డెక్కడఁ జూచెఁ నొండెడ ననేవ్యక్ష్మజముల్ పుట్టవే?
ఫలితంబై వరశాఖ లొప్పఁగ ననల్పప్రీతి సంధించుచున్
విలసచ్ఛాయ నుపాశ్రితప్రతతికి న్విశ్రాంతిఁ గావింపఁగాఁ
గల యీ భూజము వంటకట్టియలకై ఖండింపఁగా నేటికిన్?

శ్లోకములు

శ్లో. సా సభాద్వార మాసాద్య రుదతీ మత్స్య మబ్రవీన్.
అవేక్షమాణా సుశ్రోణి పతీం స్తాన్ దీనచేతసః.
ఆకార మభిరక్షంతీ ప్రతిజ్ఞాం ధర్మసంహితాం.
దహ్యమానేన రౌద్రేణ చక్షుషా ద్రుపదాత్మజా

సీ. ఏలఁదీగఁ గప్పిన లలితపరాగంబు
క్రియ మేన మేదినీరేణు వొప్ప
చంపకంబున నవసౌరభం బెసఁగెడు
కరణి నాసిక వేఁడిగాడ్పు నిగుడ
తోయజదళములతుది నుంచు దొరిఁగెడు
గతిఁ గనుఁగవ నశ్రుకణము లురుల
నిందుబింబముమీఁది కందువంపంబునఁ
గురులు నెమ్మొగమున నెరసియుండ
సర్వజనవంద్య యైన పాంచాలి సింహ
బలునిచే నివ్విధంబున భంగపాటు
తనకు వచ్చిన నెంతయు దైన్య మొంది
యవ్విరాటుని సభఁ జేర నరిగి నిలిచి.

ఉ. పంబిన కోపము న్సమయభంగభయంబును నగ్గలించి యు
ల్లంబు పెనంగొనంగఁ బతులం దగు సభ్యులఁ జూచుమాడ్కి రూ
క్షంబగు చూడ్కి నాల్గుపదుకన్నియ చూచి సభాజనప్రతా
నంబును మత్స్యనాథుఁడు వినంగ నెలుంగు చలింప నిట్లనున్.'

ఈ శ్లోకమును పద్యమును జూచువారి కిప్పు డీపద్యముయొక్క దీర్ఘ పాదములయందలి వర్ణనఁ గ్రొత్తగాఁ గల్పించుటయేకాక తక్కిన భాగమును గూడ కవి యెట్లు పెంచెనో విశద మగును

శ్లోకము

శ్లో. తాం వేశాం రత్ననాగారం పాంచాలీసంగమాశయా,
మన్యమాన స్స్వసంకేత మగారం ప్రవిశ త్తతః.

పద్యము

శా. సింగం బున్న గుహానికేతమునకున్ ఘుంబున నచ్చు మా
తంగంబుం బురుడించుచున్ బవనపుత్రస్వీకృతంబైన యా
రంగాగారము చేర వచ్చి మదిలో రాగంబు ఘూర్ణిల్ల విం
తిం గాముం డిటఁ దేఁడె యంతకని యుద్వృత్తాంగజోన్మాదుఁడై.

ఇఁక నీ కవియొక్కకవిత్వశైలిని గనుపఱచెడి మైదారు పద్యములు మాత్రము వ్రాసి "కవిబ్రహ్మ" యని మహాకవులచేఁ గొనియాడఁబడిన యాతని చరిత్రము నింతటితో ముగించెదను —

ఉ. 'అక్కట మోసపోయి యడియాసలఁ జావకయున్నదాన ము
న్నెక్కడనే దురంతదురితోత్కటబాధలఁ బెట్టి యున్న నా
కెక్కడి దుఃఖశాంతి? గరమే యిట నెమ్మియిఁ గల్గనేర్చు? మీ
ముక్కున నూర్పు గల్గ నొక మూర్ఖుంచేఁ బడి నృపస్థలిన్.

విరాట. ఆ. ౩

శా సింగం బాఁకటిలో గుహాంతరమునం జేట్పాటుమైనుండి మా
తంగస్ఫూర్జితయూథదర్శనసముద్యత్క్రోధమై వచ్చు నో
జం గాంతారనివాసఖిన్నమతి నస్మత్సేనపై వీఁడె వ
చ్చెం గుంతీసుతమధ్యముండు సమరశ్రేమాభిరామాకృతిన్.

విరాట. ఆ. ౪

క. కాలుఁడు ప్రేరేఁపఁగ నిటు
ప్రేలిన యంతటనె విన్నుఁ బెద్దఁగఁ దలఁపన్

బోలునె మాకును ? నుడుగుము
చాలుదు వీ వెల్ల పసులు సాధింపంగన్. ఉ. ౨

శా. ఏమీ ! పార్థుఁడు నీవు దండిమగలై యీ వచ్చుకౌరవ్య సం
గ్రామక్షోభము బాహుదర్పమునఁ దీర్పం బెద్ద మిట్టెక్కి మి
మ్మే మెల్ల న్వెఱఁగంది చూచెదముగా కీ సారికిం బోయిరా
భీముం డిత్తటి రిత్తమాటలకుఁ గోపింపండుసూ పెంపఱన్.
ఉద్యో. ఆ. ౩

ఉ. ఏమిర కర్ణ ! భీము నటు లేటికిఁ దిట్టెద తతండు దోల సి
గ్గేమియులేక పాఱునెడ నెవ్వరు తిట్టిరి నిన్ను, గెల్వ సం
గ్రామములోనఁ దప్పిదము గల్గినయంతనె యింత గర్వ మే
లా ? మును నిన్నెఱుంగమె ? చలంబున సాత్యకి యిప్డు గెల్వఁడే ?
ద్రోణ. ౪

గీ. అంధులకు నూఁతకోలగా నకట ! యొకని
నైన నిలుపక నూర్వుర నదయవృత్తి
మ్రింగి తం దెవ్వఁడేనియు మీకు నెగ్గు
లాచరింపనివాఁడు లేఁడయ్యె నయ్య ?—స్త్రీప. ఆ. ౧

ఈ పయిని జెప్పిన రెండు కావ్యములనుగాక యీకవి కవివాగ్బంధన మనెడి లక్షణగ్రంధము నొకదానిని గూడ రచియించెను. గాని దానియందు విశేషాంశము లేవియు లేవు. అందలి కడపటిపద్యము నిం దుదాహరించు చున్నాను :

కం. 'తనరం గవివాగ్బంధన
మను ఛందం బనని వెలయ హర్షముతోఁ ది
క్కన సోమయాజి చెప్పెను
జను లెల్ల నుతింప బుధుల సమ్మతిగాఁగ౯—కవివాగ్బంధనము. *

[ * కవివాగ్బంధనమునకు 'కవిసార్వభౌమఛందస్సు' అను నామాంతరము కలదఁట ! ఇది తిక్కన కృతి కాదని విమర్శకుల యాశయము. ఇం దిరువదియేడు యతులు చెప్పఁబడినందున, ఇది నవీనకృతికావలెను. కవిసార్వభౌముని పేరిటఁ బరఁగుటయు నియ్యది కవిబ్రహ్మచే రచింపఁబడలేదనుటను వ్యక్తము చేయుచున్నది.]

ఇతఁడు కృష్ణశతక మొకటి చెప్పె నని పేర్కొనఁగలవి యీ పద్యము నుదాహరించుచున్నాఁడు.

మ. 'అరయన్ శంతనపుత్రుపై విదురుపై నక్రూరుపైఁ గుబ్జపై
నరుపై ద్రౌపదిపైఁ గుచేలునిపయిన్ నందవ్రజశ్రేణిపైఁ
బరఁగంగల్గుభవత్కృపారసము నాపైఁగొంత రానిమ్ము నీ
చరణాబ్జంబులు నమ్మినాను జగదీశా కృష్ణ భక్తప్రియా!' ♦

తిక్కనసోమయాజి "విజయసేన" మను గ్రంథమును గూడ రచించెనని కొందఱు వ్రాయుచున్నారు. నే నా గ్రంథమును జూడకపోవుటచేత తిక్కనయే దానిని రచించెనో, తిక్కనయే గ్రంథకర్త యైనచో నతఁ డే తిక్కనయో, నే నిప్పుడు చెప్పఁజాలను. "విజయసేన" మను పూర్వ గ్రంథ మొకటి యున్నది. దానినుండి యప్పకవి యీ క్రింది పద్యము నుదాహరించియున్నాఁడు.

ఉ. 'వల్లభుఁ డేగు దుర్లభుఁడు వానిదెసం దగులాడి యిమ్మెయిన్
దల్లడ మందెదేల యుచితస్థితికి న్ననుఁ బాసఁజాలిసన్
దల్లియు బంధులోకమును దండ్రియు నేమనువా రెఱింగిరే
నుల్లమ! యిట్లు నీకుఁదగునో తగదో పరికించి చూడుమా!'

చిలుకూరి వీరభద్రరావుగా రాంధ్రులచరిత్రమునం దీ క్రింది పద్యముల నుదాహరించియున్నారు

సీ. 'ఘనసార కస్తూరికాగంధముల నన్య
గంధబంధంబులు గలపి కలిపి

♦ [ 'కృష్ణ! భక్తప్రియా!' అను మకుటముతో శతకమున్నట్లు కానరాదని 'ఆంధ్రకవితరంగిణి' (ద్వితీయ సంపుటము-పుట 185) లోఁ గలదు. 'కృష్ణా! దేవకీనందనా!' అను మకుటముతో మాత్రము వెన్నెలకంటి జన్నయ కృతమగు శతకము కానవచ్చుచున్నది అది 'దేవకీనందన శతకము' గా ప్రసిద్ధము.

కుసుమితవల్లికాలసితవీథులఁ జొచ్చి
గని సరోగృహములఁ మునిఁగి మునిఁగి
సుమధికాహార్యాంగ సంగీతముం తోఁ
కన్నెతీగల కౌఁట కఱపి కఱపి
కుముద కుట్మలకుటీ కోరకంబులు దూఱి
యలిదంపతుల నిద్రఁ దెలిపి దెలిపి

యనుదినమ్ము నప్పురాంతికమ్మున గట్టు
వాలు వోలె విప్రవరుఁడువోలె
నట్టువోలెఁ దాను నచ్చినచెలి వోలె
మలయుచుండు మందమారుతంబు.

సీ. మదనవశీకారమంత్రదేవత దృష్టి
గోచరమూర్తి గైకొనియెనొక్కొ
సితకరబింబనిస్రుతసుధాధార ని
తంబినీరూపంబు దాల్చెనొక్కొ
విధికామినీ శ్రేష్ఠవిజ్ఞానపరసీమ
విధి గండరింపంగ వెలసెనొక్కొ
శృంగారరసవరసశ్రీవిలాసోన్నతి
సుందరాకారంబు నొందెనొక్కొ

కాక యొక వధూటి కడుపునఁ బుట్టిన
భామ కేల నిట్టిరామణీయ
కంబు గలుగు ననుచుఁ గన్నియపై మహీ
పాలసుతుఁడు దృష్టి పఱపె నర్థి.

ఉ. పల్లవపుష్పసంపదలఁ బంచి వసంతుఁడు కాపురాకకై
యెల్లవనంబు సంకటము లేదఁగఁ దా రొడికంబు మీఱ న
ట్లల్లన క్రోలి క్రోలి మలయానిలుఁ డందుఁ బురాణపత్రముల్
దుల్లఁగఁజేసె నత్తిక్రియఁ బటుత్వము కాముఁడు పిచ్చలింపఁగన్.

పయివానిలో "మదనవశీకారమంత్రదేవత" యను సీసపద్యమును కుమార సంభవటిప్పణములో విజయసేనము ద్వితీయాశ్వాసములోనిదని మానవిల్లి రామకృష్ణకవిగా రుదాహరించి యున్నారు *

నన్నయభట్టారకుఁడును తిక్కనసోమయాజియు నాంధ్రకవులలోఁ బ్రామాణికాగ్రగణ్యులే యయినను మనము వారి పుస్తకములోని సామాన్యప్రయోగములను మాత్రమే యనుసరింపవలయును గాని యతులకొఱకును బ్రాసములకొఱకును వారు వేసికొనవలసివచ్చిన యసామాన్యప్రయోగములను మన మనుసరించుట యుచితము కాదని నేను దలఁచుచున్నాను ఎట్లన నన్నయభట్టు సామాన్యముగా నందఱనియే ప్రయోగించుచు వచ్చినను నొకటి రెండు స్థలములయందు యతిస్థలమున

గీ. గురులలోనఁ బరమగురువు తల్లియ యట్టి
తల్లివచనమును విధాతకృతియు
నన్యథాకరింప నలవియే యనిన నం
దొఱకు నిట్టు లనియె ద్రుపదవిభుఁడు.

అందొ అని వాడి యున్నాఁడు. ఈ ప్రకారముగానే తిక్కనసోమయాజి సామాన్యముగా నొక్కఁడనియే ప్రయోగించుచును వచ్చిన యతిస్థానమునం దొకచోట

* [పెదపాటి జగ్గకవి తాను సమకూర్చిన 'ప్రబంధ రత్నాకరము'లో 'విజయ సేనము' లోని పద్యముల నుదాహరించి యున్నాఁడు. 'విజయసేనము'లభ్యముకాలేదు. ఇయ్యది తిక్కనకవి కృతమనుటలో ఆధారములు లేవు. అప్పకవి, కస్తూరి రంగకవి 'విజయసేనము' లోని దని యుదాహరించిన పద్యమును కూచిమంచి తిమ్మకవి చిమ్మపూఁడి అమరేశ్వరుని 'విక్రమసేనము' లోనిదిగా నుదాహరించెను. దీనింబట్టి విక్రమసేన, విజయసేనములను జెప్పుటలో తారుమారులు జరుగుచున్నట్లు తెలియుచున్నది. 'విజయసేనము' లోనివని యుదాహరింపఁబడిన పద్యములు వైశ్యవర్ణనము, గణపతి స్తోత్రము, పరిఖావర్ణనము మున్నగు విషయములు కలవి కలవు వీని కర్తృత్వమును గూర్చి విమర్శకులు సందేహించుచున్నారు

క 'పాండవులవలనఁ గీడొ
క్కొండును లే దనిప నీదుకౌరవులు ధరణీ
మండల మంతయు నిమ్మీగిరి
పాండునృపతిభాగమునకుఁ బాపిరి వారిన్.'

ఒక్కొఁడని వాడియున్నాఁడు నన్నయతిక్కనాదుల ప్రయోగములను మనము శిరసావహించి గ్రహింపవలసినదే యయినను మన గ్రంథముల యందు "అండొాలు" "ఒక్కొఁడు" మొదలయిన విశేషరూపములను వాడక "అండలు" "ఒక్కఁడు" మొదలయిన సామాన్యరూపములను వాడుటయే మంచిదని నే ననుకొనియెదను.

తిక్కనసోమయాజులు మనుమసిద్ధిరాజ్య మంతరించిన తరువాత చిరకాలము జీవించి యున్నవాఁడయి సర్వజనులచే గౌరవింపఁబడుచు నుండినవాఁడే యయినను మరణకాలమునకు విశేషవిత్తవంతుఁడుగా నుండినట్టు కనఁబడఁడు అందుచేతనే యాతని కుమారుఁడు కొమ్మన్న పాటూరికరణికమును సంపాదింపవలసినవాఁ డయ్యెను

రక్కస గంగరనదేవమహారాజు రాజ్యమేలుచుండఁగా ౧౧౬౯ శాలివాహన శకము ప్లవంగసంవత్సర జ్యేష్ఠశుద్ధ త్రయోదశీ శనివార మనఁగా క్రీస్తు శకము ౧౨౪౭-వ సంవత్సరములో చెంటిరామనాయకుఁడు కడపమండలము లోని సిద్ధవటముతాలూకా జోతిగ్రామమునందలి జ్యోతినాథదేవాలయము నకు గోపురము కట్టించినట్లు దాని యావరణములో ఱాతిమీద (No. 563) శాసన మొకటి చెక్కఁబడియున్నది నిర్వచనోత్తరరామాయణములో "రంగదుదారకీర్తి యగు రక్కెస గంగని" యన్నపద్యముండుటచేత, ఈ శిలాశాసనమునుబట్టి ౧౨౪౭-వ సంవత్సరమునకు పెక్కేండ్లుతర్వాతనే నిర్వచనోత్తరరామాయణము రచియింపఁబడినట్టు స్పష్ట మగుచున్నది

[రక్కెస గంగనయు, గంగయసాహిణియు నభిన్నవ్యక్తులని శ్రీ చిలుకూరి వీరభద్రరావుగా రభిప్రాయపడినారు. నిర్వచనోత్తరరామాయణములోని 'రంగదుదారకీర్తి —' అను పద్యమునుబట్టి వారిద్దరును విభిన్నవ్యక్తు

అనియు, పరస్పరవిరోధులనియుఁ దెలియుచున్నది. 'ఆంధ్రకవితరంగిణి' కారులును, 'తాళ్ళప్రొద్దుటూరుశాసనవ్యాసమున (భారతి సం. ౧౫ భా. ౧ పుట ౧౪౩) శ్రీ నేలటూరి వెంకటరమణయ్యగారును వీరు వేర్వేఱువ్యక్తు లనియే తెల్పియున్నారు ]

## గణపనారాధ్యుఁడు

['ఆంధ్రకవితరంగిణి'లో 'ఎఱ్ఱాప్రెగడ' చరిత్రమునకుముందు 'స్వరశాస్త్ర' మను మంజరీద్విపదకర్తయగు 'గణపనారాధ్యు'ని చరిత్ర మీయఁబడినది. ఈకవి క్రీ. శ. ౧౩౨౪—౧౩౪౫ నడుమ నుండినవాఁడట। ఈ కవినిగూర్చి శ్రీ నేలటూరి వేంకటరమణయ్యగారు 'భారతి' (సంపు. 12 సంచి.1) లో ప్రకటించిన వ్యాసము ననుసరించి, యీ విషయము గ్రహింపబడినదని తత్కర్త తెలిపియున్నారు ]

# ఎఱ్ఱాప్రెగడ

ఎఱ్ఱాప్రెగడ యను కవి నియోగిబ్రాహ్మణుఁడు ఈతని యింటిపేరు చెదలవాడవారు; నివాసస్థలము నెల్లూరిమండలమునందలి కందుకూరితాలూకా లోని గుడ్లూరు గ్రామము; [ఎఱ్ఱాప్రెగడ గృహనామమును గూర్చియుఁ నివాసమును గూర్చియు నభిప్రాయభేదము లున్నవి. ఇతని గ్రంథములను బట్టి యాతని గృహనామమును నిర్ణయింపఁజాలము. విప్రనారాయణ చరిత్ర మును రచించిన చెదలువాడ మల్లనకవి తానెఱ్ఱాప్రగడ వంశజుఁడనని చెప్పి కొనుటచే నీతని గృహనామము 'చెదలువాడవా' రగునని కొందఱి తలంపు ఎఱ్ఱాప్రెగడ 'చెదల్వాడ నిలయుఁ' డని మల్లన చెప్పియున్నాఁడు

ఎఱ్ఱాప్రెగడ తాతయైన 'ఎఱపోతసూరి' వేఁగినాట కరాపర్తి' వృత్తిమంతుఁ డఁట; కాన నతని నివాసము 'కరాపర్తి' కావచ్చును. భారతారణ్య పర్వ శేషము చివఱి పద్యములఁబట్టి యితని నివాసము పాకనాటి యందలి గుడ్లూ రై నట్లు తెలియుచున్నది. ఈతఁడు గుడ్లూరిలో నున్నపుడే అరణ్యపర్వ శేషమును, నృసింహ పురాణమును రచించెననియుఁ, దర్వాత మల్లారెడ్డి పరిచయము సంపాదించి, అతని మూలమున నతనియన్న వేమారెడ్డి నాశ్ర యించి అద్దంకిలోఁ గొంతకాలము నివసించి, రామాయణ, హరివంశముల నచటనే రచించి యా వేమారెడ్డికే కృతిచేసె ననియు, వార్ధక్యమునఁ జెదలు వాడలో నివసించి యుండుననియు "ఆంధ్రకవితరంగిణి" లోఁ గలదు. (నాలుగవ సంపుటము-పుట 53] తండ్రి సూరన్న; తల్లి పోతమ్మ; ఈత నిది శ్రీవత్సగోత్రము. ఇతఁడు తిక్కనసోమయాజి తరువాత నించు మించుగా నేఁబది సంవత్సరముల కాలమున నుండినవాఁడు. ఇతఁడు తిక్కనసోమయాజి కవిత్వమునం దత్యంతగౌరవము కలవాఁడయి యాతని వలెనే కవిత్వము చెప్పఁ బ్రయత్నించినవాఁ డగుటచే విరాటపర్వములోఁ

దిక్కనసోమయాజి తన తండ్రి కలలో వచ్చి గ్రంథరచన చేయవలసినదని చెప్పినట్టే, తన తాత తన భావమునందు తోచి చెప్పినట్టు నృసింహపురాణమున నిట్లు వ్రాసియున్నాఁడు

సీ. 'ప్రజ్ఞాపవిత్రుఁ డాపస్తంబసూత్రుండు
శ్రీవత్సగోత్రుఁ డూర్జితచరిత్రుఁ
డగు బొల్లనకుఁ బ్రోలమాంబకుఁ బుత్రుండు
వెలనాటిచోడునివలన మిగుల
మన్నన గన్న భీమనమంత్రిపౌత్రుండు
* ప్రేకమాంబామనఃప్రియుఁడు పోత
మాంబికావిభు సూరనార్యు మజ్జనకుని
బొల్లశేనిధికిని * బ్రోలనకును
జన్నకు ననుజన్ముని నన్నతండ్రి
వేఁగినాట గరాపత్తివృత్తిమంతుఁ
డనఘుఁ డెఱపోతసూరి కంసారిచరణ
కమలమధుకరపతి సారవిమలయశుఁడు.

వ. మదీయభావంబున నావిర్భావంబు నొంది సదయానంద మధురవాక్యంబుల నన్ను నిట్లని యనుగ్రహించె.

ఉ. ఉన్నతసంస్కృతాదిచతురోక్తిపదంబులఁ గావ్యకర్తవై
యెన్నికమైఁ బ్రబంధపరమేశుఁ డనంగ నరణ్యపర్వ శే
షోన్నయ మంధ్రభాష సుజనోత్సవ మొప్పఁగ నిర్వహించి తౌ
నన్నయభట్టి తిక్కకవినాథుల కెక్కినభక్తి పెంపునన్.

క. గిరిశపదభక్తిరసత
త్పరభావముకలిమి శంభుదాసుఁ డనంగాఁ
బరఁగినగోవిందగుణా
దరపంభృత సౌమనస్యధన్యుఁడ వెందున్. [పీఠిక 15-18]

* పేరమాంబా మనఃప్రియుఁడు_అని పాఠము

♦ బోలనకును_అని పాఠము

ఈతవికాలమువరకును నన్నయభట్టు విడిచిన యారణ్యపర్వశేషము తెనిఁగింపఁబడక భారతము కొఱఁతపడి యుండుట చూచి యితఁడు తాను దానిని తెనిఁగింప నెంచియు తనపేరిట నాంధ్రీకరించినచో నన్నయభట్టారకునిఁ బోలెఁ దనకు నేదో కీడు మూడునని భయపడి మిగిలిన భాగమును రాజరాజనరేంద్రున కంకితముగా నన్నయభట్టుపేరితోనే రచియించెను. భారతములో నీతఁడు రచియించినభాగములోని మొదటి పద్యము

చ. 'స్ఫురదరుణాంశురాగరుచి బొంపిరివోయి నిరస్తనీరదా
వరణములై దళత్కమలవైభవజృంభణ ముల్లసిల్ల ను
ద్ధురతరహంససారసమధువ్రతనిస్వనము ల్చెలంగఁగాఁ
గరము వెలింగె వాసరముఖంబులు శారదవేళఁ జూడఁగన్.'

అనునది. కాఁబట్టి యీ కవి రచియించిన దారణ్యపర్వములో సగముకంటె నధికముగా నుండును.

ఎఱ్ఱాప్రెగడ కవిత్వము మృదువును మధురమునయి, కదళీపాకమై, చాల వఱకు సోమయాజులకవిత్వమును పోలియుండును ఇతఁడు రచియించిన భారతభాగమునం దించుమించుగా సంస్కృతపదములును, తెలుఁగుపదములును సమానముగా నుండును ఇతని భాషాంతరమును పయి యిరువుర దానివలెనే మూలమైన సంస్కృతగ్రంథానుసారముగా నుండదు. ఈక్రింది శ్లోకములును పద్యములును కొంతవఱకీ యంశమును తేటపఱుపవచ్చును.

సంస్కృతారణ్యపర్వము.

శ్లో. తవ వశ్యా హి సతతం పాండవాః ప్రియదర్శనే
ముఖప్రేక్షా శ్చతే సర్వే తత్త్వమేత ద్బ్రవీహి మే.
వ్రతచర్యా తపో వాస్తి స్నానమంత్రౌషధాని వా,
విద్యావీర్యం మూలవీర్యం జపహోమాగదా స్తదా.

తెలుఁగు

సీ. నీప్రియభర్తల నిర్మలవృత్తులఁ
ప్రకటతేజుల లోకపాలనిభులఁ

బార్ధుల నీ వాకభంగిన వదలక
చెలువ మెబ్బంగి భజింతు దగిలి ?
యొక్కఁ దొక్కనికంటె నువిద నీ కెక్కుడు
ననురక్తు లగుట యత్యద్భుతంబు
నగుమొగంబులకావి నాతి నీదెస నెప్డుఁ
బతులకుఁ గిన్క యెప్పాటి లేదు

వ్రతము పెంపొ మంత్రౌషధవైభవంబొ
సరసనైపథ్యకర్మకౌశలమొ చతుర
విభ్రమోల్లాసరేఖయొ వెలఁది యేవి
శేషసౌభాగ్యహేతువుఁ జెపుమ నాకు.'

ఇందలి సీసపాదముల నాలిగింటను మూలములో లేని నిర్మలవృత్తులఁ బ్రకటతేజుల మొదలయిన విశేషణాదులచేత గ్రంథము విస్తారముగాఁ బెంపఁబడినను గీతపాదములయందు మూలమునందలి తపస్సు స్నానము జపము హోమము మొదలైనమాటలు విడిచిపెట్టఁబడినవి.

సంస్కృతము.

శ్లో. 'యదైవ భర్తా జానీయా న్మంత్రమూలపరాం ప్రియమ్,
ఉద్విజేత తదైవాస్యాః సర్పా ద్వేశ్మగతా దివ.
ఉద్విగ్నస్య కుత శ్శాంతి రశాంతస్య కుత స్సుఖం,
న జాతు వశగో భర్తా స్త్రియాః స్యాన్మంత్రకర్మణా.
అమిత్రప్రహితాంశ్చాపి గదాన్ పరమదారుణాన్,
మూలప్రచారై ర్హి విషం ప్రయచ్ఛంతి జిఘాంసవః.
జిహ్వయా యాని పురుష స్త్వచా వా ప్యుపసేవతే,
తత్రచూర్ణాని దత్తాని హన్యుః క్షిప్ర మసంశయః
జలోదరసమాయుక్తాః శ్విత్రిణః పలితా స్తథా,
అపుమాంసః కృతా స్త్రీభిః జడాంధబధిరా స్తథా.

పాపానుగాస్తు పాపాస్తాః పతీ నుపస్సృజం త్యుత.
స జాతు విప్రియం భర్తుః స్త్రియా కార్యం కథంచన'

తెలుఁగు

చ. అఱయక మంత్రతంత్రవివిధౌషధభంగులఁజేసి యెంతయున్
వలతురు నాథు లంట మగువా! కడుబేలతనంబు దానమున్
గలిగినప్రేమయుం బొలియుఁ గాని యొకంటను సిద్ధిఁ బొంద ద
వ్వ్యాలఁతులతోడిమన్కి యహిపొత్తుగఁ జూచు విభుం డెఱింగినన్.

చ మగువ యొనర్చువశ్యవిధి మందులు మాయలు నొందుచందమై
మగనికిఁ దెచ్చు రోగములు మానక మూకజడాదిభావముల్
మొగి నొనరించు నద్దురితముల్ తన చేసినచేతలై తుదిన్
జగమున కెక్కు నిందయును సద్గతిహానియు వచ్చు నింతికిన్.'

వీనిని చదువుటవలననే మూలగ్రంథములోని కొంత భాగము వదలి వేయఁ బడినట్టు స్పష్టమగును గనుక సత్యాద్రౌపదీసంవాదము నందలి పద్యము లలో నొక్కదానినిమాత్రము వ్రాసి యిఁక నీ విషయము విడిచిపెట్టెదను.

శ్లోకము

'ఏత జ్ఞానా మ్యహం కర్తుం భర్తృసంవననం మహత్,
అసత్స్త్రీణాం సమాచారం నాహం కుర్యాం న కామయే.'

పద్యము

గీ. ఇట్టి వర్తనముల నెప్పుడుఁ బాండవులకుఁ
దగిలి ప్రియము సేయఁదగిరిఁ గాని
మగువ! నీవు చెప్పు మందులు మాకులు
నింద్రజాలములును నే నెఱుంగ'

ఈ కవియొక్క కవిత్వశైలి తెలియుటకయి యీ పద్యములే చాలి యున్నను. మఱియొకభాగములోని పద్యములను రెంటిని కూడ నిందు వ్రాసెదను.

ఉ. నారలు కట్టి కూర లశనంబుగ నుగ్రవనంబులో విప
ద్భారము నొంది వందురినఫల్గును నుజ్జ్వలరాజ్యవైభవో
దారుల మై కమంగొని ముదంబును బొందఁగ గాంచుకంచెనిం
పారఁగ నొందుగల్గునె కృతార్థత యెందును గౌరవేశ్వరా.

అర. వ. ఆ ౩.

ఉ. శాతవశాఖాగ్రఖండితలసన్మదకుంజరకుంభముక్తము
క్తాతతశైలకందరగుహాంతరసుప్తమృగేంద్ర కేసర
వ్రాతము వేడ్కఁ నాచికొన వారక చేరుట గాదె క్రోధవి
ఖ్యాతమహోగ్రు భీముఁ జెనకం దలపోయుట నీకు నెమ్మెయిన్.'

అర. ఆ. ౬.

భారతమును రచించిన యీ ముగ్గురు కవులును ప్రామాణికాగ్రగణ్యులు. సర్వవిధములచేతను వీరి కవిత్వము మిక్కిలి శ్లాఘ్యమైనది. వీరిని కవిత్రయ మందురు. కవిత్రయవిరచిత మయిన యాంధ్రభారత మారంభింపఁబడిన మూఁడు వందలసంవత్సరములకు సంపూర్ణ మైనది. కవిత్రయము ప్రయోగించిన పదములనే కాని వేఱు పదములను కవులు ప్రయోగింపఁగూడదని వీరికి వెనుక కవిరాక్షసుఁడను నతఁడు తాను రచియించిన కవిరాక్షసీయ మను లక్షణగ్రంథమునందు నియమము చేసినాఁడట. అయినను తరువాతికవులు మాత్ర మీ నియమము నంతగా పాటింపలేదు.

ఎఱ్ఱాప్రెగడకు శివభక్తుఁడగుటచేత శంభుదాసుఁ డనియు, ప్రబంధధోరణిని భారతారణ్యపర్వశేషమును చమత్కారబంధురముగా రచించుటచేత ప్రబంధపరమేశ్వరుఁ డనియు, బిరుదనామములు గలవు. ఈతఁడు చేసిన యితరగ్రంథములు రామాయణము, హరివంశము, * లక్ష్మీనృసింహపురాణము. ఇందలి కడపటి పుస్తకమున కహోబలమాహాత్మ్య మని నామాంతరము. హరివంశ మీ కవి కొండవీటిప్రభువైన † పోలయవేమారెడ్డి కంకితముచేసెను. [ఇయ్యెడ 'ఆంధ్రకవితరంగిణి' (నాలుగవ సంపుటము-పుట 97)లో నిట్లున్నది.

---

* లక్ష్మీనృసింహావతారమను పేరు శబ్దరత్నాకరమునఁ గలదు.

† 'పోలయ'కు బదులు 'ప్రోలయ' అని యుంకెట నుండఁదగును.

'హరివంశకృతిపతి పేమారెడ్డి కాఁడనియు, నాతని మూఁడవ కుమారుఁడైన యన వేమారెడ్డి యనియుఁ గొందఱు భ్రమపడుచున్నారు ......ఆశ్వాసాంత పద్యములనుబట్టి హరివంశకృతిపతి కోమటి ప్రోలయ వేముఁడు కాని వేమారెడ్డి కుమారుఁడైన యన వేమారెడ్డి కాఁడనుట నిశ్చయము'']

అనవేమారెడ్డితండ్రియైన యీ ప్రోలయవేమారెడ్డి ప్రతాపరుద్రుని ప్రభుత్వ దినములలో నొక సేనానాయకుఁడుగా నుండి, ౧౩౨౩ వ సంవత్సరమున ప్రతాపరుద్రుఁడు తురుష్కులచేత కారాగారబద్ధుఁడుగాఁ జేయఁబడిన కొన్నిసంవత్సరముల కనఁగా ౧౩౨౭ వ సంవత్సరమునందు స్వతంత్రుఁడయి వినుకొండరాజ్యము నాక్రమించుకొని ౧౩౪౫ వ సంవత్సరమువఱకును రాజ్యముచేసెనని చెప్పఁబడియున్నది. కాని యీతని శాసనములు ౧౩౨౦ వ సంవత్సరమునుండియే కానఁబడు చున్నందున నితఁ డా సంవత్సరమునందే రాజ్యపాలన మారంభించి యుండును. అందుచేత నీ ప్రోలయవేమారెడ్డి * ౧౩౨౦ వ సంవత్సరము మొదలుకొని ౧౩౬౫ వ సంవత్సరమువఱకును రాజ్యపాలనము చేసియుండవలెను. ఇతఁడు మొదట సామంతుఁడయి కాకతీయ రాజ్యావసానదశయందు స్వతంత్రరాజయి యుండును. ఈతని ప్రథమపుత్రుఁడు అనపోతారెడ్డి ౧౩౫౦ వ సంవత్సరము మొదలుకొని ౧౩౬౧ వ సంవత్సరమువఱకును, ద్వితీయపుత్రుఁడు సుప్రసిద్ధుఁడైన యనవేమారెడ్డి ౧౩౬౨ మొదలుకొని ౧౩౮౦ వఱకును రాజ్యముచేసిరి. ఈ యనవేమారెడ్డి రాజమహేంద్రవరమువఱకును తెనుఁగుదేశమును జయించి ప్రసిద్ధికెక్కుటయే కాక, సంస్కృతాంధ్రములయం దసమానపాండిత్యముకలవాఁ డయి యమరుకకావ్యమునకు సంస్కృతవ్యాఖ్య వ్రాసి ప్రఖ్యాతి కెక్కెను. [అమరుకకావ్యమునకు సంస్కృతవ్యాఖ్యానమగు 'శృంగారదీపిక'ను రచించిన యాతఁ డీ యనవేమారెడ్డి కాఁడు. పెదకోమటి వేమారెడ్డి ఇతఁడు క్రీ. శ. 1400-1420 నడుమ నుండెను] ప్రోలయవేమారెడ్డి ౧౩౨౦ వ సంవత్సరము మొదలుకొని ౧౩౪౫ వ సంవత్సరమువఱ

[* ఇతని రాజ్యారంభకాలము ౧౩౨౮ అని 'ఆంధ్రకవితరంగిణి' (సంపుటము ౪ పుట 57]

కును రాజ్యముచేసినందున, ఇతని యాస్థానకవీశ్వరుఁడయిన యెఱ్ఱాప్రెగడ యిప్పటి కయిదువందలయేఁబది సంవత్సరములక్రిందట నున్నట్లు నిశ్చ యింపవలసి యున్నది. పోలయవేమారెడ్డిపూర్వు లంత పేరుపడినవారు కారు గనుకనే యెఱ్ఱాప్రెగడ హరివంశమునందు పోలయ పయివారి నెవ్వరిని వంశవర్ణనయం దుదాహరింపలేదు. పోలయవేమారెడ్డి కద్దంకి రాజధాని యయినట్టు హరివంశములోని యీ క్రిందిపద్యమువలన విశద మగుచున్నది

గీ. 'తనకు నద్దంకి తగు రాజధానిగాఁ బ
రాక్రమంబున బహుభూము లాక్రమించి
యనుజతనుజబాంధవమిత్త్రజనుల కిచ్చె
నెదురె యెవ్వారు వేమమహీశ్వరునకు.'

ఎఱ్ఱాప్రెగడ హరివంశమునం దీ క్రిందిపద్యములచేత నన్నయ తిక్కన సోమయాజుల నిద్దఱిని మాత్రమే పూర్వకవులనుగా స్తుతించినాఁడు.

ఉ 'ఉన్నతగోత్రసంభవము నూర్జితసత్త్వము భద్రజాతిసం
పన్నము నుద్ధతాన్యపరిభావిమదోత్కటము న్నరేంద్రపూ
జోన్నయనోచితంబు నయి యొప్పెడు నన్నయభట్టకుంజరం
బెన్న నిరంకుశోక్తిగతి నెందును గ్రాలుటఁ బ్రస్తుతించెదన్.'

మ. తనకావించినసృష్టి తక్కొరులచేతం గాదునా నే ముఖం
బునఁ దాఁ బల్కిన పల్కు లాగమములై పొల్పొందునా వాణి న
త్తను పీఠం బొకరుండునాఁ జను మహత్త్వ ప్తిం గవిబ్రహ్మనా
వినుతింతుం గవితిక్కయజ్వ నఖిలోర్వీదేవతాభ్యర్చితున్.

ఇతఁడు హరివంశమును రచియించుటకుముందే రామాయణమును రచించి నట్లు వేమారెడ్డి కవి నుద్దేశించి యన్నట్లు చెప్పఁబడిన యీ క్రింది పద్యము వలనఁ దెలియవచ్చుచున్నది.

శా. 'నాతమ్ముండు ఘనుండు మల్లరథినీనాథుండు వి న్నాతత
శ్రీతోడ న్నముఁ బ్రేతుఁ జేసి యెలమిం జేపట్టి మా కిచ్చుటం

చేతోమోద మెలర్ప రామకథ మున్ జెప్పించి యత్యుత్తమ
ఖ్యాతిం బొందితి వింకనుం దనియ నేఁ గావ్యామృతాస్వాదనన్.'

హరివంశములోని మొదటి పద్యమునందలి "యన్నమవేమభూవిభున" కన్నదాని "నన్నయవేమభూవిభున కని భ్రమపడి యీ కవి తన హరివంశమును అనవేమభూపాలున కంకిత మొనర్చినట్లు చెప్పఁబడెనుగాని యది సరికాదు. ఎఱ్ఱాప్రెగడ యనవేమారెడ్డి నెఱుఁగునో యెఱుఁగఁడో యని సందేహింపవలసి యున్నది. మనకవి యీక్రిందిపద్యమునందు

శా. వేమక్ష్మాధిపుకూర్మిపుత్రుఁడు దయావిభ్రాజి యవ్యాజతే
జోమార్తాండుఁడు కీర్తనీయసుగుణస్తోమంబులం దేమియున్
రామస్ఫూర్తికి లొచ్చుగాక సరియై రాజిల్లె రాజార్చితుం
డాముష్యాయణుఁ డెందుఁ బోతయచమూపాగ్రేసరుం డిమ్మహిన్

ప్రోలయవేముని జ్యేష్ఠపుత్రుఁడై యనపోతారెడ్డిని, ఈ క్రిందిపద్యమునందు

క. 'దానంబునఁ గర్ణుని సరి
మానంబునఁ పేర్మి ననుపమానుఁడు బుధస
న్మానచతురుండు మాచయ
సూనుఁడు కోమటి సమ సనులభుఁడు కరుణన్.''

ప్రోలయవేమునియన్నకుమారుఁడైన కోమటిరెడ్డిని, వర్ణించినను హరివంశమునం దెక్కడను అనవేమునిపేరైన నెత్తలేదు అందుచేత హరివంశరచనాకాలమునాఁటి కనవేముఁడు పుట్టెనో లేదో, పుట్టినను మిక్కిలి పసివాఁడుగా నుండెనో, యని యూహింపవలసి యున్నది. పయిపద్యములో "మాచయసూనుఁ" డన్నచోటఁ గొన్ని ప్రతులలో "పోలయసూనుఁ"డని యున్నది. మాచయసూనుఁ డన్న పాఠమే సరియయినది. [ఈ పద్యమును జర్చించుచు 'ఆంధ్రకవితరంగిణి'లో నీక్రిందివిషయము వ్రాయఁబడినది.

'క. దానంబున .....ప్రోలయసూనుఁడు కోమటి సమస్తసులభుఁడు కరుణకా' అను కందపద్యము ముద్రిత ప్రతిలోను, కొన్ని తాళపత్ర ప్రతులలోను నట్లే యున్నది. అందు 'ప్రోలయ' అను శబ్దము పొరపాటు. ప్రోలయకుఁ గోమటి యను సూనుఁడు లేనేలేఁడు. 'ప్రోలయ' యను పదము సరికాదనియు, నచట 'మాచయ' యను పదముండవలెననియు శ్రీ వీరేశలింగము పంతులుగారు వ్రాసి యున్నారు. కాని 'మాచయ' యను పదముకూడ సరికాదనియు, నచ్చట వేమయ యను పదముండవలెననియు నాయభిప్రాయము. కవి యీ కథాసందర్భమున వేమారెడ్డి వంశమును, నాతని మాతృసంబంధులను మాత్రమే వర్ణించుచున్నాఁడు గాని వేమారెడ్డి కగ్రజుఁడయిన మాచన వంశమును జెప్పుటలేదు. ఇంతియగాక యీ కంద పద్యమునకుఁ బైన 'అతని యనుజుఁడు' అని చెప్పియుండుటచే వేమారెడ్డికి ప్రథమపుత్రుఁడైన పోతయ చమూపతికిఁ దమ్ముఁడును వేమారెడ్డికి రెండవ పుత్రుఁడు నైనవానిని బై కందపద్యములో వర్ణింపనెంచెననుట నిశ్చయము. కానిచో 'అతని యనుజుండు' అను వాక్యము నిరర్థకమగును. కావున పై పద్యములో 'ప్రోలయ' అనుటకు బదులుగా వేమారెడ్డిని సూచించు వేమయ యను మాట యుండఁదగినది.

శ్రీపంతులుగారు శ్రీనాథకవి చారిత్రమున వేమారెడ్డికి 'కోమటిరెడ్డి' యను పుత్రుఁడున్నాఁడని యంగీకరించుచు, 'ఎఱ్ఱాప్రెగడ హరివంశము రచించు నాఁటి కన వేమారెడ్డి మిక్కిలి పసివాఁడు. కోమటిరెడ్డి మృతుఁడయ్యెను. హరివంశమునందే యీతని పెదతండ్రి కుమారుఁ డయిన కోమటిరెడ్డి యిట్లు వర్ణింపఁబడెను. అని వ్రాసి 'దానంబునఁ గర్ణుని ...' అను పద్యము నుదాహరించుచు నందలి 'ప్రోలయ' అను పదమును 'మాచయ' అని మార్చివేసిరి .. .. ....హరివంశ రచనము నాఁటికి వేమారెడ్డి రెండవ కుమారుఁడైన కోమటిరెడ్డి జీవించియే యున్నాఁడు. అతఁడే పై కంద పద్యమున వర్ణింపఁబడినవాండు' (ఆంధ్రకవితరంగిణి నాలుగవ సంపుటము పుటలు 95, 96)

క. శ్రీసంభావితవక్షో
భాసురమణిహారకిరణపరిచయచతురో
ల్లాసమృదుహాసయవిరత
భూసురగృహరచితహేమ ! పోలయవేమా !'

అని పూర్వభాగము షష్ఠాశ్వాసప్రారంభమునందును,

క. 'శ్రీనందనసమసౌంద
ర్యానందితయువతిహృదయ ! యధికాభ్యుదయా
యానతజనహృద్యదయా
భూనుతజయశక్తిభీమ ! పోలయవేమా !

అని యుత్తరభాగమున సప్తమాశ్వాసప్రారంభమునందును, కవి కృతిపతిని "పోలయవేమా !" యని సంబోధించుటచేతను,

చ. కులజలరాశిచంద్రుఁడగు కోమటిపోలనయున్ నితంబినీ
తిలకము పుణ్యురాలు పతిదేవత యన్నమయుం గృతార్థతా
కలితులు ధీరు వేమవిభుఁ గానఁగఁ గాంచిన పుణ్య మెద్ది యే
కొలఁదుల నెన్ని జన్మములఁ గూర్చిరొకో బొదలున్ జనస్తుతుల్.'

అని కృత్యాదియందు వేమనను గన్నవారు పోలనయు నన్నమయునని స్పష్టముగాఁ జెప్పుటచేతను, హరివంశమును గృతి నందినవాఁడు పోలయ వేమారెడ్డియే యనుట నిశ్చయము. అంతేకాక కృత్యాదియందు నెఱ్ఱనయే కృతిపతితో నిట్లనియెను—

క. 'కావునఁ జెప్పెదఁ గళ్యా
ణావహమహనీయరచన హరివంశము స
ద్భావమున నవధరింపుము
భూవినుతగుణాభిరామ ! పోలయవేమా!'

ఇంతవఱకును బయల్పడిన శాసనాదులనుబట్టి రెడ్లప్రభుత్వకాలమును, సంబంధమును తేటపడుటకయి వారి వంశవృక్షము నిచ్చట నిచ్చు చున్నాము—

- దేసటి ప్రోలయ (భార్య అన్నమ్మ)
  - మాచన.
    - పెదకోమటి
      - 5 కోమటివేముఁడు (1400—1420)
        - 6. రాచవేముఁడు. (1420—1424)
  - 1 వేమారెడ్డి (1320—1349)
    - 2 అనపోతుఁడు. (1350—1361)
      - 4. కుమారగిరి. (1380—1400) కొండవీటిరాజ్యము
      - మల్లాంబ. భర్త కాటయవేముఁడు) రాజమహేంద్రవరరాజ్యము (1386—1400)
        - అనితల్లి (భర్త వీరభద్రారెడ్డి) (1426—50)
    - 3. అనవేముఁడు (1362—1380)
    - దొడ్డాంబ (భర్త కాటయ)
      - కాటయవేముఁడు (1386—1400) (మల్లాంబభర్త)
        - అనితల్లి.
    - వేమసాని
      - భీమలింగము.
        - భార్య వేమాంబిక అనవేమునిపౌత్రి)
  - దొడ్డారెడ్డి
  - అన్నారెడ్డి
  - మల్లారెడ్డి
    - అల్లాడరెడ్డి (1416—26)
      - (భర్త వీరభద్రారెడ్డి.) (1426—50)

[మేఁడి వంశవృక్షములో 'అనితల్లి' తల్లి మల్లాంబిక యని తెలుపఁబడి నది. శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రియగారు 'శృంగార శ్రీనాధము'న కాటయవే మనను గూర్చి వ్రాయుచు 'ఈతఁడు కొమరుఁడు బుత్రుఁడు అనపోత నృపాలుని కల్లుఁడు, తల్లాంబిక, దొడ్డాంబిక, మల్లాంబిక యని యీతనికి ముగ్గురు భార్యలు తెలియవచ్చు చున్నారు తల్లాంబికయందుఁ గుమారగిరి యని కుమారుని, దొడ్డాంబిక యం దనితల్లియని కుమార్తెను గాటయ వేమన కాంచినాఁడు, మల్లాంబికకు సంతానము కలదో, లేదో తెలియదు. (పుట 58) అని తెలిపియున్నారు.]

1,2,3,4,5,6 సంఖ్యలు వేసినవారు వరుసగా రాజ్యమునకు వచ్చిన రెడ్డి రాజులు వారు రాజ్యము చేసినకాలము వారిక్రింద వేయఁబడినది. ఇందు వేయఁబడిన కాల మిప్పటివఱకు దొరకిన శాసనములనుబట్టి నిర్ణయింపఁ బడినది ముందు లభింపఁబోయెడు శాసనములను బట్టియైనను వీరి కాల మంతగా మాఱక రెండు మూఁడు సంవత్సరము లెక్కువతక్కువగా సరి పోవును గాని యంతకంటె నెక్కువ వ్యత్యాసముండదు. మూఁడవవాఁడైన యనవేమారెడ్డి రాజధానిని అద్దంకినుండి కొండవీటికి మార్చెను నాలవవాఁ డయిన కుమారగిరిరెడ్డి రాజమహేంద్రవరరాజ్యమును తనచెల్లె లయిన మల్లాంబ కరణముగా నిచ్చినందున నామెభర్తయు, మేనత్తకొడుకు నయిన కాటయవేముఁ డా రాజ్యమును 1385 మొదలుకొని 1400-వ సంవత్సరము వఱకును పాలించెను కాటయవేమునితండ్రి కాటయ కుమారగిరితండ్రి చెల్లె లయిన దొడ్డాంబను వివాహమాడెను అనవేముని మనుమరా లయిన వేమాంబికను వివాహమాడిన యల్లాడరెడ్డి కాటయవేముని దండనాథుఁడుగా నుండి రాజ్యము నాక్రమించుకొని 1413-వ సంవత్సరము మొదలుకొని 1426 వఱకును తన పేరనే రాజ్యము చేయ నారంభించెను గాని; పిమ్మట కాటయ వేమునిపుత్రిక యైన యనితల్లిని తన ద్వితీయపుత్రుఁడైన వీరభద్రారెడ్డికిఁ బెండ్లిచేసి రాజ్యము వారి కిచ్చివేసెను. కొందఱు కాటయవేమునికి కొమర గిరి యను పుత్రుఁడు పసివాఁ డనితల్లి తమ్ముఁ డొకఁ డుండెననియు, ఆతని బాల్యములో తాను మంత్రిగా నుండి యల్లాడరెడ్డి శత్రుభయము

లేకుండఁ గాపాడి యాతని పక్షమున రాజ్యము చేసె ననియు, అతఁడు మృతినొందఁగా రాజ్య మవితల్లి వశము చేసె ననియు, చెప్పుచున్నారు. స్థానికచరిత్రములలో రెడ్ల రాజ్యకాలపరిమితినిగూర్చి యీ క్రింది పద్యము కానఁబడుచున్నది.

సీ 'పోలయవేమన్న పొలుపారఁ బంద్రెండు
　　వత్సరంబులు గాచె వసుధ యెల్ల
అటువెన్క ముప్పది యనపోతవేమన్న
　　వన్నెవాసికి నెక్కె వసుధ యేలె
ధర్మాత్ముఁ డనవేమధరణీకళత్రుండు
　　పదియునేనిట భూమి పదిలపఱిచె
ప్రజల కుత్సవముగఁ బదునాలు గేఁడులు
　　కొమరగి రేలెను సమయుదాఁక

నేలెఁ గోమటివేమన యిరువదేఁడ్లు
రాచవేమన్న నాల్గు వర్షంబు లేలె
మించి కట్టిరి గృహరాజుమేడ కొండ
వీట నూటేఁడ్లు రెడ్లు భూ విదితయశులు.'

ఈ పద్యమెంతవఱకు విశ్వసింపఁదగినదో చదువరులే యోచించుకోవచ్చును. రెడ్లచరిత్రము నింతట విడిచి యిఁక మన కవిచరిత్రమునకు వత్తము.

కవియింటిపేరు చెదలువాడవారు. ఈ సంగతి యెఱ్ఱాప్రెగడ వంశజుఁడయిన చెదలువాడ మల్లన రచించిన విప్రనారాయణచరిత్రములోని యీ క్రింది పద్యమువలన స్పష్టపడుచున్నది

సీ. 'ప్రతిభతో నారణ్యపర్వశేషముఁ జెప్పెఁ
　　గవులకుఁ జెవులపండువులుగాఁగ
వల్మీకభవువచోవైఖరి రామాయ
　　ణంబు నాంధ్రప్రబంధంబుఁ జేసె

నారసింహుని పురాణమొనర్చె హరి మెచ్చి
నన్ను నెన్నఁడు చూచినాఁడ వనఁగఁ
బ్రౌఢిమై హరివంశభాగముల్ రెండును
రచియించె సభలందుఁ బ్రాజ్ఞు లెన్న
దురితహరుఁ బ్రబంధపరమేశ్వరునిఁ జెద
ల్వాడనిలయు నాదు వంశకర్త
ధన్యమూర్తి శంభుదాసు నెఱ్ఱాప్రెగ్గ
డను నుతింప బ్రహ్మకును దరంబె?'

కవియింటిపే రేర్చూరివారని పడుట యెఱ్ఱన లనేకు లుండుటచేతనే.

సీ 'భవ్యచరిత్రుఁ డాపస్తంబసూత్రుండు
శ్రీవత్సగోత్రుండు శివపదాబ్జ
సంతతధ్యానసంసక్తచిత్తుఁడు సూర
నార్యునకును బోతమాంబికకును
నందనుం డిలఁ బాకనాటిలో నీలకం
ఠేశ్వరస్థానమై యెసఁక మెసఁగు
గుడ్లూరి నెలవున గుణగరిష్ఠత నొప్పు
ధన్యుఁ డద్వైతైకతత్పరాత్ముఁ
డెఱ్ఱనార్యుండు సకలకవీంద్రవినుతుఁ
డైన నన్నయభట్టమహాకవీంద్రు
సరససారస్వతాంశప్రశస్తి తన్నుఁ
జెందుటయు సాధుహర్షణసిద్ధిఁ గోరి.'

అను భారతారణ్యపర్వశేషములోని పద్యమునందుఁ గాని.

సీ 'ప్రజ్ఞాపవిత్రుఁ డాపస్తంబసూత్రుఁడు
శ్రీవత్సగోత్రుఁ డూర్జితచరిత్రుఁ
డగు బొల్లనకుఁ బోలమాంబకుఁ బుత్రుఁడు
వెలనాటిచోడనివలన మిగుల

ఘన్నన గన్నభీమనమంత్రిపౌత్రుండు
　　　　ప్రేకమాంబామనఃప్రియుఁడు పోత
మాంబికావిభు సూరనార్యు మఖ్జనకుని
　　　　బొల్లధీనిధికిఁ బ్రోలనకును
జన్నునకు ననుజన్ముఁడు గన్నతండ్రి
వేఁగినాటి గరాపర్తివృత్తిమంతుఁ
డనఘుఁ డెఱపోతసూరి కంసారిచరణ
కమలమధుకరపతి సారవిమలయశుఁడు.'

అను నృసింహపురాణములోని పద్యమునందుఁ గాని, తన గృహనామమును జెప్పక తా నాపస్తంబసూత్రుఁడ ననియు శ్రీవత్సగోత్రుఁడ ననియు శివపదాబ్జసంతతధ్యానసంసక్తచిత్తుఁడ ననియు మాత్ర మెఱ్ఱన చెప్పుకొనుట చేతను,

సీ. 'శ్రీవత్సగోత్రుండు శివభక్తియుక్తుఁ డా
　　　　పస్తంబసూత్రుఁ డపారగుణుఁడు
నేర్పూరిశాసనుం డెఱ్ఱనప్రెగ్గడ
　　　　పుత్రుండు వీరనపుణ్యమూర్తి
కాత్మజుఁ డైన గాదామాత్యునకుఁ బ్రోల
　　　　మాంబకు నందను లమితగుణులు
కసువనామాత్యుండు ఘనుఁడు వీరనమంత్రి
　　　　సింగధీమణియు నంచితచరిత్రు
లుద్భవించిరి త్రేతాగ్నులో యనంగ
సొరిది మూర్తిత్రయం బన శుద్ధకీర్తిఁ
బరఁగి రందులఁ గసువనప్రభువునకును
ముమ్మడమ్మనుసాధ్వి యిమ్మలను వెలసె.'

అను పద్యములో భాగవతషష్ఠస్కంధమును రచియించిన సింగయ శ్రీవత్సగోత్రుఁడును, శివభక్తియుక్తుఁడును నాపస్తంబసూత్రుఁడు నగు నేర్పూరి

యెఱ్ఱనప్రెగ్గడ నొక్కనిని దన పూర్వునిఁ జెప్పి యుండుటఁ జూచి సూక్ష్మముగా విచారింపక స్థూలదృష్టిచేత నీ యెఱ్ఱనప్రెగడయే యా యెఱ్ఱనప్రెగడ యని భ్రమపడుటవలనఁ గలిగినది. ఈ యెఱ్ఱన లిరువురును గాక మఱియొక యెఱ్ఱనకవి గూడఁ గలఁడని కొక్కోకమునందు గ్రంథకర్త తన్నుఁగూర్చి చెప్పుకొన్న యీ క్రిందిపద్యమువలనఁ దెలియుచున్నది.

సీ. 'శ్రీవత్సగోత్రప్రసిద్ధసంభూతి నా
పస్తంబసూత్రప్రశస్తఘనుఁడ
గురుదయానిధి యైన సూచనమంత్రికి
నంగనామణి ముత్తమాంబికకును
దనయుండ సత్కవీంద్రసుమాన్యచరితుండ
శివకృపాస జ్ఞానశేఖరుండ
నారూఢవిద్యాచలానంద యోగీంద్ర
శిష్టప్రవాదవిశిష్టఘనుఁడ
నెఱ్ఱనామాత్యుఁడను సత్కవీంద్రహితుఁడఁ
గవిత వాక్రొప్పఁ గొక్కోకకవివరుండఁ
జతురమతితోడ రతిశాస్త్ర మిదియుఁ
దెనుఁగు గావింతు రసికులు వినుతి చేయ'

ఇఁకను మనము చెదలువాడ యెఱ్ఱాప్రెగడ కాలమునుగూర్చి యించుక విచారింప వలసియున్నది. ఇతఁడు తాను రచించిన రామాయణమును హరివంశమును బోలయవేమున కంకితము చేసి యుండుటచేతను, బోలయవేముఁడు ౧౩౨౦ మొదలుకొని (కొందఱ అనునట్లు ౧౩౨౪ మొదలుకొని) ౧౩౪౯-వ సంవత్సరమువఱకును సామంతుఁడుగానో స్వతంత్రుఁడుగానో ప్రజాపాలనము చేసి యుండుటచేతను, ఇతఁ డా కాలమున నుండె ననుటకు సందేహము లేదు. ఇతఁడు తిక్కనసోమయాజి తరువాత నిరువది ముప్పది సంవత్సరములలోపలనే యుండియున్నట్టు కనఁబడుచున్నాఁడు. "ప్రజ్ఞాపవిత్రుఁ" డన్న నృసింహపురాణపద్యమునుబట్టి చూడఁగా నీతని వంశవృక్ష మీ విధముగా నున్నది.

భీమన. (వెలనాటిచోడునివలన మన్నన గన్నవాఁడు)
|
బొల్లన
|
ఎఱపోతన.
|
బొల్లన.  ప్రోలన.  జన్నన.  సూరన.
|
ఎఱ్ఱన. (ఎఱ్ఱాప్రెగడ.)

వెలనాటిచోడుని కాలములో నున్న భీమనమంత్రికొడుకు బొల్లన; బొల్లన కొడుకు కెఱపోతన; ఎఱపోతనయొక్క కొడుకు సూరన, సూరన కొడుకు కెఱ్ఱాప్రెగడ వెలనాటిచోడునికాలమునందుండి. భీమన మంత్రికిని కవియైన యెఱ్ఱాప్రెగడకును నడుమ ముగ్గురు పురుషు లున్నారు. ఒక్కొక్కపురుషునకిఁ గలయంతరము నలువదేసి సంవత్సరములచొప్పున గణించినను భీమనమంత్రి తరువాత నెఱ్ఱాప్రెగడ నూటయిరువది సంవత్సరములకు పుట్టి యుండ వలెను. వెలనాటిచోడుఁడు ౧౧౫౦ మొదలుకొని ౧౧౬౩-వ సంవత్సరము వఱకును భూపరిపాలనము చేసెను. అతనిచే మన్నన గన్న భీమనయు నా కాలమునం దుండవలెను; ఒక్కొక్కఁడు తండ్రికి నలువదేసి సంవత్సర ముల యీడునఁ బుట్టుచు వచ్చినచో భీమనకొడుకు బొల్లన ౧౧౯౦-వ సంవత్సరమునఁ బుట్టి యుండవలెను. తరువాత నాతనికొడు కెఱపోతన ౧౨౩౦-వ సంవత్సరమునఁ బుట్టి యుండవలెను; అటుపిమ్మట నాతని కొడుకు సూరన ౧౨౭౦-వ సంవత్సరమునందుఁ బుట్టి యుండవలెను; పిదప సూరనకొడుకు మనకవి యెఱ్ఱాప్రెగడ ౧౩౧౦-వ సంవత్సరము నందుఁ బుట్టి యుండవలెను. వెలనాటిచోడునివలన మిగుల మన్ననఁ బొందిన భీమనమంత్రి వెలనాటిచోడునికాలమునాఁటికే ముప్పది నలువది యేండ్ల ప్రాయముగలవాఁడయి యుండును గాన నాతనిపుత్రుని జననమున కటు తరువాత నలువదియేండ్లు వేయుట న్యాయము కాదు. అందుచేత నిరువ దేసి సంవత్సరములు తగ్గించుచు వచ్చినచో మనకవి జననకాలము ౧౩౫౦-వ

సంవత్సరప్రాంతములకుఁ బోవును [ఇయ్యెడ 'ఆంధ్రకవితరంగిణి' లో నీ క్రింది విధముగఁ గలదు.

'భీమనమంత్రిని గౌరవించిన చోడుఁడు మొదటి యాతఁడని శ్రీ వీరేశలింగము పంతులుగా రభిప్రాయపడిరి రెండవ చోడుఁడని నా యభిప్రాయము. ఇతనిని వీరేంద్ర చోడుఁ డందురు భీమనమంత్రి ౧౧౭౫ సంవత్సర ప్రాంతమున నీ వెలనాటి చోడునిచే గౌరవము నందెననియు, నప్పటి కాతఁడు ముప్పది సంవత్సరముల యీడుగల వాఁడనియు భావించితిమేని, భీమనమంత్రి జననము క్రీ శ. ౧౧౪౦ ప్రాంతమైయుండును తరమునకు ముప్పది మూఁడు సంవత్సరముల వంతునఁ జూచినచో, ౧౧౭౫లా ప్రాంతమున బొల్లనయు ౧౨౧౦ ప్రాంతమున నెఱపోతసూరియు, ౧౨౪౫ ప్రాంతమున సూరనయు, నించుమించుగ ౧౨౮౦ వ సంవత్సరకాలమున మన యెఱ్ఱాప్రెగ్గడయు జన్మించి యుందురని దలంపవలసి యున్నది. శ్రీపంతులుగా రనినిట్లు మొదటి వెలనాటిచోడుఁ డైనచో, నీయంతర మధికమై తరమునకు ౪౫ సంవత్సరముల వ్యవధి యేర్పడి యస్వాభావిక మగును" (నాలుగవ సంపుటము. పుటలు 57, 58)]

కులోత్తుంగరాజేంద్రచోడుఁడే యిందుఁ బేర్కొనఁబడిన వెలనాటిచోడుఁడు, ఈ యంశమును నిర్ణయించుటకు మంచనకవివిరచితమైన కేయూరబాహుచరిత్రము మనకు కొంత తోడుపడుచున్నది. వెలనాటి గొంకరాజుమంత్రి నందూరి గోవిందామాత్యుఁడు, గొంకరాజుపుత్రుడైన వెలనాటిచోడుఁ డనఁబడెడు కులోత్తుంగరాజేంద్రచోడుని మంత్రి గోవిందామాత్యుని కుమారుఁడైన కొమ్మనప్రధానుఁడు కేయూరబాహుచరిత్రము ప్రథమాశ్వాసములోని యీ క్రింది పద్యములను జూడుఁడు.

మ. 'విహితాస్థానములందుఁ జూపుఁ దగ గోవిందాభిధానప్రభుం
దహితోర్వీధరవజ్రి గొంకవిభురాజ్యాధిష్ఠియై సంధివి
గ్రహముఖ్యోచితకార్యసంఘటన వాక్ప్రౌఢత్వమున్ బాడప
న్నహనోదగ్రరిపుక్షితీశబహునైన్యధ్వంసనాటోపముః.

కం. ధీరుం డా గోవిందన
కూరిమినందనుఁడు వెలసెఁ గొమ్మన నాఁక
క్ష్మారమణున కుదయించిన
వీరుఁడు రాజేంద్రచోడవిభుప్రెగ్గడయై. 23

సీ. నవకోటిపరిమితద్రవిణ మే భూపాలు
భాండారమున నెప్డు బాయకుండు
నేకోనశతదంతు లే రాజునగరిలో
నీలమేఘంబులలీలఁ గ్రాలు
బలవేగరేఖ నల్వదివేలతురగంబు
లే నరేంద్రునివాగ నెపుడుఁ దిరుగుఁ
బ్రతివాసరంబు వెబ్బడిమే ఎప్పట్ల నే
యేవిభుమందల నెపుడుఁ గల్గు

నట్టి యధికవిభవుఁ డగు కులోత్తుంగరా
జేంద్రచోడనృపతి కిష్టసచివ
తంత్రముఖ్యుఁ డనుఁగుమంత్రి గోవిందసుం
దనుఁడు కొమ్మనప్రధానుఁ డొప్పు. 24

ఉ. ఇల వెలనాటిచోడమనుజేంద్రునమాత్యత యాదవాలుగాఁ
గులతిలకంబుగా మనిన కొమ్మనప్రెగ్గడకీర్తి మాయిలం
దెలుపఁగ నేల ? తత్క్రియఁ బ్రతిష్ఠితమైన తటాక దేవతా
నిలయమహాగ్రహారతతి నేఁటికి నెల్లెడఁ దాన చెప్పఁగన్ 25

ఆ కాలమునందు నియోగులు రాజునకడ మంత్రులుగా నుండుటయే కాక ఖడ్గతిక్కనవలె దండనాథులుగాఁ గూడ నుండి శత్రురాజులతో యుద్ధములు సహితము చేయుచుండిరి. ఈ కొమ్మనామాత్యునిఁగూర్చి కేయూరబాహుచరిత్రములో వ్రాయఁబడినదానిని చూడుఁడు

మ. అరుకందన్ వెలనాటిచోడమనుజేంద్రాజ్ఞాపనం బూని దు
స్తరశక్తిం జని యేకవింశతిసహస్రగ్రామసంఖ్యాకమై
ధరణిం బేర్చిన పాకనాడు నిజదోర్దండైకలగ్నంబుగాఁ
బరిపాలించె నమాత్యకొమ్మన జగత్ప్రఖ్యాతచారిత్రుఁడై. 27

క. చలముమెయిఁ గటకసామం
తుల కరిహయబహుళసేనతో నేతేఱన్
దలపడియెఁ గొమ్మసచివుఁడు
బలియుండై క్రొత్తచెర్లపరిసరభూమిన్. 28

సీ. సేలకట్టెవాటినఁ జెలఁగి రెంటిరి మూటిఁ
గూడ గుఱ్ఱంబులు గుదులుగ్రుచ్చుఁ
బ్రతిమొగం బగు నరపతులకత్తళమునఁ
గడిమిమై వీఁపులు వెడలఁబొడుచు
బందంపుగొఱియలపగిది నేనుంగుల
ధారశుదిగ నసిధారఁ దునుముఁ
జిదియించుఁ బగిలించుఁ జేతులతీఁట వో
వడిఁ గాండ మేసి మావతులతలలు

తల పుడికివేసి మావంతుతలలు శత్రు
రాజశిరములు ద్రొక్కించు రాఁగెఁ దిరుగ
వాగె నుబ్బెడు తన వారువంబుచేత
మహితశౌర్యుఁడు కొమ్మనామాత్యవరుఁడు 29

ఈ కొమ్మనామాత్యునికుమారుఁడైన కేతన వెలనాటిచోడునికుమారుఁడైన పృథ్వీశరాజునకు మంత్రిగా నుండెను పృథ్వీశరాజు 1163 మొదలు కొని 1187-వ సంవత్సరమువఱకును రాజ్యపాలనము చేసెను. మంచన వీరి నిట్లు వర్ణించెను.

క. 'ఆ కొమ్మన ప్రెగ్గడసుతుఁ
డై కేతన చోడభూవరాత్మజుఁడై పై

రాకరుఁ డగు పృథ్వీశమ
హీ కాంతువిమంత్రి యయ్యె నెంతయుఁ బేర్మిన్.　　　31

ఉ. కౌశికగోత్రభూసురశిఖామణి కేతన భూవరుండు పృ
థ్వీశనరేంద్రుమంత్రి యయి యెల్లెడఁ జాలఁ బొగడ్త కెక్కె నా
కాశనదీమరాళశివకాశసురాశనతారకేశనీ
కాశతరాధరోచిరవకాశవికాసయశోవిశాలుఁడై.　　　32

ఈ పృథ్వీశరాజు మనుమసిద్ధితండ్రి యైన తిక్కనృపాలునిచే రణరంగమున సంహరింపఁబడినట్లు నిర్వచనోత్తరరామాయణములోని యీ క్రింది పద్యము చెప్పుచున్నది.

ఉ. 'కేశవసన్నిభుండు పరిగీతయశోనిధి చోడతిక్కధా
త్రీశుఁడు కేవలుండె నృపు లెవ్వరి కాచరితంబు గల్గనే?
శైశవలీలనాఁడు పటుశౌర్యధురంధరబాహుఁ డైన పృ
థ్వీశనరేంద్రుమస్తకము నేత్తెఱఁ గందుకకేళి సల్పఁడే!'

ఇది 1187-వ సంవత్సరమునందు జరగి యుండును. అప్పటికి మనుమసిద్ధి తండ్రి యైన తిక్కరా జిరువదియేండ్లలోపలి వయస్సువాఁ డయి యుండును. ఎఱ్ఱాప్రెగడ ౧౨౮౦-వ సంవత్సరప్రాంతములయందు జననమొంది ౧౩౫౦-వ సంవత్సరప్రాంతమువఱకును జీవించి యుండును. ప్రోలయవేముని యనంతరమున నీతఁడు జీవించి యుండిన పక్షమున వేముని పుత్రుఁడైన యనపోతనయాస్థానమున నీతఁడు కవిగా నుండక యన్యులాస్థానకవులుగా నుండుట తటస్థింపదు. అనపోతనయాస్థానమునందు వెన్నెలకంటివారు కవులుగా నుండి యాతనికిఁ బ్రబంధము లొసంగినట్టు విష్ణుపురాణములో నీ క్రిందిపద్యమునఁ జెప్పఁబడినది.

ఉ ఈ నిఖిలంబు మెచ్చ నమరేశ్వరదేవుఁడు చూడఁ గృష్ణవే
ణీనది సాక్షిగా ననికి నిల్చిన రావుతుఁ గేసభూవిభుం
గానకుఁ దోలి వెన్నడిచి కాచిన వేమనయన్నపోతభూ
జానికి పత్త్రబంధము లొసంగిన వెన్నెలగంటివారిలోన్.

అనపోతారెడ్డికి ప్రబంధముల నొసఁగిన యాతఁడు వెన్నెలకంటి సూర్యుఁడు ఈ సూర్యకవి యనపోతనయాస్థానమునం దుండి ప్రబంధములు చేయుటయే కాక యనపోతనతండ్రి యైన వేమారెడ్డిచేత నగ్రహారములు పడసినట్లు జక్కన విక్రమార్కచరిత్రములోని యీ క్రింది పద్యము తెలుపుచున్నది.

ఉ. 'వెన్నెలకంటిసూర్యుఁడు వివేకగుణాఢ్యుఁడు వేదశాస్త్రసం
పన్నుఁడు రెడ్డివేమనరపాలకుచేత మహాగ్రహారముల్
గన్న కవీంద్రకుంజరుఁ డకుంఠితతేజుఁడు పెద్దతండ్రిగా
సన్నుతి గన్న సిద్ధనకు సంతతదానకళావినోదికిన్'

పోలయవేమారెడ్డియవసానదినములయందు వెన్నెలకంటి సూర్యుఁడు తదాస్థానకవిగా నుండి యగ్రహారములను బొందుట మొదలయిన వానినిబట్టి విచారింపఁగా నెఱ్ఱాప్రెగడ వేమారెడ్డికాలములోనే పరమపదము నొందెనేమో యని యూహ కలుగుచున్నది. ఎఱ్ఱాప్రెగడ యనవేమారెడ్డి నెఱుఁగకపోవుట కూడ నీ యూహను బలపఱచుచున్నది. ఎఱ్ఱాప్రెగ్గడకు ముఖ్యాశ్రయుఁడును, అన్న యైన వేమారెడ్డి కీకవి నిచ్చినవాఁడును, అయిన మల్లదండనాథుఁడు గూడ వేమారెడ్డి కాలములోనే లోకాంతరగతుఁ డయ్యెను తమ్ముని మరణానంతరమున వేమారెడ్డి తన ప్రియానుజన్ముఁ డైన మల్లారెడ్డికి పుణ్యముగా నమరావతీపట్టణములోని యమరేశ్వరాలయశిఖరమున స్వర్ణకలశముల నెత్తించెను. ఎఱ్ఱాప్రెగడజననమరణకాలములనుగూర్చి పైని వ్రాయఁబడినవి సంభావ్యము లైన యూహలే కాని సరిగా నిర్ధారితము లైన పరమ సిద్ధాంతములు కావు [భారతా రణ్య పర్వశేష, నృసింహపురాణ, రామాయణ, హరివంశములనేగాక యెఱ్ఱాప్రెగడ 'కవి సర్పగారుడ' మను ఛందోగ్రంథమును వ్రాసినట్లు ఆనంద రంగరాట్ఛందమునం దుదాహృతములైన పద్యములనుబట్టి తెలియుచున్నది. కాని యట్లూహించుటకుఁ దగిన ప్రమాణములు లేవు.

ఎఱ్ఱాప్రెగడయును, తిక్కనయు సమకాలీనులనియు తిక్కన భారతమును రచింపఁ బూనుటకు ముందే ఎఱ్ఱాప్రెగడ '(నన్నయ) తద్రచనయకారణ్యపర్వమును పూరించి, రాజరాజనరేంద్రుని కంకిత మిచ్చెననియు,

అరణ్యపర్వము సమగ్రముగా నుండుటచేతనే తిక్కనయు, మారనయు భారతమున మూఁడు పర్వములను నన్నయభట్టు రచించెనని చెప్పియున్నా రనియు నిటీవలఁ గొందఱు తలంచుచున్నారు. రెడ్డిరాజుల యాశ్రయము లభింపక పూర్వమే భారతారణ్యపర్వము పూరింపఁబడుటచే, దాని నెఱిఁగియే తిక్కన మూఁడు పర్వములు నన్నయ కృతములని చెప్పుటయు, తాను విరాటపర్వమునుండి తెలిఁగింపఁ బ్రారంభించుటయుఁ గుదురదు. ఎంత ప్రయత్నించినను, తిక్కన గతించిన నాఁటి కెఱ్ఱాప్రెగడ జన్మిఁచెనని చెప్పుటకును ప్రబల ప్రమాణములు లభించుట కష్టము ]

ఈ కవి రచించిన భారతపద్యము లీ వఱకే యుదాహరింపఁబడి యున్నందున, తక్కిన పుస్తకములకై లికూడఁ దెలియుటకయి వానినుండి కూడ రెండేసి పద్యముల నుదాహరించుచున్నాను

ఏఱ్ఱాప్రెగడ రామాయణము

మ. చెఱుకుందోటలఁ బెంచి శాలిమయసుక్షేత్రస్థలు ల్నించి య
క్కఱ లేకుండగఁ బాగనాగ లతికాకాంతారము ల్ప్రోచి యే
డ్తెఱ నంతం గుముదోత్పలాళి వనవాటీకోటిఁ బాటించి పై
న్జెఱువు ల్వ్రాల్చెఁ బురంబునల్దెసలఁ బ్రస్ఫీతాంబుపూర్ణస్థితిన్.

ఉ. కోఱలు నుగ్గు నుగ్గయిన క్రూరఫణీంద్రుగతిం దరంగముల్
మాఱిన భూరివారిధిక్రమంబున రాహుకరాళవక్త్రమున్
దూఱిన తీవ్రభాను క్రియ దుర్బలసైన్యతఁ బుత్రహీనతన్
గీఱి పరాభవాధిగతిఁ గీడ్పడి భూపతి నెమ్మనంబునన్.

హరివంశము

ఉ. ఏ నిటు ప్రాణరక్షకయి యెంతియుఁ బాపము చేసి గర్వపం
కానవిఘాతిన్నై విను నుదంచితశోకపయోధి మునిఁగితిం

బూనిన మత్కృతం బఖిలమున్ వృథ యయ్యె విధాతచెయ్వి లె
వ్వానికి మాన్పఁగా నకట ! వచ్చునె మానుషతుచ్ఛయత్నతన్.

పూర్వ. ఆ. ౫

శా. పాపాత్ముం డగు దైత్యుచేఁ బడిన మీపాటంతయుం జెప్పఁగాఁ
గోపం బుత్కటమై మనంబునను సంక్షోభంబు ప్రాపించె మ
ద్రూపం బొండొకభంగి మీకు నిటులై తోఁచెన్ భవన్మంజులా
లాపంబుల్ ప్రకృతిస్థుఁ జేసె నను నుల్లాసంబుతోఁ గ్రమ్మఱన్.

ఉ. ఆ. ౪

నృసింహపురాణము

చ. సురుచిరపానపాత్రమున సుందరి యొక్క తె కేల నిండు చం
దురుఁడు ప్రకంపితాంగకముతోఁ దిలకించెఁ దదాననాంబుజ
స్ఫురితవికాసవైభవము సొంపు లడంకువ ముచ్చలింపఁ జె
చ్చెరఁ జనుదెంచి పట్టువడి చేడ్పడి భీతి వడంకుచాడ్పునన్.

చ. ఇదె చనుదెంచెఁ జైత్రుఁడని యెల్లవనంబులకుం బ్రమోదముల్
పొదలఁగ మేలివార్తఁ గొని బోరన వచ్చిన దాడికాఁడనన్
మృదువన దేవతాముఖసమీర మెదుర్కొన నుల్లసిల్లె నిం
పొదవఁగ దక్షిణానిల మనూనమనోహరఖేలనంబునన్.

ఈ నృసింహపురాణముమాత్రము నరాంకితము చేయక యెఱ్ఱాప్రెగడ యహోబలస్వామి కంకితముచేసి యున్నాఁడు. ఈ క్రింది దా పురాణము లోని మొదటి పద్యము—

ఉ. 'శ్రీకి నిరంతరంబు కడుఁ జెన్నెసలారెడు రాగలీల ను
త్సేకముఁ బొంది యొప్పు తనచిత్తము చూపెడుమాడ్కి నిత్యర
మ్యాకృతి యైన కౌస్తుభము నక్కునఁ బయింబచరించు నుత్తమ
శ్లోకుఁ డహోబలేశుఁ డతిలోకుఁడు లోకముఁ గాచుఁగావుతన్.

భారతమును తెనిగించిన కవుల విట్లు వరుసగాఁ జెప్పుటచేత నన్నయ భట్టారకునికిని, ఎఱ్ఱాప్రెగడకును మధ్యకాలమునందు తెలుఁగు కవులెవ్వరును లే రని భ్రమింపఁగూడదు. అథర్వణాచార్యుఁడు, భీమకవి, రంగనాథుఁడు, భాస్కరుఁడు, కేతన, మారన, పెద్దన మొదలయినవారి మధ్యకాలములో ననేకు లున్నారు.* వారిని గుఱించి కూడ సంగ్రహముగా నిఁకమీఁద వ్రాయుచున్నాము.

---

ఎఱ్ఱాప్రెగడ తన నృసింహపురాణమునందు సహితము నన్నయతిక్కనలనే పూర్వకవులనుగాఁ జెప్పియున్నాఁడు—

ఉ. భాసురభారతార్థములభంగుల నిక్క మెఱుంగ నేరమిన్
గాసటబీసటే చదివి గాథలఁ ద్రవ్వు తెనుంగువారికిన్
వ్యాసముని ప్రణీతపరమార్థము తెల్లఁగఁ జేసినట్టి యా
జ్ఞాసనకల్పులం దలఁతు నాద్యుల నన్నయతిక్క నార్యులన్. (పీఠిక - 9)

* (వీరి పౌర్వాపర్యముం గూర్చి యాయా సందర్భములందు వివరింపఁబడును.)

# పావులూరి - మల్లన

ఇతఁడు తెనుఁగున గణితశాస్త్రమును రచించిన మహాకవి. ఇతఁడు నియోగి బ్రాహ్మణుఁడు; శివ్వన్నపుత్రుఁడు; ఆపస్తంబసూత్రుఁడు; గార్గ్యగోత్రుఁడు గోదావరిమండలములోని పావులూరి * గ్రామమునకు కరణము. గద్యములోని "పావులూరి మల్లనామాత్య విరచితంబైన దశగణితశాస్త్రంబునందు" అన్న వాక్య మితఁడు నియోగి యని తెలుపుచున్నది. తక్కిన యంశము లనేకము లీ తనిగణితములో నీ పద్యమునఁ జెప్పఁబడినవి.

క. 'ఇలఁ గమ్మనాఁటిలోపల
విలసిల్లిన పావులూరివిభుఁడను సూత్రా
కలితాపస్తంబద్విజ
కులతిలకుఁడ వినుతగార్గ్యగోత్రోద్భవుఁడన్.'

ఈ పావులూరి గణితము మహావీరాచార్యులవారి సంస్కృతగణితసార సంగ్రహమునకు భాషాంతరీకరణము. ఇందలి పద్ధతులు మాత్రమే పయి గ్రంథమునుండి తెలిఁగింపఁబడినవి గాని లెక్క లన్నియు మల్లనార్యునిచేత స్వతంత్రముగాఁ గల్పింపఁబడినవే! ఈ పావులూరి గణితము గాక ప్రతాప రుద్రుని కాలములో రచియింపఁబడిన సూత్రగణిత మొకటియు, అచ్యుత దేవరాయని కాలములో వల్లభామాత్యకవిచేఁ దెలిఁగింపఁబడిన లీలావతి గణితమును, వేంకటేశగణితమును. ఎలుగంటి పెద్దనార్యుని ప్రకీర్ణగణితమును, తెలుఁగునందుఁ గలవు.

పావులూరి మల్లన తన గ్రంథమునఁ బూర్వకవుల నెవ్వరిని స్తుతించియుండ లేదు. ఈ కవి నన్నయభట్టుతోడి సమకాలికుఁ డయినటుల కనఁబడు

[* ఇది గోదావరి మండలములోనిది కాదు; కమ్మనాఁటిలోనిది కాన, గుంటూరు జిల్లా బాపట్ల తాలూకాలోనిది. (చూ. ఆంధ్రకవితరంగిణి పు. 204)]

చున్నాఁడు. ఈ కవి తనకు రాజనరేంద్రుఁడు పిఠాపుర సమీపమున నున్న నవఖండవాడ యను గ్రామము నిచ్చినట్లుగా నీక్రింది పద్యములయందుఁ జెప్పుకొన్నాఁడు

ఉ. శ్రీనిలయుండు శివ్వనను జిమ్మనను న్మతి సూర్యదేవునిన్
ధీనిధిఁ బోలయార్యుని దేజమునం బ్రతితుల్యులైన యా
సూనుల నల్వురం బడసె సూరిజనస్తుతసత్యభారతీ
జ్ఞానులఁ బద్మగర్భువదనంబులు నాలుగుఁ బోల వారిలోన్.

ఉ. శ్రీలలనేశుఁ డాంధ్రనృపశేఖరుఁడై చను రాజరాజభూ
పాలకుచేతఁ బీఠపురిపార్శ్వమునన్ నవఖండవాడ యన్
ప్రోలు విభూతితోఁ బడసి భూరిజనస్తుతుఁడైన సత్కళా
శీలుఁడ రాజపూజితుఁడ శివ్వనపుత్రుఁడ మల్లనాఖ్యుఁడన్.

ఇందలి మొదటి పద్యము నన్నపకవి తద్భవవ్యాజవిభ్రమమున కుదాహరణముగాఁ గైకొని యున్నాఁడు. దీనినిబట్టియే యితఁడు లాక్షణికకవి యని వేఱుగఁ జెప్ప నక్కఱలేకయే తెలిసికోవచ్చును. రాజనరేంద్రునికాలములోనే నన్నయభట్టు గాక యిట్టి కవిత్వమును జెప్పఁగల కవు లితరులుండుటచేత నాంధ్రకవిత్వమునకు నన్నయభట్టారకుఁడు మొదటివాఁడు కాఁడనియు, అతనికాలమునందును నంతకుఁ బూర్వమునందును తెనుఁగుకవులుండిరనియు, వా రట్టి కవిత్వమును జెప్పుటకుఁ గావలసిన లక్షణగ్రంథములా వఱకే యుండిన వనియు, స్పష్టమగుచున్నది. ఆ కాలమునందును, దత్పూర్వమునందును నుండిన తెనుఁగుకవులలోఁ దమ గ్రంథములందు మొట్టమొదట దేవతాస్తుతి నొక్క సంస్కృతశ్లోకములోఁ జేసి తరువాత దెనుఁగు పద్యముల నారంభించుట యాచారముగా నున్నట్లు కనఁబడుచున్నది. ఆ కాలమున గ్రంథములోఁ గవిస్తుతిని జేయుట లేదు; కృతిపతినిగూర్చి షష్ఠ్యంతపద్యములను జెప్పుట లేదు. ఈ యాచారము తిక్కనకాలమువఱకును వచ్చినది. తిక్కన తన నిర్వచనోత్తరరామాయణములోఁ బూర్వుల పద్ధతినే

యననుసరించినను, భారతమున నూతనమార్గమును ద్రొక్కి గ్రంథాదిని తెలుఁగు పద్యముచే వేసి కవిస్తుతియు స్వప్నగాథయు, షష్ఠ్యంతపద్యములును జేర్చి నాఁడు. గతానుగతికులయి కవులందఱును బిమ్మటఁ దిక్కనచూపిన త్రోవనే నడుచుచున్నారు పావులూరిగణితమునందు మొదట నీ క్రింది శ్లోకమును, పద్యములును నున్నవి.

శ్లో॥ శ్రీకంఠం సగుణం సమస్తజగతాం కర్తార మీశం గురుమ్
భూతోయానలచంద్రసూర్యపవనవ్యోమాత్మమూర్తిం విభుమ్
నిత్యానందమయో పయో గిరిజయా సార్ధం ప్రజావృద్ధయే
మాయాయోగ ముపైతి తం శివకరం వందే శివం శ్రేయసే.

క ప్రణమిల్లి శివుని కీర్తియ
నణిమాదిగుణాస్పదునకు నభినవస ఖ్యా
మణిదీప్తిసారసంగ్రహ
గణితసముద్రంబుఁ దఱియఁ గడఁగితిఁ బ్రీతిన్.

శా. అర్కాదిగ్రహపంచకగ్రహణకాలాన్వేషణోపాయమున్
దర్కవ్యాకరణాగమాదిబహుశాస్త్రప్రోక్తనానార్థసం
పర్కాదివ్యవహారమున్ భువనరూపద్వీపవిస్తారమున్
దర్కింపన్ గణితప్రవృత్తి వెలిగాఁ దార్కొం డెఱింగించునే ?

క. కావున గణితముఁ దెనుఁగున
గావింపఁగఁ గణఁగితి సుకవిమల్లుఁడ గౌ
రీవల్లభచరణసరో
జావాసితచిత్తమధుకరాత్ముఁడ జగతిన్.

ఈ ప్రకారముగా మొదట శ్లోకముతోఁ జేయఁబడిన పూర్వగ్రంథము లిప్పటికి నన్నయకృతభారతమును, భాస్కరరామాయణమును, నిర్వచనోత్తరరామాయణమును, ఈ పావులూరిగణితమును గనఁబడుచున్నవి. ఈ పుస్తకమునుండి శైలిని జూపుట కొక పద్యము నుదాహరించుట దక్క కవినిగూర్చి వ్రాయఁదగిన దేదియుఁ గనుపట్టదు.

చ. చెలికి షడంశమున్ బ్రియకు శేషములోపలఁ బంచమాంశమున్
బొలుపుగ దానిశేషమున బోదకు నాలవపాలు నిచ్చి యం
దులఁ దన పాలు దాఁ గొనియెఁ దొమ్మిదిజేనలు రాజహంస మీ
నలినమృణాల మెంత సుజనస్తుత! మా కెఱుఁగంగఁజెప్పుమా.

నే నీ కవిచరిత్రమును వ్రాసి ప్రచురించిన తరువాత కొందఱు రాజరాజ నరేంద్రుఁడు నవఖండవాడ యిచ్చినది గణితము చేసిన మల్లనకుఁ గాదనియు నాతని తాత యైన మల్లన కనియు వార్తాపత్రికలలో వ్రాసి యున్నారు అందుచే నే నీ సంవత్సరమునందు బెంగుళూరికిఁ బోవునపు డొక దినము చెన్నపురిలో నిలిచి ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారమునకును. నాంధ్రసాహిత్య పరిషత్పుస్తకభాండాగారమునకు బోయి యం దున్న పావులూరిగణితములను జదివితిని ఆంధ్రసాహిత్య పరిషత్పుస్తకభాండాగారములోని ప్రతులలో నొకదానియందు

ఉ. 'శ్రీలలనేశుఁ డాంధ్రనృపశేఖరుఁ డై చనురాజరాజభూ
పాలకుచేతఁ బీఠపురపార్శ్వమున న్నవఖండవాడ యన్
బ్రోలు విభూతితోఁ బడసె భూరిజనస్తుతుఁ డై నసత్కళా
శీలుఁడు రాజపూజితుఁడు శివ్వనపుత్రుఁడు మల్లఁ డున్నతిన్.

క. గోత్రపవిత్రుఁడు సద్గుణ
పాత్రుం డగు శివ్వనకును బతిహితశుభచా
రిత్రారుంధతి గౌరమ
ధాత్రీసతి కిరువురకును దనయుండ జగతిన్.'

అనియు, నింకొకప్రతియందు

ఉ 'శ్రీలలనేశుఁ డాంధ్రనృపశేఖరుఁడై ... . ........ .........
.. . . . సివ్వనపుత్రుఁడు మల్లఁ డున్నతిన్.

ఉ. శ్రీనిలయుండు సివ్వనయుఁ జిమ్మనయుం గుణసూర్యదేవుఁడుఁ
ధీనిధి ప్రోలనార్యుఁడును దేజమునఁ రవితుల్యులైన యీ
సూనుల నల్వురం బడసె సూరిజనస్తుతులైన సత్యవి
జ్ఞానులు పద్మగర్భువదనంబులు నాలుగుఁబోలువారిలోఁ,

క. గోత్రపవిత్రుఁడు సద్గుణ
పాత్రుఁడు సిద్ధనకు మిగులఁ బతిహితశుభచా
రిత్రాయంధతిగౌరమ
ధాత్రీసతి యిద్దఱికిని దనయుఁడ జగతిన్.'

అనియు నున్నది. ఇందు మొదటి ప్రతిలోని పాఠమునుబట్టి రాజనరేంద్రు నిచే నగ్రహారమును బడసినవాఁడు గణితశాస్త్రకర్త యైన పావులూరి మల్లనయే యని స్పష్టముగాఁ గానవచ్చుచున్నది. రెండవ ప్రతిలోని పాఠమును బట్టి గణితశాస్త్రకర్త యైన మల్లనతాత యగ్రహారమును బడిసినట్టు కనబఁడుచున్నది ఈ రెండు పాఠములలో మొదటిపాఠమే సరియైనదని నా యభిప్రాయము గణితశాస్త్రవేత్తయు లాక్షణికకవియు నైన మల్లనకే రాజరాజనరేంద్రుఁ డగ్రహారము నిచ్చి యుండును గాని ప్రసిద్ధుండు గాని మల్లన కూరక యిచ్చి యుండఁడు. ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారములో నున్న ప్రతులలోని పాఠము రెండవప్రతిలో నున్నట్లే యున్నది. ఎక్కువ ప్రతులలో ని ట్లుండుటచేత గణితమును రచియించినకవి యగ్రహారమును సంపాదించిన మల్లనమనుమఁడే యనుకొన్నను, అగ్రహారమిచ్చినది ౧౦౩౦ వ సంవత్సరప్రాంత మయినపక్షమున నటుతరువాత ముప్పది నలువది సంవత్సరములు కడఁగా ౧౦౬౦-౭౦ సంవత్సర ప్రాంతములయందు గణితశాస్త్రకర్త యాయిన పావులూరి మల్లన యుండి యుండును. *

[* 'శివ్వనపుత్రుఁడు మల్లఁడున్నతిన్' అను పాఠమే సరియైనదనియు, రాజరాజు వలన నఖండవాడఁ బడసినది గణితశాస్త్రకర్త కాక, యతని తాతయే యనియు, మనుమఁడగు మల్లన క్రీ. శ 1100 ప్రాంతము వాఁడనియు విమర్శకుల యాశయము మతియుఁ బద్యమునఁ జేర్కొనఁ బడిన రాజరాజు, రాజనరేంద్రుఁడని చెప్పుటకుఁ దగిన యాధారములు లేవనియు, అఖండవాడ వెలనాంటి చోడరాజగు పృథ్వీశ్వరుచే కుంభమాధవస్వామి కర్పింపఁబడినట్లు క్రీ. శ 1186 లోని శాసనము వలనఁ దెలియవచ్చుచున్నదనియు, మీఁది పద్యము సరిగా నుండలేదనియు, 'తెనుఁగు కవుల చరిత్ర'లోఁ దెలుపఁబడియున్నది. (పుట. 282) మల్లన, నన్నయ కించుమించుగఁ జేఁబదియేండ్ల తర్వాతి వాఁడని శ్రీ తిమ్మావజ్ఝల కోదండరామయ్యగారనుచున్నారు ఈ 'పావులూరి-మల్లనకవి'యుఁ దిక్కనకు ముందురావలసిన వాఁడు.]

ఈ పావులూరిమల్లన భద్రాద్రిరామశతకమును కూడ రచియించి నట్లు చెప్పుదురు గాని తండ్రులు వే ఱగుటచేత భద్రాదిరామశతకమును రచి యించిన పావులూరిమల్లన వే ఱొకఁ డని తోఁచుచున్నది. ఈ మల్లనతండ్రి పేరు సివ్వన్న; రెండవ పావులూరిమల్లన తండ్రి పేరు రామన్న యని శత కములోని యీ క్రింది పద్యమునం దున్నది.

క. శ్రీమహితపావులూరిసు
ధాముఁడ రామన్నమంత్రి తనయుఁడఁ గవిసు
త్రాముఁడ మల్లనసచివుఁడ
శ్రీమద్భద్రాద్రి ధామ శ్రీరఘురామా!

# నన్నెచోడకవి

* నన్నెచోడదేవుఁ డనెడి యీ కవి తెలుఁగున కుమారసంభవ మనెడు పండ్రెండాశ్వాసముల కావ్యమును రచియించెను. ఈ గ్రంథములోని మొదటి యేడాశ్వాసములను ౧౯౦౯-వ సంవత్సరమునందు బ్రహ్మశ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు మొదటిభాగము గాఁ బ్రకటించి యాంధ్ర ప్రపంచమునకు మహోపకారము చేసిరి. వా రా పుస్తకముయొక్క పీఠికలో నీ కవి కవిత్వప్రౌఢిమనుబట్టి కవిరాజ శిఖామణియనియు, దిగ్విజయమును బట్టి టేంకణాదిత్యుఁ డనియు, బిరుదములు గలవాఁ డయ్యెననియు, కావేరీ తీరమున నొరయూ రను పట్టణము రాజధానిగా గోదావరీ, సింహళమధ్య దేశము నేలె ననియు. క్రీ. శ. ౯౪౦ లోఁ బాశ్చాత్యచాళుక్యులతో యుద్ధము చేసి రణరంగమున నిహతుఁ డయ్యెననియు, వ్రాసిరి. ఈ కవి కవిరాజ శిఖామణి యన్నపేరును తానే పెట్టుకొనెను. గ్రంథాదియందే యవతారికలో నున్న యీ పద్యమును జూడుఁడు.

చ. "రవికులశేఖరుండు కవిరాజశిఖామణి కావ్యకర్త స
త్కవి భువి నన్నెచోడుఁడఁటె! కావ్యము దివ్యకథం గుమారసం
భవమఁటె! సత్కథాధిపతి భవ్యుఁడు జంగమమల్లికార్జునుం
డవిచలితార్థయోగధరుఁడట్టె! వినం గొనియాడఁ జాలదే?"

[ఆ-౧-౨౪]

ఇతఁ డాత్మస్తుతియందు కొంచె మిష్టము గలవాఁడు. సూర్యవంశపురాజు లైన భగీరథుఁడు, రాఘవుఁడు మొదలయిన పూర్వులతోఁ దాను సమానుఁడ

* కాలమునుబట్టి నన్నెచోడకవి తిక్కనాదులకంటె ముందు రావలసినవాఁడు. కాని శ్రీ వీరేశలింగము పంతులుగారు తొలుతఁ గవిత్రయము యొక్కయుఁ, బిదప ౧౧-వ శతాబ్దివాఁడని తాము భావించిన పావులూరి మల్లనయొక్కయు చరిత్రము లను వివరించిన పిదపనే నన్నెచోడునిగూర్చి వ్రాయఁబ్రారంభించిరి. క్రమముతప్పక భారతకవుల చరిత్రమును దెల్పఁదలఁచియే ఆయన తిక్కన, యెఱ్ఱనల చరిత్రములను ముందుగాఁ జెప్పియుండవచ్చును.

నని యీకవి తన కుమారసంభవములో నీక్రిందిపద్యమునఁ జెప్పుకొని యున్నాఁడు—

సీ. కుతలంబు నడుకొనఁ గొలకొండగా నిల్పి
　　శరనిధి గ్రొచ్చిరి సగరసుతులు
మిన్నులపైఁ బాఱుచున్నయే టిలఁ దెచ్చి
　　వారాశి నించె భగీరథుండు
గోత్రాచలము లెత్తికొని వచ్చి కడచన్న
　　రత్నాకరముఁగట్టె రాఘవుండు
జలధి మహీపతిమొలనూలుగాఁ జుట్టి
　　పాలించెఁ గరిఁగరికాలచోడు

గీ వరుస నిట్లు సూర్యవంశాధిపతు లంబు
నిధియ మేర గాఁగ నిఖిలజగము
నేలి చనినవారి కెనవచ్చు సుశ్లాఘ
ధనుఁడ, నన్నెచోడ జనవిభుండ.　　[ఆశ్వా. ౧-౫౨]

దీనిక్రిందిపద్యములోనే తన తండ్రియైన చోడబల్లి పాకనాటి యం * దిరువది యొక్కవేయిటి కధీశుఁ డని కవియే చెప్పి యుండుటచేత నాతనికొడుకయిన నన్నెచోడుఁడును పాకనాటిలోఁ గొంతభాగమునకు ప్రభు వగుట స్పష్టము.

చ. 'అరినరపాలమౌళిదళితాంఘ్రియుగుం డయి పాకనాటియం
దిరువదియొక్కవేయిటి కధీశుఁడు నాఁ జను చోడబల్లికిం
జిరతరకీర్తి కగ్రమహిషీతిలకం బన హైహయాన్వయాం
బరశశిరేఖ యైన గుణభాసిని శ్రీసతికిం దనూజుఁడన్.'

[ఆ ౧-౫౩]

ఈ పద్యముతరువాత నున్న యీక్రింద పద్యములోనే కవి తా నోరయూరి పురాధిపుఁ డన్నకథను జెప్పుకొని యున్నాఁడు.

[ * ఇయ్యది జనసంఖ్యకాని, గ్రామసంఖ్య కాదని 'ఆంధ్రకవితరంగిణి' పుట 160) ]

క. 'కలుపొన్న విరులు పెరుగం
గలుకోడిరవంటు దిశలఁ గలయఁగఁ జెలఁగన్
బొలుచు నొరయూరి కధిపతి
నలఘుపరాక్రముఁడఁ దెంకణాదిత్యుండన్.' [అ ౧-౩౪]

ఈ పద్యము మొదటినుండియు నద్భుతకల్పనముగాఁ గనఁబడుచున్నది. ఆ యూరిలో రాతిపొన్న చెట్లు పువ్వులతోఁ బెరుగుచున్నవఁట! రాతికోళ్ళు దిశలు మాఱుమ్రోయునట్లుగా కూయుచుండునఁట! ఆహా! ఏమి యా యూరి మాహాత్మ్యము!

పూర్వము చోళరాజు లెవ్వరో కావేరీతీరమున తిరుచునాపల్లికి సమీపమునం దున్న యొరయూరు రాజధానిగా రాజ్యపాలనము చేసినందునఁ దరువాతి చోళరాజశాఖలలోనివా రందఱు నొరయూరిపురాధీశ్వరుల మని చెప్పుకొనుట యాచార మయి యున్నది. ఈ యాచారము ననుసరించియే నన్నెచోడుఁడును నొరయూరి కధిపతి నని చెప్పుకొనెను. రాజ్యపరిమితినిగూర్చి పుస్తకములో నింతవఱకు కాధారము లున్నవి అంతకంటె నెక్కువగాఁ జెప్పినచో దానికి బలవత్ప్రమాణము లున్నఁ గాని విశ్వాసార్హము కాదు. ఈ కవి గోదావరిసింహాళమధ్య దేశము నేలె ననువారు తమ వాక్యమున కాధారములైన ప్రమాణములను జూపి ఋజువుచేయవలెను. మన కిప్పటికిఁ దెలిసినంతవఱకు కా కథనము నిరాధార మయి యవిశ్వసనీయ మైనదిగాఁ గనుపట్టుచున్నది. ఈతని దిగ్విజయములును గోదావరీసింహాళ మధ్యదేశ పాలనమువంటివే. ఇఁక నీ కవియొక్క కాలనిర్ణయము చేయవలసి యున్నది. ఈ కాలనిర్ణయమునకు సాధారణముగా పుస్తకములలో మూఁడు నాలు గాధారములుండును. అం దొకటి కవివంశానువర్ణనము. అది యీ పుస్తకమునందు లేదు. కవి చోడబల్లి యని తనతండ్రి నొక్కనిని జెప్పుటయే కాని తత్పూర్వుల నెవరినిఁ బేర్కొనలేదు. చోళులచరిత్రమునందు చోడబల్లు లెందఱో కనఁబడుచున్నారు. వారిలో నీతని తండ్రి యెవ్వరో యీ పుస్తకమువలనఁ దెలియదు. రెండవది కృతిపతివంశవర్ణనము. అదియు

నీ పుస్తకమునందు లేదు. జంగమమల్లికార్జునుని నొక్కనిని మాత్రమే కృతిపతినిగాఁ జెప్పెను గాని కవి తత్పూర్వుల నెవ్వరిని వర్ణించి యుండ లేదు. బల్లిచోడులవలెనే మల్లికార్జునులును ననేకు లున్నారు. వారిలో కృతిపతి యే మల్లికార్జునుఁడో చెప్పుట సులభసాధ్యము కాదు. గ్రంథ సంపాదకు లైన రామకృష్ణకవిగారు తమ పీఠికలో ముగ్గురు జంగమమల్లి కార్జునులను పేర్కొని వారిలో భృంగిరిటియవతార మగు పండితారాధ్య మల్లికార్జునుఁడు కాఁ డనియు, శైవాచారగురుపరంపరలో వానప్రస్థాశ్రమ వర్తి యగు యోగిమల్లికార్జునుఁడు కాఁ డనియు, మొదటి యిద్దఱిని నిరాకరించి మూఁడవవా డయిన కాలాముఖమల్లికార్జునుఁడు కావచ్చునని యంగీకరించిరి. మూఁడవది పూర్వకవిప్రశంస ఈ పుస్తకమునందదియుఁ గానఁబడదు. కవి వాల్మీకి, వ్యాసుఁడు, కాళిదాసుఁడు, భారవి, భాణుఁడు మొదలయిన సంస్కృతకవులను కొందఱిని ప్రశంసించి తెలుఁగుకవులను విడిచిపెట్టెను. అయినను సంస్కృతకవులను బేర్కొన్నతరువాత

క. మును మార్గకవిత లోకం
బున వెలయంగ దేశికవితఁ బుట్టించి తెనుం
గు నిలిపి రంధ్రవిషయ*ము న
జనసత్యాశ్రయుని తొట్టిచాళుక్యనృపుల్.　　　　[ఆ ౧-౨౩]

అను పద్యమును, దానితరువాత

చ. సురవరులం గ్రమంబున వచోమణిసంహతిఁ బూజచేసి మ
ద్గురుచరణారవిందములకుం దగ సమ్మతిఁజేసి కొల్చి వి
స్తరమతులం బురాణకవిసంఘము నుత్తమమార్గ ఎత్కవీ
శ్వరులను దేశిసత్కవుల సంస్తుతిఁ జేసి ప నోముదంబునన్.
　　　　[ఆ ౧-౨౪]

[ * యం, బునఁ జనఁజాళుక్యరాజా మొదలుగాఁ బలువుర్. అనునది సరియైన పాఠము ]

అను పద్యమును పుస్తకములోఁ గానఁబడుచున్నవి. ఈ పద్యములోఁ గవి చెప్పిన దేవతాస్తుతియు, గురువందనమును, పురాణకవిప్రశంసయు, సంస్కృతసత్కవీశ్వరస్తోత్రమును పుస్తకములోఁ గానఁబడుచున్నవి కాని దేశిసత్కవుల సంస్తుతిమాత్రము కనఁబడకున్నది దేశిసత్కవులను స్తుతింపనిది స్తుతించితి నని కవి యబద్ధమువ్రాసి యుండఁడు. అందుచేత "మును మార్గకవిత" యను పద్యమునకును "సురవరులన్" అను పద్యము నకును నడుమను తెలుఁగుకవులను స్తుతించిన పద్య మొకటి యుండి యుండవలెను మాతృకను జూచి పుత్రికను వ్రాసిన లేఖకుని ప్రమాదము వలననో, మాతృకను లిఖించినవాని లోపమువలననో యా పద్యము విడిచి పెట్టఁడి యుండును.* ఆ పద్యమే యుండియుండిన యెడలఁ గవికాలము కొంతవఱకుఁ దెలిసి యుండును. ఈ కుమార సంభవమునందే దశమా శ్వాసమున పుత్రోత్సవసందర్భమున బృహస్పతి శివుని స్తుతించి చెప్పిన దారిద్ర్యవిద్రావణపద్యదశకములోని మొదటిదైన యీ పద్యమునందు రామేశ్వరకవి యొకఁడు పేర్కొనఁబడి యున్నాఁడు

శా. శ్రీరామేశకవీశ్వరాదు లెద నీశ్రీపాదము ల్భక్తితో
నారాధించి సమస్తలోకసముదాయాధీశులై రన్నసం
సారుల్ దుఃఖనివారణార్థ మభవున్ సర్వేశు లోకత్రయా
ధారున్ నిన్ మదిఁ గొల్వకున్కి యుఱవే దారిద్ర్యవిద్రావణా!'

[ఆ ౧౦ - ౬౦]

ఈ రామేశకవీశ్వరుఁడు కవికాలమునాఁటికె ప్రసిద్ధుఁ డయి యుండిన శివభక్తుఁడైన యాంధ్రకవి యయి యుండును. పయి పద్యములోఁ బ్రథమపాదమున 'కవీశ్వరాదు లెద' యనుచోటు "కవీశ్వరాదు లెద్ద",

[* పయి రెండు పద్యములకును నడుమ దేశిసత్కవుల స్తుతి రూపమగు పద్య మండవలెనని భావింపనక్కఱలేదనియు, 'మునుమార్గకవిత' అను పద్యమున నే దేశ సత్కవులునుతింపఁబడినట్లు భావింపవచ్చుననియు, ఇంతకును లభింపని పద్యమును గూర్చి యాలోచించినఁ బ్రయోజనము లేదనియు, అట్టి పద్య మొక్కటి యుండి తీరవలయునని నిశ్చయముగాఁ జెప్పుటకును తగిన యాధారములు లేవనియు 'ఆంధ్ర కవి తరంగిణి' యందుఁగలదు. [చూ. పుట. 165.]

యని వేసి సంపాదకులు డకారమును దేలఁ బలుకవలయు నని పుట యడుగున నొక టిప్పణము వ్రాసిరి గణభంగము కలుగకుండ సాధారణ మైన 'యెద' యనురూపమును వేయక గ్రంథము పురాతన మైన దని చూపుటకుఁ దక్క నసాధారణమైన 'యెడ్డ'యనురూపమును వేసి యెడ్డలోని యెకారము లఘు వగు నని చూపుట కేల ప్రయాసపడ వలెను. [రామేశ్వర కవిని గూర్చి 'కవితరంగిణి' లో నిట్లు వ్రాయబడినది

[' రామేశ్వరకవి కవికాలము నాఁటికిఁ బ్రసిద్ధుఁడై యుండిన యాంధ్ర కవియై యుండును' అని శ్రీ వీరేశలింగము పంతులుగారు వ్రాసియున్నారు. ఇతఁడాంధ్రకవి యనుట కాధారములు లేవు. ఏ భాషాకవియో చెప్పఁజాలము. కుమార సంభవకావ్యమునకు విమర్శనము వ్రాసిన శ్రీపాద లక్ష్మీపతి శాస్త్రులుగారీపద్యమున రామేశ్వరకవి ప్రశంసయే లేదని యభిప్రాయపడి యున్నారు శ్రీ మల్లూరు వేంకటరామయ్యగారు భారతి (వృష-శ్రావణము) లో కాకతీయ - రెండవ బేతరాజునకును, నాతని కుమారుఁడును, దారిద్ర్యవిద్రావణ బిరుదాంచితుఁడునైన త్రిభువనమల్ల దుర్గరాజునకును గురువై, వారిచే నగ్రహారములను గైకొని, కాలాముఖశైవ పరంపరకు సంబంధించిన శ్రీశైల మల్లికార్జున మఠాచార్యుఁడుగ నుండిన రామేశ్వర పండితుఁడే పై పద్యములోఁ జెప్పిన రామేశ కవియై యుండుననియు, నన్నెచోడకవి దారిద్ర్యవిద్రావణ మకుటముతో రచించిన దశకమునకును, త్రిభువనమల్లుని దారిద్ర్య విద్రావణ బిరుదమునకును నేదియో సంబంధ ముండి యుండుననియు వ్రాసియున్నారు. రెండవ బేతరాజువలన రామేశ్వరపండితుఁడు దానమును బరిగ్రహించిన కాలము చాళుక్య విక్రమ శకము ౨౩. [శా శ ౧౦౨౨ క్రీ శ. ౧౦౧౭-౧౦౯౮.] ఈ రామే శ్వరపండితుఁడు పండితుఁడే కాని కవియైనట్లాధారములు లేవు. పై పద్య ములో నీ రామేశ్వరుఁడే చెప్పఁబడెననుటకును నాధారములు కనఁబడవు. [పు 175 ]

''మును మార్గకవిత'' యను పద్యములో మార్గకవిత యనఁగా సంస్కృత కవిత్వమనియు దేశికవిత యనఁగా దేశభాషాకవిత్వ మనియు అర్థము *

సంగీతరత్నాకరములోని యీ క్రింది శ్లోకము లీయర్థమును స్పష్టపఱుచు చున్నవి—

శ్లో॥ గీతం వాద్యం తథా నృత్తంత్రయం సంగీత ముచ్యతే
మార్గో దేశీతి తద్ద్వేధా తత్ర మార్గ స్స ఉచ్యతే.
యో మార్గితో విరించాద్యైః ప్రయుక్తో భరతాదిభిః
దేవస్య పురత శ్శంభోః నియతోభ్యుదయప్రదః
దేశేదేశే జనానాం య ద్రుచ్యా హృదయరంజకం
గీతం చ వాదనం నృత్తం తద్దేశీ త్యభిధీయతే.

౧౯౧౨వ సంవత్సరమునందుఁ బ్రకటింపఁబడిన తమ యాంధ్రుల చరిత్రముయొక్క ద్వితీయభాగములో శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారు నన్నెచోడునిగూర్చి వ్రాయుచు "౯౨౫-౪౦ సంవత్సరప్రాంతమున నున్న యీ సత్యాశ్రయుని నన్నెచోడమహాకవి తన కుమారసంభవకావ్యమున నీ క్రింది పద్యములోఁ బేర్కొని యున్నాఁడు

క. 'మును మార్గకవిత లోకం
బున వెలయఁగ దేశికవితఁ బుట్టించి తెనుం
గు నిలిపి రంధ్రవిషయమున
జనసత్యాశ్రయునిఁ దొట్టి చాళుక్యనృపుల్' [ఆ౧-౨౩]

దీనిం బట్టి నన్నయభట్టారకుని నూ ఱేండ్లకుఁ బూర్వమే యాంధ్ర కవితాసతి వర్ధిల్లుచున్న దని స్పష్ట మగుచున్నది ఈ పై పద్యమునందుఁ జెప్పబడిన సత్యాశ్రయునకుఁ దరువాతనే నన్నెచోడుఁ డున్నవాఁ డని నిస్సంశయముగాఁ జెప్పవచ్చును" అని వ్రాసిరి. ఈ సత్యాశ్రయకథనమువలన

[* శ్రీ వీరేశలింగము పంతులుగా రభిప్రాయ పడినట్లే 'ఆంధ్రకవి తరంగిణి' కారులును మార్గకవిత యనఁగా సంస్కృత కవిత్వమనియు, దేశికవిత యనఁగా నాంధ్రకవిత యనియు నభిప్రాయపడి యున్నారు [చూ పుట 165] కాని యిది సరికాదు ప్రాచీన సంస్కృతి సాహిత్యమార్గము ననుసరించిన లక్షణములు కలది మార్గకవిత; దేశీయ సంప్రదాయములు కలది దేశికవిత.]

నన్నెచోడుఁడు ౧౧౦౦-వ సంవత్సరమునందు రణనిహతుఁ డయ్యె నన్న రామకృష్ణకవిగారి సిద్ధాంతము పూర్వపక్ష మయిపోయినది. అయినను రామకృష్ణకవిగారి కిటీవల లభించిన నన్నెచోడుని కుమారసంభవముయొక్క ప్రత్యంతరములో పాఠభేదము కనఁబడి వారిసిద్ధాంతమును గొంతవఱకు మరల నిలువఁ బెట్టినది. రామకృష్ణకవిగారు ౧౯౧౪ వ సంవత్సరము నందుఁ బ్రకటించిన నన్నెచోడుని కుమారసంభవముయొక్క ద్వితీయ భాగములో నీ పద్యపాఠాంతరమును "రంధ్రవిషయంబునఁ జనఁ జాళుక్య రాజు మొదలుగఁ బలువుర్" అని చూపిరి ఈ పాఠభేదమునుబట్టి పద్య మీ విధముగా మాఱుచున్నది.—

క. 'మును మార్గకవిత లోకం
　బున వెలయంగ దేశికవితఁ బుట్టించి తెనుం
　గున నిలిపి రంధ్రవిషయం
　బునఁ జనఁ జాళుక్యరాజు మొదలుచఁ బలువుర్.'

ఈ పాఠాంతరము సత్యాశ్రయునిబాధను తొలఁగించినను ఆంధ్రపత్రిక యొక్క ౧౯౧౧ వ సంవత్సరపు సంవత్సరాదిసంచికలో బుఱ్ఱా శేషగిరి రావు పంతులుగారు వ్రాసిన యీ క్రిందియంశమును గొంత పోషించు చున్నది.—

"సత్యాశ్రయుని తొట్టి చాళుక్యనృపులు ఆంధ్రవిషయమున తెలుగుఁ దేశకవిత నిలిపి రని కవి వ్రాయుచున్నాఁడు పైనుదాహరించిన శాసన నిదర్శనములప్రకార మిందుఁ జెప్పబడిన సత్యాశ్రయుఁడు భారతమును రచియించుటకు నన్నయను బ్రోత్సాహపఱిచిన రాజరాజనరేంద్రుఁ డని యూహింపఁ దగు. భారతమందు సత్యాశ్రయకులతిలక యని రాజరాజ విషయమున వాడఁబడి యున్నది"

మొదటి పాఠమునుబట్టి సత్యాశ్రయకులతిలకుఁ డైన రాజరాజ నరేంద్రుండు సత్యాశ్రయుండు కాకపోవచ్చునని గాని యీ పాఠమును బట్టి

చాళుక్యరాజు నిర్బాధకముగా రాజరాజనరేంద్రుఁడు కావచ్చును. అట్లయి నచో నన్నెచోడుఁడు నన్నయభట్టునకుఁ దరువాతివాఁ డయి యుండవలెను.

నాలవది కవికాలమును నిశ్చయించుటకై ప్రధానసాధనము కవి గ్రంథము నారంభించిన సంవత్సరమునో, పూర్తిచేసిన సంవత్సరమునో పుస్తకమున వ్రాసికొనుట. ఈ కవి యదియుఁ జేసి యుండలేదు. అందుచేత మనము పుస్తకములోని సాధనసామగ్రి ననుసరించి యితరాధారములచేతనే కవికాల నిర్ణయమును జేయవలసి యున్నది.

బుట్టా శేషగిరిరావుగారు త్రిభువనమల్లచోడదేవుని కొడుకే నన్నెచోడుఁ డని వ్రాయఁగా తమ యాంధ్రులచరిత్రము ద్వితీయభాగముయొక్క యవతారికలో చిలుకూరి వీరభద్రరావుగారు

"శ్రీ బుట్టా శేషగిరిరావు ఎం-ఏ గారు పండ్రెండవ శతాబ్దముమధ్య నున్న త్రిభువనమల్లచోడదేవుని చోడబల్లిగా భావించి యతని జ్యేష్ఠపుత్రుఁడైన నన్నెచోడుఁడే నన్నెచోడకవి యని సిద్ధాంతము చేసినారు; కాని త్రిభువనమల్లుఁడు చోడబల్లి కాఁజాలఁడు. అదియునుగాక త్రిభువనమల్లునికొడుకైన నన్నెచోడునితల్లి మాబలదేవి యని శాసనములం గన్పట్టుచున్నది. కుమారసంభవమునఁ దన తల్లి శ్రీసతి యని నన్నెచోడకవి చెప్పుకొని యున్నాఁడు."

అని వ్రాసిరి. తమ యాంధ్రులచరిత్రమునందు - శాసనమును బల్లయచోడదేవుని కొడుకు కామచోడుఁ డని స్పష్టముగా ఘోషించుచుండఁగా దానికి ప్రత్యక్షవిరోధముగా చోడబల్లికిఁ బెక్కండ్రుగురు భార్యలు గల రనియు, నన్నెచోడుఁడు పెద్దభార్యకొడు కనియు, కామచోడుఁడు మరియొకభార్యయొక్క తనయుఁ డనియు, మనమూహింపవచ్చు నని నిరాధారము లైన యూహలపై నూహలను పన్ని నన్నెచోడుఁడు క్రీ. శ. ౧౧౦౬-వ సంవత్సరములోని శాసనములోఁ బేర్కొనఁబడిన బల్లయచోడదేవమహారాజుకొడు కని సిద్ధాంతము చేయ సాహసింపఁగలిగిన వీరభద్రరావుగారు త్రిభువనమల్లచోడునే బల్లిచోడునిగా భావించి యాతనిపుత్రుఁడైన నన్నె

చోడునే నన్నెచోడకవినిగాఁ జెప్పిన శేషగిరిరావుగారి సిద్ధాంతము నేల నిరాకరింపవలెను ? శ్రీసతి మాబలదేవినామాంతరము కాఁగూడదా ? శాసనములలో నొక్కనినే చోడపల్లి. చోడపల్లి చోడబల్లి, బల్లిచోడుఁడు, బల్లయ చోడుఁడు మొదలైన నామములతో వ్యవహరించుచుండుట మనము చూచుచుండ లేదా ?

డి-48 సంఖ్యగల ౧౧౪౫-౪౬ సంవత్సరపు నెల్లూరిశాసనములో

"స్వస్తి చరణసరోరుహవిహితలోచన త్రిలోచనప్రముఖాఖిల
పృథివీశ్వర కారిత కావేరీతీర కరికాలకులరత్నప్రదీపాహితకుమా
రాంకుశ శ్రీమన్మహామండలేశ్వర బల్లిచోడమహారాజులు"

అని బల్లిచోడుని శాసనములో నున్నది. ఓ-19 సంఖ్యగల ౧౧౫౩-౫౪ వ సంవత్సరపు నెల్లూరిశాసనములో నెనిమిదేండ్లకుఁ దరువాత

"స్వస్తి చరణసరోరుహవిహితవిలోచనత్రిలోచనప్రముఖాఖిల
పృథివీశ్వర కారిత కావేరీతీర కరికాలకులరత్నప్రదీపాహితకుమా
రాంకుశ శ్రీమన్మహామండలేశ్వర త్రిభువనమల్ల దేవచోడమహారాజులు"

అని త్రిభువనమల్లచోడదేవుని శాసనములో నున్నది; డి-4౭ సంఖ్యగల ౧౧౬౬-౬౭ వ సంవత్సరపు నెల్లూరిశాసనములో మఱి పదుమూఁడేండ్లకుఁ దరువాత

"స్వస్తి చరణసరోరుహవిహితవిలోచన త్రిలోచన ప్రముఖాఖిల
పృథివీశ్వర కారితకావేరీతీరకరికాలకులరత్న ప్రదీపాహితకుమా
రాంకుశ శ్రీమన్మహామండలేశ్వరబల్లి చోడమహారాజులు ..."

అని మరల బల్లిచోడుని శాసనములో నున్నది. ౧౧౪౫ వ సంవత్సరములోను, ౧౧౬౬ వ సంవత్సరములోను బల్లిచోఁడుడు రాజ్యము చేయుచుండ గా నడుమను ౧౧౫౩ వసంవత్సరమునందు త్రిభువన మల్లదేవుఁడు మఱియొకఁడు రాజ్యము చేయుట సాధారణముగా సంభవింపదు గావునను, ఒక్క యక్షరమైనను హెచ్చు తగ్గు లేక మూఁడు శాసనములలోను బిరుదావళి యొక్కటిగానే యున్నదిగావునను, ఈ శాసనములలోఁ బేర్కొనఁబడిన

బల్లిచోడుఁడును త్రిభువనమల్లచోడుఁడును ఏకపురుషుఁ డనుకొనుట సము
చితముగాఁ గనఁబడు చున్నది.

మైసూరుచోడశాసనములలో మల్లిదేవచోడుని శిలాశాసనములు రెండు కానఁ
బడుచున్నవి. వానిలో చళ్ళకెరెతాలూకాలోని మహాదేవపురమందలి వీర
భద్రాలయముయొక్క తూర్పుగోడమీఁద నున్నది 43 సంఖ్యగల 1108 వ
సంవత్సరపుది; ఓబలపురసిద్ధరామేశ్వర దేవాలయములో దక్షిణమున శిల
మీఁద నున్నది 21 వ సంఖ్యగల 1147 వ సంవత్సరపుది. ఈరెండుశాసనము
లును ఒక్కరిపేరివే యైనను మొదటిదానియందు 'శ్రీమన్మహామండలేశ్వర
త్రిభువనమల్లమల్లిదేవచోళమహారా' జనియు, రెండదానియందు 'శ్రీమన్మ
హామండలేశ్వర జగదేకమల్ల మల్లిదేవ చోళమహారా' జనియు ఉన్నది.
కారణాంతరములచేత శాసనములో నొక్కరికే వేఱువేఱు పేరు లుండవచ్చు
ననియు, ఈప్రకారముగానే త్రిభువనబల్లిచోడమహారాజును బల్లిచోడ
మహారాజు నొక్కరే యగుట విరుద్ధము కాఁ జాల దనియు, చూపుట
కొఱకు మాత్రమే యీశాసనముల నుదాహరించితిని గాని వేఱుప్రయోజన
ముద్దేశించి కాదు. అయినను కాలసామ్యమును, నామసామ్యమును బట్టి
చూడఁగా నా త్రిభువనబల్లిచోడమహారాజును, నీ త్రిభువనమల్లచోడ
మహారాజును నొక్కరే యయియుండవచ్చునేమో యని సందే
హము కలుగుచున్నది. ఉభయులును సూర్యవంశజులు; కాశ్యపగోత్రజులు;
కరికాలచోళకులాభరణులు. ఈ యూహ నిజమే యయి త్రిభువనబల్లిచోడ
మహారాజునకు మహిసూరులో కూడ కొంత రాజ్య ముండియుండినపక్షము
నను, మన నన్నెచోడకవిరాజశిఖామణి త్రిభువనబల్లిచోడ మహారాజు
పుత్రుఁడే యయిన పక్షమునను, నన్నెచోడునికిఁ గన్నడభాషలో విశేష
పాండిత్య ముండె ననుటకుఁ దగిన కారణ మున్నది. పూర్వోక్తములైన
రెండు శాసనములలో ౪౩ వ సంఖ్య గలదానిలో క్రీ. శ. ౧౦౭౬ మొదలు
కొని ౧౧౨౬ వఱకును రాజ్యపాలనము చేసిన త్రిభువనమల్లచక్రవర్తి
యొక్క బిరుదావళి 'సమస్తభువనాశ్రయం .. రాజాధిరాజపరమేశ్వరం....
సత్యాశ్రయకులతిలకం' మొదలయిన విశేషణములతోఁ జెప్పఁబడినతరువాత
చోడబల్లినిగూర్చి "ఒరయూర పురవరాధీశ్వర, కరికాలచోళకులాంబరద్యు

మణి, కాశ్యపగోత్రోద్భవ" మొదలైన విశేషణములు చెప్పఁబడినవి. ఈ ప్రకారముగానే ౨౧౧-వ సంఖ్య గలదానిలో 1143 మొదలు 1154 వఱకు రాజ్యము చేసిన జగదేకమల్లచక్రవర్తి బిరుదులు సమస్తభువనేశ్వరాది వాక్యములతోఁ బేర్కొనఁబడినపిమ్మట చోడబల్లి యొరయూరపురవరాధీశ్వరాదిబిరుదులతోఁ జెప్పఁబడెను ఒక శాసనము త్రిభువనమల్లుని కాలములోను, రెండవ శాసనము జగదేకమల్లుని కాలములోను వ్రాయఁబడుటయే చోడబల్లియొక్క నామవ్యత్యాసమునకుఁ గారణము

నన్నెచోడుని కాలమును సరిగా నిర్ధారణము చేయుట కా కాలములో జంగమమల్లికార్జునుఁ డుండుటయు తండ్రి బల్లిచోడుఁడగుటయు, తల్లి శ్రీదేవి యగుటయు, ముఖ్యముగా మూఁడు కావలెను ఈ విషయమును నిర్ణయించుటకు 1915—16 వ సంవత్సరపు దక్షిణమండల శాసనకార్య నివేదనపత్రిక (Epigraphical Report of the Southern Circle for the year 1915—16) మనకు కొంత తోడుపడుచున్నది. నర్సారావుపేట తాలూకాలోని కొప్పరపు గ్రామము నందలి కోదండరామస్వామి దేవాలయముముందున్న నాగస్తంభముమీది ౩౭౭ వ సంఖ్య గల శిలాశాసనములో చోడబల్లియు, మల్లికార్జున యోగియుఁ జెప్పఁబడి యున్నారు శాలివాహనశకము ౧౦౩౭ అనఁగా క్రీ. శ ౧౧౧౫ జయసంవత్సర చైత్రబహుళ అమావాస్యనాఁడు సూర్యగ్రహణసమయమునందుఁ జేయఁబడిన దానములను గూర్చి యీ శాసనము చెప్పుచున్నది. అప్పుడు త్రిభువనమల్లచోడుని జ్యేష్ఠపుత్రుఁడైన కన్నరచోడదేవుఁడు రాజ్యము చేయుచుండెను త్రిభువనమల్లచోడుని ముగ్గురు పుత్రులలో నన్నెచోడునిజ్యేష్ఠునిగాఁ గొన్నిశాసనములు చెప్పుచున్నను, మఱికొన్ని శాసనములు నన్నెచోడుని కనిష్ఠపుత్రునిగాను, కన్నెరచోడుని జ్యేష్ఠపుత్రునిగాను జెప్పుచున్నవి. ఈ శాసనమునందు రాజుయొక్క వంశపరంపరాగతమంత్రియు నీశ్వరనాయకపుత్రుఁడును నయిన మారన రెండు గొప్పచెఱువులు త్రవ్వించి కొప్పరగ్రామములో సోమేశ్వ

రాలయము కట్టించి యొక తటాకము నిర్మించినట్లును రాజు నమ్మఁదైన చోడబల్లి కొంప్రరముసమీపమున నున్న బైడిపల్లిని దానము చేసినట్లును, ఈ దానములను మారనప్రార్థనముమీఁద విష్ణువర్ధనుని క్రిందియధికారి యైన మహామండలేశ్వరకడియరాజు స్థిరపఱిచినట్లును, సోమేశ్వరాలయము పాలూరునందలి కాలాముఖసన్యాసి మల్లికార్జునుని పాలనమునం దుంచఁబడినట్లును, చెప్పఁబడి యున్నది. ఈ శాసనమును బట్టి చూడఁగా బల్లిచోడుఁడు మొదలైనవారు సర్వస్వతంత్రులు గాక పేరునకైనను చాళుక్యచక్రవర్తులకు లోఁబడిన మహామండలేశ్వరు లనియు తేటపడుచున్నది. ఈ శాసనమునుబట్టి చూడఁగా నన్నెచోడుని సోదరుని కాలములో కాలాముఖమల్లికార్జునయోగి యుండినట్లును, నన్నెచోడునిసోదరుఁడు చోడబల్లి యనబడెడు త్రిభువనబల్లిచోడుఁ డయినట్లును రెండంశములు స్థాపింపఁబడినవి. ఈ చోడబల్లికిఁ ద్రిభువనమల్లచోడబల్లి యని పేరు వచ్చుట కతఁడు త్రిభువనమల్లచాళుక్యచక్రవర్తి పాలనకాలములో నుండుట కారణమని మనము సులభముగాఁ దెలిసికొనవచ్చును. ఈ బల్లిచోడునికిఁ గామచోడబల్లి యనియు నామము గలదు. ఇఁక బల్లినిగూర్చిన మూఁడవ యంశము స్థాపింపఁబడవలెను. ఈ నన్నెచోడునితల్లి నూబలదేవి యని శాసనము చెప్పుచున్నది. శ్రీసతికి మాబలదేవి మాఱుపేరు కాఁగూడదా? కావచ్చును.

ఈ సంబంధమున 1915-16 వ సంవత్సరపు కార్యనివేదనపత్రికలోనే పేర్కొనఁబడిన 363 వ సంఖ్య గల నన్నెచోడుని శాసనమునే విచారింతము. ఈ శాసనము శకసంవత్సరము ౧౦౨౪ అనగా క్రీస్తుశకము ౧౧౦౨-వ సంవత్సరము విషువత్సంక్రాంతినాఁడు సోమేశ్వరాలయమునకుఁ జేసిన భూదానములను గూర్చినది. ఈ కాలమునందు రాజ్యమేలుచుండినవాఁడు మహామండలేశ్వరత్రిభువనమల్లదేవమహారాజాత్మజుఁ డైన నన్నెచోడుఁడు. ఈ శాసనము నరసారావుపేటతాలూకాలోని చెన్నుపల్లియగ్రహారమునందలి పరశువేదీశ్వరాలయముయొక్క యెదుట నున్న నందిస్తంభముమీఁద చెక్కఁబడి యున్నది ఈ శాసనములో నన్నెచోడునికి కన్నరచోడుఁడు

సోదరుఁడయినట్టును, మావలదేవి తల్లియైనట్టును చెప్పఁబడినది. ప్రథమ శాసనమునందు చెప్పఁబడినట్టు నన్నెచోడునికి మాబలదేవి తల్లియగుట సత్యమా? ఈ ద్వితీయశాసనమునందు జెప్పఁబడినట్టు మావలదేవి తల్లి యగుట సత్యమా? రెండును సత్యములే. రెంటికిని శ్రీసతి యనియే యర్థము. గాలి నరసయ్యశాస్త్రి తన యింటిపేరైన గాలికి ప్రభంజన మనియు, నరసయ్య కహోబలుఁ డనియు, పర్యాయపదములు వేసికొన్నట్లే కవులు పేరులకు పర్యాయపదములు వేయుట సనాతనాచారమయి యున్నది.

మా+అబల-మా=శ్రీ (లక్ష్మి,) అబల=సతి (స్త్రీ) మాబల=శ్రీసతి
మా+ఆవల-మా=శ్రీ, ఆవలదేవి=(పర్వతపుత్రి) సతి, మావలదేవి
=శ్రీసతి

'మాబల' యనిగాని 'మావల' యనిగాని పద్యములో వేయవలసినచో దానితుదను దేవీపదము చేర్పవలసి యుండును కవి తాను రచించిన చంపకమాలలో గణసౌలభ్యార్థము మాబలార్థబోధక మయిన శ్రీసతి పదమును ప్రయోగించి యుండును. ఇది తృప్తికరమైన సమాధానము కాకపోయినను, ఇంతకంటె మంచి యాధారము దొరకనప్పుడు దీనినే సరిపుచ్చుకొనవలెను. ఇప్పటికి దొరకిన యీ యాధారములనుబట్టి నన్నెచోడుఁడు ౧౧౪౦ కిఁ దరువాత నున్నవాఁడని యేర్పడుచున్నది. ఆ కాలమందలి మండలేశ్వరు లందఱును రాజ్యకాంక్షచేత నొండొరులతోఁ బోరాడుచు జయాపజయము లను బొందుచు నుండెడివారు. ఈ యల్పయుద్ధములలో నొక్కదానియందు ౧౧౪౦ వ సంవత్సరమునందు కాకపోయినను నన్నెచోడుఁడు తరువాత నిన్నూటనలువది సంవత్సరములకయినను నిహతుఁడయి యుండును మూఢవిశ్వాసము అధికముగాఁ గల యాకాలము నం దాతని మృతిని శుభాశుభగణవిధిజ్ఞు లయిన లక్షణజ్ఞులు మగణముతరువాత రగణము వేయుట కారోపించుటయు, సామాన్యజను లా మాటలను విశ్వసించుటయుఁ దటస్థించెను. అందుచేత నన్నెచోడునకుఁ దరువాత గొంతకాలమున కున్న యథర్వణాచార్యుఁడు తనఛందస్సులో నీ క్రిందిపద్యమును వేసెను

క. 'మగణమ్ముఁ గదియ రగణము
వగవక కృతిమొదట నిలుపువానికి మరణం
బగు నిక్కమండ్రు, మడియఁడె
యగు నని యిడితొల్లి వేంకణాదిత్యుఁ డనిన్.'

ఈ పద్యమునుబట్టి నన్నెచోడుఁడు శుభాశుభగణపరిజ్ఞానములేనివాఁడని యథర్వణునియభిప్రాయ మయినట్టు తేలుచున్నది. నన్నెచోడుఁడు తన కుమారసంభవమునందు స్రగ్ధరావృత్తములో మగణముతరువాత రగణముం డియే తీఱవలెను. ఈ నన్నెచోడకవి నన్నయభట్టారకునకును, తిక్కన సోమయాజికిని నడిమికాలమునం దున్నవాఁడు. ఇతఁడు తన పుస్తకము నందు సుకవిస్తుతియు కుకవినిందయు షష్ఠ్యంతపద్యములును వేసియు న్నాఁడు. వీనిని వేయుటలో మొదటివాఁడని యింతవఱకును తిక్కనసోమ యాజికి వచ్చిన ప్రతిష్ఠ యిప్పు డాతనినుండి తొలఁగి యీతనివి జేరు చున్నది.

[శ్రీరామకృష్ణకవిగారు కుమార సంభవమును పూర్తిగాఁ బ్రకటించిన ముప్పది మూఁడేండ్లకుఁ బిదప మద్రాసు విశ్వవిద్యాలయమువారును, శ్రీవావిళ్లవారును 'కుమారసంభవము'ను బ్రకటించియున్నారు విశ్వవిద్యా లయమువారి-ప్రచురణకు శ్రీ కోరాడ-రామకృష్ణయ్యగారి విపుల 'పీఠిక' కలదు నాఁటివఱకును ఈ కావ్యమునుగూర్చి కలిగిన చర్చల నన్నింటిని పరిశీలించి యొకరీతి సిద్ధాంతముగనే శ్రీరామకృష్ణయ్యగారు కవి కాలాదు లనుగూర్చి వివరించియున్నారు ఆ విషయము సంగ్రహముగా నిచటఁ దెలుపఁబడును.

'ఈ కవికాల నిర్ణయమునుగూర్చి పరిశీలించిన వారిలో నొకరిద్దరు తక్క తక్కిన వారందరు నన్నయ తరువాతి వాఁడని నిరూపించుటకే యత్నించిరి అందు పలువురు నన్నయతిక్కనల నడిమికాలపువాఁడై యుండునని తలంపఁగా నిటీవల 'కుమార సంభవ విమర్శనము'ను బ్రకటిం చిన శ్రీ లక్ష్మీపతి శాస్త్రులుగారు తిక్కనకుఁ గూడఁ దరువాతివాఁ డగునని

యాంతరంగికములగు కొన్ని పోలికలనుబట్టి నిర్ణయింప యత్నించిరి. ఇట్లీ కవి కాలనిర్ణయమునకు నిష్కృష్టమగు శాసనాధారము లేకపోవుటచే నాంతరంగిక నిదర్శనములనుబట్టి క్రీ శ 940 మొదలు క్రీ శ. 1300 వరకు గల నడిమి కాలమున నీతని యునికి యూగులాడు చుండవలసి వచ్చినది.

ఈ మధ్యకాలము ముఖ్యముగా మూడు తరగతులుగా విభాగింపదగియున్నది. ఒకటి నన్నయకు పూర్వమని రెండవది నన్నయకు సమకాలికము-లేదా నన్నయ తిక్కనలకు నడిమి భాగమని, మూడవది తిక్కనకు తరువాతికాలమని ఈ మూడవది - నన్నిచోడుఁడు తిక్కనకు తరువాతికాలపువాఁడను వాదము తక్కినవానికంటె నర్వాచీనము. శాసన నిదర్శనము నిష్కృష్టమైనదిగాఁ గనఁబడనందున నాంతరంగిక నిదర్శనమగు రచనలోని పోలికలనుబట్టి విచారింపఁగా గొన్ని విషయముల తిక్కనకేతనల భావములను,రచనలను నన్నిచోడు డనుకరించెనని శ్రీలక్ష్మీ పతిశాస్త్రిగారికి తోచుటచే నాయనయే యా మూడవ పక్షవాదమును తొలుత ప్రతిపాదించిన వారైనారు ఇంక ననేకవిధములగు పోలికలు ఇతరకవులతో సమానముగఁ గనఁబడుచుండఁగా, వారు చూపిన పోలికలైనను చోళుని రచననే వారనుకరించి యుండఁగూడదా ? యను సందేహమును నిశ్శేషముగాఁ దీర్చునవి కాకపోవుటచే తిక్కన తరువాతి వాఁడను నర్వాచీనవాదము నంతగా మనము పాటింపవలసిన యావశ్యకత కనఁబడదు.

ఇఁక నన్నయకుఁ బూర్వుఁడనునది తొలివాదము. కవి తననుగూర్చి చెప్పికొనిన గ్రంథస్థ విషయములలో తల్లిదండ్రుల నామములు కలవు.. పురాతన శాసనములఁ బరిశోధింపఁగాఁ బెక్కండ్రు నన్నిచోడు లగపడుచున్నారు గాని వారిలోఁ గొందఱు మాత్రమే చోడబల్లియను రాజునకుఁ బుత్రులుగాఁ బేర్కొనఁబడియైన నుండిరి గాని, ఎందునను దల్లి పేరు లేనందున నిస్సందేహముగా నిర్ణయించుటకు వీలే లేకున్నదనుట వాస్తవము. నన్నిచోడుఁడు .కావేరీతీరమునందలి యొరయూరి కధిపతినని, టెంకణాదిత్యుండనని చెప్పుకొనినంత మాత్రముచేత—అతని తండ్రి చోడబల్లి పాకనాటి యం దిరువదియొక్క వేయింటి కధీశుఁడని చెప్పుచుండఁగా — నీతఁడు

అచ్చటి వాఁడును, పాకనాటి చోడ వంశము వాఁడును గాక - ఒరయూరును పాలించుచు (మగణమ్ము గదియ రగణమ్మును వేసి పద్యము చెప్పుటచే) పాశ్చాత్య చాళుక్యరాజులచే రణరంగమున నిహతుఁడైన వాఁడనుట సంభావ్యముగాఁ గనఁబడదు. ఆంతరంగిక సాక్ష్యమగు వ్యాకరణచ్ఛందో విశేషాపూర్వపద ప్రయోగములలోఁ గొన్ని నన్నయ తరువాతి కవులలోఁ గూడఁ గనఁబడుటచేత - వాని విషయమున నన్నయ యవలంబించిన దానికంటె భిన్నమగు సంప్రదాయము నవలంబించినవాఁ డనియే వ్యక్తమగుచున్నది గాని, నన్నయకుఁ బూర్వుఁడను కాలనిర్ణయమున కిది తోడ్పడునదిగాలేదు. (పీఠిక పుటలు VII-VIII)

ఇక నన్నిచోడుని నన్నయకు సమకాలికునిగా నిశ్చయించినవారిలో శ్రీ దేవరపలి (వెంకట) కృష్ణారెడ్డిగారు ముఖ్యులు. ఉద్భటుని గూఢవస్తుమయకావ్యమునం దాదరము చూపిన నన్నిచోడునకుఁగూడ గూఢవస్తుమయరచనయం దాదరము కలదనియు, కావుననే గ్రంథరచనాకాలమును 12-వ ఆశ్వాసమందు గూఢముగ 'ఖడ్గలత పూచెనో నాజయజైత్ర సంపదన్' అను పద్యములో జయసంవత్సర, జయమాస, జయతిథి, జయవారమైనట్లు సూచించినాఁడనియు, ఇది విక్రమయంగపద్ధతిని తిధివారనక్షత్రముల కలయికచే క్రీ. శ. 1057 సం. సరిపోవుననియు, కావున నాతఁడు నన్నయకు సమకాలికుఁ డగుననియుఁ దెలిపిరి. వీరు చూపిన లెక్కలలోఁ గూడ నొక సంవత్సరము తేడా కనఁబడుచునేయున్నది..... .. నన్నిచోడుని వాస్తవాభిప్రాయము నిది యెంతవరకు సమర్థింపగలదో తెలిసికొను నితరాధారమేమియునులేదు. ఇది యిట్లుండ నిదివరకు లభించిన శాసనములలో నీకాలపువాఁడగు నన్నిచోడుని సూచించు శాసన మేదియు బయలుపడలేదు ... .. కావున నీకవి నన్నయ తిక్కనల నడిమివాఁడనువారి వాదమే యిప్పటి కాదరణీయముగా కనఁబడుచున్నది [పుట XII]

.. చోడబల్లి పాకనాటియం దిరువదియొక్కవేయింటి కధీశుఁడేనా ? యను సందేహమున కాతని తరువాతి తరమువాఁడు, శాసనకర్తయగు మల్లిదేవ చోడున కాబిరుదమున్నప్పు డీతనికి నుండి యుండునని మన మూహింప

వచ్చును దీనినిబట్టి యీ చోడబల్లి నన్నిచోడు లిద్దరు పాకనాటిలోనివారే యనుటయైనను స్పష్టమగును. ఇక సామాన్యపుశంకల నటుంచి. యీ శాసనములవలన చోడబల్లికొడుకు నన్నిచోడుఁడు, ఈతని కరికాలచోడాన్వయజని తత్వము, పాకనాటిలో నునికి, ఏకవింశతి సహస్రగ్రామావనీవల్లభునితోడి సంబంధము, చోడబల్లిచే నారాధింపఁబడిన యొక కాలముఖవ్రతుఁడగు మల్లికార్జునయోగి, దారిద్ర్య విద్రావణ బిరుదముగల ప్రభువు. రామేశకవి — అను నిన్ని విషయములు తెలిసినవి కావున నీ కవి క్రీ శ 1100 ప్రాంతమువాఁడని, నన్నయ కవ్యవహిత పరముఁడుండి యుండునని తలంప వచ్చును' [పు XIII]

నన్నిచోడుని కాలమును గూర్చి విపులముగ విమర్శించిన పిదప 'ఆంధ్రకవి తరంగిణి' కారులు కుమార సంభవ మందలి పదప్రయోగాదులనుబట్టి నన్నిచోడుఁడు ప్రాచీనుఁడనియు, నతనిది ప్రాచీన కవిత్వమనియు నన్నయకుఁ బూర్వుఁడో, పరుఁడో నిర్ణయింపఁ జాలము' అని వ్రాసియున్నారు. [పుట 202]

ఈ విషయమున 'తెనుఁగు కవుల చరిత్ర' లో క్రింది విధముగఁ గలదు

'ఈతఁడు రాజైనను, ఈ గ్రంథమున చారిత్రకాంశములను తెలుపక పోవుట చేత నీతని కాలము వివాదములకు మూలమైనది అవి నాలుగు విధములు— 1 ఈ కవి తెనుఁగున నాదికవియని యనుకొనుచున్న నన్నయభట్టారకునకు పూర్వుఁడు అనఁగా క్రీ. శ. 940 ప్రాంతమువాఁడు. 2 నన్నయతో సమకాలికుఁడు అనఁగా 1051 సం ప్రాంతమువాఁడు. 3 నన్నయకు వెనుక నొక శతాబ్దిలోపువాఁడు. అనఁగా క్రీ. శ. 1130-1150 సం. ప్రాంతమువాఁడు. 4 తిక్కనకు తరువాతివాఁడు అనఁగా సం. 1275-1350 ప్రాంతమువాఁడు. నన్నెచోడకవి క్రీ శ సం 1130-50 ప్రాంతమువాఁడనియే నేఁడంగీకృతమైనది.'] [పుట 200]

కుమారసంభవములో నితఁడు చేసిన కుకవినింద యిది.

గీ. 'చెనసి గుణమైన దోషంబు సేయ నేర్చుఁ
గుకవి కృతులందు దోసంబు గుణము సేయ

నేరఁ, డది యట్ల దొంతులు చేరి నాయి
దోర్పనేర్చుఁ గా కది యేమి చేర్పనేర్చు?' [అ ౧-౭౯]

ఈ పద్యమునం దితఁ డనావశ్యకముగా కుక్క యనుటకు మాఱుగా 'నాయి' యను నన్యభాషాపదమును బ్రయోగించి యున్నాఁడు. ద్రవిడభాషలోను, కన్నడభాషలోను కుక్కను నాయి యందురు. ఇట్లు తఱచుగా కన్నడ పదముల నుపయోగించుటయు, గ్రాంధికభాషలోను వ్యావహారికభాషలోను గూడ లేని యప్రతీతపదములను వాడుటయు స్వచ్ఛమయిన యీతని కవిత్వమునకుఁ గొంత కళంకమును దెచ్చుచున్నవి. * దీనిని మనస్సునం దుంచుకొని యీ కవి నుద్దేశించియే కాఁబోలును తిక్కనసోమయాజి తన నిర్వచనోత్తర రామాయణమునందుఁ గుకవిదూషణముగా నీ క్రింది పద్యమును వేసి యున్నాఁడు.

చ. పలుకులపొందు లేక రసభంగము చేయుచుఁ బ్రాఁతపడ్డ మా
టలఁ దమనేర్పు చూపి యొకటన్ హృదయం బలరింపలేక యే
పొలమును గానియట్టి క్రమముం దగ మెచ్చుగ లోక మెల్ల న
వ్వులఁబొరయం జరించు కుకవుల్ ధర దుర్విటులట్ల చూడఁగన్.'

ఈ పద్యమునందు దుష్కవులు దుర్విటులతోఁ బోల్పఁబడి యున్నారు. కొందఱు పొగడినంత యత్యుత్తమమయినది కాకపోయినను, నన్నెచోడుని కవిత్వ మన్యభాషాపదదూషితము కానియెడల నుత్తమమయినదనియే చెప్ప వచ్చును. ఇతఁడు సంస్కృతగ్రంథములను మాత్రమేకాక కన్నడగ్రంథ ములను సహితము విశేషముగాఁ జదివి యుండుటచేత నాగ్రంథముల

[* 'వ్యాకరణమునకు లొంగని పదములు, అప్రతీతపదములు, భాషాంతరపద ములు, నీకావ్యమునందుండుట దీని ప్రాచీనతను వ్యక్తముచేయునదే! ఇట్టి ప్రయో గములవలన కవి కేమాత్రము కళంకము కలుగదు. ప్రాచీనకవుల ప్రయోగము లర్వాచీనములగు వ్యాకరణములకు లొంగకుండుట కవి కపకర్షను కల్గింపదు—' అని పండిత విమర్శకులు కొందఱభిప్రాయపడుచున్నారు.]

యందలి భావములను, పదములను గొంత చేకొనియున్నాఁడు ఈ యంశ మును స్థాపించుటకై పుస్తకసంపాదకులు చూపినవానిని మాత్రమే యొకటి రెంటి నిం దుదాహరించుచున్నాను.

క. ముదమున సత్కవి కావ్యము
నదరక విలుకానిపట్టినమ్మును బరహృ
ద్విదమై తల యూఁపింపని
యది కావ్యమో ? వాని * పట్టినదియుం గరమే ? [అ౧-౪౧]

అనెడు ప్రథమాశ్వాసములోని యీ నలువదియొకటవ పద్యము

శ్లో॥ కిం కవే స్తస్య కావ్యేన కిం కాండేన ధనుష్మతః
పరస్య హృదయే లగ్నం న ఘూర్ణయతి యచ్ఛిరః.

అను సంస్కృతశ్లోకమునకు తెలుఁగు, పయి పద్యము పీఠికలో నున్నట్టు చేకొనఁబడినది. గ్రంథములో "నదరక" యన్నచోట "నదరఁగ" ననియు, "వానిపట్టినది" యనుచోట "మలరిపట్టినది" యనియుఁ బాఠభేదములు గల దయి యున్నది.

మహాస్రగ్ధర హరహాసాకాశగంగాత్యమలజలమరాళాబ్జ నీహారధాత్రీ
ధరకర్పూరేందుకాకోదరవరపతిదిగ్దంతిపక్షీరనీరా
కరముక్తాహారకుందోత్కర రజతశరత్కౌముదీద్యోతకీర్తి
శ్వరునాత్మారామువాణీవరువరగురుసర్వజ్ఞుసజ్జ్ఞానదూరున్.

చతుర్థాశ్వాసాంతమందలి యీ ౪౬౫ వ పద్యము

'హరహాసాకాశగంగాజలజలరుహనీహారధాత్రీ
ధరనీహారాంశుతారావనిధరశరదంభోధరక్షీరనీరా
కరతారాభారతీదిగ్గదనిరదనపీయూషడిండీరముక్తా
కరకుందేంద్రేభహంసోజ్జ్వలవిశదయశోవల్లభుం శాంతినాథమ్.'

---

[* పట్టినదియున్ శరమే ?' అనునది సరియైన పాఠము]

అను కాలాముఖమఠమునకుఁ బ్రక్కనుండు జైనమఠములోని త్రైలోక్యమల్లుని క్రీ. శ. ౧౦౭౨ శాసనశ్లోకమును జూచి వ్రాయఁబడినది. జైనులు శబ్దార్థచౌర్యమునకు వెనుదీయ రని సంపాదకులు వ్రాసినను పయి శ్లోకమును రచియించిన జైనసంస్కృతకవి ముందు చేయఁబోయెడి తెలుఁగు గ్రంథమునుండి యీ శ్లోకమును దొంగిలించి యుండఁజాలఁడు.

సీ. కరలత లందంద కామపాశంబుల
నదిమి బంధించుచున్నట్లు బిగియ
నొవవఁ బేర్చిందులఁ బదనైన పూఁత లం
గమునకు వజ్రలేపములుగాఁగఁ
బులక లొండొరులమేనుల నుచ్చిపోయి డ
గ్గఱ మొల లిచ్చినకరణిగాఁగఁ
గనకంపుఁబ్రతిమలు గాఁచి యంటించిన
ట్లొడఁగూడి తనువు లొండొంటిఁ గదియ
గీ. దగఁగ నొక్కతలకు మొగములు రెండైన
పగిది దలలు మాఱుమొగము పడఁగ
గిఱి మేనుమేను * దూఱ గాఢాలింగ
నంబు చేసి రంగనయుఁ బ్రియుండు.

అను కుమారసంభవనవమాశ్వాసములోని యీ ౧౪౭వ పద్యములోని "యొక్క తలకు రెండుమొగములో యను నుత్ప్రేక్ష తక్కఁ దక్కిన భావము లన్నియుఁ గల" వని సంపాదకులు కన్నడ జగన్నాథవిజయములోని యీ క్రింది పద్యముసు పూర్ణముగా నుదాహరించి యున్నారు.

మ ఉకదింపెర్మొలెబెంగెమూడె చెమర్గళ్ బల్వజ్రలేపంబొ లా
గిరె, కీల్గొట్ట బెడంగనీయె పులకం, తోళ్తోళ్గెగంటిక్కిదం
తిరె, మెమ్మెయ్యొళడంగు వంతమరె, గాఢాలింగనంగెయ్దు న
ల్లరదేనిర్దరొకాసిబెచ్చ తెఱదిం శ్రీసత్యభామాచ్యుతర్.

[ * మేన దూఱి — పాఠాంతరము]

జగన్నాథవిజయము నన్నెచోడుని సమకాలీనుఁడైన రుద్రభట్టుచే రచియింపఁబడినది. "నన్నెచోళునియత్యపూర్వభావములు మల్లినాథపురాణ జగన్నాథవిజయాది కర్ణాటకకావ్యములలో మార్పులేక యున్నవి" అని సంపాదకులు వ్రాయుచున్నారు. ఇందుఁ బేర్కొనఁబడిన మల్లినాథపురాణము 1105-వ సంవత్సరప్రాంతములం దున్న నాగచంద్రునిచే రచియింపఁబడినది. కుమారసంభవములోని భాగములు తద్గ్రంథకర్తయగు నన్నెచోడునితో సమకాలికులును, పూర్వకాలికులును నగు తెలుఁగురాని కన్నడకవులచేఁ జేకొనఁబడిన వని చెప్పుటే యుచితమో, ఆ కవుల కాలపువాఁడును, తరువాతికాలపువాఁడునునై కన్నడమువచ్చిన నన్నెచోడుఁడే వారి కర్ణాటక కావ్యములనుండి కైకొనియె నని చెప్పుటయే యుచితమో, చదువరులే తెలిసికోఁగలరు ఇతఁడు కర్ణాటకకావ్యములలోనుండి తన కుమారసంభవము నందు సంగ్రహించిన కన్నడ పదబృందములోని కొన్నిపదముల నిందుఁ జూపుచున్నాను.

సీసపాదము. అనులేపనములు మండనములు లేకయు
భాసురాంగములింతదేసియగునె. [ఆ. ౬. పద్య. ౫౨]

ఇందలి దేసి పదము సుందరమైన యను నర్థ మిచ్చెడు కర్ణాటకపదము

క. దోస మనెగుణదవోలు
ద్భాసిసి కన్నడదళొల్దుపూర్వాచార్యర్
దేసియనె నిఱిసిఖండ
ప్రాసమనతిశయమదెందు యనియం మిక్కుర్.

(కవిరాజమార్గము.)

ఈ కవిరాజమార్గకర్త 814-887-వ సంవత్సరముల మధ్యమున నున్న నృపతుంగుఁడు.

వెంచలు.

చ. ఎలమిన పూరి మేసి సెలయేఱుల నీరులు ద్రాగి మేలి వెం
చల నెలమావిఁ జొంపములఁ జల్లని నీడల నిల్చి పొల్చి మం

దలు గొని నఁదిపోతులునుఁ దారునుఁ బేయలు సమ్మదంబునన్
గలసి రమించుధేనువులఁ గాంచిరి తద్విపినాంతరంబునన్.
[ఆ. ౬. పద్య. ౩౦]

వెంచ లనఁగా కన్నడమున సరస్సులు.

క. వికచసరసీరుహం కో
కకులవ్యాభాసిపూగొళం తానిరెయుం
బకనికరలులితకలు షో
దకవిడిళదొళంచె వెంచెయొళ్ వసియిసు మే.—గుణవర్మ.

గుణవర్మ 1050-వ సంవత్సరప్రాంతములం దుండినవాఁడు.

కొలవేళలు

సీసపాదము —మోసుల వీజనంబులు సేయఁ గొలవేళ
లిరవుగాఁ గూర్చి చామెరలు చేయు.
[ఆ ౫. పద్య. ౧౩౮]

కొలవేళ లనఁగా కన్నడమున వట్టివేళ్ళు.

చ. 'తరుణియరావిలాసకుసుమాస్త్రనిరీక్షి సెకామతాపదిం
తరుణమృణాలమంతెగెదుపూగొళదిం పొఱ గిక్కిదండదిం
కొరగి మృణాళనాళికెగెచందనదణ్కెగెతిఱ్ఱిళిల్గెత
గ్గొరగదసూసునీర్గెకొలవేర్గొడల గుఱియాగెమాడువర్'—
(మల్లినాథపు)

మల్లినాథపురాణకర్త యైన నాగచంద్రుఁడు 1105 వ సంవత్సరప్రాంతములం దున్నవాఁడు.

కండవడము.

చ. బెదరుచు నంతరంగమున భీతికిఁ గండవడంబు సుట్టి ప
ల్కెదు పొరపొచ్చెమున్ వెఱపుఁ గేనముఁ జెయ్యులకోలినెత్తు వె

ట్టైదు వడి మోవియుం గరువటిల్లెడు నీమది నింతతల్లడం
బొదవుఁడిదేమి కారణమ యుగ్మలి నాకెఱిగింపు మేర్పడన్.
[ఆ ౪. పద్య. ౫౯.]

**కండవడ మనఁగా కన్నడమునందు తెలి.**

క. 'తళిర్గళకండవడంగళ
తళిర్గళపాసుగళెతలిర్గళోవరిగళెకెం
దలిర్గళెళసిపెళవిఱిల్గళె
విలాసమంమెఱెవరిల్లికెలరబలెయరొళ్.'—ఆదిపురాణ.

ఈ యాదిపురాణమును రచించిన యాదిపంపఁడు క్రీ శ. 940–వ సంవత్సర ప్రాంతమునం దుండినవాఁడు. ఈ యుదాహరణములనుబట్టి చూడఁగా నన్నెచోడుఁడు తన కాలపువియుఁ దన పూర్వకాలపువియు నైన కన్నడ గ్రంధములను బాగుగాఁ జదివినవాఁ డయినట్టు కనఁబడు చున్నాఁడు. ఈతఁడు వాడిన కన్నడపదము లన్నియు పూర్వకాలమునందు కర్ణాటకాంధ్ర భాషలకు రెంటికిని సామాన్యము లని మనవారు చెప్ప వత్తురు అవి పూర్వము రెండు భాషలకును సామాన్యములని యెట్లు దెలిసికోవచ్చును? ఏ పూర్వకవులు వీనిని బ్రయోగించిరి? నన్నయభట్టారకాదులు ప్రయోగింపలేదు. "బెదరుచు" నన్న పయి పద్యమునం దింకొక విశేషప్రయోగము కూడఁ గానఁబడుచున్నది. "ఒదవుటిదేమి?" యనుటకు మాఱుగా "ఒదవు డిదేమి?" యను రూపము వాడఁబడినది ఈ పుస్తకమును వ్రాసిన తంజావూరిలోని యఱవ వాండ్రకు ట డ భేదము చక్కఁగాఁ దెలియక పోవుటచేత వ్రాఁతలో నిట్టి రూపములు పడి యుండవచ్చును అట్టివి పూర్వకాలపురూపములని భ్రాంతి చెంది ముద్రాపకులు వాని నట్టె యుంచి యుందురు. ఇట్టి రూపము లీ పుస్తకమునం దిరువది ముప్పదిచోట్ల వేయఁబడి వానిక్రింద "ఒదవుడు–ఒదవుట" యనునట్లు టిప్పణములు వ్రాయఁబడినవి. డకారమున్నచోట్ల టకారము వేసిన నీ యాయాస మంతయు తప్పిపోయి యుండును. ఈ యన్ని స్థలములలో డకారమును టకారముగా మార్పఁ గూడని స్థల మొక్కటియు లేదు. అపూర్వరూపములను

వేసినంత మాత్రముచేత క్రొత్తకవి ప్రాఁతకవి కానేరఁడు. ఈ కవి భావార్థకమునందు టకారము వాడె ననుటకు నొక్క యుదాహరణమును కుమారసంభవమునుండి చూపెదను—

క. దొనఁగోలఁ గోలవేగం
బున నరికొల్పుటయుఁ దిరువుఁ బోరిఁబోరి విడుపుం
జనుటయు దనుజులఁ గొనుటయు
ననిమిషులకు నైనఁ గాంచు డరుదయ్యె ననిన్.—[ఆ.౧౨-౧౫౩]

అరిగొల్పుట, చనుట, కొనుట, అని మొదట మూఁడుచోట్ల టకారమువేసినవారు కడపట కూడ 'కాంచుట' యని టకారమును వేయక కాంచు డని డకార మేల వేయవలెనో దురూహ్యముగా నున్నది. కాంచు డరు దయ్యె ననుటకు మాఱుగా "కాంచు టరు దయ్యె" నన్నచో యతిభంగము వచ్చునా? గణభంగము వచ్చునా? ఏదియును రాదు. ఈ ప్రకారముగానే యేకా దశాశ్వాసములోని ౫౩ వ దయిన యీ పద్యమునందును

ఉ. * ఆయము లిచ్చు డాఁకిమొన కాయము వెంచుట పెక్కుమన్ననల్
నేయుట పోరికి న్మొనసి చేయుట గా మది నిశ్చయించుచున్
నాయకు కోర్కెఁదీర్పఁ ని నా యెడ్డనూఁడినట్లు తొమ్మునం
జే యిడి నిద్ర వోయిరి నిశీథి భటుల్ సమరంబు కోరుచున్.

పెంచుట, చేయుట, చేయుట, యని వరుసగా మూడుచోట్ల టకారమువేసి మొదట నొక్కచోటమాత్ర మిచ్చు డని డకార మేల వేయవలసివచ్చెను? ఇచ్చుట యన్న ఛందోలక్షణభంగము లేమైన వచ్చునా? ఇచ్చుట యన్నదే పూర్వకాలరూపముగాని యిచ్చు డన్నది కాదు. "అంతకంతకు మా పట్టణములో త్రాగుడు హెచ్చుచున్నది" అను విధమున నిప్పుడిప్పుడు త్రాగుట యనుటకు త్రాగు డని వాడుకలోనికి వచ్చినది ఈ పుస్తకములో నిప్పు

[* ఆయములిచ్చుటాజి .. .. నిసిన్ సుభటుల్ - అని విశ్వవిద్యాలయ ముద్రిత ప్రతి.]

డున్నట్లు "నాయెడ్డ" యని యుంచినచో గణభంగము కలుగుచున్నది. ఎడఁదద, ఎద, ఎడ, ఎడ్డ, యని నాలుగు రూపము లుండఁగా నిర్బాధక మైన నడిమి రెండు రూపములలో నొకదాని వేయక సబాధక మైన "యెడ్డ" యను రూపమును వేసి దానిక్రింద "ఇందు డకారమును దేలఁ బలుకవలయును" అని టిప్పణి మేల వ్రాయవలెను? 'నాయెద నూఱడి' యని వేసిన నేమి దోషము? ఇట్టి యసాధారణరూపములను వేసినంత మాత్రముచేత నిది యత్యంతపురాతనగ్రంథము కాఁగలుగునా? ఈ పుస్తకము యొక్క ౧౦, ౧౧ వ యాశ్వాసములలోనే యిటువంటి యెడ్డలైదు గణభంగము కలుగునట్లుగా వేయఁబడి క్రిందను "ఇందు డకారమును దేల నుచ్చరింపవలయు" లోనగు టిప్పణములు వ్రాయఁబడినవి.

పయి పద్యమునందలి 'ఱొమ్మునం జేయిడి నిద్ర వోయిరి' యన్నభాగ మీ కవి నన్నయభట్టారకుని భారతమును చదివి యుండెనని తెలుపుడు చేయు చున్నది.

క. 'వినుతధనుర్విద్యావిను
　　ఘనుఁ గర్ణు సహాయుఁ బడసి కౌరవవిభుఁ డ
　　ర్జునువలని భయము చెడి ఱొ
　　మ్మునఁ జేయిడి నిద్ర వోయె ముదితాత్ముండై.'

అను నాదిపర్వములోని పద్యమును జూడుఁడు నన్నెచోడుఁడు నన్నయ భట్టు పుస్తకమును జదివె నని స్థిరపఱుచుటకు యిచ్చట మఱి రెం డుదా హరణములను గూడ నిచ్చుట చాలి యుండవచ్చును

నన్నయభట్టారణ్యపర్వమున ద్వితీయాశ్వాసమునందు

క. "అఱపొఱడు కుఱుచచేతులు
　　నొఱవ శరీరంబు గలిగి యొరులకుఁ జూడం
　　గొఱగాకుం డియు మన్మథు
　　నొఱపులఁ బడియెడు నితండు యువతీప్రియుఁడై.' [ప. ౧౩౪]

అఱపొఱ దన్న యసాధారణపదమును వాడెను. దానినే నన్నెచోడుఁడును కుమారసంభవములోని ఆ. ౬-౩౭ పద్యములో

సీసపాదము. * కందుఁబండ్లుఁ బఱిగిగడ్డంబులును నఱ
పొఱకు ల నంటు రూపులును గుఱుచ.

పయియట్లు ప్రయోగించెను. ఒకకవి యింకొకకవియొక్క గ్రంథమును జదివి యం దుండి యేమయిన గ్రహించినట్లు తెలిసికొనుటకు మొదటి కవి యొక్క విశేషప్రయోగములనుబట్టి తెలిసికొనవలెనే కాని సర్వకవి జన సామాన్యము లైన ప్రయోగములనుబట్టి నిశ్చయించుటకు వలను పడదు. నన్నయభట్టారకపర్వమునందు

చ. పొలుపుగఁ బూసి కట్టి తొడి భూరివిభూతి ప్రకాశితంబుగాఁ
గలయఁగఁ దత్పురీజనులు కాంస్య మృదంగక శంఖ భేరి కా
హళ పటహధ్వనుల్ చెలఁగ నాటలుఁ బాటలు నొప్పనెల్లవా
రలు చని చేసి రర్చనలు రైవతకాద్రికి నుత్సవంబుతోఁ.

అనెడి యష్టమాశ్వాసములోని పద్యములో "తొడిగి" యని యుండవలసిన సామాన్యరూపములోని "గి" వర్ణకమును దీసివేసి "తొడి" యని విశేష ప్రయోగమును జేసెను. దీనిని జదివియే నన్నెచోడుఁడు తనకుమారసంభవము పంచమాశ్వాసములో

'కేసరరాజీవ కేయూరములు తొడి
రాజీవకర్ణపూరము లమర్చి—' [పద్యము ౨౦]

అను సీసపాదమునందు "తొడి" యని ప్రయోగించి యున్నాఁడు.

ఉ. పీండె ఖలుండు దక్షుఁ డనువీఱిఁడిపొఱుఁడు వీఁడు సర్వవ
ధ్యుం డెడసేయ కుండు శివదూషకునాలుక గోసి యుప్పు నిం
పుండు త్రపుద్రవమ్మొడలఁ బూయుఁడు లోహముకాచి నోరఁ బో
యుండు దురాత్ము చర్మపట మొల్వుఁడు కన్నులు మీఁటుఁ
డుక్కఱన్— [అ ౨-౮౪]

[* కందుఁబండ్లుఁ బఱికి గడ్డంబులును నఱ పొఱడులునంటు రూపులునుఁ గుఱుచ — అని మద్రాసు, విశ్వవిద్యాలయ ముద్రిత ప్రతి.]

ఇత్యాదిస్థలములయందు దీర్ఘముమీఁది యరసున్నలను నిండుసున్నలనుగాఁ బ్రయోగించి యుండుటయే యీ కవియొక్క ప్రాచీనతను తెలుపుచున్నదని కొందఱనుచున్నారు.

ఉ. ఎంచినప్రేమ నీపదక మిమ్మని రుక్మిణి మున్ను వేఁడుడుం
బూంచినపూఁవు దక్కఁ బలుపోకలఁబోవుచు నుండు దేవుఁడుఁ
డాంచినసొమ్ము చేరె నకటా మదిఁ గోరనిసత్యభామకున్
నోంచినవారిసొమ్ము లవి నోమనివారికి వచ్చునే యిలన్.

అని పదునాల్గవశతాబ్దియం దున్న నాచన-సోముఁడు సహితము దీర్ఘము మీఁది యర్ధబిందువులను పూర్ణబిందువులనుగాఁ బ్రయోగించి యుండుటచేత నిది ప్రాచీనత కొక గుఱుతు కాదు.

## క్రౌంచపదము.

చంచుల నాస్వాదించుచు లేఁదూండ్లకరువు ప్రియలకు నలఁదుచు మైరో
మాంచము లోలిం గంచుకితంబై పొడమఁగ నలరుచుఁ బులినములం గ్రీ
డించుచుసంభాషించుచుఁ బ్రీతింబొలుచుచుఁ జెలఁగుచుబొలయు సముద్య
త్క్రౌంచగతుల్ వీక్షించుచు భాస్వజ్జ్వలనుఁడు శరవణ సరసికివచ్చెన్.

అను దశమాశ్వాసములోని ౩౦ వది యగు క్రౌంచపదవృత్తము నుదహరించి, "ఇందుఁ గందసీసములవలెఁ బ్రతిపాదము రెండు భాగములుగా విభజింపఁబడి కందమువలెఁ బూర్వార్థమునఁ బ్రాసమును ద్వితీయార్థమున విశ్రమము మాత్రమే కూర్పఁబడియె ద్వితీయప్రాసయతి మాత్రము నన్నయ, తిక్కన, కవిజనాశ్రయకారాది ప్రాచీనులు పాటించిరి కాని యప్పకవి తన్మర్మము తెలియక వదలెను .... ... ... ... .... ... ... .... ... .... ....నన్నయకాలమునకే క్రౌంచపదము వృత్తము కావునఁ బ్రథమాక్షరవిరతి ముఖ్యమని ప్రాస మున్నను రెండు విరమస్థానములు ప్రయోగించిరి. ఇది నన్నెచోడుని ప్రాచీనత కొక గొప్ప కారణము." అని సంపాదకులైన రామకృష్ణకవిగారు ద్వితీయభాగపీఠికయందు వ్రాసిరి నా

బుద్ధి కిది నన్నెచోడుని ప్రాచీనతకుఁ గారణముగాఁ గానఁబడదు గాని యాతనికిఁ గల కర్ణాటక భాషా పక్షపాతిత్వమునకుఁ గారణముగాఁ గనఁబడుచున్నది నన్నయకాలమునకే క్రౌంచపదము వృత్తమయ్యె నఁట; అయినపక్షమున యతిస్థానము లన్నియు మొదటియక్షరముతో మైత్రికలవయి యుండుట యాంధ్రభాషాకవిత్వమర్యాద ఈ మర్యాదను వదలి కర్ణాటకభాషాకవిత్వమర్యాద నవలంబించుట తెలుఁగుసంప్రదాయమునకు విరోధము. నన్నయభట్టొక్కఁడను దాను రచించిన భారతభాగమునందు క్రౌంచపదవృత్తమును వాడియే యుండలేదు. అందుచేత నాతని కాలమున క్రౌంచపదవృత్తము వాడుకలో లే దనుట స్పష్టము ఆతని కాలమునందును, తత్పూర్వమునందును అక్కరలు మొదలైనవి యెక్కువ వాడుకలో నున్నవి నన్నయభారతమునం దక్కరలు మిక్కిలిగా నుండుటయే కాక నన్నయకు నూఱు సంవత్సరములు పూర్వమం దుండిన యుద్ధమల్లుని శాసనములో నన్నియు మధ్యాక్కరలే యున్నవి. ఇటీవల నక్కరలు వాడుకలోనుండి తొలఁగుటయు క్రౌంచపదవృత్తము వాడుకలోనికి వచ్చుటయుఁ దటస్థించినది. నన్నెచోడుని కుమారసంభవమునం దక్కరలు లేక పోవుటయుఁ, గ్రౌంచపదవృత్తముండుటయు నతఁడు నన్నయకు మిక్కిలి తరువాతివాఁ డని స్థాపించుటకు గొప్ప కారణముగా నున్నది. కవిజనాశ్రయమునఁ జెప్పఁబడిన క్రౌంచపదలక్షణ మిది —

"పంచశరాభా! సంచితపుణ్యా! భమసభననయపరిమిత మైన
గ్రౌంచపదాఖ్యం బంచితమయ్యెన్ గ్రయయతివశవసుకలితముగాఁగన్"

మన నన్నెచోడకవి యీ తెలుఁగులక్షణమును పాటింపక విశ్రమవిషయమున

శీతకరోర్వీవాతశశాంకర్ యుగమితసురిపురనివహదకదెయోళ్
భూతగణేశం భూశశరాశా గజదొళె యతిగళుమెసెదిరె పెసరిం
నీతియుతేకేళ్ నాతిశయోక్తిక్రమదొళెనెగళ్దుదిదతిశయరచనో
పేతము శేషోర్వీతళకం క్రౌంచపద మిదతిశయపదరచనెగళిం"

అను కన్నడలక్షణము ననుసరించెను. ఇది నాగవర్మఛందోంబుధిలోని క్రౌంచపదలక్షణము ఈ నాగవర్మ సుమారు ౯౫౦ వ సంవత్సరము నాటి వాఁడు. తెలుఁగులక్షణములోని కడపటి యగణమునకు బదులుగా కన్నడ లక్షణములో నగ మున్నది. కడపటి నగణములోని తుది రెండు లఘువుల నొక గురువునుగాఁ జేసినయెడల నది తెలుఁగులక్షణముతో సరిపోవును. సుప్రసిద్ధకర్ణాటకలక్షణకర్త యయిన యీ నాగవర్మ తాను వేఁగిదేశవువాఁడ నని తన ఛందోంబుధియం దీ క్రిందిపద్యములలోఁ జెప్పుకొని యున్నాఁడు—

క. జగదొళగిదొందుమిగిలెనె
నెగళ్దిర్దుదువేంగిపిషయమావిషయదొళా
గ్రగణితమెనె ప ప్తగ్రా
మగళొళమావేంగిపళుకరం సొగయిపుగుం　　౧

క. ఆవేంగిపళువినోళ్విభు
దేవసమానంవిదగ్ధనంబుజభవనం
తావగమొళ్గుణనిధియం
తీవసుధెయెశెనిసివెణ్ణమయ్యంనెగళ్దం.　　౨.

క. వేదదొళనుగతరెనిసువ
వేదగళొళ్నిపుణనాగినెగళ్దంగంభీ
రోదోన్నతెపరివేష్టిత
మేదినియొళ్ పెణ్ణమయనకలంకగుణం.　　౬.

ఈ నన్నెచోడకవి మన వా రనుకొన్నంత పూర్వుఁడు కాకపోయినను గొంత పూర్వుఁడే యయి నన్నయభట్టునకు, తిక్కనసోమయాజికిని నడిమి కాలమునం దుండినవాఁ డయి నన్నయభట్టారకుఁడు బ్రాహ్మణకవులలో నగ్రగణ్యుఁ డయినట్టే రాజకవులలో నగ్రగణ్యుఁ డయియున్నాఁడు. ఇతఁడు ౧౧౫౦-వ సంవత్సరప్రాంతమునుండి దాదాపుగా ౧౧౬౦-౭౦-వ సంవత్సరప్రాంతముల వఱకు నుండి యుండును. ఈతని కవిత్వము మొత్తముమీఁదరసవంత మయి యసాధారణధార కలదయి హృదయంగమ

మయి యున్నది ఇతఁడు నాచనసోమనాథాది మహాకవులతోఁ దులఁదూగఁ దగినవాఁడు గాని సాధారణుఁడు కాఁడు ఈతని కవిత్వమునందు క్త్వార్థక సంధులు మొదలైన కొన్నియల్పదోషము లున్నవి కాని యవి రత్నాకరములోని నత్తగుల్లలవలె నంతగాఁ బాటింపఁదగినవి కావు. కన్నడభాషాపద సమ్మేళనము మాత్రము శ్లాఘ్యము గాదు *

సీ. పింఛాతపత్రముల్ పెనఁగి మరుద్వీథిఁ
గార్కొను నీలమేఘములు గాఁగ
వివిధభూషారత్న వివిధాంశుజాలముల్
సదమలాఖండల చాపములుగ
ఘనవీధిఁ బొలసాడు ఖచరాంగనాపాంగ
తరళాక్షిరుచులు సౌదామనులుగ
సింధురోన్నతకరశీక రాసారముల్
ధారుణిఁ గురియు నాసారములుగ

ఆ వె. సంచితంబులైన పంచమహాశబ్ద
రవము లులియ మేఘరవము లెసఁగ
హరుఁడు వచ్చె రజతగిరి కుమాన్వితము గ్రొ
క్కారులీలఁ గరము గారవమున [ఆ. ౯-౧౪౧]

అను నవమాశ్వాసములోని యీ పద్యమునందు "పొలసాడు" అనియు,

చ. 'నిజవదనామితాసితమణీకచనీలవిభాతివాహన
ద్విజవరబర్హిబర్హవితతిం దొడరాడి సముల్లసిల్లన
త్యజితవిలాసలీల విజయధ్వజ మంబరవీథిఁ గుక్కుట
ధ్వజముఁ బెనంగఁ బొల్పెసఁగి వచ్చెను మహేశ్వరసూతి ప్రీతితోన్.
[ప 203]

[ * అట్టివి కన్నడపదము లనుటకంటె — అప్పు డాంధ్రభాషలో వ్యవహారమునమన్న పదములే యని యనుకొనవచ్చును.]

అను ద్వాదశాశ్వాసములోని పయి పద్యమునందు "తొడరాడి" అవియుక్త్యార్థకసంధులు గానవచ్చుచున్నవి. *

క. ఏసియు వైచియుఁబొడిచియు
వేసర కొండొరులఁ బట్టి విడువక కేశా
కేశిఁ బెనంగుచుఁ బోర మ
హాసురముగఁ బోరి రా సురాసురవీరుల్.' [ప. ౧౬౮]

అను ద్వాదశాశ్వాసములోని పద్యమునందు శసప్రాసము వేయఁబడినది.

చ. 'పుడమిపుడున్ ధనాఢ్యుఁడునుభూరిబలుఁడునుశౌర్యవంతుఁడున్
గడుదృఢపాణిపద్ముఁడును గాక యొడంబడ దశ్వమేధ మిం
దడరఁగ జేయఁ దన్మఖమునందులపుణ్యఫలంబు లందఁగా
నడుగడుగశ్వమేధ మనునాజిమొనం జని చావు నేగియే. [ప ౪౪]

అనెడి యేకాదశాశ్వాసపద్యములో "పుడమిపుఁడున్" అని గ్రామ్యపద ప్రయోగము చేయఁబడినది

చ. అరుణజలంబు లాడి తురగాజినవస్త్రము లర్థిఁ గట్టి భీ
కరకరిదానకర్దమము కస్తురిగాఁగ నలంది వీరహృ
త్సరసిరుహంబు లోలి నవతంసవిభూతిగఁ దాల్చి చాల న ♦
చ్చరువుఁ బిశాచకాంతలు పిశాచములందవిలించి రొప్పులన్.
[ఆ: ౧౧-౨౦౨]

అను పద్యములో నచ్చెరు వని యుండవలసినదాని నచ్చరు వని యపశబ్దము వేయఁబడినది.

ఈ కవి చేసిన గ్రంథములు రెండు అం దొకటి కుమారసంభవము, రెండవది కళావిలాసము. కాళిదాసుఁడు చేసిన కుమారసంభవము గాక యుద్భటుఁ

[* ఇట్టివి శబ్దపల్లవములైనఁ గావచ్చును. క్త్వార్థకములని యనుకొన్నను-అట్టివాని సంధిని పెక్కు రామోదించి యున్నారు.]

[♦ నచ్చరువ - పాఠము. అచ్చరువు 'అచ్చెరువు' నకు రూపాంతరము కాని అపశబ్దము కాదు.]

డను కవి సంస్కృతమున వేఱొక కుమారసంభవమును జేసినట్టు కవి యీ క్రింది పద్యమునఁ జెప్పి యున్నాఁడు

క. క్రమమున నుద్భటుఁడు గవి
త్వము మెఱయఁ గుమారసంభవము సాలంకా
రము గూఢవస్తుమయకా
వ్యముగా హరులీల చెప్పి హరు మెప్పించెన్. [ఆ. ౧-౨౧]

ఈ రెండు కుమారసంభవములను జదివి కావలసినచో వానినుండి కథను గైకొనుచు తనమనసు వచ్చినట్టు మార్చి పెంచి సురుచిర వర్ణనాలంకారబంధురముగా నన్నెచోడుఁ డీ యాంధ్రకుమారసంభవమను కావ్యమును రచించెను ఇందు పండ్రెండాశ్వాసములు గలవు; ఈ పండ్రెండాశ్వాసములలోను సుమారు రెండువేల పద్యము లున్నవి ఇది తన పరమార్థవిద్యాగురు వైన జంగమ మల్లికార్జునయోగి కంకితము చేయఁబడి నది ఆశ్వాసాద్యంతపద్యములలోఁ గొన్నిచోట్ల నతఁడు శివుని కభేదముగా వర్ణింపఁబడుటయే గాక గ్రంథమధ్యమునందు సహిత మీ పద్యములలో నట్లే విరుద్ధముగా వర్ణింపఁబడెను. *

చ. 'కమలదళాక్షి చాలఁ బమకంబునఁ గూర్చునిజేశుతోడఁ జి
త్తము దనివోవఁగా బహువిధంబులఁ గూడిన హృద్గతానురా
గము వెలిఁ జేర్చెనో యన నఖక్షతచుంబనరంజితాంగవి
భ్రమగతి వచ్చి చూచె నొకభామిని జంగమమల్లికార్జునున్.

గీ. మగువ జంగమమల్లయఁ దగిలి చూచి
యంద కన్నులు మనసును నంటి యున్న
నచలభావన నిల్చెఁ దా నట్ల పరము
నభవుఁ గని జను లచలాత్ము లగుట యరుదె.'

[ఆ ౮-ప. ౬౧-౬౨]

[* జంగమమల్లికార్జునుఁడు శివున కభిన్నుఁడని తలఁచినపుడు ఇట్టివర్ణన విరుద్ధమని భావింపనక్కఱలేదు.]

పురకాంతలు శివునిఁ జూడ వచ్చినసుటకు మాఱుగా యోగియైన జంగమ మల్లయను జూడ వచ్చి రనుట క్రొత్త యసంగతముగా నున్నదేమో ! ఈ కవి శృంగారవర్ణనమునం దత్యాసక్తి కలవాఁడు ఇతఁ డష్టమాశ్వాసములో విటాభిసారికాలంజికాదుల నేఁబది పద్యములకుఁబై నెక్కుడుగా వర్ణించెను. కవికవిత్వశైలి తెలియుటకై యీతని గ్రంథములనుండి కొన్నిపద్యముల నుదాహరించుచున్నాను.

## ౧. కుమారసంభవము.

చ. అతని శరాసనంబు కనకాచల, మిక్షుశరాసనంబు నీ,
కతనికి నమ్మ పాశుపత, మంటిరఁ గందెడు పువ్వుటమ్ము నీ,
కతఁడు పురాపహారి, విరహాతురపాంథజనాపహారి వీ,
వతనికి నీకు హ స్తిమశకాంతర మె మ్మెయి నెన్న చూచినన్.

[ఆ. ౪-౭౨]

సీ. బాల నీవేనలి కాలోరగంబని
మలయానిలంబు నీవలన రాదు
కమలాస్య నీకనుఁగవ చకోరము లని
వెన్నెల సొరదు నీయున్నయెడకు
నబల నీయెలుఁగు పికారావ మని నీకుఁ
జూతమ్ము కొమ్మలు చూప వెఱచుఁ
జపలాక్షి నీముక్కు చంపక మనుభీతి
నలులు నీపొడ గని యలయఁ బాఱు

వనిత నీకుఁ బ్రాణవల్లభుండై మది
నొలసె శివుఁడు పాయకుండు ననియొ
పేదమరుశరములు నీదెశ రా నోడు
వీని కేల నీవు వెఱచె దమ్మ.

[ఆ. ౫-౧౬౫]

ఉ. గంధగజాసురారిఁ బురకాయజకాలబల ప్రహారి ను
గ్రాంధకహారిఁ దీ వ్రగరళాయతవహ్నివిహారి దేవతా

సింధుజలౌఘధారి సురసిద్ధమునీంద్రగణోపకారి ను
ద్బంధవిదారి నోఁబలుక బ్రాహ్మణనీవధికారివే మహిన్. [ఆ ౭-౨౮]

సీ. దుగ్ధాంబునిధి నిట్టఁ దోఁచెనో యని శేషుఁ
డాన్పుగా హరి నీటఁ బవ్వడింపఁ
నాదవి సుధారస మువ్పొంగెనో యని
దేవతల్ దనివోవఁ ద్రావఁ దలఁపఁ
దొలఁకాడుమిన్నేఱు వెలివిరిసెనో యని
లీల సురాంగన లోలలాడఁ
బాదరసం బుర్విఁ బరఁగెనో యనిసిద్ధ
నికరంబు కలశముల్ నించి కొనఁగఁ
బాండురాంగుండు విశ్వరూపంబుదాల్చి
యెలసెనో యని సద్భక్త లెలమిఁ గొలువ
నఖిలజీవుల కానంద మతిశయిల్ల
నచ్చవెన్నెల విమలమై యలరి కాసె. [ఆ. ౮-౧౧౮]

ఉ బాలకుఁ బట్టియే సురలు బల్విడి నాపయి నెత్తి రింతయే
నేలిదమైతినే తమకు నెన్నఁడు మద్భుజవిక్రమక్రమా
భీలకరాళఖడ్గవరభీషణవేషము చూచి నేలపైఁ
గాలిడి నిల్తురే యనికిఁ గ్రమ్మఱ వత్తురె వృత్తి నొత్తురే.
[ఆ ౧౦-౨౪౯]

౨. కళావిలాసము *

సీ. పృథులవిశ్వంభరారథమున కెదురుగాఁ
బూన్పించె నెవ్వాఁడు పువ్వుఁదేరు

* ఈపద్యములు శ్రీరామకృష్ణకవిగారి కుమారసంభవపీఠికనుండి గ్రహింపఁబడినవి. లక్షణగ్రంథములయం దుదాహరింపఁబడిన కొన్ని పద్యములె కాని పుస్తకము సమగ్రమముగా నెవ్వరికిని లభింపలేదు. అందుచేత నీ యాంధ్రకళావిలాసము క్షేమేంద్రుని సంస్కృతకళావిలాసముతో నెంతవఱకు సంబంధించి యున్నదో తెలిసికొనుట శక్యముకాదు.

కాంచనాచలకార్ముకమునకు సాటిగాఁ
జేపట్టె నెవ్వాఁడు చెఱకువిల్లు
నవిరళపాశుపతాస్త్రమ్మునకు వాఁడి
మిగిలించె నెవ్వాఁడు చిగురుఁదూపు
నతులితామరదానవాదిబలంబుల
గెలిపించె నెవ్వఁ డయ్యళిబలంబు

నట్టిజగజెట్టి మన్మథుం డఖిలలోక
ములకు వెఱగొంగ జీవులమూలకంద
మతనియిలుఁ జొచ్చి వెడలనియతఁడు గలఁడె
యతనియమ్ములఁ బడకున్నయదియుఁ గలదె.

చ. తొడవులు వెట్టు సంభ్రమముతోఁ దిలకించు మడుంగు గట్టుపైఁ
బడ దడ వోప దింపెఱిఁగి పట్టుదు నేర్పులు గట్టి పెట్టుఁ బ
ల్కెడు నెడఁదొ ట్రుపాటొదవుఁగింకకుఁ జేగిలుమన్నమర్పఁగాఁ
జిడుముడిఁ బొందుఁ గొంత పతిచేరినఁగూరిమి గల్గెనేనియున్.

# ప్రతాపరుద్రుఁడు

ఇతఁడు ౧౧౧౬-వ సంవత్సరము మొదలుకొని ౧౧౪౦-వ సంవత్సరము వఱకును రాజ్యపాలనము చేసిన కాకతిప్రోలరాజుపుత్రుఁడు; సుప్రసిద్ధుఁడయిన తిక్కనసోమయాజికాలములో నుండి ౧౧౯౯-వ సంవత్సరమునుండి ౧౨౬౦ వఱకును ప్రజాపాలనము చేసిన గణపతిదేవుని పెదతండ్రి. ఓరుగంటి ప్రతాపరుద్రుఁడని సాధారణముగా పిలువఁబడెడు వేఱొక ప్రతాపరుద్రుఁడు రుద్రమదేవిమనుమఁడు ౧౨౯౫ మొదలుకొని ౧౩౨౧ వ సంవత్సరమువఱకును కాకతీయరాజ్యపరిపాలనము చేసినవాఁడుండినందున భేదము తెలియుటకయి చరిత్రకారు లితనిని ప్రథమ ప్రతాపరుద్రుఁడందురు. ఈ ప్రతాపరుద్రదేవమహారాజు ౧౧౪౦-వ సంవత్సరము మొదలుకొని ౧౧౯౫-వ సంవత్సరమువఱకును నేఁబదియైదుసంవత్సరములవిచ్ఛిన్నముగా రాజ్యపరిపాలనముచేసెను. ఇతఁడనేకరాజులను జయించి తన రాజ్యమును నానాముఖములు వ్యాపింపఁజేసెను. ఇతఁడు పరాక్రమవంతుఁడగుటయే కాక విద్యావంతుఁడుకూడ నయి తాను శైవమతస్థుఁడగుటచేత ముఖ్యముగా శైవకవుల నాదరించుచు వచ్చెను. బసవపురాణాది వీరగ్రంథములను రచించిన పాల్కురికి సోమనాథుఁ డీతనికాలములో నుండి యీతనివలన నగ్రహారాదులను బడసెను. ఈతఁడు కవులను ప్రోత్సాహపఱుచుచు వచ్చుటయే కాక తాను గూడ కర్ణాటకాంధ్రసంస్కృతభాషలయందుఁ బాండిత్యము కలవాఁడయి విద్యావిభూషణుఁడని పేరు వడసి స్వయముగా కవిత్వము చెప్పుటయందు సమర్థుఁడయి యుండెను. ఇతఁడు సంస్కృతమున నీతిసార మనెడు గ్రంథమును రచించినట్టు బద్దెనకవి తన నీతిశాస్త్రముక్తావళిలో నీ క్రిందిపద్యమునఁ జెప్పెను.

చ. 'పరువడి నాంధ్రభాషఁగల బద్దెనీతియుసంస్కృతంబులోఁ
బరఁగ బ్రతాపరుద్రనరపాలునిచే రచియింపఁబడ్డ యా

నరవరు నీతిసారము వినం జదువం గడు మంచి దంచుఁ జె
చ్చెరఁ గవినీతిపద్ధతులు చేసె వినోదము బాలబోధకున్.'

నీతిశాస్త్రముక్తావళిని ముద్రించిన శ్రీయుత మానవల్లి రామకృష్ణ కవిగారు ప్రతాపరుద్రుఁడు సంస్కృతముననే కాక తెనుఁగునఁగూడ నీతిసారమును రచించినట్లు చెప్పి దానిలో నుండి పెక్కు పద్యముల నుదాహరించిరి వానిలో నుండి కొన్నిపద్యముల నెత్తి యిందు క్రిందఁ బొందుపఱుచున్నాను.

క. 'ఆపదలఁ జెందుప్రజలను
భూపతి మొదలిచ్చి మగుడఁ బ్రోవఁగఁ జనుఁ దాఁ
జేపట్టి విడువవలవదు
భూపతికిఁ గుటుంబ మగుఁగ భూమియ కాదే

గీ ఎంత పొదలి యున్న నేరండమూలు జీబు
గులును దారుకృత్యములకు నగునె?
యితరు లెందఱైన నేలిక కధికులై
చేయు పనులు పూని చేయఁగలరె?

క. దూరము వ్యవసాయకులకు
భారంబు సమర్థులకును భాసురవిద్యా
పారగులకును విదేశము
వైరము ప్రియవాదులకును వసుమతిఁ గలదే?

గీ. విమతులా వెఱింగి వెఱ పేది తొడరుట
మిడుత లగ్గిమీఁదఁ బడినయట్లు
తోడు లేక యధికుఁ దొడరుట యంబుధిఁ
గలము లేక యీఁదఁ గడఁగినట్లు.

ఉ కొందఱు మేలమాడుటలుఁ గొందఱి వావులుదీర్చి పిల్చుటల్
కొందఱు ముద్దుచేయుటయుఁ గొందఱి నెయ్యపుఁ జూపుచూచుటల్

కొందఱి నాత్మభావమునఁ గొందఱి మన్నన భృత్యులందు ని
ట్లందఱి నన్నిభంగుల నృపాగ్రణి వశ్యులఁ జేయఁగాఁదగున్.'

ఈ ప్రతాపరుద్రుఁడు క్రీ. శ. 1158 నుండి 1195 వఱకును రాజ్యమును బాలించెననియు, మడికి-సింగన్న 'సకలనీతి సమ్మతము' లో నీతి సారమును పేర్కొనినను, కర్తపేరు తెలుపలేదనియు, ఈ ప్రతాపరుద్రుని సంస్కృత 'నీతిసారము' ను ముద్దరాజు రామన్న తన రాఘవ పాండవీయ వ్యాఖ్యలో నుదాహరించెననియు తెనుఁగు కవుల చరిత్ర' లోఁ గలదు.]

# పాలకురికి సోమనాథుఁడు

పాల్కురికి సోమనాథకవి తాను భృంగిరిటగోత్రుఁడును, గురులింగపుత్రుఁడును, * అయినట్లు 'అనుభవసారములో' లో నీ క్రిందిపద్యమునఁ జెప్పుకొన్నాఁడు.

క. 'భృంగిరిటగోత్రుఁడను గురు
   లింగతనూజుఁడ శివకులీనుఁడ దుర్వా
   సంగవివర్జితచరితుఁడ
   జంగమలింగ ప్రసాదసత్రాణుండన్.'

ఈ కవి ప్రతాపరుద్రుని కాలమునం దుండెను. ఈ కవికాలమునం దుండిన ప్రతాపరుద్రుఁడు క్రీ శ. ౧౨౯౫-వ సంవత్సరము మొదలుకొని ౧౩౨౧వ సంవత్సరమవఱకును రాజ్యము చేసిన ద్వితీయప్రతాపరుద్రుఁడు గాక ౧౧౪౦ సంవత్సరము మొదలుకొని ౧౧౯౬ వ సంవత్సరమువఱకును భూపరిపాలన మొనర్చిన ప్రథమప్రతాపరుద్రుఁడయి యున్నాఁడు. ఈ కవి సంస్కృతాంధ్రగ్రంథములను మాత్రమే గాక విశేషముగా కన్నడగ్రంథములను గూడ రచించెను. ౧౨౨౨ వ సంవత్సరమునం దుండిన కన్నడకవి యగు సోమరాజు తన యుద్భటకావ్యములో "సముదంచద్వృషభస్తవామరమహీజారామనం సోమనం" అని పాల్కురికి సోమనాథుని పూర్వకవినిగా స్తుతించి యుండుట చేతను, ౧౧౬౮ వ సంవత్సరమునందు మృతి నొందిన బసవనకు సోమన శిష్యపుత్రుఁ డగుటచేతను, ఈ నడిమి కాలమునం దుండిన పాల్కురికి సోమనాథుఁడు బసవనకు తరువాత ముప్పదేండ్లకనఁగా ౧౧౯౫ వ సంవత్సరప్రాంతమునం దుండినట్టు చెప్పవచ్చు నని కర్ణాటక కవిచరిత్రము చెప్పుచున్నది ౧౧౯౬ వ సంవత్సరమువఱకున్న

---

* సోమనాథుని తండ్రి విష్ణురామదేవుఁడు; తల్లి శ్రియాదేవి. ఈ సంగతి 'బసవపురాణము' ను బట్టి తెలియుచున్నది. లింగార్యుఁడీతని గురువు. తండ్రికాఁడు,

మహీపాలనము చేసి పరలోకగతుఁడైన ప్రతాపరుద్రునికాలములో నుండి యాతనిచేత నగ్రహారములు మొదలైనవి బహుమతులుగాఁ బడసెను గనుకను, తన కాలములోనే తన శిష్యపుత్రులు కూడ నుండవచ్చును గనుకను, సోమనాధుని మఱికొంతవెనుకకు జరపి ౧౧౯౦-వ సంవత్సర ప్రాంతములం దుండె నని నేను చెప్పుచున్నాను.

శ్లో 'గురులింగార్యస్య దయాహస్తగర్భసముద్భవః
బసవేస్య తనయః బసవేశ్వరగోత్రకః ॥
బసవేశభుబిష్యాత్మభవో బసవకింకరః।
శ్రీమత్పాల్కుర్కిసోమేశనామాహం సర్వవిత్తమః ॥
పండితారాధ్యచరితాలంకృతాం కృషి మారభే।
తత శ్శృణు నతామాత్యసూరనామాత్యశేఖర ॥

అని పండితారాధ్యచరిత్రమునందు సోమనాధుఁడు తన్నుఁ గూర్చి చెప్పుకొని యున్నాఁడుఁ దీనినిబట్టి సోమనాధుఁడు లింగార్యుని ఛాత్రుఁ డయినట్టును; బసవేశునిపుత్రుఁ డయినట్టును గనఁబడుచున్నాఁడు మనలో గురువులును జనకులుగానే భావింపఁబడుదురు గనుక ననుభవసారమునం దా యర్థముననే చెప్పఁబడెనేమో। భారతమునందలి యీ పద్యార్థమును జూడుఁడు.

మధ్యాక్కర

'తనర జనకుండు నన్నప్రదాతయును భయత్రాత
యును ననఁగ నింతులకు ముప్వ రొగి నయిరి గురువు;
లనఘ! యుపనేత మఱియు నిరంతరాధ్యాపకుండు
ననఁగఁ బురుషున కియ్యేవు రనయంబు గురవు లైరి.'

కాఁబట్టి యితనికాల మిప్పటి కేడువందల యిరువది సంవత్సరము లని చెప్పవచ్చును. ఈతఁడు వీరశైవుఁడు; శైవమతగ్రంధముల ననేకము లను రచియించెను. ఈ సోమనాథకవి రచియించిన తెనుఁగు గ్రంథములలో ద్విపదరూపమున నున్న పండితారాధ్యచరిత్రమును, బసవపురాణమును

ప్రధానములు వీనిలో బండితారాధ్యచరిత్రము శ్రీనాథుఁడును, బసవపురాణమును పిడుపర్తి సోమనార్యుఁడును, పద్యకావ్యములనుగాఁ జేసిరి

ఒకనాఁడు ప్రతాపరుద్రుఁ డోరుగల్లుపురమున శివాలయమునకుఁ బోయి నప్పుడు శైవులు మండపముమీఁదఁ గూరుచుండి పాల్కురికి సోమనారాధ్య కృత మయిన బసవపురాణమును వినుచుండిరి. వారిని జూచి రాజది యే'మని యడుగఁగా వెంట నున్న ధూర్తబ్రాహ్మణుఁ డొకఁడు "మొన్న నీ నడుమను పాల్కురికి సోమపతితుఁడు మధ్యవర్ళ్ళ పెట్టి యల్లిన యప్రమాణ బసవద్విపదపురాణ పఠన" మని పలికెను. అందుమీఁద శివ భక్తులు పోయి పొరుగూర నున్న సోమనారాధ్యున కా వృత్తాంతమును దెలుపఁగాఁ బ్రతివాదులను జయించుటకయి బయలుదేఱి యతఁ డోరుగల్లు పురమునకు శిష్యబృందముతో వచ్చెను అతనిరాక యెఱిఁగి యేకశిలా నగరమునందలి బ్రాహ్మణధూర్తు లాతని నవమానించుటకయి యా యూర నుండు మత్తు లయిన మొండివాండ్రు మొదలయినవారికి విభూతిరుద్రా క్షాదులు పెట్టి శిష్యబృందమునువలె వారి కెదురుగాఁ బంపిరి. * తరువాత సోమనార్యుఁ డా పురిఁ బ్రవేశించి ప్రతిపక్షులతో వాదించి గెలిచి రాజాను గ్రహము సంపాదించి కొంతకాల మా యూర నుండి, ప్రతాపరుద్రుని మంత్రియు, సోమనార్యుని శిష్యుఁడు నగు ♦ నిందుటూరి యన్నయా మాత్యునిసాహాయ్యమున దొంకిపర్తి మొదలయిన కొన్ని గ్రామములను బడసి శిష్యుల కిచ్చి, తా నాపట్టణము విడిచి కలికె మను గ్రామమునకుఁ బోయి యచ్చట శివసాయుజ్యమును పొందెను. ఈ యంశములు కొండపీటి చరిత్రము వలనను, బసవపురాణపద్యకావ్యపీఠికయందలి యీ క్రింది పద్యా దుల వలనను దెలిసికోవచ్చును.

సీ. ఒకనాఁడు శివభక్తు లోరుగంటను స్వయం
భూదేవుమండపమున వసించి

[* సోమనాథుని మహత్త్వవలన అవి యథార్థములే యయి, ఆవేషధారులా పిదప సోమనాథునికి శిష్యులైరఁట !

♦ ఇతఁ డిందులూరి-అన్నయమంత్రి.]

బసవపురాణంబు పాటించి వినువేళ
హరునిఁ గొల్వఁ బ్రతాపుఁ డచటి కేఁగి
'యీ సంభ్రమం బేమి' యనుడు భక్తులు బస
వనిపురాణం బర్థి వినెద రనిన
విన నా పురాణంబువిధ మెట్లొకో యన్న
ధూర్తవిప్రుఁ డొకండు భర్తఁ జేరి

'పాలకురికిసోమపతితుఁ డీ నడుమను
పెనఁచె మధ్యవళ్ళు పెట్టి ద్విపద
యప్రమాణ మిది యనాద్యంబు పద' మన్న
నరిగె రాజు భక్తు లది యెఱింగి.

* * * * *

ఉ. వారలు వచ్చురాక పరవాదు లెఱుంగియు నేవ పుట్టి నా
యూర వసించు ముక్కడుల నున్మదవృత్తుల మొండివారలన్
జేరఁగఁ బిల్చి చంద్రధరచిహ్నిత దేహులఁ జేసి యందఱన్
బోరన మీ రెదుర్కొనఁగఁ బొండని పంచిన దుండగంబునన్.'

పాల్కురికి సోమనార్యుఁడు బసవపురాణము, పండితారాధ్యచరితము, అనుభవసారము, చతుర్వేదసారసూక్తులు సోమనాథభాష్యము, రుద్రభాష్యము, బసవరగడ, గంగోత్పత్తిరగడ, సద్గురురగడ, చెన్నమల్లుసీసములు, నమస్కారగద్యము, వృషాధిపశతకము మొదలయిన గ్రంథములు రచియించి నట్లు బసవపురాణపద్యకావ్యమునం దీ క్రింది పద్యమునఁ జెప్పఁబడినది.

సీ. బసవపురాణంబు పండితారాధ్యుల
చరితంబు ననుభవసార మును చ
తుర్వేదసారసూక్తులు సోమనాథభా
ష్యంబు శ్రీరుద్ర భాష్యంబు బసవ

రగడ గంగోత్పత్తిరగడ శ్రీబసవాఢ్య
రగడయు సద్గురురగడ చెన్న
మల్లుసీసములు నమస్కారగద్య వృ
షాధిపశతకంబు నక్షరాంక

గద్యపద్యము లైదు పంచప్రకారగద్య
యష్టకము పంచకము నుదాహరణయుగ్మ
మాది యగు కృతు లుక్తిహితార్థబుద్ధిఁ
జెప్పె నవి భక్తసభలలోఁ జెల్లుచుండు.

ఈ కవి గ్రంధములలో బసవపురాణము, పండితారాధ్యచరిత్రము, అనుభవ సారము తెలుఁగు, అన్యవాదకోలాహలము, బసవనపంచగద్య. సోమనాథ భాష్యము, సంస్కృతము; తక్కినవి కన్నడము *

[ * సోమనాథుఁడు ౧౦ తెలుఁగు గ్రంథములను, ౧౦ సంస్కృత గ్రంథములను, ౪ కన్నడ గ్రంథములను రచించెనని 'ఆంధ్రకవి తరంగిణి' లోఁ గలదు.

ఆంధ్రగ్రంథములు - బసవ పురాణము, పండితారాధ్య చరిత్రము, మల్లమదేవీ పురాణము, సోమనాథ స్తవము, అనుభవసారము, చెన్నమల్లు సీసములు, వృషాధిప శతకము, చతుర్వేదసారము, బసవోదాహరణము, బసవరగడ

సంస్కృత గ్రంథములు - సోమనాథ భాష్యము, రుద్ర భాష్యము, వృషభాష్టకము, బసవోదాహరణము, అష్టోత్తర శతనామ గద్యము, నమస్కార గద్యము, పంచప్రకార గద్యము, అక్షరాంక గద్యము.

కన్నడ గ్రంథములు - బసవరగడ, బసవాఢ్యరగడ, సద్గురురగడ గంగోత్పత్తి రగడ-ఇయ్యవి తెనుఁగుకృతులో, కర్ణాటకృతులో చెప్పఁజాలమని శ్రీబండారు తమ్మయ్యగారు వ్రాసిరి. రగడలు తెలుఁగు సంప్రదాయమునకు సంబంధించినవను నాశయమున, శ్రీ తమ్మయ్యగా రట్లనియుండ వచ్చును.

'అక్షరాంక గద్య' నేకాక 'అక్షరాంక పద్యము'లనుగూడ సోమనాథుఁడు వ్రాసెననియు' 'శీల సంపాదనము, శివగణ సహస్రనామము' నను రెండు కన్నడ కృతులనుకూడ ఈతఁడు రచించెననియు, శ్రీ వేంకటరావుగారు తమ 'తెనుఁగు కవుల చరిత్ర' లో వ్రాసియున్నారు.

ఈ రచనలలో మొదటిది 'అనుభవ సార' మనియు, అది నన్నయభట్టు కవితా సంప్రదాయముల ననుసరించినదనియు, శైవకవితా సంప్రదాయము లందు లేవనియు తెల్పుచు శ్రీ వేంకటరావుగారు తర్వాతి రచనలను క్రమముగా నిట్లు నిరూపించిరి— బసవపురాణము, వృషాధిప శతకము, గద్య కృతులు, పద్య స్తుతులు, చతుర్వేద సారము, భాష్య గ్రంథములు, సంస్కృత స్తుతులు, పండితారాధ్య చరిత్రము,

సోమనాథకృత మయిన బసవద్విపదను పద్యకావ్యమును గా రచింపు మని పిడుపర్తి సోమనాథకవితో నాతని తండ్రి బసవన్న చెప్పు సందర్భమున నిట్లనెను.

సీ. విరచించె జైమిని వేదపాదస్తవం
బొకపాదమునను వేదోక్తి నిలిపి
హరభక్తి వైదికం బని శ్రుతు లిడి చెప్పెఁ
బ్రతిభ సోమేశుఁ డారాధ్యచరిత
నరవి శ్రీనాథుఁ డాచరిత పద్యప్రబం
ధము చేసె ద్విపదలు తఱుచు నిలిపి
యాతండు పద్యకావ్యము చేసె నైషధ
మంచితహర్షవాక్యములఁ బెట్టి

సోమగురువాక్యములఁ బెట్టి భీమసుకవి
గరిమ బసవపురాణంబు గణనఁజేసె
గానఁ బూర్వకావ్యము చేరుగతి రచించు
వారి కాదికావ్యోక్తులు వచ్చు నెగడు.'

ఈ భీమకవిచేసిన బసవపురాణము కన్నడభాషలో. పాల్కురికి సోమనాథ విరచిత మయిన యనుభవసారమునుండి కొన్ని పద్యములఁ జూపి, తత్కృతములయిన బసవపురాణ పండితారాధ్యచరితములనుండి శైలిని సూచించు చిన్నభాగముల నుదాహరించి, యీ కవిచరితమును ముగించు చున్నాను.

అనుభవసారము

చ. 'మదిమ వహింప హేతువులుముప్పదియై మది నొప్పఁ బెంపునన్
మృదుమధురోక్తు లింపడర మెచ్చులు దీటుకొనంగ నర్థసం
పద దళుకొత్త సాంగముగఁ బామరు లుల్లము పల్లవింప న
ల్లైదురుభజింప భక్తి వలదే శివభక్తి కథాప్రసంగతిన్.

చ. అవిరళలింగపూజయు, నిరంతరసద్గురుభక్తియుక్తియుఁ
సవినయజంగమార్చనయు సత్యము శౌచము సచ్చరిత్రమున్

దవిలి ప్రసాదసేవయును దా నొడఁగూర్పక వట్టిమాటలం
దవునె యుదాత్తభక్తి సుగుణాకర ! శ్రీకర ! దోషిభీకరా !

శా. దానానేకమహాతపోనిచయసద్ధర్మౌఘతీర్థాఖిల
స్థానస్తోమజపవ్రత ప్రణుతయజ్ఞవ్రాతమంత్రోక్తని
త్యానుష్ఠానవితానమున్ సలుపు పుణ్యం బంతయుం గూడ నా
రాధ్యానాథాంఘ్రులఁ బూన్చు పుష్పజసహస్రాంశంబునుఁబోలునే.'

ద్వి. అనుచు నవ్వించుచు నవిరళభక్తి
జనితసుఖామృతవనధిఁ దేలుచును
బసవండు జంగమప్రకరంబుఁ దాను
నసలారనోలగంబై యుండె నంత
పెద్దలతేఁడు, పెన్నుద్దులమొదలు,
బుద్ధులప్రోక, విబుధనిధానంబు,
అమితవచోరాశి, సుమనోనురాగుఁ,
డమలినచిత్తుఁ, డుద్యద్గుణాన్వితుఁడు,
సకలవీణాప్రవీణకలావిదుండు,
అకలంకనాదవిద్యాపండితుండు. &c , బసవపురాణము

ద్వి. వేదవేదాంతాదివివిధపురాణ
వాదితకేవలభక్త వర్ధనుఁడు
పండితనతపాదపద్మండు సుకవి
మండలవిబుధసమాజపూజితుఁడు
ఆరూఢకీర్తికుండగు కోటిపల్లె
యారాధ్యులందు లోకారాధ్యమూర్తి
యసమతదీయలోకారాధ్యశిష్య
విసరాగ్రగణ్యుండు వీరవ్రతుండు
చనును "రుద్రో నాత్ర సంశయ" యనఁగ
జనియించినట్టి సాక్షాద్రుద్రమూర్తి &c , పండితారాధ్య చరిత్ర.

]వివాదాస్పదములైన కవిచరిత్రములలో సోమనాధుని చరిత్ర మొకటి. ఇతని జన్మస్థానమునుగూర్చియు, కులగోత్రములనుగూర్చియు, కాలమును గూర్చియు విభిన్నాభిప్రాయములు కలిగి వాదోపవాదములు ప్రబలినవి. ఈవిషయములంగూర్చి ప్రత్యేకగ్రంథములే వెలువడినవి. వాని సారాంశము మాత్ర మిచట తెలుపఁబడును.

సోమనాధుని నివాసము తెలంగాణాయందలి 'పాల్కుఱికి' యని పెక్కురు విమర్శకు లభిప్రాయపడియున్నారు. 'పండితారాధ్యచరిత్ర'ను పరిష్కరించి, విపుల విమర్శనమును వ్రాసిన శ్రీ చిలుకూరి నారాయణరావుగారు— మైసూరు రాష్ట్రములో తుముకూరు పరిసరముననున్న 'హాల్కుఱికి'యే సోమనాధుని జన్మస్థానమని తెలిపిరి. 'ఆంధ్రకవితరంగిణి' కారులు శ్రీ నారాయణరావుగారితో నేకీభవించిరి 'తెనుఁగు కవుల చరిత్ర'లో తెలంగాణాలో నేఁడు కానవచ్చు 'పాలకుర్తి'యే సోమనాధుని నివాసమగు 'పాల్కుఱికి' యని వివరింపఁబడి యున్నది.

సోమనాధుఁడు, తాను 'భృంగిరిటి' గోత్రుఁడనని చెప్పియుండెనే కాని కుల, గోత్రములను వివరింపలేదు కావున నీతఁడు బ్రాహ్మణేతరుఁడైన జంగముఁడని శ్రీబండారు తమ్మయ్యగారు వాదించుచున్నారు. శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు మున్నగు వారీతఁడు బ్రాహ్మణుఁడని నిరూపించి యున్నారు. 'పరంపరాయాతమగు జనశ్రుతినిబట్టి యీతఁడు కౌండిన్య గోత్రజుఁడని తెలియుచున్న' దని శ్రీ వేఁకటరావుగారు 'తెనుఁగు కవుల చరిత్ర' లో (పుట 324) వివరించిరి 'కులగోత్రముల ప్రసక్తి లేని వీరమాహేశ్వరాచారము స్వీకరించిన వెనుక, సోమనాధుఁడు తత్సంప్రదాయము ననుసరించి తా నీశ్వర కులజుఁడననియు, భక్తి గోత్రుఁడననియు, పార్వతీ పరమేశ్వరులు తల్లిదండ్రులనియు చెప్పుకొన్నాడు.' అని వేంకటరావుగారి యభిప్రాయము. దీనినే పెక్కురు విమర్శకులు సమ్మతించుచున్నారు

సోమనాధుఁడు తాను గురులింగ తనూజుఁడనని యనుభవసారమునఁ జెప్పియున్నను- తన తల్లిదండ్రులు రామవిష్ణుదేవుఁడు, శ్రియాదేవియని బసవ

పురాణమునఁ జెప్పుటవలన, గురులింగార్యుఁ డితని దీక్షాగురువనియు, అందు వలననే అతనిని జనకునిగా భావించెననియుఁ జెప్పవలసి యున్నది.

ఇతని కాలమునుగూర్చియు నభిప్రాయభేదము లున్నవి. బసవపురాణమును తొలుత పరిష్కరించి, విపుల విమర్శన వ్రాసిన శ్రీ వేటూరి-ప్రభాకరశాస్త్రి గారు సోమనాథుఁడు క్రీ. శ. 1190 నాఁటికేను ప్రసిద్ధుఁ డగుటచే బసవ పురాణ మా ప్రాంతముననే రచియింపఁబడి యుండుననియు తెల్పియున్నారు. శ్రీ బండారు తమ్మయ్యగారు క్రీ శ. 1160-1230 మధ్యకాలమున నీతఁ డుండెనని నిశ్చయించిరి. శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు క్రీ శ. 1190-1260,70 ల మధ్యకాలమున నీతఁడుండెనని నిర్ణయించిరి. బసవపురాణ రచనాకాలము క్రీ శ 1178 అని శ్రీ దేవరపల్లి-వేంకట కృష్ణారెడ్డిగారు తమ 'నన్నెచోడకవి చరిత్ర' లోఁ దెల్పి యున్నారు ఈ కాల మించుమించుగా ఓరుగంటిని పాలించిన కాకతిప్రోలరాజు పుత్రుఁడు మొదటి ప్రతాపరుద్రుని కాలమునకు సరిపోవును. సోమనాథుఁడు ఆ ప్రభువర్యుని సభలోనే ప్రతి వాదులను వాదమున నోడించి వీరశైవ మతమును స్థాపించి యున్నాఁడని పలువురి యభిప్రాయము.

శ్రీ మల్లంపల్లి-సోమశేఖరశర్మగారు శాసన ప్రమాణములు నాధారముగాఁ గొని బసవపురాణ, పండితారాధ్య చరిత్రములు క్రీ॥శ. 1290-1320 ల నడిమికాలమున రచింపఁబడినవనియు, సోమనాథుని కాలమదియే యనియుఁ దెల్పియున్నారు, ఇయ్యది రుద్రమదేవి మనుమఁ డగు ద్వితీయ ప్రతాప రుద్రుని కాలమునకు సరిపడును శ్రీ నేలటూరి-వేంకటరమణయ్యగారు శ్రీ చిలుకూరి నారాయణరావుగారు, శ్రీ సోమశేఖరశర్మగారి వాదమునే సమర్థించిరి. 'ఆంధ్రకవి తరంగిణి' కారులును, శతక వాఙ్మయ సర్వస్వము' ను రచించిన శ్రీ వేదము-వేంకట కృష్ణశర్మగారును పయి వాదమునె యనుసరించిరి.]

# రంగనాథుఁడు

రంగనాథుఁ డనునతఁడు రామాయణమును ద్విపదకావ్యమునుగా రచియించిన కవి. రంగనాథుఁడు తన గ్రంథమునం దాంధ్రకవుల నెవ్వరిని స్తుతింపక పోవుటచేత నీతఁడు నన్నయభట్టారకునికంటెను బూర్వుఁడని కొందఱు చెప్పుదురు గాని తగిన నిదర్శనములేవియుఁ గానరావు ద్విపదరామాయణము కృత్యాదిని "కవిలోక భోజుండు" అని బుద్ధరాజున కొక విశేషణము వాడఁబడినది. భోజరాజు శాలివాహనశకము ౧౦౨౧-వ సంవత్సరమునం దనగా హూణశకము ౧౦౯౯-వ సంవత్సరమునం దున్నట్లొక శిలాశాసనమువలనఁ దెలియవచ్చుచున్నది. పయి విశేషణమును బట్టి భోజుఁడు కవీంద్రుల నాదరించువాఁ డని దేశవిఖ్యాతి చెందిన తరువాతనే యీ గ్రంథము రచియింపఁబడుట స్పష్టము గనుక, కవి యీ రామాయణమును పండ్రెండవ శతాబ్దమునందో తరువాతనో చేసి యుండవలెను. పదుమూడవ శతాబ్దమునందు రచియింపఁబడిన ట్లొక కథవలన నూహింపఁదగి యున్నది. ఆ కథ భాస్కరునిచరిత్రమునందుఁ దెలుపఁబడును. ఇది కృష్ణామండలములోని మనుమూరి సంస్థానమునకు ప్రభువయి యుండిన * కోన విఠ్ఠలరాజుకొమారుఁడైన బుద్ధరాజు పేరుపెట్టి యీ కవి రచించినను, జనులు బుద్ధరాజరామాయణ మని పిలువక నేటివరకును దీనిని రంగనాథరామాయణమనియే వాడుచున్నారు. కవి బుద్ధరాజున కాశ్రితుఁడగుటయే కాక బంధు వనియుఁ జెప్పుదురు. అయినను దీని వాస్తవమును కనుఁగొనుట కాధారము లేవియు లేవు. ఒకవేళ రంగనాథుఁ డా రాజునాస్థానవిద్వాంసుఁడగు బ్రాహ్మణుఁ డైన నై యుండవచ్చును. ఆఱువేల నియోగి యైన కోవెల గోపరాజు రంగనాథుని నియోగికవులలోఁ జేర్చి యీ క్రిందిపద్యమునఁ జెప్పియున్నాఁడు.

---

* [గోన విఠలరాజు కాని కోన విఠలరాజు కాఁడు. కాన 'కోన' అనుచోట్ల నెల్లెడల 'గోన' అనుకొనవలెను ]

చ. 'అనఘు హుళక్కిభాస్కరు మహామతిఁ బిల్లలమఱ్ఱి పెద్దిరా
జును బినవీరరాజుఁ గవిసోముని దిక్కనసోమయాజిఁ గే
తనకవి రంగనాథు నుచితజ్ఞుని నెఱ్ఱన నాచిరాజుసో
మన నమరేశ్వరుం దలఁతు మత్కులచంద్రుల సత్కవీంద్రులన్.'

పూర్వలాక్షణికు లందఱును రంగనాథుని లాక్షణికకవినిగా నంగీకరించి యున్నారు. ఇప్పుడు ముద్రితమైన గ్రంథమునందుఁ గొన్ని ప్రక్షిప్తభాగములు కూడ చేరియున్నందున, అక్కడక్కడఁ గొన్ని వ్యాకరణదోషములు కానవచ్చుచున్నవి. కాని యవి కవివి కావనుట నిశ్చయము పుస్తకమునం దెక్కడను కవి పేరైనను లేకపోవుటయే కాక కాండముల యంతముల యందుఁగూడ,

ద్వి. 'అని యాంధ్రభాష భాషాధీశనిభుఁడు
వినుతకావ్యాగమవిమలమానసుఁడు
పాలితాచారుఁ డపారధీశరధి
భూలోకనిధి కోనబుద్ధభూవిభుఁడు
తమతండ్రి విఠ్ఠలధరణీశు పేరఁ
గమనీయగుణధైర్యకనకాద్రి పేర
బనిపూని యరిగండభైరవు పేర
నాచంద్రతారార్కమై యొప్పమీఱ
భూచక్రమున నతిపూజ్యమై వెలయు
నసమానలలితశబ్దార్థసంగతుల
రసికమై చెలువొందు రామాయణంబు
పరఁగ నలంకారభావనల్నిండఁ
గరమర్థి ......కాండంబు సెప్పె.'

అని కోన బుద్ధరాజు రచియించినట్లే వ్రాయఁబడియున్నది. అయినను బుద్ధరాజు తన్నును, దనకావ్యమును బొగడుకొన్నట్లున్నరీతినిబట్టి చూడఁగా పండితు లాత్మస్తుతిపరాయణులు కాఁజాలరు గనుక పుస్తకమును వేఱొకరు రచియించిరనియే యూహింపవలసి యున్నది.

రంగనాథరామాయణ మిప్పటి కేడు వందలసంవత్సరములక్రిందట రచియింపఁబడినది. కొందఱీ కవి కోనబుద్ధారెడ్డికాలములో దూపాడుపరగణా కథికారిగా నుండెననియు, బుద్ధారెడ్డి ప్రతాపరుద్రునికి లోఁబడిన సామంతరా జనియు, చెప్పుచున్నారు. ఆ ప్రతాపరుద్రుఁని గణపతిదేవుని తండ్రియైనపక్షమున, ఇప్పుడు చెప్పిన కాలము సరిగానే యుండును. అట్లుగాక యా ప్రతాపరుద్రుఁడు గణపతిదేవుని మనుమఁ డనెడి పక్షమున, కవి కాలము మఱి యఱువదేండ్లు తరువాత కావలసివచ్చును. అనేక హేతువులనుబట్టి యీ గ్రంథము మొదటి ప్రతాపరుద్రుని కాలములోఁ జేయఁబడినదే యైనట్టు నిశ్చయింపఁదగి యున్నది. ఈ మొదటి ప్రతాపరుద్రుఁడు ౧౨౦౦ వ సంవత్సరప్రాంతమువఱకును రాజ్యపాలనము చేసెను. బుద్ధారెడ్డికూతుఁరైన కుప్పమాంబ తన చరమవయస్సులో నావఱకే మృతుఁడైన తన భర్తపేర బూదపూరిలో (శాకాబ్దే వసునందశంకరమితే శ్రీధాతృసంవత్సరే) శకసంవత్సరము ౧౧౯౮ కి సరియైన క్రీ. శ. ౧౧౭౬ ధాతృసంవత్సరమున లింగప్రతిష్ఠ చేసి యనేకభూదానములు చేసి శాసనము వ్రాయించెను. ఈ కుప్పమాంబ కోన బుద్ధారెడ్డి కూఁతురని చూపుటకయి యా శాసనములోని యీ క్రింది శ్లోకము నుదాహరించుచున్నాను.

> 'శ్రీగోనవంశనిజ శేఖరబుద్ధయాఖ్య
> పుత్రీ పవిత్రచరితా భరితా గుణౌఘైః
> శృంగారసారకరణిః కరణీయదక్షా
> కుప్పాంబికాజని చ తస్య సతీ కళత్రమ్.'

రంగనాథరామాయణము రచియింపఁబడిన కాలమున కీమె పుట్టెనో లేదో. ఎట్లయినను రంగనాథరామాయణము ౧౨౩౦-౪౦ వ సంవత్సరప్రాంతముల యందు రచియింపఁబడి యుండును. ఇది తిక్కన యుత్తర రామాయణ రచనమున కిరువది ముప్పదియేండ్లముందు. తిక్కనపితామహుఁడైన మంత్రి భాస్కరుఁడు రామాయణమును రచించుటవలనఁ గాకపోయినను రంగనాథుఁడు రామాయణమును రచించుటవలన నైనను సోమయాజి పూర్వ రామాయణమును మాని యుత్తరరామాయణమును రచియించి యుండును.

రంగనాథుని కవిత్వము మృదుమధుర పదబంధయుత మయి శబ్దార్థాలంకారసంయుతమయి యన్వయకాఠిన్య విరహితమయి మనోహరముగా నుండును. కవిశైలితెలియుట కయి కొన్నిపద్యములను వ్రాసి యీతని చరిత్రము నింతటితో ముగించుచున్నాను.

ద్వి. 'నడురాత్రి యరుదెంచె నరలోకనాథ
కడు డస్సినాఁడవు కనుమోడ్తు గాక!
చలియింపకున్నవి సకలవృక్షములు,
మెలఁగవు వనభూమి మృగసమూహములు;
నెఱి విహంగంబులు నీడము లేచ్ఛెరి
మఱచియున్నవి తమ మంజులధ్వనులు;— బాలకాండము

ద్వి కోమలి కేకయకులమునఁ బుట్టి
యీ మాటలాడ నోరెట్లాడె నీకు?
అడవులపాలు కమ్మని రాముఁ ద్రోవ
నెడపక తొల్లి నీ కెగ్గేమి చేసె?
కౌసల్యకంటె నిన్ ఘనముగాఁ జూచు,
నీసేవ లొనరించు నీపంపుచేయు;
నెటువలెఁ బొమ్మంటివే దయమాలి?—అయోధ్యాకాండము

ద్వి. వ్రతములఁ గడు డస్సి వనటలఁ గుస్సి
యతిదుఃఖములఁ గుంది యాత్మలోఁ గంది
విపులాశ్రువులఁ దోఁగి విరహాగ్నిఁ గ్రాఁగి
కపటవృత్తులఁ జిక్కి కడముట్ట స్రుక్కి
జీవంబుపై రోసి చెలువంబుఁ బాసి
యా విధి మది దూఱి యలసత మీఱి
చెక్కిటఁ జేయి చేర్చి చింతల కోర్చి
దిక్కు లేమిఁ దలంచి ధృతి దూర డించి

యినరశ్మి వాడిన యెలదీగపోలె
ఘనధూమయుతదీపకళికయుఁబోలె
జలదమాలికలోని శశికళవోలెఁ
బలుమంచుపొదవిన పద్మినివోలెఁ
జెలఁగి పిల్లులలోని చిలుకయుఁబోలెఁ
బులులలో నావునుబోలె దుర్వార
ఘోరరాక్షసవధూకోటిలో నున్న
నారీశిరోమణి నలినాయతాక్షి — సుందరకాండము.

ద్వి. కృతకృత్యుఁ డగు రాముకీర్తిపుష్పములు
చతురతమై వెదచల్లినయట్లు
కర మొప్పఁ జుక్కలు రాణించె నంతఁ
జిరకాలములసీమ శిశువులమామ
పొలుపొందు కలువలపోరానివిందు
కలసిన జక్కవకవఁ బాపుమందు
పాలవెల్లిని ద్రచ్చి పడసినవెన్న
శూలియౌదలపువ్వు చుక్కలనవ్వు
నెరిచకోరములకు నెలనెలపంట
యురవేది విరహుల నుడికించు మంట
గగనంబుతోడపు కొంగఁగుంచెడిగులు
నొగి నబ్ధిఁ బొంగించు నూఱటఁబట్టి
హరిహరబ్రహ్మలయానందవృష్టి
సరసిజరిపుఁడైన చంద్రుఁడు పొడిచె. — యుద్ధకాండము.

[ఈ రంగనాథునిఁగూర్చియు, ద్విపదరామాయణకర్తృత్వమునుగూర్చియు వాదవివాదములు అభిప్రాయభేదములును వెలసినవి. రామాయణమున రంగనాథుని పేరు లేకున్నను, అతని పేరనే వాడుకలో నున్నందున నతఁడే రామాయణకర్తయని కొందఱు విమర్శకులు నమ్ముచున్నారు. ఈ రంగ

నాధుఁడే చక్రపాణి రంగనాథుఁడు. తొలుత వైష్ణవుఁడు వైష్ణవుఁడుగా నున్నపుడే రామాయణమును రచించెను.

ఇతఁడు వీరశైవుఁడగు పాలకురికి సోమనాథునితో వాదింపఁబోయి—ఆతఁడీతనిం జూడ నిష్టపడకపోఁగా, సోమనాథుని కుమారుఁడగు చతుర్ముఖ బసవేశ్వరునితో వాదించి, యోడిపోయి శ్రీశైలమార్గమునఁ బోవుచు, మల్లికార్జునస్వామిని జూడకుందున కన్నులు కానరాకుండఁబోయెననియు, నీతఁ డహోబలమునకుఁబోయి నరసింహదేవుని బ్రార్థింపఁగా నాతఁడు స్వప్నమునఁ గానవచ్చి శివద్వేషము తగదని బోధించెననియు, రంగనాథుఁడు శ్రీశైలమునకుఁ బోయి దేవుని స్తుతింపఁగా నొకకన్ను వచ్చెననియు, సోమనాథుని యనుగ్రహమున రెండవకన్నుకూడ లభించెననియు నొకవదంతి కలదు. ఈకథసంగతి యెటులున్నను, ఇతఁడు సోమనాథుని సమకాలికుఁడనియు, నీతఁడే ద్విపదరామాయణకర్తయనియు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు మున్నగువా రభిప్రాయపడినారు తొలుత వైష్ణవుఁడై రామాయణమును రచించినను, పిదప శైవుఁడగుటలో విరోధములేదు. తెనాలి రామలింగఁడు తొలుత శైవుఁడై పిదప రామకృష్ణుఁడైన సంగతి యెల్లరకును తెల్లమేకదా। రంగనాథుఁడు శైవుఁడైన పిదప 'శివభక్తిదీపిక' యను నొక చిన్నగ్రంథమును, 'నయనగతిరగడ'లో రచించెనఁట!

చక్రపాణి రంగనాధుఁడును, రామాయణకర్త యని చెప్పఁబడు రంగనాథుఁడును విభిన్నవ్యక్తులని 'ఆంధ్రకవి తరంగిణి' కారు లభిప్రాయ పడుచున్నారు [మూఁడవ సంపుటము పుటలు 155-156] మఱియు నీ రంగనాధుఁడు 'శ్రీగిరినాథ విక్రమ' మను నాంధ్రకావ్యమును, వీరభద్ర విజయము, శరభ లీలా అను కన్నడగ్రంధములను రచించెనని చెప్పుదురని అందే కలదు. [మూఁడవ సంపుటము. పుట 156]

రంగనాధ రామాయణమును గోన బుద్ధరాజే తన తండ్రి విఠ్ఠలరాజు పేరిట వ్రాసెననియు, విఠ్ఠలుఁడే పాండురంగఁడు గాన, అతఁడు పాండురంగనాధుఁడు కావచ్చుననియు, ఆ పదమును హ్రస్వ మొనర్చినచో 'రంగ

నాథుఁ డగుననియు, అతని పేరిట రచితమైన రామాయణము 'రంగనాథ రామాయణ' మయ్యెననియు కొందఱి యభిప్రాయము. ఇది యుక్తిసహము కాదని పెక్కండ్రు తలంచుచున్నారు.

విర్ఠలరాజు 'రామాయణమును రచింపఁదగినవాఁ డెవ్వఁడు?' అని ప్రశ్నింపఁగా సభ్యులతని పుత్రుఁ డగు బుద్ధరాజే తగినవాఁడని చెప్పినట్లును, పిదప తండ్రి పుత్రుని రామాయణమును రచింపఁ గోరినట్లును కృత్యాదిని బట్టి తెలియుచున్నది. పుత్రుని శక్తి సామర్థ్యములు తండ్రికిఁ దెలియకుండుట వింతగానే తోఁచును. ఉత్తరకాండము ద్విపదగా తెలిఁగించిన బుద్ధరాజు పుత్రులు కాచవిభుఁడును, విర్ఠలరాజును ఇచ్చిన వంశవృక్షమునకును, రంగనాథ రామాయణము నందలి వంశవృక్షమునకును భేదము కానవచ్చుచున్నది. ఈ విషయమున నింకను పరిశోధన జరుగవలసియున్నది ]

# కేతన

కేతన యనెడు కవి తిక్కనసోమయాజి కాలమునం దున్నవాఁడు. ఈ యంశ మీతని యాంధ్రభాషాభూషణమందలి యీ క్రింది పద్యమువలనఁ దేటపడుచున్నది.

గీ 'కవిత చెప్పి యుభయకవిమిత్రు మెప్పింప
నరిది బ్రహ్మ కైన నతఁడు మెచ్చఁ
బరఁగ దశకుమారచరితంబు చెప్పిన
ప్రోడ నన్ను వేఱె పొగడ నేల ?'

దీనివలన నితఁడు తిక్కనసోమయాజికాలమువాఁ డగుట స్పష్టపడినందున, ఇతఁడు పదుమూఁడవ శతాబ్దమధ్యమున ననఁగా నిప్పటికి **రమారమి** యాఱు వందలనలువది సంవత్సరముల క్రిందట నున్నాఁడనుట నిశ్చయము. ఇతఁ డాంధ్రభాషాభూషణమును రచించుటకు ముందు తెలుఁగునకు వ్యాకరణ మేదియు లేదనుట నన్నయభట్టారక చరితమునం దుదాహరింపఁబడిన పద్యమువలననే కాక యాంధ్రభాషాభూషణమునందలి యీ క్రింది పద్యము వలనను దేటపడుచున్నది.

ఉ. 'క్రొత్తగ నాంధ్రభాషకును గొంచక లక్షణ మిట్లు చెప్పనే
యుత్తమబుద్ధి యీతఁ డని యోరలవోవక విన్నఁజాలు మీ
రొత్తిన మీకు మాఱునకు నుత్తర మిచ్చుట చాల యెగ్గు మీ
చిత్తమునందు నన్నెరవుసేయకుఁడీ కవులార ! మ్రొక్కెదన్.

క. నేరములు కాళిదాస మ
యూరాదులకైనఁ గలుగు నొరులకు లేవే !
సారమతులైన సుకవుల
కారుణ్యమె నేర్పుకలిమి కవిజనములకున్.'

ఈతడు దండివిరచిత మయిన దశకుమారచరిత్రమును తెనిఁగించుట చేతఁ బండితు లీతని 'నభినవదండి' యని పొగడిన ట్లీక్రింద నుదాహరింపఁబడెడి యాంధ్రభాషాభూషణములోని పద్యములో కవియే చెప్పుచున్నాఁడు.

క. 'వివిధకళానిపుణుఁడ నభి
నవదండి యనంగ బుధజనంబులచేతన్
భువిఁ బేరు గొన్నవాఁడను
గవిజనమిత్రుఁడను మూలఘటికాన్వయుఁడన్.'

ఈ కవియింటిపేరు పైని పేర్కొనఁబడినట్లు మూలఘటికవారు; ఈతని తండ్రిపేరు ప్రమానయ్య; * ఇతఁడు శివభక్తుఁడు. ఇతఁ డాంధ్రభాషాభూష

* ఈతనితండ్రి ప్రమానయ యైనట్లు విజ్ఞానేశ్వరమునందలి ప్రాయశ్చిత్తకాండములో కడపట నున్న యీ క్రింది పద్యమువలన నెఱుఁగవచ్చును.

క. 'తజ్ఞులకుఁ దెలియునట్లుగఁ
బ్రాజ్ఞులు మది మెచ్చఁ దెలుఁగుపద్యములను ద
త్వజ్ఞుఁడు ప్రమానయకేతన
విజ్ఞానేశ్వరము జగతి వెలయఁగఁ జెప్పెన్.'

[ఇతని తల్లి గంగమాంబ. నివాసము వెత్తి (వెంటి, రాలు ]

ధర్మశాస్త్రములను కేతనయే మొట్టమొదట తెనిఁగింప నారంభించెను. ఇటీవలి కవులు సహితము మఱి యెవ్వరును ధర్మశాస్త్రముల నాంధ్రీకరింపఁ బూనుకొలేదు. కేతనయొక్క విజ్ఞానేశ్వరములోని మఱి రెండుపద్యముల నిం దుదాహరించుచున్నాను.

చ. 'ఒకనికిఁ గూఁతు నిచ్చి తగ సుంకువ గైకొని పెండ్లిసేయ ను
త్సుకమతి నున్నచోట గుణశోభితుఁ డొక్కఁడు వచ్చె నేనియున్
బ్రకటితదోషముల్ మొదటిభర్త పయిం గలవేని తండ్రి క
న్యక గుణవంతుఁ డైన పతి కచ్చుగ నిచ్చుట ధర్మమెమ్మెయిన్. ఆచారకాం.

ఉ. జాతర పెండ్లియుత్సవము జన్నము చేయఁ దొడంగియున్నచో
బాఁతిగ రాజమంత్రులు తపస్వులు వేల్పు లవశ్యకార్యముల్
ప్రీతి నొనర్చుచోఁ దఱిమి పిల్వఁగ నప్పను లెల్లఁ దీరఁగా
భూతలనాథుముద్ర గొనిపోయిన భృత్యులు వారిఁ దేఁదగున్. వ్యవహార.

ణమును, దశకుమారచరిత్రమును మాత్రమే కాక విజ్ఞానేశ్వరీయమును యాజ్ఞవల్క్యధర్మశాస్త్రమును గూడ తెనిఁగించెను *

అనేక లక్షణగ్రంథములు పుట్టి యున్న యీ కాలమునం దాంధ్రభాషాభూషణమంతగా నుపయుక్తము కాకపోవచ్చునుగాని యితరలక్షణగ్రంథములు లేని పూర్వకాలమునం దది పరమప్రయోజనకరముగా నుండిన దనుటకు సందేహము లేదు. † కేతనకవిత్వము తిక్కనాదులకవిత్వముతో సరిరాకపోయినను సలక్షణమయి మధురమయినదిగా నున్నది. ఈతని కవిత్వశైలి తేటపడుట కయి యీతని గ్రంథమునుండి కొన్నిపద్యము లుదహరింపఁబడుచున్నవి.

౧. ఆంధ్రభాషాభూషణము.

క. 'భాషావేదులు నను విని
యా షణ్ముఖపాణినులకు నగు నీడని సం
తోషింప నాంధ్రభాషా
భూషణ మను శబ్దశాస్త్రముం గావింతున్.

---

[* కేతన తెలిఁగించినది యాజ్ఞవల్క్యస్మృతి యను ధర్మశాస్త్రముకాదు. ఆ స్మృతికి విజ్ఞానేశ్వరుఁడు రచించిన 'మితాక్షరి' అను వ్యాఖ్య ననుసరించినది. పేరికిది విజ్ఞానేశ్వరీయమే కాని దానికిది యనువాదము కాని, అనుసరణము కాని కాదు. మితాక్షర విపులమగు గ్రంథము. కేతన పయి మితాక్షరిలోని విషయములను – జన సామాన్యమున కుపయోగి యగు వానినిగూర్చి సంగ్రహముగ నొక చిన్న గ్రంథమును రచించి, దానికి 'విజ్ఞానేశ్వరీయ' మని పేరు పెట్టి యుండవచ్చును. మూలమునందు వేర్వేఱు కాండములలో నున్న విషయము లిందు తారుమారయి యున్నవి ]

[† కేతన తనకుఁ బూర్వమున నున్నదియు, ద్వితీయ నాగవర్మచే 12వ శతాబ్దికిఁ బూర్వము రచింపఁబడిన 'కర్ణాటకభాషాభూషణము' ననుసరించి 'ఆంధ్రభాషాభూషణము'ను రచించెననియు, ఆ నాగవర్మ తొలుత వేంగీనగర నివాసియై యుండి, రాజకీయ కల్లోలములు కారణముగా కర్ణాటక దేశమున కేఁగెననియు, ఆంధ్ర, కర్ణాటక భాషాభూషణములు రెంటికిని చాల పోలికలు కలవనియు భాషా సాహిత్య విమర్శకులు, బహుభాషావేత్తలు నగు శ్రీ తిరుమల - రామచంద్రగారు వివరించి యున్నారు.]

క. పోఁడిగ బహువచనంబులు
వీఁ డనుటకు వీం(డ్రు వీరు వీరలు నయ్యెన్
కాఁడునకు కాం(డ్రు కాఱును
వాఁ డనుటకు వాం(డ్రు వారు వారలు నయ్యెన్.

౨. దశకుమారచరిత్రము.

క. మించి మదించిన రిపుల హ
రించక సత్కీర్తి యీ మహీతల మెల్లన్
నించక దీనుల దయఁ బో
షించక ప్రఖ్యాతి కలుగునే నరనాథా ।

క. నుతకీర్తి వడసి జనవ
ర్ణితులై వర్ధిల్లి దుష్టని(గహశిష్ట
ప్రతిపాలకులై 'త్రిజగ
ద్ధిత' ముగ నేలంగఁదగు మహీతల మెల్లన్.

ఉ. ఆమగధేశమాళవధరాధిపు లెక్కటిఁ బోరి రాజిలోఁ
గాముఁడు శంబరుండు శశిఖండధరుండు గజాసురేం(ద్రుఁడున్
రాముఁడు రావణుండు సురరాజసుతుండును సింధునాథుఁడుఁ
భీముఁడు దుస్ససేనుఁడు నుపేం(ద్రుఁడుఁ గంసుఁడుఁ బోరునాకృతిఁ.

౩. విజ్ఞానేశ్వరీయము

మ. సుర సేవించిన వాతివాఁడి యయినఁ సొమ్మెల్లఁ బోనాడినఁ
బురుషద్వేషిణియైన గొడ్డయిన నెప్డుం గూఁతులం గన్న మైఁ
బరపౌరోగము గల్గె నేనియును నప్పార్యం బెడంబాసి య
ప్పురుషుండొండొకపెండ్లి యాడినను నొప్పుందప్పులేదేమియుఁ.

ఆచార.

క మాటలు నేరక పలికిన
నోటమిగాఁ గొనక కార్య మున్న నిజముఁ దాఁ
బాటించి నృపతి ధర్మం
బేటముగాఁ బాడి నిర్ణయింపఁగ వలయున్—వ్యవ.

ఉ. ప్రేకనిబండివానికిని విప్రునికిఁ బతికి న్వివాదికిన్
ప్రేఁకపుమోపువానికిని వృద్ధునికిన్ గడుఁజిన్నబిడ్డకున్
ప్రేఁకటియాడుమానిసికి వేదులువానికిఁ దెప్పగొంటుకున్
దేఁకువతోఁ దొలంగునది తెల్లముగా నెదు రేగుదెంచినన్—
ప్రాయశ్చిత్త.

ఈ కవి బాణభట్టవిరచిత మయిన కాదంబరిని తెనిఁగించినట్లు కనఁబడు చున్నది. కేతనకృత మయినకాదంబరిలోని దని రంగరాడ్ఛందమునం దీ పద్య ముదాహరింపఁబడియున్నది.

గీ. 'జనవరేణ్యుఁ గాంచి సాష్టాంగ మెరఁగిన
నా విభుండు వాని లేవనెత్తి
కౌఁగిలించి వానిఁ గనుఁగొని కేయూర
కాభిధాన మొసఁగెఁ గడుముదమున'

కాదంబరిలోని వని యుదాహరింపఁబడిన పద్యములలో నొక దానియందు భాస్కరునికేతన యని యుండుటచేత కాదంబరి గ్రంధకర్త యితఁడు గాక తిక్కనసోమయాజిపెదతండ్రి యైనకేతన యని తోఁచుచున్నది. *

అభినవదండి యను నామాంతరము గల యీ కేతనకవిచేత విరచితమైన దశకుమారచరిత్రము పంద్రెండాశ్వాసముల పద్యకావ్యము నా కీ నడుమ లభించినది. ఆ గ్రంధములోని

* [కేతనమంత్రి' చరిత్రమును జూడుఁడు]

ఉ. 'శ్రీరమణీగృహాంగణము చెన్నువహింప నలంకరింపఁగాఁ
దోరణముం బ్రదీపమును దోహలియై యొడఁగూర్చెనాఁదగం
జేరి యురంబునందు తులసీవనమాలయుఁ గౌస్తుభంబు నొ
ప్పారఁగ నుల్లసిల్లు హరి యన్నమతిక్కని ధన్యుఁ జేయుతన్.

ఉ. హారికపర్దకాంచనమయాచలసానువునందు నిర్ఝర
స్ఫారవిలాసముం గలుగు జాహ్నవిఁ దాల్చిన శంకరుండు నీ
హారకరావతంసుఁ డణిమాదిగుణప్రదవీక్షణుండు ది
క్పూరితకీర్తిశాలి యగు కొమ్మయతిక్కనిఁ గాచుఁగావుతన్.

అను మొదటి రెండు పద్యములవలనను దశకుమారచరిత్రము తిక్కన సోమయాజి కంకితము చేయఁబడినట్లు దెలిసికోవచ్చును కవి యిష్టదేవతా వందనాదులు చేసిన తరువాత

"వ అని యిష్టదేవతా ప్రార్థనంబును సుకవిచరణారవిందాళి వందనంబు నుం జేసి నా రచియింపంబూనిన కృతి కధీశ్వరుండైన కొట్టరువు తిక్కనామాత్యునకు నిజస్థానం బగు విక్రమ సింహపురం బభి వర్ణించెద"

అని యేతత్పురవర్ణమును తత్పురాధీశ్వరుఁ డగు మనుమసిద్ధివర్ణనమును జేసి

"వ ఇట్లు కీర్తిపాత్రంబైన మనుమసిద్ధిమహీవల్లభునకుఁ గరుణారస పాత్రంబైన కొట్టరువు తిక్కనామాత్యుండు నిజకులక్రమాగతం బగు మంత్రిపదంబున వర్తిల్లుచు.

గీ అందలంబు గొడుగు లడపంబు మేల్కట్టు
చామరములు జమిలిశంఖములును
గంబగట్లు భూమి కానికగాఁగఁ బెం
పెసఁగు రాచపదవు లెల్లఁ బడసె."

అని చెప్పి తిక్కన తన్ను రావించుట లోనగు విషయముల నిట్లు చెప్పెను.

సీ. వేఁగివిషయమున వెట్టి(ంటి) రా లనుపేర
నభిరామ మగు నగ్రహారమునకు

నగ్రగణి యగువాని నఖినవదండినాఁ
బొలుపు మీఱినవానిఁ బ్రోలనార్యు
ననుఁగుఁదమ్ముని సంస్కృతాదిభాషాకావ్య
కర్తృత్వమున నుతి గన్నవానిఁ
గౌండిన్యగోత్రుని బండారుకేతదం
డాధీశుమఱఁది నధ్యయనపరుని
మూలఘటికాన్వవాయసముద్రపూర్ణ
హిమమయూఖుని మారయ కమలకమల
వదన యగుసంకమాంబకు * వరతనూజుఁ
గేతనార్యుని నన్ను విఖ్యాతయశుని.

వ. అత్యాదరంబున రావించి యాసనార్ఘ్యపాద్య తాంబులాంబ రాభరణ దానాద్యుపచారంబులఁబరితుష్టహృదయుం జేసి నీవు సంస్కృతాద్యనేక భాషాకావ్యరచనావిశారదుండ వగుట జగత్ప్రసిద్ధంబు గావున నొక్క కావ్యము రచియించి నన్నుఁ గృతిపతిం జేయవలయునని సగౌర వంబుగాఁ బ్రార్థించిన నేనును మత్కావ్యకన్యకకుఁ దగు వరుండగు నతని మనోరథంబు సఫలంబు గావింపఁదలంచి.

ఉ. కొమ్మయశౌరిసూనున కకుంఠితకీర్తివిలాసమొందఁ గ
ద్యమ్మున దండి చెప్పిన కథాక్రమ మొప్పఁ దెనుంగుబాస గ
ద్యమ్మును బద్యముం బెరయ నంచితభావరసోదయాభిరా
మ మ్మగునట్లుగా దశకుమారచరిత్రము చెప్పఁబూనితిన్.'

ఈ దశకుమారచరిత్రకవిత్వము కవి చెప్పుకొన్నట్టు తిక్కన మెచ్చునంత రసవంతముగానే యున్నది. ఇందుండి కొన్ని పద్యము లిం దుదాహరింపఁ బడుచున్నవి.

చ. పలికిన నుల్కపాటు మదిఁ బట్టుకొనంగ నెలుంగుదిక్కు చూ
డ్కులు పచరించి యాత్మపతి ఘోషముచందము కారణంబుగాఁ

[ * కేతనతల్లి సంకమ, తండ్రి మారయ యని విజ్ఞానేశ్వరీయము వలనఁ దెలియవచ్చుచున్నది.]

దలఁకక డాయఁబోయి విదితంబుగఁ గాంచె రథంబుమీఁద ని
ర్మలమణిమండనద్యుతినిరాకృతహంసుని రాజహంసునిన్ — ఆ. ౨.

ఉ. ఏపునఁ బోరుసేనలకు నెల్లను మీఱి సముల్లసద్భుజా
టోపముమై నరాతులఁ బటుప్రదరంబులఁ బాఱఁద్రోలి యా
భూపతి యగ్గమైన రథమున్ రథముం గదియించి లంఘన
ప్రాపితతద్రథుండ నయి పట్టి వెసం దెగఁజూచి యార్చితిన్ ఆ ౪.

చ. కనుఁగొనునంత నా మనసుఁ గన్నుల మన్మథుఁ డింతిపాలు చే
సిన మెలఁగంగలేక గతచేష్టుఁడ నై యిదినిద్ర వోవుచో
మనమున కింతపుట్టె గరిమం బగువిభ్రమ మంగకంబు నొం
దినతఱిఁ జూచువారలకు ధీరత యెక్కుడిదంచు లోలతన్ — ఆ ౬

ఉ. అల్లుఁడ వీవు రాజ్యమున కంతకు నర్హుఁడ వీవు భూమికిం
దల్లివి తండ్రివిన్ బహువిధంబుల దాతవు నీవు మాకులం
బెల్ల సముద్ధరింప నుదయించిన పుణ్యుఁడ వీవు నీకు నే
నెల్లి మదీయపుత్రిఁ బురమెల్ల నెఱుంగఁగఁ బెండ్లిచేసెదన్. ఆ ౭.

ఉ. నీ వలవోకఁజూచి తరుణీతిలకంబుమనంబు రూపమున్
భావగతంబులై నఁ గడుఁ బ్రౌఢత చూపుట గోరి యచ్చుపా
పై వఱలంగ నున్న తెఱఁ గంతయు వ్రాసితిఁగా తలంచెదన్
దేవసమాన నా యెఱుక తెల్లమొ బొంకొ నిజంబు చెప్పుమా —
ఆ. ౧౦

శా. సైన్యంబు ల్మద మెక్కి బాహుబలముల్ శౌర్యంబులుం జూపి ని
ర్దైన్యస్ఫూర్తిఁ గడంగి ఘోరపటుశస్త్రప్రౌఢిమన్ నిష్ఠురా
నన్యోన్యాహవనోత్థితాగ్నికణరౌద్రాకారతన్ లోకసా
మాన్యాతీతమహోగ్రవిక్రమరణోన్మాదప్రకారంబులై — ఆ. ౧౨

ఈదశకుమారచరిత్రములో భారతాంధ్రీకరణవిషయ మేమియుఁ జెప్పఁ
కుండకపోవుటచేతఁ దిక్కన యీ గ్రంథరచననాటికి భారతము చేయ
నారంభించి యుండఁడు,

# బద్దెనకవి

ఆంధ్రచోడులలోనివాఁడైన యీ బద్దెనృపాలుఁడు నీతిశాస్త్రముక్తావళి యను గ్రంథమును జేసెను. ఈ గ్రంధమును బ్రహ్మశ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు ౧౯౧౦ వ సంవత్సరమునందు పెద్ద పీఠికతోఁ బ్రచురించిరి. ఈ బద్దెననృపతి కృష్ణానదీతీరమునం దున్న దక్షిణ షట్సహస్రదేశమును పాలించిన యొక చిన్నసామంతరాజు. శ్రీరామకృష్ణకవిగారీ బద్దెనకవిని గూర్చి "కృష్ణవేణానదీతీరదక్షిణషట్సహస్ర విషయాధీశ్వర వీరమాహేశ్వర కీర్తిసుధాకర గుణరత్నాకర వేంగిచాళుక్య మూలస్తంభ రిపుదళితసంభికుంభ బలియాంగనాగృహతోరణ నన్నన గంధవారణనామాది ప్రశస్తిసహితం శ్రీమహామండలేశ్వరబద్దచోళనరేంద్ర" మను శాసనము నుదాహరించి, దానినిబట్టి యతఁడు క్రీస్తుశకము ౧౧౨౦ వ సంవత్సరములో నుండవచ్చునని యూహించి, ఆ శాసనము "చెన్నపట్టణపు లైబ్రరీలోని చరిత్రములలోనిది గావున నమ్మఁదగినది కా" దని దానిని నిరాకరించి, ఇట్టి బిరుదులు గలవాఁడు కేవలసామంతరాజగునా ? యని సందేహించిరి ఇట్లు సంశయపడవలసిన పని లేదు. మనలోని సంస్థానాధిపతుల కనేకులకుఁ దమకు గల గ్రామములకంటె బిరుదనామములే యెక్కువగా నుండును. ఉన్నరాజ్యము చిన్నదే యయినను బిరుదావళిమాత్రము పెద్దదిగానున్న రాజులనేకులు గలరు. ఈ కవికాలవిషయమున రామకృష్ణకవిగారు చేసిన యూహ సరియైనది కాదు. కవికాలము నించుమించుగాఁ దెలిసికొనఁదగిన యాధార మొకటి కవియొక్క నీతిశాస్త్రముక్తావళియందే కానవచ్చుచున్నది.

సీ. 'రాజనీతియు నసద్రాజలక్షణమును
మంత్రిమార్గంబు దుర్మంత్రివిధము
నధికారవిధియుఁ గార్యవిచారము నుపాయ
గతియును రాజ్యరక్షాక్రమంబు

నిల నరాజకవృత్తి హితసేవకస్థితి
దుస్సేవక క్రియ దుష్టరాజ
సేవాబలము దానశీలతామహిమ వి
వేకసంగతియును లోకనీతి

పద్ధతులు చేసి భువి నతిప్రజ్ఞ వెలయ
బద్దెనీతియుఁ గోమటి కుచునోళ్ల
కతిన దబ్బుఅపారంబు గదియఁ గవులు
తప్పు లెడలింప నెంతయు నొప్పు భువిని.'

అను మొదటిపద్యము క్రిందనే యొక ప్రతిలో రామకృష్ణకవిగారు ౩౦ వ పుటలో నుదాహరించిన యీ క్రిందిపద్య మున్నది.

చ. 'పరువడి నాంధ్రభాషఁ గల బద్దెనసీతియు, సంస్కృతంబులోఁ
బరఁగఁ బ్రతాపరుద్ర నరపాలునిచే రచింపఁబడ్డ యా
నరవరు నీతిసారము వినం జదువం గడు మంచిదంచుఁ జె
ప్పెరఁ గవి నీతిపద్ధతులు చేసె వినోదము బాలబోధకున్.'

దీనినిబట్టి బద్దెనకవి ప్రతాపరు దునితరువాతివాఁ డని స్పష్టముగాఁ దెలియ వచ్చుచున్నది. పయి పద్యమునందుఁ బేర్కొనఁబడిన మొదటి ప్రతాప రుద్రుడు ౧౧౪౦ మొదలుకొని ౧౧౯౬ వ సంవత్సరమువఱకును రాజ్య పాలనము చేసినవాఁ డగుటచే బద్దెనరపాలుఁడు నిస్సంశయముగా క్రీస్తు శకము ౧౧౯౬ వ సంవత్సరమునకుఁ దరువాతివాఁ డయియుండవలెను. ఈ నడుమను బ్రహ్మశ్రీ జయంతి రామయ్యపంతులుగారు, రాక్షసనామ సంవత్సర భాద్రపదమాసమునందు (సెప్టెంబరు ౧౯౧౫) ప్రచురింపఁబడిన యాంధ్ర సాహిత్యపరిషత్పత్రిక నాల్గవసంపుటము ౫-వ సంచికలోఁ బ్రకటించిన రెండు శాసనములను బట్టి కవికాలము ౧౨౬౧-వ సంవత్సరప్రాంత మని స్పష్టపడినది. ఈ శాసనములు కృష్ణామండలములోని గన్నవరము తాలూకాలో కొండనాయనివర మను గ్రామమునందు బ్రహ్మేశ్వరస్వామి యాలయములో నొక రాతిపలకమీఁదఁ జెక్కఁబడి యున్నవి. ఇందలి మొదటి శిలాశాసనము

"స్వస్తి సమస్తప్రశస్తిసహితం శ్రీమన్మహామండలేశ్వరవీర నారాయణ చోడబద్దిగదేవరాజులు శకవర్షంబులు ౧౧౮౩ ణ్డగు నేంటి కర్కాటక సంక్రాంతినాండు ......... ... .. . . . ."

అనునంతవఱకు నుండి తరువాత శిథిలమయినది ఉత్తరపువైపున పడమటి వైపున నున్న రెండవ శిలాశాసనము

శ్లో. "శ్రీనాధనాభినీరేజసంభూతబ్రహ్మణః పురా
జాతా విశ్వగుణాక్షిణలక్ష్మీ రాజపరం రా
తస్యాం బద్దిగభూపోఽభూద్వీరనారాయణాంకితః
చోడదోరయ (భూపో) స్యపుత్రో ౽గా దస్య నందనః
శ్రీశాకాబ్దే పురాష్టాదశశశిగణతే కర్కసంక్రాంతికాలే
స ప్రాదా ద్దీప మిష్టప్రద మనవరతం చోడబద్దిక్షితీశః
శ్రీమద్భ్రిహ్మేశ్వరాయాశశి రవి పశదంగోంకనాంకస్య (వే!) తే
స్తద్దీపార్థం చ వేలేటిజనపదమహీం వింశతిద్రోణసంఖ్యాం."

అని పూర్తిగా నున్నది. ఇందుఁ జెప్పఁబడిన శాలివాహనశకము ౧౧౮౩ క్రీస్తుశకము ౧౨౬౧ అగుచున్నది. "ఈశాసనములు పుట్టిన కాలమునందు కాకతీయరాజ్యము రుద్రమదేవి పాలించుచుండెను ఆమె క్రింద సామంతుడుగా నుండి బద్దెన కృష్ణాతీరముం దాక చిన్న రాజ్యమును బాలించుచుండినట్టు కనుపట్టుచున్నది." అని రామయ్యపంతులుగారు వ్రాసి యున్నారు. *

---

* [శ్రీరామకృష్ణకవిగారు తెల్పిన 'రాజనీతియు, పగువడి' అను పద్యములు రెండును బద్దెన కృతములు కావనియు బాంబోధకమైన వేఱొక గ్రంథమును వ్రాసిన వేఱొక కవివ యయు, ఆకవిని గూర్చియు, గ్రంథమును గూర్చియుఁ దెలియదనియు 'ఆంధ్రకవి తరంగిణి' కారులు వ్రాయుచున్నారు [మూఁడవ సంపుటము. పుటలు 18,19]

శ్రీరామయ్యపంతులుగారిచ్చిన శాసనములను బట్టి రామకృష్ణకవిగారిచ్చిన కాలము సరియైనది కాదని, తేలును. వీనింబట్టి బద్దెనృపాలురు తాతయు, మనుమఁడు నగుదురు. శాసనకర్త మనుమఁడగును, తాతకాఁడు. నీతిశాస్త్రముక్తావళికర్తయు, శాసనకర్తయు నభిన్నులనుట కింకను తగిన యాధారములు లభింపలేదు. తాత గ్రంథకర్తయైనచో క్రీ. శ. ౧౨౦౦ ప్రాంతమువాఁడగును; శాసనకర్తయే గ్రంథకర్త యగునేని క్రీ. శ. ౧౨౬౦ ప్రాంతమువాఁడగును.]

బద్దెన తననీతిశాస్త్రముక్తావళితుద నీక్రింది గద్యమును వేసికొనియున్నాఁడు.

గద్య. 'ఇది శ్రీలక్ష్మీవల్లభ శ్రీపాదపద్మారాధకకమలాప్తకుల పవిత్ర నన్నయగంధవారణ, రాజరాజమనోజాంకబద్దెనాఖ్యప్రణీతంబైన రాజ నీతిప్రకారం బన్నది సర్వము సంపూర్ణము.'

ఈ నీతిశాస్త్రముక్తావళి, రాజనీతిపద్ధతి, అసద్రాజపద్ధతి, మంత్రిపద్ధతి, దుర్మంత్రిపద్ధతి, అధికారపద్ధతి, నియోగపద్ధతి, కార్యవిచారపద్ధతి, ఉపాయ పద్ధతి, రాజ్యరక్షాపద్ధతి, అరాజకపద్ధతి, హితసేవకపద్ధతి, దుష్టసేవకపద్ధతి, దుష్టరాజసేవనపద్ధతి, దానశీలతాపద్ధతి, లోకనీతిపద్ధతి, అని పదునైదు పద్ధతులుగా భాగింపఁబడినది ఈ పద్ధతులను ముగించి కడపటఁ కవి తన పుస్తకము నిట్లాశీర్వదించుకొనెను.

ఉ. 'శ్రీవిభుఁ డైన బద్దెనృపశేఖరుచేసిన నీతిశాస్త్రము
క్తావళి శిష్టలోకహిత మయ్యెడుఁ గాపుత నాఁడునాఁటి కిం
దీవరగర్భుఁడుఙ్ శశియుఁ దిగ్మమరీచియు భూతధాత్రియున్
దేవగణంబులుఙ్ బుధులు దిక్పతులుం గల యంతకాలముఙ్.'

కవి పద్యాంతములయందు వేమనవలెనే వీరనారాయణుఁడా బద్దెనరేంద్రా, ఉదారవైరోచనుఁడా, నన్నచోడనరేంద్రా, దశదిశాభరణాంకా, నరేంద్ర చతురాననుఁడా, పరభైరవా, నయతత్త్వనిధీ, రాజమనోజభూభుజా, రాజ రాజమనోజా, కొమరురభీమా, భూపదిలీపా, సర్వజ్ఞనిధీ, నన్నయగంధ వారణా, అను వివిధనామములతోఁ దన్నే సంబోధించుకొని యున్నాఁడు. ఈ నామములలో నన్నెచోడనరేంద్రుఁడు, నన్నయగంధవారణుఁడు, ఇత్యాదినామములు గల చోడరాజు లితనికిఁ బూర్వులో సమకాలికులో యుండి యున్నారు. వారిలోఁ గుమారసంభవమును రచించిన నన్నెచోడుఁ డొకఁడు, విక్రమార్కచరిత్రమును కృతినందిన సిద్ధనమంత్రితాత యయిన సిద్ధనమంత్రి మంత్రిగాఁగల నన్నయ గంధ వారణుఁ డొకఁడు. ఈ పేరులు బద్దెనృపాలునికిఁ గూడఁ గలిగియున్నచో సిద్ధనమంత్రి మంత్రిగాఁ గలవాఁడయి యీ క్రిందిపద్యమునందు విక్రమార్కచరిత్రములోఁ బేర్కొనఁ బడిన నన్నయగంధవారణుఁ డీ బద్దెచోడుఁడే యయియుండును.

చ. 'వనరుహనాభు కుద్ధవుఁడు వజ్రికి జీవుఁడు వత్సధారుణీ
శునకు యుగంధరుండు దితిసూతికి దైత్యగురుండు విక్రమా
ర్కునకును భట్టి రీతి నధికుండగు నన్నయగంధవారణం
బునకుఁ బ్రధానుఁడై నుతులఁబొందెను సిద్ధనమంత్రి యిద్ధరన్.'

౧౧౫౬ వ సంవత్సరము మొదలుకొని ౧౧౬౩ వ సంవత్సరమువఱకును రాజ్యపాలనము చేసిన వెలనాటిచోడుఁ డనఁబడెడు రాజేంద్రచోడునిచే నగ్రహారాదికమును బడసిన సూరనసోమయాజికి మనుమఁడగుటచే సిద్ధనమంత్రి ౧౨౪౦-౫౦ సంవత్సరప్రాంతములనుండి యుండవలెను. అప్పుడు సిద్ధనమంత్రి ప్రభువయిన నన్నయగంధవారణుఁడును నించుమించుగా నాకాలమునందే యుండును. ఈ కాలము బద్దెనృపాలుని శాసనకాలముతో దాదాపుగా సరిపోవును. కాఁబట్టి యీ నన్నయగంధవారణుఁడే బద్దెనృపతి యేమో! అట్లయినచో బద్దెనకు నన్నయ యను నామాంతరము కూడఁ గలిగి యుండును. అప్పు డీతఁడు చోడుఁడు గనుక నన్నె (నన్నయ) చోడుఁడనియుఁ బిలువఁబడవచ్చును, *

నీతిశాస్త్రముక్తావళిని రచించుటకుఁ బూర్వము కవి సుమతిశతకమును రచించిన ట్లీక్రిందిపద్యమునఁ జెప్పుకొనెను.

క. 'శ్రీవిభుఁడ గర్వితారి
క్ష్మావరదళనోపలబ్ధజయలక్ష్మీసం
భావితుఁడ సుమతిశతకముఁ
గావించినప్రోడఁ గావ్యకమలాసనుఁడన్.'

పైనిఁ బేర్కొనఁబడిన బిరుదావళులు గాక యీ పద్యమువలనఁ గవికి కావ్యబ్రహ్మ యన్న బిరుదవిశేష మొకటి కనఁబడుచున్నది. ఈతనికిఁ బూర్వము నందుఁ బ్రతాపరుద్రదేవుఁడు సంస్కృతమున నీతిసారమును రచియించినట్టు చెప్పఁబడెనుగదా! దానిని ప్రతాపరుద్రదేవుఁడే తెలిఁగించెనో మఱియెవ్వరు

* [శ్రీ వీరేశలింగముపంతులుగారి యూహ సరికాదనియు, సిద్ధమంత్రి కుమారుఁడైన జన్నయమంత్రి క్రీ. శ. ౧౪౦౬-౧౪౨౨ నడుమ కర్ణాటరాజ్యమును పరిపాలించిన దేవరాజులయొద్ద నుద్యోగిగానుండినట్లు విక్రమార్కచరిత్రమునందే యుండుటంబట్టి తండ్రి, కుమారుల నడుమ ౧౬౦ సంవత్సరముల యంతర ముండదనియు 'ఆంధ్రకవి తరంగిణి' లోఁ గలదు (మూఁడవ సంపుటము పుట 25).]

తెలిఁగించిరో గాని రామకృష్ణకవిగారు పోలిక పద్యము లని నీతిసారము లోనిపద్యములను పదింటికంటె నెక్కువగా నుదాహరించి యున్నారు. వానిలోనిపద్యములను రెంటిని వానిని పోలియున్నవన్న బద్దెనీతిలోని పద్యములను రెంటిని నిచ్చట నుదాహరించు చున్నాను.

గీ. 'విమతులా వెఱింగి వెఱఁపేది తొడరుట
మిడుత లగ్గిమీఁదఁ బడినయట్లు
తోడులేక యధికుఁ దొడరుట యంబుధిఁ
గలము లేక యీఁదఁ గడఁగినట్లు' (నీతిసారము)

ఉ. వారని యల్కఁజేసి కడవం బలవంతుఁడు విగ్రహించినన్
దూరము పోవుటొండె వినతుండయి వానిన చొచ్చుటొండెఁ గా
కీరసమెత్తి కోల్మతివిహీనత నేనుఁగుతోడ లావునన్
బోరగు నెమ్మచంద మది బుద్ధియె రాజమనోజభూభుజా!
(నీతిశాస్త్రముక్తావళి)

క. దూరము వ్యవసాయకులకు
భారంబు సమర్థులకును భాసురవిద్యా
పారగులకును విదేశము
వైరము ప్రియవాదులకును వసుమతిఁ గలదే' (నీతిసారము)

చ. అమరఁగ విద్య గల్గిన మహాత్మున కెద్దెస వోయినన్ స్వదే
శమ కడవన్ సమర్థున కసాధ్యమయెద్ది కడంగి చేసినఁ
సమధురవాణియైన గుణశాలికి నెయ్యురె యెవ్వరున్ బటు
త్వముగలవానికిం గొలువు సద్దకురంగట బద్దెభూపతీ?
(నీతిశాస్త్రముక్తావళి)

ఈ కడపటి పద్యములు రెండును

శ్లో॥ "కోఽతిభార స్సమర్థానాం కిం దూరం వ్యవసాయినాం,
కో విదేశః సవిద్యానాం కః పరః ప్రియవాదినామ్."

అను శ్లోకమునకుఁ దెనుఁగు.

బద్దెనకవి తిక్కనసోమయాజులకాలపువాఁడు. ఈతనికవిత్వము సులభమయి మృదువయి మనోహరముగా నుండును. నీతిశాస్త్రముక్తావళిలోని రెండు పద్యముల నిందుఁ బొందుపఱుచుచున్నాను.

ఉ. 'ఎత్తినకాలకాని సిరి కెన్నఁడు నిల్చినకాల నిల్వఁగాఁ
జిత్తము లేదు గాన సిరి చెందిననాఁడ పరోపకారముల్
హత్తి కడంగి చేయుఁ డెడరైనఁ బదంపడి వేఁడుకొందమన్
చిత్తమె కాని యిత్త మను చిత్తము పుట్టునె యెట్టివారికిన్ ?

ఉ. వాన సమస్తజీవుల కవశ్యము ప్రాణము ప్రాణ మైన య
వ్వానయుఁ బల్మఱుం గురియవచ్చిన దిట్టుదు రెల్లవారలున్
హీనమనస్కుఁడై యొరులయిండ్లకుఁ బల్మఱుఁ బోవునేనియున్
మానిసి కట్లు వచ్చు నవమాన మనూనము మానభంగమున్.'

సుమతిశతకము

క ఎప్పుడు సంపద గలిగిన
నప్పుడు బంధువులు వత్తు రది యెట్లనినన్
దెప్పలుగఁ జెఱువు నిండినఁ
గప్పలు పదివేలు చేరుఁ గదరా సుమతీ!

క. ఎప్పటి కెయ్యది ప్రస్తుత
మప్పటి కామాటలాడి యన్యులమనసుల్
నొప్పింపక తా నొవ్వక
తప్పించుకు తిరుగువాఁడు ధన్యుఁడు సుమతీ! *

* [ఈ పద్యములు బద్దెన రచించిన 'సుమతిశతకము' లోనివని చెప్పుటకుఁదగిన యాధారములు లేవు. ముద్రిత ప్రతిలో లేని పద్యములు కొన్ని వ్రాఁతప్రతులలోఁ గానవచ్చుచున్నవి వీనిశైలియు భిన్నముగా నున్నది.

'సుమతిశతకము' భీమనకృతి యొకటి యున్నదని తిమ్మకవి రచించిన సర్వలక్షణ సారసంగ్రహామునుబట్టి తెలియుచున్నది అయ్యది లభింపలేదు. ఆ భీమకవి 'వేములవాడ భీమకవి' యని యనుటకును ఆధారములు లేవని 'ఆంధ్రకవి తరంగిణి.' (రెండవ సంపుటము పుట 17) ప్రస్తుతము ప్రచారములోనున్న సుమతిశతకము బద్దెన కృతికంటె విభిన్నము కావచ్చును ]

# నందూరి కేతనమంత్రి

కేయూరబాహుచరిత్ర కృతికర్తయగు నందూరి-గుండయమంత్రి కితఁడన్న. మంచనకవి యీతని నొక కవిగాఁ బ్రశంసించియున్నాఁడు. ఈతని గ్రంధము లేవియో తెలియదు. కేతనకవికృతముగా కువలయాశ్వచరిత్రము ఒకటి చెప్పఁబడుచున్నది. ఆ కేతన యెవ్వరో నిర్ణయింప శక్యము కాకున్నది.

ఈ నందూరి-కేతనమంత్రి క్రీ. శ. 1300 ప్రాంతమువాఁడు.

# మంచన

ఈ కవి కేయూరబాహుచరిత్ర మను నాలుగాశ్వాసముల గ్రంథమును రచించి నండూరి గుండన్నమంత్రి కంకితముచేసెను. ఈ గుండన్నమంత్రి యొక్క తాతకుతాత యైన గోవిందామాత్యుఁడు వెలనాటిగొంకరాజుమంత్రి యైనట్టును, ముత్తాత యైన కొమ్మామాత్యుఁడు గొంకరాజుకొడుకైన కులోత్తుంగరాజేంద్రచోళుఁ డను నామాంతరము గల వెలనాటిచోడుని మంత్రి యైనట్టును కేయూరబాహుచరిత్రమునం దీ పద్యములలోఁ జెప్పఁబడినది.

శా. ప్రాగ్దేశాపరదక్షిణోత్తరదిశాభాగప్రసిద్ధక్షమా
భుగ్ధ్వాంతకుఁ డేలె గొంకవిభుఁ డీ భూచక్ర మక్రూరతన్
వాగ్దేవీస్తనహారనిర్మలయశోవాల్లభ్యసంసిద్ధితో
దిగ్దంతిశ్రవణానిలోజ్జ్వలరటత్తీవ్రప్రతాపాఢ్యుఁడై.

క. ఆ విభునకుఁ బ్రెగ్గడయై
భూవలయంబున యశోవిభూషణుఁ డయ్యెన్
గోవిందనప్రధానుం
డావాసము కౌశికాన్వయంబునఁ దనరెన్.

మ. విహితాస్థానమునందుఁ జూపుఁ దగ గోవిందాభిధానప్రభుం
డహితోర్వీధరవజ్రి గొంకవిభురాజ్యాధిష్ఠుఁడై సంధివి
గ్రహముఖ్యోచితకార్యసంఘటనతంత్రప్రౌఢియున్ బాధస
న్నహనోదగ్రరిపుక్షితీశబహుసైన్యధ్వంసనాటోపమున్.

క. ధీరుఁడు తా గోవిందన
కూరిమినందనుఁడు వెలసెఁ గొమ్మన గొంక
క్ష్మారమణున కుదయించిన
వీరుఁడు రాజేంద్రచోడవిభు ప్రెగడయై.

సీ. నవకోటిపరిమితద్రవిణ మే భూపతి
భండారమున నెప్డుఁ బాయకుండు
నేకోనశతదంతు లే రాజుఘనశాల
నీలమేఘంబుల లీలఁ గ్రాలు
బలవేగరేఖ నల్వదివేలు తురగంబు
లే నరేంద్రునిపాగ నెపుడు నిలుచుఁ
బ్రతివాసరంబు డెబ్బదియేనుపుట్ల నే
యే విభుమందల నెపుడు గలుగు

నట్టి సమధికవిభుఁ డగు కులోత్తుంగరా
జేంద్రచోళవిభుని కిష్టుఁడైన
తంత్రముఖ్యుఁ డగుచు మంత్రిగోవిందనం
దనుఁడు కొమ్మనప్రధానుఁ డొప్పె

చ. ఇల వెలనాఁటిచోడమనుజేంద్రునమాత్యత యానవాలుగాఁ
గులతిలకంబుగా మనిన కొమ్మనప్రెగ్గడకీర్తి మాటలన్
దెలుపఁగనేల? తత్ప్రియఁ బ్రతిష్ఠిత మైన తటాకదేవతా
నిలయమహాగ్రహారములు నేఁడును నెల్లెడఁ దామ చెప్పఁగన్.'

వెలనాటిచోడుఁ డనెడి యీ కులోత్తుంగరాజేంద్రచోడునిశాసనములు ౧౧౩౮-వ సంవత్సరము మొదలుకొని ౧౧౮౦-వ సంవత్సరమువఱకును గానఁబడుచున్నవి. ఈ రాజేంద్రచోడుఁడే యుద్ధమునందు టెంకాణాదిత్యుఁ డైన నన్నెచోడుని సంహరించి పాకనాఁడును గైకొన్నట్టు కనఁబడుచున్నది. నన్నెచోడుఁడు కుమారసంభవములో

చ. 'అరినరపాలమౌళిదళితాంఘ్రియుగుం డయి పాకనాఁటియం
దిరువదియొక్కవేయిటి కధీశుఁడునాఁ జను చోడబల్లికిం
జిరతరకీర్తి కగ్రమహిషీతిలకం బన హైహయాన్వయాం
బరశశిరేఖ యైన గుణభాపిని శ్రీసతికిం దమాజుఁడన్.'

అని తన తండ్రియైన చోడబల్లి యిరువదియొక్క వేలయూళ్ళు గల పాక నాఁటి కధీశుఁ డని చెప్పెను. మంచన కేయూరబాహుచరిత్రమునందు రాజేంద్రచోడునిమంత్రి యైన కొమ్మనామాత్యుని వర్ణించుచు

మ. అరుదందన్ వెలనాటిచోడమనుజేంద్రాజ్ఞాపనం బూని దు
స్తరశక్తిం జని యేకవింశతిసహస్ర గ్రామసంఖ్యాకమై
ధరణిం బేర్చిన పాకనాఁడు నిజదోర్దండైకలగ్నంబుగాఁ
బరిపాలించె నమాత్యకొమ్మన జగత్ప్రఖ్యాతచారిత్రుఁడై.'

అని రాజేంద్రచోడుఁ డను నామాంతరము గల వెలనాటిచోడమనుజేశ్వరుని యాజ్ఞానుసారముగా నిరువదియొక్కవేల గ్రామములు గల పాకనాఁటి నమాత్యకొమ్మన పరిపాలించినట్లు చెప్పెను. ఈ పాకనాటి రాజ్యమును క్రొత్తగా గెలిచి రాజేంద్రచోడుఁడు దాని పాలనమున కయి కొమ్మనా మాత్యుని నియమించినట్లు కనుపట్టుచున్నది ఈ విజయము ౧౧౭౦ వ సంవత్సరప్రాంతముల దయి యుండును ఈ కొమ్మనామాత్యుఁడు మంత్రి యగుటయే గాక రణతిక్కనవలె దండనాథుఁ డయి మహాశౌర్యవంతుఁడయి కటకసామంతులు మొదలైనవారిని రణరంగమున భంగించి నట్లీ క్రిందిపద్య ములవలనఁ దెలియవచ్చుచున్నది.

క. చలము మెయి, గటకసామం
తులు కరిహయబహుళసేనతో నేతేఱన్
దలపడియెఁ గొమ్మసచివుఁడు
బలియుండై క్రొత్తచెర్లపరిసరభూమిన్.

సీ. సెలకట్టెవాటునఁ జెలఁగి రెంటిని మూఁటిఁ
గూడ గుఱ్ఱంబుల గుదులు గ్రుచ్చుఁ
బ్రతిమొగంబగు నరపతుల కత్తళమునఁ
గడిమిమై వీఁపులు వెడలఁ బొడుచు
బందంపుగొటియలపగిది నేనుంగుల
ధారశుద్ధిగ నసిధారఁ దునుముఁ

జిదియించు బిగిలించుఁ జేతులతీఁట వో
వడిఁ గాండ మేసి మావతులతలలు

తలపుడికి వ్రేసి మావంతుతలలు శత్రు
రాజశిరములుఁ ద్రొక్కించు రాఁగెఁ దిరుగ
వాగె నుబ్బెడు తన వారువంబుచేత
మహితశౌర్యుండు కొమ్మయామాత్యవరుఁడు.

చ. అరిగజకుంభపాటనవిహారము కొమ్మనమంత్రి సల్పుచో
నురలిన మౌక్తికవ్రజము లుర్విపయిం బొలిచెం దదీయసం
గరహతవీరదోర్గ్రహణకౌతుకసంభ్రమ ఖేచరీకర
స్ఫురతనుమర్దనోద్గళితభాసురహారమణీచయం బనన్.

చోళరాజులు చాళుక్యచక్రవర్తులకు లోఁబడిన సామంతమండలాధీశ్వరు లయ్యును రాజ్యకాంక్షచేత నొండొరులతోఁబోరాడిచంపుచుఁ జచ్చుచు నుండిరి. ఈవెలనాటిచోడునిపుత్రుఁ డైనపృథ్వీశరాజును మనుమసిద్ధి తండ్రి యైనచోడతిక్కభూపాలుఁడు చంపెను. కృతిపతితాత యగు కేతన మంత్రి పృథ్వీశరాజునకు మంత్రిగా నుండెను. ఈ పృథ్వీశరాజునే మనుమ సిద్ధిరాజుయొక్క తండ్రియైన తిక్కనృపాలుఁడు చంపినట్లు నిర్వచనోత్తర రామాయణమునం దీ పద్యమునఁ జెప్పఁబడినది.

ఉ. 'కేశవసన్నిభుండు పరిగీతయశోనిధి గూడతిక్కధా
త్రీశుఁడు కేవలుండె నృపు లెవ్వరి కాచరితంబు గల్గునే
శైశవలీలనాఁడు పటుశౌర్యధురంధరబాహుఁ డైన పృ
థ్వీశనరేంద్రుమస్తకము నేత్తెఱఁ గందుకకేళి సల్పఁడే.'

తిక్కధాత్రీశ్వరుఁడు శైశవదశయందే పృథ్వీశనరేంద్రునిఁ జంపుటచే నిది పదుమూడవ శతాబ్దారంభమునందుజరిగి, తిక్కనరాజు ౧౨౨౦వ సంవత్సర ప్రాంతమువఱకును రాజ్యము చేసి యుండును. ఈ చరిత్రాంశముకూడ తిక్కనరేంద్రుని పుత్రుఁడైన మనుమసిద్ధికాలములో నుండిన తిక్కనసోమ

యాజి ౧౨౫౦ వ సంవత్సరమునకుఁ దరువాత నున్నాఁ డన్న సత్యమును స్థాపించుచున్నది. పృథ్వీశరాజుమంత్రి మనుమఁడైన గుండనామాత్యునకుఁ గేయూరబాహుచరిత్ర మంకితము చేయఁబడి యుండుటచే నీ కవి తిక్కన సోమయాజికాలములోనో కొన్నియేండ్లు తరువాతనో యుండవలెను. కాఁబట్టి యీ మంచనామాత్యకవి ౧౩౦౦ వ సంవత్సరప్రాంతములయం దున్నాఁడని నిశ్చయముగాఁ జెప్పవచ్చును.

ఇతఁడు రాజమహేంద్రపురనివాసి. పయిని జెప్పఁబడిన వెలనాటిచోడుఁడు లోనయిన రాజులు చాళుక్యరాజప్రతినిధులుగా రాజమహేంద్రవరము రాజధానిగా వేఁగిదేశమును బాలించినవారే ! కృతినాయకుఁడు తన్నుఁగూర్చి యన్నట్టుగా కవి యీ క్రింది పద్యమును వ్రాసికొని యున్నాఁడు

క. తన యిష్టసఖుని విద్వ
జ్జనమాన్యుని నుభయకావ్యసరణిజ్ఞున్ మం
చననామధేయు నన్నుం
గనుఁగొని యిట్లనియె వినయకౌతుక మెసఁగన్.

*　*　*　*

క. సాయిరసము శృంగారం
బై యలవడఁ గథలు నీతులై యెడనెడ రాఁ
గేయూరబాహుచరితము
చేయుము నీ వంధ్రవాక్యశిల్పము మెఱయన్.'

ఈకేయూరబాహుచరిత్రమునందు

ఉ 'బాలరసాలసాలనవపల్లవకోమలకావ్యకన్యకన్
గూళల కిచ్చి యప్పడుపుకూడు భుజించుటకంటె సత్కవుల్
హాలికులైన నేమి మఱియంతకు నాయతిలేనినాఁడు కౌ
ద్దాలికులైన నేమి? నిజదారసుతాద్యభిరక్షణార్థమై.'

అను పద్యము ప్రథమాశ్వాసమునఁ గానఁబడుచున్నది. ఇటీవలివారు దీని కర్తృత్వమును బమ్మెరపోతరాజున కారోపించి వాడుకలో నున్న యా కథను గల్పించియుందురు. కావ్యకన్యను కూళల కియ్యఁగూడదు గాని

మంచివారి కీయవచ్చునని కవి తాత్పర్యమైనట్టు దానిక్రిందనే యున్న యీ పద్యము తెలుపుచున్నది.

క. 'అని తగనివానిదెస నా
మనసెప్పుడు రోయుఁగాన మతివజ్జనవ
ర్జనలకు మిగిలిన సుగుణుని
నినుఁ బొంది మదీయకవిత నెగడుం బుడమిన్.'

ఈకేయూరబాహుచరిత్రకవిత్వము రసవంతముగా నున్నది. ఇందుండి కొన్ని పద్యముల నిం దుదాహరించుచున్నాను.

చ. దలముగ నెల్లప్రొద్దును లతానివహంబుల రాలు పుప్పొడుల్
పులినతలంబులై చెలువుపూనఁగ మీఁదటఁ దేలు కేతకీ
దళములమొత్త మోడలవిధంబు నటింపఁగఁ బాఱుఁ బెద్దలై
ఫలరసవాహినుల్ పురియుపాంతవనంబులఁ గొన్నిచోటులన్. ఆ. ౧

ఉ. ఎప్పటియట్ల యింతిఁ గని యే తైఱ మ్రొక్కిన దానివల్లభుం
డప్పుడు దిగ్గన న్నెగసి యచ్చటఁ దోఁచిన వాఁడు దిట్టఁడై
తప్పక యన్నిదిక్కులకుఁ దా వెస మ్రొక్కి ప్రదక్షిణంబుతోఁ
జప్పుడుగాఁగ మెచ్చుచును జంద్రమరీచికి మ్రొక్కెఁ బల్మఱున్.
ఆ. ౨

మ. పగలెల్ల న్వెలి నిల్చి రాతిరి రహోభంగిన్ స్వగేహంబున
ట్టుగమీఁదన్ వసియించి భార్యపయి దృష్టుల్నిల్పి యుండంగఁబ్రౌ
ద్దగుడున్ గంజిమడుంగుపేర రజకుం డత్యార్ధ నేతెంచినన్
మృగశాబేక్షణ లోచనావరణము ల్మెల్లం దగ న్విచ్చుచున్. ఆ. ౩

చ. పనిచినఁ బోయి చూడ్కులకుఁ బండు వనందగు నుత్సవంబు నిం
పెనయఁగఁ జూచి మళ్ళి తన యిక్కువకుం బెడగాఁ బథాంతరం
బున మన మూని యింటిదెసఁ బోవుట మాని విభుండు మున్నుచే
సిన యుపకారము ల్మఱచి చేడియ చింగ యొకర్చె నాత్మలోన్ ఆ. ౩

# అథర్వణాచార్యుఁడు

అథర్వణాచార్యుని కాలమును నిర్ణయము చేయుటకుఁ గొన్నియాధారములు కనఁబడుచున్నవి. దక్షిణహిందూస్థాన ప్రాచీనలిపి శాస్త్రమును రచించిన బర్నెల్‌దొరవా రథర్వణకారికలలో నక్షరములనుగూర్చి వ్రాయఁబడిన

శ్లో. 'పంచవరాదయో వర్ణా శ్శృంఖశార్ఙ్గాదిసన్నిభాః,
తిర్యగ్రేఖాయుజశ్చోర్ధ్వం దండరేఖాన్వితా అధః.
త ఏవ చ ద్వితీయా స్స్యు రూర్ధ్వరేఖాద్వికాన్వితాః,
ప్రథమా స్తు ద్వితీయాస్స్యు స్తృతీయా స్తే చతుర్థకాః.
రేఖాద్వయాధో దండేన యుక్తాస్స్యు రనునాసికాః
మిశ్రద్దండద్వయోపేతాః ప్రథమా లిపయః స్మృతాః.

ఇత్యాది శ్లోకముల నుదాహరించి, తెలుఁగక్షరములలోఁ బైని జెప్పఁబడిన మార్పులు పండ్రెండవ శతాబ్దాంతమువఱకును గలుగనందున, అథర్వణాచార్యుఁడు పండ్రెండవ శతాబ్దాంతమునకుఁ గాని పదుమూడవ శతాబ్దారంభము నకుఁగాని పూర్వుఁడయి యుండఁజాలఁడని వ్రాసియున్నారు. ఆ గ్రంథము లోనే దొరవా రింకొకచోట నథర్వణాచార్యుఁడు తన త్రిలింగశబ్దాను శాసనములో ప్రథమపరిచ్ఛేదము అయిదవ శ్లోకములోను, తృతీయపరి చ్ఛేదము పదుమూడవ శ్లోకములోను హేమచంద్రునిపే రుదాహరించి నందున ౧౦౮౮-వ సంవత్సరమునఁ గాఁబోలును పుట్టి ౧౧౭౨-వ సంవ త్సరమునందు మృతినొందిన హేమచంద్రుని తరువాతివాఁడని వ్రాసినారు.

అథర్వణకారిక లనఁ బడునవి యథర్వణాచార్యునిచే రచియింపఁబడినవి గాక మఱి యెవ్వరిచేతనో యొక యాధునికునిచేత నాతనిపేరు పెట్టి యిటీవల రచియింపఁబడిన వయినట్టు కనఁబడుచున్నవి. కాఁబట్టి యా కారికావళిని బట్టి యాతనికాలమును నిర్ణయించుటకు వలనుపడదు. అతఁడు మొట్ట

మొదట నొక యాంధ్రవ్యాకరణమును జేసి యటుపై నింకొక యాంధ్ర వ్యాకరణమును జేయుట తటస్థింపదు అధర్వణకారిక లనఁబడెడు వికృతి వివేకము మిక్కిలి యాధునికమని చూపుటకుఁ జాలినన్ని నిదర్శనము లా పుస్తకమునందే యున్నవి. పూర్వకవు లెవ్వరును స్త్రీవాచక తత్సమపదముల కకారాంతములకు సంధి కూర్చి యుండలేదు. ఈ నియమమును మీఱి "గంగనుకాసె" "శ్రీరంగభర్తంచు" అని యాముక్తమాల్యదయందు ౧౫౦౮ లా మొదలుకొని ౧౫౩౦-వ సంవత్సరమువఱకును కర్ణాటకసామ్రాజ్యము నేలిన కృష్ణదేవరాయ లకారాంత తత్సమములకు మొట్టమొదట సంధిని గూర్చినవాఁడు. ఆతనికిఁ బూర్వ మెన్నఁడును లేని యీ నూతన ప్రయోగములకు "కుత్ర చిత్సంస్కృతీయో పి ప్రాణో ఽప్యచ్యుతో భవేత్" అని యధర్వణకారికలయందు లక్షణము విధింపఁబడి యున్నందున కారికల కర్త ౧౫౩౦ వ సంవత్సరమునకుఁ దరువాతివాఁడయి యుండవలెను *

---

* [అధర్వణకారిక లనఁబడు 'వికృతివివేకము' అధర్వణకృతిగా 'తెనుఁగు కవుల చరిత్ర' యందుఁ జెప్పఁబడినది. మఱియు 'ఇందలి (వికృతి వివేకము నందలి) లిపిశ్లోకములలో నుదాహరింపఁబడిన యక్షర విన్యాసమునుబట్టి డాక్టరు బర్నెలు (Dr Burnell) దొరవారితనిని పంద్రెండవ శతాబ్ది నున్నవాఁడని భావించిరి ఇది సమంజసమే! నన్నయభట్టారకుని వెనుక తిక్కనకు ముందుగా భారతమును పూరించుటకుఁ బూనుకొనిన యాంధ్రకవి యధర్వణుఁడు కాని యధర్వణుని కవిత యతి సంస్కృత పదభూయిష్ఠ మగుటచేత వ్యాప్తిలోనికి రాలేదు. శైవకవితాప్రభావము వలన తిక్కన తెనుగుదనము చూపుచు రచించిన భారతము ముందఱ నధర్వణుని భారతము నిలువలేదు.' అనియుఁ గలదు. (తెనుగుకవుల చరిత్ర-పుటలు 303 304)

అధర్వణుఁడు తిక్కనకుఁ దర్వాతివాఁడనియు, నితనికాలము క్రీ శ ౧౨౫౦ ప్రాంతమని తలంపవచ్చుననియు. త్రిలింగ శబ్దానుశాసన, వికృత వివేకములను అధర్వణుఁడు రచింపలేదనియు, 'ఆంధ్రకవి తరంగిణి' లోఁ గలదు. (చూ తృతీయ భాగము-'అధర్వణాచార్యుఁడు)

అధర్వణుఁడు తొలుతఁ త్రిలింగశబ్దానుశాసనమును రచించి, పిదప వివరముగా వికృతి వివేకమును రచించెనని శ్రీ వజ్ఝల - చిన సీతారామస్వామి శాస్త్రులుగారు 'అధర్వణ కారికావళి' పీఠికలోఁ దెల్పి యున్నారు

శ్రీ తిమ్మావజ్ఝల కోదండరామయ్యగారు విజయ-మార్గశిర మాస 'భారతి' లో 'అధర్వణ భారతము' అను వ్యాసమున అధర్వణాచార్యుని భారతము గూర్చిన యమూల్య విషయములను దెల్పిరి ఇంతవఱకు నధర్వణుఁడు భారతములోని విరాటో

జేసెననియు, నది పరమప్రమాణ మనియుఁ జెప్పి యున్నాడు. * ఈ యకలంకుఁడు జైనపండితుఁడు. ఈతఁ డకలంకుఁ డనియు, అకలంక భట్టనియు, భట్టాకలంకుఁ డనియు, అకలంకదేవుఁ డనియు గ్రంథముల యందు వాడఁబడుచున్నాఁడు. ఇతఁడు సంస్కృత సూత్రములతో "శబ్దాను శాసన" మనుపేర కన్నడవ్యాకరణమును జేసి, దానికిఁ దానే "భాషా మంజరి" యను వృత్తిని, మంజరీమకరంద" మను వ్యాఖ్యానమును జేసి యున్నాఁడు. తాము చేసిన వ్యాకరణములకు శబ్దానుశాసనము లని పేరు పెట్టుటయు వానికిఁ దామే వృత్తులను వ్యాఖ్యానములను వ్రాయుటయు మొదటినుండియు జైనపండితులలో నాచారమయి యున్నది. మొట్టమొదట సంస్కృత వ్యాకరణమును జేసిన శాకటాయనుఁ డను జైనపండితుఁడు తన వ్యాకరణమునకు 'శబ్దానుశాసన' మను పేరు పెట్టి దాని 'కమోఘ వృత్తి యను వృత్తిని జేసి యున్నాఁడు. తరువాత హేమచంద్రుఁ డను జైనపండితుఁ డెనిమిది ప్రకరణములు గల 'శబ్దశాసనము'ను సంస్కృత సూత్రములతో ౧౧౭౦-వ సంవత్సరమునందుఁ జేసెను. దానిలోని యెని మిదవ ప్రకరణము ప్రాకృతమునుగూర్చినది. దానినే మనవారు హేమ చంద్రదక్కి యని చెప్పుదురు. సంస్కృతప్రాకృతము లాంధ్రభాషకు ప్రకృతులగుటచేత నొక విధముగాఁ గొంతవఱకు సంస్కృతప్రాకృత వ్యాకరణములను తెనుఁగులక్షణములనియుఁ జెప్పవచ్చును. శబ్దాను శాసన మను పేరితో సంస్కృతసూత్రములతో వ్యాకరణమును జేసిన మూఁడవ జైనపండితుఁడు భట్టాకలంకుఁడు. ఈ కర్ణాటకశబ్దానుశాసనము నాలుగు పాదములను ఏనూటతొంబదిరెండు సూత్రములను గల దయియున్నది. ఇందలి సూత్రము లాంధ్రశబ్దచింతామణిలోని సూత్రములను బోలి యుండును. వాని స్వరూపమును జూపుటకయి యొక్క సూత్రము నిందు వృత్తి వ్యాఖ్యానములతో నిచ్చుచున్నాను.

సూత్రము ౨౪౯.—నవోల్వాలి

* [దీనిచే అకలంకుఁడు చెప్పబడెనని కాని, చెప్పబడినను కన్నడ వ్యాక రణ కర్త చెప్పఁబడెనని కాని చెప్పఁగలను పడదని కొందరందురు.]

వృత్తి—అకారాంతా చ్ఛబ్దా త్పరస్య సుపః శ్లుబ్భ భవతి వోల్ ప్రత్యయే, వాల్ప్రత్యయే చ పరే.

ప్రయోగః—ఇంద్రనవోల్, ఇంద్రనవాల్; చంద్రనవోల్, చంద్రనవాల్. వోల్వాలితికిం ఇంద్ర-బొల్, చంద్రంబొల్.

వ్యాఖ్యా—తస్య తుల్యే వోల్వాల్వితి షష్ఠ్యంతా దేతౌ ప్రత్యయౌ విధాస్యేతే తయోః పరయోః సుపః శ్లుబ్నిషిధ్యతే-తత్రానకారాంతే విభాషయా వక్ష్యమాణత్వాద యమకారాన్త ఏవ నిషేధః వర్యవస్యతీత్యాహ—అకారాంతా దిల్యాది-పూర్వేణ శ్లుపః ప్రాప్తా వయ మారంభః.

అకలంకుఁడు తన శబ్దానుశాసనము నీ మంగళశ్లోకముతో ముగించెను.

శ్లో. 'మంగళం భగవానర్హాన్ మంగళం భగవాన్ జినః,
మంగళం ప్రథమాచార్యో మంగళం వృషభేశ్వరః'

అకలంకుని శబ్దానుశాసనమునుగూర్చి యింత దూర మేమేమో చెప్పియు ముఖ్యముగాఁ జెప్పవలసినదానిని చెప్పకయే యుంటిమి. అతఁడు తన గ్రంథరచనకాలమును పుస్తకముతుద నిట్లు చెప్పెను.

శ్లో. శకవర్షే రస నేత్ర బాణ శశి సంఖ్యే బ్దే తపోమాసికే
భక్తతి శ్రీసితపంచమీ గురు దినే లగ్నే ఘటే పౌష్ణ భే।
అకలంకాహ్వయయోగిశిష్యతిలకో గ్రంథం సతాం మంజరీ
మకరందాఖ్య మిదం మతం వ్యరచయం భట్టాకలంకో మునిః.

ఈ శ్లోకములో తాను మంజరీమకరందాఖ్యవ్యాఖ్యను శకవర్షములు ౧౫౨౬ (అనఁగా క్రీ శ. ౧౬౦౪) శోభకృత్సంవత్సర మాఘశుద్ధ పంచమీ గురువార రేవతీనక్షత్ర కుంభలగ్నమున ముగించినట్లు భట్టాకలంకుఁడు చెప్పెను. అకలంకుఁడు కర్ణాటకశబ్దానుశాసనమును వ్యాఖ్యతోఁడఁగూడ ౧౬౦౪-వ సంవత్సరమునందు ముగించినందున, దానిని చదివి తన కారికలను రచించిన వికృతివివేకకారుఁడు తరువాత నేఁబది, యఱువది సంవత్సరముల కుండి

యుండును. * ఈ కాల మహోబల పండితుని కాలముతో సరిపోవుచున్నది. ఈ కారికలవార్త నహోబలునికిం బూర్వమునం దున్నవా రెవ్వరు నెఱుఁగరు. పూర్వమందున్నవా రనుట యేమి? ఏకకాలమునందే యున్న యప్పకవి సహితమెఱుఁగఁడు. అప్పకవిమీఁది స్పర్ధచేతఁ దన వ్యాఖ్యాన మనఁగా నహోబలపండితీయ మనఁబడెడు కవిశిరోభూషణ మప్పకవీయ మున కంటె మిన్నగా నుండవలె నన్నయభిలాషతో నీ కారికావళిని రచించి తన వ్యాఖ్యానములోఁ జేర్చి యధర్వణాచార్యుని వని లోకమును భ్రమ పెట్టి నమ్మించి యుండె ననుటకు సందేహము లేదు. ♦ కారికల నధర్వ ణుఁడే రచియించి యుండినయెడల

'శ్రుతేఽపశబ్దే చోకే వా ప్రమాదాత్ పాణినిం స్మరేత్
ప్రాకృతే షడ్విధే చాపి వాల్మీకిం వా మహేశ్వరం
ధ్యాయే దత్రతు మామేవ స్మరే త్పండితసమ్మతః.'

ప్రమాదముచేత సంస్కృతమున నపశబ్దము నుచ్చరించినచో పాణినిని స్మరింపవలసినట్లే యాంధ్రమున నపశబ్దము నుచ్చరించినచోఁ దన్నే (యధ ర్వణునే) స్మరింపవలయు నని యింత యత్యధికముగా నాత్మశ్లాఘనను జేసి కొని యుండఁడు. ఈ కారికావళిని తాను రచియించి యుండుటచేతనే యహోబలపండితుఁడు

"యస్సారోఽ ధర్వణే గ్రంధే సోప్యత్రైవ విధీయతే
తేన తత్పక్కికాలోకలోలతా త్యజ్యతే బుధైః.'

అధర్వణుని గ్రంధములో సారభూతమైన దంతయు నిందే చేర్పఁబడి యుండుటచేత పండితు లా గ్రంధమును జూడవలె నన్న యభిలాషను విడిచిపెట్టవలయునని వ్రాసి యున్నాఁడు. గ్రంధ మంతయు నహోబల పండితీయములోనే యుండినప్పుడు వేఱుగా గ్రంథమును జూడవలెనన్న

* [ఇట్లనుట సరికాదనియు, అహలంకుఁడు ప్రాచీనుఁ డొకఁ డున్నాఁడనియు శ్రీ ప్రభాకరశాస్త్రి గారు 'ప్రబంధ రత్నావళి' పీఠికలో వ్రాసియున్నారు.]

[♦ వెనుక ఏవ పుటలోఁ జెప్పినదాని కిది విరుద్ధముగా నున్నది.]

కోరిక గలవారికి గ్రంథము మఱి యెక్కడ దొరకును? ఎక్కడ వైఖరిను కారికావళి పుస్తకరూపమున నున్నను, ప్రకటింపఁబడినను తత్కారికలన్నియు కవిశిరోభూషణమునుండి యెత్తి వ్రాయఁబడినవే గాని వేఱుకావు. నన్నయభట్టునకుఁ బ్రథమాచార్యత్వమును, అథర్వణాచార్యునకు ద్వితీయాచార్యత్వమును, మొట్టమొదట సృజించి యాంధ్రపండిత లోకమున వ్యాపింపఁజేసినవాఁ డహోబలపండితుఁడే యని తోఁచుచున్నది. ఈ కారికలను రచియించినవాఁడు నిజమయిన యథర్వణాచార్యుఁడు గాక పేరు మార్చుకొన్న కృత్రిమాథర్వణాచార్యుఁ డగుటచేత, పాడి వేంకటస్వామిగా రన్నట్లు మొదట గాలి నరసయ్యరూపమునుండి వాతూలాహోబలరూపమునకు మాఱి మరల "వాతూలవంశేఽవతారభూయశ్శ్రీనన్నవిద్వానహమేవ సోఽస్మి" అని తానే చెప్పుకొన్నట్లు విద్వాంసుఁడయి ప్రథమాచార్యుఁడైన యా నన్నయభట్టారకుఁడే యీ యభినవ నన్నయభట్టావతారమున ద్వితీయాచార్యుఁ డయి వికృతివివేకకర్త యయి యుండును. కారికావళికర్తకు ప్రథమాచార్య భావన యకలంకుని శబ్దానుశాసనమును నిపుణముగా చదువుటచేత దానిలోని మంగళశ్లోకమువలనఁ గలిగెను. వికృతివివేక కారుఁడు శబ్దానుశాసనకర్త యైన యకలంకునిశిష్యుఁడైనను కాకపోయినను దన పుస్తకమున దాతవిఁ బేర్కొనుటచేతనే ౧౬౦౪ వ సంవత్సరమునకుఁ దరువాతివాఁడని నిరాక్షేపణీయసిద్ధాంత మేర్పడుచున్నది. అథర్వణునిచే రచియింపఁబడినది త్రిలింగ శబ్దానుశాసన మొక్కటియే కాని వికృతివివేకము కాదు. ఆంధ్రకౌముదీ కారుఁడు తా నథర్వణవ్యాకరణమును జదివిన ట్లీ క్రింది శ్లోకమున జెపి యున్నాఁడు.

> అథర్వణాని కాణ్వాని హ్యాగ్నస్పత్యాని సం విదన్
> కౌముదీ మాంధ్రశబ్దానాం సూత్రాణి చ కరోమ్యహమ్.'

దీనినిబట్టి యథర్వణాచార్యుఁడు పండ్రెండవ శతాబ్దాంతమునందో, పదుమూడవ శతాబ్దాదినో యున్నట్లు నిశ్చయముగాఁ దెలియవచ్చుచున్నది. అహోబలపండితు లీతనిని ద్వితీయాచార్యుఁ డని వాడుటయు, ఇతఁడు

భారతమునందలి విరాటపర్వము మొదలుకొని తెనిఁగింపఁబూనుటయు కూడ నథర్వణాచార్యుఁడు నన్నయభట్టునకుఁ దర్వాతను దాదాపుగా తిక్కనసోమ యాజికాలములోను ఉన్నట్టు చూపుచున్నవి. ఈతని ఛందస్సులో

క. 'మగణమ్ముఁ గదియ రగణము
వగవక కృతిమొదట నిలుపువానికి మరణం
బగు నిక్క మంద్రు మడియఁడె
యగు నని యిది తొల్లి వేంకణాదిత్యుఁ డనిన్.'

అను పద్య ముండుటచేత నితఁడు నన్నెచోడునికిఁ దరువాత బహుకాలమున కుండినవాఁ డని తెలియ వచ్చుచున్నది. కాఁబట్టి యితఁ డిప్పటి కాఱునూటయేఁబది సంవత్సరములక్రిందట నుండెను. ప్రథమాచార్యుఁ డనఁబడు నన్నయభట్టారకుని తరువాతనే యాతఁ డుండక పోయినయెడల, ఈతనిని ద్వితీయాచార్యుఁ డనుట యెట్లు తటస్థించును? నన్నయభట్టారణ్యపర్వమువఱకును తెనిఁగించిన తరువాతనే యీతఁడు భారత మాంధ్రీకరింపఁబూని యుండనియెడల, విరాటపర్వము మొదలుకొనియే తెలిఁగించుటకుఁ గారణ మేమియు నగపడదు. నన్నయభట్టారకుఁడు తన గ్రంథప్రాశస్త్యమునకయి యథర్వణభారతమును కాల్చివేసె నన్న కథ యెంతమాత్రము విశ్వాసార్హమైనదికాదు. అథర్వణాచార్యుఁడు తిక్కన కాలములో ననఁగా ౧౨౬౦-వ సంవత్సరప్రాంతములం దుండినవాఁడు. అథర్వుఁణుడన్న పే రాంధ్రులలో లేదనియు, ఇది కల్పితనామమయి యుండు ననియు నొకరు వ్రాయుచున్నారు. అయిన నయి యుండవచ్చును. గాలి నరసయ్యశాస్త్రి తనపేరు బాగుగా లేదని ప్రభంజనాహోబలపండితుఁ డని పేరు పెట్టుకొన్నట్టుగానే, తల్లిదండ్రులు నాలయ్యవంటి పేరేదో పెట్టి యుండఁగా నది గౌరవావహమైనది కాదని నాలవ దథర్వవేదమయినందున పూజనీయమయిన యా పేరు పెట్టుకొని యుండనువచ్చును. లేదా యితఁడు జైనుఁడు గనుక జైనులలో నట్టిపే రుండిన నుండనువచ్చును. అథర్వణుఁ డాంధ్రమునందు తగినంత పాండిత్యము గల సంస్కృత విద్వాంసుఁడైన జైనపండితుఁడు. ఇతఁడును దిక్కనసోమయాజియు

నించుమించుగా నేకకాలమునందే నన్నయభట్టు విడిచిన భారతభాగమును దెనిఁగింప నారంభించి యుందురు. ఇతఁడు రెండు మూఁడు పర్వములను మాత్రమే తెలిఁగింపఁగలిగెను; తిక్కన పదునేనుపర్వములును జేసి గ్రంథము ముగింపఁగలిగెను. ఈతనికవిత్వము సంస్కృతసమాసపద భూయిష్ఠ మయి, సామాన్యులకు దురవగాహమయియుండెను; తిక్కన కవిత్వ మాంధ్రపదభూయిష్ఠమయి బహుజన సుఖావగాహమయి యుండెను. ఈ హేతువుచేతనే తిక్కనభారతము సర్వజనాదరణపాత్రమయి దేశమం దంతటను వ్యాపింపఁగా, నథర్వణభారతము కతిపయపండితజనైకాదరణపాత్ర మయి సర్వజనీన వ్యాప్తి గాంచక యాంధ్రదేశమున మృగ్య మయినది. అది యిప్పుడు కతిపయ పూర్వలక్షణగ్రంథములయం దుదాహరింపఁబడిన పద్యరూపమున జీవించి యుండుటయే కాని సంపూర్ణపుస్తకరూపమున నెందును గానఁబడక నామమాత్రావశిష్టమయి యున్నది.

తిక్కనసోమయాజి భారతరచనము చేయ నారంభించునప్పటి కథర్వణా చార్యుఁడు త్రిలింగశబ్దానుశాసనమును జేసి యుండలేదు. ఆ కాలమునందు దశకుమారచరిత్రమును దిక్కన కంకితముచేసిన కేతనకవి తన యాంధ్ర భాషాభూషణవ్యాకరణమునందు

క. 'మున్ను తెలుఁగునకు లక్షణ
మెన్నఁడు నెవ్వరును జెప్ప; రేఁ జెప్పెద వి
ద్వన్నికరము మది మెచ్చఁగ
నన్నయభట్టాదికవిజనంబులకరుణన్.

గీ. సంస్కృతప్రాకృతాదిలక్షణము చెప్పి
తెలుఁగునకు లక్షణము మున్ను దెలుపకునికి
కవిజనంబులనేరమి కాదు; నన్ను
ధన్యుఁ గావింపఁ దలఁచిన తలపు గాని.'

అని యా వఱకెవ్వరును వ్యాకరణముచేసి యుండలేదని స్పష్టముగాఁ జెప్పెను. త్రిలింగశబ్దానుశాసనము మిక్కిలి పురాతనమయిన దనఁగా

వన్నయభట్టుభారతమునకంటెను బ్రాచీన మయినదని చూపుటకయి పాడి వేంకటస్వామిగా రాంధ్రపత్రికయుగాదిసంచికలోఁ దమ వ్యాసమునందు బెర్నలుగారు చెప్పిన హేమచంద్రునిబాధ తొలంగునట్లుగా "హేమచంద్రాది మునిభిః కథితం చాంద్రలక్షణం" ఇత్యాది శ్లోకములలో హేమచంద్రుఁ డన్నది సోమచంద్రుఁ డని యుండవలెనని చెప్పిరి. హేమచంద్రుఁ డె ట్లాంధ్రవ్యాకరణకర్త గాఁడో యట్లే సోమచంద్రుఁడును నాంధ్రవ్యాకరణ కర్త కాఁడు. ఈ మార్పు సహితము త్రిలింగశబ్దానుశాసన మత్యంత పురాతనమని సాధించుటకుఁ బనికి రాకపోవుటయే కాక, యథర్వణా చార్యుఁడు మఱింత యర్వాచీనుఁడని చూపుటకే తోడుపడుచున్నది. జైన పండితుఁడయి సోమదేవుఁ డనఁబడెడి యీ సోమచంద్రుఁడు ౧౨౦౫-వ సంవత్సరమునందు 'శబ్దార్ణవ చంద్రిక' యను సంస్కృతవ్యాకరణమును రచియించెను. సోమచంద్రుఁ డన్న పాఠమునకంటెఁ ద్రిలింగశబ్దానుశాసనములో ననేక స్థలములయం దున్న హేమచంద్రుఁ డన్న పాఠమే సరియైనది. త్రిలింగశబ్దానుశాసనమునందు హేమచంద్రుఁడు మునిఁగా జెప్పఁబడినాఁడు; అందు విశేష మేదియు లేదు. జైనులు తమ విద్వాంసులను మునులనుగాఁ జెప్పుటయు, విద్వాంసులే తమ్ము మునులనుగాఁ జెప్పుకొనుటయు నాచార మయి యున్నది. కర్ణాటకశబ్దానుశాసనమును రచియించిన యకలంకభట్టు "భట్టాకలంకో మునిః" అని తన్నుఁగూర్చియే తన పుస్తకములోఁ జెప్పు కొనెను.

> శ్లో. 'బార్హస్పత్యాని సర్వాణి । కాణ్వం వ్యాకరణం విదన్
> కరో మ్యథర్వణం శబ్దం । సర్వలక్షణలక్షితం.'

అని బృహస్పతివ్యాకరణమును, కణ్వవ్యాకరణమును సర్వమును జూచి తా నీ వ్యాకరణమును రచియించిన ట్లారంభములోనే యథర్వణుఁడు సెప్పు చున్నాఁడు. ద్రావిడులు తమ యఱవభాష కగస్త్యుండు వ్యాకరణము చేసె నని చెప్పుకొనునట్లే తెలుఁగువ్యాకరణములు సహితము ఋషిప్రోక్తము లన్నచో భాషకు గౌరవము వచ్చునని గొప్పకు చెప్పుకొన్నవే కాని యీ వ్యాకరణము లన్నియుఁ గవీశ్వరుల మానస సృష్టిలోనివేగాని యెప్పుడును

వ్యవహారములో నుండినవి కావు. ఆంధ్ర వ్యాకరణములు చేసినవా రొక్క- దేవతలును, ఋషులును మాత్రమే కారు. వారిలోఁ గవిరాక్షసునివంటి రాక్షసరాజులును గలరు. శ్రీరాములకు శత్రువైన రావణుఁడు కూడఁ దెలుఁగుభాషకు త్రేతాయుగమునందే వ్యాకరణము చేసెను.

"అనుక్తం సర్వశాస్త్రం తు। రావణీయే విలోకయేత్."

త్రిలింగశబ్దానుశాసనములో లేని విషయముల నన్నిటిని రావణవ్యాకరములోఁ జూచి తెలిసికోవలెనఁట! త్రిలింగశబ్దానుశాసన మన్నపేరు పెద్దదిగా నున్నను, దానిలోఁ జెప్పఁబడిన విషయములు మాత్ర మత్యల్పములు. ఈ కాలపు చిన్న వ్యాకరణములలో సాధారణముగాఁ జెప్పఁబడు విశేషము ములు సహితము దానియందు లేవు. ఆరంభదశలోఁ జేయఁబడిన వ్యాకర ణములలో దేనిలోను విశేషాంశము లుండవు. ఆ కాలములోనే చేయఁబడిన తిక్కన 'కవివాగ్బంధనము' మొదలైన లక్షణగ్రంథములలో సహితము విశేషాంశములు లేవు. ఆంధ్రభాషయే యెఱిఁగినట్టు కనఁబడని బృహస్ప త్యాదులు చేయని వ్యాకరణములను చేసినట్టు మన పండితులు చెప్పి రన్న విశ్వాసార్హముగా నుండునా? యని మనవారు సందేహపడవచ్చును. ఎప్పటి పండితుల మాటయో యేటికి? మన యీ కాలపు పండితులే యాంధ్రభాషావిషయమున "భౌతిక కళానిధి" లో నేమిర్వాసిరో చిత్త గింపుఁడు.

శ్లో॥ 'యుగభేదా దాంధ్రభాషాచార్యభేదః ప్రకీర్త్యతే।
కృతే సుధాయనః ప్రోక్త స్త్రేతాయాం శుకనాభకః॥ ౧
దివోదాసశ్చ శల్యాతి రింద్రమిత్ర స్తథైవ చ
భాషాచార్యా ద్వాపరే స్యు స్తిష్యే భూన్నందివర్ధనః॥ ౨
తతో దేవశరాయశ్చ తస్య శిష్యో నియోగికః।
ఏతే క్రమా దాంధ్రభాషాచార్యా స్సంప్రకీర్తితాః॥ ౩
అథాంధ్ర భాషానామాని యుగభేదా త్ప్రచక్షతే।
ఆంధ్ర మాంధ్రేయణం చైవ మల్లకో గుహ్యక స్తథా॥ ౪

కోసలో ద్రామిళశ్చైవ క్రౌంచో హేరంబక స్తథా।
గుహ్యకో పిరకశ్చైవ కాళింగో రౌద్ర మేవ చ॥' ౫

మనము ప్రథమాచార్యుఁడు, ద్వితీయాచార్యుఁడు నన్న మాటలకే శంకపడుచుండఁగా, కృతయుగమునందు సుధాయనుఁడు, త్రేతాయుగమునందు శుకవాభుఁడు. ద్వాపరమునందు దివోదాసుఁడు శల్యాతి యింద్రమిత్రుఁడు, కలియుగమునందు నందివర్ధనుఁడు, దేవశరాయఁడు నని యాంధ్రభాషాచార్యులు మీఁదుమిక్కిలి మఱి యేడుగు రయినారు ఆంధ్రము, ఆంధ్రేయణము, మల్లకము, గుహ్యకము, కోసలము, ద్రామిళము, క్రౌంచము, హేరంబకము, పిరకము, కాళింగము, రౌద్రము, అని యాంధ్రభాషాభేదములు ద్వాదశాదిత్యులవలెఁ బంద్రెం డయినవి

శ్లో॥ 'తిషేయ ద్వావితి యదుక్తం తచ్ఛృణుష్వ సమాహితః।
కృష్ణాగోదావరీమధ్యదేశే పాపవివర్జితే॥ ౧

దివ్యే గోకుల్యపార్శ్వస్థభార్గవక్షేత్రసన్నిధౌ।
గోదావర్యాశ్చోత్తరస్థతట గంగాముఖే స్థితామ్॥ ౨

యాం పురీం శాసతి విభు శ్శాతకర్ణి ర్మహాయశాః।
తస్యాం మాహేంద్రపుర్యాం తు విష్ణువర్ధనపుత్రకః। ౩

సర్వశాస్త్రవినీతజ్ఞో వేదవేదాంగపారగః।
సర్వభాషారహస్యజ్ఞ శాంతో దాంత స్సమాహితః॥ ౪

శాతకర్ణే ర్మహారాజ్ఞ స్సభాధ్యక్షః సుబుద్ధిమాన్।
నందివర్ధననామాభూత్త స్య శిష్యో నియోగికః॥ ౫

ఆంధ్రభాషారహస్యజ్ఞో నామ్నా దేవశరాయకః
తా వుభా వాస్థానసభాప్రదీపా వితి వర్ణితౌ॥ ౬

రాజాజ్ఞాం శిరసా ధృత్వా తావుభౌ పండితోత్తమౌ।
కలౌ యుగే ష్టపంచాశోత్తర త్రిశతవత్సరే॥ ౭

కళింగాంధ్రం చ రౌద్రాంధ్ర స్థాపయామాసతు స్స్వయం॥' Ete ,

పూర్వోక్తములైన ద్వాదశాంధ్రభాషలలో కలియుగమునందు రెండాంధ్రభాషలు పుట్టినవి. పాపరహితమైన కృష్ణాగోదావరీ మధ్యదేశమునందు దివ్యమయి గోకుల్యపార్శ్వస్థమైన భార్గవక్షేత్రమున గోదావరియొక్క యుత్తరతటమున గంగాముఖ మను ప్రదేశ ముండెను. ఆ ప్రదేశమున మహాయశుఁడైన శాతకర్ణి పాలించుచుండిన మహేంద్రపురమునందు విష్ణువర్ధనుని పుత్రుఁడును, సర్వశాస్త్రవినీతజ్ఞుఁడును, వేదవేదాంగపారగుఁడును, సర్వభాషా రహస్యజ్ఞుఁడును, శాంతుఁడును, దాంతుఁడును, శాతకర్ణిమహారాజుయొక్క సభాధ్యక్షుఁడును, సమాహితుఁడు నైన నందివర్ధన నామధేయుఁ డుండెను. ఆతనికి శిష్యుఁడయి నియోగియు, నాంధ్రభాషారహస్యజ్ఞుఁడు నైన దేవళ రాయఁ డుండెను. వా రుభయులును రాజాస్థానసభాప్రదీపములుగా వర్ణింపఁ బడుచుండిరి. పండితోత్తములైన వీ రిద్దఱును రాజాజ్ఞను శిరసావహించి కలియుగమున మున్నూటయేఁబదియెనిమిది సంవత్సరమునందు స్వయముగా కళింగాంధ్రమును, రౌద్రాంధ్రమును స్థాపించిరి. ఇది కలియుగాబ్దము ౩౦౫౮ అగుటచేత పూర్వోక్తమయిన వృత్తము నడచి యిప్పటికి నాలుగువేల యాఱునూట యఱువది సంవత్సరము లయినది. ఇఁక పూర్వకాలాంధ్ర భాషాకవనరీతిని గూడఁ గొంచెము చిత్తగింపుఁడు. కృతయుగమున సుధా యనుఁడు స్థాపించిన భాష కాంధ్ర మని పేరు గలుగుటకుఁ గారణమును విశ్వేశ్వరభట్టాచార్యులవారు భాషాముకుర మను నాంధ్రగ్రంథమునం దిట్లు వ్రాసియున్నారఁట.

సీ. 'ఖేచరకిరణాగ్ని దగ్గిబోడరముచే
సత్యభాగుడియిండ్ల భాసముదర
అగ్నిమిత్రుడంధకత ఝడంగె డుమ్మిలో
కడిజగ్ధిభాస్కరుం మననమొంది
బొరవిన జెరణినిం గడగుడి గెరగించి
గుడగనోచి భాబిందు లడగదొడసె
అడుగ నా భామణి నవభవకరమొంద్రు
త్సలరించి వరుణకరగాగర్భ బవిడె

గ్రుడువించు గ్రుమ్మల గరిమమనడై
దిఙ్ముఖము లరలించు భోగరింద్ల
భాసమెరయ భాసముబ్బరించె
వాని కంశుగురుడు.

(అర్థము—ఖేచరకిరణాగ్నిడగ్గి బోడరముచే=సూర్యకిరణాగ్ని వలనఁ గలిగిన యెండపిడుగులచే; సత్యభాగుడియింద్ల = కన్నులయొక్క? భాసము= ప్రకాశము, ఉదర = నశింపఁగా; డుమ్మిలో = భూమియందు; అగ్నిమిత్రుఁడు = అగ్నిమిత్రుఁ డనెడువాఁడు; అంధకతరుడంగె = గ్రుడ్డితనమును బొందెను; కడి=అనంతరము; భాస్కరుం=సూర్యుని; జగ్గిచే= భక్తిచేత; మననమొంది = ధ్యానముచేసి; బొరవిన = కుంభకమార్గముచే; జెరణినిం=జీవాత్మను; గడగుడిగెరగించి = సూర్యునియందర్పించి; గుడగనోచి = సూర్యప్రార్థనచేసి; భాబిందులడగదొడనె = కన్నులియ్యవేఁడుకొనెను, అడుగ = అడుగఁగా; అభామణి = ఆసూర్యుఁడు; నవభవకరమొంద్రు=చంద్రకిరణములవలె; త్సలరించి=చల్లనిస్వభావముగలవాడయి; వరుణకరగా గర్పబవిడె=సూర్యుని జలకిరణములచే గర్భముదాల్చిన మేఘమునుండి, గ్రుడవించు గ్రుమ్మలగరిమమనుడై =చల్లగ గురియు వాన చినుకులనుబోలు మనముగలవాఁడై దిఙ్ముఖములరలించు; దశదిక్కుల వ్యాపించునట్లు; భోగరింద్లభాసమెరయ = దంతకాంతులు ప్రకాశించుచుండఁగా; అంశుగురుడు = సూర్యుఁడు; వానికి = అగ్నిమిత్రునకు; భాసముబ్బరించె =భాష నుపదేశించెను.)

క. భాగురు భాషాప్రబొమ్మన
భాగుడిబొమ్మిండ్లబిందు ల్భాసము నందెఁ
భాబుష్పభాషవానాంధమున్
రాతీయ్యగనది నాంధ్రమనుంచు బరువడినందెన్.

(అర్థము—భాగురుభాషాప్రబొమ్మన = సూర్యునిచే ననుగ్రహింపఁబడిన భాషాప్రభావముచే; భాగుడిబొమ్మిండ్లబిందుల్ = అగ్నిమిత్రునినేత్ర

బిందువులు; భాసమునొందె౯ = ప్రకాశమును బొందెను; భాబుష్వభాష = సూర్యునిచేవచ్చినభాష; వాని = అగ్నిమిత్రుని; అంధమున్ = గ్రుడ్డితనమును; రాతియ్యగ = నాశనపఱుప(గా, అది = ఆ భాష; ఆంధ్రమనుంచు = ఆంధ్ర భాష యని; బరువడినందెన్ = ప్రసిద్ధినొందెను.)

పయి పద్యముల తాత్పర్యము—పూర్వమొకప్పు డెండ యధికమయి యగ్నిపిడుగులు పడి యగ్నిమిత్రుని కన్నులు పోయెను; అత(డు తనకు కన్ను లియ్యవలసినదని సూర్యుని ప్రార్థింప(గా సూర్యు డతనిభక్తికి మెచ్చి యతని కొక భాష ననుగ్రహించెను; ఆ భాషాప్రభావమువలనను, సూర్యానుగ్రహమువలనను మరల నగ్నిమిత్రున కంధత్వము పోయి కన్నులు వచ్చెను; ఆ భాష యాతని యంధతను బోగొట్టినందున దాని కాంధ్రభాష యని పేరు కలిగెను.

అథర్వణాచార్యు(డు మొదట త్రిలింగశబ్దానుశాసన మను వ్యాకరణము నొకదానిని చేసి తరువాత వికృతివివేక మను వ్యాకరణ కారికావళిని రచించి నా(డన్న వాడుక కలదు గాని యది సత్యముకాదు. ఈ కడపటిది యథర్వణ కృతము కానేరదు. వికృతివివేకమునం దాంధ్రశబ్దచింతామణిలో లేని లక్షణము లనేకములు చెప్ప(బడి యున్నవి. ఈ గ్రంథము సంజ్ఞా పరిచ్ఛేదము, సంధిపరిచ్ఛేదము, అజంతపరిచ్ఛేదము, హలంతపరిచ్ఛేదము, క్రియాపరిచ్ఛేదము అని యైదుభాగములుగా భాగింప(బడి కారిక లన(బడు మూ(డు వందల శ్లోకములను గలిగి యున్నది. ఈ కవి రచియించిన తెలు(గుభారత మిప్పటికి మాకు దొరకనందున, కవి వంశాదులనుగూర్చి యేమియు( జెప్పజాలము. లక్షణగ్రంథములం దుదాహరింప(బడిన పద్యము లను బట్టి చూడ(గా నిత(డు విరాటోద్యోగభీష్మపర్వములను రచించినట్లును, కవిత్వము రసవంతమయి సంస్కృతపదబహుళముగా నుండునట్లును తెలియ వచ్చుచున్నది. అప్పకవి విరాటపర్వములోని యీ క్రిందిపద్యముల నుదాహరించియున్నా(డు.

గీ. ధర్మతనయ యుష్మదా-జ్ఞానిగళవిని
బద్ధమగుచుఁ జిక్కువడియెఁ గాక
విజయమత్తగజము విడివడ్డచో నడ్డ
పాటుగలదె విష్టపత్రయమున.

క. శ్రీకరుఁ డెదురునపుడు వ
నౌకోధ్వజ మింద్రమకుట మర్దనతురగా
నీకము దివ్యశతాంగము
నా కవ్వడి కబ్బియున్న నతఁ డేమగునో.

క. ఆ కర్ణదురాలాపము
లాకర్ణింపఁగ నసహ్యమై ద్రోణునితో
నాకనదీసుతుఁ డనియె వ
నౌకోధ్వజ మెఱుఁగ వచ్చునరుఁ జూపి తగన్.

కవిచింతామణియందు వెల్లంకి తాతంభట్టుచేత నుదాహరింపఁబడిన యీ క్రింది పద్య ముద్యోగపర్వములోని దయి యుండవలెను.

శా. తృష్ణాతంతునిబద్ధబుద్ధు లగు రాధేయాదులం గూడి శ్రీ
కృష్ణుం గేవలమర్త్యుఁగాఁ దలఁచి పూర్ణింపంగ నుత్సాహవ
ర్ధిష్ణుండయ్యె సుయోధనుం డకట ! ధాత్రీనాథ ! యూహింపుమా
యుష్ణీషంబునఁ గట్టవచ్చునె మదవ్యాధోగ్రశుండాలమున్.

కూచిమంచి తిమ్మకవిచే సర్వలక్షణ సారసంగ్రహమునం దుదాహరింపఁబడిన యీ క్రిందిపద్యము భీష్మపర్వాది దగుట స్పష్టము.

క. పదిదినము లయిదుప్రొద్దులు
పదఁపడి రెణ్ణాళ్ళు నొక్క పగలున్ రేయున్

గదనంబుఁజేసి మడిసిరి
నదిసుత గురు కర్ణ శల్య నాగపురీశుల్. *

అథర్వణభారతములోని యీ క్రింది మూఁడు పద్యములను నాంధ్ర సాహిత్యపరిషత్పుస్తకభాండారములో నున్న యుదాహరణపద్యగ్రంథము నుండి కైకొనఁబడినవి.

సీ. రాజమండలపూర్ణరాజమండలవిధి
　　　రత్నగర్భామలరత్నగర్భ
గంధర్వగంధర్వగంధర్వనగరంబు
　　　నాగపున్నాగపున్నాగవనము
మార్గణమార్గణమార్గణపీఠము
　　　త్తుంగభుజంగభుజంగభూమి
కాంతకాంతారాతికాంతకుంతస్థలి
　　　వీరకుమారకుమారసరసి

యనఁగఁ బొగడు కెక్కు నలకాపురంబు దే
వేంద్రుపురము దానవేంద్రుపురముఁ
గ్రేణి సేయు లలితశోణాంశుమణిబద్ధ
గోపురంబు హస్తినాపురంబు '

మ. నతనానావనినాథయోధమకుటన్యస్తాబ్జరాగోజ్జ్వల
　　ద్యుతివిభ్రాజితపాదపీఠు లలనాదోశ్చామరోద్ధూతమా

---

* ఈపద్య మల్పభేదముతో నన్నయభట్టారకుని యాదిపర్వమునందును గానఁబడుచున్నది; గాని యీయర్థమే వచ్చెడి యీ క్రిందిపద్యము దానిపయినే యున్నది గాన నిది యథర్వణభారతములోనిదే యయి యుండవచ్చును.

తరల. పదిదినంబులు భీష్ముఁ డాహవభారకుండు గురుండు పం
　　చదివసంబులు గర్ణుఁడు న్దివసద్వయంబు దినార్ధ మం
　　దుదితతేజుఁడు శల్యుఁ డత్యధికోగ్రవీరగదారణం
　　బది దినార్ధముగాఁగ నిటు మహాభయంకరవృత్తితోన్.

రకల్లోలాళివినీలకుంతలుఁ బ్రభారుగ్గాముఁ గేయూరశో
భితబాహాపరిఘున్ సువర్ణధరణీభృద్ధైర్యు దుర్యోధనున్.

మ. ప్రణతాశేషవసుంధరాధిపశిరస్స్రగ్గంధలుబ్ధభ్రమ
ద్క్వణదభ్రభ్రమకృద్ద్విరేఫగణఝుంకారప్రదాబద్ధసం
స్రణవత్పుత్రప్రథితప్రవర్ధితసమస్తక్షత్రసూయాధ్వర
క్షణసింహాసనభాసితున్ ధృతధనుశ్శ్లాఘానుజున్ ధర్మజున్.

ఈ కవి తెలుఁగున ఛందస్సునుగూడ రచియించియున్నాఁడు. దాని 'కథర్వణఛందఁ' స్సని పేరు. దానియందలి రెండు పద్యముల నిందు క్రింద నుదాహరించుచున్నాను.

క. 'అనిలానలసంయోగం
బనఘా ! కీలాకరాళమగు వహ్నిభయం
బొనరించుఁ గర్తగృహమున
ననుమానము లేదు దీన నంద్రు కవీంద్రుల్.

క. మునుకొని పద్యముఖంబున
ననిలగణం బిడిన నాయురారోగ్యంబుల్
కొనసాగు దానిముందఱ
ననలగణం బిడినఁ బతికి నలజడి సేయున్.'

# కాచవిభుఁడును, విట్ఠలరాజును

ఈ కాచ లిరువురును రంగనాథరామాయణమును రచియించినట్లు చెప్పఁబడి యున్న బుద్ధరాజుయొక్క పుత్రులు. వీరు పదుమూఁడవ శతాబ్దమధ్యమున నుండి యుందురు. వీ రిరువురును జేరి తమ తండ్రి యాజ్ఞ నొప్పున నుత్తరరామాయణమును ద్విపదకావ్యమునుగా రచియించినట్లు గ్రంథాదియం దున్న పీఠికవలనఁ దెలియవచ్చుచున్నది.

ద్వి. కోనకులార్ణవకువలయేశుండు
నా నొప్పు కోటగన్నక్షితీంద్రునకు *
ననఘాత్మ యగుచున్న యన్నమాంబికకుఁ
దనయుఁడు బుద్ధాభిధానుండు పనుప
నారయ మత్స్యకూర్మాదిదివ్యావ
తారంబులం దెల్లఁ దలఁచి చూడంగ
రామావతారంబు రమణీయ మగుట
రాముపావనచరిత్రము దివ్యభాష
లోకానురంజనశ్లోకబంధములఁ
జేకొని వాల్మీకి చెప్పినజాడ
మా తండ్రి బుద్ధక్ష్మానాథు పేర
నాతతనృపకైరవాప్తుని పేర
ఘనుఁడు మీసరగండకాచవిభుండు
వినుతశీలుఁడు పినవిఠలభూపతియు
నని జనుల్ మముఁ గొనియాడంగ మేము
వినుతనూతనపదద్విపదరూపమున

* [బుద్ధరాజుతండ్రి విట్ఠలరాజని రంగనాథ రామాయణము]

ప్రాకటంబుగ నాంధ్రభాషను జెప్పఁ
గైకొన్నయుత్తరకథ యెట్టి దనిన.

ఈపుస్తకముయొక్కకవనధోరణి రంగనాథరామాయణమును బోలియున్నది. కాఁబట్టి యీయుత్తరకాండమునుగూడ రంగనాథుఁడే రచియించి పూర్వ కాండములకు బుద్ధరాజును కృతికర్తనుగాఁ జేసినట్టే దీనికిఁ దత్పుత్రులను గృతికర్తలనుగాఁ జేసి యుండ వచ్చునని యూహింపఁదగి యున్నది. అయినను, ఇతర నిదర్శనములు లేక యిది యిట్లని నిశ్చయింప వలను పడదు. ఈక్రింది యుదాహరణమువలనఁ బుస్తకముయొక్క కవిత్వశైలి కొంత తెలియవచ్చును.

ద్వి. అంతట రంభయు నంభోజసరసి
దంతి చొచ్చినచొప్పు తనకుఁ బాటిలినఁ
జింతాపరంపర చిత్తంబులోన
నంతకంతకు దట్టమై కడ లొత్తనఁగఁ
దలఁకుచుఁ గొంకుచుఁ దనలోనఁ దానె
పలుకుచుఁ బులిబాఱిఁ బడి వడిచెడిన
హరిణిచందంబున నటఁ దొట్రుపడుచుఁ
బిరిగొన్నదురవస్థఁ బ్రియుపాలి కరిగి
యడుగులఁబడి లేచి యందంద మేను
వడఁకంగ వదనంబు వంచి హారములు
పెనఁగొన గనయంబు ప్రిదులలోఁ జెరివి
కొనిన పూవులు గందఁ గ్రొమ్ముడి వీడఁ
దొంగలిఱెప్పలఁ దోఁగు బాష్పములు
తుంగ స్తనంబులఁ దొరుఁగ నట్లున్నఁ
గనుఁగొని యిది యేమి కాంత నీచంద
మనవుడు నాలేమ హస్తముల్ మొగిచి
నడుకుచు నాపల్క నాల్కకు రాక

కడుఁదూలి గద్గదకంఠయై పలికె
నేను నీయొద్దకు నేతేర నింద్రు
పై నెత్తిపోవుచుఁ బంక్తి కంధరుఁడు
సేనతోఁ గలధౌతశిఖరిపై విడిసి
తా నందు ననుఁ గాంచి దర్పాంధుఁ డగుచు
నేనుఁ గోడల నన నిఱియంగఁ బట్టి .
నాన దూలఁగ బిట్టు నను గాసి చేసెఁ
గావున నీ తప్పుఁ గావంగఁ దగదు
నావుడు నలిగి యా నలకూబరుండు &c.

# మారన

మారన యను కవి తిక్కనసోమయాజుల శిష్యుఁడు. ఇతఁడు మార్కండే యపురాణమును తెనిఁగించెను. నీతిబోధక మయి సర్వజనరంజక మయి యున్న హరిశ్చంద్రోపాఖ్యానము కథయుఁ బ్రబంధరత్నమని కొనియాడఁ బడు మనుచరిత్రముకథయు మార్కండేయపురాణమునుండి తీసికొనఁబడి నవే. ఇతని కవిత్వము తిక్కనసోమయాజికవిత్వమంత మధురముగా నుండదు గాని సలక్షణ మయినదిగాను మృదువుగాను, ఉండును. ఇతఁడు తన గ్రంథమును ప్రతాపరుద్రుని సేనానాయకుఁడైన నాగయగన్నమంత్రికిఁ * గృతి యిచ్చెను. కవి కృత్యాదిని కృతినాయకుని వర్ణించుచు నాతనిని గూర్చి

చ. 'ఎలమిఁ బ్రతాపరుద్రమనుజేంద్రునిచేఁ బడసెం బ్రవీణుఁడై
కొలిచియు శౌర్యలీల రిపుకోటి రణావనిఁ గీటడంచియున్
బలరిపుతుల్యవిక్రముఁడు నాగయగన్నవిభుండు తేజమున్
విలసితరాజ్యచిహ్నములు విశ్రుతలక్ష్మియు నాయకత్వమున్.'

అని చెప్పెను. ఈ కృతిపతి కేలికయైన ప్రతాపరుద్రుఁడు కాకతీయ వంశ భూషణుఁడై జగత్ప్రసిద్ధుఁ డయి యుండినవాఁడు .విద్యానాథ మహాకవి యీతనిపేరనే ప్రతాపరుద్రీయ మనెడి యలంకారశాస్త్రమును జెప్పెను. ప్రతాపరుద్రుఁడు తన మాతామహి యైన రుద్రమ్మదేవియనంతరమున ౧౨౯౫ వ సంవత్సరమున రాజ్యమునకు వచ్చి ౧౩౨౩ వ సంవత్సరము వఱకును రాజ్యము చేసెను. ౧౩౨౧ వ సంవత్సరమునందు ఢిల్లీపాదుషా యొక్కసేనలు ప్రతాపరుద్రునిరాజధాని యైన యోరుగల్లుమీఁదికి దండెత్తి వచ్చి యోడిపోయినందున ౧౩౨౩ వ సంవత్సరమునందు ఢిల్లీచక్రవర్తి

* [ఇతఁడు సేనానాయకుఁడు కాని మంత్రి కాఁడనియు, సేనానాయకుఁడు మంత్రి కాఁడనియు 'ఆంధ్రకవి తరంగిణి']

మఱియొక గొప్పసేనను పంపఁగా సేనాధిపతి ఘోరయుద్ధములో ప్రతాప రుద్రుని పట్టుకొని ఢిల్లీనగరమునకుఁ గొనిపోయెను. ప్రతాపరుద్రునిమంత్రి యైన యుగంధరుఁడు తన ప్రభువును వదలించి తెచ్చిన ట్లొక విచిత్రమైన కథను చెప్పుదురు. తన ప్రభువును మహమ్మదీయులు కొనిపోయినతరువాత మంత్రియుగంధరుఁడు తా నొక మనోహరమైన పడవను కట్టించి దాని యందు రత్నఖచితములైన భూషణములు వేసికొని వాణిజ్యమునిమిత్తమై పోయినట్లుగా గంగానదిమీఁదుగా పోయి ఢిల్లీనగరము చేరి యమ్మకము నిమిత్తమై యమూల్యము లైన రత్నములు తెచ్చితి మని తన మనుష్యుల చేత పాదుషాకు చెప్పి పంపి చూచుట కయి యొక దిన మేర్పఱిచెను. ఈ ప్రకారముగాఁ జేయవలసిన యేర్పాటుల నన్నిటిని చేసి తాను పడవ దిగి పట్టణమునందు పిచ్చివానివలె తిరుగుచు, నేటి కిన్నిదినములకు ఢిల్లీచక్ర వర్తిని కారాబద్ధునిగాఁ గొని పోయెద మని యొక చిఁపిచేటతో చాటుచు, రాత్రు లూరివెలుపల నున్న యొక మఱ్ఱిచెట్టుక్రింద శుచియై వంట చేసికొని భుజించుచు, మాఱువేషముతో నటించుచుండెను. ఈ రీతిగా ప్రతిదినమును పిచ్చిగా చాటుచుండుట రాజభటులు చూచి, రాత్రు లీతఁడు మఱ్ఱిచెట్టువంక పోవుచుండుట్ల చారులవలనఁ దెలిసికొని, ఒకనాఁడు పగలు గూఢముగా పోయి మఱ్ఱిచెట్టుమీఁద నెక్కి కూరుచుండి యుండిరి. అతఁడు పగలంతయు నూరంతటను జాటి యథాప్రకారము రాత్రి మఱ్ఱిచెట్టుకడకు వచ్చి శుచియై వంట చేసికొని తినుట కన్నము విస్తరిలో వడ్డించుకొన్నతరువాత నతని కావులింత యొకటి వచ్చెనఁట! అప్పు డతఁడు వింత లేనిది యావులింత రాదనుకొని నిదానించి చూచి వెన్నెలలో చెట్టునీడనుబట్టి పయి నెవ్వరో మనుష్యు లున్నారని తెలిసికొని, పయివంకఁ జూచిన ననుమాన పడుదు రని యట్లు చేయక, వడ్డించుకొన్న యన్నముమీఁద వంటచేసిన కుండను బోర్లించి విస్తరిచుట్టును ముమ్మారు ప్రదక్షిణములు చేసి, ఢిల్లీచక్రవర్తిని పట్టుకొని తమ యూరు కొనిపోదుమని పెద్దకేక వేసి, తనచేతికఱ్ఱతో కుండను పగులఁగొట్టి యన్నము తినక లేచిపోయెను. భటు లంతట నతఁడు పిచ్చివాఁడని నిశ్చయము చేసికొని వెడలిపోయి చక్రవర్తి కా వార్త తెలిపి

తమతమ పనులమీఁద నుండిరి. గడువుదినమున ప్రతాపరుద్రుని తనవెంట నుంచుకొని పరిమితపరివారముతో చక్రవర్తి యోడవద్దికి పోవుటకు బయలు దేఱఁగా యుగంధరుఁడు చక్రవర్తి నిప్పుడే పట్టుకొని పోయెద మని చింపిచేటతో చాటుచు వెంటఁబడెను. రాజభటు లాతనిని పిచ్చివానిఁగా భావించుటచేత నాతనిమాటలను లక్ష్యముచేయక వెంట రానిచ్చిరి. అంతట నతఁడు చక్రవర్తిపరిజనులు చూడకుండ పడవ నెక్కి పయిని కూర్చుండి చక్రవర్తిని పట్టుకొని పోవుచున్నా మని చాట మొదలుపెట్టెనఁట! పాదుషా లోపల నున్న సరకులను పరీక్షించుచుఁ గొంతసేపు లోపలనుండి పయికి వచ్చి చూచునప్పటికి పడవ తమరేవున లేక బహుదూరము వచ్చి నట్లు కనఁబడఁగా, అది యంతయు శత్రువుల కుతంత్రమువలన నయినదని తెలిసికొని చేయునది లేక ప్రతాపరుద్రునితో సమాధానము చేసికొని యాతని రాజ్యమును మరల నిచ్చివేసి విడుదల పొంది తాను తన రాజధానికి మరలి పోయెనఁట! ప్రతాపరుద్రునిమంత్రులలో యుగంధరుఁ డనువాఁ డెవ్వఁడును లేఁడు. యుగంధరుఁడు మిక్కిలి పూర్వకాలమునందు అత్యంత ప్రసిద్ధుఁ డయిన యొక మంత్రి శిఖామణి. శ్రీహర్షకవిచేత సంస్కృతమున రచియింపఁబడిన ''రత్నావళి'' నాటికయందే యుగంధరునిసంతతివాఁడు (యౌగంధరాయణుఁడు) మంత్రిగాఁ జెప్పబడెను. మారనకవి నాగయ గన్నని 'నీతి యుగంధరుఁ'' డని చెప్పెను.

[యౌగంధరాయణుఁడు గొప్పరాజనీతిజ్ఞుఁడుగను, ప్రభుకార్యతత్పరుఁడు గను భాసుని (సంస్కృత) నాటకములందుఁ బ్రసిద్ధుఁడు భాసు ననుసరించియే శ్రీహర్షదేవుఁడు 'రత్నావళి'ని రచించెను యౌగంధరాయ ణుఁడు ప్రతాపరుద్రుని విడిపించి, ఢిల్లీచక్రవర్తిని చెఱఁగొనిన కథను శ్రీ వేదము-వేంకటరాయశాస్త్రిగారు తమ 'ప్రతాపరుద్రీయనాటకము'నఁ గూర్చినారు. ఈ వృత్తాంతము విశ్వాసార్హము కాదని విమర్శకులు చరిత్ర కారులును తెలిపియున్నారు.

నాగయగన్న సేనాని ప్రతాపరుద్రుని యనంతరము మహమ్మదీయమతమును గైకొని ఢిల్లీచక్రవర్తిని సేవించినట్లును, ఆతనికి సేనానియై రాజ్యకార్యము లను నిర్వహించినట్లును శ్రీ నేలటూరు-వేంకటరమణయ్యగారు తెలిపియున్నారు (భారతి-బహుధాన్య-మాఘమాసము)

'భారతి'లోఁ బ్రకటింపఁబడిన పై వ్యాసమునుబట్టి ఉలూఫ్‌ఖానా ప్రతాప
రుద్రుని, నాగయగన్న సేనాని మున్నగు మఱికొందఱిని ఢిల్లీకిఁ బంపు
చుండఁగా, ప్రతాపరుద్రుఁడు దారిలోనే మరణించినట్లును, సేనాని
మహమ్మదీయమతమును స్వీకరించి, రాజ్యకార్యములను నిర్వహించుచు,
ఒకప్పు డోరుగంటి ప్రాంతమునకు నియమితుఁడై యుండియును ప్రజల
కలవరము నణఁపఁజాలక - కాపయనాయకుని ప్రతాపమున కోర్వలేక
రాజ్యము నాతనికర్పించి ఢిల్లీకిఁ బాఱిపోయెననియుఁ దెలియుచున్నది ]

పయికథ యెట్టి దయినను, నాగయగన్నఁడు ప్రతాపరుద్రుని కాలములోని
వాఁడు గనుక మారనయు పదుమూఁడవ శతాబ్దాంతము నందును, పదు
నాల్గవశతాబ్దాదియందును నున్నవాఁ డని తేలుచున్నది. కాఁబట్టి యతఁ
డిప్పటి కాఱువందల సంవత్సరముల క్రిందట నుండి యుండును. ఈ
గన్నయ్యతల్లి మల్లాంబ కాకతీయగణపతికలవరి యైన మేచయనాయకుని
కూఁతు రని యీ క్రిందిపద్యమునఁ జెప్పఁబడినది.

సీ. ఏ రాజు రాజుల నెల్ల జయించి మున్
వెట్టికిఁ బట్టె దోర్విక్రమమున
నే రాజు సేతునీహారాద్రిమధ్యోర్వి
నేకపట్టణలీల నేలి ప్రాలె
నే రాజు నిజకీర్తి నెనిమిదిదిశల ను
ల్లాసంబు నొందఁ నలంకరించె
నే రాజు తనతేజ మీజగంబునకు న
ఖండైకవిభవంబుగా నొనర్చె

నట్టి కాకతిగణపతిక్ష్మాధినాథు
ననుఁగుఁదలవరి ధర్మాత్ముఁ డధికపుణ్యుఁ
డయిన మేచయనాయకుప్రియతనూజ
నతులశుభలక్షణస్ఫురితామలాంగి '

(నాగచమూవరుఁడు వరించె .. మల్లమాంబికన్ )

నాగయగన్నయ్య మార్కండేయపురాణమును గొంత పొగడి కవి నుద్దేశించి
యీ కోరికను కోరినట్లు గ్రంథమునఁ జెప్పఁబడి యున్నది.

ఉ. 'కావునఁ దత్పురాణము ప్రకాశితసారకథామృతం బొగిన్
ద్రావి జగజ్జనంబు లలరన్ రచియింపు తెనుంగున న్వచ
శ్శ్రీవిభవంబుపెంపు విలసిల్లఁగఁ గోవిదు లిచ్చ మెచ్చి సం
భావన చేయఁ జారుగుణభాస్వర మారయసత్కవీశ్వరా!

మారన యాంధ్రకవులలో నన్నయతిక్కనలనుమాత్ర మీక్రింది పద్యములతో స్తుతించినాఁడు.

ఉ సారకథాసుధారస మజస్రము నాగళపూరితంబుగా
నారఁగఁ గ్రోలుచున్ జనులు హర్షరసాంబుధిఁ దేలునట్లుగా
భారతసంహిత న్మును త్రిపర్వము లెవ్వఁ డొనర్చె నట్టి వి
ద్యారమణీయు నంధ్రకవితాగురు నన్నయభట్టుఁ గొల్చెదన్.

చ. ఉభయకవిత్వతత్త్వవిభవోజ్జ్వలు సద్విహితాధ్వర క్రియా
ప్రభు బుధబంధు భూరిగుణబంధుర భారతసంహిత క్రియా
విభుఁ బరతత్త్వకోవిదు నవీనపరాశరసూను సంతత
త్రిభువనకీర్తనీయయశుఁ దిక్కకవీశ్వరుఁ గొల్తు భక్తితోన్.

మారన తన యాశ్వాసాంతగద్యములయందు "శ్రీమదుభయకవిమిత్ర తిక్కనసోమయాజి ప్రసాదలబ్ధసరస్వతీపాత్ర తిక్కనామాత్యపుత్ర మారయనామధేయప్రణీతం" బని చెప్పెను * మారనశైలిని సూచించెడు నయిదాఱు పద్యములను మార్కండేయపురాణములోనివాని నిం దుదాహరించుచున్నాను

* [ఈ యాశ్వాసాంత గద్యనుబట్టి మారన తిక్కనసోమయాజి శిష్యుఁడనియు తిక్కనామాత్యుఁడను వేఱొకని పుత్రుఁడనియుఁ దెలియవచ్చుచున్నది. ఇందలి 'తిక్కనామాత్య పుత్ర' అను విశేషమునుబట్టి కొందఱు మారన తిక్కనసోమయాజి పుత్రుఁడని భ్రాంతిపడుచున్నారు. అది సరికాదు.

మారన తిక్కనగూర్చి విశేషమేమియుఁ జెప్పనందున నితనిం గూర్చి యెక్కువగాఁ దెలియుట లేదు. ఇతని యితర రచన లేమియు నున్నట్లు కానఁబడదు.

ప్రతాపరుద్ర మహారాజు క్రీ. శ. ౧౨౯౫ మొదలు ౧౩౨౩ వఱకు నాంధ్ర రాజ్యమును పాలించినందున. మారన కవియు, నాగయ గన్నయయు, ఆ కాలముననే యుండిరనుట నిశ్చయమని 'ఆంధ్రకవి తరంగిణి' లోఁ గలదు. (మూడవ సంపుటము. పుట 167]

చ. 'ఉరగముచేతఁ జచ్చిన తనూభవునిం గని శోకవేదనా
పరవశయు న్వికీర్ణకచభారయు నుద్గతబాష్పపూరయున్
గరతలతాడితాస్యయును గద్గదికావికలార్తనాదయున్
జరణవిపర్యయాపగతసత్వరయానయునై పొరిం బొరిన్. ఆ. ౧

చ. కనుఁగొని యాతనోగ్రనరకస్థజనంబు లెలుంగులెత్తి యో
మనుజవరేణ్య! పుణ్యగుణమండన! తావకదేహదివ్యగం
ధనిబిడమారుతంబు పరితాపభరం బడఁగించి మాకు నిం
పొనరఁగఁజేయుచున్నయది యొక్కముహూర్తమునిల్వవేదయన్. ఆ ౨

ఉ. ధర్మమునన్ ధనంబు సతతంబు ప్రవృద్ధముగా ధనంబునన్
ధర్మము తొంగలింప ధనధర్మవిరోధులు గాని కామభో
గోర్మ్ముల నొప్పు సంసృతిసుఖోదధిఁ దేలుచు నించుకేనియున్
గర్మవిరక్తి లేక బహుకాల మలర్కుఁడు ప్రీతి నుండఁగన్.— ఆ.౩

ఉ. వాయుపురజ్జులేల మునివల్లభ! వృద్ధుఁడ వౌండెఁ గావు లేఁ
బ్రాయపువాఁడ వ దివసరమ్యము లైన యనేకదేశముల్
ధీయుత! యల్పకాలమునఁ ద్రిమ్మర శక్యమె నీకు నెమ్మెయిన్
వేయును నేల నమ్మ నెద నీపలుకన్న మునీంద్రుఁడిట్లనున్.— ఆ.౪

ఉ ఎక్కడనుండి వచ్చె నతఁ డీతుహినాద్రికి వేడ్క నూని యే
నక్కడ నక్కుమారరుచిరాకృతి యాదట నేల చూచితిన్
మక్కువ నేల నాదుమది మన్మథుఁ డేచఁదొడంగె నా కయో!
ది క్కిఁక నెవ్వ రిచ్చట మదీయు లటంచు దురాశ యేటికిన్. ఆ.౫

చ. తనరుచు నాకమోక్షసుఖదం బగు దారపరిగ్రహంబు చే
యనికత మేమి? బంధమున కాస్పదమా యది? యంద సంతతం
బును మునిదేవపిత్రతిథిపూజ లొనర్చుచుఁ బుణ్యలోకముల్
చను గృహమేధి సర్వసుఖకారిణి వత్స! గృహస్థవృత్తి దాన్. ఆ ౬

చ. నిరుపమసచ్చరిత్రుఁడు పవిత్రుఁడు సర్వజనైకమిత్రుఁ డి
ద్ధరణజితోగ్రశత్రుఁ డతిదాంతుఁడు శాంతుఁడు సత్యవంతుఁ డా
దరనయధర్మవంతుఁడు వదాన్యుఁడు మాన్యుఁడు ధన్యుఁ డంతరం
గరహితమన్యుఁ డై కరము గారవమారఁగ నేల యేలుచున్. ఆ.౭

# విన్నకోట - పెద్దన్న

విన్నకోట పెద్దన్న యనెడి కవి కావ్యాలంకారచూడామణి యను లక్షణ గ్రంథమును రచియించినవాఁడు. ఇతఁడు నియోగి బ్రాహ్మణుఁడు; గోవిందరాజుపుత్రుఁడు; కౌశికగోత్రుఁడు. ఈతని వాసస్థానము రాజమహేంద్రవరము. కావ్యాలంకారచూడామణిలో నితఁడు పురవర్ణనమున కుదాహరణముగా రాజమహేంద్రవరము నిట్లు వర్ణించియున్నాఁడు.

సీ. గంభీరపరిఘ నాగస్త్రీల కభ్రాంత
కేళివిహారదీర్ఘిక యనంగ
నుత్తాలసాల మన్యుల కుబ్బి దివిఁ బ్రాఁకఁ
జేసినదీర్ఘ నిశ్రేణి యనఁగఁ
జతురచాతుర్వర్ణ్యసంఘ మర్థులపాలి
రాజితకల్పకారామ మనఁగఁ
బ్రాంతసుస్థిత మైనభవజూటవాహిని
భుక్తిముక్తిప్రదస్ఫూర్తి యనఁగ
నెప్పుడును నొప్పురాజమహేంద్రవరము
ధరణిఁ గల్పించె నేరాజు తనదుపేర
నట్టిరాజమహేంద్రునియనుఁగుమనుమఁ
డెసఁగు జాళుక్యవిశ్వేశ్వరుండు.

[రాజమహేంద్రవరము నీకవి వర్ణించుటం బట్టి యీతని నివాసము రాజమహేంద్రవరమనియు, విశ్వేశ్వరుఁడు రాజమహేంద్ర పురాధీశ్వరుఁడనియు తోఁచవచ్చును. విశ్వేశ్వరుఁడు చాళుక్య వంశీయుఁడుగాని రాజమహేంద్రుని పౌత్రుఁడుగాని కాఁడు.]

ఇతఁడు తాను రచియించిన యలంకారశాస్త్రమును రాజమహేంద్ర పురాధీశ్వరుఁడును చళుక్యవంశసంభవుఁడును నయిన విశ్వేశ్వరమహారాజున కంకితము చేసెను. విశ్వేశ్వరుని కాలమును సరిగా నిర్ణయించుట కాధారము దొరక

లేదు గాని యీతఁడు పదునాలవ శతాబ్దారంభమున నున్న ట్లూహించుట కవకాశము కలిగియున్నది. విశ్వేశ్వరరాజు విశాఖపట్టణమండలములోని సర్వసిద్ధి కీశాన్యమూలను మూఁడుక్రోసులదూరములో నున్న పంచధారల వద్ద ధర్మలింగేశ్వరస్వామి కొకమండపమును కట్టించినాఁడు. ధర్మలింగేశ్వర స్వామివారి యాలయములోని శిలాశాసనములో మండపము కట్టిన సంవత్సరము తెలుపఁబడకపోయినను, అతని వంశవృక్ష మీ ప్రకారముగా లిఖింపఁబడినది. భీమేశ్వరుని కొడుకు విమలాదిత్యుఁడు, విమలాదిత్యునిపుత్రుఁడు రాజనరేంద్రుఁడు, రాజనరేంద్రుని సుతుఁడు కులోత్తుంగచోళుఁడు, కులోత్తుంగచోళుని తనయుఁడు విమలాదిత్యుఁడు, విమలాదిత్యుని యాత్మజుఁడు మల్లప్పదేవుఁడు, మల్లప్ప దేవునిసూనుఁ డుపేంద్రుఁడు, ఉపేంద్రుని నందనుఁడు కొప్పభూపుఁడు, కొప్పభూపునితనూజుఁడు మనమోపేంద్రుఁడు, మనమోపేంద్రుని కుమారుఁడు విశ్వేశ్వరభూపుఁడు.

దీనినిబట్టిచూడఁగా విశ్వేశ్వరరాజు రాజనరేంద్రున కేడవ మనుమఁ డైనట్టు తెలియవచ్చుచున్నది, రాజనరేంద్రుఁడు ౧౦౨౨వ సంవత్సరము వఱకును రాజ్యము చేసినట్లు మనకుఁ దెలియును. తక్కిన విశ్వేశ్వరుని పూర్వులాఱుగురును ఒక్కొక్కరు నలువదేసి సంవత్సరములు రాజ్యముచేసి రనుకొన్నను విశ్వేశ్వరునికాలము (పదుమూడువందల నాలుగు) ౧౩౦౪వ సంవత్సరముకంటెఁ దరువాత నారంభము కాదు. కావ్యాలంకారచూడామణియం దీ రాజవంశము పూర్ణముగా తెలుపఁబడకపోయినను, తెలుపఁబడినంతవఱకు పయి వంశవృక్షముతో నేకీభవించుచున్నుట నా పుస్తకములోని యీ క్రింది పద్యమువలనఁ దెలిసికోవచ్చును.

సీ. శ్రీకంఠచూడాగ్రశృంగారకరణ మే
　　　　రాజున కన్వయారంభగురుఁడు
　చాళుక్యవంశభూషణము శ్రీవిష్ణువ
　　　　ర్ధనుఁ డే మహీశులతాతలకుఁ దాత
　ఖ్యాతకుమారరామభీముండు చాళుక్య
　　　　భీముఁ డే నృపకులాబ్ధికి విధుండు

రాజమహేంద్రవరస్థాత రాజన
రేంద్రుఁ డెవ్వఁవతాత యే విభునకు

నంధ్రదళదానవోపేంద్రుఁ డగును పేంద్ర
ధరణివల్లభుఁ డే రాజుతండ్రి తాత
ఘనుఁ డుపేంద్రాఖ్యుఁ డెవ్వని కన్నతండ్రి
యతఁడు విశ్వేశ్వరుఁడు లక్కమాంబసుతుఁడు

విశ్వేశ్వరరాజుకుమారుఁ డయిన యుపేంద్రునిపుత్రుఁడు నృసింహభూపుఁడు శాలివాహనశకము ౧౩౨౫వ సంవత్సరమునం దనఁగా క్రీస్తుశకము ౧౪౦౩వ సంవత్సరమునందు పంచతీర్థమునందలి ధర్మలింగేశ్వరస్వామి గుడికి గోపురము కట్టించిన ట్లాత శిలాశాసనమం దా దేవాలయములో వ్రాయఁబడి యున్నది. తాతకును, మనుమనికిని డెబ్బది సంవత్సరముల వ్యత్యాస ముండవచ్చును గనుక నృసింహ భూపతితాత యైన విశ్వేశ్వర భూపుఁ డించుమించుగా ౧౩౩౦వ సంవల్సరమువఱకు నుండి యుండును. కాఁబట్టి యీ విశ్వభూపుని యాస్థానకవి యైన విన్నకోట పెద్దన్న యిప్పటి కయిదువందలయేఁబది సంవత్సరములక్రిందట ననఁగా నెఱ్ఱాప్రెగడకంటె కొంచెము ముందుగానో యాతనికాలములోనో యున్నాఁడని నిశ్చయింప వలసి యున్నది. [ఈ 'ఆంధ్రకవులచరిత్రము'లోని కాలనిర్ణయము సరిగా లేదని శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు విభవ సం భాద్రపదమాస 'భారతి' యందు తెలుపుచు విన్నకోట పెద్దన్నను గూర్చి యీ క్రింది విధముగా వివరించినారు.

'శాసనమునుబట్టి విమలాదిత్యుని కొడుకు రాజనరేంద్రుఁడు. అతనికొడుకు కులోత్తుంగచోడకేసరి. అతనివంశమున విమలాదిత్యునికొడుకు మల్లప దేవుఁడు. అతనిపుత్రుఁ డుపేంద్రుఁడు. ఉపేంద్రునికొడుకు మల్లప దేవుఁడు (2). అతనికుమారుఁ డుపేంద్రుఁడు (3). అతనికుమారుఁడు

కొప్పభూపతి, కొప్పభూపతిపుత్రుఁ డుపేంద్రుఁడు (4), అతని పుత్రుఁడు మనుమోపేంద్రుఁడు, మనుమోపేంద్రునికొడుకు విశ్వేశ్వరభూపతి అని తేలుచున్నది.

శాసనమున విశ్వేశ్వరభూపతి మండపమును కట్టించిన సంవత్సరముకూడ నిట్లు తెలుపఁబడినది.

'శాకాబ్దే నవబాహు రామ శశి సం
ఖ్యాతే శుచౌ భాసితే
సప్తమ్యా మినవారభాజి మహితః
సంస్థాపితో మండపః,
కల్యాణోత్సవసిద్ధయే సవిభవః
శ్రీపంచధారాపురీ
ధర్మేశస్యచశుక్య విశ్వధరణీ
భర్తా విచిత్రాస్పదమ్''

'ఇందువలన విశ్వేశ్వరభూపతి మండపమును కట్టించినది నవ-బాహు-రామ-శశి సంఖ్య అనఁగా 1329 శ. సం. అని తేలుచున్నది. కావున విశ్వేశ్వర భూపతి శ సం. 1329 అనఁగా క్రీ. శ 1407 ప్రాంతమువాఁడు. క్రీ. శ 1304 నకు వంద సంవత్సరముల తరువాతివాఁడు. ఈ శాసనమునందే విశ్వేశ్వర భూపతి సర్వసిద్ధిపద్ద చిత్రభాను సంవత్సరమునకు సరియయిన శకవర్షము 1424 ప్రాంతమున శత్రువుల నోడించెనని క్రింది శ్లోకమున శ్లేషింపఁబడినది.

'గతిబాహు శక్తి భూమితి
మవిగణయత్సర్వ సిద్ధిపదభగ్నం,
సతిచిత్రభానుసాక్షిణి
ధరణి వరాహో దధావ దాంధ్రబలమ్ః

గతి, బాహు, శక్తి, క్షమలకు సరియైన శకవర్షము 1324. ఈశ్లోకమునకు సరియైన తెలుగునేతయే పెద్దన కావ్యాలంకారచూడామణి యేడవయుల్లాసమున.

'చతురుపాయ-బాహు-శక్తి క్షమావళి
బాలవిడిచి చిత్రభాను సాక్షిఁ
బాతె సర్వసిద్ధిపదమేది ధరణీవ
రాహమునకు నోడి రాచకదుపు ?'

సర్వసిద్ధిపదమేది-అనుచో పథమేది-అనియుండుట లెస్స.

అనియుండుటచేత శాసనరచయితకూడఁ బెద్దనయే యయి యుండును. కావ్యాలంకారచూడామణి నాతఁడు శా. స. 1324 న చిత్రభాను సంవత్సరమునకుఁ దరువాత రచియించి యుండును.]

ఈకవి గ్రంథములోని రెండు పద్యములనుమాత్ర మిప్పు డుదాహరించి యీతనిచరిత్రము నింతటితో విరమించెదను.

ఉ వేడుక విశ్వనాథపృథివీవరసుందరు బిట్టు చూచి తో
డ్తోడన సిగ్గు డగ్గఱుడుఁ దొంగలిఱెప్పలకప్పులోనఁ జి
ట్టాడెడు చూడ్కు- లొప్పెఁగుసుమాయుధతూణముఖాంబునందు వ్రా
టాడెడు పువ్వుఁదూపులన నంగనకుం దరళంపుఁజాయలన్.

శా. శ్రీనిండారఁగ లోకరక్షకొఱకై సిద్ధించుటంజేసి ల
క్ష్మీనాథుం డగు నయ్యుపేంద్రుఁ డిపు డేచెంగాన నీ నూతన
క్ష్మానాథుం డగు విశ్వనాథునకు శృంగారాధినాథత్వ మి
ట్లీనోపుం బ్రబఱుతింప నంచుఁ గవు లుత్ప్రేక్షింతు రెల్లప్పుడున్.

ఈ విన్నకోట పెద్దన ప్రద్యుమ్నచరిత్రమును రచించె నని శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు వ్రాసి, కుమారసంభవము టిప్పణములో నీ క్రింది పద్యముల నుదాహరించిరి.

సీ. మించిన గతులు సాధించి యింద్రునికి మా
రొ్కనియున్న కాల్గలకొండ లనఁగఁ
జేతనత్వంబులు చేకొని రవికిఁ గా
మ్ములు చూపు చీఁకటిమొన లనంగఁ
జే కల్గి యలుల కనేకదానము లిడ
మెలఁగుతమాలభూమిజము లనఁగఁ
జిత్రవధోద్ధతసిద్ధులై గాడ్పుతో
మోహరించిన కారుమొగుళు లనఁగ

నెల్లచందంబులను గడు నెసఁకమెసఁగి
పొగడు నెగడును బడసి యుప్పురిఁ జరించు
తమ్ముఁ జూచిన మెఱయుఁ బుణ్యమ్ము నొసఁగఁ
దావలం బైన భద్రదంతావళములు.

సీ. గజయాన మెలఁగినగతి యైనఁ బైఁ బడ
గద్దించి తర్కించి కలఁత నొందు
మానిని యల్గినమాడ్కిఁ దోఁచినఁ దేర్చు
నూకించు భావించి యొత్తలించుఁ
జపలాక్షికెమ్మోవి చవిగొన్నయట్లైనఁ
జెమరించి చర్చించి చిన్నఁబోవు
మదవతికౌఁగిలి గదిసినయట్లైనఁ
బులకించి తేటి సంచలత నొందుఁ

దన్ను మెఱసిన కోర్కులు తగులు కొలుపు
నోలిఁ దనలోన నలి నరపాలసుతుఁడు
మాన మూటాడ గంభీరమహిమ సడల
లజ్జ గడివోవ ధైర్యంబు లావు దిఁగగ.

పెద్దన ప్రద్యుమ్నచరిత్రములోని యేదో యుదాహరణగ్రంథమునం దుదాహరింపఁబడిన యీ పద్యములను జూచి పెద్దన విన్నకోట పెద్దన యని కవిగారు భ్రమపడిరేమో ! ప్రద్యుమ్నచరిత్రము పొన్నాడ పెద్దిరాజు దని యీ గ్రంథములోని రెండు పద్యము లీ క్రిందివి రెండు చోట్ల నాంధ్ర సాహిత్యపరిషత్తువారియొద్ద నున్న యుదాహరణ పుస్తకములో నుదాహ రింపఁబడినవి.

గీ. రాయుచున్న ఘనపయోధరములఁ గలిగి
నడుము లొకకొంత బయలయి బెడఁగు మిగిలి
చూడ నొప్పారురేఖల సొంపు మెఱసి
కోటకొమ్మ లమరు వీటికొమ్మలట్ల.

క. పురగోపురశిఖరంబులఁ
గర మరుదై పద్మరాగకలశము లమరుఁ
జరమాచరమాద్రులపై
సరిపున్నమఁ దోఁచు సూర్యచంద్రులభంగిన్.

# జిమ్మపూఁడి - అమరేశ్వరుఁడు

ఇతఁడు సుప్రసిద్ధుఁడైన యాంధ్రమహాకవి. ఈ కవినిగూర్చి యిరువది యేండ్ల క్రిందట నా యాంధ్రకవులచరిత్రములో నిట్లు వ్రాసితిని. అమరేశ్వరుని గొప్పకవినిగా పూర్వకవు లనేకులు స్తుతించి యున్నారు. ఈతఁడు చేసిన గ్రంథము లేవియో తెలియరావు గాని కూచిమంచి తిమ్మకవి తన సర్వలక్షణసారసంగ్రహమునందుఁ జిమ్మపూడి యమరేశ్వరుని విక్రమసేనములోని దని యీ క్రిందిపద్యము నుదాహరించి యున్నాఁడు.

ఆ. నీర నగ్గి యునికి యారయ విస్మయం
బనుచు బాడబాగ్నికడలి యప్పు
రంబుఁ జొచ్చె నొక్కొ రత్నాకరముమఱు
లనఁగ జెలువ మమరు నాపణములు ''

ఈ కవిని ప్రశంసించిన పూర్వకవుల పుస్తకములలోని పద్యములఁ గొన్నిటి నిం దుదాహరించుచున్నాను.

ఉ. నన్నయభట్టుఁ దిక్కకవినాయకు భాస్కరు రంగనాథుఁ బే
రెన్నిక కెక్కినట్టి యమరేశ్వరు నెఱ్ఱనమంత్రి నాదిగాఁ
జన్న కవీంద్రుల న్నవరసస్ఫుటవాణు లనంగ ధాత్రిలో
నున్న కవీంద్రులం దలఁతు నుల్లమెలర్పఁగ వాగ్విభూతికిన్
[అనంతామాత్యుఁడు]

ఉ. నన్నయభట్టుఁ దిక్కకవి నాచనసోముని భీమనార్యుఁ బే
రెన్నికఁ జిమ్మపూడి యమరేశ్వరు భాస్కరు శంభుదాసునిన్
సన్నుతి చేసి వాక్యసరసత్వము పీనుల కింపుమీఱ న
త్యున్నతిగా నొనర్తు నెఱయోధులు మేలనఁ గావ్య మిమ్ములన్.
[ప్రౌఢకవి మల్లన]

చ. అలఘుని శబ్దశాసనపదాంకితుఁ దిక్కనసోమయాజి ని
శ్చలమతి శంభుదాసు బుధసన్నుతు నాచనసోమనార్యుఁ జె
న్నలరిన చిమ్మపూడి యమరాధిపు భాస్కరు రంగనాథునిం
దలఁతు నపూర్వదివ్యకవితామహనీయసమగ్రచిత్తులన్.

[నూతనకవి సూరన్న]

ఉ. ఇద్ధగుణుం బ్రబంధపరమేశ్వరు నెఱ్ఱనప్రెగ్గడన్ మనః
పద్ధతి నిల్పి సూక్తిరుచిభాస్కరుఁ డైన హుళక్కిభాస్కరున్
బుద్ధి ఘటించి సంతతము పూని భజించి వచఃప్రసాదనం
సిద్ధునిఁ జిమ్మపూడి కులశేఖరు నయ్యమరేశసత్కవిన్. *

[అంగర నృసింహకవి]

ఇట్లు పదునేనవ శతాబ్దారంభమునుండియు నున్న మహాకవీశ్వరు లీతనిని సత్కవీంద్రునినిగాఁ బొగడుచు వచ్చుటచేతఁ జిమ్మపూడి యమరేశ్వరుఁడు పదునాల్గవ శతాబ్దారంభమునం దనఁగా నెఱ్ఱాప్రెగడ కాలమునందో, కొంచె మీవలనో యున్నట్టు నిశ్చయింపవచ్చును. విక్రమసేనమును సంపాదింప వలెనని నేను చిరకాలమునుండి కృషి చేయుచుంటిని. గాని నా కృషి యింతవఱకును సఫలమయినది కాదు. ఇట్లుండఁగా ౧౯౦౯ వ సంవత్సరము ఏప్రిల్ నెలలో నా మిత్రు లయిన మానవల్లి రామకృష్ణకవిగారు తాము ప్రకటించిన క్రీడాభిరామముయొక్క యాచ్ఛాదనపత్రముపైని చిమ్మపూడి యమరేశ్వరుని విక్రవసేన మచ్చులో నున్నదని ప్రచురించుటఁ జూచి యా మహాగ్రంథము శీఘ్రకాలములోనే నా కరస్థము కాఁగలదు గదా యని యపరిమితానంద మొందితిని. వా రా సంవత్సరమునందే డిసెంబరునెలలో ప్రకటించిన నన్నెచోడుని కుమారసంభవప్రథమభాగాచ్ఛాదనపత్రముమీద సహితము విక్రమసేన మచ్చులో నున్నట్టే ముద్రింపఁ

* వినుకొండ వల్లభరాయకృతిగా శ్రీనాథుఁడు రచించినదని చెప్పఁబడుచున్న క్రీడాభిరామమున చిమ్మపూడి అమరాధిపుని ప్రశంసకలదు. కాన నితఁడు 13 వ శతాబ్దిమధ్యమున నుండియుండ వచ్చును.

బడినది. ఆ పుస్తకమును సంపాదించుటకయి నేను బహులేఖలను వ్రాసితిని గాని నేను త్వరపడినకొలఁదిని పుస్తకప్రకటన మాలస్యము కాఁజొచ్చెను. అందుచేత నేను ముద్రితప్రతిని శీఘ్రముగాఁ బొందఁగాంతు నన్నయాశను విడిచిపెట్టి నా కవిచరిత్రమున కనుకూలముగా నుండుట కయి విక్రమసేనముయొక్కయవతారికను గ్రంథములోని కొన్ని పద్యములను వ్రాసి పంపవలసిన దని కవిగారిని వేఁడితిని. కవిగారు తమయొద్ద నున్న పుస్తకములో నవతారికభాగము లేదనియుఁ గొన్ని పద్యములను వ్రాసి పంపెద మనియు నాకుఁ బ్రత్యుత్తర మిచ్చిరి. శ్రీరామకృష్ణకవిగారి సంవత్సరము మెయి నెల ౧౦వ తేదిని చెన్నపురిలో "అపూర్వ వాఙ్మయ పరిశోధనము" ను గూర్చి యొనర్చిన యుపన్యాసములో జగ్గన్న ప్రబంధ రత్నాకరములో నుదాహరింపఁబడిన గ్రంధములబేర్కొనుచు వానిలో విక్రమసేన మొకటిగాఁ జెప్పి, వానిలోఁ గొన్నిటిలోఁ గొన్నిభాగములు మాత్రమే తమకు లభించిన వని చెప్పుటచేత విక్రమసేనముయొక్క యవతారికమాత్రమే కాక గ్రంథమంతయు వారికి లభింపలేదనియుఁ, బ్రబంధ రత్నాకరములో నుదాహరింపఁబడిన పద్యములు మాత్రమే వారికి లభించి యుండు ననియు నే నూహించుచున్నాను. నా యూహ సత్యము కాకపోవచ్చును. గ్రంథావతారిక గాక తక్కిన పుస్తకభాగ మంతయు వారియొద్ద నుండినపక్షమునఁ జిరకాలమిత్రులయిన కవిగారు నా ప్రార్థనము చెల్లింపకుండి యుండరు. విక్రమసేనములోని పద్యములు ముప్పదికంటె నెక్కువగా నాంధ్రసాహిత్యపరిషద్గ్రంథాలయమువారి యుదాహరణపుస్తకములో నియ్యఁబడినవి. అం దుదాహరింపఁబడిన పద్యములను గొన్నిటి నిందు క్రిందఁ బొందుపఱుచు చున్నాను.

సీ. సారథి శతవృద్ధు చక్రంబు లొనఁగూడి
జరగవు రథమున సంఘటించి
యుదకంబుసోఁకున కోర్వనియరదంబు
చేతికి బిరుసైన రాతివిల్లు

గరితాఁకు కోర్వక గడగడ వడఁకుచు
మువ్వంకఁ బోయెడిఁ జివ్వనారి
మేపు నీరును లేక మెదలాడనోపక
వర్ణహీనము లైన వారువములు

ఇట్టి సాధనములు నీకు నెట్టులొదవె
త్రిపురముల నెట్లు గెలిచితి దేవదేవ!
యనుచు నగజాతచెలు లాడ సలరు శివుఁడు
చిత్త మిగురొత్త మమ్ము రక్షించుఁ గాత!

సీ. భట్టనారాయణభాషామహాదేవి
లబ్ధవర్ణుల కర్థలబ్ధిఁ జేయు
బాణవాగ్స్వామినీ ప్రసవమంజరి విశా
రదుల కలంకారరమను జేయు
రాజశేఖరభారతీజహ్నుకన్యక
సుకవీంద్రులకు భావశుద్ధిఁ జేయు
మాఘవాణీశీతమారుతగతి సార
మతులకు రోమోద్గమంబుఁ జేయు

నని యెఱింగి వారియడుగులు దలఁచి న
మస్కరించి దండి మా మురారి
వామనుని గుణాఢ్యు క్షేమేంద్రు నిల నలం
కారవిదులఁ దలచిఁ గారవమున.

సీ. ప్రత్యగ్రరచనాతిభాసురప్రాసాద
నిర్జితగోత్రావనీధరంబు
ప్రాకారశిఖరాగ్రబంధురమణిగణ
ద్విగుణితతారకావిభ్రమంబు
పరిఘాజలాంతరప్రతిబింబితద్రుమ
స్ఫారితపాతాళభూరుహంబు

వరపుష్పసౌరభావర్జితమధుపశ్రూ
స్వీకృతాశావారణేంద్రగండ
మప్సరస్స్పృహణీయలీలాతిశయవి
లాసినీజననేత్రవిలాసజనిత
కుసుమశరబాణవైహార్త్య మసదృశార్ధ
నిర్జితాలక యుజ్జయినీపురంబు.

గీ. ఇట్టి పాపయి ల్కుందేలు మట్టి యనుచు
జనులు కనుకని పల్కెడు చందమామ
నడిమిమచ్చకు నెఱిఁగి పేరిడఁగ నేర్తు
రప్పురమున మేడలపయి నాడు సతులు.

సీ. చూపులకట్టు పూఁదూపులచేబట్టు
నబలలచూడ్కుల యాయుధములు
తాయంబునకుఁ గండుఁగోయిలఁ గూయించు
బాలలపలుకులు మూలమంత్ర
మెదిరికిఁ దేఁటుల నెడయాట లాడించు
నబలలయలకల యాప్తబలము
పవరణలకుఁ జంద్రుఁ జాలించు మగువల
మొగముల సేనకుఁ దగిన మొగము
భావభవునకు నటుగాక బలమె బలము
గాఁగఁ దిరిగెనె పెట్లచే గాసిఁబడఁడె
యనఁగ సౌందర్యసంపద లభినవముగ
వఱలుదురు తత్పురంబున వారసతులు.

క. తరుణవయస్కుల యౌవన
పరిపాకుల వృద్ధజనుల భటులను నిజసో
దరులను గురులనుగాఁ జూ
తురు పురముపతివ్రతాసతులు పుణ్యవతుల్.

ఉ. పూవులప్రోవులై చిలుకబోదలు కోయిలపిండుమందలై
తావుల క్రోవులై యళివితానముగానము తానకంబులై
కావను బండఁజాలుటఁ ద్రికాలముఁ గల్గ వరంబుఁ గన్నయ
ట్లై వనరాజి పొల్పగుఁ బురాంతికభూములఁ నెల్లఁ జూడఁగన్.

చ. మరలఁగఁబోదు రిండ్లకును మా పవునంతకుఁ జేలలోపలం
దిరిగి యొకింతవంత వడదేఱెడుమోములఁ జెన్నునేయుచుం
బిరిగొని క్రాలు దృగ్రుచులపెల్లునఁ జీఁకటి నెల్లఁ బాచినం
దెరువరు లర్థిఁ గూడఁ బఱతేరఁగఁ బామరభామినీజనుల్.

శా. దానానేకపబృంహితస్వనము గంధర్వావళీహేషిత
ధ్వానంబుల్ మృదువేదనాదమును గాంతానూపురారావముల్
గానానూనరవంబుఁ దూర్యబహుశంఖస్ఫారశబ్దంబుఁ బె
ల్లైనీరాకరఘోషమో యనఁగ నిత్యంబుం జెలంగుం బురిన్.

గీ. నూఱుక్రతువులు చేయని పాఱుటిల్లు
కోటిపడగలు లేని కిరాటగృహము
జాతిరత్నంబు గాని పాషాణకులము
వెదకి చూపిన వీటఁ బన్నిదము గలదు.

మ. కులశైలంబులలో సువర్ణగిరి, దిక్కుంభీంద్రవర్గంబులో
బలభిన్నాగము, లోకపాలకులలోఁ బర్జన్యుఁ, డుగ్రోరగం
బులలో శేషుఁడు, పెంపుగన్నకరణిం బూజ్యాధిపశ్రేణిలో
వెలసెన్ విక్రమసేనభూవిభుఁడు దోర్వీర్యప్రకాశోన్నతిన్.

చ. అదె కైలాసము దిగ్విలాసము విహాయశ్చారిణీసమ్మద
ప్రదవిన్యాస ముదగ్రభాసము మరుద్భామాసదాధ్యాస మ
భ్యుదయన్యాస మసన్నిరాసము మయూరోదారనిధ్వానబి
భ్యదహివ్రాతకృతప్రవాసము త్రినేత్రావాస మూర్వీశ్వరా!

సీ. అరుణపుష్పావళి నగ్నిగా సంధించి
యలుల నల్లెలుగాఁగ నావహించి

దండడి వీతెంచు దక్షిణపవనంబు
భస్త్రానిలంబుగాఁ బరిఢవించి
చిలుకలుఁ బికములుఁ జేదోడు సేయఁగ
మాధవుఁ డనెడి కమ్మరి కడంగి
యంగజుం డను పతియానతిఁ బనిపూని
మొగడల న్ములుకుల మొనలు చఱచు

కొలిమి యొక్కొ యనఁగ గురియు పరాగంబు
విస్ఫులింగములుగ విరహు లులుక
నేచి పూచి యున్న యీ యశోకమహీరు
హంబుఁ గంటె మాళవాధినాథ!

శా. ముత్తా కే కుజము ల్పడల్చె మొగడ ల్మొ న్నే మహీజంబులం
దొత్తెం బువ్వులు నిండఁగాఁ బెరిఁగె నే యుర్వీజముల్ పూపలన్
మొత్తంబై విలసిల్లె నే ధరణిజంబుల్ కాయలం బండులన్
జిత్తానందముఁ జేర్చె నే క్షితిజము ల్చెల్వొందఁగాఁ జెప్పుమా.

సీ. పాంథులహృదయముల్ పల్లటంబులు సేయ
దర్పకుపనిచినదం డనంగ
విరహిమృగంబుల మరిగింపఁ దివిరెడు
కాయసంభవుని మొక్కల మనంగఁ
గడు నల్గి చైత్రునగారంబు ముద్రింప
మనసిజుఁపనిచినయనుఁగు లనఁగ
సహచరుం డగు గంధవహుఁ గానఁగా మీన
కేతనుపంచినమాత లనఁగ

నభినవాకారసౌందర్యసుభగలీల
లతిశయంబుగ మెలఁగుచు నసమబాణు
పుష్పలావికాజనములు పోలె నెఱసి
కోమలాంగులు పువ్వులు గోసి రెలమి.

సీ. దక్షిణపవనంబు తమగంధమును బూని
మలయాచలముమీఁదిమరులు మాన
తివిచి పట్టినలత చివుళులచాయకుఁ
గరతలంబులకాంతి వరము లొసఁగ
కుసుమము ల్గోయుచో గోళ్ళమెఱుంగులు
తనిమొగ్గలకు గవిసెన లొనర్ప
పిలువంగఁ జెలఁగెడు పలుకులు రాజకీ
రములకు నొజ్జతనములు సేయఁ

గురులు నలులపిండు బెరయఁగ వనమయూ
రములగతులతోడ గమనలీల
ననఁగి పెనఁగి ప్రీతి వనకేళి సలిపిరి
వనజముఖులు వేడ్కఁ బనుపు చేయ.

మ. పరపై యొప్పెసలారు మాణికపుసోపానంబులం బ్రజ్వల
ద్వరవజ్రోపలసైకతంబులను సౌవర్ణారవిందంబులన్
హరినీలాసితవారిజంబులను జక్రాంగాదివాఃపక్షివి
స్ఫురణం గల్గు సరోవరంబు గనియెన్ భూవల్లభుం డయ్యెడన్.

క. మొగములు విరిదమ్ములఁ గుచ
యుగములు కోకములఁ జూడ్కి నుత్పలముల మం
దగతులు హంసలఁ దోల న
రుగుగతిఁ జొచ్చిరి సతుల్ సరోవర మెలమిన్.

గీ. బలిమి రాహు సుధాంశుబింబంబు వెఱచి
పాఱఁ గడుడాసి వెనుకొనుపగిది నొక్క
యెడ సఖులఁ గూడి చెలరేఁగి యీఁదుచోట
నీలవేణియు మొగమును నెలఁత కొప్పె.

సీ. కలయంగ నలఁదిన కస్తూరి పెల్లుగ
జలమున కెల్లను గలుగఁజేసి

కుచమండలంబుల కుంకుమచర్చల్ల
నీరెల్ల జేవురునీరు చేసి
తనులిప్తసురభిచందనకర్దమంబున
వారి నెల్లఁ బుప్పుఁగువందు చేసి
మూలలనవపుష్పమాలికావితతుల
వన మెల్లఁ బెట్టువ గొనఁగఁజేసి
యలక లలికవీధి నంటఁ గన్నవలఁ గెం
పెలయఁ గామచిహ్నలెల్లఁ జెలయ
నెలరువాతు లమర జలకేళి చాలించి
కొలను వెడలి రింతు లలపగతుల.

గీ. కమలినీకాంత యెంతయుఁ గంది వంద
వారుణీసక్తుఁడై వసువ్యయము చేసి
యరిగినట్లు సరాగియై యంబరంబు
దొఱఁగి పశ్చిమజలధిలో నుఱికెఁ దరణి

గీ. వామనానేకపము చక్రవాళకుధర
ధాతుతటము గోరాడుచో దరులు విఱిగి
గూలుటయు మింటి కెగసినధూళి వోలెఁ
బర్వె నెఱసంజ పడమరఁ బట్టుకొనుచు.

సీ ధర వియోగుల నెల్లఁ బరిమార్పఁ బూని హృ
ద్భవుఁడు గట్టిన వీరపట్ట మనఁగ
విరహులపై దండు వెడలుచో మదనున
కెత్తిన కెంజివురెల్లి యనఁగ
నలిఁ బ్రోషితులమీఁదఁ గొలిపెడు మరుకరి
ఘుసృణపంకాంకితకుంభ మనఁగ
జొత్తిల్లఁ బథికులనెత్తుట దోఁగిన
శంబరద్విషుచేతి చక్ర మనఁగఁ

దూర్పుకొండతుట్టతుది మ్రాఁకునను వ్రేలు
గొమ్మవలుదపూవుగొలక వోలెఁ
గందు బెరసి రాగకాంతి దలిర్పంగ-
మవ్వ మొప్పఁ జందమామ వొడిచె.

ఉ. అలరులపాన్పులం దలిరుటాకులసెజ్జల హర్మ్యవేదికా
తలములఁ దీవెయిండ్ల సికతాశయనంబుల మున్వియుక్తిమై
నలదురి వందుకందువుల నప్పటి కప్పటి కింపుఁ బెంపఁ గో
ర్కులు తనివారి వేడ్కపడఁ గూడిరి వేడుకతోడ దంపతుల్.

చ. పలుచని చంద్రికారసము ప్రన్ననినున్ననితేటక్రొమ్మెఱుం
గులతుదలం దలిర్చునెలగొమ్మలకాంతి పసిండినిగ్గుతోఁ
గలిపి యలంతివన్నె యిడి కాయజునిల్పిన రత్నపుత్రికల్
నలువ సజీవిఁ జేసెనొకొ నాఁ దగు నాతివిభూతిచూడ్కికిన్.

చ. చనువున రెండు వక్త్రములు చన్నులపాల్గుడువంగ నొక్కమో
ము నగఁగఁ నొక్కయాననము ముద్దునటింపఁగ నొక్కయాస్యము
గ్గనఁగ నిదేమి పల్కు దని యాలపనంబునఁ జెక్కిలించును
బ్బున నగు షణ్ముఖుం డెలమిఁ బొంది త్రిశక్తులు మాకు నీవుతన్.

క. హరగిరి సురగిరి రోహణ
గిరు లీవినకొదమ లనఁగ గృహములు పురి న
చ్చెరు వగు నకుప్యరత్న
స్ఫురణల విలసిల్లి తగినపొడవులతోడన్.

పయి పద్యములంబట్టి చూడఁగా విక్రమసేనము మాళవదేశము నందలి యుజ్జయినీనగరమున కధిపతి యయిన విక్రమసేనునికథయై సమస్తవర్ణనలతోను నిండి యున్నశృంగారకావ్య మయినట్టు కనుపట్టుచున్నది

# హుళక్కి భాస్కరుఁడు

భాస్కరుఁ డనెడి యీ కవి రామాయణము పద్యకావ్యముగా తెనిఁగింపఁ బడుటకు ముఖ్యకారకుఁడు. తిక్కనసోమయాజుల పితామహుఁడున్ను. గుంటూరిసీమకు పాలకుఁడు నగు మంత్రి భాస్కరునిచే రామాయణ మంతయు తెనిఁగింపఁబడినదనియు, అది యే హేతువు చేతనో యొక్క యారణ్యపర్వము తప్పఁ దక్కినభాగ మంతయు నుత్పన్నము కాఁగా పిమ్మట హుళక్కిభాస్కరుఁడు మొదలయినవారు తక్కిన కాండమ్ములను మరల రచించి గ్రంథపూర్తి చేసిరనియు ఒక ప్రతీతి కలదు. ఈ రామాయణమునకు భాస్కరరామాయణ మన్న పేరు మంత్రిభాస్కరునిచేత నయినను, హుళక్కిభాస్కరునిచేత నైనను రావచ్చును; గాని, ఆరణ్యకాండము తక్కినకాండములవలెఁ గాక యాశ్వాసములను కలిగి యుండుటను బట్టియు దానిశైలినిబట్టియు విచారించి చూడఁగా భాస్కరరామాయణము లోని యారణ్యకాండము మంత్రిభాస్కరునిచేతనే రచియింపఁబడినదేమో యని సందేహము కలుగుచున్నది. యుద్ధకాండములోని ౧౧౩౪ పద్యములను హుళక్కి భాస్కరుఁడు రచియించినను, దాని నాశ్వాసములఁగా విభాగింపకుండుటయు, ఆరణ్యకాండ మంతటిలోను ౭౩౦ పద్యములకంటె నెక్కువ లేకపోయినను దానిని రెం డాశ్వాసములుగా భాగించుటయు, విచారింపఁగా నీ రెండు కాండములను రచియించినవా రొక్కరు కారనియు వేఱువేఱు భాస్కరులనియు నూహింపఁదగి యున్నది. యుద్ధకాండములోని "శ్రీయుత మూర్తియైన" యను పద్యము మొదలుకొని వేదగిరినాయనింగారి ప్రేరణమువలన నయ్యలార్యునిచే రచియింపఁబడినట్టు ప్రాచీన తాళపత్రసంపుటములలోఁ గొన్నిటిలో వ్రాయఁబడియున్నది.

ఒక్క యారణ్యకాండమునం దక్క మఱి యేకాండములోను నాశ్వాస విభాగము చేయఁబడలేదు. అంతేకాక యారణ్యకాండమునందలి ప్రథమ ద్వితీయాశ్వాసాంతపద్యములు కృతిపతినిగూర్చిన సంబోధనములు గాక

శా. "పుణ్యుం డూర్జితశౌర్యధైర్యమహిమస్ఫూర్తిస్ఫురద్వైభవా
గణ్యుం డార్యజనానురంజితమహాకారుణ్యుఁడున్ శ్లాఘ్యసౌ
గుణ్యుండు న్వయవార్ధిచంద్రుఁడు రిపుక్షోణీశ్వరస్థాపితా
రణ్యుం డార్తశరణ్యుఁ డుజ్జ్వలయశోరమ్యుండు సౌమ్యుండిలన్
[అరణ్య. ఆ. ౧-౨౯౧]

అనియు,

శా. వైరిక్ష్మాతలనాథపర్వతమహావజ్రాయుధున్ ఘోరదు
ర్వారాఁహఃప్రథితారిదుస్సహతమిస్రప్రస్ఫురద్భాను గం
భీరాంభోనిధి ధీరతానిమిషభూభృన్నాథు నత్యంతవి
స్తారోదారగుణప్రసిద్ధినవరాధాపుత్రు సన్మిత్రునిన్."
[అరణ్య ఆ. ౨-౪౩౭]

అనియు, వరుసగాఁ బ్రథమ, ద్వితీయాంతములుగా నుండుటచేతను దిక్కన కవికృతమయిన నిర్వచనోత్తరరామాయణమునందలి యాశ్వాసాంతపద్యములుకూడ నీ విధముగానే వివిధవిభక్త్యంతములుగా నుండుటచేతను వన కాండమును భాస్కరమంత్రి రచించె ననియుఁ, బితామహునియందలి గౌరవముచేతఁ దిక్కనయుఁ దన యాశ్వాసాంతపద్యముల నాతఁడు చూపిన దారినే రచియించెననియు నూహించుచున్నారు ఎంత సయుక్తికముగా నున్నను, ఇవి యూహలేకాని సిద్ధాంతములు కానేరవు. అరణ్యకాండము సాహిణిమారని కంకిత మొనర్చుట యీ యూహలను బాధించుచున్నది. పండ్రెండవ శతాబ్దాంతమునం దుండిన మంత్రిభాస్కరుఁడు పదుమూడవ శతాబ్దాంతమునను, పదునాల్గవశతాబ్దాదియందును ప్రజాపాలనము చేసిన ప్రతాపరుద్రుని కాలములో సాహిణిమారని కంకితము చేసె ననుట పొసఁగి యుండనేరదు. కాఁబట్టి యారణ్యకాండమునుగూడ హుళక్కి భాస్కరుఁడే రచియించియుండును. తిక్కనసోమయాజిని గాని యాతనివంశమును వర్ణించిన కేతనకవి గాని భాస్కరమంత్రి రామాయణమును రచించెనని చెప్పి యుండకపోవుటచేతను, పదునాల్గవ శతాబ్దాంతమువఱకు నుండిన కవు లెవరును భాస్కరుని పూర్వకవినిగా స్తుతించియుండకపోవుటచేతను,

పదునేనవ శతాబ్దాంతమునుండి కవు లొకక్కభాస్కరునే పూర్వకవినిగా స్తుతించుచుండుటచేతను, కవిత్వమునకుఁ బ్రసిద్ధికెక్కిన భాస్కరుఁ డొక్కఁడే యనియు, కొందఱు భాస్కరశబ్దమునకు హుళక్కిపదమును గూడఁ జేర్చుచు వచ్చుటచేత నాతఁడు హుళక్కి భాస్కరుఁడే యనియు, ఊహింపఁదగి యున్నది అవియే నిజమైనచో భాస్కరరామాయణము పదునాల్గవ శతాబ్దాదిని రచియింపఁబడెనని చెప్పవలసి యుండును.

చ సహజకళంకమూర్తుఁ కుజాతులు గూఢతరోదయప్రభా
మహిములు గోత్రవిద్విషదమాత్యులు రాత్రి చరానుకూలధీ
సహితులు మందవర్తనులు సర్పసమానులు రాజసేవక
గ్రహములు గాననయ్యె నల రాయనిభాస్కరుఁ డస్తమించినన్.

శా. రెండా నాల్కలు, సంప్రదాయకునకున్ లెక్కింపఁగా నొక్కటే
గండామొండిశిఖండిబండలకు లెక్కల్లేనినాల్కల్గదా ।
చండారాతికులాటవీదహనచంచజ్జైత్రయాత్రాలస
త్కాండా । రాయనిమంత్రిభాస్కరునికొండా । దండనాథాగ్రణీ ।

శా. కాండావిర్భవభాండభూపరివృఢగ్రైవేయశైలేయ సూ
కాండాటాధిపకేతుమాతులబలాకాశస్రవంతీమరు
త్కాండాఖండలతుండిపాండురయశఃకర్పూరపేటీభవ
త్కాండా । రాయనిమంత్రిభాస్కరునికొండా । దండనాథాగ్రణీ.

వెనుకటికూర్పులం దుదాహరింపఁబడిన పయి పద్యములు మంత్రిభాస్కరుని గూర్చినవియుఁ, గొమ్మనామాత్యునిగూర్చినవియుఁగాక రాయనిభాస్కరుని గూర్చినవియు, నాతనిపుత్త్రుఁడైన కొండామాత్యునిగూర్చినవియు నయి యున్నవి. మంత్రిభాస్కరుఁ డాఱువేల నియోగి, హుళక్కి భాస్కరుఁడు కొడుకైన మల్లికార్జునభట్టు భట్టనామము కలవాఁడగుటనుబట్టి వైదిక బ్రాహ్మణుఁడని యూహింపఁదగి యున్నది కాని విక్రమార్కచరిత్రము రచించిన యాఱువేలనియోగి యైన కోవెల గోపరాజు హుళక్కిభాస్కరుని గూడఁ దనకులమువారైన నియోగికవులలోనే చేర్చియున్నాఁడు చూడుఁడు,

చ అనఘు హుళక్కిభాస్కరు మహామతిఁ బిల్లలమఱ్ఱిపెద్దిరా
జును బినవీరరాజుఁ గవిసోముని దిక్కనసోమయాజిఁ గే
తనకవి రంగనాథు నుచితజ్ఞుని నెఱ్ఱన నాచిరాజుసో
మన నమరేశ్వరుం దలఁతు మత్కులచంద్రుల సత్కవీంద్రులన్.'

భాస్కరరామాయణ మంకితము చేయఁబడిన సాహిణిమారఁడు బుద్ధరాజు కొమారుఁ డయిన ట్లయోధ్యాకాండములోని యీ క్రిందిపద్యమువలనఁ దెలియవచ్చుచున్నది.

క. 'శ్రీరమణీరమణసుధా
ధారాళదయాకటాక్షదామస్మితదృ
క్కైరవ వితరణకరణవి
శారద ! బుద్ధయకుమార ! సాహిణిమారా ! [అయోఁ ౧]

ఈ బుద్ధరాజునకు నవనాథుఁ డనియు పేరు గలదు. రంగనాథరామాయణము బుద్ధరాజు రచియించిన ట్లుండుటచేతను, భాస్కరరామాయణ మా రాజుపుత్రుఁ డయిన మారని కంకితము చేయఁబడుటచేతను సాహిణిమారఁ డా బుద్ధరాజుకొడుకే యైనపక్షమున రంగనాథరామాయణము భాస్కరరామాయణముకంటె నిరువది, ముప్పది సంవత్సరములు ముందుగా రచియింపఁ బడినదని చెప్పవలసి యుండును. సాహిణి మారఁడు గుఱ్ఱపువాఁడని చెప్పెడి కథ కేవలకల్పితము. అతఁడు రాజపుత్రుఁడు. అతఁడు క్షత్రియ కులజుఁడు కాక రెడ్డివంశపువాఁ డయినను, రాజ్యభారమును వహించినవాఁ డగుటచే రా జయ్యెను. తండ్రిజీవితకాలములో సేనాధిపతిగా నుండి, తరువాత రాజయ్యెను. ఈతనిది సాహిణివంశము, ఇతనికుమారుఁడు కుమారరుద్రదేవుఁడు ఇతఁడే రామాయణమందలి యయోధ్యాకాండమును తెనిఁగించిన కవి. అందుచేతనే గద్యమునం దీతఁడు "మారయకుమార కుమారరుద్రదేవ ప్రణీతం" బని వ్రాసికొన్నాఁడు. కోనకాటభూపతి కుమారుఁడు రుద్రరాజు, రుద్రరాజుకుమారుఁడు బుద్ధరాజు; బుద్ధరాజు కుమారుఁడు విట్ఠలరాజు, విట్ఠలరాజుకుమారుఁడు బుద్ధరాజు, మారయ సాహిణి బుద్ధరాజు కుమారుఁడే యయినను, రంగనాథరామాయణకృతికర్త

యీ బుద్ధరా జగునో, కాఁడో యని సందేహింపవలసినదిగా నున్నది. సందేహింపవలయు ననుటేల? కాలవ్యత్యాసమునుబట్టి కాఁడనియే నిస్సంశయముగాఁ జెప్పవచ్చును ఆ బుద్ధరా జీ బుద్ధరాజుతాత కావచ్చును, లేదా, యాతనితో సంబంధమే లేని వేఱొక బుద్ధరాజు కావచ్చును. సాహిణి మారన్న ద్వితీయప్రతాపరుద్రునికాలములో నాతనియశ్వసేనాధ్యక్షుఁడుగా నుండి తద్రాజ్యము తురుష్కాక్రాంతమైన యనంతరమున స్వతంత్రుఁ డయి యొకదేశపాలకుఁ డయ్యెను. భాస్కరరామాయణ మా కాలమునందే రచియింపఁబడి ౧౩౨౦-వ సంవత్సర ప్రాంతమునం దీ సాహిణిమారని కంకిత మొసర్పఁబడి యుండును. సాహిణిమారన రా జయినట్లీ క్రింది హుళక్కిభాస్కరుని చాటుధారను బట్టి సులభముగాఁ దెలిసికోవచ్చును.

క　అప్పు లిడునతఁడు ఘనుఁడా?
యప్పు దొసఁగి మరలఁ జెందునాతఁడు రాజా?
చెప్పఁగవలె సాహిణిమా
రప్పను దానమున ఘనుఁడు రాజు నటంచుఁ.

మారన్న రా జనియు, సేనాధిపతి యనియు స్థాపించు పద్యములు రామాయణములోనే యున్నవి.

క　శ్రీరామాకుచయుగళీ
హారిద్రోల్లసితవక్షహరిచరణసరో
జారాధ్యుఁడు మారయధర
ణీరమణో త్తముఁడు సాహిణీతిలక మిలఁ.

[అరణ్యకాండము. ఆ. ౨-౧]

శా. లాటీచందనచర్చ చోళమహిళాలావణ్యసామగ్రి క
ర్ణాటీగీతకలాసరస్వతి కళింగాంతఃపురీమల్లికా
వాటీమంజరి గౌడవామనయనావక్షోజహారాళియై
ఘాటింపందగు నీదుకీర్తి రథినీపాలాగ్రణీ! సాహిణీ!

[కిష్కింధాకాండము, ౧-౨౬]

బుద్ధరాజు తన బంధుఁడైన రంగనాథునిచేత ద్విపదరామాయణము చేయించుచున్నట్లును, ఆ గ్రంథము మూఁడు వంతులు ముగింపఁబడిన వెనుక మంత్రియైన భాస్కరుని కా సంగతి దెలిసి యతఁడు రాజుతోఁ దాను రామాయణమును పద్యకావ్యమునుగాఁ జేసి కృతి యిచ్చెదనని చెప్పఁగా ముందుగాఁ జేసి తెచ్చిన గ్రంథము కృతినందెద నని రాజు చెప్పినట్లును, అందుమీఁద నతఁడు గ్రంథమును శీఘ్రముగాఁ జేయింప నెంచి తన యాశ్రితుఁడును, కవీంద్రుఁడు నైన హుళక్కిభాస్కరుని బిలిపించి చెప్పఁగా నతఁ డారణ్యకాండమును మాత్రము చెప్పక తక్కిన భాగమును తెనిఁగించి తెచ్చెద నని యొప్పుకొని పోయినట్లును, అరణ్యపర్వమును తెనిఁగించిన నన్నయభట్టునకు వచ్చిన దురవస్థయే యారణ్యకాండము జేసినయెడలఁ దనకును వచ్చునని హుళక్కిభాస్కరుఁడు జడియుట చేత దానినిమాత్రము మంత్రి భాస్కరుఁడు రచించినట్లును, హుళక్కిభాస్కరుఁ డింటికిఁ బోయి తన పుత్రుఁ డైన మల్లికార్జునభట్టుచేత బాలకాండమును, కిష్కింధాకాండమును, సుందరకాండమును, శిష్యుఁడైన కుమారరుద్రదేవునిచేత నయోధ్యాకాండంబును, మిత్రుఁడైన యయ్యలార్యునిచేత తాను రచియింపఁబూనిన యుద్ధకాండమునందలి కడపటి భాగమును జేయించి తాను యుద్ధకాండముయొక్క మొదటిభాగమును రచియించి మంత్రి భాస్కరునియొద్దకుఁ గొనిపోయి నమర్పించినట్లును, మంత్రి భాస్కరుఁడు తాను రచించిన యారణ్యకాండమునుగూడఁ జేర్చి రామాయణము నంతను రాజునొద్దకుఁ గొనిపోయినప్పుడే రంగనాథుఁడును తన ద్విపద రామాయణమునుగూడ తేఁగా రాజు కుడిచేతితో రంగనాథునిరామాయణమును, ఎడమచేతితో భాస్కరుని రామాయణమును గ్రహించినట్లును, అందుమీఁదఁ దన్ను లాఘవపఱిచినందునకయి భాస్కరునికిఁ గోపమువచ్చి, యిటువంటి రాజునకు గ్రంథమును కృతి యిచ్చుటకంటె గుఱ్ఱములను కాచు వానికి కృతి యిచ్చుట మేలని పలుకుచు నతఁడు కొలువువిడచి లేచిపోయి నట్లును, అతఁడు పోవుచుండఁగా నక్కడనుండి యా మాటలు వినుచున్న మారఁడన్న గుఱ్ఱపువాఁ డెదురుగా వచ్చి యాతనికి నమస్కరించి "స్వామీ!

సత్యసరస్వతులగు మీ రాడినమాట దాఁటగూడ" దని ప్రార్థింపఁగా భాస్కరుఁడు రామాయణమున కొతనిని కృతిపతినిగాఁ జేసినట్టును, ఒక కథ చెప్పుచున్నారు.

కాని యది సత్యముకాదు. ఇటీవలివారు "సాహిణి" యను పదమును జూచి భ్రమించి యీ కథ కల్పించియుందురు రాజు గ్రంథమును శీఘ్రముగా సొంతము చేయింపవలెనని కోరియుంకుటచేత భాస్కరరామాయణ మిత్రులందఱిచేత వ్రాయఁబడియుండును. కొందఱీ సంబంధమున మంత్రి భాస్కరుని విడచి హుళక్కిభాస్కరుఁడే రంగనాథునితోఁడి పోటికిఁ దన పుత్ర మిత్రచ్ఛాత్రులచేతఁ బుస్తకమును బూర్తి చేయించెనని కథ యింకొకవిధముగా మార్చి చెప్పుదురు. అప్పుడు సహిత మీ కథ యధికవిశ్వాసార్హమైనది కాఁజాలదు. రంగనాథుఁడును, హుళక్కిభాస్కరుఁడును నేకకాలమునం దుండినవారు కారు. ఇరువురకును నడుమను నూఱు సంవత్సరము లంతరము గలదు ఒకఁడు ముత్తాత బుద్ధరాజుకాలములోనుండిన, రెండవవాఁడు మునిమనుమనికాలములో నుండినవాఁ డగును. హుళక్కిభాస్కరుఁడు యుద్ధకాండమునందలి పూర్వభాగమును రచియించిన ట్లయ్యలార్యప్రణీతంబయిన యీ క్రిందిపద్యమువలన నెఱుఁగవచ్చును.

చ. 'అమర హుళక్కిభాస్కరమహాకవి చెప్పఁగ నున్న యుద్ధకాం
డముతరువాయి చెప్పె వికట ప్రతిభాషణుఁ డప్పనార్యస
త్తమసుతుఁ డయ్యలార్యుఁడు కృతస్థితి నార్యులు మెచ్చునట్లుగా
హిమకరతారభాస్కరమహీవలయస్థిరలక్ష్మి చేకుఱన్.'

[యుద్ధకాండము. ౨౬౮౩]

భాస్కరరామాయణము మొదట పదునాల్గవ శతాబ్దారంభమునందుఁ దెనిఁగింపఁబడియుండుటచేత భాస్కరరామాయణము పుట్టి యిప్పటి కాఱువందల సంవత్సరములు కావచ్చినది సోమదేవరాజీయమునందుఁ బ్రతాపరుద్రుఁడు కొలువుతీఱి యున్నప్పుడు దర్శింప వచ్చినవారిని వర్ణించుచో "శాకల్లి మల్లికార్జునభట్టు మొదలైన బ్రహ్మవిద్వాంసులు . నూటయేబండ్రును, హుళక్కిభాస్కరుఁడు మొదలుగాఁగల ప్రబంధ కవీశ్వరు లిన్నూఱుగురును

... అశ్వంబుల కధికారియైన సాహిణి మారనయు . కొలువఁ బేరోలగంబున సుఖోపవిష్టుండై "— అని వ్రాయఁబడియున్నది. వీ రందఱును ప్రతాపరుద్రునికాలములోనే యుండినందున, వీరు పదుమూఁడవ శతాబ్దాంతము నందును పదునాలవ శతాబ్దారంభమునందును నుండి యుండవలెను. సాహిణి మారని కాలములో ననఁగా ౧౨౯౫వ సంవత్సరము మొదలుకొని ౧౩౨౦వ సంవత్సరప్రాంతమువఱకును రాజ్యపాలనముచేసిన ద్వితీయ ప్రతాపరుద్ర చక్రవర్తికాలములోను, దరువాతను మహావిద్వాంసుఁడును మహాకవియు నయి హుళక్కిభాస్కరుఁడు మిక్కిలి ప్రసిద్ధిచెందినవాఁడు. అందుచేత నాతనికిఁ గవులును, పండితులును మిత్రు లయి యుండుటయే కాక విద్యను, గవిత్వమును నేర్చుకొనుచుండిన ఛాత్రులును పలువు రుండి యుందు రనుటకు సందేహము లేదు.

శ్రీనాథునికాలములో—ననఁగా పదునాల్గవ శతాబ్దాంతమునందును పదునైదవ శతాబ్దాదియందును నుండిన వల్లభామాత్యుఁడు * తన క్రీడాభిరామమునందు

ఉ. 'నన్నయభట్టతిక్కకవి నాయకు లన్న హుళక్కిభాస్కరుం
డన్నను జిమ్మపూడి యమరాధిపుఁ డన్నను సత్కవీశ్వరుల్
నెన్నుదుటం గరాంజలులు ♦ నింతలు చేయనిరావితాపాటి తి
ప్పన్నయు నంతవాఁడె తగునా యిటుదోసపుమాట లాడఁగన్.'

అని తన కంటె నేఁబదియఱువది సంవత్సరములు పూర్వమునం దుండిన హుళక్కిభాస్కరుని నన్నయతిక్కనాదులతో సమానునిగాఁ బొగడుటయే యాతని ప్రసిద్ధిని వేయినోళ్లఁ జాటుచున్నది. అట్టి సుప్రసిద్ధకవికడ మిత్రులును బలువురు చేరి కవిత్వమును నేర్చుకొనుచుండుటయుఁ దాము చేసిన గ్రంథములను పద్యములను గురువునకుఁ జూపి దిద్దించుకొని యాతని మెప్పు పడయఁ జూచుచుండుటయు వింత కాదుగదా! భాస్కరుఁడు రామాయణరచనకుఁ బూనినప్పుడు తామును గొంతభాగమును జేసి చూపెద

[* క్రీడాభిరామము శ్రీనాథకృతియని శ్రీవేటూరి ప్రభాకరశాస్త్రి మున్నగువారు, వల్లభరాయకృతియని శ్రీబండారు తమ్మయ్య ప్రభృతులు.

♦ 'నింతురు జేయని' అనునది సరియైన పాఠము.]

మని వేఁడఁగా మిత్త్రానురాగముచేతను శిష్యవాత్సల్యముచేతను వారి
కోరికను నిరాకరింపక యంగీకరించుట స్వాభావికసౌజన్యసూచకముకాదా ?
ఈ ప్రకారముగాఁ దన పుత్త్రునకును ఛాత్త్రునకును మిత్త్రునకును భాస్క-
రుఁడు కొంతకొంత భాగ మిచ్చి తా నొక భాగమును బుచ్చుకొని వారు
చేయుచు వచ్చినదానిని తా నప్పుడప్పుడు చదివి సంస్కరించుచు నడుమ
నడుమఁ దన పద్యములను జేర్చుచు శ్లాఘ్యముగా నున్నదానిని తన
పుస్తకములోని భాగముగా స్వీకరించుచు వచ్చి యుండును. ఈహేతువు
చేతనే రామాయణమునకు మూఁడు కాండములు చేసిన మల్లికార్జునభట్టుపేరు
రాక యొక కాండమునో, కాండమునరనో చేసిన భాస్కరునిపేరు వచ్చె
ననుటకు సందేహములేదు. తండ్రికి కుమారునిపేరు ప్రసిద్ధికి వచ్చునప్పటి
కంటె నెక్కువ సంతోషము వేఱొకప్పుడు కలుగదు. అందుచేతనే తన
కుమారునిని మూఁడు కాండములు తన రామాయణములో నుంచుట
కంగీకరించి యతఁడు కృతార్థుఁడయ్యెను. సద్గురువునకు స్వపుత్త్రునియందు
వలెనే సచ్ఛాత్త్రునియందును నత్యంతప్రీతి యుండును. అందుచేతనే భాస్క-
రుఁడు తన ప్రియశిష్యుఁడు చేసిన కాండమును సహితము తన పుస్తకములో
నుంచుట కంగీకరించి యుండును. ఈ కుమారరుద్రదేవుఁడు సామాన్య
శిష్యుఁడు గాక భాస్కరమహాకవి కాశ్రయుఁడైన సాహిణీ మారయ
ప్రభువునకు పుత్త్రుఁడయి కూడ నుండెను. తన సుతుఁడు కవియగుటయు
నాతనికవిత్వము తన కంకిత మొనర్పఁబడిన పుస్తకములో నుండుటయు
రాజునకు సహితము పరమప్రీతికరముగానే యుండును.

భాస్కరుఁడు మొట్టమొదటఁ దన కుమారుఁడైన మల్లికార్జునభట్టునకు బాల
కాండమును, శిష్యుఁడైన కుమారరుద్రదేవున కయోధ్యాకాండమును తెనిఁ
గించుట కిచ్చి తా నారణ్యకాండమును బుచ్చుకొని యుండును. తానే
మొదటిదైన బాలకాండమును బుచ్చుకొని యితరులకే తరువాతి కాండముల
నియ్యక తా నేల యారణ్యకాండమును బుచ్చుకోవలెనని కొంద ఱడుగ
వచ్చును. వర్ధిష్ణువులయి చిరకాలము మనఁగోరెడి తరుణవయస్కులైన
వారి కా కాండము నియ్యక వారి శ్రేయస్సును గోరియే యతఁడు తాను

వయస్సు చెల్లినవాఁడయి మోక్షార్థియయి యున్నవాఁ డగుటచేత నారణ్యకాండమును గైకొని యుండును. ఆ కాలమునందును సకారణముగానో యకారణముగానో భారతారణ్యపర్వమువలనే రామాయణారణ్యకాండమును శుభదాయకము కా దన్న సమ్మకము సామాన్యముగా జనులలో వ్యాపించి యున్నది. పిన్నయీడువాఁడైన మల్లికార్జునభట్టేండ్లు చెల్లినవాఁడైన తండ్రికంటె నధికవేగముగా పద్యరచన చేయఁగల కవితాధార కలవాఁ డగుటచే జనకుఁ డారణ్యకాండమును ముగింపకముందే తన బాలకాండమును ముగించి తన సహపాఠియైన కుమారరుద్రదేవుని కిచ్చిన యయోధ్యాకాండమును, తండ్రి చేయుచుండిన యారణ్యకాండమును విడిచిపెట్టి కిష్కింధాకాండమును జేయ నారంభించెను ఇంతలోపల భాస్కరుఁడు తన యారణ్యకాండమును ముగించి కొడుకు చేయుచున్న కిష్కింధాకాండముతరువాయి నందుకొని దానిని పరిసమాప్తి నొందించి సుందరకాండమును జేయ నారంభించెను. తరువాత మల్లికార్జునభట్టందుకొని సుందరకాండమును జేయుచుండఁగా మిత్రుఁడైన యయ్యలార్యుఁ డాతని యనుమతిమీఁదనే యుద్ధకాండముయొక్క యుత్తరభాగమును గైకొని రామాయణమును తుదముట్టించి యుండును *

ఈ రామాయణము పలువురచేఁ దెలిఁగింపబడిన దగుటచేత శైలియు బహువిధములుగా నుండును అరణ్యకాండముకవిత్వము తక్కినవాని కవిత్వముకంటె రసవంతముగా నుండును ఇందు కవిత్రయమువారి ప్రయోగములకు విరుద్ధము లయిన ప్రయోగములు కొన్ని కానఁబడుచున్నను, పూర్వలాక్షణికు లెల్లరు భాస్కరరామాయణమును ప్రామాణికగ్రంథముగా నంగీకరించి యున్నారు. వారివారి శైలులు తేటపడుటకయి యిందు క్రిందఁ గొన్ని పద్యముల నుదాహరించుచున్నాను.

---

[* ఈ వాక్యములన్నియు నూహలపైనే యాధారపడియున్నవనియు, ఆ యూహలలోఁ గొన్ని పరిశీలనముచేసి చూచునప్పుడు నిలుచునవికావనియు 'ఆంధ్రకవితరంగిణి'లోఁ గలదు.]

౧. మల్లికార్జునభట్టు.

ఉ. జంగమవల్లులో యమృతసాగరవీచులొ రత్నమూర్తులో
యంగజుమోహనాస్త్రములొ యంచితహేమశలాకలో మహీ
రంగనటత్తటిల్లతలొ రాజకళాసఖులో యనంగఁ ద
న్వంగులు వాద్యసంగతుల నాడుచుఁబాడుచునుండ నత్తఱిన్.

[బాలకాం. ౩౦౮]

శా. ప్రాణంబు ల్వలతేని రామునకు నేర్పారంగ నన్నిచ్చిన
ప్రాణుండై మను, మట్లుగాక మదిలో దర్పించినం దద్రణ
క్షోణీయుక్తఖరాగ్రసిక్తపటుదోస్త్రాణోగ్రబాణాసనా
క్షీణస్ఫారకఠోరఘోరశరము ల్చెండాడు నీకంఠముల్.

[సుందరకాండ. ౧౬౫]

౨. కుమార రుద్రదేవుఁడు.

ఉ. వేఁడిన వేఁడిమాట నృపవీరుఁడు సైఁపక కర్ణరంధ్రముల్
సూఁడినభంగిఁ దాకుఁటయు స్రుక్కి మనంబున నొచ్చి నిన్ను నే
నాఁడు నృపాలపుత్త్రి వని నమ్మి వరించితిఁగాక! యిమ్మెయిన్
నేఁ డొక కాలసర్పమయి నీ విటుచేయుట నాకుఁ దోఁచెనే?

[అయో. ౧౬]

చ. తలఁపఁగ నీ వశక్తువిధంబున నాడెదు రామచంద్ర! నీ
కొలఁది యెఱుంగఁ డీతఁ డతికుత్సితుఁడై మతిదప్పి యాలిమా
టలు విని యింతతెంపున కొడంబడెఁ దా నొక సత్యవాదియై
పలుకఁడె మొన్న నేఁడు నినుఁ బట్టముఁగట్టెద నంచు బొంకొకో.

[అయో. ౪౬]

౩. భాస్కరుఁడు.

ఉ. ‘ఓరి నిశాచరాధమ! మదోద్ధతిఁ దాపసవిప్రకారముల్
వారక చేసి తా ఫల మవశ్యముఁ బొందక పోవునే? యమా

గారగతుండవై కుడువఁ గాలము నీ కిదె చేరె; నింక నా
ఘోరశరంబుల న్గమునికోర్కులు దీఱఁగ నిన్నుఁ ద్రుంచెదన్.

[అరణ్య. ఆ. ౧, ౨౩౮]

ఉ ఈ కొఱగానికార్య మిటు లెవ్వఁ డొకో యనుకూలశత్రుఁడై
నీకుఁ బ్రియంబుగాఁ బలికె నీవును నిత్తెఱఁ గాచరింపఁగా
రాక తలంచిచూడ నిది రాక్షసవంశవినాశకాలమో
కా కటుగాన నీకొనునె కాదన కీదృశ మెవ్వఁడేనియున్.

[అర. ఆ. ౨, ౧౪]

౪. హుళక్కిభాస్కరుఁడు.

చ చనదు మహద్విరోధ మని చక్కటి చెప్పిన నింతతప్పునన్
గనలితి! నీతిశూన్యులకుఁ గార్యము లేటికిఁ దోఁచు? నిప్పు వే
యును బనిలేదు; నీవలన నొప్పని నావచనంబు లెల్ల నీ
వని మొన రాముచేఁ బడినయప్పు డెఱింగెదుగాక! పోయెదన్?

[యుద్ధకాండము ౧౨౪]

శా. కామక్రోధమదాతిరేకమున నేకగ్రాహివై యున్న ని
న్నేమార్గంబునఁ దెల్పవచ్చు? నధికుం డెగ్గేల నైఁచున్? బర
స్త్రీ మాయం గొనివచ్చు టేతగవు? నీచేఁగాక సామంతమి
త్రామాత్యాదులు నేఁడు శాత్రవులచేనా చచ్చి రూహింపఁగన్?

[యుద్ధ ౧౧౩]

౫. అయ్యలార్యుఁడు.

శా. పాతాళంబుననుండి వచ్చెనొ, నభోభాగంబునందుండి సం
ఘాతవ్యగ్రత నేగుదెంచెనొకొ, దిక్చక్రంబునందుండి యు
జ్జాతంబై యరుదెంచెనొక్కొ యనఁగా సర్వంకషంబై తమో
జాతం బంతఁ బదార్థదర్శనవినాశస్థేమమై పేర్చినన్ [యుద్ధకాండ]

మ. మదధీనంబగు జీవితంబును మనోమానానురాగంబులున్
ద్వదధీనంబులు చేసి యన్యజనచింతాదూరనై తావకా

భ్యుదయం బెప్పుడుఁ గోరుచుండ నిట నీ వుగ్రంబుగాఁ బల్క న
య్యేదు కంటే హృదయంబు వజ్రకఠినంబై యున్న దిప్పట్టునన్.

[యుద్ధకాండ ౨౩౪౮]

తెలుఁగుభారతమును రచియించిన కవులవలెనే రామాయణమును రచించిన కవులును మూలగ్రంథమును మిక్కిలి సంగ్రహపఱిచి కథను కూడ కొన్ని చోట్ల నిష్టానుసారముగా మార్చివేసినారు. అందుచేత సంస్కృతమున నిరువదినాలుగువేల గ్రంథముగా నున్న రామాయణము తెనుఁగున పదునేనువేల గ్రంథ మయినది. ఈ కవులు మొత్తముమీఁద గ్రంథమును సంగ్రహపఱిచినను, కొన్నిచోట్ల పెంచను సహితము పెంచిరి ఎట్లన - యుద్ధకాండమునందు మాఘకావ్యమునందలి యేడవ సర్గము చేర్పఁబడినది. గ్రంథవిస్తరభీతిచేత సంస్కృతరామాయణమునకును తెలుఁగురామాయణమునకును గల భేదము లిం దేమియు వివరింపలేదు హుళక్కిభాస్కరుని కవిత్వము మనోహరముగా నుండును. మల్లికార్జునభట్టుకవిత్వములో సంస్కృతపదములును, సమాసములు నధికముగా నున్నవి. మొత్తముమీఁద పుస్తకమునైలి యంతయు శ్లాఘనీయముగానే యున్నది. ఈ రామాయణము గాక హుళక్కిభాస్కరుఁడు దశగతు లను గ్రంథమును గూడ రచించి సాహిణిమారనికి అంకితముచేసె నని రామకృష్ణకవిగారు క్రీడాభిరామపీఠికలో వ్రాసిరి.

ఆంధ్రుల చరిత్రము ద్వితీయభాగములో శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారు భాస్కరరామాయణ కర్తల నొక్కొకరినే యెత్తుకొని మల్లికార్జునభట్టునుగూర్చి "యితఁడు సాహిణిమారన యాస్థానకవి యగు భాస్కరుని పుత్త్రుఁడే యైన, వారియాజ్ఞాప్రకారము రామాయణము రచింపఁబూనినవాఁడే యైనయెడల బాలకాండముమొదట కృతినాయకుని సంబోధింపక కాండాంతమున శివుని సంబోధించి యుండఁ డనియు, కిష్కింధాకాండాదినున్న పద్యము సాహిణిమారనసంబోధనము కాక పోవుటయే కాక కాండాంతమునందలి పద్యములు రెంటిలో నొకటి శివుని గూర్చిన సంబోధనము కలది యనియు, సుందరకాండము మొదట సాహిణి

మారని సంబోధించిన పద్య మున్నను కాండాంతమునందలి పద్యములు రెండును శివుని సంబోధించునవిగా నున్న వనియు, అందుచేత మల్లికార్జున భట్టు రచియించిన భాగములు శివుని కంకితము చేయఁబడినవి గాని సాహిణి మారన కంకితముచేయఁబడినవి కానట్టును సాహిణిమారననుగూర్చిన రెండు పద్యముల నెవ్వరో చాటువులుగాఁ జెప్పిన నిటీవలిలేఖకులు వానిని దెచ్చి వీనికి ముడిపెట్టినట్టును మల్లికార్జునభట్టు సాహిణిమారనకాలమువాఁడు కానట్టును నూహింపవలసియున్న" దనియు వ్రాసి, తరువాతఁ గుమార రుద్రదేవునిగూర్చి యతఁడు "తనభాగమును (అయోధ్యాకాండమును) సాహిణిమారని కంకితముచేసినది వాస్తవ మనుటకు సందియములేదు గాని యతఁడు భాస్కర శిష్యుఁ డన్న మాట విశ్వసింపఁదగినదిగాఁ గనుపట్ట" దనియు, "ఇంత విద్యావంతుఁడైన కుమారుఁడు కలిగి యుండియు సాహిణిమారఁ డీ రామాయణము నంతయు నీతనిచేతనే వ్రాయింపకుండుటకుం గారణంబు" లేదనియు, వ్రాసి, యటు పిమ్మట భాస్కరునిగూర్చి "అరణ్యకాండము సాహిణిమారని కంకితము చేయఁబడియున్నది గాని రచనా విధాన మంతయు నన్నెచోడ, తిక్కనాది కవివరుల రచనావిధానక్రమమును బోలియున్నది" యనియు, "ఈ కాండ మున నాశ్వాసవిభాగము చేయఁబడినది. అంతియగాక యీ కాండమునందలి ప్రథమ ద్వితీయాశ్వాసాంతపద్యములు కృతిపతినిగూర్చి సంబోధనములు గాక ప్రథమ ద్వితీయాంతములుగా నున్నవి. ఇట్టి మార్గమును తదితర కాండములను రచించిన కవు లెవ్వరు నవలంబించి యుండలేదు" అనియు, వ్రాసి, అటుతరువాత నయ్యలార్యునిఁగూర్చి యతఁడు "యుద్ధకాండములో కొంత భాగము హుళక్కిభాస్కరుఁడు చెప్పెనని చెప్పెనేకాని హుళక్కి భాస్కరుఁడు తనకు మిత్రుడని యెక్కడను జెప్పి యుండలేదు. మఱియు యుద్ధకాండమునందలి పద్యములు శివుని సంబోధించునవిగా నున్నవి గనుక నితఁడు సాహిణిమారనికాలములోనివాఁడు కాఁడనుట నిశ్చయము" అనియు, వ్రాసి, కడపట రామాయణములో విశేషభాగము సాహిణిమారని మరణానంతరమే రచింపఁబడి యుండవలయును. అట్లుగాక యున్న శివునిం

గూర్చిన సంబోధనములు గల పద్యము లీ రామాయణమున నుండుట కే ప్రమేయము గానరాదు. ఎన్ని విధములుగాఁ బరిశీలించి చూచినను అరణ్య కాండము ఒక్కనభాగములకంటెఁ బూర్వము రచియింపఁబడి యుండు నని విదిత మగుచున్నది. అట్లయినయెడల ... .... సాహిణిమారుఁడు రామా యణము నంతయు విడిచి ముందుగా భాస్కరమహాకవిచే నారణ్యకాండము నంకితము పొందుట కేమి హేతువో తెలియరాదు" అనివ్రాసి, భాస్కర రామాయణమునుగూర్చి యథార్థకథనము వింకను బరిశీలింపవలసియున్నదని తేల్చిరి

మల్లికార్జునభట్టు తన గద్యమునందు

"అష్టభాషాకవిమిత్రకులపవిత్ర భాస్కరసత్కవి పుత్ర మల్లికార్జునభట్ట ప్రణీతం బయిన .. "

అని స్పష్టముగా తాను భాస్కరసత్కవిపుత్రుఁడనని చెప్పుకొనుచుండఁగా కొడుకు తనతండ్రి కాశ్రయుఁడయి యున్న మారనకాలములో లేఁడన్న విపరీతాభిప్రాయము శ్రీవీరభద్రరావుపంతులుగారి కేల కలిగెనో దురూహ్య ముగా నున్నది. మల్లికార్జునభట్టు తాను జేసిన రామాయణభాగమును రాజాజ్ఞచేతఁగాక తండ్రియిష్టమును బట్టియే చేసి యుండుటచేత స్వాభావిక ముగాఁ దన యిష్టదైవతమైన శివునినే సంబోధించి యున్నాఁడు. రాజున కాశ్రితుఁడును, విహితుఁడును నైన భాస్కరుఁడు రాజానుమతితో నా పద్య ముల నట్టే యుంచి యుండవచ్చును. భాస్కరుఁ డాస్థానకవిగాను, మారన యశ్వసేనా నాయకుఁడుగాను ప్రతాపరుద్రునియొద్దఁ గొలువుకుదిరి యుం డుట ప్రసిద్ధము. ఒక్క ముద్రితరామాయణమును మాత్రమే కాక పూర్వ లిఖితపుస్తకములనుగూడ పరిశీలించినచో పూర్వోక్తములయిన యనేకాంశ ములు తేటపడును. చెన్నపురిలోని దొరతనమువారి ప్రాచ్యలిఖితపుస్త భాండాగారములో రామాయణములు ౧౨, ౧౩ సంఖ్యలు గలవియు, ౧౩౦ మొదలుకొని ౧౩౫ వఱకు సంఖ్యలు గలవియు, ౨౪ తాళపత్రీ లిఖితపుస్తకములు నున్నవి కిష్కింధాకాండముచివర నొక పుస్తకములో మాత్రము భాస్కరునిగద్య మున్నది; ఇంకొక పుస్తకములో (౧౪౩)

కుమారరుద్రదేవునిగద్య మున్నది. సుందరకాండముచివరను ౧౨౨ సంఖ్య గల పుస్తకములో "శ్రీమదష్టమభాషాకవిమిత్ర కులపవిత్రయశస్కర భాస్కరప్రణీతంబైన" యని యున్నది. ఈ ప్రకారముగానే ౧౪౪, ౧౪౭ ౧౫౦, ౧౫౧ సంఖ్యల పుస్తకములలోను భాస్కరునిగద్యమే యున్నది. ఈ పుస్తకములలో పద్యములు సహిత మనేకములు భిన్నములుగా నున్నవి. ఈ పద్యభేదములనుబట్టి పుస్తకములో నొక్కరికంటె నెక్కువమంది హస్తము తగిలినట్టు కనఁ బడుచున్నది. మల్లికార్జునభట్టున కిదియే నూతన కవిత్వ మగుటచేతఁ దన పాండిత్యప్రకర్షమును కనఁబఱుపవలె నన్న యుద్దేశముతోఁ గాఁబోలును సాంస్కృతికదీర్ఘసమాసములు మొదలైనవానిని విశేషముగా వాడి యున్నాఁడు

రెండవదియైన యయోధ్యాకాండము మారయకుమారుఁడైన కుమారరుద్ర దేవునిచే రచియింపబడిన ట్లున్నది అతనియాశ్వాసాంతగద్య మిది.

"సకలకళావిశారద శారదాముఖముకురాయమాణ సారస్వతభట్టబాణ నిశ్శంక వీర మారయకుమార కుమారరుద్రదేవ ప్రణీతంబైన.... ... "

ఈ గద్యములోఁ దాను భాస్కరశిష్యుఁడనని చెప్పకపోయినను తన తండ్రి కాశ్రితకవియైన భాస్కరకవితోఁ గలిసి తన తండ్రిపేర రచియింపఁబడు చున్న రామాయణరచనలోఁ దాను పాలుగొనుచుండుటయుఁ, దన పద్యము లను భాస్కరునిచే సంస్కరింపించుకొనుచుండుటయు నాతనిశిష్యత్వమును చెప్పకయే చెప్పుచున్నవి. కొన్ని వ్రాఁత పుస్తకములలో నీ కాండాంతము నందు భాస్కరునిగద్యమే యున్నది. పద్యములును పెక్కులు భిన్నము లుగా నున్నవి. ఇది యంతయు భాస్కరునిహస్త మిందులోను దగిలి యున్నదని తెలుపుడుచేయుచున్నది. కుమారరుద్రదేవుఁడు తరుణవయ స్కుఁడైన రాజకుమారుఁ డగుటచేఁ దన స్తోత్రప్రియత్వమును నిశ్శంకవీర త్వమును గద్యములోఁ గొంత చూపుకొని యున్నాఁడు.

ఇది యుద్ధకాండములోని భాస్కరుని కడపటి పద్యము.

ఉ 'ఇంక బలీముఖుల్ బలిసి రెక్కడిరావణుఁ డేటిలంక పొం
డింకను మేఘనాథునగ ఠీ పెనుమంటలతోడిచిచ్చుల

క్రభంకషశాతకుంభశిఖరంబగు మోసలఁ గంటి రెట్లు నా
వంకఁ జరింప దగ్ని యవి వారివిభీషణుపుణ్యగేహముల్'

[యుద్ధ ౧౮౩౩]

ఇక్కడనుండి యయ్యలార్యుని కవిత్వము. "ఇఁకమీఁద శాకల్యమల్లుభట్టు చెప్పిన కవిత్వము" అని కొన్ని వ్రాఁతప్రతులలోను. "ఈ మీఁద వేదగిరి రాయనింగారు శాకల్యమల్లుభట్టుగారి మనుమఁడు అయ్యలుభట్టుగారిచేత చెప్పించిన యుద్ధకాండశేషము" అని కొన్నివ్రాఁత ప్రతులలోను ఉన్నది. యుద్ధకాండాంతపద్యము కొన్నిప్రతులలో

"అష్టభాషాకవిమిత్రకులపవిత్ర భాస్కరసత్కవిమిత్రాయ్యలార్య విరచితంబైన ...... "

అనియు, కొన్నిప్రతులలో

"ఇది శ్రీశాకల్యమల్లకవివర రామనరసింహాసరజాప్ప లార్యవరనందనో భయభాషాకవితావిశారద శారదాచరణకమలః రివరణ మానసాయ్యలార్య విరచితంబైన.... ..."

అనియు నున్నది. ఇందలి మొదటి గద్యములో నయ్యలార్యుఁడు భాస్కరుని మిత్రుఁ డనియు, రెండవ గద్యములో శాకల్యమల్లునియొక్కయు, రామనృసింహునియొక్కయు తమ్ముఁడైన యప్పలార్యుని పుత్రుఁ డనియుఁ, చెప్పఁబడెను. అయ్యలార్యుఁ డెట్లయినను భాస్కరకవికి సమకాలీనుఁడే. ప్రతాపరుద్రనియాస్థానములో శాకల్యమల్లుభట్టు పండితుఁడు గాను, భాస్కరుఁడు కవిగాను, ఉండినందున శాకల్యమల్లుకవి తమ్మునికొడుకైన యయ్యలార్యుఁడు మల్లికార్జునభట్టు, కుమారరుద్రదేవులతోడి యీడువాఁ డయి యుండును. కవి చెప్పినదానికి ప్రత్యక్షవిరోధముగా నెవ్వడో లేఖకుఁ డెవ్వడో వేదగిరిరాయనింగారు చెప్పించి రని వ్రాసిన మాట పాటింపఁదగినది కాదు. ౧౫౦ వ సంఖ్యగల వ్రాఁతప్రతిలో గద్యయయ్యలార్యునిదే యున్నను, "శ్రీమద్రామాయణమహాకావ్యంబున యుద్ధకాండశేషంబునందు సర్వంబును షష్ఠాశ్వాసము" అని యున్నది. ౧౫౫-వ సంఖ్య గల వ్రాఁతప్రతియందు గద్య సహితము భాస్కరునిదే యుండి

"యుద్ధకాండంబునందు సర్వంబును షష్ఠాశ్వాసము" అని యున్నది. దీనిని బట్టి చూడఁగా భాస్కరుఁడే యుద్ధకాండంబునంతను రచించి, దాని నారణ్యకాండమునువలెనే యాశ్వాసములుగా భాగించి యుండునని తోఁచుచున్నది. అయినను యుద్ధకాండము కడపట షష్ఠాశ్వాసమని యుండుటయే కాని లోపల నాశ్వాసవిభజనము కానరాదు. దీనినంతను విచారించి చూడఁగా రామాయణ మంతయు భాస్కరునికాలములోను సాహిణిమారనకాలములోను రచింపఁబడినదే యని విస్పష్ట మగుచున్నది రామాయణకవిత్వమంతటిలోను మొట్టమొదట నారణ్యకాండకవిత్వమును, దానికిఁ దరువాత యుద్ధకాండకవిత్వమును మేలయినదిగాఁ గానఁబడుచున్నది.

[భాస్కరరామాయణమునందలి బాల, అరణ్య, కిష్కింధాసుందరకాండములను మంత్రి భాస్కరుఁడును, అయోధ్యాకాండమును కుమారరుద్రదేవుఁడును, యుద్ధకాండములోని కొంతభాగమును హుళక్కిభాస్కరుఁడును, మిగిలిన భాగము నయ్యలార్యుఁడును రచించిరనియు, బాల, కిష్కింధా, సుందరకాండములలో మల్లికార్జునభట్టు కవిత కొంత చేరియుండుటవలన కాండముల చివరి గద్యము లాతని పేరిటనే కానవచ్చుచున్నవనియు 'ఆంధ్రకవి తరంగిణి' కారుల యభిప్రాయము బాలకాండము, అయోధ్యాకాండము, అరణ్యకాండమును మంత్రి భాస్కర విరచితములయి యుండునని 'తెనుగుకవుల చరిత్ర' కర్తల యభిప్రాయము.

భాస్కరరామాయణములోని బాల, కిష్కింధా, సుందరకాండములను భాస్కరుని కుమారుఁడగు మల్లికార్జునభట్టు రచించినట్లు గద్యములవలనఁ దెలియవచ్చు చున్నది. ఆ కాండములలో నీతని కవిత కొంత చేరియుండును. ఇతఁడు హుళక్కిభాస్కరుని పుత్రుఁడు ఇతఁడు తన గ్రంథభాగములను పరమేశ్వరాంకితములుగా నొనర్చెను. ఇతని యితర గ్రంథములేవియు లభింపలేదు. హుళక్కిభాస్కరుని కాలము పదుమూఁడువ శతాబ్ది ద్వితీయపాదమునుండి పదునాల్గవ శతాబ్ది ప్రథమపాదము వఱకు నగుటచే మల్లికార్జునభట్టు క్రీ. శ. ౧౨౮౦ - ౧౩౩౦ నడుమనుండి యుండునని 'ఆంధ్రకవి తరంగిణి' కారుల యభిప్రాయము. (మూఁడవ సంపుటము పుట 218)

ఇందలి యయోధ్యాకాండమును రచించిన కుమారరుద్రదేవుని గ్రంథాంతర ములు కానరాలేదు. ఈతఁ డోరుగంటిని పాలించిన రుద్రదేవుని బంధువై యుండునని శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారును, కృతిపతి యగు సాహిణి మారన పుత్రుఁడని శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారును భావించిరనియు, వారియూహలు సరికావనియు 'ఆంధ్రకవితరంగిణి'లోఁ గలదు. (మూఁడవ సంపుటము-'కుమారరుద్రదేవుఁడు') ఇతఁడు 13 వ శతాబ్దిచివఱను, 14 వ శతాబ్ది తొలిపాదమునను ఉండియుండును.

యుద్ధకాండమును పూరించిన (శాకల్య) అయ్యలార్యుఁడు మల్లుభట్టు మనుమఁడు; అప్పలార్యుని నందనుఁడు; ఇతఁడు రామాయణ యుద్ధకాండ మును క్రీ. శ. ౧౩౭౦ ప్రాంతమున పూర్తిచేసియుండునని 'ఆంధ్రకవి తరంగిణి' (నాలుగవసంపుటము-పుట 154) లోఁ గలదు.]

# నాచన సోముఁడు

నాచన సోముఁ డనెడి కవి యెఱ్ఱాప్రెగడ కిరువది ముప్పది సంవత్సరముల తరువాత సుప్రసిద్ధపండితకవిగా నుండినవాఁడు. ఈ కవి యెఱ్ఱాప్రెగడ వృద్ధదశలో బాలుఁడయి కొంతకాలము సమకాలీనుఁడయి యుండి యుండ వచ్చును. ఇతఁడు రచించిన హరివంశముయొక్క మొదటియాశ్వాసము లోని యవతారిక మాకు దొరకనందున కవియొక్క గోత్రాదులను చెప్పఁ జాలము. ఇతఁడు నియోగి, నాచన కొమారుఁడు. [నాచనసోముఁడు- అనుచోఁ గల 'నాచన' శబ్దము వంశనామమో, పితృనామమో స్పష్టముగాఁ దెలియుట లేదనియు, శాసనములోని 'సోమాయ నాచనాంభోధే = సోమాయ' అని యుండుటచే వంశనామమే యని యూహింప నవకాశ మున్నను, కొక్కోక కవి యెఱ్ఱన సోమన నాచన సుతుఁడని చెప్పుటచేతను, సింహాసన ద్వాత్రింశతికను రచించిన కొఱవి గోపరాజు 'నాచిరాజు సోమన' యని పేర్కొనుటచేతను, 'నాచన' యనునది తండ్రిపేరే యని నిశ్చయింప వచ్చుననియు 'ఆంధ్రకవి తరంగిణి' (నాలుగవ సంపుటము, పు 116)లోఁ జెప్పఁబడినది.] ఇతఁడు తన గ్రంథమును నెల్లూరియందలి హరిహరనాథు నకుఁ గృతి యిచ్చుటచేత నీతనినివాసస్థలము నెల్లూరిమండలములోని యేదో గ్రామమని తోఁచుచున్నది. ఎఱ్ఱాప్రెగడ చేసిన హరివంశము ప్రౌఢముగా నుండలే దన్న యభిప్రాయముతో నీతఁ డీ యుత్తరహరివంశమును రచించి నట్టు కనఁబడుచున్నది. [నాచనసోముఁడు, ఎఱ్ఱాప్రెగడవలెనే హరివంశము నందలి పూర్వోత్తరభాగములను రెండింటిని రచించెనని 'ఆంధ్రకవి తరంగిణి' కర్త, మఱికొందఱును తలంచుచున్నారు. ఇతని పూర్వహరివంశ మెచ్చటను లభింపలేదు. ఇతఁ డుత్తర హరివంశమునే రచించియుండునని శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు మున్నగువారి యాశయము. సోమన పూర్వ హరివంశమునుకూడ రచించెననుటకుఁ దగిన ప్రమాణములు కావలసి యున్నది. [ఇంచుమించుగా నెఱ్ఱనయు, సోమనాథుఁడు నేకకాలీనులు గనుక, శంభుదాసునికవిత్వమునం దీత నికంత గౌరవము కలిగి యుండకపోవచ్చును.

సోమనాథునికవిత్వము మిక్కిలి ప్రౌఢముగాను, సర్వవిధముల నెఱ్ఱాప్రెగడ కవిత్వమునకంటె మేలైనదిగాను ఉన్నది. ఒక్క యెఱ్ఱాప్రెగడకవిత్వమే కాదు. భారతమును రచించిన కవిత్రయములో ననేకులకవిత్వమును గొన్ని విషయములలో సోమునికవనముతో సరి రాదని నా యభిప్రాయము *

ఇతనికవిత్వపటుత్వసంపదనుబట్టి యీతనికి సర్వజ్ఞుఁ డని బిరుదుపేరు వచ్చినది. ఆపేరున కీతఁడు తప్పక తగినవాఁడే. ఇటీవల నితనికాలమును దెలిపెడి తామ్రశాసన మొకటి దొరికినది. అది బుక్కదేవరాయల రాజ్య కాలములో నాచనసోమనకును, మఱి యైదుగురు బ్రాహ్మణులకును గలిపి రా జొక గ్రామము నగ్రహారముగా నిచ్చినప్పుడు పుట్టిన శాసనము. ఈ శాసనమునుబట్టి యితఁ డాపస్తంబసూత్రుఁడనియు, భారద్వాజగోత్రు డనియు యజుశ్శాఖవాఁడనియు సకలాగమవేది యనియు నష్టాదశ పురాణార్థ విదుఁడనియు నష్టభాషాకవిత్వరచనావిశారదుఁ డనియు నాచనకులాంభోధి సోముఁ డనియుఁ దెలియవచ్చు చున్నది. ఈ శాసనము నిచ్చటఁ బూర ముగా వ్రాయుచున్నాను. ఇది మైసూరురాజ్యములోని కోలారు మండలమునందలి హోబ్లీరామపురపు పటేలయిన జటావల్లభుఁ డను విప్రునినుండి గైకొనఁబడి ఎపిగ్రాఫికాకర్ణాటికాలో జీ, డీ ౪౭ వ సంఖ్యను ప్రకటింపఁబడిన తామ్రశాసనము.

శ్రీగణాధిపతయే నమః

శ్లో. నమ స్తుంగశిరశ్చుంబిచన్ద్రచామరచారవే,
త్రైలోక్యనగరారంభమూలస్తంభాయ శంభవే. ౧
అవ్యా దవ్యాహతైశ్వర్యకారణో వారణాననః
వరద స్త్రివతిమిరమిహిరో హరనందనః. ౨

---

* [ఎఱ్ఱాప్రెగడ కవిత్వముకంటె సోముని కవిత్వమే ప్రశస్తతరమని శ్రీబహు జనపల్లి-సీతారామాచార్యులుగారు, నడకుదుటి-వీరరాజుగారు మున్నగువారి యభి ప్రాయము. ఎఱ్ఱనకవిత ప్రశస్తతరమని శ్రీరాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారు మున్నగు వారి యాశయము.]

శ్రీమా నాది వరాహో య శ్శ్రియం దిశతు భూయసీం,
గాఢ మాలింగితా యేన మేదినీ మోదతే సదా. ౩

అ_స్తి కౌస్తుభమాణిక్యకామధేనుసహోదరః,
రమానుజః కళానాథః క్షీరసాగరసంభవః ౪

ఉదభూ దన్వయే తస్య యదుర్నామ మహీపతిః,
పాలితా యత్కులీనేన వాసుదేవేన మేదినీ. ౫

తత్కులే బుక్కనామా యః కీ_ర్తిశౌర్యవిచక్షణః,
మంగాంబికాఽభవ ద్రాజ్ఞీ లక్ష్మీరివ హరే ర్యథా. ౬

అభూ _త్తస్య కులే శ్రీమా నభంగురగుణోదయః,
అపా_త్త దురితాసంగః సంగమో నామ భూపతిః. ౭

మాలాంబికాఽభవ ద్రాజ్ఞీ తస్య రాజ్ఞః శుచిస్మితా,
దమయంతీ నళస్యేవ ఇంద్రస్యేవ యథా శచీ. ౮

ఆసన్ హరిహరః కంపో బుక్కరాయమహీపతిః.
మారపో ముద్దప శ్చేతి కుమారా _స్తస్య భూపతేః. ౯

పంచానాం మధ్యగ _స్తేషాం ప్రఖ్యాతో బుక్కభూపతిః,
ప్రచండవిక్రమో మధ్యే పాండవానా మివార్జునః. ౧౦

భంగాః కళింగామితశౌర్యవృ_త్తే
ర్వంగా విభిన్నాంగవిఘూర్ణనేత్రాః,
ఆంధ్రాశ్చ రాంధ్రాణి విశంతి యస్య
బాహాగ్రఖడ్గేన విశీర్యమాణాః.

తురుష్కాః శ్శుష్కవదనాః పాండ్యభూపాః పలాయితాః,
స్వభుజార్జితవీర్యేణ తస్మి న్రాజ్యం ప్రశాసతి. ౧౨

బుక్కరాయోఽభవ చ్ఛ్రీమాన్ భుజార్జితపరాక్రమః,
మేదినీవ ప్రజా యేన స్వపుత్రా ఇవ రక్షితాః. ౧౩

రాజాధిరాజ _స్తేజస్వీ యో రాజపరమేశ్వరః,
భాషాలంఘితభూపాలభుజంగమవిహంగమః. ౧౪

రాజరాజభుజంగో యః పరరాజభయంకరః.
హిందురాయసురత్రాణ ఇత్యేతైః శుభశోభితః. ౧౭
విద్యాభిధాననగరీ విజయోన్నతిశాలినీ,
విద్యారణ్యకృతా తస్యాం రత్నసింహాసనే స్థితః. ౧౮
యస్మిన్ షోడశదానానాం ధరా యా పరిశోభితే,
దానాంబుధారయా తస్య వర్ధతే ధర్మపాదపః. ౧౯
అలంకృతే శకస్యాబ్దే రసభూవయనేందుభిః
తారణాబ్దే చైత్రమాసే నవమ్యాం శుక్లపక్షకే. ౧౦
పంపాయాం భాస్కరక్షేత్రే విరూపాక్షస్య సన్నిధౌ.
ఆపస్తంబాఖ్యసూత్రాయ భారద్వాజాన్వవాయినే. ౧౯
యాజుషాణాం వరేణ్యాయ సకలాగమవేదినే.
అష్టాదశపురాణానా మఖిలజ్ఞాతార్థవేదినే. ౨౦
అష్టభాషాకవిత్వశ్రీ వాణీ విజితసంపదే,
సోమాయ నాచనాంభోధేః సోమయామితతేజసే. ౨౧
గుత్తి దుర్గాభిధే రాజ్యే కోడూరాజ్యమహీతలే,
పెన్నమాగాణి విఖ్యాతే సర్వసస్యోపశోభితే. ౨౨
కోడూరునాగమల్లాఖ్యదిన్నాభాఖ్య మపి పశ్చిమాం.
గ్రామోత్త మాద్వేటమంకూరోః ప్రాచ్యాద్దిశి పమన్వితం ౨౩
ఊరచింతలనామ్నశ్చ గ్రామా ద్దక్షిణసంస్థితం.
వంగలూరోర్కడుతాశాఖ్యా ముత్తరాశాముపాశ్రితం. ౨౪
పినాకినీతటే పెంచుకలదిన్నాహ్వయం పురా.
బుక్కరాయపురాఖ్యాత ప్రతినామ్నా చ శోభితం. ౨౫
నిధినిక్షేపసంయుక్తం జలపాషాణసంయుతం,
అక్షిణ్యాగామిసహితం సిద్ధసాధ్యసమన్వితం. ౨౬
అష్టభోగ మిదం సర్వస్వామ్య మాచంద్రతారకం,
సహిరణ్యపయోధారాపూర్వకం దత్తవాన్ముదా. ౨౭

శ్రీమన్నాచనసోమాఖ్యమహాకవివరోఽప్యథ,
రాజాన మాశిషం చైవ చిరజీవీ భవత్వితి. ౨౮

స్వయ మన్వకరోద్వృత్తిం దశోత్తరశతం కవిః,
షట్త్రింశ దత్ర భాగాః స్యు ర్యజమానాహ్వాయ స్తతః. ౨౯

భారద్వాజాన్వయే జాతః తల్లపో నామ యాజుషః,
అష్టావింశతివృత్తీనా మధిపో నాచనాత్మజః ౩౦

కాశ్యపాన్వయసంభూత అన్నదాతాధ్వరీంద్రజః,
యాజుషైకాదశాంశీ చ సర్వజ్ఞః సింగయో బుధః. ౩౧

కాశ్యపాన్వయసంభూత అన్నదాతాధ్వరీంద్రజః,
యాజుషైకాదశాంశీ చ సర్వజ్ఞః సింగయో బుధః. ౩౧

దేవణస్య సుతః శ్రీమాన్ సింగపో నామ యాజుషః,
కౌండిన్యాన్వయసంభూతో దశవృత్తీశ్వరః స్మృతః ౩౨

నాగయస్య సుతః శ్రీమాన్ వత్సయో నామ యాజుషః,
కాశ్యపాన్వయసంభూతో వృత్తిత్రయ మిహాశ్నుతే. ౩౩

శ్రీవత్సాన్వయసంభూత స్తిమ్మయస్య తనూభవః,
యాజుషో భాస్కరశ్చేతి వృత్తిద్వయ మిహాశ్నుతే. ౩౪

అస్యాగ్రహారవర్యస్య చతుస్సీమావినిర్ణయం,
సర్వేషాం సుఖబోధాయ లిఖ్యతే దేశభాషయా. ౩౫

తూర్పుకు నాగమలదిన్న - ఆసందుకు చింతకోట. అందుకు దక్షిణము రగదిలోని నల్లగుట్ట - అందుకు దక్షిణాన కప్పలవాగు మేర - అందుకు పశ్చిమానక ... అందుకు దక్షిణాన వేంపమ్రాకు. అందుకు దక్షిణాన కోడూరి రాట్లపువాల్లి అరతిపెద్దరావిమాకు నాగమల్లదిన్న - ఆసందుకు ముగ్నుడ్డ పొలాన ... అమ్మిమ్రాకుమేర. అందుకు దక్షిణాన కలవిగుట్టం - అందుండి పెన్న యేటిగడ్డను ఉప్పారగోడలు-దక్షిణాన కవంగలూరును కొడతాళాను ఆసందుక పెన్నమేరనై-పడుమటికి వెలునుకూరు - ఆసందుకు యేటకలసిన కొనవాంగుమేర - పడుమటికి గడ్డమేర - అందుకు ఉత్తరాన నాయనిచింత -

అందుకు ఉ_త్తరాన చోటమిట్టమీది జమ్మిమాకు. అందుకు ఉ_త్తరావ దంటు తెరువు వేంపమ్రాకు. అందుకు ఉ_త్తరాన కప్పలవాంగుగడ్డను తుమ్మమ్రాకు— అందుకు ఉ_త్తరాన కాళంవాంగు మేరచేసికొని నక్కలతిప్ప - పడుమట అందుమేర చేసికొని కొండమేర - ఉ_త్తరానకు ఊరచింతల ఆసందుకున్ను కొండమేర - మానుచింతకానసుకలశన్ను.

ఇది మఖిలరాజశేఖరమధుకరఝెుంకారగీత మాహాత్మ్యం
శ్రీమద్బుక్కరాజేంద్రనృపతేః శాసన మచలైకపారిజాతస్య
ఆత్రేయాణాం యాజుషః కోటిదేవా
రాధ్యాచార్యస్యాంగజో మాథమూ_ర్తిః
చక్రే సమ్యక్సర్వశాస్త్రప్రవీణః
శ్లోకానేతాన్మల్లనారాధ్యవర్యః.　　　౩౭

త్వష్టైత్రిత చ్ఛాసనం స్వామిశాసనేన నివిర్మితం।
శాసనాచార్యవర్యేణ నాగిదేవేన శిల్పినా.　　　౩౮

దానపాలనయోర్మధ్యే దానా చ్ఛ్రేయోనుపాలనం.
దానా త్స్వర్గమాప్నోతి పాలనా దచ్యుతం పదం.　　　౩౯

స్వద_త్తా ద్ద్విగుణంపుణ్యం పరద_త్తానుపాలనం.
పరద_త్తాపహారేణ స్వద_త్తం నిష్ఫలం భవేత్.　　　౪౦

సామాన్యోయం ధర్మసేతుర్నృపాణాం
కాలే కాలే పాలనీయో భవద్భిః.
సర్వా నేతాన్ భావినః పార్థివేంద్రాన్
భూయో భూయో యాచతే రామచంద్రః.　　　౪౧

శ్రీవిరూపాక్ష.

ఈ శాసనమునుబట్టి పెంచుకలదిన్న యను పూర్వనామము గల గ్రామము బుక్కరాయపురమను నూతననామముతో నూటపది భాగములుగాఁ జేయఁబడి, వానిలో ౩౬ భాగములు యజుర్వేదియు భారద్వాజగోత్రుఁడు నయిన నాచనసోమునకును, ౨౮ భాగములు భారద్వాజగోత్రుఁడునునాచనపుత్రుఁ

డునైన తల్లప్పకును, ౧౧ భాగములు కాశ్యపగోత్రుఁడును అన్నదాతా ధ్వరిపుత్రుఁడు నైన సింగయ్యకును, ౧౦ భాగములు కౌండిన్యగోత్రుఁడును రేవణవిష్ణుతుఁడును నైన సింగప్పకును, ౧౩ భాగములు కాశ్యపగోత్రుఁడును నాగయ్యపుత్రుఁడును నైన వత్సయ్యకును, ౧౨ భాగములు శ్రీవత్స గోత్రుఁడును తిమ్మయ్య పుత్రుఁడు నైన భాస్కరునికిని, గ్రామ మాఱు గురు బ్రాహ్మణుల కగ్రహారముగా నియ్యఁబడినది. ఆ యాఱుగురికిని వేఱువేఱుగా రాగిరేకులమీఁద దానశాసనములు చెక్కించి యియ్యఁబడిన ట్లున్నవి. ఈ శాసనమునకే ప్రతికగా నున్న యింకొక తామ్రశాసనము ముడియనూరిలోని వేంకటరామశాస్త్రిగారివద్దనుండి గైకొనఁబడి యెపిగ్రాఫికా కర్ణాటికాలో ఎమ్. బీ ౧౫౮ వ సంఖ్యను బ్రకటింపఁబడినది.

ఈ రెండుశాసనములును బుక్కరాయలయాజ్ఞచే తన్నియుక్తాధికారి యగు విరూపాక్షునిసంతకముతో నేకకాలమున నేకకవి (మల్లనారాధ్యకవి) చే రచియింపఁబడి యేకశిల్పి (నాగిదేవుని) చేతనే చెక్కఁబడినవే యయినను, అందందు ముఖ్యభాగములలోనే పాఠభేదములను గలిగియుండుట వింతగా నున్నది. ఒకదానిలో నాచనసోముని కియ్యఁబడిన భాగములు (36) షట్త్రింశత్తని యుండఁగా రెండవదానిలో (౨౬) షడ్వింశత్తని యున్నది. ఇరువదియెనిమిది యని చెప్పినచో మొత్తము నూటపది భాగములకు సరిపోదు గాన (ముప్పదియాఱు) షట్త్రింశత్తని యుండుటయే సరియైనది. కవికాలము ననఁగా దానకాలమును దెలిపెడి ముఖ్యభాగమే వ్యత్యాసము కలదిగా నున్నది. మొదటిదానిలో "రసభూనయనేందుభిః" అని యున్నపాఠము రెండవదానిలో "రసాబ్ధినయనేందుభిః" అని యున్నది. దానకాలము మొదటి పాఠమునుబట్టి శాలివాహనశకము ౧౨౧౬ వ సంవత్సర మనఁగా క్రీస్తుశకము ౧౨౯౪ వ సంవత్సర మగుచున్నది, రెండవ పాఠమునుబట్టి శాలివాహనశకము ౧౨౪౬ వ సంవత్సర మగుచున్నది. ఈ రెంటిలో నే కాలమును బుక్కరాయలరాజ్యకాలములోనిది కాదు. ఆ కాలములో బుక్కరాయలు రాజ్యముచేయకుండుటయేకాక యప్పటి కాతఁడు పుట్టియైన నుండఁడు. శాసనములోని వాక్యములనుబట్టి చూడఁగా బుక్కరాయలు తాను రాజ్యము

చేయుచున్న కాలములోనే నాచనసోమునికి దానముచేసినట్లు స్పష్టముగాఁ దెలియవచ్చుచున్నది. శ్రీచిలుకూరి వీరభద్రరావుగారి యాంధ్రులచరిత్ర మునుబట్టి వీరబుక్కరాయలు ౧౩౫౫ వ సంవత్సరము మొదలుకొని ౧౩౭౭ వఱకును భూపరిపాలనము చేసెను. కాఁబట్టి శాసనకాలము ౧౩౫౫ నకును ౧౩౭౭ నకును మధ్య దేదో యొక సంవత్సరమయియుండవలెను అగ్రహారదానసంవత్సరము తారణ యని శాసనము చెప్పుచున్నది. రాజ్యారంభ సంవత్సరము మన్మథ (౧౩౫౫) యు, అంత్యసంవత్సరము నల (౧౩౭౬) యు, అగుచున్నవి. ఈ మధ్య ననఁగా బుక్కరాయల రాజ్యకాలములో తారణసంవత్సరము లేనేలేదు. ఉన్న సంవత్సరములో వర్ణోచ్చారణమునుబట్టి తారణకు చేరువ సంబంధముగలది సాధారణ. ఇది బుక్కరాయల రాజ్యకాలములో నుండుటచేత శాసనసంపాదకులైన రైసుదొరగారు తమ పండితులతో నాలోచించి సాధారణసంవత్సరమునకు సరిపోవునట్లుగా "రసభూనయనేందుభిః" అన్నదానిని "కరాజనయనేందుభిః" అని సవరించి శాలివాహనశకము ౧౨౯౨ అనఁగా క్రీస్తుశకము ౧౩౭౦ వ సంవత్సరమగునట్లు చేసిరి. అప్పుడు శాసనశ్లోక మీ విధముగా మాఱుచున్నది.

"అలంకృతే శకస్యాబ్దే <u>కరాజనయనేందుభిః</u>
<u>సాధారణే</u> చైత్రమాసే నవమ్యాం శుక్లపక్షకే."

కర = ౨, అజ = ౯, నయన = ౨, ఇందు = ౧-౨౯-౨౧ కుడినుండి యెడమకు ౧౨౯౨ శకవర్షమగుచున్నది. శాసనసంవత్సర మిదియేకావచ్చును గాని యీ యూహయే సరియైన దని నిశ్చయముగాఁజెప్పవలనుపడదు. ఈ మార్పును సూచించిన శాసనసంపాదకు లగు రైసుదొరగారు తమ యింగ్లీషు భాషాంతరములో పుట యడుగున నీక్రింది నివేదనము చేసియున్నారు.

Note:—"This is given as the Saka year rasa bhu nayana indu (=1216), the year Tarana. But This does not fall within Bukka's reign, during which there

was no Tarana. Hence Sadharana, Saka 1292 expired has been conjecturally taken ”

షిమోగామండల (TI No. 154, Shimoga Dt. Ep. Carn ) టీయల్ ౧౫౪ వ సంఖ్యశాసనములో బుక్కదేవరాయలు శకవత్సరము 1268 వ్యయసంవత్సర మార్గశీర్ష శుద్ధద్వితీయనాఁడు సింహాసనమెక్కినట్టు చెప్పఁబడియుండుటచేత క్రీస్తుశకము 1346 వ సంవత్సరాంతమునుండియే యాతని పరిపాలన మారంభమయ్యెనని కొందఱు చెప్పుచున్నారు. అట్లయినను తారణసంవత్సరము కాని శకవర్షము 1216 గాని యీతని రాజ్యకాలములో రావు. ఇఁక 'రసాభ్రనయ నేందుభిః'' అన్న రెండవ పాఠమును జూడుఁడు. ఇందుఁ జెప్పఁబడిన తారణసంవత్సరమును హరిహరబుక్కరాయలకాలములోనికిఁ దెప్పించుటకు శకవర్షమును 1266 నకు మార్ప వలెను. అట్లు మార్చుటచే ''రసాభ్ర'' యని యున్నదానిని ''రసర్తు''నుగా సవరించిరి. అట్లుచేసినను బుక్కరాయలకాలములోనికి రాక తారణసంవత్సరము హరిహరరాయలరాజ్యకాలములోనికి వచ్చినది. అందుచేత శాసనకాలము ౧౨౪౪ అనుటకంటె ౧౨౬౦ అనుటయే సత్యమునకు సమీపమయి యుండును. శకవర్షము 1298 (క్రీస్తు. శ. 1376) నలసంవత్సర ఫాల్గుణ బహుళపాద్యమి భానువారమునాడు బుక్కరాయలు మృతినొందెను. బుక్కరాయనికాలములో నుండి యాతనిచే నగ్రహారమును బడసి నాచన సోమనాథుఁ డెఱ్ఱాప్రెగడకంటెఁ బూర్వుఁ డని చేసెడి వాదము విశ్వాసార్హమయినది కాదు.

[శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు సోముని ఉత్తరహరివంశపీఠికలో శాసనమునందలి 'రసాభ్రనయనేందుభిః' అనుదానిలోని 'భ్ర' ను 'ర్తు' గా సవరించి, శాసనకాలము శా. శ. ౧౨౬౬ గానిర్ణయించిరి. నాగరలిపిలో 'భ్ర, ర్తు' లకు ఎక్కువ పోలికయుండుటచే శాసనమును వ్రాసినవారుగాని పరితలుగాని పొరపాటుపడియుందురని శ్రీ శాస్త్రులుగారి యాశయము. కాఁగా నీతఁ డెఱ్ఱాప్రెగడకు సమకాలికుఁడో, కొంచెము తర్వాతివాఁడో అయియుండును. ఆంధ్రకవితరంగిణియందు నీ యాశయమే తెలుపఁబడినది.]

అందందు నెఱ్ఱాప్రెగడ హరివంశములోని పద్యము నొకదానిని సోముని హరివంశములోని పద్యము నొకదానిని తీసి పోల్చుటవలన నుభయకవుల తారతమ్యమును తేటపడ నేరదు. కవిత్వతత్త్వమును మొత్తముమీఁద విచారింపవలెను. అప్పుడుసహితమభిప్రాయభేదముండక మానదు. ఒకరికి రుచించినది యింకొకరికి రుచింపదు. లోకోభిన్నరుచి యన్నది క్రొత్తది కాదు గదా!

ఇతఁడు హరివంశముఁగాక వసంతవిలాస మను ప్రబంధమును నొకదానిని కూడ రచియించి యున్నాఁడఁట. * దానిలోని పద్యముల మూటి నీ క్రింద నుదాహరించుచున్నాను.

క. అత్తఱి విటనాగరికులు
చిత్తమున వసంతకేళి చిగురొత్తంగా
మొత్తములు గట్టి తెచ్చిరి
ముత్తెపుఝల్లరులతోడి ఋజ్జటకొమ్మల్.

క. అంజెదవుగాక నను జెం
తం జేరఁగనీక యెంతతగ్గిన మిరియా
లుం జొన్నలసరిగావే
లంజెతనమునందుఁ గొమిరెలం గెలువవాకో.

శా. ప్రాలేయప్రతివీరసేనఁ బఱపెన్ బ్రైపై వసంతం బిలన్
గాలోన్మీలితకోరకోదరపరాగప్రౌఢకోపాగ్నియై

---

* ['వసంతవిలాసము' మాచయబ్రహ్మయ కంకితము చేయఁబడినదని శ్రీమానపల్లి—రామకృష్ణకవిగారు తెల్పినారు ఈ బ్రహ్మని శాసన మొకటి పల్నాడు తాలూకాలోని కారెమపూఁడిలో నున్నదని శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు ఉత్తరహరివంశ పీఠికలో వ్రాసియున్నారు. ఈ మాచయబ్రహ్మనిమీఁద కొన్ని చాటువులు కలవు.

నాచనసోముని హారవిలాసములోని వని కస్తూరి రంగకవి రంగరాట్ఛందములోఁ గొన్ని పద్యముల నుదాహరించినాఁడు. ఈ గ్రంథము హారవిలాసముకంటె భిన్నమో అభిన్నమో ?]

హాలాపానవిహారసారమహిళాహుంకార దోస్సారమై
హేలాపల్లవహేతిఖండితమహాహేమంతసామంతమై.

ఇట్లొక పద్యమును రెండుపద్యములను జూపుటవలన నీతనికవిత్వశైలి తెలియఁజాలదు గనుక సోముని హరివంశమునందలి యుషాకన్యాపరిణయ కథలోని కొంత భాగము నిందుఁ బ్రకటించుచున్నాను. ఇతనికిఁ దిక్కన సోమయాజియందు మిక్కిలి గౌరవ ముండుట యితఁడు హరివంశము నందుఁజెప్పిన "ఇది శ్రీ మదుభయకవిమిత్ర కొమ్మనామాత్యపుత్ర బుధా రాధనవిరాజి తిక్కనసోమయాజి ప్రణీతం బయిన శ్రీమహాభారతకథావంతా రంబున శ్రీమత్సకలభాషాభూషణ సాహిత్యరసపోషణ సంవిధానచక్రవర్తి సంపూర్ణకీర్తి నవీనగుణసనాథ సోమనాధ ప్రణీతం బయిన"యను గద్యము వలన స్పష్టముగాఁ దెలియవచ్చుచున్నది. ఎఱ్ఱాప్రెగడకు డెబ్బది యెనుబది సంవత్సరములకుఁ దరువాత నున్న ప్రౌఢకవి మల్లన మొదలయినవా రీతనిని పూర్వకవినిగా స్తుతించినారు.

ఉ. నన్నయభట్టుఁ దిక్కకవి నాచనసోముని భీమనార్యుఁ బే
రెన్నికఁ జిమ్మపూడియమరేశ్వరు భాస్కరు శంభుదాసునిన్
సన్నుతి చేసి వాక్యసరసత్వము వీనుల కింపుమీఱ న
త్యున్నతిగా నొనర్తు నెఱియోధులు మేలనఁ గావ్య మిమ్ములన్.

అని పోతనామాత్యుని పుత్రుఁడయిన ప్రౌఢకవిమల్లన * తన రుక్మాంగద చరిత్రమునందు సోముని స్తుతించి యున్నాఁడు.

సీ. . .... ....... . నన్నపార్యువర్ణనలఁ బొగడి.

గీ. వెలయఁ దిక్కనసోమయాజుల భజించి
యెఱ్ఱనామాత్యు భాస్కరు నిచ్చ నునిచి
సుకవిసోముని నాచనసోము నెరఁగి
కవిమనోనాధు శ్రీనాధు ఘనత మెచ్చి.

* ఇతఁడు పోతనామాత్యుని పుత్రుఁడు కాఁడు ఇతఁడు శ్రీవత్సగోత్రుఁడు. పోతన కౌండిన్యగోత్రుఁడు. ఈ మల్లన తండ్రి పోతయమంత్రి.

అని భాగవతషష్ఠస్కంధమునందు సింగయయు సోముని పూర్వకవిగాఁ జెప్పినాఁడు. పిల్లలమఱ్ఱి పినవీరన్నయు "మా నన్నయభట్టుఁ దిక్కకవి నెఱ్ఱాప్రెగ్గడన్ సోమునిఁ" అని యెఱ్ఱాప్రెగడతరువాత సోమునిఁ జెప్పినాఁడు. వీని నన్నిటినిబట్టి విచారింపఁగా సోమకవి యెఱ్ఱాప్రెగడకుఁ దరువాతను శ్రీనాథాదులకుఁ బూర్వమునందును నుండుట స్పష్టము. కాఁబట్టి యతఁడు హూణశ॥ ౧౩౬౦-౭౦ సంవత్సరప్రాంతములయం దున్నాఁడని యించుమించుగా నిశ్చయింపవచ్చును. దీనినిబట్టి విచారింపఁగా నాచన సోమనాథుఁ డిప్పటి కయిదువందలయేఁబది సంవత్సరములక్రింద నున్నట్లు తేలినది. ఈ విషయమయి పెంచి చెప్పుటకంటె హరివంశములోని పద్యములను వ్రాయుటయే చదివెడివారికి మనోహరముగా నుండవచ్చు నను తలంపుతో నట్లు చేయుచున్నాను.

మ. ఒకనాఁ డిందుధరుండుఁ బార్వతియు లీలోద్యానకేళీసరి
న్నికటానేకవిహారదేశముల దైతేయేంద్రకన్యాప్సరో
నికురుంబంబులు పారిజాతకుసుమానీకంబు పైఁ జల్ల ద
ర్పకబాణంబుల కెల్ల నెల్ల యగు సౌభాగ్యంబుతో నాడఁగన్.

వ. అట్టియెడ.

సీ. కిసలయంబులతోడఁ గెంగేలు తడవెట్టి
　　విరులపై నఖకాంతి విఱ్ఱి రాల్చి
తేఁటిగములకు దనూళిలఁ గానుక యిచ్చి
　　గుత్తులఁ బాలిండ్లు గొలిచి చూచి
చలిగాలి నిశ్వాససౌరభంబుల నాఁగి
　　యళిపంక్తి కురులతో వలుక దీర్చి
పుష్పాళి నెలగంధములు వియ్యమందించి
　　పూఁదేనెచెమటల బుజ్జగించి
తొడలు ననఁటికంబంబులు ఘెడలుఁ బోక
బోదెలు నెలుంగులును బరపుష్టశతులు

మాటలును గిరభాషలు మక్కళించి
చిగురుఁబోఁడులు వనకేళి చేయఁ జేయ.

వ. వారిలో నొకర్తు.

మ. సహకారాధిపుఁ గౌఁగిలించుకొని వాసంతీలతాకాంత సా
రహరిద్రారసగౌరకేసరములన్ రంజిల్లు మాధ్వీకవా
ర్లహరిస్వేదముఁ జూఁడఁ బట్టపగ లేలా యింతటన్ సిగ్గు లే
దహహా! యంచు దొలంగి నవ్వెఁ జెలిమాటై ముద్దరా లయ్యెడన్.

మ. ఒక రామాతిలకంబు రత్నరుచితో నొప్పారు మందారకో
రకముం గర్ణవతంసత న్నిలుపుచున్ రాఁగా లతాసక్తమా
చుకచేలాంచలమై మఱుఁగి విడు మంచున్ గేలు సాఁచెన్ ససా
యకమౌర్వీం దెగఁగొన్న మన్మథుని ప్రత్యాలీఢపాదంబులన్.

చ. ఒక చపలాక్షి లేఁజిగురుటూయెలఁ గోయిలరాచవారి ని
క్కకు నెలయింపవచ్చు కలకంఠికటాక్షము తెక్కదారు ప్రసు
కక్క పలుమాఱుఁ జూపఁ జెలికత్తెలు ముద్దులబావ పొమ్మనన్
మొకము సగంబు వాఁచె మణిముద్రికలం జిఱునవ్వు గప్పుచున్.

చ. లలన లతావితానముల లత్తుకతేకులచాయ చల్లుచే
తుల నెలగొమ్మ లందికొనిఁ దోరపునవ్వులు పిక్కటిల్ల నె
చ్చెలులు చెలంగి మావిరులు చెందొవ లయ్యె ననం దడంబడన్
దలిరులఁ గోయ రాచిలుకదాఁటులుఁ దేఁటులు నాసచేయఁగన్.

సీ. సుడిగొన్నచిగురాకుజొంపంబు గెంపారఁ
దలమీఁద మల్లికాదామ మడఁచి
నిడుదతామరతూఁడు నెట్టెంబు చుట్టి పైఁ
బటికంపుఁగడియంపుభాగ మదిమి
తోన యాత్రేవఁ గెందొవతేకు హత్తించి
మెడచక్కిఁ గస్తూరి మేదిచి పూసి

పాయగొమ్మల నల్లపట్టుఁ దగిల్చి యం
క్కొనయాకుపై వెండికోర వెట్టి
ధవళకేతకధూళి గాత్రమునఁ జటిచి
మోఁకమామిడి కొకకొంత ద్రొక్కి నిలిచి
యొడలిలోఁ జక్కసగము నా కొసఁగు మనుడు
నద్రికన్యక తల వంచె హరుఁడు నవ్వె.

చ. నడకతెఱంగు మాటజతనంబు నపాంగవిలాసమున్ మొసం
గిడిన తెఱంగు ముద్దుమొగ మించుకవంచిన సిగ్గుఁ బార్వతిం
దడఁబఱుపంగ నొ ప్పెసఁగె దర్పకవైరికి నాసపాటుగా
నడరుచుఁ జిత్రరేఖ యను నచ్చర నెచ్చెలు లిచ్చ మెచ్చుఁగన్.

* * * * *

క. ఆవసథశోధనమునకు
సావాసులు వచ్చి కనిరి సౌధముపై ౦
భావితుఁడై దనుజసుతా
సేవితుఁడై యున్న మనుజసింహుఁ గుమారున్.

మ. కని యక్కోమలికిం గుమారునకు సంగం బంగజాయత్తమై
యునికిన్ బాణునితోడఁ జెప్పఁ జని వా రొండేమియున్ శంక లే
క నరుం డొక్కఁడు దేవ! నీనగరిలోఁ గన్యాజనాంతఃపురం
బున నున్నాఁడు భవత్సుతావిభుత నిష్పాందియ్యకొన్నాఁడవే.

ఉ. నావుడు రోషవహ్నిజ్వలనం బొగ రేఁగినభంగి మోమునం
గావిరి పర్వ నంగమునఁ గంపము నివ్వటిలంగ బాణుఁ డ
త్యావిలచిత్తుఁడై మనుజుఁ డట్టె మదీయపురంబు చొచ్చె న
చ్చేవయ కాక నానగరు చెర్చె నిసీ మగమాట లేటికిన్?

క. ఏ నీనఘె నాకూఁతును
మానవుఁడఘె నగరు చొచ్చి మాకులమువకున్

హాని యొనరించెఁ గన్నులఁ
గానఁడు దలయెత్త రోఁత గాదే నాకున్.

క. మనుజాంగనలం బట్టుట
దనుజులకుం జెల్లుఁగాక దనుజాంగనలన్
మనుజులు పట్టుటకును దొర
కొనిరే బెండులు మునింగి గుండులు తేలెన్.

క. అని తన కింకరసైన్యము
ననిరుద్ధునిమీఁదఁ బనిచె నదియు భయోత్పా
దనమతిఁ బట్టుఁడు కట్టుఁడు
తుమముఁ దను నెలుంగు లడరఁ దోఁతెంచె వడిన్.

క. అప్పలుకుల కలుకలు మది
నుప్పర మెగయంగ నొఁగె నుల్లాసము మై
నొప్పారఁగ బరిగోలల
నొప్పించిన భద్రగజము నూల్కొన్నగతిన్.

వ. అక్కుమారకంఠీరవుండు.

క. ఆతరుణి వలదు వల దని
భీతిం దనుఁ బట్టఁ బట్ట భీకరతరవి
ఖ్యాతరవసింహనాదుం
డై తత్సౌధంబు డిగ్గె నవుడుగఱచుచున్.

వ. ఇట్లు డిగ్గి తదంతఃపురద్వారంబున నిలిచి దారుణతరం బగు పరిఘంబు పుచ్చుకొని.

మ. తన ఘోరధ్వనికిం గలంగఁబడు తత్సైన్యంబు దైన్యంబునం
దునుకొందం బరిఘంబు పై విసరుచున్ దుర్వారుఁడై పైపయిన్
మునుఁగం బాఱు శరాసిముద్గరగదాముఖ్యాయుధశ్రేణిచేఁ
గినియం జేసిన వేసవిన్ రవి దివిం గ్రీడించుచందంబునన్.

క. మంది పదాతులఁ గొందఱఁ
జెండాడిన నున్నవారు చెదిపాఱిరి బా
ణుం డున్నయెడకు నొడళుల
నిండను నెత్తురులు గ్రమ్మ నిట్టూర్పులతోన్.

వ. అప్పు డద్దనుజేంద్రుండు.

క. వెఱవకుఁడు వెఱవకుఁడు చిం
దఱవందఱగాకుఁ డేల ధైర్యముఁ దూలన్
మఱచితిరె కులముఁ గీర్తియుఁ
బిఱుకులగతి నింతవలదు బీరము చెడఁగన్.

ఉ. పాఱెదు త్రోవ మీకు నలవాటుగఁ జేసిన శూరుఁ డెవ్వఁడో
మీఱి యనేకయుద్ధముల మీరు జయించుట లెల్ల నింతతోఁ
దీఱె ననుం గనుంగొనుఁడు ధీరతఁ దోర్బల రండు నాకునుం
బాఱుఁడు పాఱుఁ డందుఁ బరిపంథుల నాఱ్వుఁడు చాలు మీపనుల్.

వ. అని వారి నడికించియు నదలించియుఁ బొదుపుచేసి పోరికిఁ బురి
కొల్పి మఱి మహావీరులం బదివేవురఁ బదివేవురఁగా బలుతెఱంగుల
మూఁకలుచేసి ప్రమథగణంబులం గలపి పంచిన.

శా. నేలం గొందఱు మింటఁ గొందఱు గజానీకంబుఁ గీలాలము
గ్జాలంబుం బురుడింప నంచితమదోత్సాహంబు దేహంబులం
జాలం గ్రాల నిశాతహేతిలతికాసౌదామినీదామభీ
మాలంకారము బీరముం దెలుప నుద్యద్విక్రమక్రీడతోన్.

వ. వచ్చి యదల్చి నిలునిలు మని తాఁకిన.

క. ఒక్కనికిఁ బెక్కుమొనలకుఁ
దక్కక పోరగుట యరిది దానవబల మన్
క్రిక్కిఱిసిన తిమిరమునకు
స్రుక్కక యాదవకుమారసూర్యుఁడు నిలిచెన్.

వ. ఇట్లు తన చేతిపరిఘంబు కంధరంబునం జేర్చి.

గీ. పరిఘతోమరాదులఁ దన్నుఁ బరులు వైవ
వారివారికై దువులనె వారి వైచె
మఱియుఁ దనతొంటిపరిఘం బమర్చి చేత
నాసురారాతిసేనపై నడరె నపుడు.

క. ఇరువదినాలుగువేవుర
వరభటులం గింకరుల నవారణలీలన్
బరిమార్చి పేర్చి విక్రమ
ధురంధరుం డయిన విజయదోహలి మఱియున్.

క. పలుకఁయు గరవాలముఁ గొని
పొలికలనం గెలవఁ జదలఁ బొదల మెఱుంగుల్
వల నొప్పారఁ బ్రచారం
బులు ముప్పదిరెండు నిండుమొనలకుఁ జూపెన్.

పంచమాశ్వాసము.

సోముని హరివంశములోని మఱికొన్ని పద్యములు.

ఉ. రెండుబలంబులందు నరరే యరరే యవురే యనంగ నొం
డొండఁ జెలంగు సన్నుతుల నుబ్బుచు నీయదుపీరుఁ జంపుఁ బౌం
డ్రుం డనువారు సాత్యకి కఠోరభుజాప్రతిముండు పౌండ్రభూ
మండలనాథుఁ జంపు ననుమానము లే దనువారుఁ బోరిలోన్.

శా. ఓరీ దానవధూర్త! నీదువచనోద్యోగంబు లెల్లేగెరా
రారా యింకిట నేమి చేసెదవురా క్రౌర్యంబు శౌర్యంబు స
ద్వీరత్వంబును గల్గెనేని దనుజా! తెల్లంబుగాఁ జూపుమం
చా రాజీవవిలోచనుండు వచనవ్యాపారపారీణతన్.

చ. ఇతని కితండె సాటి యగు నీతని కీతఁడె సాటి వచ్చు ను
ద్ధతిఁ జనువెంట వింట నడిదంబున నింతటివారు లే రుమా

పతి కొకరుండు శిష్యుఁ డురుబాహుఁడు ద్రోణున కొక్కరుండు ధీ
రతముఁడు శిష్యుఁ డిట్లిరువురన్ రణధీరతఁ జెప్ప నేటికిన్.

చ. మఱకువ కత్తరించి మదమానములం జుఱవుచ్చి మెచ్చుఁ జా
గఱకొని క్రోధకామముల గండడఁగించి పరాపకారముం
జఱిపడఁ ద్రోచి వాచవులచట్టలు వాపి తొలంగి చిత్తముల్
జఱిఁ బడియున్న నీకు నొకచక్కటి నెక్కటి వేఁడఁ గల్గెనే!

చ. ఎఱుఁగరుగాక లోకమున కెవ్వరికైనను మేలు సేయఁగా
నొఱపగు నాశ్రమంబున పమున్నతమైన గృహస్థధర్మముం
బఱగడ వైచి గోఁచిగొని పాఱిన పొల్లకు ముక్తి కల్గునే
పఱిగల నేఱినం గొలుచు పాఁతటికిం గలదే తలంపఁగన్?

చ తిరిసిన కూడు దెచ్చి నలుదిక్కుల బోడలు తిండి పెట్టఁగాఁ
బెరిఁగిన పొట్టతోడ నొకపెఁటపయిం దొరవోలె నెవ్వరిన్
సరకుగొనండు పట్టుకొని చాఁగఱగొన్న బలే! యెఱుంగుఁ డ
క్కరిబలు మోపు మోచు నయగారితనం బఱ నుట్టి గట్టినన్.

చ. పెఱిగితిగాక నీవు నొకప్రెగ్గడవే సభ లుండుభంగి ము
న్నెఱుఁగనివాఁడవై భ్రమసి యెవ్వరిముందఱ నేమి మాటలో
యఱచితి వారిజంకెలకు నంతట ద్రోవడి వచ్చి తిచ్చటన్
గఱువఁగ వచ్చునే బలిమి గాడిదకుం బులితోలు గప్పినన్.

మ. అరిఁ జూచున్ హరిఁజూచు సూచకములై యందంద మందారకే
సరమాలామకరందబిందుసలిలస్యందంబు అందంబులై
దొరఁగం బయ్యెదకొం గొకింత దొలఁగం దోడ్తో శరాసారమున్
దరహాసామృతసారముం గురియుచుం దన్వంగి కేలీగతిన్.

చ. చొరని బిలంబులు న్వెదలఁ జూడని క్రంతలు గాలు రాపడం
దిరుగని త్రోవలు న్వెడియ దీర్పని గొందులు నాలుబిడ్డలే
కరయని రేలు చీమ చిటుకన్నను విప్పనిమూఁటలుం బయిం
జిరుగని కోకలుం గలవె చేరిన యీ సురకోటి కచుఁతా!

చ. అరదముపై నుదగ్రుఁ డగు నంగిరునిం గని నెమ్మొగంబునం
దరహసితంబు చెన్నొసఁగ దానవసూదనుఁ డల్ల నిట్లనుఁ
మరలు మునీంద్ర! నీకు వసమా యసమాయుధకేళి కేలికిం
దరమె మదీయసాయకవితానము లిప్పుడు గోలుపుచ్చవే!

చ. తరుణుల పీరముద్దియలతాఁకునఁ జిందఱవందలైన క్రొ
న్నురువులలోన శైవలము నూలుకొనంగ నితంబపంక్తిపైఁ
బొరలు తరంగరాజి విరిపువ్వులు పీడిన కుంతలంబులం
బరఁగఁ బదంబులం దెఱఁగి పైఁబడ నేడ్చు విటాలికైవడిం.

శా. ఈ రూపంబున సంస్కృతిం దొఱఁగి మీ రెంతెంత యేచింతలం
జేరం గోరక యూరకున్న నిటు విచ్ఛేయంగఁజేయం గడున్
భారంబే విను నంతయుం గలిగెనో బాలార్కబింబంబులో
నారంగూరిన యంధకారమన నాహా! సాహసం బెట్టిదో!

శా. ఓరీ! బ్రాహ్మణధూర్త! నాయెదుట నోహో! సాహసం బెట్టిదో
వైరిం గోరి నుతించు మాట లెటుగా వచ్చెం గృతఘ్నా! యిది
న్నోరే యెవ్వరి కెవ్వ రయ్యెదరు నిన్నుం బెంచి మన్నించినన్
గారామై యిటు చేసితే తొలఁగు మింకం జాలు నీకార్యముల్.

# వేములవాడ భీమకవి

* భీమకవియొక్క వాసస్థానము గోదావరిమండలములోని దాక్షారామమునకు సమీపమున నున్న వేములవాడ యను గ్రామము. ♦ ఇతని జన్మమును గుఱించి విచిత్రమైన కథ యొకటి చెప్పుచున్నారు వేములవాడ గ్రామము వందు సోమన యను నియోగిబ్రాహ్మణుఁ డొకఁ డుండెను. ఆతనిమరణానంతర మతనిభార్య నిరుపేదరాలైనను విద్యావతి యగుటచే ధనికుల యిండ్లలో పాటలును, పద్యములును చెప్పి జీవనము చేయుచుండెను. ఆమె శివరాత్రి పుణ్యకాలమునందు తనయూరిస్త్రీలతోఁ గలిసి దాక్షారామమునకు యాత్రవోయి వా రందఱును తమకు సంతానముఁ గలిగింపవలె నని భీమేశ్వరస్వామికి మ్రొక్కుకొనుచుండఁగా, తన కిఁక సంతానము గలుగఁ బోద న్నసమ్మకముతో పరిహాసార్థముగా తనకు కొడుకు పుట్టినయెడల తానును స్వామికి పుట్టెఁడు నీటితో దీపారాధనము చేయించెద నని మ్రొక్కుకొనెను. ఆమెమాటల కప్పు డచ్చట నున్న స్త్రీ లందఱును నవ్విరి. ఆమె యిల్లు చేరిన తరువాత కొంతకాలమునకు దైవ మామె కోరికను సఫలముచేసెనో యన్నట్లు వితంతువున కెట్లో విధివశముచేత గర్భము నిలిచెను. తాను భక్తితో మ్రొక్కుకొన్నందున భీమేశ్వర స్వామియే చూలు కలిగించె నని యామె యెంత చెప్పినను నమ్మక, ఆమె వా యూరివా రందఱును జాతినుండి బహిష్కరించి తమయిండ్లకు రానీ కుండిరి. ఆమె కటుపిమ్మట పురుషశిశువు కలుగఁగా మిక్కిలి ప్రేమతో బెంచుచు, ఆతనికి భీమేశ్వరస్వామిపేరు పెట్టి, తానే యాతనికి చిన్నప్పటి నుండియు విద్య చెప్పుచుండెను. ఈ భీమన తాను పిల్లవాండ్రతో నాడు

* ఇతనిచరిత్ర తిక్కనచరిత్రకు ముందు రావలసినది.

♦ [భీమకవి నివాసము నిజామురాష్ట్రములోని వేములవాడ యనియు, అచటి రాజేశ్వరుఁడే భీమేశ్వరుఁడనియు శ్రీ జయంతి రామయ్యపంతులుగా రభిప్రాయపడి యున్నారు. గోదావరిమండలములోని వేములవాడయే భీమకవి నివాసమని 'ఆంధ్ర కవితరంగిణి'లోఁ జెప్పఁబడినది.] (పు. 217)

కొనఁ బోయినప్పుడు వా రతనిని "విధవకొడుకా!" యని పిలుచుచు పరిహసించుచు రాఁగా కొంత జ్ఞానము వచ్చినవాఁ డగుటచేత మనస్సులో వేదన పొంది తల్లివలన తన జన్మవృత్తాంతమును దెలిసికొని, తత్క్షణ మా గ్రామము విడిచి పోయి దాక్షారామము చేరి భీమేశ్వరస్వామి యాలయములో లింగమును కౌఁగిలించుకొని వదలక కూరుచుండెనఁట! అంతట స్వామి కా చిన్నవానియం దనుగ్రహము వచ్చి నీ "వాడినదెల్ల నాటయు, పాడినదెల్ల పాటయు నగు"నని వరమిచ్చి పంపెనఁట! ఆ బాలుఁడు మరల స్వగ్రామమునకు వచ్చినతరువాత నొకయింట బ్రాహ్మణసమారాధనము జరుగునప్పు డచ్చటికిఁబోఁగా బ్రాహ్మణు "లీ ముండకొడుకును లోపలికి రానియ్యఁ గూడ"దని తలుపులు లోపల గడియవేసిరఁట! అంతట వడ్డన లయి లోపల భోజనము లారంభముకాఁగా, భీమన తలుపులసందునుండి చూచి "మీ పప్పులు కప్పలుగాను; మీ యన్నము సున్నముగాను" అని శపించె నఁట! ఆ శాపాక్షరములు సత్యము లయి విస్తళ్ళలోని యన్నము సున్న మయి, అప్పములు కప్ప లయి దుముకు లాడసాఁగెనఁట! అప్పుడు బ్రాహ్మణు లందఱును భయపడి యది భీమనమహత్త్వ మని తెలిసికొని తలుపు తీసి, సున్నమును కప్పలను యథాపూర్వకముగా చేసినపక్షమున వానిని పంక్తిభోజనమునకు రానిచ్చెద మని చెప్పఁగా నతఁడు 'సున్న మన్నమును, కప్ప లప్పములును కావలె' నన్న యుత్తరక్షణముననే యవి యట్లయ్యెనఁట! నాఁటినుండియు బ్రాహ్మణు లాతఁడు వరప్రసాది యని తెలిసికొని, ఆతని కుపనయనాది సంస్కారములు చేయించి బహిష్కారము దీసివేసి, అతనిని పంక్తిభోజనములకు రానిచ్చుచు గౌరవింపుచుండిరి.

భీమకవి సంస్కృతమున రచియించినట్లు చెప్పఁబడెడు జ్యోతిషగ్రంథమును దెనిఁగించిన యొకానొక కవి యించుమించుగా నీ కథనే తన గ్రంథావ తారికయం దీ క్రింది సీసమాలికలోఁ జెప్పియున్నాఁడు.

సీ. శ్రీకరంబైన ధరఁ జెలువు గాంచినయట్టి
భీమపురంబునఁ క్షేమమీఱ

భీమేశ్వరుండును బ్రియముతో భక్తుల
 కోర్కె లొసంగుచుఁ గొమరు మిగుల,
నొకనాఁడు తత్పురియువతులు కొందఱు
 భక్తి భీమేశ్వరభవనమునకుఁ
బోయి పుత్రుల వేఁడ ముగ్ధత్వమున నొక్క
 విధవ కుమారుని వేఁడఁ గోర
నాలేమముగ్ధత కపహసించుచు నల
 భీమేశ్వరుఁడు పుత్రుఁ బ్రీతి నొసఁగె
నా కొంత గర్భిణియై కాంచెఁ దనయుని
 గలియుగాదిని బ్రేమ కడలుకొనఁగఁ
బ్రభవవర్షంబున శ్రావణమాసంబు
 శుక్లపక్షంబున శోభనంబు
మీఱఁ బంచమి శుక్రవారంబునను హస్త
 యందుఁ గన్యాలగ్నమందు వెలయ,
వెలిపెట్టి రక్కాంత విధవ పుత్త్రునిఁ గాంచె
 నని నింద మెడఁగట్టి యఖిలజనులు
నంతఁ దత్తనయుండు నైదేండ్ల బాలుఁడై
 పురి బాలకులతోడఁ బొసఁగనాడ
జను లెల్ల గోళకుం డని నిందఁజేసిన
 రోషించి యాతండు దూషిత యని
రా మొత్తి తల్లిపై నేయఁబోయిన నది
 భీమేశ్వరుఁడు తండ్రి వ్రేయు మనిన
వెసఁ జని యాతని వ్రేయ నుంకించిన
 భీమేశ్వరుఁడు దయ పెద్ద గలిగి
ప్రత్యక్ష మయి, వత్స! రమ్మని తగఁ జీరి
 పశుపక్షిమృగములఁ బ్రాణికోట్లఁ
.... .. . .... .... .... .... .... .... .... ....
 .... .... .... .... .... .... .... ....

గలిగించు శక్తియుఁ గరమొప్ప జనులకు
బిడ్డల నాయువుఁ బెంపుఁదనర
సంపద లొసఁగెడి సామర్థ్యమును మఱి
కానిది యౌనని యైనదెల్లఁ
గాదని యట్టుల కావించు బలమును
మఱి నీ రాఁ గలుగునదియును దెలుపఁగఁ
బ్రావీణ్యమును నిచ్చి ప్రబలుము నీ వని
వరమిచ్చెఁ బదియాఱు వర్షములకు
నాతనికి సహాయమై సరస్వతియును
... ... .. . ... .. .. . ..... ....
నతఁ డెట్లుచెప్పిన నట్ల చేయుచునుండె
సరిలేని కీర్తిచే జగతి వెలసి

గీ. యతఁడు చెప్పిన శాస్త్రమం దధికభక్తి
కలిగి నిజమని తలఁచినఁ గల్గు శుభము;
కోర్కులెల్లను ఫలియించు గురుతరముగ
సకలజనులకుఁ దప్పదు జగతిలోన

నాఁటనుండియు నితఁడు కవిత్వము చెప్పికొనియే జీవనము చేయుచుండెను. తిట్టుకవిత్వమునం దీతఁడు ప్రసిద్ధుఁడు. అందుచేతనే యీతని నుద్దండకవి యనియు, కవిరాక్షసుఁ డనియు, జనులు వాడుకొనుచు వచ్చినట్టు కనుపట్టుచున్నది. ఇతఁడు గాక కవిరాక్షసుఁ డనెడు కవి వేఱొకఁ డున్నాఁడు.

భీమకవి తన్నుగూర్చి చెప్పుకొను కథ లనేకము లున్నవి. ఈతఁడు రాజసభలకుఁ బోయినప్పుడు, తాను దాక్షారామ భీమేశ్వరునిపుత్రుఁడ ననియే చెప్పుకొనుచు వచ్చిన ట్లీ క్రిందిపద్యము వలనఁ దెలియవచ్చుచున్నది.

మ. 'ఘనుఁడన్ వేములవాడవంశజుఁడ దాక్షారామభీమేశనం
దనుఁడన్ దివ్యవిషామృతప్రకటనానాకావ్యధుర్యుండ భీ
మన నాపేరు వినంగఁ జెప్పితిఁ దెలుంగాధీశ ! కస్తూరికా
ఘనసారాదిసుగంధవస్తువులు వేగం దెచ్చి లాలింపురా !'

ఈ పద్యమునందలి తెలుంగాధీశ యనుదానిని వెలుంగాధీ. ..యని దిద్ది దానికి విమలాదిత్యుఁ డని యర్థము చెప్పుటకంటె సాహసకార్య మొండద తెలుంగాధీశుఁ డనఁగా తెలుఁగురాయఁడు. రామవిలాసములో

క. ఆ మాచనృపతిసుతుఁడు మ
హామహుఁ డెఱపోతనక్షమాధీశ్వరుఁ డా
శ్రీమంతుసుతులు జగదభి
రాములు శ్రీతెలుఁగురాయ రామనరేంద్రుల్. *

అని గుడిమెట్టరాజగు నెఱపోతరాజుకొడుకు తెలుఁగురాయఁ డొకఁడు చెప్పఁబడి యున్నాఁడు ఈతెలుఁగురాయఁడు పదుమూఁడవ శతాబ్ది మధ్యమునం దుండినవాఁడు కవి యీ తెలుఁగురాయనిఁగూర్చియే యీ పద్యమును జెప్పినయెడల, ఇతఁడు తిక్కనకాలములోనో, తిక్కనకు గొంచె మీవలావలలనో యుండి యుండును. తిక్కన యీతనిని తన గ్రంథము లలోఁ బేర్కొనకుండుట కూడ నితఁడు తిక్కనకు పూర్వపువాఁడు కాఁడని తెలుపుచున్నది. పదుమూఁడవ శతాబ్దిమధ్యమున నున్న యీ తెలుఁగు రాయఁడు గాక కవులకు కస్తూరికాదానము చేయుటయందుఁ బ్రసిద్ధుఁ డయిన వేఱొక తెలుఁగురాయఁడు సాంపరాయని పుత్రుఁడు పదునాల్గవ శతాబ్దోత్త రార్థమున నుండెను. భీమన కస్తూరిని వేఁడినది యీ తెలుఁగురాయనినే యయి యుండును. "తెలుంగాధీశ" యన్న ప్రయోగము వ్యాకరణదుష్ట మగుటచేత నది 'కళింగాధీశ' యని యుండవలెనని యొకరు వ్రాయు చున్నారు. సంజ్ఞలయందును, బిరుదములయందును మనము వ్యాకరణ దోషములను బాటింపరాదు. కస్తూరికాదానమునకుఁ బ్రసిద్ధికెక్కినవాఁడు తెలుఁగురాయఁడు కాని కళింగాధీశుఁడు కాఁడు. ఈ తెలుఁగురాయనినే కస్తూరి వేఁడెడి యీక్రింది పద్యములో నీతనిఁగూర్చి శ్రీనాథుఁడును 'తెలుంగాధీశ' యనియే ప్రయోగించియున్నాఁడు.

(* ఇయ్యది పెద్దాపురప్రభువులు వత్సవాయివారి యాస్థానములోనుండిన ఏనుఁగు లక్ష్మణకవి విరచితము.)

శా. 'అక్షయ్యంబుగ సాంపరాయని తెలుంగాధీశ ' కస్తూరికా
భిక్షాదానము చేయురా సుకవిరాడ్బృందారకశ్రేణికిన్
దాక్షారామపురీవిహారవరగంధర్వాప్సరోభామినీ
వక్షోజద్వయకుంభికుంభములపై వాసించుఁ దద్వాసనల్.'

ఈ తెలుఁగురాయఁడు మరణము నొందుటచేతఁ గస్తూరికాదానము చేయు వారు లే రని శ్రీనాథుఁ డీ సీసపద్యపాదమున విలపించియున్నాఁడు.

"రంభఁ గూడెఁ దెలుంగురాయరాహుత్తుండు
కస్తూరి కే రాజుఁ బ్రస్తుతింతు"

విమలాదిత్యునితండ్రి యైన దాననృపాలుఁడు మూఁడు సంవత్సరములు రాజ్యము చేసిన తరువాత కళింగు లాతనిని రాజ్యపదభ్రష్టునిఁ జేసి రాజ్యమును తా మాక్రమించుకొనిరి. ఆ కాలములో భీమకవి యున్నట్టును, అప్పుడు రాజ్యపాలనము చేయుచున్న కళింగగంగును తిట్టినట్టును కొందఱు చెప్పుచున్నారు. ఈ కవి యొకనాఁడు రాజసందర్శనార్థమయి పోఁగా రాజ కళింగగంగు కార్యభారములో మునిఁగియుండి యసమయమగుటచే కోపపడి "యిప్పుడు సందడిగానున్నది. సందడి తీఱినతరువాత రమ్ము" అని కేక వేసెనఁట ! అందుమీఁద భీమన యాగ్రహపడి

ఉ. వేములవాడభీమకవి వేగమె చూచి కళింగగంగు తా
సామము మాని కోపమున సందడి దీఱిన రమ్ము పొమ్మనెన్
మోమును జూడ దోష మిఁక ముప్పదిరెండు దినంబులావలన్
జామున కర్థమం దతనిసంపద శత్రులఁ జేరుఁగావుతన్.

అను పద్యమును జెప్పెనఁట ' ఈ వాక్యము శాపమయి తగులఁగా శత్రు రాజు లాతనిరాజ్య మాక్రమించుకొని యాతనిని వెడలఁగొట్టిరఁట ! తరువాత నతఁడు శత్రుభీతిచేత మాఱువేషముతో నూరూరఁ దిరుగుచు నొకనాఁటిరాత్రి చీఁకటిలో భీమకవి యింటిముందరి పాఁతరగోతిలో కాలు జాఱి పడి, ఆఁత బ్రతుకు బ్రతికిన మహారాజున కిప్పు డొక్కకాలి దివ్వటి యైన లేకపోయెనే యని ఖేదపడెను అప్పుడు పాదప్రక్షాళణమున కయి వెలుపలికి వచ్చిన భీమకవి యా మాటలు విని 'నీ వెవ్వఁడ ?' వని

యడుగఁగా 'నేను వేములవాడభీమకవి చేసిన జోగి' నని యతఁడు ప్రత్యుత్తరము చెప్పెను. అందుమీఁద కవి కరుణించి

ఉ. 'వేయి గజంబు లుండఁ బదివేలతురంగము లుండ నాజిలో
రాయల గెల్చి సజ్జనగరంబునఁ బట్టము కట్టుకో వడిన్
రాయకళింగగంగ కవిరాజు భయంకరమూర్తి చూడఁ దాఁ
బోయిన మీనమాసమునఁ బున్నమ పోయిన షష్ఠినాఁటికిన్.'

అను పద్యమును మరలఁ జెప్పి యాశీర్వదించెను. ఈ యాశీర్వచన ప్రభావముచేత నాతఁడు భాగవతులలోఁ గలసి సజ్జనగరమునకుఁ బోయి, అక్కడి రాజు తన శత్రువు నవమానించుటకయి 'రాజకళింగగంగు వేషము వేసెదరా?' యని భాగవతుల నడుగఁగ, వారు నొప్పుకొాండని చెప్పి రాత్రి వేళ తానా వేషము వేసికొని, వేషమునిమిత్తమని తనఖడ్గమును, గుఱ్ఱమును రాజువలనఁ బడసి యశ్వారోహణము చేసి యాటనెపమున నిజముగా రాజకళింగగంగే వచ్చె నని జను లాశ్చర్యపడ రాజును సమీపించి తన చేతిఖడ్గధారతో నాతనిశిరస్సు ఖండించి తాను సింహాసన మెక్కి కూరు చుండెను. ఈ వార్తయే నిశ్చయ మయిన యెడల రాజు చాళుక్యరాజులు రాజ్య పదభ్రష్టులైన కాలపువాఁడే యైన పక్షమున, విమలాదిత్యుఁ డేడు సంవత్స రములును, విమలాదిత్యునిజ్యేష్ఠభ్రాత యైన శక్తివర్మ పండ్రెండు సంవత్సరములును మరల స్వరాజ్యమును గైకొన్నతరువాత పాలనము చేసినందున భీమకవి రాజనరేంద్రుని రాజ్యకాలారంభమునందును, తత్పూర్వ మిరువది మూడు సంవత్సరములవఱకును, ఉండిన ట్లెంచవలసి వచ్చును. అయినను, ఆ కాలమునందు కళింగదేశము నేలిన ప్రభువులలో గంగ యనుపేరు గలవాఁ డెవ్వఁడు నున్నట్లు కనఁబడఁడు. కాఁబట్టి భీమకవి నన్నయభట్టునకుఁ బూర్వుఁడు కాఁడనుట నిశ్చయము.

ఎనిమిదవ శతాబ్దారంభము మొదలుకొని పండ్రెండవ శతాబ్దారంభము వఱకును పాలకులుగా నున్న కళింగరాజులలో "గంగ" నామము గలవాఁ డొక్కఁడు మాత్రమే కనఁబడుచున్నాఁడు. అతఁడు శాలివాహనశకము ౯౯౯ వ సంవత్సరమునం దనఁగా క్రీస్తుశకము ౧౦౭౭ వ సంవత్సరమున

రాజ్యమునకు వచ్చెను. ఈతని తల్లి చోడదేశపురాజు (రాజనరేంద్రుని కొడుకగు కులోత్తుంగచోడదేవుని) కూఁతు రయినందున, ఇతఁడు చోడ గంగనియుఁ బిలువఁబడుచు నుండెను. నన్నయభట్టునకుఁ దరువాత కళింగ రాజ్య మేలిన "గంగ" నామము గలవారిలో మొదటివానికాలమునందు భీమన యుండె ననెడు పక్షమున, పయి పద్యమునం దుదాహరింపఁబడిన రాజకళింగగం గితఁడే యనవలసివచ్చును. అప్పు డీతని తండ్రిపేరు రాజరాజగుటచేత, ఆ పేరును సూచించు నిమిత్తమే కళింగగంగునకుఁ బూర్వము రాజశబ్దము చేర్పఁబడినట్లును జెప్పవలసి వచ్చును. ఈ కళింగ గంగు శాలివాహనశకము ౧౦౧౧ వ సంవత్సరమునకు సరియైన క్రీస్తు శకము ౧౦౮౯వ సంవత్సరమునందు తామరకుంరి యను గ్రామమును మాధవశర్మ యను బ్రాహ్మణు కిచ్చిన భూదాన శాసనమునం దున్నది. ఈ శాసనము విశాఖపట్టణమందలి కరగ్రాహిచేఁ బంపఁబడి చెన్నపురి చిత్రి వస్తు ప్రదర్శనశాలయందుంచబడి యున్నది. ఈ కళింగగంగున కనంత వర్మదేవుఁడని నామాంతరము గలదు. ఈశాసనములోఁ జెప్పఁబడిన వంశాను క్రమమునుబట్టి కళింగగంగుని తండ్రి రాజరాజు (ఇతఁడే కులోత్తుంగ చోడదేవుని కూఁతు రగు రాజసుందరిని వివాహ మాడినవాఁడు) రాజరాజు తండ్రి వజ్రహస్తుడు; ఇతఁడు ము ప్పదిసంవత్సరములు రాజ్యపాలనము చేసెను. వజ్రహస్తునితండ్రి కామార్ణవుఁడు; ఇతడు తన యన్నలలో నొకడు రెండు సంవత్సరములును, ఒకఁడు మూడు సంవత్సరములును ప్రభుత్వము చేసినతరువాత పందొమ్మిది సంవత్సరములు రాజ్యపాలన చేసెను. కామార్ణవుని తండ్రి వజ్రహస్తుఁడు; ఇతఁడు ముప్పదియైదు సంవత్సరములు రాజ్యమేలెను. వజ్రహస్తునితండ్రి కామార్ణవుఁడు; ఇతఁడు తన యన్నలును, అన్నకొడుకును ముప్పదియేడేండ్లు రాజ్యము చేసినతరువాత రాజయి యిరువదియైదు సంవత్సరములు ప్రజాపాలనము చేసెను. కామార్ణవునితండ్రి గుణార్ణవుఁడు; ఇతఁ డిరువదియేడు సంవత్సరములు భూమియేలెను. గుణార్ణవునితండ్రి కామార్ణవుఁడు. ఇతడన్నయైన వజ్రహస్తుఁడుగా సంవత్సరములు దేశ మేలినతరువాత ప్రభుత్వమునకు వచ్చి పందొమ్మిదేండ్లు నేల యేలెను. కామార్ణవునితండ్రి (?) రణార్ణవుఁడు;

ఇతఁ డైదు సంవత్సరములు భూపరిపాలనము చేసెను. రణార్ణవునితండ్రి కామార్ణవుఁడు; ఇతఁ డేఁబదియేండ్లు ప్రభుత్వము చేసెను. కామార్ణవుని తండ్రి దానార్ణవుఁడు, ఇతఁడు నలువది సంవత్సరములు రాజ్యము చేసెను ఇతనిరాజ్యకాలము ౭౩౦ వ సంవత్సర ప్రాంత మయినది. ఈ కాలము మొదలుకొని ౧౦౭౭ వ సంవత్సరము వఱకును కళింగరాజ్య మేలినవారిలో గం గను పేరు గలవాఁడు లేనందున, భీమకవికాలములో నుండిన కళింగగం గింతకుఁ బూర్వపువాఁడు కాఁడని నిశ్చయింపక తప్పదు. ఈతనికాలము లోనే భీమకవి యుండిన పక్షమున, అతఁడు పండ్రెండవ శతాబ్దా రంభ మున నున్నట్లు తెలియుగదా? ఈకాలము సాహిణిమారఁడు మొదలైనవారి కాలముతో సరిపోకున్నది. అందుచేత భీమకవి యీతనికాలములోనివాఁడు కాఁడనియు, తరువాత నున్న వేఱొక కళింగగంగు కాలములో నుండి యుండుననియు, ఎంచవలసి యున్నది.

ఇయ్యెడ శ్రీ జయంతి-రామయ్య పంతులుగారు. ఆంధ్ర సాహిత్య పరిషత్తువారు ప్రకటించిన కవిజనాశ్రయ పీఠికలో క్రింది విషయమును వ్రాసియున్నారు

"....ఈ పద్యములలో 'గళింగగంగు' రాయకళింగగంగునని పేర్కొనబడిన రాజెవ్వడో నిర్ణయింపవలయును. ౧౧ వ శతాబ్దము మొదలు రమారమి యఱువది సంవత్సరములు కళింగదేశము ననంతవర్మయను నామాంతరముగల చోడకళింగగంగ దేవుడు పాలించి ట్లు శాసనముల వలన దెలియుచున్నది ............ఈ కాలమునందే రాజరాజచోడగంగను రాజు వేంగిదేశమును బాలించుచుండెను. ఈతఁడు రాజరాజ నరేంద్రుని పౌత్రుఁడు. కాంచీపురము రాజధానిగా వేంగిచోళదేశముల నేకచ్ఛత్రముగా నేలిన కులోత్తుంగ చోళుని యగ్రపుత్రుండు. తండ్రి యాజ్ఞానుసారముగ వేంగి దేశమును బాలించెను ........ ప్రస్తుత విచారమునకు భీమకవి కాశ్రయుండైన రాజు వీరిరువురిలో నెవ్వఁడైన నొక్కటియే! కావి, కళింగ గంగను సంజ్ఞ యనంతవర్మ చోడగంగ దేవునికే యన్వర్థమగును .. .. భీమకవి యీతని రాజ్యకాలము పూర్వభాగములో నుండెననిన, ౧౦౨౪ శకా

బ్దమున పట్టాభిషిక్తుడైన రాజరాజునాస్థానకవియగు నన్నయభట్టు నకు రమారమి ౧౦౦ సంవత్సరముల తరువాతివాడగును. భీమకవి యనంతవర్మ రాజ్యావసానదశయం దుండెననుకొన్నచో మఱి ముప్పది, నలువది సంవత్స రముల తరువాతి వాడగును. కాని శ్రీరామమూర్తిగా రనుకొన్నట్లు నన్నయభట్టుకంటె ప్రాచీనుడుకాడు. వీరేశలింగము పంతులుగా రెంచినట్లు ౧౪-వ శతాబ్దము వాఁడగును.''

పయియంశములను బట్టి శ్రీరామయ్యపంతులుగారు రాయ కళింగగంగును రాజరాజ చోడ గంగును విభిన్న వ్యక్తులని తలంచినట్లును, ఇరువురు నభిన్నులని శ్రీ వీరేశలింగము పంతులుగారు తలంచినట్లును తెలియుచున్నది. మఱియు రాజరాజ చోడగంగు రాజరాజ నరేంద్రుని దౌహిత్రుడని శ్రీ వీరేశలింగము పంతులుగారు తలంచినట్లు తెలియుచున్నది.

సీ. వచియింతు వేములవాడభీమనభంగి
నుద్దండలీల నొక్కొక్కమాటు
భాషింతు నన్నయభట్టుమార్గంబున
నుభయవాక్ప్రౌఢి నొక్కొక్కమాటు
వాక్రుత్తు తిక్కయజ్వప్రకారము రసా
భ్యుచితబంధముగ నొక్కొక్కమాటు
పరిఢవింతు ప్రబంధపరమేశ్వరుని రేవ
సూక్తివైచిత్రి నొక్కొక్కమాటు

నైషధాదిమహాప్రబంధములు పెక్కు
చెప్పినాఁడవు మాకు నాశ్రితుఁడ వనఘ
యిపుడు చెప్పఁదొడంగిన యీప్రబంధ
మంకితముసేయు వీరభద్రయ్యపేర.

అను పద్యములో* శ్రీనాథుఁడు చెప్పిన కవులవరుసనుబట్టి భీమకవి నన్నయ భట్టారకునికి పూర్వుఁడేమో యని భ్రమ కలుగుచున్నది. కాని యీకవి

* ఇట్లభిప్రాయ పడినవారు శ్రీ గురుజాడ శ్రీరామమూర్తి పంతులుగారు.

పండ్రెండవ శతాబ్దమధ్యమునకు లోపల లేవ ట్లింతకంటెఁ ప్రబలము లయిన నిదర్శనములు కానవచ్చుచున్నవి. రాజనరేంద్రుని యనంతరమునఁ చోళులు వేఁగిదేశము నాక్రమించుకొన్నతరువాత పండ్రెండవ శతాబ్దమధ్యమునఁ దెనుఁగుదేశములోఁ గొంత భాగము రాజ్యము చేయుచుండిన చళుక్య వంశజుఁడగు చొక్కరాజుకాలమునందు భీమకవి యున్నట్లు కొందఱు చెప్పుచున్నారు. ఒకనాఁడు చొక్కరాజుద్యానవనములో మల్లెసాల స్తంభ ముమీఁదఁ గాలు చాఁచుకొని కూరుచుండి యచ్చట నున్న భీమకవినిజూచి

శా. 'ఆనీతాభ్యుపదానశృంఖలపదాభ్యాల-బిత స్తంభమా!
నేనే వేములవాడభీమకవినేనిం జిత్రకూటంబు లో
ఘానవ్యాపితపల్లవోద్భవమహాపుష్పప్రగుచ్ఛంబులన్
నానాపక్వఫలప్రదాయి వగుమా నాకల్పవృక్షాకృతిన్.'

అంతట నా పందిరిగుంజ కొమ్మలతోను పత్రములతోను చిగుళ్ళతోను పుష్పములతోను ఫలములతోను పూర్వ మరణ్యములో నున్నట్లు మహా వృక్షమై యా రాజుకాలు దానిలోపల చిక్కుపడిపోయెనఁట! అక్కడ నున్నవా రందరు నా కవిశక్తి కత్యాశ్చర్యమగ్నమానసులయిరఁట! అప్పుడు రాజు తనకాలూడఁదీసికొనలేక మరల నావృక్షమును పందిరికంబమునుగాఁ జేయవలయునని భీమకవిని ప్రార్థింపగా నతఁడు

'ఉ. శంభువర ప్రసాదకవిసంఘవరేణ్యుఁడ నైన నావచో
గుంభన చేయ నెంతో యనుకూలత నొంది తనూనభావనన్
గుంభినిఁ జొక్కనామనృపకుంజరుపందిటిమల్లెసాలకున్
స్తంభమురీతి నీతనువుఁ దాలిచి యెప్పటియట్ల యుండుమా.'

అను పద్యమును జెప్పి, వృక్షమును మరల యథాపూర్వకముగా పందిరి స్తంభమునుగా మార్చివేసెనఁట! భాస్కరరామాయణమును కృతినందిన సాహిణిమారఁ డీతనికాలములోనివాఁ డగుటచే భీమకవి పండ్రెండవ శతాబ్దాంతమునను మధ్యమునను జీవించి యుండలేదనియు చొక్క నృపాలుఁడు పండ్రెండవ శతాబ్దమధ్యమునఁగాని యంతమునఁగాని యుండినవాఁడు కాఁడనియు, స్థాపించుచున్నది. అప్పకవీయమునం దుదాహరింపబడిన యీ

క్రింది భీమకవి చాటుధారాపద్యమువలన మారఁడు చొక్కనృపాలుని కాలములోనివాఁ డగుట తేటపడుచున్నది:

ఉ॥ చక్కఁదనంబుదీవి యగు సాహిణిమారఁడు మారుకై వడిన్
బొక్కిబడంగలండు చలము న్బలముంగల యా చళుక్యపుం
జొక్కనృపాలుఁ డుగ్రుఁడయి చూక్కల మంటలురాలఁజూచినన్
మిక్కిలి రాజశేఖరునిమీఁదికి వచ్చిన రిత్తవోవునే

ఈ సాహిణిమారఁడును, హుంకక్కిభాస్కరుఁడును గణపతిదేవునిమనుమఁడైన ప్రతాపరుద్రునికాలములో నుండినట్లు సోమదేవరాజీయమునఁ జెప్పఁబడియున్నది. ప్రతాపరుద్రునికాలములో నున్న సాహిణిమారఁడు పదుమూడవ శతాబ్దాంతమునను పదునాల్గవ శతాబ్దాదియందును నుండవలసియున్నందున, చొక్కనృపాలుఁడును, భీమకవియుఁ గూడఁ పదునాల్గవ శతాబ్దాదియం దుండినవారని నిశ్చయింపవలసియున్నది. చొక్కనృపాల, సాహిణిమారుల విషయమున 'ఆంధ్రకవితరంగిణి'లో క్రింది రీతిని గలదు. "(ఈ చక్కదనంబు రీవి) యగు పద్యము వేములవాడ భీమకవి రచించెనని యనుట కప్పకవి వ్రాఁత తప్ప మఱియొక యాధారము లేదు. ఇది భీమకవికృతమని మనము నమ్మితిమేని - భీమకవికాలములోనే యిరువురు చొక్కనృపాలురుండుట యసంభవము కావున, ని పద్యములో జెప్పబడిన చొక్కనృపాలుఁడును పై పద్యములకు (అనీతాభ్యుపదాన-శంభువరప్రసాద అను వానికి) సంబంధించిన చొక్కనృపాలుఁడును, ఒక్కఁడే యనుటకు సంశయింపనక్కరలేదు, .... .......... ... పశ్చిమ చాళుక్యులలోఁగాని, తూర్పు చాళుక్యులలోఁగాని నేనెఱిగి యున్నంతవరకు చొక్కనృపాల నామధారు లెవ్వరునులేరు. కాని నెల్లూరు మండలములోని గూడూరు తాలూకాలో రెడ్డిపాలెమునకు 'శివారు' గా నున్న పాండురంగము నందలి పాండురంగాలయములో నున్న శాసనములలో నొకదానియందు 'చొక్కనాయనారని', నామాంతరముగల కులోత్తుంగ చోళుని పేరితో నొక శాసనమున్నది. (నె శా. సం. ౪౪౬ వ పుట సంఖ్య ౯౬) ఈ శాసనము పూర్తిగాఁ బ్రకటింపబడక పోవుటచే నీ కులోత్తుంగ చోళుఁడెవ్వఁడో,

పూర్తిగాఁ బ్రకటింపఁబడకపోవుటచే నీకులోత్తుంగ చోళుఁడెవ్వఁడో, ఈతనికాలమెద్దియో తెలిసికొనుట కవకాశము లేకపోయినది. కులోత్తుంగ చోళులు ముప్వురున్నారు. మొదటి యాతడు శా. శ. ౯౯౧-౧౦౩౪ మధ్యను, రెండవయాతఁడు ౧౦౫౪-౧౦౬౮ నడుమను, మూడవవాడు ౧౧౦౦-౧౧౪౦ మధ్యను రాజ్యము చేసినవారు. చొక్కనృపాలకు నకు వైరియని పైపద్యములోఁజెప్పఁబడిన సాహిణి మారఁడు ప్రతాపరుద్రుని సేనాధిపతి యని చెప్పఁబడినట్టి సాహిణి మారఁడని యెంచితిమేని యాతఁడు పైని చెప్పిన ముప్వురుకులోత్తుంగ రాజుల కాలములోను లేక వారిలో మూఁడవయాతనికిఁ బిమ్మట దాదాపు ఎనుబది సంవత్సరములలో నున్నవాడు, కావున యీ పద్య మర్థము లేని దగు చున్నది. (చూ. ఆంధ్రకవి తరంగిణి, భా. ౧, పుటలు, 244-245)

ఇంతేగాక నన్నయభట్టారకునిచరిత్రములో జూపినట్లు భీమకవి తన కవి జనాశ్రియఛందస్సులోఁ గావ్యాలంకారచూడామణిలోని పద్యము నుదాహరిం చుట భీమకవి తప్పక పదునాల్గవశతాబ్దాదియం దున్నవాఁ డన్న యీ సిద్ధాంత మును స్థాపించుచున్నది. భీమన దేశసంచారము వెడలినప్పుడు తనగుఱ్ఱము గుడిమెట్టలోని పోతరాజు పొలములోఁ బడఁగా రాజు దానిని కట్టిపెట్టించి విడువకున్నమీఁదట భీమన యాతనిని తిట్టిన పద్యమని యొకటి చదువు దురు. ఆ పద్యము రెల్కూరి తిరుమలయ్య చెప్పినట్లు ప్రకవి చెప్పుచున్నాఁడు కాని యీ ప్రాంతములయం దది భీమకవికథగానే చిరకాలమునుండి పరంపరగా వచ్చుచున్నది. గుడిమెట్ట పాలించినది చాగి (సాగి) పోత రాజుగాని శ్రీపతిరాజు పోతరాజు కాఁడు. ఈపోతరాజు పెద్దాపురసంస్థానాధి పతు లగు వత్సవాయవారికి మూలపురుషుఁడు. గుడిమెట్ట యను గ్రామము కృష్ణామండలములోని నందిగామకు నైఋతిమూలను నాలుగు క్రోశముల దూరమున నున్నది. ఇది పూర్వము చోళవంశపురాజులలో నొక తెగవారికి రాజధానిగా నుండెను, ఆ కాలమునందు గుడిమెట్టకు రాజుగా నుండిన త్యాగిపోతరాజు బ్రాహ్మణులకును, దేవాలయములకును బహుమాన్యము లిచ్చెను. త్యాగిపోతరాజు శాలివాహనశకము ౧౧౨౨ అనఁగా హూణ

శకము ౧౧౯౯ వ సంవత్సరమున (విజయవాడ) బెజవాడలోని మల్లేశ్వరస్వామికి భూమి యిచ్చినట్టు కనకదుర్గగుడి స్తంభములలో నొకదాని మీఁద వ్రాయఁబడియున్నది. ఈ కాలమునం దీయనపేరు గల శిలాశాసనము లనేకములు కానవచ్చుచున్నవి. అందు ౧౨౧౨ సంవత్సరములో నొకటి యనుమంచిపల్లెలోను, ఇంకొకటి నడికూడిలోను, ౧౨౧౩లో నొకటి బెజవాడలోను, మఱి యొకటి గుడిమెట్టలోను, ౧౨౩౦ లోమూడు నవాబుపేటలోను, బహుశాసనము లున్నవి. గుడిమెట్టలోని యొకదానిలో పోతరాజు రాజేంద్రచోడుని కొడుకైనట్టున్నది. పోతరాజు త్యాగశీలుఁడని విని భీమకవి యక్కడికి పోయినప్పుడు రా జాతనిగుఱ్ఱమును కట్టిపెట్టించి విడువకపోగా.

చ. హయ మది సీత పోతవసుధాధిపుఁ డారయ రావణుండు ని
శ్చయముగ నేను రాఘవుఁడ 1 సహ్యజ వారిధి మారుఁ డంజనా
ప్రియతనయుండు 2 లచ్చన విభీషణుఁ డా గుడిమెట్ట లంక నా
జయమునుఁ బోతరక్కసునిచావును నేడవనాఁడు చూడుఁడీ

అను పద్యమును జెప్పి రాజును శిక్షించె నని పెద్దలు చెప్పెదరు. ఈ పోతరాజు పదుమూడవ శతాబ్దాదియం దుండినవాఁ డగుటచేత పదునాల్గవ శతాబ్దాదియం దుండిన భీమకవి యీతనికాలమునం దుండి యీ పద్యమును జెప్పుట సంభవింపనేరదు. గుడిమెట్ట నేలినది, శ్రీపతిరాజు పోతరాజు గాక సాగి పోతరాజే యయినను, అప్పకవి చెప్పిన ట్లీ పద్యము రెల్లూరి తిరుమలయ్య చేసినదే యయి యుండవచ్చును మఱియొక పోతరాజువిషయమయి తురగా రామకవి చెప్పిన పద్యమును, కథయును గూడ నీ ప్రాంతముల యందు వాడుకొనుచున్నారు తురగారామకవి యాచనార్థము లేటవరపు పోతరాజునింటికి పోఁగా నతఁడు కవి కేమయిన నియ్యవలసివచ్చు నని యింటనుండియు భార్యచేతఁ దన భర్త యింట లేఁ డనిపించెను. ఆ జాడ కవి కనిపెట్టి యాతనిభార్యను జూచి కోపముతో

1. జాహ్నవి పాఠాంతరము 2. సింగన పాఠాంతరము,

క. కూటికిఁ గాకులు కూసెడు
నేటావల మూఁక గూడియేడువఁదొడఁగెళా
గాటికిఁగట్టెలు చేరెను
లేటవరపుపోతరాజు లేఁడా లేఁడా ?

అని రెట్టించి యడిగి తనదారిని బోయెనఁట! భార్య యీ సంగతి మగనితోఁ జెప్పవలెనని లోపలికిఁ బోఁగా భర్త మంచముమీఁద చచ్చిపడి యుండెనఁట! అంతట బంధువు లందఱును దుఃఖించి దహన సంస్కారమునిమిత్తమయి శవమును శ్మశానమునకుఁ దీసికొనిపోవుచుండఁగా వెంట నున్న యాతనిభార్య తనకెదురయిన కవికాళ్ళమీఁదఁ బడి తనకు పతిభిక్ష పెట్టుమని వేఁడుకోఁగా నతఁడు

క. నాఁటి రఘురాము తమ్ముఁడు
పాటిగ సంజీవిచేత బ్రతికినరీతిణా
గాటికిఁ బో నీ కేటికి
లేటవరపు పోతరాజ లెమ్మా రమ్మా!

అని చెప్పి యాతనిని బ్రతికించెనఁట! తురగా రామకవియు నించుమించుగా భీమకవివంటివాఁడే.

భీమకవి పదునాల్గవ శతాబ్దాది నుండియున్నట్టు పయి నిదర్శనము లన్నిటివలనను స్పష్టమగుచున్నది. ఇప్పు డేర్పడిన యీ కవికాలమును బట్టి చూడఁగా

గీ. భారతముఁ దెనిఁగించుచుఁ దా రచించి
నట్టి రాఘవపాండవీయంబు నడఁచె,
ఛందము నడంప నీ ఫక్కి సంగ్రహించె
ననుచు భీమన యెంతయు నడఁచె దావి. [ పీఠిక-44 ప

అని యప్పకవి చెప్పిన వాక్యము నిరాధార మయినట్టు స్పష్టమగుచున్నది. కవుల కాలభేదముమాట యటుండనిచ్చినను, నన్నయభట్టు భారతమును దెలిఁగింప నారంభించుటచేతఁ దా నావఱకు రచించిన రాఘవపాండవీయ మడఁగెననియు, వాంధ్రశబ్దచింతామణిని జేయుటచేతఁ దన ఛందస్సును

నడఁగిపోవు ననియు భీమన తలఁచె ననుట యుక్తివిరహితమైన వెఱ్ఱిమాట యగుట యించుక యాలోచించినవారి కెవ్వరికిని దోఁచకపోదు. భారతరాఘవార్థములు గల ద్వ్యర్థికావ్యమం దొకయర్థము గల భారతమును రచించుటచే నెట్లు నశించును? పై పద్యమునందలి యుత్తరార్థములోని యుక్తి యీ యుక్తిని సహితము మించి యున్నది. ఛందము నడఁచుటకఁట! వ్యాకరణమును సంగ్రహించెనఁట! 'పృష్ఠతాడనా ద్దంతభంగ' యన్నట్లు వ్యాకరణము రచిఁచుటచేత ఛంద స్సెట్లు నశించును? వ్యాకరణము శబ్దలక్షణము; ఛందస్సు పద్యలక్షణము. ఆంధ్రశబ్దచింతామణివలన భీమన తన ఛందస్సెడుగంటు నని తలఁచుకొనుట కా యాంధ్రశబ్దచింతామణిలో రెండు శ్లోకములు దక్క ఛందోవిషయ మేమియు లేనేలేదు. ఆంధ్రశబ్దచింతామణిని

క. 'ఆదిని భీమకవీంద్రుఁడు
గోదావరిలోనఁ గలిపెఁ గుత్సితమున; నా
మీఁదట రాజనరేంద్ర
క్ష్మాదయితునిపట్టి దాని మహి వెలయించెన్.' [పీఠిక-51 ప

అను తన యద్భుతకల్పన కాధారముగా నుండుటకయి యీ గాధను బుద్ధిమంతుఁ డైన యప్పకవియే కల్పించి యుండును గాని యాంధ్రశబ్దచింతామణిని నన్నయ రచించియు భీమన చించియు నుండరు.

భీమన చాటుధార యని యప్పకవీయములో

చ. 'గరళపుముద్ద లోహ మవగాఢమహాశనికోట్లు సమ్మెటల్
హరునయనాగ్ని కొల్మి యురగాధిపుకోఱలు పట్టుకార్లు ది
క్కరటిశిరంబు దాయి లయకాలుఁడు కమ్మరి వైరివీరసం
హరణగుణాభిరాముఁ డగు మైలమభీమనఖడ్గసృష్టికిన్.'

అను పద్య ముదాహరింపఁబడి యున్నది. ఈ మైలమభీమన శాలివాహన శకము ౯౭౯ వ సంవత్సరమున నుండె నని యొకచోటను, శాలివాహన శకము ౯౭౯ వ సంవత్సరమునకు సరియైన క్రీస్తుశకము ౧౦౫౭ వ సంవత్సరమునం దుండెనని యొకచోటను జెప్పఁబడి, మైలమభీమనకాలములో నుండినవాఁ డయినందున భీమకవి పదునొకండవ శతాబ్దములోని వాఁ డయి

నట్టు కవిజీవితములలో వ్రాయఁబడియున్నది. * ఒకవేళ మైలము భీమన్న యందుఁ జెప్పఁబడిన కాలములోనే యుండినను పై పద్యముకలవ వేముల వాడ భీమకవి యాతనికాలమునందే యుండినవాఁ డయినట్లు నిశ్చయముగాఁ జెప్ప వలనుపడదు. మైలముభీమన సంతతివారి కోరికప్రకార మైనను భీమ కవి యీ పద్యమును జెప్పి యుండవచ్చును. ఈవఱకిం దుదాహరింపఁబడిన పద్యములే కాక స్వవాదోపబలార్థముగాఁ గవి జీవితములలో నుదాహరింపఁ బడిన యీ క్రిందిపద్యమును భీమకవి మైలముభీమన కాలమని చెప్పఁ బడెడు కాలములో నుండె ననుట నబద్ధము చేయుచున్నది

సీ. గడియలోపలఁ దాడి కడఁగి ముత్తునియఁగాఁ
దిట్టిన మేధావిభట్టుకంటె
రెండు గడెల బ్రహ్మదండిముం డ్లన్నియు
డుల్ల దిట్టిన కవిమల్లుకంటె
మూడు గడియలకు మొనసి [illegible]త్తినగండి
పగులఁ దిట్టిన కవి[illegible]నుకంటె
నరజాములోపలఁ జెఱువునీ [illegible] కంగఁ
దిట్టిన బడబాగ్నిభట్టుకంటె
నుగ్రకోపి నేను నోపుదు శపియింపఁ
గ్రమ్మఱింప శక్తి గలదు నాకు
వట్టిమ్రానఁ జిగురు పుట్టింప గిట్టింప
బిరుద వేములాడభీమకవిని.

ఇందలి "వేములాడ" యన్న ప్రయోగము మాత్రమేకాక, ఈ ప్రత్యక్షము నందు బేర్కొనఁబడిన కవులును, నీ పద్యము భీమన చెప్పినది కాదని ఘోషించుచున్నారు. ఈ పద్యములోఁ బ్రథమపాదమున మేధావిభట్టు తాళవృక్షమును ముత్తునియలుగాఁ దిట్టినట్లు చెప్పఁబడిన పద్య మిది—

క. సాళువపెదతిమ్మమహీ
పాలవరుఁడు వీఁడె వచ్చెఁ బడ[illegible] వ్రాయిగా

*కవిజీవితములు.

గేలను లే దా కొక్కటి
తాళము ముత్తునియ లగుచు ధరపైఁ బడుమా!

ఇందుఁ జెప్పఁబడిన సాళువపెద్దతిమ్మరాజు పదునేనవ శతాబ్దములోని వాఁడగుటచే భీమకవి యీతనికిఁ దరువాతివాఁ డయి యుండఁడు. ద్వితీయ పాదమున ప్రౌఢకవిమల్లన బ్రహ్మదండిముండ్లు చాలఁ దిట్టినట్లు చెప్పఁబడిన పద్య మిది

క. గుడి యన్న నృపతిఁ బొడఁగన
నడవంగాఁ గొండపల్లి నగరిపడమటన్
గుడి యెడమ మడమఁ గాడిన
చెడుముండులు బ్రహ్మదండిచెట్టున ముల్లై.

ఈ ప్రౌఢకవిమల్లన పదునేను శతాబ్దాంతమునం దుండినవాఁ డగుటచేత నీతనికిఁ దరువాత భీమకవి యుండి యుండఁడు. తృతీయపాదమందలి కవి ఖానుఁ డెవ్వఁడో తెలియ రాలేదు. చతుర్థపాదమున బడబానలభట్టు తెలుగు రాయఁడు కట్టించిన చెఱువునీ ళ్లింకఁ దిట్టినట్లు చెప్పఁబడిన పద్య మిది

క. బడబానలభట్టారకు
కుడిచేయుంగరము రవికి గొబ్బున నర్ఘ్యం
బిడు వేళ నూడి నీలో
బడియెఁ దటాకంబ నీటిఁ బాయుము వేగన్.

తెలుఁగురాయనికాలము ముందే చెప్పఁబడినందున నాతనికి దరువాతనున్న బడబానలభట్టుకాలమునకుఁ దరువాతను భీమకవి యుండియుండడు. అప్పక వీయములో నుదాహరింపఁబడిన పై పద్యముల నన్నిటిని జదివి నడుమను గొంత తన కవిత్వము పెట్టి వ్యాకరణజ్ఞానము చాలని యిటీవలి మహాకవి యెవ్వఁడో భీమకవిపేరు పెట్టి యీ పద్యము నల్లి యుండును. ఒకవేళ భీమకవి మైలముభీమనకాలములోనే యుండి నను, ఆ భీమన పదునా కండవశతాబ్దములోవాఁడు గాక, యాతని సంతతి వాడయిన మఱియొక మైలముభీమన కావచ్చును. శ్రీనాథకవికృతమయిన

శా. అక్షయ్యంబుగ సాంపరాయని తెలుంగాధీశ కస్తూరికా
భిక్షాదానము చేయురా సుకవిరాట్బృందారక శ్రేణికిన్
దాక్షారామచళుక్యభీమవరగంధర్వాప్సరోభామినీ
వక్షోజద్వయకుంభికుంభములపై వాసించుఁ దద్వాసనల్.'

అను పద్యములో నతనికాలమునం దొక తెలుఁగురాయఁ డున్నట్లు చెప్పఁ బడెను. రామవిలాసములో రామరాజపుత్రుఁ డగు మఱియొక తెనుఁగు రాయఁ డీ క్రిందిపద్యములో వర్ణింపఁబడినాఁడు

'మ. అచలాధీశ్వరధీరు రేకపలిదుర్గాధ్యక్షు విద్వేషిరా
ట్ప్రచయోద్వేలబలావలేపతిమిరప్రద్యోతనున్ విక్రమా
ర్కచరిత్రోత్తమకావ్యనాయకుని వేడ్కం బ్రస్తుతింపదగున్
సుచరిత్రాఢ్యుని వత్సవాయతెలుఁగుక్షోణీశచూడామణిన్.

ఇరువురును కస్తూరికే ప్రసిద్ధు లయినట్లు చెప్పఁబడినను, పదునాల్గవ శతాబ్దాదిని భీమకవికాలములో నుండిన తెలుంగాధీశుఁడును, పదునైదవశతాబ్దాదిని శ్రీనాథునికాలములో నూఱు సంవత్సరములకుఁ దరువాత నుండిన తెలుంగాధీశుఁడును, ఏకపురుషుఁడుగా గాక వేఱువేఱు పురుషు లయి యుండవలెను. ఈ ప్రకారముగానే మైలముభీమన లనేకులుండవచ్చును ఇది గాక కవి జీవితములోనే రణతిక్కన రణవిహతుఁడయినప్పుడు భీమకవి రణతిక్కనిభార్యను "దీర్ఘసుమంగళీభవ" యని దీవించి

'క. గుణములనిధాన మగు మన
రణతిక్కఁడు తాఁ గళేబరంబును శిరమున్
గణఁకమెయిఁ గలయ బ్రతుకును
బ్రణుతాఖిలవైరిమకుటభాసితపదుఁడై'.

అను పద్యము చెప్పి మొండెమును శిరస్సును నేకముగాఁ గూర్చి బ్రతికించె నన్నకథ ద్వాత్రింశన్మంత్రులచరిత్రమునుండి గ్రహింపఁబడి, దానినిగూర్చి *"యీ కథ కేవలకల్పితమని చెప్పుట కాధారము లేవియుఁ గానరావు" అని

* కవిజీవితములు పుట 28

వ్రాయఁబడినది. భీమకవి రణతిక్కన కాలములోనే యున్నపక్షమున, ఈ వఱకుఁ జేయఁబడిన తిక్కనకాలనిర్ణయమునుబట్టి భీమన పదుమూఁడవ శతాబ్దమధ్యమునకుఁ బూర్వపువాఁడని తేలుచునే యేర్పడును. ఆ ద్వాత్రింశన్మంత్రుల చరిత్రములోన రణతిక్కన తల్లిపేరు మైలమ్మ యనియు పెంపుడుతల్లిపేరు పోలమ్మ యనియు వ్రాయఁబడుటయే కాక "గరళపుముద్ద" అను పద్యము భీమకవి తిక్కనఖడ్గమును బ్రశంసించుచుఁ జెప్పినట్లీ విధముగా దుదాహరింపఁబడినది—

చ. గరళపుముద్ద లోహ మవగాఢమహాశనికోట్లు సమ్మెటల్
హరునయనాగ్ని కొల్మి యమునాధిపుకోఱలు పట్టుకార్లు ది
క్కరటిశిరంబు దాయి లయకాలుఁడు కమ్మరి వైరివీరసం
హరణగుణాభిరాముఁడగు మైలమతిక్కనిఖడ్గసృష్టికిన్.

ఇది యెవ్వరినిగూర్చి చెప్పఁబడిన పద్యమో బుద్ధిమంతు లూహించు కొందురుగాక! భీమకవిని గూర్చి సన్నయ చెప్పినదనెడు

చ. 'మతిఁ బ్రభ నీగిఁ బేర్మి సిరి మానముపెంపున భీమునిన్ బృహ
స్పతి రవిఁ గర్ణు నర్జునుఁ బురద్విషు యోధను బోల్పఁబూన నా
మతకరిఁ దీక్ష్ణు దుష్కులు సమానుషు భిక్షు ఖలాత్ము నెంచ వా
క్పతిపు శశిన్ గొమరుసామిని మేరువు నబ్ధిఁ బోల్చెదన్.'"

అను పద్యమును మఱి యెవ్వరిచేతనో యెవ్వరినిగూర్చియో చేయఁబడినదయి యుండును.

భీమకవి రాఘవపాండవీయమును రచించెనని పెద్దలనుకొనుటయే గాని గ్రంథము పింగళి సూరన్ననాఁటికే నామమాత్రావశేష మయినది. ఇప్పుడీతఁడు చేసిన ఛందస్సుమాత్ర మొకటి వాడుకలో నున్నది. దానికి కవిజనాశ్రయమని పేరు. ఇతఁడు తన ఛందస్సును రేచన్న యను కోమటి కంకితము చేసి యున్నాఁడు. రేచన్న యేకాలపువాఁడో తెలిసినది కాదు. అయినను గవిజనాశ్రయములో దిన్నకోట పెద్దన కృత మయిన కావ్యాలంకారచూడామణిలోని పద్యము లుదాహరింపఁబడి యుండుటచేత నతఁడు పదునాల్గవ

శతాబ్దాదియం దున్నట్లెంచవలసి యున్నది. ఇతఁడు జ్యౌతిషపటలములు వ్రాసెననియు. వానియందిప్పు డున్న వారును, మున్ను చన్నవారును, ముందు పుట్టఁబోవువారును నడుగఁబోయెడు సమస్తప్రశ్నల కుత్తరములు గలవనియు కొందఱు చెప్పుదురు. కాని యవి యన్నియు జనులను మోసము చేయుటకయి వంచకులు పన్నిన తంత్రములే కాని మఱి యేవియుఁ గావు* ఈ మహాకవి యొకనాడు తన తల్లి బ్రాహ్మణులకు నేయి వడ్డించుచుండగా నేతిచెంబు మసి కడుపుమీద నంటుకొన్నప్పుడు "అమ్మా! నీకడుపు మసి యయినది" అని చెప్పుచు, కడుపు మసియయ్యెననుట కొడుకు చచ్చెనని యర్థ మగుటచేత నా మాట తగిలి యా క్షణముననే మృతుడయ్యెనని చెప్పుచున్నారు. మఱికొందఱు వెనుకఁజెప్పిన "వేయి గజంబులుండ" నను పద్యములో "దా బోయిన మీనమాసమున బున్నమ పోయిన షష్ఠినాటికిన్" అను వాక్యము తగిలి విధివశము చేత తల్లివి నీ కడుపు మసి యయ్యెననె నని చెప్పుదురు ఈయన కవిత్వశైలి తెలియుట కయి కొన్ని పద్యములిం దుదాహరింపఁబడు చున్నవి.

ఉ. నవ్యవిలాస రమ్యనలినం బని బాలముఖాబ్జసౌరభా
 భివ్యసనంబునం బరగు భృంగకులోత్తమ తద్వియోగతా
 పవ్యథ ప్రాణి నిల్వదు కృపాగుణ మేర్పడఁ బ్రాహ్మణోన హం
 తవ్యఁ యనంగ నొప్పు వచనస్థితి కుంద కెఱుంగ జేయుమా.
 చాటుధార

చ. బిసరుహగర్భు వ్రాఁతయును విష్ణుని చక్రము వజ్రి వజ్రమున్
 దెసలను రామబాణము యుధిష్ఠిరు కోపము మౌనిశాపమున్
 మసకపుఁబాముకాటును గుమారుని శక్తియు గాలువందమున్
 బశుపతికంటమంటలును బండిత వాక్యము రిత్తవోవునే — చాటుధార

ఉ. మానుగ విశ్రమాక్షరసమంచితమై స్వరమూఁదినం దదీ
 యానుగుణాక్షరంబు గొని యైనను జెప్పఁగ నొప్పు నీ క్రియన్

* భీమకవీయప్రశ్నలక్షణము "కవిజీవితము, లలో పుటలు (22-26 )నియఁబనది, ఇది భీమకవి కృతమైనట్లాధారములు లేవు.

భానుసహస్రభాసి వృషభాధిపుఁడన్నటు లర్థయుక్తమై
పూనినచో నఖండవళి పొల్పగు నాదికవి ప్రణీతమై,-
[కవిజనాశ్రయము]

ఉ. వారక వారకామినుల వర్తుల చారుకుచోపగూహముల్
కోరక కోరకోల్ల సితకుంజములం జిగురాకుపానుపుల్
చేరక చారు కేరళ కళింగ కుళింగనరేంద్రమందిర
ద్వారవిహారులై సిరుల నందక నందకపాణిఁ గొల్వరే.

అప్పకవీయమునం దుదాహరింపఁబడిన యీ కడపటి పద్యమును రంగ రాట్ఛందమునం దుదాహరింపఁబడిన మొదటి పద్యమును భీమన వగునో కావో విచారింపవలసి యున్నది. మన విరచిత శతకంధర రామాయణము లోని వని యీ క్రింది పద్యము లొకలక్షణ గ్రంథములో నుదాహరింపబడినవి –

క. భువిఁబుట్టి పేఁచమడఁచెను
దివిజారాతుల దినేశదీప్తు లడర రా
ఘవుఁడనుచు మునులు పొగడిరి
దివిని దివౌకసులు మిగుల దీవించి రొగిన్.

ఉ. కలఁగకుఁడీ నభశ్చరులు కంపముఁ జెందకుఁడెప్డుఁగిన్నరుల్
తలఁకకు డచ్చరల్ మునులు తత్తఱ మొందకుఁడేను వచ్చిమీ
యలజడు లెల్లఁబాపి మిము నందఱఁ గాచెద నంతవట్టుమీ
గలిబిలి మాని యుండుఁడని కైటభమర్దనుఁడోలిఁబల్కెనన్.

భీమన నృసింహపురాణములోని వని యీ క్రింది పద్యము లొక లక్షణ గ్రంథమునుండి రామకృష్ణకవిగారి చేతను తన్మిత్రులు ప్రభాకర శాస్త్రి గారిచేతను వరుసగా నుదాహరింపఁబడివి

ఉ వాండిమి నల్లసిద్ధిజనవల్లభుఁడోర్చిన రాజు భీతుఁడై
యాంధ్రను గానకుఁడ వృషభాంకము బెట్టికొనంగఁ జూచితో

నేండిది యేమి నీవనుచు నెచ్చెలులెల్లహసింప నంతలో
మూండవకంటితోడిదొర మూర్తి వహించిన మొక్కి రంగనన్

క. ఈ క్షితికి వచ్చి వేగమ
దాక్షారామమున వారతరుణులనృత్యం
బీక్షించి యంతకంబెను
దక్షణమున నేర్చి రంభ తగ వేర్పడగన్.

ఈ పుస్తకములను జూచి పరీక్షించిం గాని యివి యీకవి వగునో కావో యీ కవి యేకాలమువాడో నిర్ణయించుట కనుకూలపడవు. ఇందుదాహరింపంబడిన నల్లసిద్ధి పంద్రెండు పదుమూడవ శతాబ్దములలోనివాడు. ఈ నడుమ నాంధ్రసాహిత్య పరిషన్మండలివారు ప్రచురింపంబూనుకొన్న కవిజనాశ్రయము ముద్రితప్రతి యొకటి నేను జూడందటస్థించినది. దానిపీఠిక యింకను ముద్రింపంబడకపోయినను తత్పుస్తకసంపాదకు లగు జయంతి రామయ్య పంతులుగారి దయవలన నేను దానిని జదువంగలిగితిని. దానియందు వారు భీమకవికాల విషయమున నేను వ్రాసిన దానివి ఖండించి యాతని కాలము పంద్రెండవ శతాబ్దమనియు, అతడు నన్నయ భట్టారకునకు ఁ తిక్కన సోమయాజులకును నడిమి కాలములం దుండువాం డనియు, నిర్ధారణము చేయంబ్రయత్నించిరి. దానిని సావధానముగాం జదివి యాలోచించినమీందటం గూడ నా యభిప్రాయము మాఱినది కాదు. ఇప్పుడు కవిజనాశ్రయము భీమకవిరచితము కానే కాదని నాకుతోచుచున్నది. పుస్తకమునందెక్కడను భీమకవివిరచిత మని చెప్పంబడక పోవుటయేకాక

క. 'అనవద్యకావ్యలక్షణ
మొనరంగాం గవిజనాశ్రయుడు మల్లియరే
చనసుకవి కవిజనాశ్రయ
మను ఛందముం దెనుంగుబాస నరుదుగం జెప్పెన్.'

అను పద్యమునందు మల్లియరేచండు దానిని రచియించినట్టు స్పష్టముగాం జెప్పంబడి యున్నది. 'భీమకవివిరచిత మని యూహించుటకుంగల యాధారములు ప్రక్షిప్తము లని రామయ్యపంతులుగారు విడిచిపెట్టినవియు, గొన్ని

వ్రాతప్రతులలోఁ బయి పద్యమునకుఁ బూర్వమునం దుండిననియు నైన వీక్రిందిపద్యములు

'క. పరఁగిన విమలయశోభా
సురనిరతుఁడు భీమనాగ్రసుతుఁ డఖిలకళా
పరిణతుఁ డయ్యెను భూసుర
వరుఁడు ప్రసాదోదితధ్రువశ్రీయుతుఁడై.

క. అసమానదానరవితన
యసమానోన్నతుఁడు యాచకాభరణుఁడు ప్రా
ణసమానమిత్రుఁ డీ కృతి
కి సహాయుఁడుగా నుదాత్తకీర్తిప్రీతిన్'.

ఈ పద్యములయందైనను గ్రంథమును భీమన చేసినట్టు చెప్పఁబడలేదు. మన యను భూసురుని యగ్రపుత్రుఁ డెవ్వఁడో గ్రంథరచనయందు శ్రావకాభరణాంకుఁడైన రేచనకు సహాయుఁ డయినట్టున్నది. మన కొడు కయిన బ్రాహ్మణుఁ డెవ్వఁడో కవిజనాశ్రయమును తాను జేసి ధనస్వీకారము చేసి మహాధనికుఁడైన జైనకోమటి రేచన్న చేసిన ట్టయి నను జెప్పియుండును. లేదా, పయి పద్యములయం దున్నట్టుగా గ్రంధ రచమునందు మల్లియ రేచన్నకు తోడుపడి యయిన నుండవలెను. వేఱొకచోట నేను భీమనాగ్రసుతు డనగా భీమనయే యని సాధింపఁ జేసిన యర్థము తప్పు. భీమతనూజుఁ డని యింకొకచోటఁ బుస్తకమునందే యంత్యప్రాస మున కుదాహరణముగాఁ జెప్పఁబడిన యీ క్రిందిపద్యమునందున్నది.

క. 'జననుత మతనూజా।
సునయార్పితవిభవతేజ సుభగమనోజా।
వినుతవిశిష్టసమాజా।
యన నంత్యప్రాసమగు నహర్పతితేజా।'

ప్రక్షిప్త మని విడిచిపెట్ట బడిన యింకొక పద్యమును రామయ్యపంతులు గారు తమ పీఠికయం దీ క్రిందిదాని నుదాహరించియున్నారు

క. వేములవాడను వెలసిన
　భీమేశ్వరుకరుణ గల్గు భీమసుకవి నేఁ
　గోమటిరేచనమీఁదను
　నీ మహిఁ గవు లెన్న ఛంద మెలమి రచింతున్

ఈ పద్యము నిటీవలివా రెవ్వరో చేసి కవిజనాశ్రయమునఁ జేర్చి రనుటకు సందేహము లేదు. ఇట్లు కవిజనాశ్రయమును రేచన రచియించెనా? భీమన రచియించెనా? యని సందేహపడుచుండఁగా నీ నడుమను పులిమీఁద పుట్ర వచ్చినట్టుగా పీ రిరువురునుగారు-కవిజనాశ్రయమును రచించినవాఁడు గోకర్ణుఁడని యొక క్రొత్తసిద్ధాంతము వచ్చినది. దీనిని మొట్టమొదట బైలు దేఱఁదీసినవారు శ్రీమానవల్లి రామకృష్ణకవిగారు. ఈ కవిగా రాంధ్రరాజ కవు లను శీర్షికతో ౧౯౧౦వ సంవత్సరపు ఆంధ్రపత్రిక యుగాదిసంచికలో వ్రాసి దానిలో గోకర్ణుని గూర్చి యిట్లు చెప్పియున్నారు.

''ఇతడు (గోకర్ణుఁడు) సూర్యవంశపు క్షత్రియుఁడు ........... ప్రస్తుతము నైజామురాజ్యమున వనపర్తి సంస్థానమునకు సమీపమున శిథిలమయి యున్న వర్ధమానపురమున కధీశ్వరుండు.. ఇతనితండ్రి భీమన, గురువు వాగింద్రచూడామణిఁ 1 యను జైనసమయాచార్యుఁడు. ఇతఁడే భీమకవికిఁ గర్తృత్వ మారోపింపఁబడిన కవిజనాశ్రయ మను ఛందోగ్రంథమును రచించి జగదేకమల్లునకు సేనాపతియగు రేచభూపున కంకితము చేసెను. ఈ రేచనికిఁ గవిజనాశ్రయుఁ డనియు గోకర్ణునకు శ్రావకాభరణాంకుఁ డనియు బిరుదములు గలవు. దీనిలో నాలు గాశ్వాసములును. జైనకావ్య ధర్మముల ననుసరించి వాగ్దేవతాస్తుతితో ప్రారంభింపఁబడినవి .... ....... వేములవాడ భీమకవి రచించినది నృసింహపురాణము గాని కవిజనాశ్రయము కాదు. సంయుక్తయతిలక్షణమున, ''భాస్కరకులవిలసితవార్ధిచంద్ర గోకర్ణనృపా'' యనుటయే చాలినంత నిదర్శనము. 2

ఇప్పుడు ముద్రింపబడిన కవిజనాశ్రయమునందు సంయుక్తయతిలక్షణమున ''స్మరసన్నిభసుభగమూర్తి మల్లియరేచా'' అని యున్నది. గాని

(1) ఇతఁడు వాదీంద్ర చూడామణి కాని వాగీంద్ర చూడామణి కాఁడు.
(2) గోకర్ణుండు వ్రాసిన ఛందస్సు కవిజనాశ్రయము కాదు. అది వేఱు

భాస్కరకులవిలసితవార్ధిచంద్ర గోకర్ణినృపా" యని లేదు. పూర్ణమైన పద్యమిది

క. వరకృతులకు సంయుక్తా
క్షరములలో నెద్ది యైనఁ జను వడి యిడఁగా
గురుబుధజనవరదాయక
స్మరసన్నిభసుభగమూర్తి మల్లియరేచా.

ఇది రకారప్రాసములో నున్నది; రామకృష్ణకవిగా రుదాహరించినది లకార ప్రాసములో మన్నది. రామకృష్ణకవిగారు నూతనముగాఁ జేసిన యీ సిద్ధాంతమును చదివి ౧౯౧౭ వ సంవత్సరమునఁ బ్రకటింపఁబడిన తమ యాంధ్రులచరిత్రము ద్వితీయభాగములో చిలుకూరి వీరభద్రరావుగారు గోకర్ణునిగూర్చి యిట్లు వ్రాసిరి —

"భీమన సోదరుఁడైన గోకర్ణుఁడు వాగింద్రచూడామణి యను జైన సమయాచార్యుని శిష్యుఁడు వర్ధమానపురాధీశ్వరుఁడు. ఇతఁడు భీమకవికిఁ గర్తృత్వ మారోపింపఁబడిన కవిజనాశ్రయ మను ఛందోగ్రంథమును రచించి కల్యాణపురాధీశ్వరుండైన చాళుక్య జగదేక మల్లునకు సేనాపతి యగు రేచభూపాలున కంకితము చేసెను. ఈ రేచనికిఁ గవిజనాశ్రయుఁ డనియు గోకర్ణునకు శ్రావకాభరణాంఁ డనియు బిరుదనామములు గలవు. కవిజనాశ్రయములో నాలు గాశ్వాసములును జైనకావ్యధర్మముల ననుసరించి వాగ్దేవతాస్తుతితోఁ బ్రారంభింపఁబడినవి. వేములవాడ భీమకవి రచించినది నృసింహపురాణముగాని కవిజనాశ్రయము కాదు."

వీరిరువురును గోకర్ణుఁడు రచించిన గోకర్ణఛందస్సని వేఱొక ఛందస్సుండఁగా గోకర్ణుఁ డింకొకరి పేరు పెట్టి యింకొక ఛందస్సును రచించుట యావశ్యకము కా దనియు, రేచన్న భూపాలుఁడు గాక కోమటి యని "వణిగ్వంశచూడామణిః బంధుచింతామణిః శిష్టరక్షామణిః సుందరీవశ్యవిద్యామణిః రేచనాః కావ్యసంసూచనాః" యని కవిజనాశ్రయములోనే చెప్పఁబడిన దనియు నాలోచింపరైరి. కవిజనాశ్రయము గోకర్ణవిరచితము

కాకపోవుట నిశ్చయము. తరువాత వీరభద్రరావుగారు తమ యాంధ్రుల చరిత్రములో భీమకవినిగూర్చి యిట్లు వ్రాసిరి.

"కవిజనాశ్రయము రచించినది గోకర్ణనృపాలుఁడుగాని యితఁడు గాఁడు. భీమకవినివాసస్థలము గోదావరిమండలములో గోదావరితీరమున నున్నవేములవాడ యను పుణ్యక్షేత్రము."

ఈ వేములవాడ, వీరభద్రరావుగారు చెప్పినట్లు గోదావరీమండలములోని దైనను గావచ్చును, రామయ్యపంతులుగారు చెప్పినట్టు గోలకొండదేశము లోనిదైనను గావచ్చును గాని కవిజనాశ్రయమును రచించినది వేములవాడ భీమకవి మాత్రము కాదు. కవి నివాసమైన వేములవాడ గోదావరి మండలములోని దనియే నా నమ్మకము. గోలకొండమండలములోని వేములవాడయే దాక్షారామ మని యచ్చటి స్థలపురాణములలో నుండుట భీమకవి యచ్చటివాఁడని నిరూపించుట కయి చేయఁబడిన నూతనాద్భుత కల్పనమయి యుండును. కవిజనాశ్రయకాలమును నిర్ణయింపవలె నన్నచో గ్రంథకర్తయైన రేచన్నకాలమునో యతనిగురువైన వాగీంద్ర చూడామణికాలమునో సప్రమాణముగా నిరూపింపవలెను. అంతేకాని భీమకవి వని చెప్పఁబడెడు చాటుధారలనుబట్టియాపని సాధ్యము కాదు. ఈ చాటుపద్యములలో నొకదానినిబట్టి పండ్రెండవ శతాబ్దమును, ఇంకొక దానిని బట్టి పదుమూడవ శతాబ్దమును, వేఱొకదానినిబట్టి పదునాల్గవ శతాబ్దమును, మఱియొక దానిని బట్టిపదునాఱవ శతాబ్దమును నగుచున్నది. పరస్పర విరుద్ధకాలములను దెలిపెడి యీ చాటువులలో దేనిని నమ్మి కళింగగంగుని కాలమువాఁడనికాని, పోతరాజుకాలమువాఁ డనికాని, సాహిణి మారనికాలమువాఁ డనికాని, బడబానలభట్టారకాదుల యొక్క కాలమువాఁడని కాని, నిర్ణయింప వచ్చును? కవికాలమును నిర్ణయింపవలె నన్నచో నున్నయెడల నిర్వివాదముగా కవిదని యొప్పుకొన్న గ్రంథమును బట్టి నిశ్చయింపవలెను, ఏదోమంచి గ్రంథమును జేయక నాలుగు చాటుధారాపద్యముల నల్లినమాత్రముచేత నాతని నెవ్వరును మహాకవినిగా

భావించి స్తుతించియుండరు పదునేడవ శతాబ్దాది నుండియుఁ గవు లనేకులు తమ గ్రంథాదిని భీమకవిని పూర్వకవి స్తుతిలోఁజేర్చి యున్నారు. అందుచేత వారికి బూర్వముసం దీతఁడేదో గొప్ప గ్రంథమును జేసి యుండవలెను. పదునాల్గవ శతాబ్దాంతమువఱకును నున్న తిక్కన, యెఱ్ఱాప్రెగడ, రంగనాథుఁడు, భాస్కరుఁడు, కేతన, మారన, మంచన జక్కన, విన్నకోట పెద్దన్న, మడికిసింగన్న మొదలైనవా రెవ్వరును భీమకవిని బేర్కొనకయుండుట చేత నాతడు పదునాల్గవ శతాబ్దమునకు బూర్వపువాఁడు కాడని యూహింపఁబడగి యున్నది. ఈతనిని మొట్టమొదట బేర్కొన్నవాఁడు శ్రీనాథుఁడు. అనంతామాత్యుఁడు తన భోజరాజీయములో నీ క్రింది పద్యమున భాస్కరుని, రంగనాథుని, అమరేశ్వరుని బేర్కొనియు భీమకవి పేరు చెప్పలేదు

ఉ. నన్నయ్య భట్టుఁ దిక్కకవినాయకు భాస్కరు రంగనాథుఁ చే
రెన్నిక కెక్కినట్టి యమరేశ్వరు నెఱ్ఱన మంత్రి నాదిగా
జన్న కవీంద్రుల న్నవరసస్ఫుటవాణు లనంగ ధాత్రిలో
నున్న కవీంద్రులం దలఁతు నుల్ల మెలర్పఁగ వాగ్విభూతికిన్।

శ్రీనాథుని తరువాత ప్రౌఢకవి మల్లన్న తన రుక్మాంగదచరిత్రము నందు భీమకవి నీక్రింది పద్యమునస్తుతించియున్నాఁడు

ఉ. నన్నయభట్టుఁ దిక్కకవి నాచనసోముని భీమనార్యుఁబే
రెన్నికఁ జిమ్మపూడి యమరేశ్వరు భాస్కరు శంభుదాసునిన్
సన్నుతిచేసి వాక్యసరసత్వము వీనుల కింపుమీఱ న
త్యున్నతిగా నొనర్తు నెఱయోధులు మేలనఁ గావ్య మిమ్ములన్.

ఇందఱుకవుల పొగడ్త కర్హమయిన భీమనచే రచియింపఁబడిన యుద్గ్రంథ మేదియో నా కింత వరకుఁ దెలియరాకున్నది. నృసింహపురాణమని యొకరును, శతకంధరరామాయణ మని యొకరును, భీమకవి కృతములని చెప్పుదురు కాని యట్టి వైష్ణవ గ్రంథములను వీరశైవుడును శివపుత్రుఁడు నైన భీమకవి రచియించి యుండునని గ్రంథములను జూచి తృప్తిఁబొందు

వఱకు నునేను విశ్వసింపఁజాలను. నేను చూచినంతవఱకు భీమకవివిరచిత కృతినిగూర్చి నా కొక్క యాధారము కనఁబడుచున్నది. కృష్ణదేవరాయనికిఁ గొంచెము ముందున్నవాఁడయి ౧౫౧౦వ సంవత్సరప్రాంతమునందు బసవ పురాణమును పద్యకావ్యమునుగా రచించిన పిడుపర్తి సోమనాథకవి భీమకవి బసవపురాణమును రచియించె నని తన గ్రంథముయొక్క ప్రథమాశ్వాస ములో నీ క్రిందిపద్యమునందుఁ జెప్పియున్నాఁడు.

సీ. విరచించె జైమిని వేదపాద స్తవం
బొకపాదమునను వేదోక్తి నిలిపి
హరభక్తి వైదికం బని శ్రుతు లిడి చెప్పెఁ
బ్రతిభ సోమేశుఁ డారాధ్యచరిత
సరవి శ్రీనాథుఁ డా చరితి పద్యప్రబం
ధము చేసె ద్విపదలు తఱచు నిలిపి
యాతండు పద్యకావ్యము చేసె నైషధ
మంచితహర్ష వాక్యములఁ బెట్టి
సోమగురువాక్యములఁ బెట్టి భీమనకవి
గరిమ బసవపురాణంబు గణనఁ జేసె
గానఁ బూర్వకావ్యము వేఱుగతి రచించు
వారి కాది కావ్యోక్తు లు వచ్చి నెగడు.

ఈ కవి శ్రీనాథునికిఁ దరువాత నేఁబది యఱువది సంవత్సరములకే యున్న వాఁ డగుటచేత నాకాలపు సంగతులను చక్కఁగా నెఱిఁగినవాఁడు. పాల్కురికి సోమనారాధ్యుఁడు తెలుఁగున రచించిన ద్విపదకావ్యముల రెంటిలో పండితారాధ్యచరితము నక్కడక్కడ ద్విపద లుంచుచు శ్రీనాథుఁడు పద్యకావ్యమునుగాఁ జేసె ననియు, బసవపురాణమును భీమకవి పద్యకావ్యమునుగాఁ జేసె ననియు కవి చెప్పుచున్నాఁడు. తనకుఁ బూర్వ మునందే భీమకవి బసవపురాణమును పద్యకావ్యమునుగాఁ జేసి యుండిన

యెడలఁ దాను మరల బసవపురాణమునే పద్యకావ్యమునుగా రచింపవలసిన యావశ్యక మేమి వచ్చినది? ఏమియు రాలేదు. మహాకవియైన భీమన కంటెఁ దానెక్కువ ప్రౌఢముగాను మనోహరముగాను రచియింపఁగలు గుదు నన్న నమ్మకముచేతనా? కాదు. అందుచేత భీమకవి బసవపురాణ మును పద్యకావ్యమునుగాఁ రచించినది తెలుఁగుభాషలోఁ గా దనియు, వేఱొకభాషలో ననియు నిందువలనఁ దేలుచున్నది. కవి శ్రీనాథుఁ డారా ధ్యచరిత్రమును బద్యకావ్యముగాఁ జేసె నని చెప్పి దానిక్రిందనే సందర్భ మంతగా కనఁబడని నైషధభాషాంతరీకరణకథనము నుగ్గడించుట భీమకవిది భాషాంతర మనియు. నైషధమునందు వలెనే ప్రతిభాషాంతరీకృత గ్రంథ మునందును మూలగ్రంథవాక్యములు కొన్ని పడుట యనివార్య మనియు చూపుటకొఱకయి యున్నది. ఆ కాలమునందు భీమకవి తన భాషాంతర మునందు మూలగ్రంథవాక్యములనే కొన్నిటిని బెట్టెనని జనులు నిందిం చుటవలన నిట్లు వ్రాయవలసి వచ్చియుండును. భీమకవిది భాషాంతరమై నచో నది యే భాష? వైష్ణవమత గ్రంథములు సాధారణముగా నఱవములో నుండునట్లే శైవమతగ్రంథములు కన్నడములో నుండును గానఁ గర్ణాటక భాష యని వేఱుగఁ జెప్ప వలసిన పని లేదు. ఆ కాలమునందలి తెలుఁగు పండితుల కందఱికి సంస్కృత కర్ణాటకభాషలు సాధారణముగా వచ్చుచుం డును. అందుచేత తెనుఁగును సహితము కర్ణాటక మనుచుండుట యప్పు డప్పుడు కలదు. శ్రీనాథుఁడు భీమఖండములో నేమనెనో చూడుఁడు.

తే. 'ప్రౌఢిఁ బరికింప సంస్కృతభాష యండ్రు
పలుకునుడికారమున నాంధ్రభాష యందు
రెవ్వ రేమన్న నండ్రుగా కేలకొఱత
నాకవిత్వంబు నిజము కర్ణాటభాష *

* [తనది కర్ణాట భాషయని యనుట యితరుల నాక్షేపించుటకై మాత్రమని [illegible]నెను, తనది కర్ణాటభాష యనుటయుఁ గాదు. లేదా విననింపైనభాష' [illegible] నను దాని కర్థము చెప్పవచ్చును.]

భీమకవి పాల్కురికి సోమనాథకవికృత మైన ద్విపద తెనుఁగుబసవపురాణ మును గర్ణాటకభాషలో భామినీషట్పది పద్యములలో నెనిమిదాశ్వాసముల మహాకావ్యమునుగాఁ జేసెను. ఈకవి యారాధ్య బ్రాహ్మణుఁడనియు, బసవపురాణము భీ మకవీశ్వరరగడ యను పుస్తకములను రచించె ననియు ఈతనిని సుమారు 1385 వ సంవత్సరప్రాంతమునం దున్న పద్మణాంకుఁడు 1585 వ సంవత్సరప్రాంతమునందున్న విరూపాక్షపండితుఁడు మొదలైన వీరశైవకవులు నుతించి యుండి రనియు, కర్ణాటకకవిచరితము జెప్పు చున్నది. ఆరాధ్యబ్రాహ్మణు లాంధ్రులలో తప్ప నితరులలో లేరు. భీమకవి తాను శివకవిదేవపుత్రుఁడ ననియు, ఉభయకవిత్వసమర్థుఁడ ననియు, బసవపురాణములో నీ క్రిందిపద్యమునఁ జెప్పుకొనియున్నాఁడు.

'విమల సద్గురుసేవెయలి జం।
గమభజనెయలి లింగనిష్ఠా।
సమతెయలి తనుమనధనంగళ వి త్తభవభక్తి॥
సమయవార్ధి వివర్ధనోత్స్వజ।
హిమగు శివకవి దేవనాత్మజ।
సుమతి భీమ నుభయ కవిత్వసమర్థను సురుకడె'

భీమకవి తన బసవపురాణము శాలివాహనశకము 1291 కి సరియైన సౌమ్యసంవత్సర శ్రావణబహుళ దశమీ గురువారము ముగించితి నని పుస్తకాంతమున నీ క్రిందిపద్యములోఁ జెప్పికొనెను.

కోవిదరు కేళొళ్ళి తెన లుడు।
దేవనిధనయనేందు * సంఖెగ
శోవి శకవరుషం గళాగలు సౌమ్య వత్సరద॥
శ్రావణ బహుళపక్షదశమీ।

* ఉడుమదేవ (చంద్ర) $= 1$, నిధి $= 9$, నయన $= 2$, ఇందు $= 1$, అనఁగా "అంకానాం వామతో గతి" యను న్యాయమును బట్టి 1291.

జీవవార దొళాది వృషభేం
ద్రావతారద బసవచరితె సమాప్తి యాయిత్తు ॥

దీనిని బట్టి భీమకవి శకసంవత్సరము 1291 కి సరియైన క్రీస్తుశకము 1369వ సంవత్సరమున బసవపురాణమును రచించి ముగించెనని తెలియవచ్చుచున్నది గాన నితడు ౧౩౪౦-౫౦ వ సంవత్సరప్రాంతమున నుండి యుండి యున్నవాడని నిస్సందేహముగా సిద్ధాంతమగుచున్నది బసవపురాణమునందుఁ గవియే శివలెంక మంచన పండితుఁడును, గురుమల్లికార్జున పండితుడును ప్రసాదించిన "యుద్దండమతి" తో గ్రంథముచేసెదనని చెప్పుకొనియుండుట చేతను, ఈతనిది యుద్దండలలితధారాళకవిత్వ మని యితరులు పొగడి యుండుటచేతను,

"వచియింతు వేములవాడ భీమసభంగి
నుద్దండలీల నొక్కొక్క మాటు"

అని శ్రీనాథుఁ డీతనికవిత్వమును శ్లాఘించుట వింతకాదు. భీమకవి కవిత్వముయొక్క యుద్దండలీల కొంత తెలియుటకును, అతడు పాల్కురికి సోమనాథుని బసవపురాణము భాషాంతరీకరించె నని తేటపడుటకును, పయిపద్యము క్రిందిరెండు పద్యములను గూడ నిందుదాహరించుచున్నాను-

ప్రతిపక్ష సజ్జన
పక్ష సాక్షాదుక్షరాజస
ద్వృక్ష దక్షమఖక్షయ మభక్షితక్ష్వేడ॥
త్రక్ష గణాక్షసమక్ష కరుణా।
వీక్షణ జగద్రక్షణ గుణవి।
చక్షణ బసవసూక్ష్మలక్షయ రక్షి సెంమువను॥౧॥
ఇదుసకళ మహేశ్వరామళ।
పద పయోజ పరాగమదష

ట్పదియెనిపాల్కురికె సోమేశ్వరనకారుణ్య
ఒదవిదఖిళా ప్రపూరిత
హృదయ భీమకవి ప్రణీతా।
భ్యదయబసవపురాణకథెయొళు అష్టమాశ్వాస.

[భీమకవి కన్నడబసవపురాణమును గురించి 'ఆంధ్రకవితరంగిణి' 'లో నిట్లు వ్రాయఁబడినది 'కన్నడ బసవపురాణకర్త వేములవాడ భీమకవి యని నిస్సంశయముగాఁ జెప్పుటకు వీలు లేదని తోచుచున్నది. గ్రంథాదిని గ్రంథాంతమునను భీమకవి యని మాత్రమే చెప్పబడినది. వేములవాడ భిమకవి యని యెచ్చటను జెప్పియుండలేదు. ఈ కవి తండ్రి శివకవి దేవుఁడు. ..... ... కన్నడ బసవపురాణ కర్త తండ్రి శివదేవుఁడని చెప్పినచో, ఈ కథకుఁ గొంత సరిపోయి యుండును. మధ్యఁకవి', శబ్దము నుపయోగించి యుండుటచే నీభిమకవి తండ్రి కవిత్వముఁ జెప్పఁ గలవాఁడయి యుండినట్లుతోఁచుచున్నది.,

'పైపద్యమును (విరచించెజైమిని-అను పద్యమును) పిడుపర్తి-సోమనాథకవి, భిమకవి భాషాంతరీకరణమును సమర్థించుటకై వ్రాసినాడనుట కంటె-తన గ్రంథమునందు పాల్కురికి సోమనాథుని మూలకావ్యము నందలి వాక్యములు వచ్చిపడినను, చదువరులు తనయందు గ్రంథచౌర్యము నారోపింపకుండుటకై వ్రాసియుండెనని భావించుట సమంజస మని నాయభిప్రాయము. [పుట 224. అధస్సూచిక]

'శ్రీ వీరేశలిగము పంతులుగారు, వేములవాడ భిమకవిని, కన్నడ బసవపురాణకృతి కర్తయగు భిమకవిగా నిరూపించుట యాధారరహితమై యున్నది.' అని 'తెనుఁగుకవుల చరిత్ర' లో గలదు.

భీమకవి గ్రంథములనుగూర్చి ప్రస్తావించుచు 'తెనుగు కవుల చరిత్ర' లో 'ఈతని కృతులలో రామగోపాలచరితమను ద్వ్యర్థికావ్యము నేఁడును మఱియొక కవికృతిగా లభ్యమగు చున్నది' అని చెప్పబడినది. [పుట 288]

హరవిలాసము' భీమన కృతియైనట్లు తెల్పుచు కస్తూరి రంగకవి తన 'ఆనందరంగరాట్ఛందము' నఁనొక పద్యము నుదాహరించి యున్నాఁడు. ఈ భీమకవి వేములవాడభీమకవి యని చెప్పుటకుఁ దగిన యాధారములు లేవు.

''భీమన ఛందము' లోనివని రంగరాట్ఛందమున రెండు పద్యము లీయఁబడినవి. అవికవి జనాశ్రయములోఁ గానరాకున్నవి. ఛందస్సును రచించిన భీమన యొకఁడుండెనెమో?]

# మడికి సింగన్న

సింగన యనెడి యీ కవి నియోగిబ్రాహ్మణుఁడు; భారద్వాజగోత్రుఁడు: గుంటూరివిభుఁడును తిక్కనసోమయాజికుమారుఁడు నయిన కొమ్మనకు దౌహిత్రుని పుత్రుఁ డయిన ట్లీతఁడు రచియించిన వాసిష్ఠ రామాయాణ ములోని యీ క్రింది పద్యమువలనఁదెలియవచ్చుచున్నది.

సీ. అతడు తిక్కన సోమయాజుల పుత్రుఁడై
కొమరారు గుంటూరి కొమ్మవిభుని
పుత్రిఁజిట్టాంబిక బుధలోకకల్పక
వల్లి వివాహమై వైభవమున
భూసార మగు కోటభూమిఁ గృష్ణానది
దక్షిణతటమున ధన్యలీల
నలరు రావెల యను నగ్రహారము తన
కేకభోగంబుగా నేలుచుండి

యందుఁ గోవెల గట్టి గోవిందు నెన్న
గోపినాథు ప్రతిష్ఠయుఁ గోరిచేసి
యఖిల విభవంబులందును నతిశయిల్లె
మనుజమందారుఁ డల్లాడమంత్రి విభుఁడు.

క. ఆయ్యువతీరమణులకును
నయ్యల మంత్రీంద్రుఁడుదితుఁడై ధారుణిలో
నెయ్యెడ[illegible]నర్థార్థులు మా
యయ్యయని పొగడఁగ నెగడె నౌదార్యమునన్

సీ॥ ఆత్రేయగోత్రపవిత్ర పేరయమంత్రి
పుత్రి సింగాంబికఁ బుణ్యసాధ్వి
వెలయ వివాహమై వేఁగిదేశంబులో

నేపారు రాజసంహేంద్ర పురికి
నధిపతి తొయ్యేట యనపోతభూపాలు*
మంత్రియై రాజ్యసంపదలఁ బొదలి
యొప్పారు గౌతమియుత్తరతటంబున
మహనీయ మగు పెద్దమడికియందు
స్థిరతరారామతతులు సుక్షేత్రములును
బెక్కు లార్జించి సితకీర్తిఁ బెంపు మిగిలి
యఖిలజగదన్నదాత నా నవనిఁ బరఁగె
మధురగుణధుర్యుఁ డయ్యలమంత్రివరుఁడు.

చ. ఒనరఁగఁ దద్వధూవరు లహోబలదేవునిఁ గొల్చి తద్వరం
బున నొగి సింగనార్యుని నమోఘగుణాఢ్యు ననంతుని న్మహీ
జనసుతు నబ్బయాంకు బుధసన్నుతిపాత్రుని నారయాహ్వయున్
గని నరసింహనామములు గారవ మారఁగఁ బెట్టి రందఱన్.

క. వారలలో నగ్రజుఁడను
వారిజదళనయనచరణవారిజసేవా
సారమతి నతులవాక్య
శ్రీరచనాచతురమతిని సింగాహ్వయుఁడన్

పై పద్యములవలన నీ కవి తిక్కనసోమయాజుల మనుమరాలి మనుమఁ డగుటయే కాక గోదావరిమండలములోని పెద్దమడికినివాసుఁ డని కూడ స్పష్టమగుచున్నది. ఈ కవి తన పద్మపురాణమునకుఁ గృతినాయకునిగాఁ జేసిన కందనమంత్రి కాకతీయగణపతికాలములో నున్న గన్నయమంత్రి మనుమని మనుమఁ డౌఁట కూడ కవికాలమును నిర్ణయించుట కనుకూల పడుచున్నది. గన్నయమంత్రి పుత్రుఁడు మల్లన్న. మల్లన్నపుత్రుఁడు

* [ఈ 'అనపోత భూపాలుఁడు కొంతకాల మోరుగల్లు రాజ్యమును పాలించిన కాపయ నాయకునికిఁ చిన తండ్రి కుమారుఁడఁట గోదావరినది కుత్తరమున నున్న గోదావరి మండల ప్రదేశమును పాలించుటకై కాపయనాయకుఁడీతనిని నియమించెనఁట వీరు క్రీ.శ. ౧౩౬౦ వఱకును జీవించియున్నట్లు తెలియుచున్నదట.

గణపతి ద్వితీయపుత్రుఁడబ్బయామాత్యుఁడు. అబ్బయామాత్యుని తృతీయపుత్రుఁడు కందనమంత్రి. కందనమంత్రి తాతతాత యైన గన్నయ మంత్రి కాకతీయగణపతిదేవుని కాలములో నుండిన ట్లతనిఁగూర్చిన పద్మపురాణములోని యీ క్రింది పద్యమువలన దెలియుచున్నది.

చ. 'పరువడిఁ గాకతీయగణపక్షితినాయకునొద్ద మాన్యుఁడై
ధరణిఁ బ్రశస్తుఁడై నెగడి దానము లెల్లను జేసి భక్తిపెం
పిరవుగ గుళ్ళు గట్టి గణపేశ్వరదేవుని గోపికాధిపు
దిరమగుచున్నలక్ష్మిని బ్రతిష్ఠలు చేసెఁ బ్రభుత్వ మేర్పడన్'

కాకతీయగణపతిరాజు ౧౨౦౦ వ సంవత్సరము మొదలుకొని ౧౨౬౦వ సంవత్సరమువఱకును రాజ్యపాలనము చేసినవాఁ డగుటచేత నాతనికి మాన్యుఁడై యుండిన గన్నయ మంత్రి ౧౨౬౦వ సంవత్సరమువఱకును జీవించి యుండె నని చెప్పవచ్చును. ఈతని సంతతి వారికి తర మొకటికి నలుబదేసి సంవత్సరములు వయోవ్యత్యాసము నేర్పఱిచినచో గన్నయ మంత్రిపుత్రుఁడైన మల్లన ౧౩౦౦-వ సంవత్సరప్రాంతమునం దుండును. మల్లన కొడుకైన గణపతి ౧౩౪౦-వ సంవత్సర ప్రాంతమునం దుండును. గణపతి కుమారుఁడైన యబ్బయ ౧౩౮౦-వ సంవత్సరము ప్రాంతమునందుండును. అబ్బయామాత్యుని నందనుఁడును పద్మపురాణకృతిపతియు నైన కందనమంత్రి ౧౪౨౦వ సంవత్సరప్రాంతమునం దుండును. మడికిసింగనార్యుఁడు తాను పద్మపురాణమును ముగించిన సంవత్సర మిదియే యని పుస్తకాంతమునం దీ పద్యమునఁ జెప్పెను.

మంగళమహాశ్రీవృత్తము

ఆకరయుగానల మృగాంకశకవత్సరములై పరఁగు శార్వరిని బుణ్య
ప్రాకటిత మార్గశిరపంచమిని బొల్చు నుడుపాలసుతవాసరమునందున్
శ్రీకరముగా మడికిసింగన తెనుంగున రచించె దగ బద్మసుపురాణం
బాకమలమిత్రశశిరాంశువుగఁ గందసచివాగ్రణికి మంగళమహాశ్రీ

దీనినిబట్టి (కర=౨, యుగ=౪, అనల=౩ మృగాంక=౧) శాలివాహనశకము ౧౩౪౨వ సంవత్సరమునకు సరియైన క్రీస్తుశకము ౧౪౨౦ వ శార్వరి సంవత్సరమున మార్గశీర్ష శుద్ధపంచమీ బుధవారము నాఁడు పద్మపురాణము ముగింపఁబడె నని తెలియవచ్చుచున్నది. కృతిపతి యైన కందనామాత్యునిఁ గవి వర్ణించిన రెండు సీసపద్యముల నిం దుదాహరించుచున్నాను.

సీ. 'స్వామిభక్తుఁడు కార్యచతురుండు బహుకళా
వేది నీతిజ్ఞుఁడు విప్రహితుఁడు
సరససల్లాపుఁడు సప్తాంగరక్షణ
క్షముఁడు భావజ్ఞుఁడు సర్వసులభుఁ
డరిమంత్రభేదనపరుఁడు ధర్మాత్ముఁడు
సుందరాకారుఁడు సుజనవినుతుఁ
డురుదయాపరుఁడు నిత్యోత్సవాసక్తుండు
సద్గుణాధారుండు సౌమ్యమూర్తి
సతతగురుదేవతాపరిచారరతుఁడు
గుణసముద్రుండు కాశ్యపగోత్రజనితుఁ
డనఁగ నుతికెక్కి పెంపున నతిశయిల్లు
ముదమునఁ దృశుఁడు కందసమంత్రివరుఁడు.

సీ. ఈ ధర్మచారిత్రు నే ధాత్రిపతి యేలు
నాధాత్రిపతి యేలు నఖిలజగము
నీ కామినీకాము నే కామినులు చూచు
రా కామినులు చూడ రన్యపురుషు
వీ యర్కసుతతుల్యు నే యర్థి గొనియాడు
నా యర్థి యొరు వేఁడ నాససేయఁ
డీ మంత్రికులచంద్రు నే మంత్రి పురణించు

నా మంత్రి విముఖాత్ముఁ డఖిలమునకు
ననఁ బ్రగల్భరూపఘనదాననయమార్గ
ముల నుతింప నొప్పు మఱ్ఱిగముఖఁ
దారహారహీరధవళాంశుసమకీర్తి
కలితుఁ డౌబళార్యకందవిభుఁడు.

కృతిపతికాలము తెలిసినప్పు డాతనియేలికయైన ముప్పధరణీపాలుని కాల మిదియే యని వేఱుగఁ జెప్పవలసిన పనియే లేదు. ఈ ముప్పరాజు రామగిరిపట్టణము రాజధానిగా గోదావరికి దక్షిణమునం దున్న సబ్బినాటి రాజ్యమును పాలించినవాఁడు. ఈ కవి యెఱ్ఱాప్రెగడకు మిక్కిలి తరువాతివాఁ డయినను ప్రబంధపరమేశ్వరు నేల స్తుతింపలేదో తెలియదు. ఒక్క పద్మపురాణమునందు మాత్రమే కాక వాసిష్ఠరామాయణము నందును

గీ. 'వ్యాసవాల్మీకిశుకకాళిదాసబాణ
హర్షణాదుల నాఢ్యుల నాత్మ నిలిపి
సకలభాషారసజ్ఞుల సముల నన్న
పార్యతిక్కకవీంద్రుల నభినుతింతు॥

అని తెలుఁగుకవులలో నన్నయతిక్కనలను మాత్రమే నుతించెను. వాసిష్ఠ రామాయణము పద్మపురాణమునకుఁ దరువాతర చియింపఁ బడిన దగుటచేత నది ౧౪౨౦. తరువాతఁ జేయఁబడినది. ఈ రెండు కావ్యములకుమే నడుమ సింగన్న భాగవతదశమస్కంధమును గూడఁ దెనిగించి కందనామాత్యునకే యంకిత మొనరించెను. సింగనకృత భాగవతదశమస్కంధము నాకు లభింపలేదు. * [కందనమంత్రి రాజనీతిజ్ఞుఁడే గాక కవి యని కూడఁ దెలియుచున్నది. మడికి సింగన్నయే యితని 'తారావళి' నుండి నాలుగు పద్యములను తన 'సకలనీతిసమ్మతము' నందు ఉదాహరించి యున్నాఁడు.]

* [ఇది ద్విపద కావ్యము అముద్రితము.]

అటుతరువాత నీ కవి సకల నీతిసమ్మత మను రాజనీతి గ్రంథమును సమకూర్చెనని రామకృష్ణకవిగారు చెప్పుచున్నారు. *వీని నన్నిటిని విచారించి చూడగా మడికి సింగన్న ౧౪౩౦ వ సంవత్సరమువఱకైన జీవించియుండును. ఈ కడపటి గ్రంథము పేరుదాహరింపలేదు గాని "పద్మపురాణోత్తర ఖండంబును భాగవత దశమస్కంధంబును దెనుంగున రచియించి" యని తక్కిన రెండు కావ్యములపేరులును సింగన్న వాసిష్ఠరామాయణములో నుదాహరించెను. ఇతఁడు పద్మపురాణ దశమస్కంధములను నరాంకిత మొనర్చినను వాసిష్ఠరామాయణమునుమాత్ర మట్లుచేయక శ్రీమదహోబిల స్వామి కంకిత మొనర్చెను. వాసిష్ఠరామాయణములో నితడు మొట్టమొదటి తెలుఁగు పద్యమును వేయక యాదిమకవీశ్వరాచారానుసారముగా నీ శ్లోకమును వేసెను.

> 'శ్రీమద్దివ్యమునీంద్ర చిత్తనిలయం సీతామనోనాయకం
> వల్మీకోద్భవవాక్పయోధి శశినం స్మేరాననం చిన్మయం
> నిత్యం నీరదనీలకాయ మమలం నిర్వాణసంధాయినం
> శాంతం నిత్య మనామయం శివకరం శ్రీరామచంద్రం భజే.'

ఈ యాచారమును పూర్వకవులు కొందఱు కొన్ని పుస్తకములలో నను సరించుచు వచ్చినను నిటీవలివారు పూర్ణముగా విడిచిపెట్టినారు. గణపతిదేవుని యాస్థానమున నుండిన కృతిపతిపూర్వుఁడైన గన్నయ మంత్రికాలమునుండి తరమునకు నలువదేసి సంవత్సరముల చొప్పున వేసి కృతిపతియైన కందనమంత్రి కాలమును ౧౪౨౦ వ సంవత్సరమునకు దింపినట్లే కృతికర్తయైన సింగన యుండిన ౧౪౨౮-వ సంవత్సరము మొదలుకొని తరమునకు నలువదేసి సంవత్సరముల చొప్పునవేసి కృతికర్త వంశమును గణపతిదేవుని కాలములో నుండిన తిక్కన వఱకును పైకెక్కించుచు వచ్చినచో నించుమించుగా నదియు సరిపోవును. కవిసింగన్న ౧౪౨౦వ సంవత్సర ప్రాంతమునం దుండినచో నాతనితండ్రి యయ్యలుమంత్రి

* [ఈ గ్రంథమును శ్రీరామకృష్ణ కవిగారే ప్రకటించియున్నారు.]

౧౪౨౦-వ సంవత్సర ప్రాంతమున నుండును; ౧౩౭౦ వ సంవత్సర ప్రాంతమునం దుండిన యయ్యలుమంత్రితల్లి చిట్టాంబిక ౧౩౪౦-వ సంవత్సర ప్రాంతమం దుండును; చిట్టాంబిక తండ్రి కొమ్మన ౧౩౦౦-వ సంవత్సర ప్రాంతమం దుండును; కొమ్మన జనకుఁడు తిక్కన సోమయాజి ౧౨౬౦-వ సంవత్సర ప్రాంతములం దుండును. తండ్రియైన యయ్యలుమంత్రిని మంత్రిగాఁ గైకొన్న తౌయ్యేటి యనపోత భూపాలుఁడు ౧౨౬౦-వ సంవత్సరము మొదలుకొని ౧౩౨౭-వ సంవత్సరము వఱకును రాజ్యము చేసెనఁట! ఇవి శకసంవత్సరము లేమో! సింగకవి పద్మపురాణమునం దీక్రింది పద్యముచేత నన్నయ్యతిక్కనలను మాత్రమే స్తుతించి యున్నాఁడు-

ఉ. భారతవేదవాక్యరసభావము లజ్ఞు లెఱుంగ లేక వి
స్సారమనస్కులై తిరుగుచందముఁ జూచి తెనుంగుబాసఁ బెం
పార రచించి యందఱిఁ గృతార్థులఁ జేసిన పుణ్యమూర్తులన్
సారమతి న్భజింతు ననిశంబును నన్నయ తిక్కనార్యులన్.

ఈ కవి భాగవతదశమస్కంధమును, పద్మపురాణోత్తరభాగమును, వాసిష్ఠ రామాయణమును, తెనిఁగించెను. నన్నయాదులకవనమందువలెనే దీర్ఘ సమాసములు లేక యీతని కవిత్వము సలక్షణ మైనదిగా నున్నది.

క. ఆ పరమేశ్వరమకుట
వ్యాపితగంగా ప్రవాహవరకవితాస
ల్లాపుఁడగు మడికి సింగనఁ
జేపట్టక కీర్తి గలదె శ్రీమంతునకున్

అను పద్మపురాణములోని పద్యమువలనను,

చ. కదిసిన నోరవోవుచును గబ్బవుదొంతుల సత్పదార్థముల్
కదుకుచు నెట్టివారిఁ బొడగన్నను గుట్టని స్నేహసౌఖ్యముల్
మదికి ససహ్యమౌ శునకమార్గమునం జరియించు నోయస
త్పదకవులార! మత్కవితఁ దప్పులు పట్టక యూరకుండుఁడీ.

అను వాసిష్ఠరామాయణమునందలి పద్యము వలనను, కవి స్వాతిశయ భావము కలవాఁ డని తోఁచుచున్నది. కవిశైలి తెలియఁబఱచుట కయి కొన్ని పద్యములను వ్రాసియీతని చరిత్రను ముగించుచున్నాను.

౧ పద్మపురాణము:—

ఉ. వేణివిలోలనీలజలవేణి విశాలపవిత్రసైకత
శ్రోణి మరాళచక్రకులసుస్వరవాణి సరోరుహోల్లస
త్పాణి సభక్తి మజ్జనవిధావిశారదనాకలోకని
శ్రేణి మహాఘశాత్రవవిశిక్షణశాతకృపాణి యెల్లెడన్.

ఉ. ఆ తరుణీలలామకుఁ బ్రియంబుగవే చని కాంచెనా జగ
త్ఖ్యాతము నక్షయార్తి పరిహృతివిధానసమర్థసత్ఫల
వ్రాతము నవ్యపుష్పమకరందవిలోలుపమత్తషట్పదో
పేతము దత్తనిర్జరసమీహితజాతముఁ బారిజాతమున్.

౨. వాసిష్ఠరామాయణము

శా. ఆ రాజన్యు లుదగ్రు లుగ్రగతి నన్యోన్యప్రహారార్థులై
వీరానీకము పిచ్చలింపఁగ భుజావీర్యం బవార్యంబుగాఁ
గ్రూరాస్త్రంబుల నొండొరుం బొదివి దిక్కుల్ వ్రయ్యఁబెల్లార్చుచు
న్బోరాడంగ విదూరుఁ డీక్షితె నపుడా భూమీశుచే భూవరా!

చ. విను మునినాథ! తొల్లి పదివేవురు విష్ణుల లక్ష రుద్రులన్
వనజభవాష్టకోటుల నవారణ మ్రింగినవాఁడ నాకు నీ
యనిమిషనాయకుల్ తృణసమానులు, వారలనెన్న నేల? పెం
పున మిముబోటి విప్రులొకభోజనమాత్రమె నాకుఁ జూడఁగన్.

## అప్పనమంత్రి

భోజమహారాజు సంస్కృతమున రచించిన 'చారుచర్య' అను వైద్యగ్రంథము నీతఁడు తెనిఁగించెను. దీనిని ముక్త్యాల సంస్థానాధీశులు ప్రకటించిరి. దీనికి శ్రీవేటూరి-ప్రభాకర శాస్త్రిగారు పీఠికను వ్రాసిరి. ఈ అప్పనమంత్రి తన్నుగూర్చి గ్రంథమునఁ దెలుపుకొని యున్నాఁడు. దానినిబట్టి యీతని వృత్తాంతము తెలియవచ్చుచున్నది. ఇఁతడు నియోగి బ్రాహ్మణుఁడు; ఆపస్తంబ సూత్రుఁడు. భారద్వాజ గోత్రుఁడు; గోవిందార్యునకును, నాగమాంబకును పుత్రుఁడు; సింగనామాత్యునికి మేనల్లుఁడు.

ఇతని 'చారుచర్య' లోని పద్యమును మడికి సింగన తన 'సకలనీతి సమ్మతము' లో నుదాహరించి యున్నందున నీతఁడు పదునాల్గవ శతాబ్దిలో నుండెనని చెప్పవచ్చును చారుచర్యలో ౭౫ పద్యములు కలవు. శైలిని బట్టి యీకవి తిక్కన, బద్దెనలకు సమకాలికుఁడై యుండునని శ్రీ ప్రభాకర శాస్త్రులుగా రభిప్రాయపడిరి.

# దోనయామాత్యుఁడు

దోనయామాత్యుఁడు సస్యానందము, సర్వలోకాశ్రయమునను రెండు పద్యకావ్యములను రచించెను. ఇతనింగూర్చి శ్రీనిడుదవోలు—వేంకట రావుగారు తెలుఁగువారికి తెలియఁజేసినారు. (చూ భారతి-వ్యయ. జ్యేష్ఠ మాససంచిక.) ఇతఁడు నియోగి బ్రాహ్మణుఁడు; ఆపస్తంబ సూత్రుఁడు, శ్రీవత్స గోత్రుఁడు; మాచిరాజునకును, రుద్రాంబకును పుత్రుఁడు.

సస్యానందము నాలుగాశ్వాసముల ప్రబంధము. ఇది శ్రీశైల మల్లికార్జున స్వామి కంకితము. కర్షకుల కుపయోగించు పెక్కు విషయములిందు గలవు. దీనిని తొలుత శ్రీతడకమళ్ల-వేంకట కృష్ణారావుగారు ౧౯౫౧ లో ముద్రించిరి. అందు కవి గోనయామాత్యుఁడని తెల్పఁబడినది. కాని ఆపేరు సరికాదు. ఇతఁడు దోనయ యన్నట్లే చాల తాళపత్రప్రతులలోఁ గలదు.

కవియే తన కాలమునుగూర్చి గ్రంథమునఁ దెల్పినాఁడు. కాని కాలమునుదెల్పు నా పద్యమునఁగల పాఠభేదములనుబట్టి సస్యానంద రచనా కాలము శా. శ. ౧౨౩౮, ౧౨౮౨, ౧౨౮౮ లలో నొకటియై యుండ వలెను.

ఈతఁడు తన్ను 'ఉపేంద్రుఁడాదరింపఁగా' 'సర్వలోకాశ్రయము' ను చెప్పెనఁట! సర్వలోకాశ్రయ బిరుదము చాళుక్య ప్రభువులది ఆ గ్రంథము లభింపలేదు; కాని యందలి విషయము చాళుక్య వంశవర్ణనమై యుండవచ్చు నని యూహించుచున్నారు. దోనయామాత్యుఁడు పేర్కొనిన యుపేంద్రుడు మూఁడవ యుపేంద్రదేవుఁడు కాని, నాల్గవ యుపేంద్రదేవుఁడు కాని యయి యుండవలెను. దోనయ నాదరించిన రాజు మూఁడవ యుపేంద్రుఁడని శ్రీ వేంకట రావుగారును. నాల్గవ యుపేంద్రుఁడని 'ఆంధ్రకవితరంగిణి' కర్త శ్రీ శేషయ్యగారును తలంచుచున్నారు.

# పశుపతి నాగనాథుఁడు

శ్రీ వేటూరి - ప్రభాకర శాస్త్రిగారు కూర్చిన 'ప్రబంధరత్నావళి' లో నాగనాథుని విష్ణుపురాణమునుండి యొక పద్యముదాహరింపఁబడినది. నిజాము రాష్ట్రములోని ఓరుగల్లు సమీపమునఁగల యొకశాసనము ననుసరించి యితని తండ్రి పశుపతియనియు, ఇతఁడు క్రీ॥ శ॥ ౧౩౭౫ ప్రాంతము వాఁడనియు తెలియుచున్నది. చమత్కారచంద్రికను సంస్కృతమున వ్రాసిన విశ్వేశ్వర పండితున కీతఁడు శిష్యుడు. ఇతని విష్ణుపురాణము వెన్నెలకంటి సూరన్న రచనకంటె, ప్రాచీనము; కావున తొలియనువాద మనవలెను. ఇతఁడు సంస్కృతమున 'మదనవిలాస' మను భాణమునుకూడ రచించెనఁట. 'సింహాసనద్వాత్రింశతిక' ను రచించిన కొఱవి-గోపరాజు స్తుతించిన నాగరాజీ నాగనాథుఁడే యని విమర్శకుల యాశయము.

# భవదూరుఁడు

ఇతని పూర్తిపేరు భాస్కరభవదూర మహీపతియఁట; సంగమ వంశీయుఁడును, విజయనగర పరిపాలకుఁడు అగు మొదటి బుక్కరాయల కుమారుఁడు. ఇతఁడు పోరుమామిళ్ళ తటాకమును త్రవ్వించెనఁట; ఇతని పద్యములు కొన్ని కానవచ్చుచున్నవి గ్రంథములు కానవచ్చుట లేదు. ప్రాచీనులలోఁ గొందఱు కవులీతనిని స్తుతించి యున్నారు ఈయంశములను శ్రీనిడుదవోలు వేంకటరావుగారు తెల్పుచున్నారు.

మొదటి బుక్కరాయల కుమారులలో భాస్కరుఁడాఱవ వాఁడు; అతఁడే యీకవి యైనచో నితనికాలము క్రీ॥ శ॥ ౧౩౪౩-౧౩౮౯ నడుమ అయియుండును.

# కొఱవి సత్యనారన

ఇతఁడు నియోగి బ్రాహ్మణుఁడు; ఆపస్తంబ సూత్రుఁడు హరితస గోత్రుఁడు. అమరేశ్వరమంత్రి పౌత్రుఁడు. సింగయ, గంగమల పుత్రుఁడు. సింహాసన ద్వాత్రింశతికను రచించిన కొఱవి గోపరాజునకుఁ బితామహుఁడు. ఇతనికి 'భీమన' యను నామాంతరమున్నట్లును, ఇతఁడు రామాయణమును రచించినట్లును

క. రామాయణకృతి కృతియై
తామెఱయుచు నంధ్ర కవిపితామహుఁడనఁగా
భూమిని మించిన భీమన
నామంబునఁ బరఁగె సత్యనారన ఘనుఁడై.

అను గోపరాజు పద్యమువలనఁ దెలియుచున్నది; ఇతని ౧౪-శతాబ్ది యందుత్తరార్ధమున నుండి యుండునని 'ఆంధ్రకవి తరంగిణిలో'నున్నది. (నాల్గవ సంపుటము. పుట 152)

## శ్రీ గిరికవి

ఈతఁడు 'నవనాథ చరిత్రము'ను పద్యకావ్యముగా రచించినట్లు గౌరన రచించిన ద్విపద నవనాథ చరిత్రమువలనఁ దెలియవచ్చుచున్నది. ఆ పద్యకావ్యము కాని, యితని గ్రంథాంతర మగు శ్రీరంగమాహాత్మ్యముగాని లభింపలేదు. ఈ కవి గౌరన కంటెఁ బ్రాచీనుఁ డగుటచే క్రీ. శ. ౧౩౦౦ - ౧౪౦౦ నడుమనుండి యుండవలెను. ఇతఁడు 'శ్రీగిరీశ!' అను మకుట ముతో నొక శతకమునుగూడ రచించెనని చెప్పుదురు శ్రీరంగమాహాత్మ్యము చెన్నమల్లు శ్రీగిరన్న కృతియని సంకలన గ్రంథమును బట్టి తెలియు చున్నది

## ప్రకాశ భారతయోగి

ఇతఁ డన వేమారెడ్డి యాస్థానమున నుండి పెక్కు సంస్కృతాంధ్ర గ్రంథ ములను రచించెనఁట! అందేవియు నిపుడు లభ్యముకావు ఇతఁడు రచించిన సీసపద్యములు రెండు భీమేశ్వరాలయము (దాక్షారామము) లోని శాసన ములలో నున్నవఁట ! వానిని 'ఆంధ్ర కవితరంగిణి'కారు లిచ్చి యున్నారు (నాలుగవ సంపుటము - పుటలు 158. 159)

# మండికి - అనంతయ్య

తనకు 'అనంతయ్య' అను తమ్ముఁ డున్నట్లు మడికి సింగన తనవాసిష్ఠ రామాయణమునఁ జెప్పి యున్నాడు. ఇతఁడు సుప్రసిద్ధమై చింతలపూడి యెల్లనకవి కృతముగాఁ జెల్లుబడి యగుచున్న విష్ణుమాయా నాటకమను ప్రబంధమునకు గర్తయని "ఆంధ్ర కవి తరంగిణి" లో విపులముగా వివరింపఁబడినది (నాలుగవ సంపుటము - మడికి - అనంతయ్య చరిత్రము) విష్ణుమాయా నాటకములోని కృత్యాది లభింపక పోవుటయు వివిధ తాళ ప్రతులలోని గద్యలు విభిన్నముగ నుండుటయు. ఏతత్కర్తృత్వము విష యమున సందేహమును గల్గించుచున్నవి ఆంధ్రకవి తరంగిణి కర్త శ్రీశేషయ్యగారు — లేఖకుల ప్రమాదమువలన నియ్యది రాధామాధవ (ఎల్లనార్య) కృతిగాఁ దెలియవచ్చుచున్నది గాని, కారణాంతరములను పరిశీలించిన దీనిని మడికి - అనంతయ్య యే రచించియుండునని అభిప్రాయ పడుచున్నారు.

# జక్కయ కవి

జక్కయ్య యనెడి యీ కవి విక్రమార్క చరిత్రమును పద్యకావ్యముగా రచించెను. ఈతఁడు నియోగి బ్రాహ్మణుఁడు. ఈతని తండ్రి పేరన్న యామాత్యుఁడు, తాత పెద్దయామాత్యకవి. ఈ విక్రమార్క చరిత్రము దేవరాయని మంత్రియైన సిద్ధన్న కంకితము చేయఁబడెను. సిద్ధన్న మంత్రి కవినిగూర్చి యీ ప్రకారముగా నన్నట్లు కవి తన గ్రంథమునందుఁ జెప్పి యున్నాఁడు :

సీస మాలిక

సంస్కృత ప్రాకృత శౌరసేన్యాదుల
ఘటికలో నొక శతకంబు, జెప్పఁ
బ్రహసన ప్రకరణ భాణాది బహువిధ
రూపంబు లందు రూఢి మెఱయఁ
జక్రచతుర్భద్ర చతురశ్రీ త్ర రాధిక
క్షుద్రకావ్యములు పెక్కులు రచింప
నాంధ్ర కవిత్వంబునందుఁ బ్రబంధంబు
మేలుగాఁ బద్జ్ఞులు మెచ్చఁ జెప్ప
నిర్మల నే రీతి నే ధాతువుల నేమి
రసమున నైన వర్ణనము చేయ
సరి నేక సంధాద్విసంధాత్రిసంధలఁ
దొడరినఁ బొరిఁబొరిఁ గడమఁ జదువ
నెవ్వఁ డే యవధాన మెఱుఁగు నయ్యవధాన
మున వాని కించుక ముల్లు చూప
వృత్తకందముఁ గందవృత్తంబునుం జతు

ష్కందంబు మొదలుగాఁ గలుగు గర్భ
కావ్యవర్గముఁ జెప్పఁగాఁ బ్రబంధంబు ల
క్రొత్తలు పుట్టించుకొని లిఖింపఁ
గా నక్షరచ్యుతకంబు మాత్రాచ్యుత
కంబు బంధచ్యుతకంబు నామ
గోప్యంబులుం గ్రియాగోప్యంబులును భావ
గోప్యంబులును జెప్ప గోష్ఠియందుఁ
బద్యంబు గీతికార్చటి నొగిఁ జదువఁగ
నెల్ల విద్యలనందు లెఱుఁగ నేర్తు
వనుచు నెల్లూరి తిరుకాళ మనుజవిభుఁ
సమ్ముఖమ్మున సాహిత్యసరణి మెఱసి
మహిమఁ గాంచిన పెద్దయామాత్యసుకవి
మనుమఁడవు నీవు నీవంశమహిమ యొప్పు.

క. ఆడఁడు మయూరరేఖను
గాడంబాఱండు గాణగతి మన మెరియఁగా
బ్రోడగు పెద్దయ యన్నయ
మాడకు మాదెత్త యతని మాటలు జగతిన్.

క. అని మీ తండ్రి మహత్త్వము
జన వినుతరస ప్రసంగ సంగత కవితా
ఘనతేజులు కవిరాజులు
గొనియాడుదు రఖిలరాజకుంజరసభలన్.

క. చక్కన నీ వైదుష్యము
చక్కన నీ కావ్యరచనచాతుర్యంబుస్
జక్కన నీ వాగ్వైఖరి
చక్కన నీ యాళువమహిమ జక్కనసుకవీ!

విక్రమార్క చరిత్రమును గృతినందిన సిద్ధన్న జన్నమంత్రి పుత్రుడయి నట్టును, జన్నమంత్రి మంత్రిభాస్కరుని తమ్ముఁడయినట్టును; కృతిపతి యొక్క వంశాభి వర్ణనమునందుఁ జెప్పబడి యున్నది. ఈ వంశాభి వర్ణనములోనే సూరనసోమయాజి రాజేంద్రచోడునిచే నెద్దనపూడి గ్రామము నగ్రహారముగాఁ బడసినట్టును, సిద్దనమంత్రి యాతని మనుమఁడైనట్టును ఈ క్రిందిపద్యములలోఁ జెప్పఁ బడినది....

సీ. వేదశాస్త్ర పురాణ విజ్ఞానసరణిమై
నధిగత పరమార్థుఁడై తనర్చె
నెద్దనపూడి రాజేంద్ర చోడక్షమా
రమణుచే నగ్రహారముగఁ బడసెఁ
గనకదండాందోళి కాచ్ఛత్ర చామర
ప్రముఖ సామ్రాజ్య చిహ్నముల నొప్పె
సర్వతోముఖముఖ్య సవనక్రియాప్రౌఢి
నుభయ వంశంబుల నుద్ధరించె
నన్నదానాది దానవిద్యా ఘనుండు
పరమశైవ సదాచార పారగుండు
హరితవంశాంబునిధి చంద్రుఁ డార్యనుతుఁడు
సుగుణవిభ్రాజి సూరనసోమయాజి.

క. అమ్మహితాత్ముని మనుమఁడు
సమ్మాన దయానిధాన సౌజన్యరమా
సమ్మోదితబాంధవుఁడై
యిమ్మహిలో సిద్ధమంత్రి యెన్నిక కెక్కెన్.

రాజేంద్రచోడుఁడు ౧౧౫౬-వ సంవత్సరము మొదలుకొని ౧౧౬౩-వ సంవత్సరమువఱకును రాజ్యపాలనము చేసెను సిద్ధమంత్రి కొడుకైన జన్నయమంత్రి ౧౪౦౬వ సంవత్సరము మొదలుకొని ౧౪౨౨వ సంవత్స

రము వఱకును రాజ్యపరిపాలనము చేసిన దేవరాయని కాలములో నుండెను. తాతకును మనుమనికిని నిన్నూట యేబది సంవత్సరముల వ్యత్యాస ముండుట సంభవింపనేరదు గావున నిచ్చట మనుమఁడనగా సంతతివాఁ డని యర్థము చెప్పవలెను. అందుచేత సిద్ధనమంత్రి సూరన సోమయాజికి మనుమఁడు గాక తద్వంశజుఁడయి యుండుట నిశ్చయము.

ఇచ్చట "ఆంధ్రికవి తరంగిణి" యందిట్లున్నది.

[వెలనాటి చోడులలో రాజేంద్రచోడ నామధారులు పలువురున్నారు. ఇందు గడపటి యాతడు కులోత్తుంగ రాజేంద్రచోడుడు. ఇతడును మనుమసిద్ధియు సమకాలికులు. అతఁడే సూరన సోమయాజి కగ్రహార మొసగెనని తలంచితి మేని సూరనసోమయాజి క్రీ. శ. ౧౨౦౦ ప్రాంతమున నాతనిచే నగ్రహార మందెననియు నాతని, మునిమనుమఁడైన జన్నమంత్రి క్రీ శ. ౧౩౦౦ ప్రాంతము నందుండెననియు నిశ్చయింపవచ్చును. ఇందు విరుద్ధమేమియు నుండదు. పంతులుగారు చూపిన వ్యత్యాసమునకు దావుండదు. మనుమఁడని వ్రాసిన దానిని వంశీయుడని దలంచ నక్కరయుండదు. (ఆంధ్రకవి తరంగిణి-నాల్గవసంపుటము-పుటలు 219 220)

కృష్ణా! దేవకీనందనా! అను మకుటముగల శతకమునకు గర్త సిద్ధమంత్రి తండ్రి జన్నయయేయని పలువురి యభిప్రాయము. సిద్ధమంత్రి తన వంశీయుఁడని వెన్నెలకంటి వేంకటాచలకవి కృష్ణవిలాసమున జెప్పి యుండుటచే జన్నయ యింటిపేరును 'వెన్నెలకంటివా'రని నిర్ణయింప వచ్చునఁట! ఇతని కాలము క్రీ శ. ౧౩౬౦ ౧౪౨౦ నడుమనుండవచ్చునట! పయి శతకము తిక్కన సోమయాజి కృతమనునొక ప్రతీతి యున్నది. కాని యది సత్య దూరమని పలువురి యభిప్రాయము.]

జన్నమంత్రియు సిద్ధనమంత్రియు గూడ దేవరాయమహారాజు వద్దమంత్రు లుగా నున్నట్లు విక్రమార్కచరిత్రములోని యీ క్రింది పద్యములలోఁ జెప్పఁబడిన యున్నది.

సీ. విమలవర్తనమున వేదశాస్త్ర పురాణ
వాక్యార్థ సరణికి వన్నె పెట్టె
పరమహృద్యంబైన పద్యశతంబున
దేవకీతనయు విధేయుఁ జేసె
రసికత్వమున దేవరాయమహారాజ
కరుణాకటాక్ష వీక్షణముఁ గాంచె
కర్ణాటకటకమ్ము కలయంగ మెచ్చంగఁ
గడఁక విద్యాప్రౌఢి ఘనత కెక్కె
గురులఁ బోషించె సత్కవీశ్వరుల మంచె
బ్రజలఁ బాలించె భాగ్యసంపద వహించె
హరిత మునిముఖ్యవంశరత్నాకరేంద్ర
చంద్రుఁడై యొప్పు సిద్ధయ జన్నమంత్రి.

సీ. చిత్రగుప్తున కైనఁ జింతింప నరుదైన
గణిత విద్యా ప్రౌఢి ఘనత కెక్కె
నవరసంబులయందు నవ్యకావ్యంబులు
కవిజనంబులు మెచ్చఁగా నొనర్చె
నాణిముత్యములసోయగము మించిన వ్రాలు
వరుసతో నిరుగేల వ్రాయ నేర్చె
నాత్మయలిపియట్లు లన్యదేశంబుల
లిపులను జదువంగ నిపుణుఁ డయ్యె
దేవరాయమహారాయధీవిధేయ
మంత్రివల్లభచామనామాత్యదత్త
చామరచ్ఛత్ర భూషాది సకలభాగ్య
చిహ్నముల నొప్పు జన్నయసిద్ధమంత్రి.

తండ్రియు కుమారుఁడును గూడ దేవరాయమహారాజువద్ద మంత్రులుగా నున్నట్లు చెప్పఁబడినందున, కుమారుఁ డయిన సిద్ధన్న యాతని

రాజ్యములోని కడపటిదశయం దున్నట్లూహింపఁదగి యున్నది. దేవరాయ మహారాయలు క్రీస్తుశకము ౧౪౦౬వ సంవత్సరము మొదలుకొని ౧౪౨౨వ సంవత్సరము వఱకును కర్ణాటక రాజ్యమును పరిపాలనము చేసెను. కాబట్టి సిద్ధన్న మంత్రి యీపయి నుండక పోయినను ౧౪౨౨వ సంవత్సరమువరకు నున్నట్లు నిశ్చయము. అందుచేత విక్రమార్క చరిత్రము ౧౪౧౦వ సంవత్సరమునకును ౧౪౨౦వ సంవత్సరమునకును మధ్యకాలమునందు రచియింపఁబడిన దని నిరాక్షేపముగాఁ జెప్పవచ్చును. విష్ణుపురాణము తెనిగించిన వెన్నెలగంటి సూరన్న తాతయైన సూర్యుఁడీ సిద్ధన్న పెద్దతండ్రియైనట్టు విక్రమార్కచరిత్రలోని షష్ఠ్యంతములలో నొకటయిన యీ క్రింది పద్యమునందుఁ జెప్పఁబడి యున్నది.

ఉ. వెన్నెలగంటి సూర్యుఁడు వివేకగుణాఢ్యుఁడు వేదశాస్త్రసం
పన్నుఁడు రెడ్డివేమనరపాలకుచేత మహాగ్రహారముల్
గొన్నకవీంద్రకుంజరుఁ డకుంఠితతేజుఁడు పెద్దతండ్రిగా
సన్నుతిఁ గన్న సిద్ధనకు సంతతదానకళావినోదికిన్.

జక్కనకవి తన విక్రమార్క చరిత్రమునందు భారతమును తెనిఁగించిన కవిత్రయ మగు నన్నయ్యభట్టారకుని, తిక్కన సోమయాజిని, ఎఱ్ఱాప్రగడను మాత్రమే యీక్రింది పద్యములతో స్తుతించి యున్నాఁడు—

ఉ. వేయి విధంబులందుఁ బదివేవురు పెద్దలు సుప్రబంధముల్
పాయక చెప్పి రట్లు రసబంధురభావభవాభిరామధౌ
రేయులు శబ్దశాసనవరేణ్యులు నాఁగఁ బ్రసిద్ధి కెక్కిరే
యేయెడ నన్నపార్యుగతి నిద్ధరనట్టి మహాత్ముఁ గొల్చెదన్.

చ. పరువడి దేవభాషఁగల పంచమవేదము నాంధ్రభాష సు
స్థిరత రచించుచోఁ గృతిపతిత్వముఁ గోరి ప్రసన్నుఁడైన యా
హరిహరనాథుచేఁ బడసె నవ్యయసౌఖ్యపదంబు నెవ్వఁ డా
పురుషవరేణ్యుఁ దిక్కకవిఁ బూని నుతింతుఁ గృతాధ్వరోత్సవున్.

ఉ. ఈత్రయిఁ దాఁట్రబంధపరమేశ్వరుఁడై విరచించె శబ్దవై
చిత్రి నరణ్యపర్వమున శేషము శ్రీ నరసింహ రామచా
రిత్రములన్ బుధవ్రజగరిష్ఠత నెఱ్ఱయ శంభుదాసుఁ డా
చిత్రకవిత్వవాగ్విభవజృంభితు మెచ్చెద భక్తియుక్తితోన్.

ఈ జక్కన్న లాక్షణికుఁడైన మంచికవి. ఈతని కవిత్వము నిర్దుష్టమై మనోహరముగా నుండునుఁ ఈ విక్రమార్క చరిత్రము నందలి కథలు సహిత మద్భుతములుగానే యుండును. కవియొక్క రచనాధోరణి తెలియుట కయి విక్రమార్కచరిత్రములోని కొన్ని పద్యముల నిందుఁ జూపుచున్నాను.

చ. అనవుడు నింతి యీయెడఁ బ్రియాసపడం బనియేమి? యంచు వే
గన మఱి మంటఁ బుచ్చుటయె కార్యముగాఁ దలపోసి చంద్రగు
ప్తుని దగురీతి వీడుకొని భూపతిపాలికిఁ బోయి పూసగ్రు
చ్చినగతిఁ గార్యనిశ్చయ మశేషము తిన్నగ విన్నవించినన్. ఆ. ౧.

ఉ ఇమ్మెయి నర్థ మెల్లను వ్యయింపఁ బురిం గలవైశ్యు లందఱున్
నెమ్మిఁ బురందరుం గదిసి నీవు వణిక్కులవర్తనంబు స
ర్వమ్మును వమ్ముసం గలిపి వాలి విశృంఖలవృత్తి దానధ
ర్మమ్ములు త్యాగభోగములు మానక చేయుట నీతిమార్గమే? ఆ. ౨

ఉ రా జవివేకియై నిరపరాధు మహీసురవర్యునిన్ జగ
త్పూజితుఁ బుణ్యవర్తను విధూతనమజ్జనకల్మషున్ వధూ
వ్యాజమునన్ వృథాకుపితుఁడై వధియింపఁగఁ బంచె దీని నే
యోజఁ దొలంగఁద్రోతు గురు నుత్తము నెమ్మెయిఁ గాతునైపమా!
ఆ. ౩.

ఉ చెప్పఁదలంచు సిగ్గు తనుఁ జెప్పఁగనీమిక సంచలించుఁ దాఁ
జెప్పెడు మాట యెవ్వరికిఁ జెప్పకుమీ యనజూచు నంతటం
జెప్పక యుండరాదు మఱి చెప్పఁగరా దని కొంకు నెమ్మెయిం

జెప్పకపోదు పొమ్మనుచుఁ జిత్తము నూల్కొనఁజేసి యిట్లనున్.
ఆ ౪.

మ. భువనాధీశ్వరుదర్శనోత్సవసుఖంబుం బొంది యానందతాం
డవముం జేసెడుభంగి నా కమలషండం బొప్పె భృంగాంగనా
రవగానంబులతో సరాగదళనేత్ర శ్రీవిలాసంబుతో
నవచిత్రాభినవోర్మిహస్తఘటనానానావిలాసంబుతోన్. ఆ. ౫.

చ. కలువల గండుమీలఁ దొలుకారు మెఱుంగుల నిండువెన్నెలన్
వలపులరాజుతూపులను వారిరుహంబుల నొక్కయెత్తునన్
గెలుపు గొనంగఁ జాలు మృగనేత్ర యపాంగనిరీక్షణద్యుతుల్
బలుపుగ ధైర్యమూల మగు పాదగిలింపవె యీశ్వరాదులన్.
ఆ. ౬.

చ. పలుకులనేర్పునం జెవులపండువు చేసితి వింతసేపు నా
పలుకు శిలాక్షరంబుగ శుభం బది శీఘ్రముగాఁగ నంతయుం
దెలియఁగఁ జెప్పు మింక భవదీయసమాగమనప్రసంగముల్
జలజదళాక్షి! యేమిటికిఁ జల్లకు వచ్చియు ముంత దాఁపఁగన్. ఆ. ౭.

ఉ. ఈ సుకుమారతావిభవ మీ దరహాసముఖారవింద మీ
భాసురమూర్తి యీ లసదపారకృపారసనేత్రకాంతి వి
న్యాసము లెందుఁ గంటిమె ప్రియంవదుఁ డీతనియంద కాక? నేఁ
జేసినభాగ్య మెవ్వరును జేయరుపో యితఁ దేగుదెంచుటన్ ఆ. ౮.

[శాకుంతల మొకటి సిద్ధనప్రెగడ కృతము సంకలన గ్రంథములలో నుదాహరింపఁబడినది. ఈసిద్ధన విక్రమార్కచరిత్ర కృతిపతియే కావచ్చునని కొందఱి యభిప్రాయము.

జక్కనకవి 'పెమ్మయ సింగధీమణి' శతకమును రచించినట్లు 'చాటు పద్య మణిమంజరి' వలనఁ దెలియవచ్చుచున్నది. ఈ పెమ్మయ సింగన్న యెవ్వఁడో తెలియదనియు. నీశతకము జక్కనకృతమగునో కాదో యింకను విమర్శింపవలెననియు 'ఆంధ్రకవి తరంగిణి' లోఁ గలదు ]

# అనంతామాత్యుఁడు

అనంతామాత్యుఁడు పూర్వక లో నొకఁడు. ఈతఁ డారువేల నియోగి బ్రాహ్మణుఁడు. ఈతని తండ్రి తిక్కన్న; తాత ముమ్మడన్న; ముత్తాత బయ్యన్న. ఈ బయ్యన్న యైనట్లును. తిక్కన సోమయాజుల కాలములో నున్నట్లును. ఈకవి భోజరాజీయము నం దీక్రింది పద్యమునఁ జెప్పి యున్నాఁడు.

చ. క్షితిఁ గ్రతు*కర్తనా పతి చేకొని పంచమవేదమైన భా
రతముఁ దెనుంగుబాస నభిరామముగా రచియించినట్టి యు
న్నతచరితుండు తిక్క వినాయకుఁ డాదట మెచ్చి భవ్యభా
రతిఁ యనఁ బేరు గన్న కవిరత్నము బయ్యనమంత్రి యల్పుఁడే.

కవిబ్రహ్మ యయిన తిక్కన సోమయాజిచేత భవ్యభారతి యని మెప్పు వడిసినంతటి మహాకవి బయ్యన్నచే రచియింపఁబడిన గ్రంథ మొకటి యుండిన యెడల నిప్పుడు దాని పే రయినను దెలియరాకున్నది. ఈ బయ్యన కవి యగుటయే కాక దండనాథుఁడు కూడ నయి యుండునని కవి యీపద్యమునఁ జెప్పెను—

చ. శరధిసుత న్వరించు జలజాతవిలోచనుమాడ్కి శీతభూ
ధరజఁ బరిగ్రహించు హిమధామకళాధరుపోల్కి సద్గుణా
భరణ పవిత్రమూర్తి కులపాలిక నాఁ దగు పోలమాంబికన్
బరిణయమయ్యె నెంతయు బయ్యచమూపతి వైభవోన్నతిన్.

ఈకవి తన తండ్రియైన తిక్కన కృష్ణామండలములోని శ్రీకాకుళమున కొడయఁడైన యంధ్రవల్లభుని సేవ చేయుచుండినట్లు*ను తన తల్లి యైన

* [కర్తృతా మహిమ అని పాఠాంతరము.]
* [అనఁగా-ఆంధ్రవల్లభ విష్ణునిభక్తుఁడని యభిప్రాయము.]

మల్లమాంబ యక్కదండనాధుని పుత్రి యైనట్లును నీక్రింది పద్యములలో పయి గ్రంధమునందే చెప్పియున్నాఁడు.

సీ. విలసితం బగు కృష్ణవేణీ మలాపహా
రిణీ భీమరథి నా ధరిత్రియందుఁ
దనరు నదీత్రయాంతర్వేది యగు పావ
నక్షేత్రమున శోభనము లెల్ల
ధర నివాసంబగు పెరుమగూరిపురంబు
నందు విద్వజ్జనానందమైన
జీవనస్థితిచేతఁ జెన్నొందె వంశక
ర్తృత్వసంపత్తిఁ బ్రభుత్వ మొంది
నెమ్మిఁ బ్రత్యక్షపరమపదమ్మనంగ
నొప్పు శ్రీకాకుళంబున కొడయఁడైన
యంధ్రవల్లభహరిసేవ నలరుచుండుఁ
జెక్కుభంగుల ముమ్మడి తిక్కవిభుఁడు.

సీ. శ్రీవత్సగోత్రాబ్ధిశీతాంశుఁ డగు నక్క
దండాధినాథుఁ డీ తరుణితండ్రి
లావణ్యగుణపుణ్యలక్షణాన్విత యైన
యక్కమాంబిక యీ లతాంగితల్లి
చిరకీర్తినిరతులు చిట్టనమంత్రియు
నయ్యలార్యుఁడు నాతికగ్రజన్ము
లచ్యుతాంఘ్రిసరోరుహార్చనారతుఁడు త
మ్మనమంత్రి యీ యిం యనుఁగుఁదమ్ముఁ
దనఘుఁ డగు కోటకరుణాకరార్యుఁ డను ఘ
నుండు ముదునూరి పెద్దవిభుండు నిర
ధూమణికిఁ గూర్మి గల మేనమామ యనిన
మగువ లెనయె తిక్కనమంత్రి మల్లమకును.

ఈ కవి తా మాఱుఁగు రన్నదమ్ము లయిన ట్లీ క్రింది పద్యములలోఁ జెప్పుకొనెను.

ఉ. భూనుతకీర్తి యుమ్మడివిభుండు మదగ్రజుఁ డేను వైష్ణవ
ధ్యాన సమాహితాత్ముఁడ ననంతసమాఖ్యుఁడ నాదుతమ్ము ల
జ్ఞానవిదూరు లక్కనయు సత్కవి చిట్టనయున్ వివేక వి
ద్యానిధి రామచంద్రుఁడు నుదారుఁడు లక్ష్మణనామధేయుఁడున్.

క. ఈ యార్వురు నొక్కొక్కఁడు
వేయిండ్లకు మొదలుగాఁగ వెలయుదురని కా
దే యాఱువేలపే రిడి
రీ యన్వయమునకు నేష్య మెఱిఁగినపెద్దల్.

ఈ కవి శ్రీనాథునికాలమునం దున్నవాఁడో యాతనికంటెఁ గొంచెము పూర్వమునం దున్నవాఁడో యని తెలియవచ్చుచున్నది. [ఈతని 'రసాభరణము' చివఱఁగల 'జానొందన్-' అనుపద్యమునుబట్టిహూణశకము ౧౪౩౫ జనవరి ౨౫ తేదీని రసాభరణమును ధ్రువపట్టన కంకిత మిచ్చినట్లు తెలియుచున్నదనియు, అప్పటి కీతనికి ౫౦ సంవత్సరముల వయస్సుండెనని తలంపవచ్చుననియు, అది నిజమైనచో ఇతఁడు శ్రీనాథునికంటెఁ గొంచెము చిన్నవాఁడై యుండి, ఆతని కాలమున గ్రంథరచన సాగించి యుండునని చెప్పుటకు సంశయింప నక్కఱలేదనియు 'ఆంధ్రకవి తరంగిణి' కర్తల యాశయమైనట్లు తెలియుచున్నది. [చూ. అయిదవ సంపుటము పుట 260.]

'జానొందన్' అను పద్యములోఁ బేర్కొనఁబడిన 'ధ్రువపట్టణ' మేదియో తెలియకున్నది. ఇది గుంటూరు మండలములో కృష్ణానదీ ప్రాంతమునఁ గల ధూళిపూఁడి యను గ్రామమా? యని యూహ పొడముచున్నదని రసాభరణ పీఠికలో శ్రీకోపల్లె-శివకామేశ్వరరావుగారు తెల్పియున్నారు ధ్రువపురి కృష్ణామండలములోని దరుపూరని ఛందోదర్పణ పీఠికలో శ్రీనిడదవోలు-వెంకటరావుగారు తెల్పియున్నారు ధ్రువశబ్దము నకు 'మఱ్ఱి మోదు' అను రెండ

ర్థము లున్నందున మట్టిపూఁడి లేక మట్టివాడ లేక మోదుమూడి - అను గ్రామములలో నొకటియయి యుండవచ్చుననియు, మొత్తముపై నితఁడు కృష్ణామండల నివాసియనియు 'ఆంధ్రకవి తరంగిణి' కారుల యాశయము]
ఈతనికవిత్వము రసవంతమై నిర్దుష్ట మయి మృదుపదకలిత మయి హృదయ రంజకముగా నున్నది.

ఈతఁడు రచియించిన గ్రంథములలో రసాభరణము, భోజరాజీయము, ప్రధానము లయినవి. రసాభరణము శృంగారాదిరసాదులనుగూర్చి చెప్పఁబడిన లక్షణగ్రంథము. భోజరాజీయము వింతకథలను గలిగి చమత్కారముగా నుండును. ఈతఁడు భోజరాజీయమునం దెఱ్ఱాప్రెగడవఱకును గల కవుల నీక్రింది పద్యముచేత స్తుతించి యున్నాఁడు.

ఉ. నన్నయభట్టుఁ దిక్కకవినాయకు భాస్కరు రంగనాథుఁ బే
రెన్నిక కెక్కినట్టి యమరేశ్వరు నెఱ్ఱనమంత్రి నాదిగాఁ
జన్నకవీంద్రుల న్నవరసస్ఫుటవాణు లనంగ ధాత్రిలో
నున్న కవీంద్రులం దలఁతు నుల్ల మెలర్పఁగ వాగ్విభూతికిన్.

అమరేశ్వరుని మహాకవినిగా ననేకులు పొగడి యున్నారు. కాని యాత డేకాలమునం దుండెనో, ఏ యే గ్రంథములను రచియించెనో, సరిగాఁ దెలియవచ్చినది కాదు. అమరేశ్వరకృతమైన విక్రమసేనములోని దని యొకానొక లక్షణగ్రంథమునం దొక పద్య ముదాహరింపఁబడి యున్నది. ఇంకొక యుదాహరణ గ్రంథములో మఱికొన్ని పద్యము లుదాహరింపఁ బడినవి. అమరేశ్వరుని గ్రంథములవలెనే పూర్వకవుల గ్రంథము లనేకములు పేరు లేకుండ నశించి యుండును.

ఆంధ్రకవులలో ముగ్గురు నలుగురు మాత్రమే తమ కృతులలోఁ దా మున్న కాలమును వేసికొని యున్నారు. అట్టి కవులలో ననంతామాత్యుఁ డొకఁడు. ఈతఁడు రసాభరణమును శాలివాహనశకము ౧౩౫౬-వ సంవత్సరమునం దనఁగా క్రీస్తుశకము ౧౪౩౪-వ సంవత్సరమునందు రచియించిన ట్లా పుస్తకములోని యీ దిగువ పద్యమువలనఁ దెలియవచ్చుచున్నది.

శా. జానొందన్ శకవర్షముల్ ఋతుశరజ్వాలేందులై యొప్పన
య్యానందాబ్దమునందు మాఘమునఁ గృష్ణైకాదశీభౌమయు
క్తానామామృతవేళ నీకృతి యనంతాఖ్యుండు సమ్యగ్రస
శ్రీనిండం ధ్రువపట్టణాధిపున కిచ్చెన్ భక్తిపూర్వంబుగన్.

కాఁబట్టి యీ కవి పదునేనవ శతాబ్దారంభమునం దుండినవాఁడు. ౧౪౩౪-వ సంవత్సరమునం దుండిన యీ కవియొక్క ముత్తాత యగు బయ్యన యీతని కన్న నూటయేఁబది సంవత్సరములకంటె నధికపూర్వుఁ డగుట పొసఁగక పోవుటచేతను, ఆ బయ్యన్న కవిత్వము చెప్పి తిక్కన సోమయాజిచే మెప్పొంది యుండుటచేతను, తిక్కనసోమయాజి హూణశకము ౧౨౨౦-వ సంవత్సర ప్రాంతమువఱకును జీవించి యున్నట్లేఁచుమించుగా నిర్ధారణ మగుచున్నది. తిక్కనసోమయాజి నన్నయభట్టారకునికాలము లోనివాఁడు కాఁడని చూపుట కింతకంటెఁ బ్రబలసాక్ష్య మేమి కావలెను? బయ్యన మొదలుకొని కవివంశమును దెలుపు భోజరాజీయములోని పద్యములను నడుమనడుమఁ గల వర్ణనాంశముల విడుచుచు నిం దుదాహరించుచున్నాను

చ. శరధిసుత న్వరించు జలజాతవిలోచనుమాడ్కి శీతభూ
ధరజఁ బరిగ్రహించు హిమధామకళాధరుపోల్కి సద్గుణా
భరణఁ బవిత్రమూర్తిఁ గులపాలిక నాఁదగు ప్రోలమాంబికం
బరిణయమయ్యె నెయ్యమున బయ్యచమూపతి వైభవోన్నతిన్.

చ. గుణయుతు లవ్వధూవరులకు న్జనియించిరి త్రేత రామల
క్ష్మణులయి పుట్టి ద్వాపరయుగంబుతుదిం దగ రామకృష్ణులై
గణనకు నెక్కి యీ కలియుగంబున నిట్లుదయించె లోకర
క్షణుఁ డగు విష్ణుదేవుఁ డన గంగనమంత్రియు ముమ్మడన్నయున్.

చ. కడిమిఁ గిరీటి దానమునఁ గర్ణుఁడుఁ భోగమున న్సురేంద్రుఁడె
క్కుడు విభవంబునన్ హరి యకుంఠితబుద్ధిఁ బురందరేభ్యుఁడున్
గడువగు ధీరతన్ సురనగప్రవరుం డనఁ బ్రోలమాంబ ము
మ్మడి బెడఁగొందు రూపమహిమ న్మరుముమ్మడియై జగంబునన్.

క. ఆ ముమ్మడి ప్రెగ్గడ శ్రీ
రాముఁడు సీతను వరించు క్రమమున సుగుణ
స్తోమాభిరామ నమితకృ
పామండిత నెఱమాంబఁ బరిణయమయ్యెన్.

క. ఆరమణీరమణులకుఁ బ్రి
ఖారమ్యుఁడు తిక్కవిభుఁడుఁ బ్రకటితకాంతి
స్ఫారుఁడు సింగనయు నను
వారలు పుట్టి రిలఁ బుష్పవంతులమాడ్కిన్.

చ. చిరతరశోభనుం డగు వసిష్ఠమునీశ్వరుఁడయ్యరుంధతిన్
బరిణయమై గృహస్థ గుణభాసితుఁడై వెలుగొందుమాడ్కిఁగా
తరపరిరక్షణానవరతవ్రతశీలుఁడు తిక్కమంత్రి శే
ఖరుఁడు వివాహమయ్యె గుణగౌరవశోభిని మల్లమాంబికన్.

మ. అరిషడ్వర్గముఁ దూలఁదోలి ధరలో నైశ్వర్యషడ్వర్గ మీ
వరుసన్ సంభవ మొందెనాఁగ సుతషడ్వర్గంబు జన్మించెఁ ద
త్పురుషస్త్రీతిలకంబులందు ఘనసంతోషంబు తద్బాంధవో
త్కరముం బొంద సమగ్రసంపద విజాగారంబునం జెందఁగన్.'

తిక్కమంత్రికి మల్లమాంబికకును బుత్రుఁడైన యనంతామాత్యకవి తన కవిత్వము తొంటిపెద్దలకవిత్వమువలె రుచించునో లేదో యని సంశయించుచు నీ క్రిందిపద్యముతో నొకవిధ మైన సంతుష్టిని వినయపూర్వకముగాఁ దెలిపి యున్నాఁడు

చ వెలయఁగఁ దొంటిపెద్దల కవిత్వమువోలె రుచించు నొక్కొ యేఁ
బలికెడు నూత్నకావ్యరసభావము లైనను భూమిఁ దల్లిదం
డ్రులకు నిజాగ్రసూనులపటు ప్రచురోక్తులకంటెఁ జిన్నబి
డల వెడతొక్కుఁబల్కులు దృఢంబగు ముదుల నీనకుండునే ?

ఈ కవి తాను గవిత్వమును జెప్పఁబూనుటకును, నూతనమార్గమున భోజుని కథలను జెప్పఁబూనుటకును, కారణముల నీ క్రింది పద్యములలో మనోహరముగాఁ దెలిపి యున్నాఁడు.

సీ. సకలవిద్యలయందుఁ జర్చింప గవిత యు
త్కృష్టమం, డ్రిది నిత్యకీర్తికొఱకు
నర్థాప్తికొఱకు నావ్యవహారలక్షణం
బెఱిఁగెడుకొఱకు ననేకవిధము
లగు నమంగళముల హరియించుకొఱకు ను
చితనిత్యసౌఖ్యసంసిద్ధికొఱకు
నొనరఁ గాంతాసమ్మితోపదేశంబునఁ
బ్రీతిమై హిత మాచరించుకొఱకు
నయ్యెఁ గానఁ బెద్దలాచరించెద రంచు
ధైర్యఁకొలఁదిఁ గృతి యొనర్పఁబూని
యస్మదీయకృతికి నధిపతిఁ గావింప
నర్హుఁ డెవ్వఁడొక్కొ యని తలంచి.

సీ. నూతనం బయ్యుఁ బురాతనకృతులట్ల
సంతతశ్రవ్యమై జరగు ననియు
నాదిరాజసమానుఁ డగు భోజభూపతి
చరిత మీ కవితా ప్రసంగ మనియు
నిందుఁ జెప్పెడి కథలిన్నియు నోలిఁ బ్రి
శస్తధర్మోపదేశంబు లనియు
నఖిలజగన్నాథుఁ డగు నహోబిలనాథుఁ
డీ పుణ్యకృతికి నధీశుఁ డనియుఁ
బృథివి నెల్ల జనులు ప్రియభక్తియుక్తిఁ బా
టింతు రనియు నూఱడిల్లి యేను
బరమసౌఖ్య మైన భవదాభిముఖ్యంబు
నెమ్మిఁ బడసి యధికనిష్ఠతోడ

ఈ మహాకవియే యనంతచ్ఛంద స్సను పేరం బరుగిన యొక ఛందో లక్షణమును గూడ రచియించి యున్నాడు.

అనంతుని కవిత్వరీతి తెలియుటకయి యీయన కృతులనుండి కొన్ని పద్యముల నిం దుదాహరించు చున్నాను.

భో జ రా జీ య ము

ఉ. ఓలి గృహస్థధర్మముల నుండెడువానికి గ్రాసవాసముల్
చాలఁగఁ గల్గి పుత్త్రులుఁ గళత్రము సౌఖ్యము నొంద బంధుముల్
మేలన నార్యకోటి మది మెచ్చఁగ నుండుట యున్కి గాక యే
చాలును లేక యాచెనఁటిజాలిఁ బడం బనియేమి చెప్పుమా! ఆ ౨

చ. ఇటు తగునయ్య విప్రుఁడ వహీనగుణాఢ్యుఁడ వీవు; నీకు నే
మిటి కిటువంటి దౌష్ట్యము? క్షమించును మజ్జనకుండు విమ్ముఁ ద
క్కటి జను లేమి యందురు? వుదిఁ గాంక్షయె కల్గిన నగ్నిసాక్షిగాఁ
జిటికెన వట్టి కాక వృథ చేయుట ధర్మమె కన్యకాత్వమున్. ఆ ౪

ఉ. తెచ్చిన నేమి సర్వజగతీభరణక్షముఁడైన యచ్యుతుం
డచ్చుగ నెల్లజీవులకు నారసి యన్నము వెట్టుచుండు నే
నిచ్చట నొంటి నున్నతటి నేల తలంపఁడు? జారరాగ్నిచే
వెచ్చుచునున్న నన్నుఁ దగవే తనకింత యుపేక్ష చేయఁగన్. ఆ ౫

ఉ ఆయతరీతిఁ దద్ధ్వని రసాయనమై చెవి సోఁక నప్పు డం
బే యనుచుం బ్రతిస్వనము పెల్లుగఁ జూపుచుఁ బాఱి ధేనువుల్
డాయఁగఁ బోయి వేడుక నొడల్ కదలించుచు వాల మార్చుచున్
బాయక గుప్పునం గుడిచె బాలవృషంబు నిజాంఘ్రిదుగ్ధముల్. ఆ ౬

ఛ ం ద స్సు

క. కాకుస్వరయతి యగు నితఁ
డే కదలక జలధిఁ బవ్వళించె ననఁగఁ బ్ర
శ్నాకలితదీర్ఘమున నతఁ
డే కవ్వడిరథము గడిపె నిమ్ముల ననఁగన్

గీ. యరలవలు శషసహలును నాదిబిందు
యుతములై మకారవిరామయుక్తిఁ దనరు
మారుతాత్మజుఁ డరిదిసంయమి యనంగ
మదనజనకుఁడు దనుజసంహారుఁ డనఁగ.

రసాభరణము

ఉ. కైరవబంధుబంధురవికాసవిలాసము లేల? మందసం
చారత నొప్పు నమ్మలయశైలసమీరము లేల? యొప్పు నీ
కీరముపల్కు లేల? పరికింపఁగ నవ్వనలీల లేల? శృం
గారము లేల? నాకుఁ జెలి కంజదళాక్షుఁడు రాక తక్కినన్. ఆ ౩.

ఉ. మక్కువఁ బూనఁ దేనె లగు మాటలు పల్కు నహర్నిశంబు నొ
క్కొక్క నెపంబుమై నలిగి యుగ్మలికిం దమకంబు తద్దయున్
మిక్కిలి సేయు నొండొరుల మెచ్చఁగ గాఢతరప్రవీణతల్
తక్కక చూపు శౌరి మిగులం గలదే మహి నెట్టిప్రౌఢకున్. ఆ ౪

# రావిపాటి తిప్పన్న

ఈ తిప్పన్ననే త్రిపురాంతకుఁ డనియుఁ జెప్పుదురు. ఈతఁడు చేసిన గ్రంథములలో త్రిపురాంతకోదాహరణము ముఖ్యమైనది. ఒక్కొక్క విభక్త్యంతమున నొక్కొక్క పద్యమును గలదయి ప్రతి పద్యము తరువాతను నొక్కొక్క కళికను దానితరువాత నొక్కొక్క యుక్కళికను గల గ్రంథ ముదాహరణ మని చెప్పఁబడుచుండెను. నన్నయాదులకుఁ బూర్వమునందును తత్కాలమునందును తెలుఁగున సాధారణముగా నుదాహరణగ్రంథములే ప్రబలముగా నుండి జనులచే నాదరింపఁబడుచుండెను. నన్నయాదులు భారతాదిమహాకావ్యములను రచియింప నారంభించిన తరువాత నుదాహరణ గ్రంథములు మూలఁబడి * క్షుద్రకావ్యములుగాఁ బరిగణింపఁబడుచుండెను. అయినను త్రిపురాంతకుఁడు శేషనార్యుఁడు మొదలైనవారు కొందఱప్పుడప్పు డుదాహరణ గ్రంథములను సహితము చేయుచు వచ్చిరి. ఈ తిప్పన యుదాహరణ గ్రంథమును గాక మదనవిజయము, చంద్రతారావళి, అంబికాశతకములను కూడ విరచించెను. ఈ కవి కాల మిదియని నిర్ధారణ చేయుటకుఁ దగిన యాధారము లంతగాఁ గానరావు. అప్పకవి అప్పకవీయమున యతిప్రాస ప్రకరణ మైన మూఁడవయాశ్వాసమున ననుస్వారసంబంధయతి కుదాహరణముగా రావిపాటి తిప్పన్నచాటుధార యని యీక్రింది పద్యము నుదాహరించియున్నాఁడు.

మ. సరి బేసై రిపుడేల భాస్కరులు? భాషానాథపుత్రా! వసుం
ధరయం దొక్కఁడు మంత్రియయ్యె వినుకొండ న్రామయామాత్యభా
స్కరుఁడో? యా నయినన్ సహస్రకరశాఖ ల్లే వవే యున్నవే
తిరమై దానము చేయచో రిపుల హేతిన్ వ్రేయుచో వ్రాయుచోఁ.

ద్వాత్రింశన్మంత్రుల చరిత్రములో రాయనిభాస్కరుని కథయం దుదాహరింపఁబడిన యీ పద్యమున రామయామాత్యభాస్కరుఁ డనుటకు మాఱుగా రాయనామాత్యభాస్కరుఁడని యున్నది.

---

* [క్షుద్రకావ్యమనఁగా చిన్నకావ్యము. నీచమైన కావ్యమని యర్థము చేసికొనుట పొరపాటు.]

సీ. నిర్మించె నే మంత్రి నిరుపమప్రాకార
నవకంబుగా గోపీనాథపురము
గెలిచినాఁ డే మంత్రివిక్రమమునఁ
బ్రబలుఁడై యవనులబలము నెల్ల
నిలిపినాఁడే మంత్రి నియతవైభవమున
గోపికావల్లభుఁ గూర్మి వెలయ
పాలించె నే మంత్రి ప్రకటధర్మఖ్యాతి
మహిమ మీఱఁగ నాంధ్రమండలంబు

నతఁడు భూపాలమంత్రీంద్రసతతవినుత
ధీవిశారదుఁ డచ్యుతదేవరాయ
మాన్యహిత వర్తనుఁడు శౌర్యమహితయశుఁడు
భానుతేజుండు రాయనభాస్కరుండు.

అని కొండవీటిగోపీనాథస్వామివారి యాలయముఖద్వారశాఖయందు వ్రాయఁబడి యున్న పద్యమునుబట్టి రామయభాస్కరుఁ డచ్యుత దేవరాయల కాలములో ననఁగా ౧౫౪౦-వ సంవత్సరమునకుఁ దరువాత నుండుట స్పష్టము. సరిబేసై రన్న పద్యము రామయభాస్కరుని గూర్చినది గాక ద్వాత్రింశన్మంత్రుల చరిత్రములో నున్నట్లు రాయన భాస్కరునిగూర్చిన దయిన పక్షమున

శ్లో. శాకాబే వసువహ్ని వేదధరణీగణ్యేచ ధాత్రబ్దకే
వైశాఖే వినుకొండసీమని సుధీ ర్నాదెళ్ల యప్పప్రభుః,
వాసిష్ఠాయ చ భర్తపూడి మఖిలం గ్రామం స్వనామాంకితం
ప్రాదా ద్రాయనభాస్కరాయ విదుషేప్టైశ్వర్యభోగాన్వితమ్.

అని నాదెళ్ళ యప్పయమంత్రి శాలివాహనశకము ౧౪౩౮-వ సంవత్సరమునందు అనగా క్రీస్తుశకము ౧౫౧౬-వ సంవత్సరము ధాతృవత్సర వైశాఖమాసమునందు వినుకొండ సీమలోని భర్తపూడి గ్రామమును రాయని భాస్కరపండితుని కిచ్చినట్టున్న దానశాసనమునుబట్టి యతఁడు ౧౫౧౬-వ సంవత్సర ప్రాంతములం దుండుట స్పష్టము. రావిపాటి తిప్పన్న యీ రెండు

కాలములలో నే కాలమునం దుండినను. ౧౪౨౦ వ సంవత్సర ప్రాంతములయం దుండిన వల్లభామాత్యకవి యాతనిని తన క్రీడాభిరామములో నీక్రిందిపద్యములో నిట్టు చెప్పుట పొసఁగనేరదు-

ఉ నన్నయభట్టతిక్కకవినాయకు లన్న హుళిక్కిభాస్కరుం
డన్నను జిమ్మపూడి యమరాధిపుఁ డన్నను సత్కవీశ్వరుల్
నెన్నుదుటం గరాంజలులు * నిం తలుఁ జేయని రావిపాటి తి
ప్పన్నయు నంతవాఁడ తగునా యిటు దోసపుమాట లాడఁగన్.

దీనినిబట్టి యాలోచింపఁగా ౧౪౨౦ వ సంవత్సరమునకుఁ బూర్వమునందు రామయభాస్కరుఁడో రాయనిభాస్కరుఁడో యెవ్వడో యొకఁ డుండియుండవలెను. ఆ కాలమునందు రామయభాస్కరుఁ డెవ్వఁడును లేఁడు గాని ౧౩౮౬ వ సంవత్సరము మొదలుకొని రాజమహేంద్రవరరాజ్యమును పాలించిన కాటయవేమారెడ్డికాలములో రాయనిభాస్కరుఁ డొకఁడున్నట్లీక్రింది పద్యమువలనఁ దేటపడుచున్నది.

చ 'కలయఁ బసిండిగంటమునఁ గాటయవేము సమక్షమందు స
త్ఫలముగ రాయనప్రభునిబాచఁడు వ్రాసిన వ్రాలవ్రమోఁతలుఁ
గలుగలు గల్లుగల్లురనఁ గంటకమంత్రులగుండె లన్నియున్
జలుజలు జల్లుజల్లురనె సత్కవివర్యులు మేలు మే లనన్.'

పయి పద్యమునం దీ రాయనభాస్కరుఁ డప్పకవీయములో నుదాహృతమైన వద్యమునందువలెనే వ్రాయుటయందు సుప్రసిద్ధుఁ డయినట్టు చెప్పఁబడినందున రావిపాటి తిప్పన్న చెప్పిన సరిబేసైరన్న పద్య మీ రాయనభాస్కరునిఁగూర్చినదే యనియు నందుచేత తిప్పన్నకవి ౧౩౮౦ వ సంవత్సరప్రాంతములయందుండెననియు నింతకంటె ప్రబలప్రమాణములు దొరకు

* [నింతురు జేయని అని పాఠాంతరము.]

వఱకును మన మూహించితిమి. ఈ రాయనిభాస్కరుఁడు వ్రాయుటకే కాక దానము చేయుటకును రిపులను ఖడ్గముతో వ్రేయుటకును గూడఁ బ్రఖ్యాతి చెందినవాఁడు. [ఇయ్యెడ 'ఆంధ్రకవి తరంగిణి' లో నిట్లున్నది. 'ఈ చాటువు (కలయఁబసిండి గంటమున-) నాధారముగాఁ గొని శ్రీ వీరేశలింగముపంతులు గారు తిప్పన చాటుధారలో వర్ణితుఁడైన రాయన భాస్కరుఁ డీతడే యని నిర్ణయించి త్రిపురాంతకుని కాలము క్రీ. శ. ౧౩౮౦ ప్రాంతమని నిర్ణయించి నారు ఈ పద్యములోఁ గలముఁ బ్రస్తావనయేగాని కర్తృవర్ణనము లేదు. అందుచేఁ ద్రిపురాంతకుని భాస్కరు డీతడుకాఁడు. మఱియు క్రీ. శ. ౧౩౮౦ వఱకును అనవేమారెడ్డియే రాజ్యమునం దున్నవాఁడు ఆకాలములోఁ గాటయ వేమని కధికార ప్రసక్తి లేదు. ఇతఁడు అనపోతారెడ్డి కల్లుఁడు. అతని కుమారుడైన కుమారగిరిరెడ్డి రాజ్యమునకు వచ్చిన ౧౩౮౨ వ సంవత్సరము నుండియును, కుమారగిరిరెడ్డి వలన రాజమహేంద్రవర రాజ్యమును బడసిన క్రీ. శ. ౧౩౮౬ వ సంవత్సరమునకుఁ బిమ్మటను కాటయవేమన కధికార ప్రాప్తి కలిగినది. ఆపిమ్మట, తిప్పయ యీభాస్కరుని నుతించినాఁ డందు మేని త్రిపురాంతకుఁడు దాదాపుగా శ్రీనాధుని కాలమువాడగును. సమకాలిక గ్రంథము నాతఁ డాంధ్రీకరించుటయు, నాతనిని బొగడుటయు సంభ వింపదు ............... ఎట్లయినను, త్రిపురాంతకుఁడు ద్వితీయప్రతాప రుద్రుని కాలమునందున్నవాఁడని తలంచుటయే యుచితమని నాయుద్దేశము" [ఆంధ్రకవి తరంగిణి నాలుగవ సంపుటము, పుటలు 41, 42] రాయని భాస్కరునిఁ గూర్చి కవులు చెప్పిన పద్యము లనేకము లున్నను జదువువారికి మనోహరముగా నుండునని వానిలోనుండి కొన్నిటి నిందు క్రిందఁ బొందు పఱుచుచున్నాను —

క. చేకొని రాయనిబాచఁడు
కాకాలు గుణించినపిన్న కాలమునాఁడే
లా కేత్వ మియ్యనేరఁడు
దాకును గొ మ్మిమ్మయ్యఁ, డిట్టి దాతలు గలరే.

క. ఏ వ్రాలయినను వ్రాయును
నా వ్రాయఁడు వ్రాసెనేని నవ్వున కయినన్
నీ వ్రాసి తావ డియ్యఁడు
భావజ్ఞుఁడు రాయనార్యభాస్కరుఁ డెపుడున్.

ఉ. రాజితకీర్తిశాలి యగు రాయనిబాచ! భవద్యశంబు ది
క్పూజితమౌచు మించె సురభూధరభూధరభూధరేంద్రకాం
తాజసుగోత్రరుగ్విభురథాంగరథాంగరథాంగశేషభా
షాజలజాహితాహితతుషారతుషారతుషాంధపాళులన.

సీ. ఫణిరాజు తన శిరోమణుల నర్థి కిచ్చునో
యనుచు వీక్షణశ్రేణిఁ బడఁగి యుండు
కైలాసకుధర మెక్కడ నిచ్చునో యని
యుగ్రుఁ డక్కడఁ గావ లుండఁబూను;
తనలోని మణుల నే తఱి నిచ్చునో యని
వనధి సంతతమును వణఁకుచుండు
సురధరాధరము నెవ్వరి కిచ్చునో యని
తరణి యగ్గిరిచుట్టుఁ దిరుగుచుండు

నౌర! నీ దానవిఖ్యాతి యఖిలదిశల
మించి వర్తించె నీ కీర్తి నెంచఁదరమె?
గాఢదారిద్ర్యయామిని కాంతిచంద్ర
భాగ్యదేవేంద్ర! రాయనభాస్కరేంద్ర!

మ. అయలక్ష్మీనిధి రాయనప్రభుని బాచామాత్యుఁ డత్యంతము
నియతిన్ బ్రాహ్మణపూజ చేయు టభివర్ణింపంగ శక్యంబె? య
ప్రియగేహంబున హేమపంజరములన్ బెల్లర్చుతే పౌర్చుత
ప్రియమేధా యనుచుం బఠించు శుకశారీకిన్నరీద్వంద్వముల్.

శ్లో. కృతే యుగే బలి ర్దాతా
  త్రేతాయాం రఘునందనః,
  ద్వాపరే సూర్యపుత్రశ్చ,
  కలౌ రాయనభాస్కరః.

ఇతఁడు ౧౫౧౭వ సంవత్సరమునం దుండినట్లు చెప్పఁబడిన రాయని భాస్కరుని తాత యయి యుండును. ఈతని కాలమునందును దనకుఁ గొంత పూర్వమునందును నుండిన రావిపాటి తిప్పన్నకవిని సామాన్యక్షుద్రకావ్యకర్త యని జను లాతనికవిత్వమును తేలికగాఁ జూడగా నాతని ప్రేమాభిరామమును క్రీడాభిరామ మనుపేరఁ దెనిఁగించుచుండిన యభిమానముచేత వల్లభామాత్య కవి యాతనిని పూర్వకవులతో సమానుఁడుగాని సామాన్యుఁడు కాడని శ్లాఘించి యుండును. ఇట్లభిమానముచేతఁ జెప్పబడుటయే కాదు, తిప్పన కవిత్వము నిజముగానే శ్లాఘనీయముగా నున్నది.

"ఆమంత్రిశేఖరుండు రావిపాటిత్రిపురాంతకదేవుం డను కవీశ్వరుం డొనరించిన ప్రేమాభిరామనాటకమ్ము ననుసరించి క్రీడాభిరామంబను రూపకంబు తెనుంగుబాస రచియించినవాఁడు"

అని తిప్పనార్యుఁడు సంస్కృతమునఁ బ్రేమాభిరామనాటకమును రచించి నట్టును దాని ననుసరించి వల్లభామాత్యకవి తెనుఁగున గ్రీడాభిరామమును రచించినట్టును క్రీడాభిరామప్రస్తావనలోఁ జెప్పబడినది. చిన్నతనములో తిప్పనకవియో యాతని తండ్రియో కడపటి ప్రతాపరుద్రుని యంత్యదశలో నోరుగంటిపురములో నుండుటచేత నాతని రాజధాని యైన యేకశిలానగర మును బ్రేమాభిరామములో రంగమునుగాఁ గవి చేకొని యుండును. కవి కృతగ్రంథములలోనుండి కొన్ని పద్యముల నిందు బొందుపఱిచెదను.

౧ త్రిపురాంతకోదాహరణము

ఉ. శ్రీనగచక్రవర్తితుదిశృంగము చూచెద నంచు నేటికిం
  బో ననిశంబు మానవుల పుట్టువుఁ జావును లేనిమందు నా
  చే ననుచుం బతాక యనుచేఁ దరుణాచల మెక్కి చీరుఁ బం
  చాననుఁ డిందుమౌళి త్రిపురాంతకదేవుఁడు భక్తలోకముఁ.

కళిక. మఱియు సజ్జనభక్తగృహముల మరగి తిరిగెడు కామధేనువు
కఱద లెఱుఁగక వేఁడు దీనులఁ గదియుజంగమ్మరత్నసానువ
శైలజాముఖచంద్రరోచుల చవులఁ దవిలెడు నవచకోరము
వేలుపుందపసులతలంపుల వెల్లిగొల్పెడు నమృతపూరము
దేవతలు మువ్వురకు నవ్వలిదెస వెలుంగుచు నుండు నొక్కచ
భావవీధుల గలసి పలుకులఁ బట్టి చెప్పఁగరాని చక్కటి
ఆఱురేకుల మంత్రకుసుమమ్మునందు వెలిఁగెడు మంచరీకమ్ము
వేఱుసేయక యోగిజనములు వెదకి పొందెడి యూర్ధ్వలోకము.

ఉత్కళిక. అడుగుఁదమ్ములఁ జొప్పువసి గని
యడరి శునకాకృతులు గయికొని
మీఱి చదువులు దవుల ముందటఁ
బాఱు క్రోడము నేసి మందట
లాడి తను మాఱ్కొనఁగ వచ్చిన
క్రీడి కోరిన వరము లిచ్చిన
యాటవికకులసార్వభౌముఁడు
జూటభాస్వత్తుహినధాముఁడు.

ఉ ఆఱడియాస నీరసధరాధిపలోకములిండ్లు వాకిటల్
దూఱుట మాని శ్రీనగము తూర్పువాకిలిఁ జొచ్చి పాపముల్
నీఱుగఁ జేసి గంధవతినీటను గ్రుంకి మనంబులోని చి
చ్చాఱఁగఁజేయు టొప్పు త్రిపురాంతకదేవునకై నమస్కృతుల్.

ఉ. పోయెదుఁ గాల మన్యగతిఁ బొందదు మోక్షము పెండికొండకుం
బోయెదు త్రోవ కెఱుఁగబోలదు మానవులార యింతె లేఁ
బ్రాయపుగొండ కంచు శివభక్తులలోపల నద్రిరాజక
న్యాయ పుణ్యమూర్తివలనం గడతేఱెదు జన్మఖేదముల్.

## ౨. చంద్రతారావళి

మ. చరమక్ష్మాధరచారుసింహముఖదంష్ట్రాకోటియో నా(గ నం
బరశార్దూలనఖంబొ నా(గ( దిమిరేభప్రస్ఫురద్గర్వసం
హరణక్రూరతరాంకుశం బన(గ నుద్యల్లీల నీరేఖ ని
త్యరుచిం బొల్పగు( బెంపగున్ విదియచంద్రా! రోహిణీవల్లభా!

మ. అమితధ్వాంతతమాలవల్లిలవనవ్యాపారపారీణదా
త్రమొ సౌగంధికషండకుట్మలకుటీరాజీసముద్ఘాటన
క్రమనిర్యాణధురీణకుంచికయొ నా(గం బెంపునన్ నీ కళా
రమణీయత్వము చూడ నొప్పెస(గు( జంద్రా! రోహిణీవల్లభా!

మ. రతినాథుం డను మాయజోగి చదలం ద్రైలోక్యవశ్యాంజనం
బతియత్నంబున( గూర్చి మౌక్తికమయం బై యున్న ప్రాంతంబునన్
మతకం బేర్పడ( బెట్టి దా(చెనన నీ మధ్యంబునన్ మచ్చ సం
తతముం గన్నులపండువై వెలయు( జంద్రా! రోహిణీవల్లభా!

## ౩. అంబికాశతకము

ఉ. తెప్పలబోరు(దల్పు లిసిఱేంతలు వాఱెడుచూపు(గుంచియం
ద్రిప్పి తళుక్కునం దెఱచి తిన్ననిమోమున( గాయువెన్నెలల్
ముప్పిరిగొన్న వేడుకలు మూ(గిన సిగ్గసియాడ( బ్రీతి నీ
వప్పరమేశు( జూచి తను వర్ధము గొంటి పొసంగ నంబికా!

చ. బెడ(గగు రత్నదర్పణము బేరినవెన్నెల పోసి నిచ్చలుం
దుడువక పాలసంద్రమున( దోచి సుధాకరుమేనికందు పో(
గడుగక నేరెటేట సితకంజము ముంపక నైజకాంతి యై
తొడరిన( దల్లి! నీమొగముతో సరిపోల్ప(గ( జాలు నంబికా!

ఉ. కూడెడి వెంౘుకల్ నిడుదకూఁకటిఁ బ్రోవఁగ బొడ్డుపై వళుల్
జాడలు దోఁపఁ గ్రొమ్మొలకచన్నులు మించు దొలంక సిగ్గునం
జూడఁగ నేరముల్ మెఱుఁగుఁజూపుఁ నీన హిమాద్రియింట నీ
వాడుట శూలికిన్ మనము వాడుట గాదె తలంప నంబికా!

౪. మ ద న వి జ య ము

ఈ క్రింది పద్యములు రెండును మదనవిజయములోని నని శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు త్రిపురాంతకోదాహరణపీఠికలో నుదాహరించిరి.

క. సతి గుణవతి యగునేనియుఁ
బతి కది రత్నంబ ప్రాణబంధువ యమృతం;
బతివయ దుర్గుణి యగునేఁ
బతి కెడపని చిచ్చు కాలుపక యది కాల్చున్.

మ. గుణమున్ సుందరరూపమున్ విభవముం గూటంబు సౌభాగ్యల
క్షణముం జారుచరిత్రమున్ వినయమున్ జాతుర్యమున్ ధర్మభూ
షణముం గల్గి పతివ్రతామహిమ మించన్ గల్గెనేఁ దత్సతీ
మణి చింతామణి, దానిఁ దాల్పఁ గలుగన్ మర్త్యుంటె ధన్యుండిలన్.

# శరభాంక కవి

శతకకర్తయు, లింగధారియు నగు నీకవి రెండవ ప్రతాపరుద్రచక్రవర్తి కాలమున ౧౪వ శతాబ్దమున నుండెనని తెలియుచున్నది. కాని శతకమును బట్టి చూచినచో నిది అంతకంటె నవీనముగాఁ దోఁచుచున్నదఁట! ఇందు భాషాదోషములు, లోపములును చాల కలవు.

ఇందలి పద్యములను లింగమగుంట తిమ్మకవి తన 'సులక్షణసారము' న నుదాహరించెను. ఎడపాటి యెఱ్ఱన, రాజలింగకవి యితనిని స్తుతించి యున్నారు.

# కమలనాభామాత్యుఁడు

శ్రీనాథకవి సార్వభౌముఁడు తన తాత యగు కమలనాభామాత్యుఁడు గొప్ప విద్వత్కవి యని తెల్పియున్నాఁడు. ఇతఁడు క్రాల్పట్టణాధీశ్వరుఁడఁట పద్మపురాణకర్త. ఆ గ్రంథమిపుడు లభించలేదు. ఇతఁడు ద్వితీయ ప్రతాప రుద్రుని కాలమున నుండినవాఁడు కావున క్రీ. శ. 1295 – 1326 నడువ నుండవచ్చును. ఇతని మనుమఁడగు శ్రీనాథుఁడు క్రీ.శ. ౧౩౮౦ ప్రాంతమున జన్మించి యుండవచ్చునని 'ఆంధ్రకవి తరంగిణి' కారుల యాశయము.

# వినుకొండ వల్లభరాయఁడు

ఈ కవి నియోగిబ్రాహ్మణుఁడు; విశ్వామిత్రగోత్రుఁడు; తిప్పనార్య పుత్రుఁడు. ఇతఁడు క్రీడాభిరామ మనుపేర దశరూపకములలో నొకటి యయిన వీధినాటకమును దెనుఁగున రచించెను తెలుఁగున దృశ్యకావ్యమును రచించుటలో నీతఁడే మొదటివాఁడుగాఁ గనఁబడుచున్నాఁడు. తా నీ క్రీడాభిరామమును సంస్కృతమున రావిపాటి తిప్పన్నచే రచియింపఁబడిన ప్రేమాభిరామము ననుసరించి చేసినట్టు కవియే ప్రస్తావనలోఁ జెప్పుకొని యున్నాఁడు. ఇతఁ డెంతవఱకు మూలగ్రంథము ననుసరించెనో యెంతవఱకు స్వకపోలకల్పితముగా విరచించెనో తెలియరాదు. క్రీడాభిరామమునందలి వర్ణనము లనేకములు. కవి స్వకపోలకల్పితములుగాఁ జేసిన వనియే తోఁచుచున్నది. ఈ రూపకముయొక్క ముఖ్యరంగ మోరుఁగల్లు ఇది కాకతీయచక్రవర్తులకు రాజధానిగా నుండెను. ఈ రాజ్యమును పాలించిన కాకతీయ చక్రవర్తులలోఁ గడపటివాఁడు ౧౨౯౬ వ సంవత్సరము మొదలుకొని ౧౩౨౩ వ సంవత్సరము వఱకును రాజ్యపాలనముచేసి మహమ్మదీయులచేఁ బట్టుబడి ప్రభుత్వమును గోలుపోయిన ద్వితీయ ప్రతాపరుద్రుఁడు. ఈ క్రీడాభిరామము ౧౪౨౦ వ సంవత్సర ప్రాంతమునందు రచియింపఁబడెను. ఈ కాలమునందు శ్రీనాథుఁడు కర్ణాటకదేశమునకుఁ బోయి వల్లభామాత్యుని సందర్శించి వల్లభాభ్యుదయమును * రచియించి యుండుటచేతను, క్రీడాభిరామములోని

* [శ్రీనాథుఁడు 'వల్లభాభ్యుదయము' అను గ్రంథమును రచించెనని కొందఱందురు. కాని యాగ్రంథము లభింపనందున దాని కర్తృత్వమును గూర్చి గాని, యందలి విషయమును గూర్చి గాని యేమియు నిశ్చయింప సాధ్యము కాదు. ఇందు వినుకొండ వల్లభరాయని చరిత్ర మున్నదని చెప్పుటకుఁ దగిన యాధారములు లేవు. శ్రీకాకుళమునందలి వల్లభదేవుని మాహాత్మ్యమును తెలుపు వల్లభాభ్యుదయ మొకటి భట్లపెనుమర్తి కోదండకవి కృతము కలదు.]

"కందుకకేళి సల్పెడు ప్రకారమునన్" అను పద్యమును "కుసుమం బద్దిన చీరకొంగు వాలయున్" అను పద్యమును శ్రీనాథుని వీధినాటకములోని వని యప్పకవి యుదాహరించి యుండుటచేతను, క్రీడాభిరామములోని "గార్గ్య సిద్ధాంతమతముష:కాలకలన" "శకున మూనుట యిది బృహస్పతిమతంబు" "వ్యాసమతము మన:ప్రసాదాతిశయము" "విప్రజనవాక్య మరయంగ విష్ణు మతము" అను ౬౫వ పద్యమునందలి ప్రథమ ద్వితీయ చతుర్థపాదములు శ్రీనాథుఁ డిటీవల రచియించిన భీమేశ్వరపురాణ తృతీయాశ్వాసములో "గార్గ్యసిద్ధాంతమత ముష:కాలకలన, శకున మూనుటయది బృహస్పతి మతంబు, విప్రజనవాక్య మరయంగ విష్ణుమతము, సర్వసిద్ధాంత మతమభిజిత్తు సమ్మత మగు" అను ౪౧వ పద్యమునఁ బ్రథమ ద్వితీయ తృతీయపాద ములుగా నుండుటచేతను, కొందఱు శ్రీనాథుఁడే క్రీడాభిరామమును రచించి దాని కర్తృత్వమును వల్లభరాయని కారోపించె నని చెప్పుదురు. కాని యిది సిద్ధాంతము చేయుటకుఁ దగిన యాధారములు లేవియుఁ గానరావు. అప్పకవికిఁ బూర్వమునం దున్నవారును వల్లభరాయనికిఁ జేరువకాలమునం దున్నవా రగుటచేత నాతనింగూర్చి యెక్కుడుగా దెలియఁదగినవారును నైన చిత్రకవి పెద్దన్న, ముద్దరాజు రామన్న, శ్రీధరుఁడు మొదలైన లక్షణగ్రంథకర్త లందఱును బూర్వోక్త పద్యద్వయమును వల్లభరాయని వనియె తమతమ లక్షణగ్రంథములయం దుదాహరించి యుండఁగా వల్లభరాయని కిన్నూఱు సంవత్సరముల వెనుక నుండిన యప్పకవి యవి శ్రీనాథుని వనుట యజ్ఞాన మూలముఁ గాక తెలిసి చెప్పుటయెఁ గాదు. వల్లభరాయని దర్శింపఁ బోయినప్పు డతఁడు క్రీడాభిరామమును రచించుచుండఁగాఁ జూచి యుండుట చేతనో, తత్పద్యరచనమునం దాతనికిఁ దోడుపడి యుండుటచేతనో శ్రీనాథుఁడు తాను తరువాత రచించిన భీమఖండమునందు సంస్కృతశ్లోకమును దెలిఁగించుచు "గార్గ్యసిద్ధాంతమత" మన్న పద్యములోఁ గొంతభాగమట్లే వేసి యుండవచ్చును. అంతమాత్రముచేఁ బుస్తక మంతయు శ్రీనాథ విరచిత మనుట యతిసాహసము. [క్రీడాభిరామము వినుకొండ వల్లభరాయ కృతమని శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు, శ్రీ వేమూరి - విశ్వనాథశర్మ

గారు, శ్రీ బండారు - తమ్మయ్యగారు, శ్రీ ఉకుమళ్ల - అచ్యుతరావుగారు మున్నగువా రభిప్రాయపడినారు. శ్రీ వేటూరి - ప్రభాకరశాస్త్రిగారు, శ్రీ కిళాంబి-రాఘవాచార్యులుగారు, శ్రీ చాగంటి - శేషయ్యగారు మున్నగువా రిది శ్రీనాథకృతమే యని విశ్వసించుచున్నారు.

ఇయ్యది శ్రీనాథకృతమే యని వివరించుచు శ్రీ ప్రభాకరశాస్త్రిగారు 'క్రీడాభిరామము' (శృంగార గ్రంథమాల) పీఠికలో వ్రాసిన కొన్ని వాక్యములు ఇచట నీయఁబడుచున్నవి.

"సులక్షణసారము, అప్పకవీయము, లక్షణదీపిక, సర్వలక్షణ సారసంగ్రహము మొదలగు లక్షణ గ్రంథములందు శ్రీనాథుని వీథినాటకము లోనివిగా నుదాహృతములయిన పద్యములీ క్రీడాభిరామమునఁ గలవు. శ్రీనాథుఁడే యీ గ్రంథమును రచించి వల్లభరాయని పేరుపెట్టఁగా గ్రంథమున వేఱు పేరున్నను, రంగనాథ రామాయణాదులవలె నీగ్రంథము కూడఁ గర్తయగు శ్రీనాథుని పేరనే లోకమునఁ బ్రచారముగాంచి యుండుటచే నప్పకవ్యాదు లట్లు చెప్పి యుండవలెను. అప్పకవ్యాదు లుదాహరించిన పద్యములు క్రీడాభిరామమున నానుపూర్వితో నున్నవి, ప్రక్షిప్తము లనఁ గుదురదు. వల్లభరాయఁడును, శ్రీనాథుఁడును సమకాలమువారు గాకపోవుదురేని, శ్రీనాథుఁ డాతని పేర గ్రంథము రచించుట యసంభవమగును. అట్టి చిక్కులేదు. శ్రీనాథుఁడును, వల్లభరాయఁడును సమకాలమువారు. వల్లభరాయని పెద్ద తండ్రి యగు లింగనమంత్రి విద్యానగరపు హరిహరరాయల మంత్రి రెండవ మూఁడవ హరిహరరాయండ్రు క్రీ. శ. 1402, 1412 వఱకు నుండిరి. లింగ మంత్రి వారిలో నెవరియొద్ద మంత్రియయి యుండినను వల్లభరాయఁడు మన శ్రీనాథుని సమకాలమువాఁడే యగును..... ... ...మఱియు నీ గ్రంథమున వల్లభరాయని వాగ్వైభవ దాతృత్వాది వర్ణనము మితిమీఱి యున్నది. గ్రంథకర్తయే తానగుచో వల్లభరాయఁ డట్లా కందపద్యాష్టకమును రచించుకొని యుండఁడు. ఆ పద్యములు భీమఖండాదులలోని కృత్యవతరణికా పద్యముల పోలిక గలిగియున్నవి .. ... ....మఱియుఁ గృత్యవసాన పద్య

మునఁ 'గాలభైరవుఁడు కవీంద్రకాంక్షిత త్రిదశ మహీరుహమగు వల్లభ రాయనికి సమగ్ర వైభవాభ్యుదయములు కృపసేయు' నని యాశీర్వచన మున్నది. సూత్రధారోక్తిగాను, భరతోక్తిగాను నయినను గ్రంథకర్తయగు వాఁ డిట్లు చెప్పుకొనుట సరసముగాదు ఇది తానే తుమ్ముకొని, తానే శతా యుష్మని యనుకొనునట్లున్నది కవీంద్ర కాంక్షిత త్రిదశ మహీరుహము గావున వల్లభరాఁయడు విశేషధన మొసఁగి కవి యశఃకాంక్షియై యేతత్కృతి కర్తృత్వమును దనపై వేయించు కొన్నాఁడని తలఁచుట ప్రమాణదూరము కాదు. అట్టి సంప్రదాయముగూడ నాకాలమున హెచ్చుగాఁగలదు శ్రీనాథ కవి యనేక స్థలముల నిందుఁదన తక్కిన గ్రంథముల రచనములను జేర్చెను. ఆపోలిక లీగ్రంధము శ్రీనాథ కృతమేయని చెప్పకచెప్పుచున్నవి? [క్రీడాభిరామము-ఉపోద్ఘాతము-పుటలు 9-12]

క్రీడాభిరామ మనెడి యీ వీధిరూపకము పురబాహ్యాంతరప్రదేశములయందు విహరించుచు నోరుగంటినివాసు లైన గోవిందమంచనశర్మ యను బ్రాహ్మణ శిఖామణియు నాతని చెలికాఁడైన టిట్టిభసెట్టి యను వైశ్యవిటగ్రామణి ము నొండొరులతోఁ దాము చూచుచు వచ్చిన వివిధవినోదములనుఁగూర్చి చేసిన సంభాషణరూపమున నున్నది. కవి యేతద్రూపకప్రస్తావనలోఁ దన తాత తాత యైన చంద్రామాత్యుఁడు బుక్కరాజుమంత్రిగా నుండిన ట్లీ క్రింది పద్యమునఁ జెప్పెను

శా. 'కర్ణాటక్షితినాథుఁ డైన పెదబుక్కక్ష్మాపదేవేంద్రున
ర్థ్యర్ణామాత్యుని దానఖేచరునిఁ జంద్రాధీశు బంధుప్రియుం
వర్ణించుం గవికోటి శంకరజటావాటీకటాంతర్నదీ
స్వర్ణద్యంబుతరంగరింఖణలసత్సాహిత్యసౌహిత్యయై'.

ఈ ప్రస్తావనలోనే కవి తన పినతాత యైన లింగమంత్రి ౧౩౭౭ వ సంవ త్సరము మొదలుకొని రాజ్యపాలనము చేసిన హరిహరభూపాలుల కొలువులో నుండిన ట్లీ పద్యమునఁ దెలిపెను

మ. 'కనకాద్రిప్రతిమానధైర్యనిధి లింగక్ష్మాపమంత్రీంద్రుతో
ననతారాతినృపాలమంత్రిజనతాహంకారతారాహిమా
ర్కునితో రూపరతీంద్రుతో హరిహరక్షోణీంద్రసామ్రాజ్యవ
ర్ధనుతో సాటి సమాన మీఁడు గలరా రాజన్యసైన్యాధిపుల్'.

పినతాత మాత్రమే కాక కవి తండ్రి యైన తిప్పన్న యనఁబడెడు త్రిపు రాంతకుఁడు కూడ హరిహరరాయల కొలువులోనే యుండి యాతనిరత్న భాండారాధికారి యైనట్లు ప్రస్తావనలో యీ పద్యమునఁ జెప్పఁబడెను.

సీ. సత్యవ్రతాచారసత్కీర్తిగరిమలఁ
 జంద్రుతోడను హరిశ్చంద్రుతోడ
నభిమానవిస్ఫూర్తి నైశ్వర్యమహిమను
 రారాజుతోడ దేరాజుతోడ
సౌభాగ్యవైభవజ్ఞానసంపదలను
 మారుతోడ సనత్కుమారుతోడ
లాలిత్యనిరుపమశ్లాఘావిభూతుల
 భద్రుతోడను రామభద్రుతోడ
సాటి యనఁదగు ధారుణీపాలసభల
వీరహరిహరరాయపృథ్వీశశత్ర
రత్నభండారసాధికార ప్రగల్భ
మల్లికార్జునత్రిపురారిమంత్రివరుని

హరిహరరాయ రత్నభాండారాధ్యక్షుఁడును వినుకొండదుర్గపాలకుఁడు నైన గ్రంథకర్త వల్లభరాయఁడు ములికినాట మూఁడు గ్రామగ్రాసములతో మోపూరు పాలించుట మొదలైన విషయము లీ పద్యములలో నభివర్ణింపఁ బడినవి.

ఉ. గంధవతీప్రతీరపురఘస్మరపాదవిప్రసూనవ
ష్పంధయచక్రవర్తి శ్రితపర్వతదుర్గమహాప్రధానరా
ట్గంధగజంబు తిప్పన యఖండసుధీనిధి గాంచెఁ బుత్త్రులన్
బాంధవకల్పవృక్షముల బైచనవల్లభమల్లమంత్రులన్.

సీ. మూఁడుగ్రామంగ్రాసములతోడఁ గూడంగ
మోపూరు పాలించె ముల్కినాట
నాశ్వలాయనశాఖయందు ఋగ్వేదంబు
కరతలామలకంబుగాఁ బఠించెఁ
బ్రత్యక్ష మొనరించి భైరవస్వామిచేఁ
సిద్ధసారస్వతశ్రీ వరించెఁ
గామకాయనసవిశ్వామిత్రగోత్రంబు
వంశగోత్రంబుగా వార్తకెక్కె
నెవ్వఁ డా త్రిపురాంతకాధీశ్వరునకు
రాయనవరత్నభండారరక్షకునకుఁ
బ్రియతనూజుండు చంద్రమాంబికకు సుతుఁడు
మనుజమాత్రుండె వల్లభామాత్యవరుఁడు.

క. అహరవధిసమయనృత్య
త్తుహినాంశుధరప్రచారధూతాభ్రధునీ
లహరీభ్రమఘుమఘుమములు
వహిఁ దిప్పయవల్లభన్నవాగ్వైభవముల్.

శా. సాహాచారమునన్ వివేకసరణిన్ సౌభాగ్యభాగ్యంబులన్
ధౌరంధర్యమునన్ బ్రతాపగరిమన్ దానంబునన్ సజ్జనా
ధారుం దిప్పనమంత్రి వల్లభు నమాత్యగ్రామణిం బోల్పఁగా
వేరీ మంత్రులు సింధువేష్టితమహోర్వీచక్రవాళంబునన్?

వల్లభరాయఁడు ౧౪౦౪ వ సంవత్సరమువఱకును కర్ణాటకరాజ్యపరిపాలనము చేసిన హరిహరరాయల రత్నభాండారాధ్యక్షుఁ డయిన తిప్పన పుత్రుఁ డగుటచేత నా సంవత్సరమున కనంతరమున నుండె ననుటకు సందేహము లేదు. అందుచేత నీ క్రీడాభిరామము ౧౪౨౦ వ సంవత్సర ప్రాంతము

నందు రచియింపఁబడె నని నిరాక్షేపముగాఁ జెప్పవచ్చును. ఈ వల్లభరాయనికవిత్వము మృదుమధురపదగుంభనము కలదయి ప్రౌఢముగా నున్నది. కాని కొన్ని చోట్లఁ గ్రీడాభిరామములోని వర్ణనము లసభ్యము లయి యశ్లీలము లయి నీతిబాహ్యము లయి యుండుటచేత స్త్రీలును, సామాన్య జనులును జదువఁదగినది కాదు జారత్వము దూష్యముగాఁ బరిగణింపఁబడక శ్లాఘ్యముగా నెంచఁబడెడు కాలమునందుఁ జేయఁబడిన గ్రంథము విషయమయి మనము కాలమును నిందింపవలసినదే కాని కవిని గర్హింప వలసిన పనిలేదు. ఈ కవియే ప్రస్తావనయందుఁ దన తాతను నాతని తమ్ములను వర్ణించుచు "వారవధూజనపుష్పభల్లు" లని వారికిఁ బ్రతిష్ఠావహమైన విశేషణము నీ క్రింది పద్యమునఁ గూర్చెను.

ఉ. మల్లనమంత్రికిం ద్రిపురమాతరళాక్షికిఁ గాంతి రోహిణీ
వల్లభు లాత్మసంభవులు వల్లభలింగనతిప్పనక్షమా
వల్లభమంత్రిశేఖరులు వారవధూజనపుష్పభల్లు లు
త్ఫుల్లయశోవిభాసితులు పుణ్యులు సింగనభైరవేంద్రులున్.

ఇఁక నీ విషయము నింతటితోఁ జాలించి వినువారి వీనుల కింపుగా నుండు పద్యములను గొన్నిఁటిని క్రీడాభిరామములోనివాని నుదాహరించుచు నీ చరిత్రమును ముగించుచున్నాను.

గీ. జనని సంస్కృతంబు సకలభాషలకును
దేశభాషలందుఁ దెలుఁగు లెస్స;
జగతిఁ దల్లికంటె సౌభాగ్యసంపద
మెచ్చు టాఁడుబిడ్డ మేలు గాదె?

మ. ద్రుతతాళంబున వీరగుంభితకధుంధుంధుం కిటాత్కారసం
గతి వాయింపుచు నాంతరాళికయతి గ్రామాభిరామంబుగా
యతిగూడం ద్విపద ప్రబంధమున వీరానీకముం బాడె నౌ
క్కృత * ప్రత్యేకముగాఁ గుమారకులు ఫీట్కారంబునం దూలఁగన్.

* [ప్రత్యక్షరమున్-అని సరియైన పాఠము.]

మ. ఉడువీధిన్ శిఖరావలంబి యగు నాంధ్రోర్వీశు మోసాలపై
గడియారంబున మ్రోసె రెండెనిమిదుల్ ఘంటాఘణత్కారముల్
సడలెన్ భానుఁడు పశ్చిమంబునకు వైశ్యా! పూటకూటింటికిన్
గుడువం బోదమె లెక్క యిచ్చి? కడు నాఁకొన్నార మిప్పట్టునన్

ఉ. కప్పురభోగివంటకము కమ్మని గోధుమపిండివంటయున్
గుప్పెడు పంచదారయును గ్రొత్తగఁ యావునే పెస
ర్పప్పును గొమ్మునల్లనఁటిపండ్లును నాలుగునైదు నంజులున్
లప్పలతోడఁ గ్రొంబెరుగు లక్ష్మణవజ్ఝులయింట రూకకున్.

శా. ద్వీపాంతరంబుననుండి వచ్చితివె భూదేవ! ప్రశాంతం మహా
పాపం సర్వజగత్ప్రసిద్ధసుమనోబాణాసనామ్నాయవి
ద్యోపాధ్యాయి ప్రతాపరుద్రధరణీశోపాత్తగోష్ఠీప్రతి
ష్ఠాపారీణ నెఱుంగ వయ్యెదవె మాచల్దేవి వారాంగనన్?

చ. ఉభయము భావవీధి జయ మొందిన భంగి భయం బొకింత లే
కభిముఖ మయ్యె వెన్వెనుకనై యట గొన్ని పదంబు లేగుచున్
రభసముతో దువాళిగొని ప్రగ్గునఁ దాకెడు చూడు సెట్టి టి
ట్టిభ! దిధిధీయనంగను గడింది యుదగ్రభము లీయురగ్రభముల్

చ. వెనుకకు మొగ్గవ్రాలి కడువిన్నను వొప్పఁగఁ దొట్టిసేళ్ళలో
మునిఁగి తదంతరస్థ మగు ముంగర ముక్కునఁ గ్రుచ్చుకొంచు లే
చెను రసనా ప్రవాళమున శీఘ్రము గ్రుచ్చెను నల్లపూసపే
రనుపమలీల నిప్పుడుచుపాయము లిట్టివి యెట్లు నెర్చెనో!

ఉ. ప్రక్కలు వంచు వంచి మునిపండ్లును బండ్లును రాచు రాచి తా
మ్మక్కలఁ జేయుఁ జేపి తన యల్లనఁ గాళలసందుసందిలో
చక్కికి నొక్కు నొక్కి యిరచంబడ గుమ్మడిమూట గట్టి పీఁ
పెక్కు దువాళిచేసి చలి యిక్కడ నక్కడఁ బెట్టు వేకువన్.

సీ. హా కుమారస్వామియౌపవాహ్యములార!
హా మంత్రిదేవతాస్వాములార!
హా కాలవిజ్ఞానపాకకోవిదులార!
హా భూతభుక్తికుంభార్హులార!
హా యహల్యాజారయతనహేతువులార!
హా బలాత్కారకామాంధులార!
హా నితంతుశకుహాహాంకారనిధులార!
హా కామవిజయకాహళములార!
హా ఖగేంద్రదంబులార! కత్యమున నీల్గి
పోవుచున్నారె? దేవతాభువనమునకు
మీరు రంభాతిలోత్తమామేనకాది
భోగకార్యార్థమై కోడిపుంజులార!

# శ్రీనాథుఁడు

శ్రీనాథుఁ డను కవి శైవుఁ డైన పాఁకనాటి నియోగిబ్రాహ్మణుఁడు; భారద్వాజగోత్రుఁడు; ఆపస్తంబసూత్రుఁడు. ఇతని తండ్రి మారయ; తల్లి భీమాంబ; తాత కమలనాభుఁడు. కమలనాభకవి పద్మపురాణసంగ్రహమును జేసిన ట్లీ కవి భీమఖండములోని యీ క్రింది పద్యముచేతఁ జెప్పుచున్నాఁడు.

మ. 'కనకక్ష్మాధరధీరు వారిధితటీక్రాల్పట్టణాధీశ్వరున్
ఘనునిం బద్మపురాణసంగ్రహకళాకావ్యప్రబంధాధిపున్
వినమత్కాకతిసార్వభౌముఁ గవితావిద్యాధరుం గొల్తు నా
యనుఁగుందాతఁ బ్రదాత శ్రీకమలనాభామాత్యచూడామణిన్'.

శ్రీనాథుఁడు పాకనాటివాఁ డగుటచేతను, తాత సముద్రతీరపట్టణమున కధికారి యయి యుండుటచేతను, నెల్లూరిసీమలోని యేదో సముద్రతీరగ్రామనివాసి యయి యుండును. క్రాల్పట్టణ మేదో క్రొత్తపట్టణము. ఒకవేళ నిజముగానే క్రొత్తపట్టణ మయి యుండవచ్చును. క్రాల్పట్టణము ప్రకాశించు పట్టణము. క్రొత్తది ప్రకాశించును గనుక క్రొత్తపట్టణ మనవచ్చును. 'వినమత్కాకతిసార్వభౌము' నని చెప్పుట చేతఁ గమలనాభామాత్యుఁడు ౧౩-౦౦ వ సంవత్సరప్రాంతమున కాకతి ప్రతాపరుద్రసార్వభౌముని కాలములో క్రాల్పట్టణమునకు కరణముగా నుండి యుండును.

[శ్రీనాథుఁడు కర్ణాటకుఁడనియు, అతనితాత నివాసస్థానము పశ్చిమ సముద్రతీరమునఁ గల పట్టణములలో నొకటియై యుండుననియుఁ గొందఱి యభిప్రాయము 'శ్రీనాథుని కూరిమిసేయు మఱఁది' నని దగ్గుబల్లి - దుగ్గన చెప్పుటచే శ్రీనాథుఁడు కర్ణాటుఁ డనుట పొసఁగదు. కాల్పట్టమే కాలపట్టణమనియు, అది నల్లని పట్టణము-అనఁగా కృష్ణపట్టణమనియు, అది నెల్లూరు చేరువ నున్నదనియు శ్రీ చిలుకూరి-వీరభద్రరావుగారి యాశయము. కాల్పట్టణము - క్రాల్పట్టణమై - అదియే క్రొత్తపట్టణ మనుట సరికాదనియు,

క్రొత్తపట్టణ మేర్పడి యింకను రెండువందల యేండ్లయినను కాలేదనియు శ్రీ ప్రభాకరశాస్త్రిగారు తెల్పియున్నారు. ఆయన మతమున మచిలీపట్టణమున కుఁ దూర్పున సముద్రతీరమునఁ గల కాశీపట్టణమే కాల్పట్టణము; ఆ గ్రామము ప్రాచీన ప్రాభవమును సూచించుచున్నదఁట! శ్రీ కొమర్రాజు - వేంకటలక్ష్మణరావుగారు ఒక శాసనమునందు 'కలుపట్టణము' అను పేరు చూచి శ్రీనాథుని కాల్పట్టణ మదియే యని నిర్ణయించిరి. ఆకలుపట్టణము నేఁడు కలపటమను పేర నున్నది. అదియు కాశీపట్టణపు దరిదాఁపుననే గల దఁట; శ్రీనాథుఁడు పేర్కొనిన గ్రామ మిదియైనను గావచ్చును. ఈ యంశములు శ్రీ ప్రభాకరశాస్త్రిగారి 'శృంగార శ్రీనాథము' నఁదెల్పఁబడినవి. శ్రీనాథుని నివాసము 'నెల్లూ' రని శ్రీ నేలటూరి - వేంకటరమణయ్యగారును, రేపల్లె తాలూకాలోని 'నల్లూ' రని శ్రీ చాగంటి-శేషయ్యగారును అభిప్రాయ పడుచున్నారు.]

కమలనాభునిఁ గాక యీ కవి భీమఖండమునందు నన్నయభట్టారకుని తిక్కనసోమయాజిని మాత్రమే యీ క్రింది పద్యములతో స్తుతించి యున్నాఁడు.

క. నెట్టుకొని కొలుతు నన్నయ
భట్టోపాధ్యాయసార్వభౌమునిఁ గవితా
పట్టాభిషిక్తు భారత
ఘట్టోల్లంఘనపటిష్ఠగాఢప్రతిభున్.

ఉ. పంచమవేదమై పరఁగు భారతసంహిత యాంధ్రభాషఁ గా
వించెఁ బదేనుపర్వములు విశ్వజగద్ధితబుద్ధి నెవ్వఁ డ
క్కాంచనగర్భతుల్యున కఖండితభక్తి నమస్కరింతు ని
ర్వంచితకీర్తివైభవవిరాజికిఁ దిక్కనసోమయాజికిన్.

కవిత్రయములో నెఱ్ఱాప్రెగడ యప్పటి కాధునికుఁ డగుటచేత నాతని నీగ్రంథమునందుఁ బొగడకపోయినను తాను రచియించిన యితర గ్రంథ ములయం దీకవి యాతనిని పేర్కొన్నాఁడు.

శ్రీనాథుఁడు కవిత్రయమునకుఁ దరువాత మిక్కిలి ప్రసిద్ధుఁడైన కవి. ఇతనికి ప్రౌఢదేవరాయలు కవిసార్వభౌమబిరుద మిచ్చినట్లు శ్రీనాథవిరచితమైన యీ క్రింది చాటుపద్యమువలనఁ దెలియవచ్చుచున్నది.

సీ. దీనారటంకాలఁ దీర్థ మాడించితి
 దక్షిణాధీశు ముత్యాలశాల
పలుకుతోడై తాంధ్రభాషామహాకావ్య
 నైషధగ్రంథసందర్భమునకుఁ
బగులఁగొట్టించి తుద్భటవివాదప్రౌఢి
 గౌడడిండిమభట్టుకంచుఢక్క
చంద్రశేఖరక్రియాశక్తిరాయలయొద్దఁ
 బాదుకొల్పితి సార్వభౌమబిరుద

మెటులు మెప్పించెదో నన్ను నింకమీఁద
రావుసింగమహీపాలు ధీవిశాలు
నిండుకొలువున నెలకొనియుండి నీవు
సరససద్గుణనికురుంబ శారదాంబ.

శ్రీనాథకవి యీ కాలమునం దిప్పటి వేంకటగిరిసంస్థానాధిపతులకుఁ బూర్వుఁడయి గోలకొండసీమలోని మెతుకు సంస్థానమున కధీశ్వరుఁడయి యుండిన సింగమనాయని సందర్శింపఁబోయినప్పు డా రాజు తన్నేమి తప్పు పట్టునో యన్న భీతిచేతఁ దనకుఁ బరాభవము కలుగకుండఁ జేయు మని సరస్వతిని బ్రార్థించెను. పయి పద్యమునందుఁ బేర్కొనఁబడిన సింగభూపాలుఁడు మహావిద్వాంసుడు; అందుచేత నతఁడు సర్వజ్ఞ సింగమనీఁడు (నాయుఁడు) అని వ్యవహరింపఁబడుచు వచ్చెను; ఇతఁడు వేంకటగిరిసంస్థానమునకు మూలపురుషుఁ డయిన భేతాళనాయఁడను నామాంతరము గల చేవిరెడ్డికిఁ బదవ తరమువాఁడు. ఈ ప్రభువు సంస్కృతమున చమత్కారచంద్రికయను నలంకారశాస్త్రమును జేసెనందురు. దీనికి సింగభూపాలీయ మని నామాంత

రము కలదఁట * ఈ కవి సర్వజ్ఞసింగమనాయుని జూఁడబోవుటచేత నితఁడు పదునేనవ శతాబ్దారంభమున నున్నట్లు తేటఁబడుచున్నది. శ్రీనాథుఁడును, బమ్మెర పోతరాజును సర్వజ్ఞసింగమనాయని యాస్థానకవీశ్వరు లయినట్లు వేంకటగిరి సంస్థానవంశచరిత్రమునందు వ్రాయబడి యున్నది. కావి యీ కవు లిద్దఱును సింగభూపాలుని కాలమువారే యైనను వీరిలో నెవ్వరు నా యాస్థానకవీశ్వరులు కారు. వీరొక సారియో రెండు సారులో తదాస్థానమున కుఁబోయి వారిపైఁ బద్యములను జెప్పి తమ కవిత్వ ప్రౌఢిమను జూపి రాజువలన బహుమానములను బొందిరి. శ్రీనాథుఁడు రెడ్ల యాస్థానకవీశ్వరుఁడు. ఈతఁ డించుమించుగాఁ దానుచేసిన గ్రంథముల నన్నిఁటిని రెడ్లకో వారి మంత్రులకో కృతి యిచ్చియున్నాఁడు ఇతఁడు రాజమహేంద్రపురమునఁ జిరకాల ముండినను కొండవీటిసీమయందుఁ బుట్టినవాఁ డని తోఁచుచున్నది ఈతనికి రెడ్లకవీశ్వరుఁ డని ప్రసిద్ధి. ఈతఁడు కొండవీటి రెడ్లకడను, రాజమహేంద్రవరపురెడ్లకడను గూడ కవీశ్వరుఁ డయి యుండి యున్నందున నీతని చరిత్రము వివరముగాఁ దెలియుటకై రెడ్లచరిత్రము నిచ్చట సంక్షేపించి చెప్పుట యనావశ్యకము కాఁజాలదు.

అనుమకొండయందు సామాన్యకర్షకుఁ డైన దొంతి యల్లాడరెడ్డి యను పంటకాపు ధర్మచింత గలవాఁ డొకఁ డుండె ననియు, ఆతనియింటి కొక నాఁటిరాత్రి కోమటి యొకఁడు వేమన యనువాఁడు రాఁగా నాతని నాదరించి కోమటియింట భోజనము పెట్టించి తనయింటఁ బరుండఁ దావిచ్చె. అతఁడు శయనించినప్పు డతనిమూటలో స్పర్శవేది యుండుట గ్రహించి దాని నపహరించి, దానిమూలమున మహాధనికుఁ డయ్యెననియు, చెప్పెడి కథ యొకటి గలదు. ఈ కథయే యింకొక విధముగాఁ గూడఁ జెప్పఁబడు

---

* [సంస్కృతమున 'చమత్కార చంద్రిక' యను నలంకార శాస్త్ర గ్రంథమును రచించినవాఁడు సింగభూపాలుని యాస్థాన విద్వాంసుఁడగు విశ్వేశ్వర పండితుఁడు; కాని సింగభూపాలుఁడు కాఁడు. దీనికి సింగభూపాలీయమను నామాంతరము లేదు. సింగభూపాలుఁడు రచించిన 'రసార్ణవసుధాకరము' అను నాట్యాలంకార గ్రంథమునకే ఆ నామాంతరము కలదు.]

చున్నది. వేమన యను వైశ్యుఁ డొకఁడు శ్రీశైలయాత్రకుఁ బోయె ననియు, అతఁ డచ్చటి మల్లికార్జునాలయమున కుత్తరమున నున్న యరణ్యములో నితరలోహములను బంగారముగా మార్పఁగల యోషధివిశేషము లున్నట్టు కనిపెట్టి యా మందుచెట్ల యాకులపసరును రెండు కుండలనిండ నింపి వానిని గొని స్వగ్రామమునకుఁ బోవుచు మార్గమధ్యమున నొకనాటి సాయంకాల మనుమకొండఁ జేరి యా రాత్రి వసించుటకు దొంతి యల్లాడ రెడ్డియింటికిఁ బోయెననియు, ధర్మాత్ముఁ డైన యా రెడ్డి యాతనివస్తువులను తన నేద్యపుపనిముట్లున్నపాకలోఁ బెట్టనియమించి భోజనార్థమయి యా కోమటిని కోమటియింటికిఁ బంపెననియు, అతఁడు భోజనముచేసి మరల వచ్చులోపల రెడ్డి తన పనిముట్లను సరిచూచుకొనుటకయి యా పాకలోనికిఁ బోయి యందు తన నాఁగలియొక్క కఱుకోల యొకటి బంగారమువలె తళతళలాడుచుండుట చూచి యాశ్చర్యపడి చేరువకుఁ బోయి కోమటి తెచ్చుకొన్న కుండలలోని పసరొకింత దానిపైని బడుట చూచి దాని ప్రభావమువలన నా యినుపకోల సువర్ణమయి యుండునని యూహించి దానినిజమును పరీక్షించుటకై సమీపమున నున్న గడ్డపాఱ నొకదానిని గొనివచ్చి దాని నా పసరుకుండలో ముంపఁగా నదియు బంగార మయ్యె ననియు, అది చూచి సంతోషించి యా రెడ్డి పసరుతో నిండి యున్న యా రెండు కుండలను దన యింటిలోఁ బెట్టుకొని యా పాకకు నిప్పంటించె ననియు, ఇంతలోఁ గోమటి భోజనము చేసి వచ్చి యాకాశము నంటుచున్న మంటలతో బగబగ మండుచున్న యా పాకను జూచి దానిలోఁ దన పసరుకుండలు రెండును మండి పోయె నని భావించి దుఃఖించి ప్రాణమున కంటెను ధన మెక్కువగా భావించెడి యా వైశ్యశిఖామణి విత్తము పోయినతరువాతఁ దన బ్రతు కెందుకని తానును మిన్నంటి మండుచుండిన యా జ్వాలలోఁబడి ప్రాణములు విడిచెననియు, తరువాత నా కోమటి వేమయ్య పిశాచమయి యల్లాడ రెడ్డికుటుంబమును బట్టుకొని యాతనికిఁ బుట్టిన బిడ్డల నెల్లఁ జంపుచు వచ్చె ననియు, దాని కా రెడ్డి దుఃఖితుఁడయి మ్రొక్కుకొనఁగా నా కోమటి స్వప్నములో నాతనికిఁ గనఁబడి తన పేరు పెట్టినయెడల ముందు పుట్టఁ

బోయెడు కుమారుఁడు బ్రతుకు ననియు, వంశమువారికిఁ దనపేరు పెట్టుచు వచ్చినయెడల వారు మహాధనవంతులును, ప్రభువులు నయి భువనమునఁ బ్రఖ్యాతిఁగాంతు రనియు, తన మూలమున వచ్చిన ధనములో సగము ధర్మార్థముగా నుపయోగింప వలసిన దనియు చెప్పెనఁట ! అల్లాడరెడ్డి దాని కొప్పుకొని తరువాతఁ బుట్టిన తన కొమారునకు తండ్రిపేరితోఁజేర్చి కోమటి ప్రోలయ (వేమన) యని పేరు పెట్టెను. అతఁడు చిరకాలము జీవించి మహాధనికుఁ డయి తన పంటకులపురెడ్లలో వన్నె వాసి గాంచి తన ధనమును త్యాగభోగముల యందు సద్వినియోగము చేయుచు వచ్చెను. ఈ కోమటి ప్రోలయయే కొండవీటి పంటరెడ్ల వంశమునకు మూలపురుషుఁ డయ్యెను. ఆతని పుత్రులు మహాశూరు లయి ప్రతాపరుద్రునియొద్ద దండనాథు లయిరి. అల్లాడరెడ్డియింటిపేరు దొంతివా రనియు, దేసటివా రనియు కూడ నుండి యుండును. ఈతఁడు కోమటియొక్క కుండలదొంతిని సంగ్రహించుట దొంతివాఁ డయ్యెనని యొక కథ గలదు. ఈ యల్లాడరెడ్డి మిక్కిలి పాటుపడువాఁడయి విశేషధనము నార్జించి ప్రసిద్ధికెక్కి యుండును.

ఆతని కంత ధనము వచ్చినందుకుఁ గారణముగాఁ దరువాత నీకథ కల్పింపఁ బడి యుండును. కథయెట్టిదయినను ప్రోలయరెడ్డికిని నాతనిసంతతివారికిని కోమటియనియు, వేమన యనియు, నామములు వచ్చుట కేదో కారణ ముండి యుండవలెను. అల్లాడరెడ్డి స్పర్శవేదియను మందుపసరును గాక పోయినను కోమటిధనము నపహరించి యాతఁడుఁ పిశాచమయి పట్టెనన్న భీతిచేతఁ దన కుమారునికిని, సంతతివారికిని కోమటి వేమన యనుపేరు లుంచి యుండవచ్చును.

## ౧. కోమటి ప్రోలయవేమారెడ్డి

రెడ్డిరాజ్యమును స్థాపించినవాఁడు కోమటిప్రోలయ ద్వితీయ పుత్త్రుఁ డయిన వేమారెడ్డి, కోమటిప్రోలయ కూడ దండనాథుఁడుగా నుండె నని చెప్పుదురు గాని యాతనికాలములో రెడ్లకు రాజ్య మేదియు లేదు. కోమటిప్రోలయకు మాచారెడ్డి, వేమారెడ్డి, దొడ్డారెడ్డి, అన్నారెడ్డి, మల్లారెడ్డి అని యేవురు

పుత్రులు. వీరిలో రెండవవాఁడయిన ప్రోలయవేమారెడ్డి మహాపరాక్రమ శాలియయి పరాక్రమవంతుఁడుగా నుండి యాతని యవసాన కాలమున ౧౪౨౦-వ సంవత్సర ప్రాంతమున యవనులతోడఁ బోరాడి తురుష్కులు చేకొన్న రాజ్యమును గొంత వారినుండి మరల బలాత్కార ముగాఁ గైకొని రెడ్డిరాజ్యమును స్థాపించెను. ఈ విషయ మొక శాసనములో నీ క్రింది శ్లోకములయందుఁ జెప్పఁబడినది.

> శ్లో. ఉద్ధృత్య భూమిం యవనాబ్ధిమగ్నాం
> సంస్థాపయంతం ప్రకృతో త్తమార్యాః
> సాక్షాత్కరో మానుష దేవభాజా
> మహావరాహం పరికీర్తయంతి.
> శ్రీశైలగంగాతటసీమ్ని రమ్యాం
> సోపానవీధీం వదధేనవేమః
> యా దివ్యతి స్వర్గ మనోద్యతానాం
> నిశ్రేణి రివ ప్రథితా నరాణాం.

పయి శ్లోకములలో నీ వేమభూపాలుఁడు శ్రీశైలములోని పాతాళగంగకు సోపానములు కట్టించినట్లు కూడ చెప్పబడియున్నది. ఇతఁడు బంధుజనాను రాగము గలవాఁడయి తన బంధువులను, తమ్ములను కొడుకులను తన క్రింది యధికారులనుగాను, దండనాథులను గాను నియమించి వారికిఁ దాను జయించినదేశములలోఁ గొన్నిప్రదేశము లిచ్చి యద్దంకి రాజధానిగాఁ బ్రజా పరిపాలనము చేయుచుండెను. ఈ యంశమును హరివంశములోని యీ క్రింది పద్యము తెలుపుచున్నది.

> గీ. తనకు నద్దంకి తగు రాజధానిగాఁ బ
> రాక్రమంబున బహుభూము లాక్రమించి
> యనుజతనుజబాంధవమిత్రజనముల కిచ్చె
> నెవ్వరే యెవ్వారు వేమమహీశ్వరునకు.

వేమభూపాలుఁ డనుజులకే బహుభూము లిచ్చె నన్నప్పు డగ్రజుఁడైన మాచన్న కిచ్చినట్లు వేఱుగఁ జెప్ప నక్కఱయే లేదు. అతని కొకచిన్న సంస్థాన మిచ్చి దాని కతనిని విభునిగాఁ జేసెను. "ఆదిరాజన్యతుల్యాచారవిధ మాచవిభుఁడు పూజ్యుం డను విశ్రుతియును" అను హరివంశపద్య మీ యంశమును సూచించుచున్నది. తనకు రాజ్యమే లేనియెడల మాచన్న విభుఁ డగుటయు, నాదిరాజన్యతుల్యాచారుఁ డగుటయు సంభవింపవు గదా! మాచన్న రా జయినట్టు ఫిరంగిపురశాసనములోని యీక్రింది శ్లోకమువల నను దెలియవచ్చుచున్నది.

శ్లో. మాచక్షోణిపతి ర్మహేంద్రవిభవో వేమక్షితీశాగ్రజో
హేమాద్రే స్సదృశో బభూవసుగుణై స్తస్య త్రయో నందనాః

ఒక కుమారునకు దండ్రిపేరు పెట్టుట మనలో సాధారణమైన యాచారము. అందుచేత మాచనయు వేమనయు తమ పుత్రులలో నొక్కరికిఁ గోమటి యని పేరు పెట్టిరి. ఈ యిద్దఱు కోమటిరెడ్లకును భేదము తెలియుటకయి మాచన్నకొడుకు పెదకోమటి యనఁబడుచుండెను. కోమటి గాక ప్రోలయవేమారెడ్డికి ననపోతుఁ డనియు, ననవేముఁ డనియు మఱి యిద్దఱు పుత్రులు కూడఁ గలిగిరి. ఎఱ్ఱాప్రెగడ హరివంశము రచించు నాఁటి కనవేమారెడ్డి మిక్కిలి పసివాఁడు; కోమటిరెడ్డి మృతుఁ డయ్యెను. తండ్రికాలములోనే యనపోతారెడ్డి దండనాథుఁ డయినట్టు హరివంశములోని యీ క్రిందిపద్యమునఁ జెప్పఁబడెను.

శా. వేమాఖ్యాధిపుకూర్మిపుత్త్రుఁడు దయావిభ్రాజి యవ్యాజతే
జోమార్తాండుఁడు కీర్తనీయగుణసంస్తోమంబులం దేమియుకా
ధామస్ఫూర్తికి లొచ్చుగాక సరియై రాజిల్లె రాజార్చితుం
డాముష్యాయణుఁ డెందుఁ బోతయచమూపాగ్రేసరుం డిమ్మహిన్.

హరివంశమునందే యీతని పెదతండ్రికుమారుఁ డయిన కోమటిరెడ్డి యిట్లు వర్ణింపఁబడెను.

క. దానంబునఁ గర్ణునిసరి
మానంబున పేర్మి ననుపమానుఁడు బుధస
న్మానచతురుండు మాచయ
సూనుఁడు కోమటి సమస్తసులభుఁడు కరుణన్.

కోమటి ప్రోలయవేమునియొద్ద నాంధ్రకవిత్రయములోఁ గడపటివాఁడైన యెఱ్ఱాప్రెగడ యాస్థానకవీశ్వరుఁడుగా నుండి రామాయణమును, హరివంశమును నాతని కంకితముచేసెను. ప్రబంధపరమేశ్వరుఁడైన యెఱ్ఱాప్రెగడ హరివంశములోఁ గృతిపతియైన వేమారెడ్డి తల్లిదండ్రులను గూర్చి యిట్లు చెప్పెను.

చ. కులజలరాశిచంద్రుఁడగు కోమటిప్రోలనయు న్నితంబినీ
తిలకము పుణ్యురాలు పతిదేవత యన్నమయుం గృతార్థతా
కలితులు ధీరు వేమవిభుఁ గానఁగఁ గాంచినపుణ్య మెద్ది యే
కొలఁదుల నెవ్వి జన్మములఁ గూర్చిరొనాఁ బొదలున్ జనస్తుతుల్.

ఈ ప్రోలయవేమనృపాలుఁడు ౧౩౨౦ మొదలుకొని ౧౩౫౦ వ సంవత్సరము వఱకును రాజ్యపాలనము చేసి కాలధర్మము నొందెను. వేముని యనంతరమున సవతి పుత్రుఁడు అనపోతారెడ్డి ౧౩౫౦ వ సంవత్సరమునందు రెడ్డిసామ్రాజ్యభారమును వహించెను. ఈప్రకారముగానే మాచన ప్రభువుయొక్క మరణానంతరమున నాని పుత్రుఁడు రెడ్డిపోతనృపాలుఁడును, తదనంతరమున పెద్దకోమటివేమారెడ్డియు తండ్రియొక్క చిన్నరాజ్యమునకు రాజు లయిరి

## ౨. అనపోతారెడ్డి

ఇతఁడు ౧౩౫౦ వ సంవత్సరము మొదలుకొని ౧౩౬౪ వ సంవత్సరము వఱకును రాజ్యపాలనము చేసెను. ఈతని తోడఁబుట్టిన పడుచైన దొడ్డాంబికభర్త కాటయరెడ్డియు, ఆమె చెల్లెలు వేమాంబిక భర్త నాకయరెడ్డియు, మంత్రి దండనాయకు లయి తనకు మహో

సహాయులయి యసహాయశూరులయి రాజతంత్రము నడుపుచుండఁగా పండ్రెండు సంవత్సరములు సత్పరిపాలనము చేసి సముద్రవ్యాపారమున కత్యంతప్రోత్సాహము కలిగించి యనపోతభూపాలుఁడు స్వర్గస్థుఁడయ్యెను. కుమారగిరిరెడ్డి యీతనికుమారుఁడు; మల్లాంబ యీతని కొమరిత. ఈ మల్లాంబిక యనపోతారెడ్డి మేనల్లుఁడయిన కాటయవేమారెడ్డికి భార్య యయ్యెను.

## ౩. అనవేమారెడ్డి

అనపోతారెడ్డి యనంతరమున నాతని తమ్ముఁడు అనవేమారెడ్డి రాజ య్యెను. అనపోతారెడ్డివలెనే యీతని పెదతండ్రికొడుకు పెదకోమటిరెడ్డి కూడ మఱికొంతకాలమునకు లోకాంతరగతుఁ డయినందున ననవేమారెడ్డి రాజ్యకాలములోనే యతనికొడుకు వేమన తండ్రిరాజ్యమునకు వచ్చెను. అనవేమారెడ్డికి మామిడి పెద్దనామాత్యుఁడును, వేమారెడ్డికి పెద్దనామాత్యుని తమ్ముఁడు నామామాత్యుఁడును మంత్రులయినట్టు శృంగారనైషధమునం దీ క్రింది పద్యములలోఁ జెప్పఁబడినది.

> మ. అనతారాతివసుంధరారమణసప్తాంగోపహార క్రియా
> ఘనసంరంభవిజృంభమాణపటుదోఃఖర్జూద్వితీయార్జునుం
> డనవేమాధిపు రాజ్యభారభరణవ్యాపారదక్షుండు పె
> ద్దనమంత్రీశుఁడు మామిడన్నసుతుఁ డేతన్మాత్రుఁడే చెప్పఁ గన్.

> శా. స్వామిద్రోహరగండలాంఛనునకున్ సంగ్రామగాండీవికిన్
> వేమక్ష్మాపతికార్యభారకలనావిఖ్యాతధీశక్తికిన్
> నామామాత్యున కన్యరాజనిటలాంతర్న్యస్తభాగ్యాక్షర
> స్తోమాపాకరణప్రవీణునకు మంత్రు ల్సాటియే యెవ్వరున్?

ఇందు మొదటి పద్యమునం 'దనవేమ' యని యున్నది; రెండవ పద్యము నందు 'వేమ' యని యున్నది. 'అనవేమ' యన్న దంతయు నేకనామధేయ

ములోనిదే గాన శాసనములయందుఁ గాని పద్యములయందుఁ గాని యెక్కడ ననవేమునిఁ బేర్కొనవలసి వచ్చినను పూర్ణముగా ననవేమ యనియే చెప్పుదురుగాని వేమ యని చెప్పరు. వేమయ లనేకు లున్నచో భేదము తెలియుటకయి పోలయవేమ, కోమటివేమ, కాటయవేమ, అల్లయవేమ అని తండ్రిపేరితోఁ జేర్చికూడఁ జెప్పుదురు. ఈ రెండవ పద్యమునందుఁజెప్పఁబడినవేమన కోమటివేమన యనుటకు సందేహము లేదు. ఆకాలమునందు రెడ్డిరాజులలో ఇఱు ఇవమనలు లేరు.

రెడ్డిరాజులలో అనవేమభూపాలుఁడు మిక్కిలి ప్రసిద్ధి చెందిన వాఁడు. ఈతఁడు చేసిన విశేషదానధర్మములచేతను పండితసమ్మానము చేతను నీతనికీర్తిప్రసిద్ధి వచ్చినది. ఇతఁడు సంస్కృతాంధ్రములయందు, మంచి పాండిత్యము గల రసజ్ఞుఁడు. వెన్నెలకంటిసూరన చేసిన విష్ణుపురాణములోని యీక్రిందిపద్య మీతని కీర్తి యెట్టిదో తెలుపుడుచేయును,

క. తనబ్రతుకు భూమిసురులకుఁ
దన బిరుదులు పంటవంశధరణీశులకున్
దన నయము భూమిప్రజలకు
ననవేమన యిచ్చెఁ గీర్తి నధికుం డగుచున్.

అనవేముఁడు తన రాజధానిని తనపూర్వులకు రాజధాని యయి యుండిన యద్దంకినుండి కొండవీటిదుర్గమునకు మార్చినట్టు పూర్వోదాహృతశాసనములోని యీ శ్లోకములు తెలుపుచున్నవి.

శ్లో. తతోఽన్న వేమనృపతిః పరిపాలనకర్మణి
అపాలయ త్తస్య పుత్ర స్తదం తేంద్రవసుంధరా
కొండవీడుం రాజధానిం సతిచిత్రా మకల్పయత్
దృష్ట్వా త్వష్టాపి చిత్ర్య మభూ ద్యస్యా స్సవిస్మయః.

అనవేమమహీపాలునికి పుత్రసంతతి లేదు. ఒక్కకొమారితమాత్రముండెను. ఆమె భక్తినళ్వర చోళ్ళపాలపుత్రుఁ డైన భీమన్నపాలునకు భార్య;

యయ్యెను. అనవేమభూపాలునిగూర్చి కవులు చెప్పిన పద్యములలో శ్రీటూరి ప్రభాకరశాస్త్రిగారి చాటుపద్యమణిమంజరియం దుదాహరించినవాని విందు క్రిందఁ బొందుపఱుచుచున్నాను.

క. 'కవితాకన్యకు నలుగురు
కవి జనకుఁడు భట్టు దాది గణుతింపంగా
నవరసరసికుఁడె పెనిమిటి
యవిశ్వకియె తోడఁబుట్టు వనవేమనృపా!

క. కొంచెపుజగములలోపల
నంచితముఁగ నీదుకీర్తి యనవేమనృపా!
మించెను గరి ముకురంబునఁ
బంచాక్షరిలోన శివుఁడు బలసినభంగిన్.

గీ. పందికొమ్మెక్కి పెనుబాముపడగ లెక్కి
మేటితామేటివీఁ పెక్కి మెట్ట లెక్కి
విసివి విశ్వసారి యన మవిభునిఁ జేరి
రాణివాసంబుగతి మించె రత్నగర్భ.

క. రాకున్నఁ బిలువఁడేనియు
రాకకు ముద మంది చేర రమ్మనఁడేనిన్
అఁకొన్న నీయఁడేనియు
నాకొలు వటు కాల్పవలయు ననవేమనృపా!

శ్లో. అనవేమమహీపాల!
స్వస్త్యస్తు తవబాహవే
ఆహవే రిపుదోర్దండ
చంద్రమండలరాహవే.

ఒకానొకనియోగిబ్రాహ్మణకవి యీ శ్లోకము ననవేమమహీపాలుని పైని జెప్పి చదువఁగా నతఁడు సంతోషించి యాతని మూఁడువేల సువర్ణములు

పారితోషిక మొసఁగఁ బోయెనఁట! కవి వానిని స్వీకరింపక 'నేను నాలుగువే లియ్యఁగా మీరు మూఁడువేలే యిచ్చెదరా?' యనెనఁట! నాలుగువే లనఁగా తాను సమర్పించిన శ్లోకములో నున్న నాలుగు 'వే' యను నక్షరములని కవియభిప్రాయము. అప్పుడు రాజు నాలుగువేలే యిచ్చెద ననెనఁట! దానిపైని కవి 'నే నిచ్చినవే నా కిచ్చెదరా?' యనెనఁట! 'అట్లయిన నయిదువే లిచ్చెద' నని రాజు పలికెనఁట! 'నే నాఱు వేలవాఁడను; నన్ను తక్కువపఱిచెదరా?' యని కవి వచించెనఁట. తక్కువపఱుపక 'యాఱువేలే యిచ్చెద' నని రా జనెనఁట! అందుకు కవి 'నేను పుట్టువుచేతనే యాఱువేలవాఁడనే! యిందధిక మేమున్న?' దని యడిగెనఁట! అధికము కావలసినచో రా 'జేడువేల నిచ్చెద' ననెనఁట! కవి 'యది రోదనసంఖ్య; మంచిది కా' దనెనఁట. రా జా కవి వాక్చాతుర్యమునకు మెచ్చి యెనిమిదివే లిచ్చి సంతోషపెట్టి యాతనిని బంపివేసెనఁట! ఇది వట్టికల్పనకథయే యైనను, అనవేమనృపాలుఁడు కవిత్వాభిమానము గలవాఁ డనియు మహోదాత యనియు బోధించుచున్నది.

అనవేముఁడు ౧౩౬౨ మొదలుకొని ౧౩౮౩ వ సంవత్సరమువఱకును ప్రజానురంజకుఁ డయి పరిపాలనము చేసి పరమపదము నొందినతరువాత సీతనియన్న యైన యనపోతారెడ్డికుమారుఁడు కుమారగిరి రాజ్యమునకు వచ్చెను.

## ౪. కుమారగిరిరెడ్డి

ఇతఁడు ౧౩౮౩-వ సంవత్సరమునకుఁ దరువాత పినతండ్రి యనంతరమున సింహాసనమునకు వచ్చెను. ఈతనికాలములోనే శ్రీనాథకవి బైలుదేఱి రాజాస్థానకవి కాకపోయినను రాజమంత్రులకును తదితరాధికారపదస్థులకును కృతు లియ్య నారంభించెను. కుమారగిరిపెదతాత మనుమఁడైన వేమారెడ్డియొక్క ప్రథమమంత్రి నామనామాత్యుఁడు మృతినొందినతరువాత నాతని యన్న కుమారుఁడు మామిడిసింగన్న కోమటివేమునకు మంత్రి యయ్యెను. ఈ

సింగన్న యనవేమునిమంత్రియైన పెద్దనామాత్యుని కనిష్ఠపుత్రుఁడు. శ్రీనాథుఁడు మొట్టమొదట సింగన్నయన్న యైన ప్రెగ్గడన్నకును తరువాత సింగన్నకును, అటుతరువాత కుమారగిరి కడపటిదినములలో వాతవిసుగంధ భాండారాధ్యక్షుఁడైన యవచితిప్పయ్యసెట్టికివి కృతు లొసఁగెను. తిప్పయ్య సెట్టికి గృతి యిచ్చిన హరవిలాసములో నీ క్రిందిపద్య మున్నది.

చ. హరిహరరాయ ఫెరోజిసహాసురధాణగజాధిపాదిభూ
వరులు విజప్రభావ మభివర్ణన సేయఁ గుమారగిర్యధీ
శ్వరుని వసంతవైభవము సర్వము నొక్కఁడ నిర్వహించు మా
తిరుమలనాథ సెట్టికిని ధీగుణశెట్టికి నెవ్వ రీఁడగున్ ?'

పైని పేర్కొనఁబడిన హరిహరరాయలు ద్వితీయహరిహరరాయలు; అతఁడు ౧౩౭౭ మొదలుకొని ౧౪౦౪ వ సంవత్సరమువఱకును రాజ్యపాలనము చేసెను. అందుచేత నతఁడు కుమారగిరిరాజ్యకాలమున కేవల నాలు సంవత్సరములు నావల నాలుగు సంవత్సరములు రాజ్యముచేసెను. రెండవవాఁ డయిన ఫెరోజిసహా ౧౩౯౭ మొదలు ౧౪౨౨-వ సంవత్స రమువఱకును భూపాలనము చేసెను. అందుచేత నితఁడు కుమారగిరిరెడ్డి యొక్క రాజ్యాంతకాలములో మూఁడు సంవత్సరములుమాత్రమే రాజ్య భారము వహించియుండెను. అందుచేత హరవిలాసము ౧౩౯౭-౧౪౦౦ సంవత్సరముల మధ్యమున రచియింపఁబడి యుండవలెను. కొమరగిరి విద్యా వంతుఁడు; ప్రజాపరిపాలనముకంటె వసంతోత్సవాది వినోదములయం దెక్కువ యాసక్తిగలవాఁడు. ఇఁతడు తన రాజ్యనిర్వహణభారము నంతను తనమేనత్తకుమారుఁడును, మఱియు విద్వాంసుఁడును సమర్థుఁడును మంత్రియునైన కాటయవేమారెడ్డియం దుంచి తాను నిర్విచారుఁడయి యుండెను. ఇతఁడు తనచెల్లెలైన మల్లాంబయం దత్యంత ప్రేమకలవాఁ డగుటచేత రాజమహేంద్రవరరాజ్యము నామె కరణముగా నామెభర్తయుఁ దన కాప్తమంత్రియుఁ బ్రాణమిత్రుఁడునైన కాటయవేమారెడ్డికి ౧౩౮౬ వ సంవత్సరమునం దిచ్చివేసెను. ఇతఁడు ౧౪౦౦ వ సంవత్సరమువఱకును రాజ్యపాలనము చేసి పరలోకగతుఁడు కాఁగా సంతానహీనుఁడైన యీతని

కొండవీటిరాజ్యముకూడ నీతని పెత్తాత మనుమఁడైన పెద్దకోమటిరెడ్డి యధీన మయ్యెను. కొందఱు కొమరగిరిరెడ్డి కొక కొమారుఁడు గలఁడనియు, ఉన్నను కోమటివేముఁడు కొండవీటిరాజ్యమును బలవంతముగా నక్రమముగా నాక్రమించుకొనెననియుఁ జెప్పుదురు.

## ౫. పెదకోమటి వేముఁడు

కొమరగిరిరెడ్డిమరణానంతరమున ౧౪౦౦ వ సంవత్సరమునందు కోమటి వేమారెడ్డి కొండవీటిరాజ్యభారమును వహించినవాఁ డయి యంతటితోఁ దృప్తి నొంది యుండక రాజమహేంద్రవరరాజ్యమునుగూడ సంపాదింపవలెనని బహుసేనలతోఁ బలుమాఱు దండువెడలి కాటయవేమారెడ్డితో ఘోర యుద్ధములు చేసి విజయము నొందఁజాలక కాటయవేమారెడ్డిచేతను, నాతని దండనాధుఁ డయిన యల్లాడరెడ్డిచేతను పరాభూతుఁడయి, భగ్నమనోరథుఁడయి వెనుకకు మరలవలసినవాఁ డయ్యెను. ఈ యుద్ధములవలన లాభ మేమియుఁ గలుగకపోవుటయే కాక బంధురాజులైన కాటయవేమాదులతో బలవద్విరోధమును కొండవీటిరాజ్యమునకు దౌర్బల్యమును మాత్రము సంప్రాప్త మయ్యెను. కోమటివేముఁడు కొండవీటిరాజ్యమునకు వచ్చిన తరువాత శ్రీనాధునిఁ దన యాస్థానమునందు విద్యాధికారినిగా నియమించెను గాని, యతఁడేమియు రాజుపేర గ్రంథములు చేసినట్టు కనఁబడదు. కోమటి వేముఁడు రచించినట్లు చెప్పఁబడెడి యమరుకవ్యాఖ్యాన మైన శృంగారదీపికను శ్రీనాథుఁడే రచియించి దానికి రాజుపేరు పెట్టెనని చెప్పుదురు. * ఇది గాక యభినవభట్టబాణుఁ డనఁబరఁగిన వామనభట్టు వీరనారాయణ చరిత్ర మను నామాంతరము గల వేమభూపాలచరిత్రమును సంస్కృతమున వచన కావ్యముగా రచించి దానిలోఁ గోమటివేముని సర్వజ్ఞచక్రవర్తినిగాను, వేమునిపూర్వులను గొప్పచక్రవర్తులనుగాను పొగడెను. ఈ కోమటి వేమునిభార్య యైన సూరమాంబ సంతానసాగర మను తటాకమును

---

* దీని రచనలో నితఁడు శ్రీనాథుని సాహాయ్యమును పొందియుండవచ్చునని తొందటి యాశయము.

౧౪౧౦ వ సంవత్సరమునందు త్రవ్వింపఁగా దరువాత నామె కుమారుఁడు రాచవేముఁడు దానికి నీరు వచ్చుటకయి జగనొబ్బగండ నామము గల కాలువ నొకదానిని ౧౪౧౬ వ సంవత్సరమునందు త్రవ్వించెను. పెద కోమటివేమారెడ్డి ౧౪౨౦ వ సంవత్సరమువఱకును రాజ్యపాలనము చేసి యిహలోకయాత్రను చాలించెను.

## ౬. రాచ వేముఁడు

కోమటివేముని యనంతరమున నాత నిపుత్రుఁడు రాచవేముఁడు రాజ్యము నకు వచ్చి యేదో విధముగా రాజ్యపాలనము చేసి ౧౪౨౪ వ సంవత్సరము నందు దేహము త్యజించెను. ఇతఁడు దుష్పరిపాలనముచేత జనకంటకుఁ డయినందున నీతని భృత్యులలో నొకఁ డీతనిని పొడిచి చంపె నని చెప్పు దురు. ఈతనితండ్రికాలములోనే కొండవీటిరాజ్యము దుర్బల మయినందున నీతఁ డెట్లో నాలుగు సంవత్సరములు రాజ్యతంత్రము నతృప్తికరముగా నీడ్చుకొని రాఁగా తదనంతరమున రాజ్య మన్యాక్రాంతమయి తుదకు కర్ణాటులపా లయ్యెను. ఈతనితో కొండవీటిరాజ్యమంతరించెను. ఇఁక మనము రెడ్డిరాజ్యములలో రెండవది యగు రాజమహేంద్రవరరాజ్యము నకు వత్తము.

## ౧. కాటయ వేముఁడు

కాటయవేమారెడ్డి యనపోతిభూపాలుని యల్లుఁడు; కొమరగిరిరెడ్డి చెల్లె లయిన మల్లాంబికభర్త కుమారగిరిరెడ్డి తనకు మఱఁదియు మంత్రియు నైన యీ కాటయవేమునికి ౧౩౮౬-వ సంవత్సరమునందు రాజమహేంద్ర వరరాజ్యము నిచ్చిన ట్టీవఱకే చెప్పఁబడెను గదా! ఇతఁ డప్పటినుండియు సమర్థతతో ప్రజాపరిపాలము చేయుచు, కొమరగిరిరెడ్డి మరణానంతరమున ౧౪౦౦-వ సంవత్సరప్రాంతమున కొండవీటి రాజ్యమునకు వచ్చిన కోమటి వేమారెడ్డి రాజమహేంద్రవర రాజ్యమపహరించుటకయి చేసిన కృషినంతను విఫలము చేసి, బహుయుద్ధములందు తన దండనాథుడును ననవేమారెడ్డి

మనుమరాలి భర్తయు నైన యల్లారెడ్డి సహాయుఁడుగా కోమటివేముని పరాజయము నొందించి యాతని సేనలను హతముచేసి రాజమహేంద్రవర రాజ్యమును నిరపాయముగా నిలుపుకొనెను. ఇతఁడు రణరంగములయందు మహావీరుఁ డగుటయే కాక సమరపాండిత్యమునకుఁ దోడు భాషాపాండిత్యమునుగూడఁ గలవాఁడయి కాళిదాసప్రణీతము లయిన శాకుంతలాది నాటకములకు సంస్కృతమున వ్యాఖ్యానములు రచించెను. ఈతనివలెనే యాతని బావ యగు కుమారగిరిరెడ్డియు సంస్కృతభాషాపాండిత్యముగల వాఁ డయి వసంతరాజీయ * మను కావ్యమును రచించెను. ఈవసంత రాజీయమునుండి కాటయవేముఁడు తన వ్యాఖ్యానములయందుఁ బ్రమాణవచనముల నెత్తి చూపెను. సంస్కృతమునందుమాత్రమే కాక యాంధ్రమునందు సహితము మంచి పాండిత్యముగలవాఁ డయి కవుల నాదరించి వారిచే శ్లాఘింపఁబడుచుండెను. ఈతనిని సంబోధించి యొక యాంధ్రకవి చెప్పిన పద్యము నొక దాని నిం దుదాహరించుచున్నాను—

క. వెలయాలు శిశువు నల్లుఁడు
నిలయేలిక యాచకుండు నేగురు ధరలోఁ
గలిమియు లేమియుఁ దలఁపరు
కలియుగమునఁ గీర్తికామ ! కాటయవేమా !

కాటయవేమారెడ్డి ౧౪౧౯ వ సంవత్సరప్రాంతమునఁ గాలధర్మమునొందెను. ఈతని జీవితకాలములోనే యాతని పుత్రుఁడును హరిహరరాయని యల్లుఁడు నైన కాటయరెడ్డి మరణము నొందెను. ఈ వివాహమునుగూర్చి యల్లాడరెడ్డి కోరుమిల్లి శాసనములో నిట్లున్నది.

శ్లో. పౌత్రిం కాటయవేమయక్షితిపతేః పుత్రం చ కాటప్రభోః
దౌహిత్రం చతురర్ణవీం హరిహరక్షోణీపతే శ్శాసితుః,
తన్నామ్నా విటతాహ్వయాం హరిహరాంబాం చారు మార్గాహయ
త్ప్రాణౌ వేమమహీశమల్లనృపతిసామ్రాజ్యలక్ష్మ్యా సమమ్.

* [వసంతరాజీయము నాట్యశాస్త్రముకాని కావ్యముకాదు. 'నామ్నా వసంత రాజీయం నాట్యశాస్త్రం యదద్భుతమ్.' ఇది లభించలేదు.]

మరణకాలమునకుఁ గాటయవేముని కనితల్లి యను కూఁతురును కుమార
గిరి యను చిన్నకుమారుఁడును నుండిరి [“పౌత్రీం కాటయవేమయ ...”
అను శ్లోకము సరిగా లేదనుచు నందలి విషయమునుగూర్చి శ్రీ ప్రభాకర
శాస్త్రిగారు శృంగార శ్రీనాథమున విపులముగాఁ జర్చించిరి. శ్లోకమును బట్టి
కాటయవేమునికిఁ గాటయ యను కుమారుఁడు కలఁడనియు, అతఁడు హరి
హరరాయల యల్లుఁడనియు, నా కాటయ కుమార్తె హరిహరాంబయనియుఁ
దెలియుచున్నది. హరిహరాంబ భర్త వీరభద్రారెడ్డి యన్నయగు వేమారెడ్డి
యగుట ప్రసిద్ధము. వీరభద్రారెడ్డి కాటయవేముని కుమార్తె యగునని
తల్లికి భర్త : కాఁగా, కాటయవేమారెడ్డి తన యల్లుని యన్నకుఁ దన పౌత్రి
నిచ్చి వివాహమొనర్చినట్లు తేలుచున్నది. ఇది యసంగతము. శాసనమున
‘పుత్రీం కాటయవేమయక్షితిపతేః పౌత్రీంచ కాటప్రభోః’ అని యుండ
వలెను. కాటయవేముఁడు తన కుమార్తెల నిద్దఱను, వేమవీరభద్రారెడ్ల
కిచ్చి పెండ్లిచేసెను అనితల్లి, హరిహరాంబ లొక్క తల్లి కడుపునఁ బుట్టిన
బిడ్డలు కానందున, వారి నన్నదమ్ముల కిచ్చి వివాహము చేయుట
తప్పుకాదు. ఇట్టి వివాహము లనేకములు జరుగుచున్నవి. రాజమహేంద్ర
వరరాజ్యమా యల్లుం డిర్వురకును జెందఁదగుననరాదు. కాటయవేమునకు
రాజ్యము పిత్ర్యముకాదు. భార్యయగు దొడ్డాంబికవలననే వచ్చినది కావున,
దొడ్డాంబ కుమార్తె యగు అనితల్లికిని, తద్ద్వారమున నామె భర్తకును
మాత్రమే సంక్రమించినది.

ఈ విషయము శృంగార శ్రీనాథమునఁ గలదు (చూ. పుటలు 286-289.)
‘ఆంధ్రకవి తరంగిణి’ కర్త పయి యాశయముతో నేకీభవించలేదు. వీరు
కాటయవేముఁడు హరిహరరాయల యల్లుఁడు కాఁడనుచున్నారు - వివాహ
మున, శ్లోకమునుబట్టి తెలియుచున్న వావులలో అసంగతములు లేవని వీరి
యభిప్రాయము. (ఐదవ సంపుటము. పుటలు 84-88 ]

## ౨. అల్లాడరెడ్డి

కాటయవేమారెడ్డి మరణము నొందఁగానే యిదే సమయమని రాజమహేం ద్రవరరాజ్యము నాక్రమించుకొనుటకయి కోమటివేముఁడు మరల సైన్య సన్నాహము చేసికొని దండువెడలెను. అల్లాడరెడ్డి తన సేనలతో నాతనిని మార్గమధ్యముననే యెదురుకొని రామేశ్వరమువద్ద ఘోరసంగ్రామము సలిపి యతని నోడించి సైన్యమును హతముచేసి కోమటివేమారెడ్డిని వెనుకకుఁ దఱిమివేసెను. ఈ విషయమయి కోరుమిల్లి శాసన మిట్లు చెప్పుచున్నది—

శ్లో. జిత్వానల్పవికల్పకల్పితబలం తం చాల్పఖానుం రణే
మిత్రీకృత్య సమాగతంగజపతిం కర్ణాటభూపం చ తమ్,
హత్వా కోమటివేమసైన్యనికరం భూయో౽పి రామేశ్వరాత్
రాజ్యం రాజమహేంద్ర రాజ్య మకరో దల్లాడభూమీశ్వరః.

అల్లాడరెడ్డి యిట్లు కోమటివేముని నపజయము నొందించి తఱిమివేసి, రాజ ద్రోహు లయిన యితరుల నడఁచివేసి, రాజమహేంద్రవరరాజ్యమును బాలుఁడైన కుమారగిరికి మామగాఁ గాఁబోలును ౧౪౧౬ వ సంవత్సరము నుండి తానే యేలసాగెను. అల్లాడభూపతి యనవేముని పుత్రికాపుత్రిక యైన వేమాంబను వివాహమఁ చేసికొనియె ననియు, ఆమెతండ్రి భీమరాజనియు, పయిని జెప్పిన యంశమును కోరుమిల్లి శాసనములోని యీ శ్లోకము స్థాపించుచున్నది—

శ్లో. శచీవ శక్రస్య శివేవ శంభోః
పద్మేవ సా పద్మవిలోచనస్య,
వేమాంబికా చోళకులేందుభీమ
భూపాత్మజాభూ న్మహిశాస్య జాయా.

అల్లాడభూపతికి వేమాంబవలన వేమారెడ్డి, వీరభద్రారెడ్డి, దొడ్డారెడ్డి అన్నారెడ్డి, అని నలుగురు కొడుకులు గలిగిరి అనితల్లి తమ్ముఁడును కాటయవేమారెడ్డి కొడుకును నయిన కొమరగిరిరెడ్డి యుక్తవయస్సు రాక

ముందే యల్లాడరెడ్డి రాజ్యము చేయుచుండఁగానే కాలగోచరుఁడై యుండును. ఈ కొమరగిరిరెడ్డి యక్కయయిన యనితల్లిని తన ద్వితీయపుత్త్రుఁడైన వీరభద్రారెడ్డికి వివాహము చేసి యల్లాడరెడ్డి కాటయవేమారెడ్డికి వియ్యంకుఁడయ్యెను. అల్లాడరెడ్డి యిట్లు ౧౪౨౬-వ సంవత్సరము వఱకును రాజ్యము చేసి తరువాత రాజమహేంద్రవరరాజ్యము ననితల్లి భర్త యైన వీరభద్రారెడ్డి వశము చేసెను. రాజమహేంద్రవరరాజ్యము నల్లాడరెడ్డి యేలినను, వీరభద్రారెడ్డి యేలినను, ఆతనియన్న యైన వేమారెడ్డి యేలినను, అందఱును ననితల్లి పక్షముననే యేలిరనుట స్పష్టము.

### ౩. అల్లాడవీరభద్రారెడ్డి

అల్లాడభూపతికి ద్వితీయపుత్త్రుఁడైన వీరభద్రారెడ్డి ౧౪౨౬ వ సంవత్సరమున రాజమహేంద్రవర రాజ్యసింహాసనము నధిష్ఠించి భూపరిపాలనము చేయ నారంభించెను. ఈతని రాజ్యకాలములో ౧౪౩౦-వ సంవత్సరప్రాంతమున శ్రీనాథుఁ డీతనిమంత్రి యైన బెండపూఁడి యన్నామాత్యునియొద్దఁ బ్రవేశించి, తరువాత వీరభద్రారెడ్డి యాస్థానకవియయి కాశీఖండము నాతని కంకితముఁజేసి, వీరభద్రారెడ్డి రాజ్యావసానమువఱకును నచ్చటనే యుండెను. రాజమహేంద్రవరరాజ్యము ౧౪౪౩-వ సంవత్సరముఁనాటికే విజయనగర రాజులపాలయినట్లా సంవత్సరమునందలి ప్రౌఢదేవరాయల ద్రాక్షారామ శాసనమును బట్టి తేటపడుచున్నది అందుచేత వీరభద్రారెడ్డి ౧౪౪౦-వ సంవత్సరప్రాంతములవఱకు రాజ్యపాలనము చేసినట్టు కనఁబడుచున్నది. వీరభద్రారెడ్డి శాసనములుగాని, అతని యన్నయైన వేమారెడ్డి శాసనములు గాని. ౧౪౩౭-౩౮-వ సంవత్సరమునకుఁ దరువాతఁ గానరావు. వీరభద్రారెడ్డితోనే రాజమహేంద్రవరరెడ్డి రాజ్య మంతరించినది.

ఇంతవఱకును తెనుఁగుదేశమును బరిపాలించిన రెడ్లచరిత్రమును సంక్షేపరూపమునఁ జెప్పితిని ఇఁక రెడ్ల కవీశ్వరుఁడైన శ్రీనాథుని చరిత్రమును గొంత వివరింపవలసి యున్నది అతని జన్మస్థల మేదో, అతఁ డే కాలమునం దుండినవాఁడో, ఏ యే దేశములను దిరిగెనో, ఏ యే పుస్తకముల

నెప్పు డెప్పుడు రచించెనో, ఆతని యంత్యదినము లెట్లు చెల్లినవో సాధ్యమైనంతవఱకుఁ జెప్ప బ్రయత్నించెదను.

శ్రీనాథుఁడు పాఁకనాటిసీమవాఁ డయినట్టు భీమఖండమును కృతి నందిన బెండపూడి యన్నయమంత్రి చెప్పిన ట్లున్న యీ క్రింది సీసమువలనఁ దెలియవచ్చుచున్నది.

'సీ. వినిపించినాఁడవు వేమభూపాలున
కఖిలపురాణవిద్యాగమములు
కల్పించినాఁడవు గాఢపాకం బైన
హర్షనైషధకావ్య మాంధ్రభాష
భాషించినాఁడవు బహుదేశబుధులతో
విద్యాపరీక్షణవేళలందు
పాకనాఁటింటివాఁడవు బాంధవుఁడవు
కమలనాభుని మనుమఁడ వఖిలమతివి
నాకుఁ గృపసేయు మొక ప్రబంధంబు నీవు
కలితగుణగణ్య ! శ్రీనాథకవివరేణ్య !

ఇప్పుడు పాఁకనాటిసీమ యే దని నిర్ణయింపవలసి యున్నది. భారతారణ్యపర్వశేషాంతమునం దెఱ్ఱాప్రెగడ తన వాసస్థానమగు కందుకూరి తాలూకాలోని గుడ్లూరును కూడ పాఁకనాఁటిసీమలోని దానినిగా నీ క్రిందిపద్యములలోఁ జెప్పి యున్నాఁడు:—

'సీ. భవ్యచరిత్రుఁ డాప స్తంబసూత్రుండు
శ్రీవత్సగోత్రుండు శివపదాబ్జ
సంతతధ్యానసంసక్తచిత్తుఁడు సూర
నార్యునకును బోతమాంబికకును
నందనుం డిలఁ బాఁకనాటిలో నీలకం
ఠేశ్వరస్థాన మై యెసక మెసఁగు
గుడ్లూరు నెలవుగ గుణగరిష్ఠత నొప్పు
ధన్యుఁడు ధర్మైకతత్పరాత్ముఁ

డెఱ్ఱనార్యుఁడు సకలలోకైకవిదితుఁ<br>
డైన నన్నయభట్ట మహాకవీంద్రు<br>
సరససారస్వతాంశప్రశస్తి దన్నుఁ<br>
జెందుటయు సాధుజనహర్ష సిద్ధి గోరి.

క. ధీరవిచారుఁడు తత్కవి<br>
తారీతియుఁ గొంత తోఁపఁ దద్రచనయకా<br>
నారణ్యపర్వశేషము<br>
పూరించెఁ గవీంద్రకర్ణపుటపేయముగాన్ ?

ఈ యిద్దఱి పద్యములను బట్టి చూడఁగా గుంటూరుమండలములోని కొండ వీడు మొదలుకొని నెల్లూరిమండలములోని కందుకూరువఱకు నున్న దేశము పాఁకనాఁ డని తోఁచుచున్నది,

ఇతఁడు * పాఁకనాటిసీమలోని నెల్లూరిమండలమునందలి యొక సముద్రతీర గ్రామమునందు పుట్టి పెరిగినవాఁడు. ఈ పితామహుఁడు కమలనాథుఁడు మంచి పండితుఁడు; కవీశ్వరుఁడు; తెనుఁగునఁ బద్మపురాణ సంగ్రహమును జేసెనఁట! ఈతని నివాసస్థానము సముద్రతీరమందలి ♦ క్రాల్పట్టణ మయినట్టు శ్రీనాథుఁడు భీమఖండములో నీ క్రింద పద్యమునందుఁ జెప్పి యున్నాఁడు.

---

* [పద్యములోని 'పాకనాఁటింటివాఁడవు' అను దానింబట్టి శ్రీనాథుఁడు పాకనాఁటి సీమలోని వాఁడని చెప్పవలను పడదనియు, అతఁడు పాకనాఁటి శాఖవఁ జెందిన నియోగియనుటలో నేయని ప్రమాణము కాఁగలదనియు, 'ఇంటివాఁడవు' అనుటం బట్టియే యీ యంశము స్పష్టమగుచున్నదని యొకఁ గొందఱి యభిప్రాయము. చాల మంది పండిత విమర్శకులు దీనినే యామోదించుచున్నారు.]

♦ ['వారిధితటీక్రాల్పట్టణాధీశ్వరున్' అనునెడ 'వారిధి తటీకాల్పట్టణాధీశ్వరున్' అను పాఠాంతరము కలదు, దానినే పలువు రంగీకరించిరి. ఈ 'కాల్పట్టణ' మేదో యింతవఱకును సరిగా నిశ్చయింపఁ బడలేదు. 'క్రొత్త పట్టణము' అనుటకు బదులుగా శ్రీనాథుఁడు 'క్రాల్పట్టణ' మని చెప్పియుండఁడనియు, 'క్రొత్త' ప

మ. కనకక్ష్మాధరధీరు వారిధితటీక్రాల్పట్టణాధీశ్వరుఁ
ఘనునిం బద్మపురాణసంగ్రహకళాకావ్యప్రబంధాధిపుఁ
వినమత్కాకతిసార్వభౌముఁ గవితావిద్యాధరుం గొల్తు నా
యనుఁగుందాతఁ బ్రదాత శ్రీ కమలనాభామాత్యచూడామణిఁ.

ఈకాల్పట్టణ మేదో తెలియదు; ఆప్రాంతములయందుఁ బ్రసిద్ధికెక్కిన మోటుపల్లి యను రేవుపట్టణ ముండెను గాని యది యిది కాదు. మోటుపల్లికి మొగడపల్లి యని నామాంతరము గలదు శాసనములయందీ రేవుపట్టణము ముకుళపుర మని వాడఁబడినది అనపోతరెడ్డికాలము నందలి యొక శాసనములోని యీ క్రింది శ్లోకములను జూడుఁడు —

శ్లో. ఆహితతమః, కృశాను ర్వేమభూపాలసూనుః
స్తుతకలితమహీశాన్నాన్నపోతక్షితీశః
శాకాబ్దే గగనాష్టసూర్యగణితే తీరే మహాంభోనిధేః
ప్రఖ్యాత మ్ముకుళాహ్వయే పురవరే శ్రీసోమమంత్రీకరః

అందుచేత క్రాల్పట్టణము మోటుపల్లి గాక వేఱొకసముద్రతీర గ్రామమయి యుండును. ఇది యేదియో నిర్ధారణ మగువఱకును క్రాలనఁగ్రొత్త యని యర్థము చేయవచ్చును గనుకను, కడను పట్టణశబ్దమున్నది గనుకను. క్రొత్తపట్టణమునుగా భావింతము. కమలనాభుఁ డీ క్రాల్పణట్టమునకు కరణము. (వినమత్కాకతిసార్వభౌము" నని పద్యములో నుండుటచేత నితఁడు బాల్యములో ౧౩౨౦-వ సంవత్సర ప్రాంతములయందు కాకతి

'క్రాలు' పర్యాయపదము కాదనియుఁ జాలమంది యభిప్రాయపడుచున్నారు. కృష్ణా మండలమునందలి 'కాళీపట్టణమే' కాల్పట్టణమై యుండునని యభిప్రాయ పడిరి. ఈ కాల్పట్టణము' కలపటమై యుండునని శ్రీ కొమర్రాజు వేంకట లక్ష్మణ రావుగారి యభిప్రాయము. గుంటూరుజిల్లా, రేపల్లె తాలూకాలోనున్న నల్లూరే (నల్ల + ఊరు = కాలపట్టణము-కాల్పట్టణము) శ్రీనాథుని నివాసమైన ట్లాంధ్రకవి తరంగిణి కర్తల యాశయము. [చూ. ఐదవ సంపుటము పుట. 6.] నెల్లూరు శ్రీనాథుని నివాసము కానగునని శ్రీ వేలటూరి వేంకటరమణయ్యగారి యాశయము. [చూ. భారతి - ఆంగీరస - మాఘసంచిక]

ప్రతాపరుద్రమహారాజులకాలములో నుండి యాతనిచే సమ్మానింపఁబడి యున్నవాఁ డనుటకు సందేహము లేదు. అతఁడా గ్రామకరణ మగుటచే నాతని పుత్రుఁడును శ్రీనాధునితండ్రియు నగు మారయయు నా గ్రామము నందే యుండి కరణీకపువృత్తిచేసి జీవనముచేయుచు నుండి యుండవచ్చును. శ్రీనాధుడు తన తాతను గూర్చియే కాని యే పుస్తకమునందును తండ్రిని గూర్చి యంతగాఁ జెప్పి యుండలేదు. అతఁ డొకవేళ నిజముగా పండిత పుత్రుఁడేయేమో ! తాతయే శ్రీనాథునికిఁ జిన్నప్పుడు విద్యయుఁ గవిత్వ మును నేర్పియుండును. భీమఖండకృతిపతి కమలనాభుని నెఱిఁగి యుండి నట్లు చెప్పుటచేత నతఁడు ౧౩౭౦-వ సంవత్సరమువఱకైన బ్రతికి యుండ వచ్చును. అప్పటికి శ్రీనాథునికి తప్పక పదునేను సంవత్సరములకు తక్కువకాని యీ డుండును. దానినిబట్టి శ్రీనాధుడు ౧౩౫౫-వ సంవత్సర ప్రాంతమున జనన మొంది యుండును. శ్రీనాధుఁడు తన పదునాఱవ సంవ త్సరప్రాంతముననే గ్రంథరచనమున కారంభించె ననుటకు సందేహములేదు.

"చిన్నారిపొన్నారిచిఱుతకూకటినాఁడు
రచియించితి మరుత్తరాట్చరిత్ర."

అను కాశీఖండములోని పద్య మీ యంశమునకు సాక్ష్యమిచ్చుచున్నది. కాఁబట్టి యీతఁ డీ మరుత్తరాట్చరిత్రమును పదునెనిమిదేండ్లలోపల నింటి కడ నున్నప్పుడే రచియించి యుండును. కాబట్టి మరుత్తరాట్చరిత్రము ౧౩౭౩-వ సంవత్సరప్రాంతమున రచించె నని చెప్పవచ్చును. నా కీ పుస్త కము లభింపనందున శైలి యెట్లున్నదో యందు వ్యాకరణాదిదోషము లేమయిన నుండినవో యది యెవ్వరికైన నంకితము చేయబడినదో లేదో చెప్పఁజాలను. ఈతఁడు చేసిన రెండవ గ్రంథము పల్నాటి వీరచరిత్రము నందలి బాలునికథ. ఇదియు నింటికడ నున్నప్పుడే స్వగ్రామమునందలి పల్నాటివీరుల కులమువారి ప్రోత్సాహముచేత నీతనిచేత. రచియింపఁబడి యుండును. ఈ పుస్తకరచనమువలన శ్రీనాధునకుఁ గొంత ధనలాభము

కలిగి యుండును పల్నాటివీరచరిత్రము ద్విపదకావ్యము. ఇది ౧౩౮౦-వ సంవత్సరప్రాంతములయందు రచియింపబడి యుండును. పల్నాటివీరుల చరిత్రద్విపద నోరుగంటిపురములో నాడినట్లు ౧౪౨౦-వ సంవత్సరప్రాంతములందు వల్లభరాయనిచే రచియింపఁబడిన క్రీడాభిరామమునం దిట్లు చెప్పబడినది.

గీ. ....... విప్రుఁ డీక్షించెఁ బలనాటి వీరపురుష
పరమదైవతశివలింగభవనవాటి.

మ. ద్రుతతాళంబున....................
యతిగూడం ద్విపద ప్రబంధమున వీరానీకముం బాడె నొ
క్కఁత ప్రత్యేకముగాఁ గుమారకులు ఫీట్కారంబునన్ దూలఁగన్.

గీ. .... ... పడఁతి పల్నాటివీరులఁ బాడు నపుడు. *

[పల్నాటి వీరచరిత్రము ద్విపదకావ్యము, ప్రస్తుతము ప్రచారములోనున్నది మంజరీఛందమున నున్నది. ఇది యసమగ్రము. ఇది శ్రీనాథుని రచన కాదని కొందఱిమతము. ఆంధ్రకవి తరంగిణీకారులు నట్లే తలఁచియున్నారు. కాని కొన్ని భాగములలో శ్రీనాథుని పోకడలు, కొన్నింట శ్రీనాథుని రచన యనఁదగిన రచన కానవచ్చుచున్నట్లు కొందఱు తలంచుచున్నారు శ్రీనాథుఁడు, కొండయ్య, మల్లయ్య అనువారు వీరచరిత్ర గ్రంథకర్తలుగాఁ దెలియవచ్చుచున్నారనియు, శ్రీనాథుని ద్విపదకావ్యమును జూచి మిగిలిన యిర్వురును గ్రంథరచనము చేసియుందురనియును శ్రీ. సి. పి. బ్రౌనుదొర గారును, శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు నభిప్రాయపడినారు.

మఱియు నియ్యది శ్రీనాథుని చిన్ననాఁటి రచనగా శ్రీ ప్రభాకరశాస్త్రిగారు తలఁపలేదు. రాజావలంబనము పోయినపిదప-అనఁగా-కొండవీటి పతనము నకుఁ దర్వాత శ్రీనాథుఁడు 'పల్నాటిప్రాంతములను బర్యటించునప్పుడు,

* క్రీడాభిరామకర్తృత్వముఁగూర్చి వల్లభరాయని చరిత్రమున వివరింపఁబడినది.

అక్కడి ప్రజల ప్రార్థనముచేతఁగాని, దేశచరిత్రాభిమానముచేతఁగాని ఈ చరిత్రమును రచించి యుండునని శ్రీ శాస్త్రిులుగారి యాశయము. [చూ. శృంగార శ్రీనాధము. పుట. పుట 240]

ఈ పుస్తకమువలనఁ గలిగిన ప్రోత్సాహమునుబట్టి శ్రీనాథుఁడు గొప్పవారికిఁ గృతు లిచ్చి ధనార్జనము చేయవచ్చు నన్న యాశ గలవాఁడయి స్వగ్రామ మును విడిచి స్వస్థలమునకు మిక్కిలి సమీపమున నున్న యొక చిన్న సంస్థానమునకుఁ బోయెను. ఆ సంస్థానమున కప్పు డధిపతి పెద్ద కోమటి వేముఁడు. అప్పు డాతని ముఖ్యపట్టణము దువ్వూరో, యేదోయయి యుండును. ఎంతటి విద్వాంసుల కయినను రాజమంత్రి యొక్కయు, తదితరోద్యోగులయొక్కయు ననుగ్రహము లేక రాజదర్శన మగుటయు, రాజానుగ్రహమునకుఁ బాత్రుఁ డగుటయు సంభవింపనేరవు. అందుచేత శ్రీనాథుఁడు పెద్దకోమటివేమనమంత్రి యైన మామిడి సింగన్న యైన ప్రెగడన్న నాశ్రయించి యాతనికిఁ బండితారాధ్యచరిత్ర మంకితమొనర్చెను. అప్పటి కీ పెద్దకోమటివేమన్న యొక చిన్నసంస్థానాధిపతి యయి కొమర, గిరిరెడ్డి రాజ్యకాలములో నుండినవాఁడు. పెద్దకోమటి వేమభూపాలుఁడు రెడ్డిరాజ్యసంస్థాపకుఁడైన ప్రోలయవేమారెడ్డియన్న యైన మాచన్నయొక్క రెండవ కుమారుని కుమారుఁడు. మాచన్నయొక్క ప్రథమపుత్రుఁడు రెడ్డిపోతన నృపాలుడు; ద్వితీయ పుత్రుఁడు పెద్దకోమటి భూపాలుఁడు; తృతీయపుత్రుఁడు నాగనరపాలుఁడు. ఈ యంశమును శృంగారదీపికలోని యీ శ్లోకము తెలుపుచున్నది.

శ్లో. మాచక్షోణిపతిర్మహేంద్రవిభవో వేమక్షితీశాగ్రజో
హేమాద్రేస్సదృశో బభూవ సుగుణైస్తస్య త్రయో నందనాః
కీర్త్యా జాగ్రతి రెడ్డిపోతనృపతి శ్శ్రీకోమటేంద్రస్తతో
నాగక్ష్మాపతి రిత్యవాత్తవపుషో ధర్మార్థకామా ఇవ.

మాచన్నయొక్క చిన్న సంస్థానమునకు తండ్రి యనంతరమున నాతని పెద్ద కొడుకు రెడ్డిపోతభూపాలుఁడు రా జయ్యెను; రెడ్డిపోతభూపాలుని యనం

తరమున నాతనితమ్ముఁడు పెద్దకోమటి రాజయ్యెను. ఇతఁ డన వేమ భూపాలుని రాజ్యకాలములోనే మృతినొందఁగా ననవేమభూపాలుని చివర దినములలోనే పెద్దకోమటివేమభూపాలుఁడు తన తండ్రి రాజ్యమునకు వచ్చెను. అనవేమభూపాలునకు మామిడి సింగన్నతండ్రి పెద్దనామాత్యుఁడు మంత్రిగా నుండినట్టును, వేమభూపాలునకు పెద్దనామాత్యుని తమ్ముఁ డైన నామామాత్యుఁడు మంత్రిగా నుండినట్టును, శ్రీనాథుని శృంగారనైషధములో నున్న రెండు పద్యములును పయి నింతకుముందే యుదాహరింపఁబడెను.

కుమారగిరిరాజ్యకాలమునం దే హేతువుచేతనో తండ్రి యనంతరమున మంత్రిత్వము లభింపకపోఁగా మామిడి సింగన్న తన పినతండ్రి యనంతరమున వేమనృపాలునకు మంత్రి యయ్యెను. కుమారగిరిరెడ్డి రాజ్యకాలములోనే శ్రీనాథుఁడు మొట్టమొదట తన పండితారాధ్యచరిత్రమును ప్రెగ్గడన్న కంకితము చేసెను. ఈ విషయమును శ్రీనాథుని గూర్చి మామిడి సింగన్న యన్నట్లున్న నైషధములోని యీ క్రింది పద్యము వ్యక్తపఱుచుచున్నది.

క. జగము నుతింపఁగఁ జెప్పితి
ప్రెగడయ్యకు నా యనుంగుపెద్దనకుఁ గృతుల్
నిగమార్థసారసంగ్రహ
మగు నా యారాధ్యచరిత మాదిగఁ బెక్కుల్.

దీనినిబట్టి చూడఁగా నొక్క యారాధ్యచరిత్రమునే గాక యితరపుస్తకములను గూడ మఱికొన్నిటిఁ బ్రెగడయ్య కంకితమొనర్చినట్టు కనుపట్టుచున్నది. శాలివాహనసప్తశతి గూడ నీతనికే యంకితము చేయఁబడిన దేమో!

"నూనూగుమీసాలనూత్నయౌవనమున
శాలివాహన సప్తశతి నొడివితి"

అని కనియే చెప్పుకొని యుండుటచేత నిరువదిరెండేండ్ల ప్రాయమున నేనగా ౧౩౮౭-వ సంవత్సరప్రాంతమున శాలివాహనసప్తశతి రచియింపఁబడి యుండును అటు తరువాత రెండు మూఁడేండ్లు కనఁగా ౧౩౯౦-వ సంవత్సర ప్రాంతమున శ్రీనాథుని కిరువదియైదేండ్లుండి నప్పుడు పండితారాధ్య చరిత్రము రచింపఁబడి యుండును, శ్రీనాథుని ప్రసిద్ధి యంతయు నైషధ కావ్యరచనమునుండి యారంభమైనది. అంతకుఁ బూర్వపు గ్రంథము లన్నియు నించుమించుగా నామమాత్రావశిష్టము లయినవి. ఒక్క పల్నాటి వీరచరిత్రములోని కొంతభాగము మాత్రము కనఁబడుచున్నది. అవి నామ మాత్రావశిష్టములయినను కాకపోయినను నాకు మాత్రము దొరకలేదు. శ్రీనాధుని సప్తశతిలోని దని యే గ్రంథములోనుండియో యెత్తి శ్రీమావ వల్లి రామకృష్ణకవిగా రీ పద్యము నుదాహరించి యున్నారు.

> ఉ వారణసేయ దావగొనవా నవవారిజమందుఁ దేఁటి క్రొ
> వ్వారుచు నుంట నీ వెఱుఁగవా ? ప్రియ ! హా తెఱఁగంటిగంటి కె
> వ్వారికిఁ గెంపు రాదె ? తగవా మగవారల దూఱ నీ విభుం
> డారసి నీనిజం బెఱుఁగునంతకు నంతకు నోర్వ నెచ్చెలీ. *

నైషధమునుగూర్చి శ్రీనాధుడే తన కాశీఖండమునందు

> "పంతరించితి నిండుజవ్వనంబువయందు
> హర్షనైషధకావ్య మాంధ్రభాష"

నని సంపూర్ణయౌవనదశయందు రచించినట్టు చెప్పెను. కాఁబట్టి శ్రీనాథుఁడు తాను ముప్పది సంవత్సరముల వయస్సులో నున్నప్పు డనఁగా ౧౩౯౫-వ సంవత్సరప్రాంతమున నైషధమును రచించి యుండును. ఇది పెద్దకోమటి వేమన్న చిన్నసంస్థానాధిపతిగా నున్న కాలములోనే యాతనిమంత్రి యైన

* [ఇయ్యది శాలివాహన సప్తశతిలోనిదనియే పలువురి విశ్వాసము. పెదకోమటి వేమభూపాలుఁ డీ గ్రంథమునుజూచి యుండవచ్చునని శ్రీప్రభాకరశాస్త్రిులుగారి యభిప్రాయము.]

మామిడిసింగన్న ప్రేరణముచేత తదంకితముగా రచింపఁబడినది. ఈ వేమన్న పెద్దకోమటివేమన్న కాఁ డని కొందఱు భ్రమపడి యేమేమో వ్రాసిరి కాని యతఁడు పెదకోమటివేమన్నయనుటకు గ్రంథములోనేకొన్ని నిదర్శనము లున్నవి

క. శ్రీమహిత పెద్దకోమటి
వేమక్షితిపాలరాజ్యవిభవకళార
క్షామణికి సింగసచివ
గ్రామణికిం బాండ్యరాయగజకేసరికిన్.

షష్ఠ్యంతపద్యములలో నిట్లుండుటయే కాక పుస్తకాంతమున ఫల శ్రుతిలో.

"భారద్వాజగోత్రుండు నాపస్తంబసూత్రుండును
నుభయకులపవిత్రుండును మామిడి పెద్దనామాత్య
పుత్రుండును పెద్దకోమటివేమభూపాలకరుణాపా
త్రుండును నైన వివిధవివేకసాహిత్యసింగనామాత్య
పుణ్యశ్లోకుండు."

అని స్పష్టముగా పెదకోమటివేమభూపాలుఁడని చెప్పఁబడి యున్నది. నైషధమును ముద్రించినవారు షష్ఠ్యంతపద్యారంభమును "శ్రీమహితు పెద్ద కొమరుఁడు" అని యర్థము లేకుండునట్లు సవరించి పద్యమును పాడుచేసిరి. నైషధకావ్యకృతిపతి యైన మామిడిసింగనామాత్యుఁడు వేమనృపాలుని మంత్రి యైనట్లు కవి యీ పద్యమునఁ జెప్పియున్నాఁడు.

సీ. తనకృపాణము సముద్ధతవైరిశుద్ధాంత
తాటంకములకు నెగ్గుఁ దలఁపుచుండఁ
దనబాహుపీఠంబు ధరణీభృత్కుమారాహి
సామజంబులకు విశ్రాంతి యొసఁగఁ

దనకీ_ర్తిన_ర్తకి ఘనతర బ్రహ్మాండ
భవనభూముల గొండ్లి ఁ బరిఢవిల్లఁ
దనదానమహిమ సంతానచింతారత్న
జీమూతసురభుల సిగ్గు ఁ బఱుపఁ
బరఁగు శ్రీవేమమండలేశ్వరునిమంత్రి
యహితదుర్మంత్రివదనముద్రావతార
శాసనుఁడు రాయవేశ్యాభుజంగబిరుద
మంత్రి పెద్దయసింగనామాత్యవరుఁడు.

కవి పయి పద్యమునందుఁ బెదకోమటివేమనృపాలుని మండలేశ్వరుఁడని చెప్పుటచేత నైషధగ్రంధరచనకాలమునాఁటి కతఁడు రెడ్డిసామ్రాజ్య పట్టభద్రుఁడు కాలేదనియు, రెడ్డిరాజ్యములోపల మండలేశ్వరుఁడుగానే యుండెననియుఁ దెల్ల మగుచున్నది. కృతిపతి తన్నుద్దేశించి పలికినట్లుగా శ్రీనాధుఁడు నైషధావతారికలో నీ క్రింది పద్యములను వేసియున్నాఁడు.

శా. బ్రాహ్మీదత్తవరప్రసాదుఁడ వుదుప్రజ్ఞావిశేషోదయా
జిహ్మస్వాంతుఁడ వీశ్వరార్చనకళాశీలుండ వవ్యర్థిత
బ్రహ్మాండాదిమహాపురాణచయతాత్పర్యార్థనిర్ధారిత
బ్రహ్మజ్ఞానకళానిధానమవు నీభాగ్యంబు సామాన్యమే?

క. జగము నుతింపఁగఁ జెప్పితి
ప్రెగడయ్యకు నాయనుంగుపెద్దనకుఁ గృతుల్
నిగమార్థసారసంగ్రహ
మగునాయారాధ్యచరితమాదిగఁ బెక్కుల్.

* * * *

గీ. భట్టహర్షుండు ప్రౌఢవాక్పాటవమున
నెద్ది రచియించి బుధలోకహితముఁ బొందె
నట్టి నైషధసత్కావ్య మాంధ్రభాష
ననఘ ! యొనరింపు నాపేర నంకితముగ.

ఆంధ్రనైషధకావ్యాంతమునందు శ్రీనాథుఁడు

"నైషధశృంగారకావ్యం బాంధ్రభాషావిశేషంబున విశేషమనీషి హృదయంగమంబుగా శబ్దంబు ననుసరించియు నభిప్రాయంబు గురించియు భావం బుపలక్షించియు రసంబుఁ బోషించియు నలంకారంబు భూషించియు నౌచిత్యం బాదరించియు ననౌచిత్యంబు పరిహరించియు మాతృకానుసారంబునఁ జెప్పఁబడిన యీ భాషానైషధ కావ్యంబు"

అని తానుజేసిన భాషాంతరీకరణమునుగూర్చి చెప్పుకొనెను. తావనౌచిత్యంబు పరిహరించితి నని కవి చెప్పుకొన్నను, నశ్లీలములును ననౌచిత్యములు నయిన యీ క్రింది పద్యములవంటివానిని వేయక మానలేదు.

ఉ. అవ్వలిదిక్కు మోమయి ప్రియంబున నొండులతోడ ముచ్చటల్
ద్రవ్వుచు నొక్కకోమలి పరాకున నుండఁగ ధూర్తుఁ డొక్కరుం
డివ్వల వచ్చి వంచనమెయిన్ నునుమించుమెఱుంగుటద్దమున్
నవ్వుచుఁ బట్టె దానిచరణంబులకున్నడుమైన మేదినిన్.

ఆ కాలమునం దిట్టి వనౌచిత్యములుగా భావింపఁబడ కుండెనేమో !
నైషధమును తెనిఁగించుటలో శ్రీనాథుఁడు సంస్కృతము నత్యధికముగా నుపయోగించి బహుస్థలములలో సాంస్కృతికదీర్ఘసమాసములతో నింపి యున్నాఁడు.

"శ్లో. సువర్ణదండైకసితాతపత్రితజ్వలత్ప్రతాపావళికీర్తిమండలః."—
ప్రథమసర్గము. శ్లో ౨. అను భాగము.

సీ. "తపనీయదండైకధవళాతపత్రితోద్దండతేజఃకీర్తిమండలుండు"

అని తెనిఁగింపఁబడినది. ఇందు "సువర్ణ" యనుటకు "తపనీయ" యనియు, "సిత" యనుటకు "ధవళ" యనియు, సంస్కృతపదములకు సంస్కృతపర్యాయపదములు వేసి గణయతిప్రాసముల కనుకూలముగా దీర్ఘసమాసమును జేయుట తప్పఁ దెలిగించిన దేదియులేదు. కడపట "కీర్తి మండలః" అనుదానిని "కీర్తిమండలుం" డని తెనుఁగువిభక్తితోఁ గూర్చుట మాత్రమే యిం దున్న తెలుఁగు.

శ్లో. సరశీః పరిశీలితుం మయా
గమికర్మీకృతనైకనీవృతా,
అతిథిత్వ మనాయి సా దృశోః
సదసత్సంశయగోచరోదరీ.—సర్గ. ౪. శ్లో. ౪౦.

అనుదానిలోని గమికర్మీకృతత్యాదిభాగమును

మ. "గమికర్మీకృతనైకనీవృతుఁడనై కంటిన్ విదర్భంబునన్"
అని మార్పేమియుఁ జేయక యుదను విభక్తిప్రత్యయమైన డువర్ణకమును మాత్రము చేర్చి తనుఁ గనిపించెను.

శ్లో. మందాక్షమందాక్షరముద్రమిుక్త్వా
తస్యాం సమాకుంచితవాచి హంసః,
తచ్ఛంసితే కించన సంశయాళు
ర్గిరా ముఖాంభోజ మయం యుయోజ.—సర్గ. ౩ శ్లో. ౭౬.

అనుదానిలోని మందాక్షేత్యాదిప్రథమచరణమును

గీ. "రమణి మందాక్షమందాక్షరంబు గాఁగ"

అని తెనిఁగించెను. ఇందును మూలములోని పదములలో మార్పేమియు లేక తెలుఁగగుటకు కడను బువర్ణకము చేర్పఁబడెను. ఇటువంటి వనేకములు గలవు. ఇట్టి భాషాంతరములను జూచి యా కాలపు విద్వాంసులు శ్రీనాథునితో "నీడూలును మూలునుదీసికొని మా నైషధమును మామీఁదఁ బాఱవేయుము" అని పరిహాసముగాఁ బలికి రని యొక కథ చెప్పుచున్నారు. దానికి బహుస్థలములయందు సంస్కృత విభక్తికి మాఱుగా తెలుఁగువిభక్తి ప్రత్యయములైన డుములనుజేర్చుట తప్ప వేఱుభాషాంతరము లేదని తాత్పర్యము. తెనుఁగున గమనార్థకమైన సకర్మకక్రియ లేనప్పుడు "గమి కర్మీకృతనైకనీవృతుఁడనై" యనుటకంటె "అనేక దేశములను దిరిగిన వాఁడనై" యను నర్థ మిచ్చెడు వేఱొక వాక్యమును వాడుటయే సముచిత మని తోఁచుచున్నది. ఇట్టి భాషాంతరములు సంస్కృతపాండిత్యము గల విద్వాంసులకే కాని సామాన్యాంధ్రభాషాజ్ఞానము గలవారికి బోధపడవు. కొన్నిచోట్ల భాషాంతర మెట్లున్నను మొత్తముమీఁద నైషధాంధ్రీకరణము సర్వజనశ్లాఘాపాత్రముగా నున్నదనుటకు సందేహము లేదు.

శ్లో. విజ్ఞాపనీయా న గిరో మదర్థాః
కృధా కదుష్ణే హృది నైషధస్య ?
పిత్తేనదూనే రసనే సితాపి
తిక్తాయతే హంసకులావతంస !

గీ. అధికరోషకషాయితస్వాంతుఁడైన
నరపతికి విన్నవింపకు నా యవస్థ
పైత్యదోషోదయంబునఁ బరుష మైన
జిహ్వకును బంచదారయుఁ జేఁదుగాదె !

ఇత్యాదిస్థలములలో భాషాంతర మెంతో మనోహరముగా నున్నది. గుణ విశేషము కలిగియున్న దగుటచేతనే యాంధ్రనైషధ మాంధ్ర పంచకావ్యములలో నొక్కటిగాఁ బరిగణింపఁబడుటయే కాక వానిలో నగ్రగణ్యముగా భావింపఁబడుచున్నది. ఈ నైషధకావ్యరచనవలన శ్రీనాథున కాంధ్రకవులలో నత్యంత ప్రసిద్ధి కలిగినది. ఎంతటి ప్రసిద్ధి కలిగినను శ్రీనాథున కింతవఱకు రాజాస్థానములలోఁ బ్రవేశము కలిగినదికాదు. ధనార్జనమున కయి పెదకోమటివేమనృపాలుని సంస్థానమునకుఁ బోయి యతని మంత్రులు మొదలైనవారి నాశ్రయించినట్టే శ్రీనాథుఁడు స్వస్థలమును విడిచి వచ్చి యారంభదశలోనే రెడ్డిరాజ్యమునకుఁ బ్రధాననగరమయిన కొండవీటికిఁ బోయి కుమారగిరిరెడ్డియొక్క మంత్రులు మొదలయినవారి నాశ్రయించి యుండును గాని యచ్చటివా రీతని కచ్చటఁ బ్రవేశము కలుగనీయలేదు. * ఉభయులును శైవమతస్థు లగుటచేతనో, మఱి యే హేతువుచేతనో యట్టి ప్రయాణములయందు శ్రీనాథునకు కుమారగిరిభూపాలుని సుగంధభాండాగారాధ్యక్షుఁడయి కోటీశ్వరుఁడుగా నుండిన యవచి తిప్పయసెట్టితోడి మైత్రి కలిగినది. అందుచేతనే శ్రీనాథుఁడు తిప్పయసెట్టికి బాలసఖుఁ డయ్యెను. అప్పటికి శ్రీనాథుఁ డిరువది యిరువదియైదు సంవత్సరముల బాలుఁడే యయినను తిప్పయ్యసెట్టి యాతనికంటె మిక్కిలి పెద్దవాఁ డయి యుండును. కొండవీటియందు తప్ప శ్రీనాథున కవచి తిప్పయ సెట్టితోడిమైత్రి కలుగుట కవకాశము వేఱొకచోటఁ గానఁబడదు. శ్రీనాథుఁడు నైషధరచనానంతరమునఁ దన బాలసఖుఁ డయిన తిప్పయసెట్టిని జూచి సమ్మానమును బొందుటకు మరలఁ గొండవీటికిఁ బోయెను. అప్పుడు శ్రీనాథుఁడు ధనస్వీకారము చేసి హరవిలాసమును రచించి తిప్పయసెట్టి కంకిత మొనర్చెను

హరవిలాస మేడాశ్వాముల గ్రంథము. నైషధకావ్యరచనా నంతరమున నెల్లవారును దానిని సంస్కృతపదభూయిష్ఠముగాను, దీర్ఘసంస్కృతసమాస బహుళముగాను నుండిన దని నిందింపఁగా నా నిందను బాపుకొనుటకయి

* [కుమారగిరి కాలమున శ్రీనాథుఁ డిర్వదియేండ్ల లోపు వయస్సువాఁడయి యుండుట వలననే యాస్థానమునఁ బ్రవేశము కలుగ లేదని కొందఱి యభిప్రాయము.]

శ్రీనాథుఁడు హరవిలాసము నాంధ్రపదభూయిష్ఠముగాను, విశేషదీర్ఘ సంస్కృత సమాసవిరహితముగానుజేసెను శ్రీనాథుని గ్రంథము లన్నిటిలో నిది కడపటి దని కొందఱు వ్రాసిరి గాని యది సరి గాదు. ఇది తప్పక కొమరగిరిరెడ్డికాలములోనే రచియింపఁ బడినది. దీనికృతిపతి యైన కోమటి యవచి తిప్పయ్యసెట్టి కొమరగిరి భూపాలునికాలములో నుండి యాతనికి సుగంధద్రవ్యంబులు తెప్పించి యిచ్చువాఁ డనియు, తిప్పయ్యసెట్టి కవి నుద్దేశించి తనకు శైవప్రబంధ మొకటి యంకితము చేయుమని యడిగె ననియు, హరవిలాసములోని యీ క్రింది గద్యపద్యములు స్పష్టముగాఁ జెప్పుచున్నవి. "గద్యము .. .. కొమరగిరి వసంతనృపాలునివలన నాందో ళికాఛత్ర చామరతురంగాది రాజ్యచిహ్నములు వడసి యమ్మహారాజునకుఁ బ్రతిసంవత్సరోత్సవంబునకుం దగిన కస్తూరికుంకుమ ఘనసార సంకుమ దహిమాంబుకాలాగురుగంధసారప్రభృతిసుగంధ ద్రవ్యంబు లొడగూర్చియుఁ జీనిసింహళతవాయిహురుమంజిజలలోగి [illegible] తినానాదీపనగరాకరంబు లగు ధనకనకవస్తు వాహనమాణిక్యగాణిక్యంబులు తెప్పించియు, గవినైగమిక వాదివాంశికవైతాళికాదు లగు సర్థిజనంబులకు నర్థంబులు గుప్పించియు ధీరుండును నుదారుండును గంభీరుండును [illegible] దాచారుఁడును నన విఖ్యాతిఁ గాంచిన యవచిదేవయతిప్ప ప్రభుం డొక్కనాఁ డాస్థానమండపంబున సుఖోపవిష్టుం డయి.

సీ. కమలనాభునిపౌత్రుఁ గవితామహీ రాజ
భద్రాసనారూఢుఁ బరమపుణ్యు
బాత్రు నాపస్తంబసూత్రు భారద్వాజ
గోత్రు సజ్జనమిత్రుఁ గులపవిత్రు
భీమాంబికామారనామాత్యనందను
నఖిలపురాణవిద్యాప్రవీణు
నధ్వర్యు వేదశాఖాతిథినిష్ణాతు
నంధ్రభాషానైషధాబ్జభవుని

నుభయభాషాకవిత్వ ప్రయోగకుశలు
బాలసఖు గారవించి తాత్పర్య మొప్ప
నవచిదేవయత్రిపురారి యక్షరాజు
హితమితోక్తుల వెలయంగ నిట్టు లనియె.

క. కంటిని విశుద్ధసంతతి
వింటిఁ బురాణములు పెక్కు విశ్వము పొగడన్
మంటి బహువత్సరంబులు
గొంటి యశోధనము సుకవికోటి నుతింపన్. [పీఠిక-౯,౯]

.... .... .. ....

గీ. ఆగమజ్ఞాననిధివి శాస్త్రార్థనిధివి
బహుపురాణజ్ఞుఁడవు పరిభవ పవివి
బాలసఖుఁడవు శైవప్రబంధ మొకటి
యవధరింపుము నాపేర నంకితముగ." [పీఠిక-౧౨]

పయి వాక్యములవలన తిప్పయసెట్టిపై కొమరగిరిభూపాలునకు కస్తూరిఘన
సారాదులు సమకూర్చువాఁ డయినట్టును. ఏండ్లు చెల్లినవాఁ డయి నట్టును,
కవిబాలసఖుఁ డయినట్టును కనుపట్టుచున్నది ఇందలి మొదటి రెండంశముల
విషయములోను సందేహము లేదు తిప్పయసెట్టితండ్రి దేవయ్యసెట్టి
౧౩౨౦ మొదలుకొని ౧౩౪౦ వఱకును రాజ్యము చేసిన ప్రోలయవేమా
రెడ్డికాలములో నుండినవాఁ డగుటచేతను, ప్రోలయ వేమారెడ్డికొడుకు కొడు
కైన కొమరగిరిరెడ్డికాలములో తిప్పయసెట్టి యుండుటచేతను, తిప్పయసెట్టి
కుమారగిరిభూపాలుని తండ్రి యైన యనపోతభూపాలునియీడువాఁ డయి
యుండవలెను. అప్పుడు తిప్పయసెట్టికుమారులే కొమరగిరిరెడ్డి యీడువా
రయి యుండవలెను. అందుచేత తిప్పయసెట్టి కప్పటి కఱువది సంవత్సర
ముల వయస్సుండి యుండవలెను. అంతేకాక తృతీయాశ్వాసారంభములోని

యీ పద్యము తిప్పయసెట్టికూడ ప్రోలయవేమారెడ్డి కాలములోనుండినట్టు తెలుపుచున్నది.

క. శ్రీపర్వతసోపాన
స్థాపకవేమక్షితీశసామ్రాజ్యశ్రీ
వ్యాపారిముఖ్య ! యన్వయ
దీపక ! యలకాధిరాజ ! దేవయతిప్పా !

ప్రోలయవేమారెడ్డికాలములోనే తిప్పయ్యసెట్టి వ్యాపారిముఖ్యుఁ డయినందున నప్పటి కిరువది సంవత్సరములవాఁ డయిన యయి యుండి. కుమారగిరిరెడ్డి రాజ్యారంభకాలమునకే యేఁబది సంవత్సరములవాఁడయి, హరవిలాసరచన కాలమునకే యెనుబదేండ్లు దాటినవాఁ డయి యుండవలెను. హరవిలాసము ౧౪౪౦-వ సంవత్సర ప్రాంతమున తిప్పయసెట్టి కంకితము చేయఁబడినదని చెప్పెడి బుద్ధిమంతుల యభిప్రాయ ప్రకారము తిప్పయసెట్టికి నూటపది యేండ్లు దాఁటినతరువాత శ్రీనాథుఁడు హరవిలాసము నంకితము చేసెనని యేర్పడును గనుక నది గొప్ప యసంగతము. కాఁబట్టి హరవిలాసము కుమారగిరిభూపాలుఁడు జీవించియుండఁగానే ౧౪౦౦-వ సంవత్సరమునకు లోపలనే తిప్పయసెట్టి కంకితము చేయఁబడుట నిశ్చయము. అప్పటికె తిప్పయసెట్టికి దాదాపుగా డెబ్బదిసంవత్సరములయి యుండును. ౧౩౬౦-వ సంవత్సరమునకు లోపల జననమొందని శ్రీనాథుఁడు వృద్ధుఁ డైన తిప్పయ సెట్టికి వాలసఖుఁ డెట్లగును ? ఇద్దఱును సమానవయస్కులు కాకపోవుట నిశ్చయము. తిప్పయసెట్టి వృద్ధుఁడే ; శ్రీనాథుఁడు బాలుఁ డయి యుండి నప్పుడు సఖ్యము కలుగుటచేతనే తిప్పయసెట్టికి శ్రీనాథుఁడు బాలసఖుఁ డయ్యెను గాని యుభయులును బాలు రయి యుండినప్పుడు కలిగిన మైత్రి చేతఁ గాదు. పయి సీసపద్యములో

“ఆంధ్రభాషానైషధాబ్జభవుని”

అని యున్నందున, హరవిలాసము నైషధమునకుఁ దరువాత రచింపఁబడె ననుటకు సందేహము లేదు ఇఁక హరవిలాసమును రచించిన కాలమును

సరిగా నిర్ధారణము చేయుటకుఁ బ్రయత్నింతము. కవి తిప్పయ్యసెట్టితమ్ముఁ డైన తిరుమలనాథసెట్టిని వర్ణించుచు నీ రీతిని జెప్పెను.

చ. 'హరిహరరాయ ఫేరొజసహాసురధాణ గజాధిపాదిభూ
వరులు నిజప్రభావ మభివర్ణన చేయఁ గుమారగిర్యధీ
శ్వరుని వసంతవైభవము సర్వము నొక్కఁడ నిర్వహించు మా
తిరుమలనాథసెట్టికివి ధీగుణభట్టికి నెవ్వఁ డీ డగుఁ? [పీఠిక-౨౪]

ఈ పద్యమునందు హరిహరరాయలు, ఫేరొజిసహా, మొదలయినవారు మెచ్చునట్లుగా కుమారగిరిభూకాంతుని వసంతోత్సవ వైభవమును తిరుమలనాథసెట్టి యొక్కఁడే నిర్వహించుచుండినట్లు చెప్పఁబడినది. కాఁబట్టి హరవిలాసము రచియించునప్పటికి సమకాలీనులైన యీ ముగ్గురు రాజులును జీవించి యుండుట స్పష్టము. ఈ ముగ్గురిలో (రెండవ) హరిహరరాయలు ౧౩౭౭ మొదలుకొని ౧౪౦౪-వ సంవత్సరమువఱకును రాజ్యపాలనము చేసెను; ఫేరోజిసహా ౧౩౯౭ మొదలుకొని ౧౪౨౨-వ సంవత్సరమువఱకును రాజ్యపాలనము చేసెను; కుమారగిరిభూపాలుఁడు ౧౩౮౩ మొదలుకొని ౧౪౦౦-వ సంవత్సరము వఱకును రాజ్యపాలనము చేసెను. అందుచేత నీ ముగ్గురును నుండి రాజ్యపాలనము చేయుచుండిన కాలము ౧౩౯౭, ౧౩౯౮, ౧౩౯౯. ౧౪౦౦ సంవత్సరములు. కాఁబట్టి ౧౩౯౭ నకును ౧౪౦౦ లకును నడిమి కాలములో ననఁగా ౧౪౦౦ వ సంవత్సర ప్రాంతమున హరవిలాసము రచియింపఁబడెను. అప్పటికి శ్రీనాథునికి ముప్పదినాలుగు. ముప్పదియైదు సంవత్సరముల వయస్సుండును. కవి ధనలాభముకొఱకు కృతిపతిని "తిప్పప్రభుఁ" డనియు, "ఆస్థానమండపంబున సుఖోపవిష్టుండై" యనియు, అతిశయోక్తులతో నెంతయెక్కువగా వర్ణించినను, తిప్పయసెట్టి సముద్రవ్యాపారమును జేయుచు, కుమారగిరికి వలెనే యితర రాజులకును కస్తూరీకుంకుమాది సుగంధద్రవ్యములను, చీనాంబరాదులను హయరత్నాదులను విదేశములనుండి తెప్పించి విక్రయించుచు పెద్ద యంగడి పెట్టిన లక్షాధికారి యైన పెద్దకోమటియే గాని మహారాజు కాఁడు. ప్రథమాశ్వాసాంతమునందలి

క. కొమరగిరివసంతనృపా
గమకవివరగంధసారకస్తూరికుం
కుమకర్పూరహిమాంభ
స్సముదంచితబహుసుగంధిశాలాధ్యక్షా!' [అ. ౧. ప. ౩౦]

అన్న పద్యములోని సంబోధనము తిప్పయసెట్టి కుమారగిరినిమిత్తము తెప్పించిన కర్పూరములు గంధసారములు కస్తూరిని విక్రయించు గొప్ప సుగంధద్రవ్యముల వాణిజ్యశాలలు బెట్టినవాఁ డని చెప్పుచున్నది. అఱువదేండ్లు దాఁటిన ముసలివాఁ డైన తిప్పయసెట్టిని ద్వితీయాశ్వాసాంతమున "లలనాజనతారుణ్యలక్ష్మీభా!" స్త్రీజనములకు మన్మథతుల్యుఁడా! యనియు, సప్తమాశ్వాసాంతమున "కామినిహృద్యమూర్తీ!" యనియు, పంచమాశ్వాసాంతమున 'సమరపల్గుణ' యనియు, సప్తమాశ్వాసాంతమున 'సంగరపార్థ' యనియు, షష్ఠ్యంతములలో "వాణీశముఖముఖరితవీణాక్వాణనిభకవిత్వఫణితికిన్" అనియు స్తుతి చేసిన యతిశయోక్తులను టుండనిచ్చినను ఆ కాలమున నీ యూరి వైశ్యవణిజులు విదేశవాసులతోను, ద్వీపాంతరఖండాంతరవాసులతోను ముఖ్యద్రవ్యవ్యాపారమును విశేషముగా జరుపుచుండిన ట్లీ క్రింది పద్యములు సహస్రముఖముల ఘోషించుచున్నవి.

* సీ. పంజాబుకర్పూరపావపంబులు దెచ్చి
జలనోగిబంగారుమొలక తెచ్చి
సింహళంబున గంధసింధురంబులు తెచ్చి
హురుమంజిబలు తేజిహయలు తెచ్చి
గోవసంశుద్ధపంకపుద్రవము తెచ్చి
యాపగనాణిముత్యాలు తెచ్చి
చోటంగిఁ గస్తూరికాటంకములు తెచ్చి
చీనచీనాంబరశ్రేణి తెచ్చి

* [పంజార-పాఠాంతరము. మఱియు 'తెచ్చి' అనుచోటనెల్ల 'తెచ్చె' అను భూతకాలిక క్రియ యే కొన్నిటఁ గలదు.]

జగదగోపాలరాయవేశ్యాభుజంగ
పల్లవాదిత్యభూదానపరశురామ
కొమరగిరిరాజదేవేంద్రుకూర్మిహితుఁడు
జాణజగజెట్టి దేవయచామిసెట్టి.

గీ. తమ్ము లిద్దఱుఁ దనయాజ్ఞ తల ధరించి
యన్నిదీవులఁ దెచ్చులాభార్థకోటి
యర్థులకు నిచ్చి కీర్తి బేహారమాడు
నవచిత్రిపురాంతకుండు వంశాబ్ధివిధుఁడు

మ. తరుణా*చీనితవాయిగోవరమణాస్థానంబులం జందనా
గరుకర్పూరహిమాంబుకుంకుమరజఃకస్తూరికాద్రవ్యముల్
శరధిం * గప్పలిజోగులజా విరివిగా సామాన్లఁ దెప్పించు నే
నేర్పరియో వైశ్యకులోత్తముం డవచితిప్పం డల్పుదేయిమ్మహిన్.
[పీఠిక. ౨౬-౨౭]

ఇటువంటి యోడలవ్యాపారి యైన తిప్పయసెట్టి కిద్దఱు తమ్ములును, ముగ్గురు కొడుకులు నుండిన ట్లీ పద్యమునఁ జెప్పఁబడినది.

ఉ. ధీచతురు ల్సహోదరులు తిర్మలసెట్టియుఁ జామిసెట్టియున్
మాచన విశ్వనాథ చినమల్లకుమారులు వీర లాత్మజుల్
శ్రీచెలువంబు గైకొనినచేడియ యన్నమదేవి భార్యగా
గోచరమే నుతింప నయకోవిదునిఁద్రిపురాంతకాధిపుజా ?
[పీఠిక-౩౧]

* [సీరి అని పాఠాంతరము. * గప్పలి జోగువల్లి వలికొసమ్మాన్లం దెప్పించు నేర్పరియై అని పాఠాంతరము.]

[హరవిలాస రచన కుమారగిరిరెడ్డి కాలమునందే జరిగియుండునని కొందఱి తలంపు; కాని చాలమంది విద్వద్విమర్శకులు దాని నంగీకరించలేదు. కొండ వీటి రాజ్యము పతనమైన పిదప శ్రీనాథుఁడు దేశములఁ దిరుగుచు, కంచికిఁ బోయి యుండెననియు, అప్పుడచటనున్న తన బాలసఖుని (తిప్పయసెట్టి) కోరిక పయిని హరవిలాసమును రచించి, యతని కంకిత మిచ్చి, సమ్మా నముపొందెననియు. కాఁగా హరవిలాసము శృంగారనైషధ, భీమఖండములు రచింపఁబడిన పిదప - కాశీఖండరచనమునకుఁ బూర్వము రచింపఁబడి యుండు ననియు శ్రీ ప్రభాకరశాస్త్రిలుగారు వివరించిరి. హరవిలాసరచనమునాఁటికి అవచి తిప్పయసెట్టి బాలసఖుఁడగు శ్రీనాథుఁడు వృద్ధుఁడే యనియు, శ్రీనాథునికంటెను గూడఁ దిప్పయసెట్టి 'మతీవృద్ధుఁ డనియు శ్రీశాస్త్రిగారు హరవిలాస పీఠికలోఁ దెల్పియున్నారు. [చూ. ఆనందముద్రణాలయము వారి హరవిలాసము - పీఠిక-4.] ఏతద్రచనా కాలమునాఁటికి శ్రీనాథునికి నలువది, నలువదియైదు సంవత్సరముల ప్రాయమును, తిప్పయకేఁబది యేఁబదియైదు సంవత్సరముల వయసును నుండియుండునని 'ఆంధ్రకవి తరంగిణి' యందుఁ గలదు. [చూ. సంపుటము. 5. పుట. 53]

భాగవతముదశమస్కంధము శ్రీకృష్ణునిలీలలను దెలుపునట్లుగానే యీహర విలాసము హరునివిలాసములను దెలుపుచున్నది. ఇందలి శివవిలాసము లలో మొదటిది చిఱుతొండనంబి చరితమును గూర్చినది. శైవాచారపరా యణుఁడైన చిఱుతొండనంబి కృతిపతి యైన తిప్పయసెట్టివంశమునకు మూలపురుషుఁ డైన ట్లీ గ్రంథమునఁ జెప్పఁబడినది. వీరశైవశిఖామణి యైన చిఱుతొండనంబి యను వైశ్యరత్నము నిత్యమును దవపంక్తిని జంగమప్రమధులు లేక భుజించెడువాఁడు కాఁడఁట ; ఒకసారి యిరువది రెండుదినము లేకవృష్టి గురిసి తనవాస స్థానమైన కాంచీనగరమునందు సహ పంక్తిని గుడుచుటకు జంగమ మాహేశ్వరుఁ డొక్కఁడును దొరకకపోఁగా వ్రతభంగము కలుగకుండుట కయి చిఱుతొండనంబి యూరంతయు వెదకుచుఁ బోయి పోయి తుద కూరిబైట నున్న యొక పాడుదేవాలయ

ములో భార్యయైన గ్రుడ్డిముసలియవ్వతో నుండిన వృద్ధుఁడై కుష్ఠవ్యాధి పీడితశరీరుఁడైన జంగమమాహేశ్వరుఁ డొక్కఁడు కానఁబడెనఁట ! చిఱుతొండనంబి యాతనిని దనతోడి సహభోజనమునకుఁ బిలువఁగా నతఁడు క్రొత్తగా నుపనీతుఁ డయి పదియేండ్ల యీడుగల కుమారునిఁ దల్లియే చంపి వండి వడ్డించెడు గృహస్థునిపంక్తిని గాని భుజియింప రా ననెనఁట ! దుష్కరమగు నా కోరికను జెల్లించుటకు చిఱుతొండనంబియు నాతని దేవియైన తిరువెంగనాంచియు నొప్పుకొని యా ముసలిజంగమును సకళత్రముగా స్వగృహమునకుఁ గొనిపోయి యావఱకే తాను జంగమమాహేశ్వరున కాహార మగుటకు సంతోషపూర్వకముగా నంగీకరించి యుండిన సిరియాలుని పాఠశాలనుండి కొని వచ్చి యుపనీతునిఁజేసి తల్లియైన తిరువెంగనాంచియే యా బాలుని తఱిగి వండి మగనిపంక్తిని గూరుచుండిన యా ముసలి జంగమునకు వడ్డించెనఁట. అప్పు డా జంగము చిఱుతొండనంబియొక్క కొడు కొకఁడుకూడఁ గూరుచుండక యపుత్రకుని పంక్తిని భుజింపనొల్ల ననెనఁట ! దానికి * చిఱుతొండనంబి తనకు సిరియాలుఁ డేకపుత్రుఁ డగుటచేత వేఱొక పుత్రుఁడు లేఁడని విన్నవింపగాఁగా వానినే తల్లిచేతఁ బిలిపింపు మని యా వృద్ధమాహేశ్వరుఁ డాజ్ఞాపించెనఁట ! తదాజ్ఞానుసార ముగాఁ దల్లియైన తిరువెంగనాంచి 'సిరియాలా' యని కేకవేయఁగా నందఱు నాశ్చర్యసంతోషమగ్నమానసు లగునట్లుగా మృతినొందిన సిరియా లుఁడే కసుగందని శరీరముతో బ్రతికి వచ్చెనఁట ! ఆ ముసలిజంగమును ముసలియవ్వయు నా వీరశైవదంపతీపుత్రులయొక్క భక్తిని నిశ్చలశైవా చారానురక్తిని పరీక్షించుటకయి కైలాసమునుండి కపటవేషముతో భూమి కవతరించి వచ్చిన పార్వతీపరమేశ్వరులఁట ! పార్వతీపరమేశ్వరు లా కుటుంబముయొక్క శైవాచారపరాయణత్వమునకు మెచ్చి కడపట వారికి ముగ్గురకు మాత్రమే కాక కాంచీపురములో నుండిన వారియాప్తబంధువులైన వైశ్యుల కందఱికిని గూడ కైలాసనివాసప్రాప్తి ననుగ్రహించిరఁట !

* [తనకుఁ బుత్రుఁడున్నాఁడనియు, వాఁడెక్కడికో పోయెననియు, వంటకములా చల్లారకమున్నే భుజింపవలెననియు, చిఱుతొండనంబి కోరినట్లు హరవిలాసములోఁ గలదు.]

కవికల్పన కొంత యున్నను హరవిలాసములోని శివలీల లన్నియు శ్రీనాథుని యితర గ్రంథములవలెనే సంస్కృతమునుండి భాషాంతరీకరింపఁ బడినవే. శ్రీనాథుఁ డా వఱకు వాడుకలో లేని పదములను నన్యదేశభాషా పదములను హరవిలాసములోఁ బ్రయోగించుట కారంభించెను. "తరుణా చీనితవాయి" యన్న పద్యములో 'సామాను' లని ప్రయోగించుట కనిపెట్టి యున్నారుగదా! ఈ క్రింది పద్యమున 'ఖుసిమీఱ' సని వాడి యున్నాఁడు.

మ. ఖుసి 1 మీఱన్ సురథాణి నిండుకొలువై కూర్చున్నచో నీక రా
 భ్యసనంబున్ నుతియించురా యవచి తిప్పా! చంద్రసారంగనా
 భిసముత్పాదితతాళవృంతపవన ప్రేంఖోలనప్రక్రియా
 వనరోదంచితసారసౌరభరసవ్యాలంబరోలంబముల్ [పీఠిక-22]

హరవిలాసము రచియింపఁబడినతరువాత నత్యల్పకాలములోనే కుమారగిరి నరపాలుఁడు పరలోకగతుఁ డయ్యెను. అతని యనంతరమునఁ బెదకోమటి వేమభూపాలుఁడే కొండవీటిరాజ్యమున కంతకును బ్రభువయి ౧౪౦౦-వ సంవత్సరములోఁ దనమంత్రియైన మామిడిసింగనామాత్య సహితముగావచ్చి కొండవీటియందుఁ బ్రవేశించెను. అటుతరువాతఁ గొంతకాలమునకు సింగనా మాత్యుని యనుగ్రహమువలన శ్రీనాథునకుఁ మొదట రాజస్థానప్రవేశము కలిగెను. శ్రీనాథుఁడు వేమనృపాలుని యాస్థానమునందు విద్యాధికారిగా నియమింపఁబడినందున నప్పటినుండి స్థిరముగా కొండవీటినివాసుఁడయ్యెను.

ఈ పెదకోమటివేమభూపాలునియొద్ద శ్రీనాథుఁ డాంధ్రకవిగాను, పార్వతీ పరిణయమును రచించిన వామనభట్టు సంస్కృతకవిగాను, ఉండిరి వామన భట్టు సంస్కృతమున వేమభూపాలీయ మను పేర నీతని గూర్చియే యొక వచనకావ్యమును రచించెను. వేమభూపాలీయమునందు వామనభ ట్టీతనిని సర్వజ్ఞచక్రవర్తినిగాను, ఈతని పూర్వులను మహాచక్రవర్తులనుగాను పొగడెను. వేమభూపాలునకు దాను గ్రంథభర్త యగుటకంటె గ్రంథకర్త

1. మీఁదన్-పాఠాంతరము.

యగుటయం దెక్కువ యిష్టము కలిగి యుండినట్లు కనుపట్టుచున్నది. వేమ భూపాలుఁడు సంస్కృతాంధ్రములయందు మంచి పాండిత్యము కలవాఁడయినట్లు చెప్పుచున్నారు. అమరుక మను శృంగారకావ్యమునకు సంస్కృతమున శృంగారదీపిక యను వ్యాఖ్యానము నీతఁడు రచించెను ఈ గ్రంథ రచనమునందు శ్రీనాథ వామనభట్టు లీతని సహాయులుగా నుండినట్లు కొందఱును. శ్రీనాథుఁడే గ్రంథము నంతను వేమభూపాలుని పేరు పెట్టి రచించెనని కొందఱును చెప్పుచున్నారు. శ్రీనాథుఁని శాసనములలో శ్లోకములే భేద మించుకయు లేక సరిగా నిందుఁ గనఁబడుచున్నందున శ్రీనాథుఁడే శృంగారదీపికను రచించి యుండును. *ఫిరంగిపురశాసనము ౧౪౧౦-వ సంవత్సరమునందు శ్రీనాథునిచే రచింపఁబడినది. ఇది గుంటూరుమండలము లోని సత్తెనపల్లితాలూకా యందలి ఫిరంగిపుర గ్రామమున శ్రీ వీరభద్ర స్వామివారి యాలయమున కెదుట నున్న శిలాస్తంభముమీఁదఁ జెక్కఁబడినందున నీ శిలాశాసనము ఫిరంగిపురశాసన మనఁబడును. ఇది ధరణి కోటకు ప్రభువయిన గన్నమనాయని కూఁతురును వేమభూపాలుని భార్యయును సైసూరాంబ త్రవ్వించిన సంతానసాగర మను చెఱువుమ శకసంవత్సరము ౧౩౩౧ విరోధిసంవత్సర ఫాల్గుణబహుళ ద్వితీయా శుక్రవారమునఁ బ్రతిష్ఠచేయు సందర్భమున శ్రీనాథునిచే రచియింపఁబడినది. ఈ సంతాన సాగర ప్రతిష్ఠాతిథి క్రీస్తుశకము ౧౪౧౦-వ సంవత్సరము ఫిబ్రవరినెల ౨౧-వ తేదీ యగును. ఈ శాసనము నిందు క్రిందఁ బూర్ణముగాఁ బ్రకటించుచున్నాను.

పడమటివైపు.

శ్లో. కళ్యాణం జగతాం తనోతు స విభుః కాదంబినీమేచకః
క్రీడాక్రోడతనుః పయోధిపయసో విశ్వంభరా ముద్వహన్,
ధారాపేతఫణావివ రత్నవశా న్మోదాయ య స్యాభవన్

* [ఈ గ్రంథమును రచించుటలో శ్రీనాథుఁడు సాయపడి యుండునని పలువురి యభిప్రాయము]

నిర్దత్తా భుజగేంద్రమౌళిమణిభి ర్నీరాజనప్రక్రియా. ౧

తమో హరేతాం తవ పుష్యవంతౌ రాకాసు పూర్వాపరశైలభాజౌ.
రథాంగలీలా మివ దర్శయంతౌ పురా పురారేః పృథివీరథస్య. ౨

మానుషాకారకిమ్మీర స్తంబేరమవపు ర్మహః,
ఉన్నిద్రయతు భద్రాణి రుద్రాణీ యేన సుప్రజాః, ౩

యన్మౌళౌ నిహితం చిరాయ నిగమైర్ధ్యేయం చ య ద్యోగిభి
ర్యల్లక్ష్మ్యా మృదుపాణిపద్మయుగళీసంవాహనై ర్లాలితం,
జాతా యత్ర వియన్నదీ త్రిజగతీసంతాపనిర్వాపణీ
తస్మా త్కంసభిదః పదా దుదభవ ద్వర్ణో గుణార్ణోనిధిః. ౪

తత్రాభవత్స ప్తమచక్రవర్తీ వేమక్షితీశో జగరక్షపాలః,
ఏకాదశీతి ప్రతిభాతి శంకా యేనావతారాః పరమస్య పుంసః. ౫

రాజ్యం వేమ స్స చిర మకరో త్ప్రాజ్యదానై కతానో
భూమీదేవై ర్భువ మురుభుజో భుక్తశేషా మభుఙ్క్త.
శ్రీశైలాగ్రా త్ప్రభవతి పథి ప్రాప్తపాతాళగంగే
సోపానాని ప్రమథపదవీ మారురుక్షు శ్చకార. ౬

మాచక్షోణిపతి ర్మహేంద్రమహిమా వేమక్షితీశాగ్రజో
రామాద్యై స్సదృశో బభూవ సుగుణై స్తస్య త్రయో నందనాః,
కీర్త్యా జాగ్రతి రెడ్డిపోతనృపతిః శ్రీకోమటేంద్ర స్తతో
నాగమ్మాపతి రి త్యుపాత్తవపుషో ధర్మార్థకామా ఇవ. ౭

అసూత పుత్రం పెదకోమటీంద్రో విశ్రాణనే కర్ణ మసూత పుత్రం,
వేమాభిధానం సుగుణైకతానం పాథోనిధిర్నాథమివౌషధీనాం. ౮

ధాటీదుందుభిభాంకృతిం కలయ నిర్ఘాతరావం రిపూన్
నామాని ద్రుత మర్జునస్య జపతో యస్యాజి గాండీవినః,
సంగ్రామోపపదాని తాని భవతాం రక్షాకృతే సర్వదా
వర్ణ్యంతామితి బోధయం త్య[illegible] దీయంత్రిణో మంత్రిణః ౯

శ్రీశైలే స్థిరమూలతా ముహుర్గతా వృద్ధిం కుమారాచలే
పంచారామతలే ప్రతాపసుషమా సింహాచలేంద్రే తతః,
శ్రీకూర్మే పురుషోత్తమే కుసుమితా యద్ధర్మకీర్త్యోర్లతా
కాశ్యాం విశ్వపతేః పురః ఫలవతీ నిత్యోపహారోచితం.

అభిమన్యుకరగ్రాహ్యాము త్తరాం ఖడ్గపుత్రికాం,
నర్తయ త్యాహవే రంగే యః సంగ్రామధనంజయః. ౧

అశ్రాంతం గృహరాజసౌధనివసల్లక్ష్మీకరాభ్యంతర
క్రీడాంబోరుహతాలవృంతనటనప్రస్తావవిస్తారితః,
వాయుః కేసరవాసనాసురభితో య స్యార్థిచింతామణే
ర్ద్రాగ్గావామతి దాన కేళిజనితం స్వేదాంభసాం జాలకం. ౨

సప్తసంతానవ త్యాసీ ద్యేవ పర్వాంసహేత్యలం,
స్పర్ధయేవ ధృతాః కీర్త్యా గర్భే లోకా శ్చతుర్దశ. ౩

రాజ్ఞ స్తస్య మహాదేవీ రాజమాంబేరివాంబికా,
రత్నసింహాసన స్యార్ధే రాజతే సూరమాంబికా. ౪

శాకాబ్దే శశిరామరామధరణీసంఖ్యే విరోధ్యాహ్వయే
వర్షే ఫాల్గునామ్ని మాసి బహుళే పక్షే ద్వితీయాతిథౌ,
దేవీ సా పెదకోమటీశ్వరభువః శ్రీవేమపృథ్వీపతేః
శ్రీసంతానపయోనిధేః కృతవతీ సమ్యక్ప్రతిష్ఠావిధిం. ౫

లీలాలీఢతరంగశీకరకణం రాకావిభౌ రంకుణా
హేరంబేణ మదోష్మశాంతివిధయే హేలావగాఢం ముహుః
రాజీవాసనరథ్యహంసపరిషచ్చంచూపుటీవర్త్మిత
స్వచ్ఛాంభోజ మృణాళికాకిసలయచ్ఛేదం యదీయం పయః. ౬

ఘొంటాకంఠకఠోరగర్భకుహళీపాళీమధూశీరప
స్రోతస్సౌరభటీకమానమధులిడ్ఝంకారకోలాహలైః,
వాచాలాని వనాని యస్య సవిధే సోఽయం సుధానిర
శ్రీసంతానసముద్ర ఏష పయసాంరాశి ర్జ యత్యద్భుతః. ౭

వైదూర్యో[illegible]కలామల వారిపూరే
మంత్రం క్షీమత్ర భగవా న్మధుకైటభారిః,
అంగీచకార గజతా మవనచ్ఛలేన
[illegible]వరాహమహావతారాన్

శ్రీమహాభారతే. ౧౮

దేవా మనుష్యాః పితరో గంధర్వోరగరాక్షసాః,
స్థావరాణి చ భూతాని సంశ్రయంతి జలాశయం. ౧౯
తటాకే యస్య గావస్తు పిబంతి తృషితాం జలం,
మృగపక్షి మనుష్యాశ్చ సోఽశ్వమేధఫలం లభేత్, ౨౦
ఆస్ఫోటయంతి పితరః ప్రనృత్యంతి పితామహాః,
అపి నః సకులే జాతో య స్తటాకం కరిష్యతి. ౨౧
విద్యాధికారీ శ్రీనాథో వీరశ్రీవేమభూపతేః,
అకరో దాకరో వాచాం నిర్మలం ధర్మశాసనం. ౨౨

సీ. శాకాబ్దములు సహస్రమును మున్నూటము
ప్పదియొక్కఁడును నైన భవ్యసంఖ్య
వఱలు విరోధిసంవత్సరంబున ఫాల్గు
నంబున బహుళపక్షంబు విదియ
శుక్రవారంబున శుభముహూర్తంబున
శ్రీధాన్యవాటీపురాధిపతియుఁ
గృష్ణవేణ్ణాజలక్రీడావినోదుండు
నగు గన్నభూపాలుననుఁగుఁబుత్రి
వీరనారాయణుఁడు వేమవిభునిదేవి
భూరిసద్గుణనికురుంబ సూరమాంబ
జగము వినుతింప సంతానసాగరాఖ్య
వరతటాక ప్రతిష్ఠోత్సవం బొనర్చె. ౨౩

సీ. జాహ్నవీయమునాది సకలపావననదీ
విమలతీర్థాంభః పవిత్రితంబు
సవిధదేశస్థాయి శివమౌళిబాలేందు
కామినీసంపుల్లకైరవంబు
బహుమహాపరివాహపాథోభరధ్వన
ఘుమఘుమాయితదిశాగోళకంబు
జలసారణీసేకసంవర్ధితానేక
వనివినీతాధ్వగాధ్వశ్రమంబు
బలవదురుమత్స్యకచ్ఛపఝుళికుళీర
తిమితిమింగిల విక్రమాక్రమవిహార
తరళతరతుంగభంగకదంబచుంబి
తాభ్రవీథి సంతానమహాపయోధి.  ౨౪

సీ. కపటసూకర మైన కైటభాసురవైరి
ఖురపుటంబులఁ బరిక్షుణ్ణ మయ్యె
రఘుకులోద్వహధనుర్జ్యాంకితము క్తమై న
చిచ్చుటమ్ములవేఁడిఁ జేవ దఱిగెఁ
గుంభసంభవుని హస్తాంభోరుహంబున
నాపోసనం బయి హ్రాస మొందెఁ
బాషాణముల నచ్ఛభల్లగోలాంగూల
కపియూథములచేతఁ గట్టుపడియె
వనధి యే భంగి సరివచ్చు ననఁగ వచ్చు
నారసాతలగంభీరవారి యగుచు
నపగతాపాయ మగుచు శోభాఢ్య మగుచు
ననుపమం బైన సంతానవనధితోడ.  ౨౫

శ్రీనాధవిరచిత మైన రెండవ శాసనము ఫిరంగిపురమున కంటియున్న యమీనాబాదుగ్రామసమీపమునందున్న యొక గుట్టమీదఁ జెక్కఁబడియున్న శిలాశాసనము. అందుచేత దీని నమీనాబాదుశాసనమందురు. ఈ శాసనము సంతానసాగరమను పూర్వోక్తతటాకమునకు నీరు వచ్చుటకయి జగనొబ్బగండకాలువ యనుపేరితో ౧౩౩౭-వ శకవర్షమునకు సరియైన మన్మథ సంవత్సర మాఘశుద్ధపూర్ణిమనాఁడు సూరాంబయొక్కయుఁ, బెదకోమటి వేమభూపాలునియొక్కయు కుమారుఁడైన రాచవేమారెడ్డి త్రవ్వించి ప్రతిష్ఠించిన సందర్భమునఁ జెక్కింపఁబడినది. ఈకాలువ త్రవ్వించిన కాలము క్రీస్తుశకము ౧౪౧౬ అగును. ఈ కాలమునాటికి గోమటివేమారెడ్డి జీవించియే యుండెను. అతఁడు జీవించియుండఁగానే యీ కాలువ యేల కొడుకు పేరఁ ద్రవ్వింపఁబడెనో తెలియకున్నది. ఆ సంవత్సరమునఁ గాటయవేమారెడ్డి మృతినొందఁగా రాజమహేంద్రవరరాజ్యము నాక్రమించుటకయి పెద్ద కోమటివేమభూపాలుఁడు దండెత్తి పోయినప్పుడు కొండవీటి పాలనమునకు రాజవేమారెడ్డిని నియమించి యుండును. పెదకోమటివేమభూపాలుఁడు రాజమహేంద్రవరరాజ్యసంపాదన ప్రయత్నమునందు లబ్ధమనోరథుఁడు గాక యల్లాడరెడ్డిచేత నపజితుఁడయి, హతశేషసైన్యముతో నిజరాజధానిని మరలవలసినవాఁ డయ్యెను. కొండవీటిరెడ్డిరాజులకు జగనొబ్బగండబిరుద ముండెను దానికి జగదేకవీరుఁ డని యర్థము. అందుచేతనే కాలువకు జగనొబ్బగండకాలువ యని పేరు పెట్టఁబడెను. శ్రీనాథకవివిరచిత మయిన యీ శాసనము నిందు క్రిందఁ బొందుపఱుచుచున్నాను.

సీ. శాకాబ్దములు సహస్రంబును మున్నూట
 ముప్పదియేడును నొప్పుమిగుల
మహనీయమైన మన్మథవత్సరంబున
 మాఘమాసమునపూఁర్ణిమాదినమున
హేమాద్రిదానచింతామణి యరిరాయ
 బసవశంకరుఁ డాజిఫల్గుణుండు

సమదారిరాయవేశ్యాభుజంగుండు వే
మయరాచవేమనక్ష్మావరుండు
తల్లి సూరాంబచే సముత్పన్న మగుచుఁ
బరఁగు సంతానవార్ధికి వరుసగాఁగ
నొలయు గిరివాహినుల జగనొబ్బగండ
కాలువ ఘటించె నాతారకంబుగాఁగ. "శ్రీనాథకృతి"

ఈ రెండుశాసనములకును నడిమికాలములో శ్రీనాథునిచే రచియింపఁబడిన తామ్రశాసన మొకటి కనఁబడుచున్నది. దాని నాలపాడుశాసనమందుర. అది ౧౩౧౩-వ సఁవత్సరమున రచియింపఁబడినది. ఆ తామ్రశాసనము నిందు క్రిందఁ బొందుపఱుచుచున్నాను

శ్లో. కళ్యాణం జగతాం తనోతు స విధుః కాదంబినీమేచకః
క్రీడాక్రోడతనుః పయోధిపయసో విశ్వంభరా ముద్వహన్,
భారాపేతఫణావివర్తనవశా న్మోదాయ యస్యాభవ
న్నిర్యత్నా భుజగేంద్రమౌళిమణిభి ర్నీరాజనప్రక్రియా. ౧

లీలాద్యూతజితాం కళాధరకళాం మౌళౌ దృఢం కీలితా
మాహర్తుం యుగ ముద్యమయ్య భుజయో ర్విశ్లేషయంత్యా మిధః,
పార్వత్యాః కుచకుంభపార్శ్వయుగళే సప్రేమలోలేక్షణః,
కాలక్షేపణ మిందుమోచనవిధౌ కాంక్షన్ శివః పాతు నః. ౨

భవతు భవతాం ఫలాప్త్యై కల్పలతా కాపి కరటిరాజముఖీ,
మధురసుధారసధారామధులవలలితేందుమంజరీమంజుః. ౩

తమో హరేతాం తవ పుష్పవంతౌ
ధ్వాకాసు పూర్వాపరశైలభాజౌ.

రథాంగలీలా మివ దర్శయంతౌ
పురా పురారేః పృథివీరథస్య.
య న్మౌళౌ నిహితం చిరాయ నిగమై ర్ధ్యేయం చ య ద్యోగిభిః
య ల్లక్ష్మీమృదుపాణిపద్మయుగళీసంవాహనై ర్లాలితం,
జాతా యత్ర వియన్నదీ త్రిజగతీసంతాపనిర్వాపణీ
తస్మా త్కంసభిదః పదా దుదభవ ద్వర్ణో గుణార్ణోనిధిః. ౫
తస్మా దభూత్ ప్రోలయవేమనామా
శ్రీశైలసోపానవిధానశాలీ,
హేమాద్రికల్పోదితదానదక్షో
నిస్సీమభూదాననిరూఢకీర్తిః. ౬
వేమక్షితీశో వృష మేకపాదం
ఖంజప్రచారం కలికాలదోషాత్,
దత్తాగ్రహారద్విజవేదశక్త్యా
పద ప్రకమ్రై శ్చలితం చకార. ౭
మాచక్షోణిపతి ర్మహేంద్రమహియా వేమక్షితీశాగ్రజో
రామాద్యై స్సదృశో బభూవ సుగుణై స్తస్య త్రయో నందనాః.
కీర్త్యా జాగ్రతి రెడ్డిపోతనృపతిః శ్రీకోమటీంద్ర స్తతో
నాగమ్మాపతి రిత్యుపాత్తవపుషో ధర్మార్థకామా ఇవ ౮
వేమాధిపో మాచవిభు శ్చ నందనౌ
శ్రీకోమటీంద్రస్య గుణైకసంశ్రయా.
భూలోక మేకోదరజన్మనౌ చ యా
భూయోఽవతీర్ణా వివ రామలక్ష్మణౌ. ౯
చూడామణి ర్నృపాణాం దుర్మదపరిపంథిశిఖరిదంభోళిః,
సర్వజ్ఞచక్రవర్తీ పెదకోమటివేమభూపతి ర్జయతి. ౧౦
సోఽయం వేమమహీపాలో భూపాలపరమేశ్వరః,

భూదానపీరమూర్ధన్యో ధీరోదాత్తగుణోత్తరః　　　౧౧

శ్రీశాకాబ్దే పయోరాశిరామరామేందుసమ్మితే,
నందనే మాసి మాఘాఖ్యే శివరాత్ర్యాం రవిగ్రహే　　　౧౨

పితుః పితామహో యస్య మహీయయశోనిధిః,
మాధవో నామ మేధావీ విశ్వవిద్యావిహారభూః.　　　౧౩

పితామహో మహావిద్వాన్ యస్య శ్రీగుండయాభిధః,
వేదాదీనాం విశుద్ధానాం విద్యానాం జన్మమందిరం.　　　౧౪

శాపానుగ్రహదక్షో లక్ష్మీనరసింహమంత్రసంసిద్ధః,
సకలకవిసార్వభౌమో మాధవభట్టః పితా యస్య　　　౧౫

శ్రీవిశ్వేశ్వరవిదుషే భారద్వాజాన్వయావతంసాయ,
స్మయవిరహితాయ తస్మై విద్యావినయాన్వితాయ పుణ్యాయ.　　　౧౬

ప్రదాత్త్రిలింగవిషయే వెలనాండౌ మనోరమే,
తుంగభద్రాతరంగిణ్యాః ప్రాక్తీరే పర్యవస్థితం.　　　౧౭

ఆలపాడు రితి ఖ్యాతం గ్రామ మాచంద్రతారకం,
సాష్టైశ్వర్యం హ్యాష్టభోగం ధారాపూర్వం ధరాధిపః.　　　౧౮

ఈదానశాసనము శాలివాహనశకము ౧౩౩౭ నందనసంవత్సర మాఘమాసము శివరాత్రినాఁ డనఁగా ౧౪౧౩-వ సంవత్సరము జనేవరు నెల ౩౧ వ తేదీని భారద్వాజగోత్రుఁ డైన విశ్వేశ్వరపండితునకు వెలనాటిసీమలో తుంగభద్రా తీరమునం దుండిన యాలపాడు గ్రామము నగ్రహారముగా నిచ్చిన సందర్భమున వ్రాయఁబడినది. పయి మూఁడు శాసనములును గాక శ్రీనాథవిరచిత మింకనది పొన్నుపల్లి శాసనమనఁబడెడి యింకొక తామ్రశాసనము కూడఁ

గాఁబడుచున్నది, పొన్నుపల్లి గ్రామము గుంటూరు మండలమునందలి రేపల్లెతాలూకాలోనిది. ఈ శాసనములోని మొదటి పది శ్లోకములును సరిగా ఇలపాడుశాసనములో నుండినవే.

శ్లో. యత్కీర్తిగానసమయే ఫణిసుందరీణా
మాలోకితుం చ ముఖరాగ మనంగమూలం,
శ్రోతుం చ గీతరచనాం యుగప న్న దక్షో
నాగాధిపో న సహతే నయనశ్రుతిత్వం. ౧౧

అను పదునొకండవ శ్లోకము క్రొత్తది. పండ్రెండవ శ్లోకము వెనుకటి శాసనములో నుండినదే దాని తరువాతి శ్లోకములు ప్రత్యేకముగా నీ శాసనముతో సంబంధించినవి.

శ్లో. సోఽయం వేమమహీపాలో భూపాలపరమేశ్వరః,
భూదానవీరమూర్ధన్యో ధీరోదాత్తగుణోత్తరః. ౧౨

ఖరామరామేందుమితే శాకాబ్దే సర్వధారిణే,
ఉపరక్తే సహస్రాంశౌ మాసే చాశ్వయుజాహ్వయే. ౧౩

న ప్త్రే శ్రీపేర్యపేళ్ళస్య కళ్యాణగుణశాలినః,
ఆకర్తృకాణాం సాంగానాం మధ్యానాం వచసా న్నిదేః. ౧౪

శ్రీభట్టభాస్కరార్యస్య పౌత్రాయ బ్రహ్మవాదినే,
అష్టాదశానాం విద్యానాం మధ్వన్యస్య మహాశవసోః. ౧౫

పుత్రాయ విర్లయార్యస్య వేదవేదాంగవేదినః
ఆయుర్వేదం చ సాష్టాంగం నిర్నిరోద మధీతినః. ౧౬

ఫణిరాజమహాభాష్యఫక్కికాపరమేష్ఠినే,
కర్మబ్రహ్మపరామర్శమీమాంసామాంసలాత్మనే, ౧౭

కణభుగ్గ్రంథితగ్రంథసింధుమంథానభూభృ
అక్షపాదమతప్రేక్షపక్షిణీకృంచేతసే, ౧౮

తస్మై కాశ్యపగోత్రాయ సింగనార్యాయ ధీమతే,
శాంతాయ శివభక్తాయ యజరామ్నాయవేదినే, ౧౯

ప్రాదా త్త్రిలింగవిషయే వెల్నాడో ర్ధిపసీమని,
కృష్ణవేణ్యా స్తరంగిణ్యాః ప్రతీరే పర్యవస్థితం. ౨౦

పొన్నుపల్ల్యాహ్వాయం గ్రామం నిధానం సర్వసంపదాం,
సాష్టైశ్వర్యం సాష్టభోగం ధారాపూర్వం ధరాధిపః. ౨౧

అస్య గ్రామస్య చిహ్నాని దేశభాషయా లిఖ్యంతే

... .... .... ....

శ్రీనాథభట్టశాసనాచార్య దక్షిణ భాగం వకటి.

* * * *

శ్లో. విద్యాధికారీ శ్రీనాథో వీరశ్రీవేమభూపతేః,
అకరో దాకరో వాచాం నిర్మలం ధర్మశాసనం.

ఈ శాసనము శాకాబ్దములు ౧౩౩౦ సర్వధారిసంవత్సరాశ్వయుజ మాసమునందు సంభవించిన సూర్యోపరాగసమయమున ననఁగా క్రీస్తు శకము ౧౪౦౮-న సంవత్సరములో వైద్యశిఖామణియు, మహావిద్వాంసుఁడు నైన సింగరార్యునకు వెల్నాటిసీమలో కృష్ణాతీరమునం దుండిన పొన్నుపల్లి గ్రామమును దాన మిచ్చిన సందర్భమున వ్రాయఁబడినది. "శ్రీనాథభట్టి శాసనాచార్య దక్షిణ-భాగం వకటి" అని శాసనాంతమునం దుండినందున శ్రీనాథున కీగ్రామములో నొకభాగ మియ్యఁబడినట్టు కనుపట్టుచున్నది. పూర్వోదాహృతములైన యీ నాలుగు శాసనములలో నీ పొన్నుపల్లి శాస

నమే మొట్టమొదటిది. దీనినిబట్టి శ్రీనాధుఁడు ౧౪౦౮-వ సంవత్సరమునకుఁ బూర్వమునందే విద్యాధికారిగా నియమింపబడినట్టు స్పష్టపడుచున్నది.

ఈ నాలుగు శాసనములను దప్ప శ్రీనాధుఁడు పెదకోమటి వేమారెడ్డి కొండవీటిరాజ్యపరిపాలనము చేసిన యిరువది సంవత్సరములలోను వేఱు గ్రంథ మేదియుఁ జేసినట్టు కానఁబడదు. చేసినచో శృంగారదీపికనుగూడ చేసియుండవచ్చును. అమరుకవ్యాఖ్య యైన శృంగారదీపికలోని మొదటి తొమ్మిది శ్లోకములు నిట్లున్నవి.

౧. శ్లో. విశంకటకటస్థలీగళదమందదానస్పృహా
భ్రమద్భ్రమరకాకలీకలితనిత్యకర్ణోత్సవమ్,
ప్రణమ్రజనమస్తక ప్రకటడిండిమాడంబరం
ముఖే గజ ముపాస్మహే వపుషి మానుషం దైవతమ్.

౨. అన్యోన్యమేళనవశాత్ ప్రథమం ప్రవృద్ధం
మధ్యే మనా గ్వ్యవహితం చ కుతోఽపి హేతోః,
ప్రాప్తం దశా మథ మనోరథలాభయోగ్యాం
పాయాచ్చిరం రతిమనోభవయో స్సుఖం వః.

౩. రాజ్యం వేమ స్స చిర మకరోత్ ప్రాజ్యహేమాద్రిదానో
భూమీదేవై ర్భువమురుభుజో భుక్తశేషా మభుంక్త,
శ్రీశైలాగ్రాత్ ప్రభవతి పథి ప్రాప్తపాతాళగంగా
సోపానాని ప్రమథపదవీ మారురుక్షు శ్చకార.

౪. మాచక్షోణిపతి ర్మహేంద్రవిభవో వేమక్షితీశాగ్రజో
హేమాద్రే స్సదృశో బభూవ సుగుణై స్తస్య త్రయో నందనాః.
కీర్త్యా జాగ్రతి రెడ్డిపోతనృపతిశ్శ్రీకోమటీంద్ర స్తతో
నాగక్ష్మాపతి రి త్యుపాత్తవపుషో ధర్మార్థకామా ఇవ.

౫. వేమాధిపో మాచవిభుశ్చ నందినౌ
శ్రీకోమటీంద్రస్య గుణై కసంశ్రయౌ ?
భూలోక మేకోదరజన్మవాంఛయా
భూఽయో వతీర్ణావివ రామలక్ష్మణౌ,
౬. స వేమభూప స్సకలాసు విద్యా స్వతి ప్రగల్భో జగనబ్బగండః,
కవిదాస్థానగతః కవీనాం కావ్యామృతాస్వాదనతత్పరోఽభూత్.
౭. ఆమరుకకవినా రచితాం శృంగారరసాత్మికాం శతశ్లోకీమ్,
శ్రుత్వా వికసితచేతా _స్తదభిప్రాయం ప్రకాశతాం నేతుమ్
౮. మూలశ్లోకాన్ సమాహృత్య ప్రక్షిప్తా స్పరిహృత్య చ,
విధ_త్తే విదుషామిష్టాం టీకాం శృంగారదీపికామ్
౯. అవతారోఽథ సంబంధోఽభిప్రాయో భావలక్షణమ్,
నాయికా తదవస్థా శ్చ నాయక శ్చ తథా రసః
౧౦. అంగాని కై_శికీవృ_త్తే రలంకార _స్తతః క్రమాత్,
ఇ త్యేతాని ప్రవక్ష్యంతే యథాసంభవ మంజసా.
పు_స్తకాంతమునం దీ గద్య మున్నది.

'ఇతి శ్రీవీరనారాయణ సకలవిద్యావిశారద పెద్దకోమటివేమభూ
పాల విరచితా శృంగారదీపికాఖ్యా అమరుకవ్యాఖ్యా సమాప్తా.'

ఈ శృంగారదీపికయందలి ౪, ౫ పద్యములు శ్రీనాథునిశాసనములలోనివి, ఈ పు_స్తకము శ్రీనాథకృత మనుట కీ రెండు శ్లోకములే యాధారములు, ౧౪౦౦-వ సంవత్సరము మొదలుకొని ౧౪౨౦-వ సంవత్సరమువఱకును మహాకవి యైన శ్రీనాథుఁ డొక్క గ్రంథమునై నను జేయక యూరకుండఁ జాలఁడు. ఇట్లు వ్యర్థపుచ్చఁబడిన దనుకొన్న కాల మిరువది సంవత్సరములే యననేల ? ఇరువదినాలుగు సంవత్సరములు కావచ్చును. శ్రీనాథుఁడు విద్యాధికారిగా నున్న కాలము పెదకోమటివేమన రాజ్యకాలము మాత్రమే

కాక యాతని కుమారుఁడైన రాచవేమనరాజ్యకాలముకూడ నయి యున్నది. ౧౪౦౩-వ సంవత్సరము మొదలుకొని ౧౪౨౦-వ సంవత్సరమువఱకును పెదకోమటివేమనయు, ౧౪౨౦ నుండి నాలుగు సంవత్సరములు రాచవేమనయు భూమిపాలనము చేసిరని కొందఱును, రాచవేమని నాలుగు సంవత్సరములును ౧౪౨౪-వఱకును గాక తండ్రి రాజ్యకాలమని చెప్పఁబడెడి దానిలోఁ గడపటి నాలుగుసంవత్సరములే యయి ౧౪౨౦-వ సంవత్సరము వఱకు మాత్రమే యనియు ౧౪౨౦-వ సంవత్సర ప్రాంతమునందే కొండవీటిరెడ్డిరాజ్యము కర్ణాటప్రభువుల పాలయ్యెనని కొందఱును శాసనసంశోధకులు చెప్పుచున్నారు. ఎట్లయినను వింశతిదీర్ఘసంవత్సరములు నిరర్గళకవితాధార గల కవిచేతి లేఖినియు ననల్పకల్పనసమర్థమైన బుద్ధియు స్వసామర్థ్యమును మఱచి యస్వాభావికనిద్రను వహించుట సంభావ్యము కాదు. అందుచేత శ్రీనాథుఁ డీ కాలములో నేదో మహాగ్రంథమును రచించుచుండియుండవలెను. ఆ మహాగ్రంథము శివరాత్రిమాహాత్మ్య మని తోఁచుచున్నది. * శ్రీనాథుఁడు దీనిని తన ప్రభువైన పెదకోమటివేమవిభున కంకితము చేయవలె ననియె యుద్దేశించి యుండును. కాని యింతలోపల కొండవీటిరాజ్యమన్యాక్రాంత మగుటయుఁ, దనకాశ్రయులైన వేమనృపాలసింగనామాత్యాదులు నరలోకగతు లగుటయుఁ దటస్థించినందున శ్రీనాథమహాకవి రాజధానియైన కొండవీటియందు నిలువనాధారము లేక తన గ్రంథపరికరములతో నావీడు విడిచి దేశాంతరగమనోన్ముఖుఁడయి ౧౪౨౦-వసంవత్సర ప్రాంతముల

* [శివరాత్రిమాహాత్మ్యము శ్రీనాథుని కడపటి రచనయైయుండునని శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు, ఆంధ్రకవి తరంగిణీ కర్తయుఁ దలంచుచున్నారు. శ్రీనాథమహాకవి పెదకోమటి వేమారెడ్డి యాస్థానమున విద్యాధికారిగానున్న కాలములో గ్రంథరచనము సాగించి యుండకపోవచ్చుననియూ, గ్రంథములను రచింపవలెనను నియమమూ లేదనియూ, శ్రీనాథుఁడు తనకావశ్యకమని తోఁచినపుడే గ్రంథరచనకుఁ గడంగుచుండెననియూ, జీవనము నిర్విచారముగ సాగిపోవుచుండుటచే గ్రంథరచనం గూర్చిన యాలోచనయే యతనికి లేకుండెనని యూహింపవచ్చుననియుఁ గొందఱి యాశయము. పెదకోమటి వేమారెడ్డికి సంస్కృతముపై నెక్కువ వ్యామోహముండుటయు నిందులకు హేతువైనఁ గావచ్చునని కొందఱి యూహ.]

యందు ముందుగా స్వార్థమును తీర్థముగలిసివచ్చునట్లుగా శ్రీశైలయాత్రకు వెడలెను. దక్షిణహిందూస్థానములో వైష్ణవులకు విష్ణుస్థల మయిన చిత్తూరు మండలములోని తిరుమల యెట్లు ముఖ్యస్థలమో, యట్లే శైవులకు శివస్థల మయిన కర్నూలు మండలములోని శ్రీశైలము ముఖ్యస్థలము ఒకటి సంస్కృతముగాను, రెండవది యఱవముగాను నున్నను శ్రీశైలము తిరుమల యను రెండు పదములకు నర్థ మొక్కటియే. రెంటికిని పవిత్రమైన పర్వతమని యర్థము శ్రీశైలస్థలాధిదేవతలు మల్లికార్జునుఁడును భ్రమరాంబయు నయి యున్నారు. అట్టి పుణ్యస్థలమయిన శ్రీశైలదివ్యక్షేత్రమునకు కొండవీటిరెడ్డిరాజ్యనాశనానంతరమున శ్రీనాథుఁడు యాత్రకుఁ బోయి దేవతా దర్శనముఁ జేయుటయేకాక యచ్చట మఠాధికారు లయి యుండిన జంగమ గురుపీఠమువారి దర్శనము చేసి వారి యనుగ్రహమునకుఁ బాత్రుఁడయి తాను రచించిన శివరాత్రి మాహాత్మ్యమును ముమ్మయపుత్రుడైన శాంతయ్య కంకిత మొనర్చెను. ఈ శివరాత్రిమాహాత్మ్యమును ఆంధ్రసాహిత్య పరిషత్తు వారు సంపాదించి తమ గ్రంథాలయమునందుంచియున్నారు. వారియొద్ద నున్న తాళపత్రపుస్తకము పురాతనమయి కొంతవఱకు భాణనామకక్రిముల కాహారమయి మిక్కిలి శిథిలమయి యున్నది. ఆ పుస్తకములోని మొదటి పద్యములోని మొదటి పాదమే మొదలు చెడి యిట్లున్నది.

శా.......... ... ... ........ ... ... వాశ్రితోరస్స్థలీ
  నాగాధీశవిశిష్టసంస్తవలసన్నాళీకపాదద్వయ
  ప్రాగల్భ్యం బగు శంకరుండు మనుచుం బ్రత్యక్షమై యెప్పుడు౯
  యోగీంద్రాఖ్యుని ముమ్మడీంద్రసుతు నయ్యుద్యుక్తశాంతాత్మునిన్.

శివరాత్రిమాహాత్మ్యములోని రెండవ పద్య మిది—

శా. శ్రీరామారమణుం డశేషజగతీక్షేమంకర ప్రక్రియా
  భారాయత్తమనస్కుఁ డార్యజనసంభావ్యుండు భవ్యాత్ముఁడై
  గారా మారఁగ నొమ్మమాంబికసుతున్ గౌరీశభక్తాగ్రణిన్
  ధీరున్ ముమ్మయశాంతునిన్ మనుచు సంధిల్లాయురర్థాఢ్యుఁగన్,

"స్వస్తిశ్రీపర్వత స్వయంభూశ్రీలింగచక్రవర్తి శ్రీమల్లికార్జున శ్రీమహాదేవుని ముఖమండపంబున సుఖాసీను లయి—————————— బలసి యుండ శ్రీశాంతభిక్షావృత్తియతీశ్వరుఁడు శివకథావిధానంబులఁ బ్రొద్దులు పుచ్చుచుఁ దన మూలభృత్యుండగు పువ్వుల ముమ్మడిదేవయ్య శాంతునిం గనుంగొని నీపేరన... కవిత్వంబున నీకథ యుపన్యసింప నగునన మహాప్రసాదం బని సత్కవిసార్వభౌముఁడగు శ్రీనాథకవివరేణ్యుని "కృపావిశేషంబున" నీ శివరాత్రి మాహాత్మ్యము చెప్పఁబడె నని పుస్తకమునందు వ్రాయఁబడినది. శ్రీశాంతభిక్షావృత్తియతీశ్వరుని మూలభృత్యుఁడగు పువ్వులశాంతయ్య కీ కృతి యియ్యఁబడినట్లు పయి వాక్యములవలన విదితమగుచున్నది కృతిపతి యైన శాంతయ్యతండ్రి ముమ్మడి దేవయ్య; తల్లి యొమ్మమాంబ. వీ రిరువురు శివరాత్రిమాహాత్మ్యమునందిట్లు వర్ణింపఁబడిరి.

సీ. పంచాక్షరీమంత్రపారిజాతోద్భూత
ఫలము లే గురుపుసంభాషణములు
వీరశైవాచారవిమలమార్గానూన
శాశ్వతం బే గురుస్వామిమహిమ
నిఖిలదేవాధీశనివహా ప్రమేయక
పాత్ర మే గురుమూర్తి పాదయుగళి
శంకరపూజాప్రశస్తదీక్షాజనా
హ్లాద మే గురువుహస్తాంబుజాత
మనఁగఁ బండితచెనమల్లికార్జునునకు
బౌత్రరత్నంబు సెట్టియప్రభుసుతుండు
మారమాఁబాతనూజుండు మహితయశుఁడు
వెలయు ముమ్మడిదేవయ వినుతకీర్తి.

సీ. పరమపాతివ్రత్యభావంబు తలఁపంగ
గౌరి కాఁబోలు నీ కాంత తలఁప
సకలసంపత్ప్రాప్తిచాతుర్యమహిమల
నిందిర కాఁబోలు నిందువదన

సకలవిద్యాప్రౌఢి సడిసన్న గరిమల
భారతి కాఁబోలు భామ యెపుడు
సర్వలక్షణసంపన్నతోన్నతి
నింద్రాణి కాఁబోలు నిగురుబోఁడి
యనఁగ నిద్ధాత్రి నేప్రొద్దు నతిశయిల్లెఁ
బరఁగ ముమ్మిడిదేవయ్యభామ జగతిఁ
గామితార్థకసంధానకల్పవల్లి
యుజ్జ్వలద్గుణనికురుంబ యొమ్మమాంబ.

అటు తర్వాత నీ దంపతుల పుత్రుఁడు కృతిపతియైన శాంతయ్య యిట్లని వర్ణింపఁబడెను.

సీ. పరవాదిమత్తేభపంచాననాఖ్యుండు
పరవాదిమండూకపన్నగుండు
పరవాదినవమేఘపవమానధీరుండు
పరవాదిసాగరబాడబుండు
పరవాదికుత్కీలభానురదంభోళి
పరవాదికేంధనపావకుండు
పరవాదిచయతమఃపటలోగ్రభానుండు
పరవాదిభోగిసుపర్ణుఁ డనఁగఁ
జటులజైనకోలాహలసమరబిరుద
ఘనుఁడు సంగ్రామపార్థుండు వినుతయశుఁడు
శుభుఁడు ముమ్మిడిదేవయ్యసుతుఁ డనంగ
వెలసె శాంతయ్య విక్రమవీరవరుఁడు.

గీ వేఁడెఁ గవిసార్వభౌముని విమలచరితు
స్కాందపౌరాణికము లైన కథలలోన
ఘనత శివరాత్రిచరితంబు తెనుఁగు గాఁగఁ
గరుణజేయుము శ్రీనాథకవివరేణ్య.

వ. అనవుడు నమ్మహీసురాగ్రగణ్యుండు కమలనాభామాత్యపౌత్రుండు మారయామాత్యపుత్రుండు శ్రీనాథకవివరేణ్యుండు సంతుష్టమానసుండై శాంతస్వామి యొసంగిన కర్పూరతాంబూలజాంబూనదాభరణంబుల నంగీకరించి స్కాందపురాణంబున నీశానసంహితఁ ... .. జెప్పంబడ్డ ... శివరాత్రిమాహాత్మ్యంబు ... .... . ."

*    *    *    *

క. వరముమ్మడిశాంతునకున్
బరమపరజ్ఞాననిధికిఁ బావనమతికిన్
నిరుపమవిక్రమయశునకుఁ
గరుణారసపూరితాత్మకవితాంగునకున్.

వ అభ్యుదయపరంపరాభివృద్ధియు సత్యధర్మక్రియావృద్ధియు నగునట్లష్టాదశ వర్ణనాగర్భంబుగా నత్యాశ్చర్యకరంబై యుండ నా రచియింపంబూనిన కథానిధానంబు ——————— నా నేర్చిన విధంబున రచియించెద".

అని శ్రీనాథుఁడు గ్రంథావతారికయందుఁ జెప్పెను. ఆ వఱకుఁ దాను గోమటివేమనృపాలుని జీవితకాలములోనే రచియించుచుండిన గ్రంథమునే యవశిష్టమును ముగించి యవతారికను వ్రాసి యాశ్వాసాద్యంత పద్యములను జేసి శ్రీశైలయాత్రాసమయమునం దర్థసంభావనమును బడసి శ్రీనాథుఁ డీ శివరాత్రిమాహాత్మ్యమహాకావ్యమును మహాధనసంపన్నుఁడైన ముమ్మడి శాంతయ్య కంకిత మొనర్చినట్లు తోఁచుచున్నది ఈ గ్రంథము ౧౪౨౪ సంవత్సర ప్రాంతమునందు సంపూర్తి చేయఁబడి యుండును.

ఇట్లు శ్రీశైలయాత్రవలన తీర్థమును స్వార్థమును గలిసి వచ్చి యభిమతార్థ సిద్ధి యయినతరువాత శ్రీనాథుఁ డక్కడనుండి వెలువడి ధనాగమసమ్మాన సముపార్జనార్థమయి స్థలాంతరాన్వేషణము చేసికొనవలసినవాఁ డయ్యెను.

ఎంతటి సమర్థుడయినను రాజాశ్రయము లేనిచోట చిరకాలము నిలిచిన యెడల ధనాగమముగాని గౌరవముగాని తగినంత యుండదు. అందుచేత నాతఁ డిప్పుడు రాజాశ్రయము లభింపఁగల స్థల మేదో యొకటి చూచుకొని యచ్చటికిఁ బోవలెను. దేశాభిమానముచేత స్వస్థలమయిన కొండవీటిసీమకు మరలఁ బోఁ దలఁచినచో నా దేశము శత్రుభూకాంతక్రాంతమయి రాజులేని భూమియైనది. ఇఁక నప్పుడు ప్రబలమయి యుండిన రెండవ రెడ్డిరాజ్యమైన రాజమహేంద్రవరమునకుఁ బోవలె నన్నచో దానిని పాలించుచుండిన రెడ్డి రాజులు తన తేలికయయి యుండిన పెదకోమటి వేమభూపాలునితోఁ బోరాడి కష్టములపాలయిన యాతని గర్భశత్రువు లయి యుండిరి. ఒకవేళ సాహసముచేసి పోయినను వారు తమ శత్రురాజుయొక్క కవీశ్వరు నాదరించి గౌరవింతు రనుట యసంభావ్యము. ఈ హేతువులచేత శ్రీనాథుఁ డా కాలము నందు మహాబలిష్ఠమయి యుండిన కర్ణాటరాజధానికిఁ బోవలసినవాఁడయ్యెను. కర్ణాటకరాజ్య మా కాలమునందు ప్రౌఢదేవరాయలచేతఁ బాలింపఁబడు చుండెను. అతఁడు ౧౪౨౩-వ సంవత్సరమునందు సింహాసనమెక్కి ౧౪౪౭-వ సంవత్సరమువఱకును రాజ్యపరిపాలనము చేసెను.

శ్రీనాథకవీంద్రుఁడు కర్ణాటరాజ్యరాజధానికిఁ బోయినప్పుడు డాతని కొక పట్టున రాజదర్శనము లభించినది కాదు. సాధారణముగా పండితు లన్యోన్య మాత్సర్యము గలవా రగుటచేత క్రొత్తగా విదేశమునుండివచ్చిన విద్వాంసు నకు భగీరథ ప్రయత్నముమీఁదఁ గాని రాజసందర్శనము కానియ్యరు. రాజ సేవకుల నాశ్రయించి ముందుగా వారిని సంతోషపెట్టి, వారి యనుగ్రహ మును సంపాదించువఱకును వారు సహిత మభినవాగతుల కనేకములైన ప్రతిబంధములను గల్పించుచుందురు. అందుచేత శ్రీనాథుఁడు రాజసందర్శన మగుటకు ముందా పురమునందు పూఁటకూటి యిండ్లలో వేళగాని వేళలో నపాత్రపు భోజనములు చేయుచు నోట మెతుకులు పడఁగానే యంగిలు తొడిగి, కుళ్ళాయలు పెట్టి తెల్లబట్టలు కట్టి ప్రతిదినమును రాజాస్థానమునకుఁ బోయి రాజసేవకుల ననుసరించుచు బహుదినములు పరదేశములు కష్టపడ

వలసినవాఁ డయ్యెను ఆ సమయములో విసుఁగుచెంది కవిచెప్పిన పద్య మును చూడుఁడు

శా. కుళ్ళా పెట్టితిఁ గోక చుట్టితి మహాకూర్పాసముం దొడ్గితిన్
వెల్లుల్లిం దిలపిష్టము న్మెసవితిన్ విశ్వస్త వడ్డింపఁగాఁ
జల్లా యంబలి ద్రావితిన్ రుచుల దోసం బంచుఁ బో నాడితిన్
దల్లీ! కన్నడరాజ్యలక్ష్మి! దయలేదా? నేను శ్రీనాథుఁడన్.

పయి పద్యములో "తల్లీ! కన్నడరాజ్యలక్ష్మి!" యని కర్ణాటకదేశము సంబోధింపఁబడి యుండుటనుబట్టి శ్రీనాథుఁడు కర్ణాటదేశస్థుఁడని యొకానొకరు విషయవిచారము చేయక వ్రాసిరి; గాని యది గ్రాహ్యము కాదు. శ్రీనాథు డెప్పుడును దాను పాకనాఁటి సీమవాఁడ * ననియు, కొండవీటివాసుఁడ ననియు, జెప్పుకొనుచుండెను కర్ణాటకరాజధానియందు రాజసందర్శనము కాకముందో, ప్రథమసందర్శన సమయమునందో మీ వాసస్థల మేది? యని యడుగఁగా శ్రీనాథుఁడు కొండవీ డని యీ క్రింది పద్యముతోఁ జెప్పినట్లు చెప్పుదురు.

'సీ. పరరాజ్యపరదుర్గపరవైభవశ్రీలఁ
గొనకొని విడనాడు కొండవీడు
పరిపంధిరాజన్యబలముల బంధించు
కొమరు మించినబోడు కొండవీడు
ముగురురాజులకును మోహంబు పుట్టించు
గుఱుతైన యుత్రాడు కొండవీడు
చటులవిక్రమకళాసాహసం బొనరించు
కుటిలాత్ములకుఁ గాడు కొండవీడు

* [శ్రీనాథుఁడు పాకనాఁటింటివాఁడు కాని, పాకనాటిసీమవాఁడు కాఁడని విమర్శ కుల యభిప్రాయము.]

జవనఘోటకసామంతసరసవీర
భటనటానేకహాటక ప్రకటగంధ
సింధురారావమోహనశ్రీలఁ దనరు
కూర్మి నమరావతికి జోడు కొండవీడు

ఈ పద్యము కర్ణాటకరాజదర్శనార్థ మరిగినప్పుడు చెప్పఁబడినది కాకపోయి నను శ్రీనాథునిచేఁ జెప్పఁబడిన దగుటకు సందేహములేదు. బహుదినములు విజయనగరములోఁ బ్రవాసాయాసము ననుభవించిన తరువాత తుదకు శ్రీనాథునకు రాజసందర్శనమయి బహూకరణము జరిగినది రాజదర్శనము క్రీడాభిరామకర్త యైన వినుకొండవల్లభరాయని నాశ్రయించి నాతని కంకిత ముగా వల్లభాభ్యుదయమును జేయుటవలన నాతని మూలమున లభించిన దని చెప్పుదురు. వల్లభాభ్యుదయమును నేను జూడలేదు. శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు క్రీడాభిరామ పీఠికలో "శ్రీనాథుని వల్లభాభ్యుదయ ములోఁ గృష్ణాతీరమున నుండు శ్రీకాకుళస్వామితిరునాళ్ళలో జరుగు నసభ్య ములు దీనికంటెఁ బచ్చిగా నున్నవి ... ... . మఱియు వల్లభాభ్యుదయ మున నాంధ్రవల్లభుని తిరునాళ్ళలోని విధవాదుర్వర్తనములు శ్రీనాథుఁడు విశదముగా వర్ణించి యున్నాఁడు......... ... ... శ్రీనాథుఁడు శ్రీకాకుళాధీ శ్వరుఁడగు తెలుఁగురాయని దర్శించి యని కంకితముగా వల్లభాభ్యుదయము చెప్పెనుగదా!" అని వ్రాసి యున్నారు. ఈ వాక్యములనుబట్టి చూఁడగా వల్లభాభ్యుదయము శ్రీకాకుళాంధ్రదేవుని యుత్సవములలో నడచుచుండెడు విశ్వస్త్రాదుల దుర్వర్తనాది వర్ణములనుగలది యనియు, అది యాంధ్రవిష్ణు దేవునికే యంకిత మొనర్పఁబడిన దనియుఁ దెలియవచ్చుచున్నది *

---

♦ [ఈ విషయ మిదివరకే చర్చింపఁబడినది.]

* [వల్లభాభ్యుదయ మింతవఱకును లభింపలేదు. అది శ్రీనాథకవికృత మని కొందఱందురు. అది శ్రీనాథుని వల్లభాభ్యుదయములోనిదిగా నొక పద్యము పెదపాటి జగన్నాథకవి 'ప్రబంధరత్నావళి' లో నుదాహరింపఁబడినది. వల్లభాభ్యుదయకర్త వేఱై యుండవచ్చునఁట! క్రీడాభిరామముకాక శ్రీనాథుని వీధినాటకమ్ను మఱి యొక పుస్తకము ప్రచారములో నున్నది అదియే వల్లభాభ్యుదయమని కొంద ఱందురు. అది శ్రీనాథకృతమనుటకుఁ దగిన యాధారములు లేవు]

ఎవరి యనుగ్రహమువలననైన నేమి? శ్రీనాథునకు రాయల సందర్శన లాభము కలుగుటయేకాక తదాస్థానమునందు విశేషవిద్వాంస విజయలాభమును, తద్బిరుదాంకసంపాదనలాభమును, కనకాభిషేకలాభమును గూడఁ గలిగినవి లాభములు రాఁదొడఁగినప్పుడు లాభములమీఁదనే లాభములు వచ్చును గదా! రాయల సంస్థానమునందు శ్రీనాథ మహాకవికి తదాస్థాన విద్వాంసుఁ డగు డిండిమకవిసార్వభౌమ బిరుదాంకితునితో నుద్భట వివాద మొకటి సంప్రాప్త మయ్యెను. మహారాజాశ్రయము గల యా విద్వాంసుఁడు స్వవిజయనిశ్చయాహంకారముచేతను, విద్యాగర్వముచేతను దన్నాత డోడించినయెడల తన విజయడిండిమమును బగులగొట్టించుకొని తన కవిసార్వభౌమ బిరుదము నిచ్చివేయుదునని పంతములు పలికి యుండును. తానొకటి తలఁచిన దైవ మొకటి తలఁచును గదా! వివాద మే విషయములోనో దెలియదు గాని యిరువురకును నడచిన యుద్భటవివాదములో శ్రీవాణీప్రసాదలబ్ధసకలవిద్యా సనాథుఁ డగు శ్రీనాథుఁడే విజయమునొంది యా గౌడడిండిమభట్టు కంచుఢక్కను బగులఁగొట్టించి యాతని కవిసార్వభౌమ బిరుదమును లాగుకొన సమర్థుఁ డయ్యెను. ఈ కవిసార్వభౌమ బిరుదసమార్జనమునకు మన కవిరాజునకు చంద్రశేఖరు క్రియాశక్తి తోడయినట్టు చెప్పుదురు "చంద్రశేఖరు క్రియాశక్తి రాయలయొద్దఁ బాముకొల్పితి సార్వభౌమ బిరుద" మని శ్రీనాథుఁడే పయి సీసపద్యపాతమునందుఁ జెప్పెను. "శ్రీనాథుఁడు సాళ్వగుండ నరసింహరాయల కాలములో నుండినట్లును, తదాస్థానమునకుం బోయి డిండిమభట్టు నోడఁగొట్టినట్లును తెలియుచున్నది. గోకఁ జుట్టితి ... ...తల్లీ! కన్నడరాజ్యలక్ష్మి! దయలేదా నేను శ్రీనాథుఁడన్" అని చెప్పినది నరసింగరాయల యాస్థానమునందే! డిండిమ కవిని శ్రీనాథుఁ డోడించెను గదా! 'పగులఁ గొట్టించి తుద్భటవివాదప్రౌఢి గౌడడిండిమభట్టుకంచుఢక్క' అనునది నిక్కమే. ఈ డిండిముఁడే జైమిని భారతముఁ గృతినందిన సాళ్వగుండ నరసింహరాజు విజయములను వర్ణించుచు సాళువాభ్యుదయ మను సంస్కృతకావ్యమును రచించెను.

——— చంద్రశేఖరుఁ డను

నియోగిపుంగవుఁడు నరసింగరాయల మంత్రి యని సాళువాభ్యుదయమున నున్నది. కావున 'చంద్రశేఖరు క్రియాశక్తి రాయలయొద్దఁ బాదుకొల్పితి సార్వభౌమబిరుదు' అనునది స్పష్టముగా నర్థ మగుచున్నది. ఈ నరసింహ రాయలు క్రీ. శ. ౧౪౫౦ లో నున్నట్లు తెలియుచున్నది." అని రామకృష్ణ కవిగారు క్రీడాభిరామ పీఠికలో వ్రాసి యున్నారు. సాళువగుండ నరసింహ రాయలు ౧౪౫౦ వ సంవత్సరమునకు పైని ౧౪౭౦-౮౦ సంవత్సర ప్రాంతములయం దుండినవాఁ డగుటచేతను, శ్రీనాథకవి ౧౪౫౦-వ సంవత్స రమునకు ముందే ౧౪౪౦-౪౫ సంవత్సర ప్రాంతములయందే మృతి నొందిన యుండుటచేతను, ఈ కవిసార్వభౌమబిరుదపమూర్జనకథ ౧౪౩౫-వ సంవత్సర ప్రాంతమున రచింపఁబడిన కాశీఖండరచనమునకుఁ బూర్వమునందే నడచి యుండుట చేతను, శ్రీనాథుఁడు సాళువగుండ నరసింహరాయల యాస్థాన ములో నుండిన డిండిమభట్టుతో వాదము చేసి జయించుట సంభవింపనేరదు. కాఁబట్టి శ్రీనాథునిచే నోడఁగొట్టఁబడిన డిండిమభట్టు వేఱొకఁ డయి యుండ వలెను. ఇప్పుడు డిండిమభట్టు లెందఱున్నారను ప్రశ్న వచ్చును ఆ పేరు గలవారు ముగ్గురు నలుగు రున్నట్లు తెలియవచ్చుచున్నది

యోగానంద ప్రహసమునందు తత్కర్తయైన యరుణగిరినాథుఁడు తన మాతామహుఁడు "బ్రహ్మాండభాండ పిచండమండలిత విజయడిండిమచం డిముఁ" డనియు, "డిండిమప్రభుఁ" డనియు, చెప్పి యున్నాఁడు. అందు చేత మొట్టమొదట విజయడిండిమమును సంపాదించినవాఁ డష్టభాషాకవితా సామ్రాజ్యాభిషిక్తుఁడైన యీ డిండిమభట్ట కవిసార్వభౌముఁడే యనియు, ఆతని దౌహిత్రుఁడయిన యరుణగిరినాథునకు డిండిమకవిసార్వభౌమత్వము లభించుట తాతవలననే యనియు, విశద మగుచున్నది. "శ్రీకంఠాగమపారం గతుఁడై విజయడిండిమము నార్జించిన మాతామహునియొద్ద నుండియే యీ యోగానందప్రహసన కర్తకు డిండిమకవిసార్వభౌమబిరుదమును, విజయ డిండిమమును లభించినవి" అని శ్రీవేటూరి ప్రభాకరశాస్త్రిగారు కమ కనకా భిషేకమునందుఁ దెలిపి యున్నారు ఈ ప్రథమడిండిమభట్టు ౧౨౭౦-వ సంవత్సరమునందు జనన మొంది ౧౩౩౦-వ సంవత్సరము వఱకును

నూతేండ్లు జీవించెనని చెప్పఁబడెడు వేదాంతదేశికులవారితో సమకాలీనుఁడు వైష్ణవమతప్రచారకుఁడైన వేదాంతదేశికులకును, శైవమత ప్రచారకుఁడైన డిండిమభట్టునకును మతవిషయమున ననేకవాదములు జరిగినట్టును వారు వాదప్రతివాదసందర్భమున నొండొరుల నాక్షేపించుచు వచ్చినట్టును, తెలిపెడు కథలును, శ్లోకములును దక్షిణదేశమునందు వ్యాపించియున్నవి. ౧౩౭౦-౮౦ సంవత్సరప్రాంతములయం దుండిన యీ ప్రథమ డిండిమభట్టును, ౧౩౭౦-వ సంవత్సరమునకుఁ దరువాతఁగాని పుట్టని శ్రీనాథుఁడు వాదములో నోడించె ననుట పొసఁగనేరదు. ఇఁక శ్రీనాథునితో వాదించి యపజయము నొందిన డిండిమభట్టు రెండవడిండిమభట్టో మూడవడిండిమభట్టో యయి యుండవలెను.

రెండవ డిండిమభట్టుపేరరుణగిరినాధుఁడు. ఇతఁడు సంస్కృతమున యోగానందప్రహసనమును రచించెను. ఆ ప్రహసనమునం దతఁడు తన్నుఁగూర్చి "శ్రీ డిండిమకవిసార్వభౌమ ఇతి ప్రథితబిరుదాంకనామధేయః, సరస్వతీప్రసాదలబ్ధ కవితాసనాథః, శ్రీమానరుణగిరినాధః తేన కృతేన యోగానంద నామ్నా ప్రహసనేన సభానియోగ మనుతిష్ఠామి" అని వ్రాసికొని యున్నాఁడు. డిండిమకవిసార్వభౌమబిరుదాంకుఁడును, సరస్వతీ ప్రసాదలబ్ధ కవితాసనాధుఁడును నైన యరుణగిరినాధుఁడు తన యోగానందప్రహసములో భరతవాక్యముగా "దీర్ఘాయు ర్దేవరాయోదదతు వసుమతీచక్రమాచంద్ర తారమ్ అని దేవరాయని నాశీర్వదించి యున్నాఁడు. ఈ కవి వర్ణించిన దేవరాయఁడు విజయనగరాధీశ్వరుఁడైన ప్రౌఢదేవరాయలని యితరదృష్టాంతములవల్లఁ దేలుచున్నది. ఈ ప్రౌఢదేవరాయలు ౧౪౨౩-వ సంవత్సరము మొదలుకొని ౧౪౪౬-వ సంవత్సరమువఱకును కర్ణాటకరాజ్యపరిపాలనము చేసెను. ఈతని కాలములో శ్రీనాధుఁ డుండె ననుటకు సందేహము లేదు. శ్రీనాథుఁ డుద్భటవివాదప్రౌఢిచేత నోడించి కంచుఢక్క పగులఁ గొట్టించినది తప్పక యరుణగిరినాథనామము గల యీ రెండవ డిండిమభట్టునే. ఇతఁడు ప్రౌఢదేవరాయని రాజ్యకాలములో నుండినవాఁ డగుటచేత నీతనిని శ్రీనాధుఁ డోడించుట ౧౪౨౩-వ సంవత్సరమునకుఁ దరువాత నయి

యుండవలెను. ౧౪౨౬-వ సంవత్సరప్రాంతమున నని తోఁచుచున్నది. ప్రౌఢదేవరాయలు దేవరాయనామధేయము గల కర్ణాటకరాజులలో రెండవ వాఁడు మొదటివాఁడు ప్రౌఢదేవరాయని తండ్రి యైన దేవరాయ మహా రాజు. అతఁడు ౧౪౦౬-వ సంవత్సరము మొదలుకొని ౧౪౨౨-వ సంవత్సరమువఱకును కర్ణాటరాజ్య మేలెను. ఈతని కాలమునందు సహితము శ్రీనాథకవి యుండెనుగాని యతఁ డీయనరాజుకాలములో కొండవీటి నగర మును విడిచి దేశసంచారము చేయ నారంభింపలేదు. అంతేకాక గౌడడిండిమ భట్టుసహిత మీయనరాజ్యావసానదశయందు నుండక యీతని కొడుకైన ప్రౌఢదేవరాయని యేలుబడిలోనే తదాస్థానకవియయి యుండినవాఁడు. ఈ గౌడడిండిమభట్టుయొక్క కవిసార్వభౌమ బిరుదమును లాగుకొని శ్రీనాథుని కిప్పించుటలో సహాయుఁడయినవాఁడు సాళువగుండనరసింహ రాయని మంత్రిగా నుండిన చంద్రశేఖరుఁడు కానేరఁడు ప్రౌఢదేవరాయని యాస్థానములో మఱియొక చంద్రశేఖరుఁడుండి యుండవచ్చును చంద్ర శేఖరక్రియాశక్తి యన్నచోట చంద్రభూషక్రియాశక్తి యని పాఠాంతరము గలదు. ఈ చంద్రభూషక్రియాశక్తిపాఠమే సరియైన దైనపక్షమున, ౧౩౪౦-వ సంవత్సరమునందు శ్రీవీరబుక్కరాయలరాజ్యకాలములో వ్రాయ బడిన కొండూరు శాసనములో

శ్లో. శ్రీచంద్రభూషణాచార్యపదపంకజయో స్తథా,
గ్రామం కొండూరునామానం బుక్కక్ష్మాపతి రార్పయత్.

అని రాజగురు వైన చంద్రభూషాచార్యునిపేరు కనఁబడుచున్నది గాని ప్రౌఢదేవరాయనికాలములో చంద్రభూషునిపే రెక్కడను వినఁబడదు. ఈ చంద్రభూషుఁడు "యతీంద్రస్య క్రియాశక్తిగురోః ప్రీతయే శ్రీచంద్ర భూషణాచార్యః" అని పై శాసనములోనే యుండుటనుబట్టి క్రియాశక్తి యతీంద్రునిశిష్యు డగుట స్పష్టము. క్రియాశక్తిపీఠ మా కాలమునందు శంకరాచార్యపీఠమువంటి శైవమతపీఠమై కర్ణాటకరాజులకు గురుపీఠమయి యుండెను ఆ పీఠాధికారి విద్యారణ్యాదిశంకరమఠములకువలెనే యతీంద్రుఁ

డుగా నుండెను. అయినను వీరబుక్కరాయలనాటి చంద్రభూషాచార్యుఁడు గాని, క్రియాశక్తియతీంద్రుఁడుగాని ప్రౌఢదేవరాయలకాలములో నున్న శ్రీనాథునికవిసార్వభౌమ బిరుదముతో సంబంధించి యుండుట పొసఁగ నేరదు. క్రియాశక్తి మరశిష్యుఁడయి శాసనములోని చంద్రభూషాచార్యునికి మనుమఁడైన మఱియొక చంద్రభూషాచార్యుఁడు రాజగురువయి ప్రౌఢదేవరాయనికాలములో నుండిన నుండవచ్చును. మధురావిజయకృతికర్త్రియు, బుక్కరాయని కోడలును, కంపరాయనిరాణియు నైన గంగాంబ తన మధురావిజయ మను వీరకంపరాయ చరిత్రలో క్రియాశక్తి నిట్లు స్తుతించెను.

శ్లో॥ అసాధారణసాదృశ్యం విలసత్సర్వమంగళమ్
క్రియాశక్తిగురుం వందే త్రిలోచనమి వాపరమ్.

౧౩౭౭ మొదలు ౧౪౦౪-వ సంవత్సరమువఱకును రాజ్యము చేసిన ద్వితీయ హరిహరరాయనిపుత్రుఁ డిమ్మడి బుక్కరాయని మైసూరుదాన శాసనములో కులగురు వయిన కాశీవిలాసక్రియాశక్తి పేర్కొనఁబడెను.

శ్లో. శ్రీమత్కాశీవిలాసాఖ్యక్రియాశక్తీశసేవినా
శ్రీమత్త్ర్యంబక పాదాబ్జసేవానిష్ణాతచేతసా.

మన చరిత్రాంశమునకు చంద్రభూషుని కథ గాని చంద్రశేఖరునికథగాని యంతగా ప్రధాన మయినది కాదు మన శ్రీనాథునిచే నోడగొట్టఁబడి కవిసార్వభౌమ బిరుదమును గోలుపోయినవాఁడు రెండవ డిండిమకవిసార్వభౌముఁడయిన యరుణగిరినాథుఁ డనుట నిశ్చయము విజయుడి డిమమును. కవిసార్వభౌమబిరుదాంకమును స్వయముగా సంపాదించుకొన్నవి గాక మాతామహునివలన సంక్రమించినవే యయినను, అరుణగిరినాథుఁ డసామాన్య పాండిత్యమును నిరుపమానకవితా సామర్థ్యమును గలవాఁ డయినందునకు సంశయము లేదు. ఇతఁడు యోగానంద ప్రహసనాది కావ్యములను రచియించి ప్రసిద్ధి కెక్కిన ట్లీవఱకే చెప్పఁబడెను

ఇఁక మూఁడవ డిండిమకవిసార్వభౌముని గూర్చి విచారింతము. ఇతఁడు ద్వితీయడిండిమకవిసార్వభౌముఁ డయిన యరుణగిరినాథుని పుత్రుఁడు; రాజనాథదేశికనామధేయుఁడు, తండ్రివలనను, తండ్రి తాతవలనను సంక్రమించిన డిండిమకవిసార్వభౌమబిరుదమును వహించినవాఁడు; మహావిద్వాంసుఁడయి సాళువాభ్యుదయాది గ్రంథములను రచించినవాఁడు. ౧౪౯౦-వ సంవత్సర ప్రాంతమున విద్యానగరరాజ్యమును వశపఱుచుకొని పరిపాలించిన సాళువగుండనరసింహరాయని కాలములోను, తరువాతఁ * కృష్ణదేవరాయల తండ్రి యైన వీరనరసింహరాయనికాలములోను మూఁడవడిండిమకవిసార్వభౌముఁ డైన రాజనాథదేశికుఁ డాస్థానకవిగా నుండి ప్రసిద్ధికెక్కెను. ఇతఁడు సాళువగుండ నరసింహరాయని విజయములను వర్ణించుచు సంస్కృతమున సాళువాభ్యుదయ మను పదునాలుగు సరములు గల కావ్యమును జేసెను. ఈ కావ్యమునం దితఁడు తా నష్టదిగ్విజయపటహీకృత బిరుద డిండమాడం బరుఁడ ననియు డిండిమకవిసార్వభౌముఁడ ననియుఁ జెప్పుకొనెను. ఈ బిరుదము లీ వంశమువారికి పితృపితామహపారంపర్యముగా నడచుచున్నట్టు కనఁబడుచున్నవి. ఈ తృతీయ డిండిమకవిసార్వభౌముఁడు వీరనరసింహదేవరాయనికాలములోఁ గూడ నుండినట్టు కుమారధూర్జటికవి కృతి మయిన కృష్ణరాజవిజయములోని యీ క్రింది పద్యములు తెలుపుచున్నవి.

మ. రమణీయాంధ్రతరంగిణీఘుమఘుమారావార్ధగంభీరవా
గ్క్రమజంఝానిలధూతదుష్కవిమహాగర్వాభ్రసంఘుండు ది
గ్గమణీమౌక్తికహారబంధురయశోరాజద్గుణాఢ్యుండు డిం
డిమపుంభావసరస్వతీంద్రుఁ డనియెన్ రీపం బ్రకాశించుచున్.

* * * *

* [కృష్ణదేవరాయల తండ్రి నరసరాయలు కాని వీరనరసింహరాయలు కాఁడు; వీరనరసింహరాయలు కృష్ణరాయల యన్న.]

మ. అని యా డిండిమసార్వభౌమకవి ప్రఖ్యాతంబుగాఁ దత్పురా
తనవృత్తాంతము నెల్ల దెల్పనఁ జమత్కారంబు వీక్షించి యా
జననాథాగ్రణియుఁ సభాసదులు నుత్సాహంబునం బొంది కాం
చనభూషాదు లొసంగి రెంతయు దయాసంరంభధౌరేయులై.

పయిపద్యమునందుఁ బేర్కొనఁబడిన జననాథాగ్రణి వీరనరసింహరాయలు. ఇట్లు ౧౪౯౦-వ సంవత్సరప్రాంతములయం దుండినడిండిమకవి సార్వభౌముఁడు శ్రీనాథునిచే జయింపఁబడినవాఁడు కాఁజాలఁడు. శ్రీనాథుఁడు ద్వితీయడిండిమకవిసార్వభౌముని నుద్దండవివాద ప్రౌఢిచే నోడించి యతని కంచుఢక్కను బగులగొట్టించి యాతని కవిసార్వభౌమబిరుదమును స్వవశము చేసికొన్నట్టు చెప్పఁబడినను, తరువాత నాతనిసంతతివారు సహితము వంశాగతమైన విజయడిండిమమును ధరించుచు కవిసార్వభౌమ బిరుదమును వహించుచునే యుండిరి. ఈ మువ్వురు డిండిమకవిసార్వభౌములలోను ప్రథముఁడు ౧౩౭౦ సంవత్సరప్రాంతమునందును, ద్వితీయుఁడు ౧౪౨౦ సంవత్సరప్రాంతమునందును, తృతీయుఁడు ౧౪౭౦ సంవత్సరప్రాంతమునందును, ఉండినవారగుటచేత మన శ్రీనాథకవి జయించినవాఁడు ద్వితీయ డిండిమకవి సార్వభౌముఁడే కాని తక్కిన యిద్దఱును కా రని సిద్ధాంతమగుచున్నది. ఈ డిండిమభట్టుయొక్క కవిసార్వభౌమబిరుదమును స్వాధీనము చేసికొన్నను, గొంత కాలమువఱకు దాని నుపయోగించుట కే హేతువుచేతనో శ్రీనాథుఁడు సందేహించుచుండెను.

[శ్రీనాథుఁడు వాదమున నోడించినది రెండవడిండిమభట్టునేయనియు, డిండిమబట్టబిరుదము వంశపారంపర్యముగావచ్చుచున్నదేయనియు నందఱు నంగీకరించుచున్నారు. కాని యీ డిండిమభట్టు మొదటి దేవరాయలకాలమున నుండెనని కొందఱును, రెండవ దేవరాయలకాలమున నుండెనని కొందఱును దలఁచుచున్నారు. డాక్టరు నేలటూరి వేంకటరమణయ్యగా రీతఁడు మొదటి

దేవరాయల యాస్థానమున నుండెననుచున్నారు 'ఆంధ్రకవితరంగిణి' కారులు డాక్టరుగారి మతమునే యంగీకరించుచున్నారు - శ్రీబండారు - తమ్మయ్య గారు, శ్రీవేటూరి - ప్రభాకరశాస్త్రిగారు మున్నగువారు రెండవ దేవరాయల కాలముననే రెండవ డిండిమభట్టుండినట్లు తలంచియున్నారు. శ్రీ సల్లంపల్లి - సోమశేఖరశర్మగారును తమయభిప్రాయముతో నేకీభవించినట్లు శ్రీతమ్మయ్య గారు తెల్పినారఁట : ]

తమ యాస్థాకవి కిట్లు విద్యావివాదములో పరాభవము జరిగిన తరువాత విజయశాలి యైన శ్రీనాథసుకవిరాజమౌళికి దీనారములతోను, టంకముల తోను తమ ముత్యాలశాలలో కనకాభిషేకము చేయించి సత్కరించి రాయల వా రాతనిని బంపివేసిరి. దీనారములును, టంకములును రాయలకాలములో వాడుకలో నున్న బంగారునాణెములు, బంగారునాణెముల నట్లు జలమువలె శిరస్సుపైఁ గుమ్మరించి స్నానము చేయించినప్పు డవి బహుసహస్రములు కాకపోయినను సహస్రమునకు దక్కువ కాకుండ నైన నుండవచ్చును. డిండిమకవి సార్వభౌమునకు సభలో నవమానమును, తత్ప్రతిపక్షికి బహు మానమును జరిగిన యనంతరమున సహితము డిండిమభట్టును, తత్పుత్రు డును పూర్వగౌరవముతోను, పూర్వబిరుదావళితోను పూర్వవిజయడిండిమల తోను, రాయల యాస్థానకవీశ్వరులుగాను, విద్వాంసులుగాను యథాపూర్వ ముగా నుండినట్లే కనఁబడుచున్నది. శ్రీనాథున కిట్లు స్వర్ణాభిషేక సమ్మా నము జరిగినది రాయల యాస్థానమునందుఁ గాదనియు, నొకానొక దక్షిణ దేశాధీశునిసభలో ననియు

" దీనారటంకాలఁ దీర్థ మాడించితి
దక్షిణాధీశు ముత్యాలశాల"

అని యుండుటనుబట్టి యొకానొకరు వ్రాసి యున్నారు. ఆ కాలమునందు కర్ణాటకరాజులను దక్షిణాధీశ్వరు లనియు వ్యవహరించుచుండెడువారు. ఈ

స్వర్ణస్నానసత్కారము జరిగినది కర్ణాటమహారాజసంస్థానమునందే యని శ్రీనాథకృతమైన, కాశీఖండములోని యీ కృతిపతి సంబోధనపద్యము విస్పష్ట పఱుచుచున్నది.

శా. కర్ణాటక్షితినాథమౌక్తికసభాగారాంతసంకల్పిత
స్వర్ణస్నానజగత్ప్రసిద్ధకవిరాట్సంస్తుత్యచారిత్ర ! దు
గ్ధార్ణోరాశిగభీర ! ప్రాహ్ణముఖమధ్యాహ్నాపరాహ్ణార్చితా
పర్ణావల్లభ ! రాజశేఖరమణీ ! పంటాన్వయగ్రామణీ !

అంతట శ్రీనాథుఁడు రాయలకొలువు వీడ్కొని బహుధనకనకసంచయముతో మరల యశోధనార్జనముకొఱకు దేశసంచారమునకు బైలుదేఱెను. ఈ సంచారములలో నితఁ డాంధ్రవల్లభుని మైలారురెడ్డినాయకుని; సర్వజ్ఞసింగమ నాయనిని సందర్శించి సత్కారముఁ బడసెనని చెప్పుదురు. ఆంధ్రవల్లభుఁడు దక్షిణమున కాంచీనగరాధీశ్వరుఁడుగానుండిన సంపరాయని (శంభురాయని) కుమారుఁడైన తెలుఁగురాయఁడు. వీరబుక్కరాయల (౧౩౫౫-౭౭) కుమారుఁడైన కంపరాయలు తండ్రి యాజ్ఞనుసారముగా మథురాసుర త్రాణుని జయించుటకయి దక్షిణదిగ్విజయయాత్ర వెడలినప్పుడు త్రోవలో కాంచీపురము రాజధానిగా రాజ్యమేలుచుండిన సంపరాయని తన సేనాపతి యైన సాళువమంగుని సాహాయ్యముచేత జయించి కాంచీపురమును దన ముఖ్యపట్టణముగాఁ జేసికొనెను. మధురావిజయమునందీ క్రింది శ్లోకములలో

శ్లో. "అంతర్బింబితచంపేంద్రా కంపేంద్ర స్యాసిపుత్రికా,
అప్సరోభ్యః పతిం దాతు మంతర్వత్నీ కిలాభవత్.
అథ వంచితతత్ఖడ్గప్రహారః కంపభూపతిః,
అకరోదసినా చంప మమరేంద్రపురాతిథిమ్."

గంగాదేవి తన భర్త పౌరుషమును వర్ణించెడి యుత్సాహముతో కంపరాజు చంపరాయని (సంపరాయని) తన ఖడ్గధారతో ఖండించి చంపెనని గొప్ప

చెప్పినను, పరాజితుఁ డయిన చంపరాజు స్వర్గాతిథి గాక బ్రతికియుండి మధురాసురత్రాణుని జయించుటలో కంపభూపతికి సహాయుఁడు సహిత మయ్యెను. కంపరాజు సేనాధిపతియు, నిరుపమాన పరాక్రమశాలియునైన సాళువమంగరాజు సంపరాయనిరాజ్యములోఁ గొంతభాగ మతనికి మరల నిప్పించి యాతనిని మిత్రునిఁగాఁ జేసి సంపరాయస్థాపనాచార్యుఁడని పేరు పొందెను. జైమినిభారతములో పిల్లలమఱ్ఱి పినవీరభద్రుఁడు సాళువ మంగును వర్ణించుచు నీ యంశము నీ క్రిందిపద్యములలోఁజెప్పియున్నాఁడు.

సీ. ' దురములో దక్షిణసురతాను నెదిరించి
కొనివచ్చి సంపరాయనికి నిచ్చి
సామ్రాజ్యమున నిల్పి సంపరాయస్థాప
నాచార్యబిరుదవిఖ్యాతి గాంచె
శ్రీరంగవిభుఁ బ్రతిష్ఠించి యర్వదివేలు
మాడ లద్దేవునమ్మడికి నొసఁగె
మధురాసురత్రాణు మడియించి పరపక్షి
సాళువబిరుదంబు జగతి నెరపె
గబ్బితనమునఁ దేజిమొగంబు గట్టి
తఱిమి నగరంపుగవకులు విఱుగఁ ద్రోలి
తాను వ్రేసిన గోరు నుద్దవిడిఁ దెచ్చె
సాహసంబున నుప్పొంగు సాళ్వమంగు. '

ఈ ప్రకారముగా సంపరాయని సామంతరాజునుగా రాజ్యమునకు మరల నిలిపిన కాలము ౧౩౭౦-వ సంవత్సరప్రాంతము స్వరాజ్యమునందు పునస్సంస్థాపితుఁడయి సంపరాయఁడు ౧౪౦౦ సంవత్సర ప్రాంతమువఱకును రాజ్యభారమును వహించి యుండును. అనంతరమున సంపరాయని పుత్రుఁడయిన తెలుగుఁరాయఁడు రాజ్యమునకు వచ్చి ౧౪౩౫-వ సంవత్సరప్రాంతమువఱకును రాజ్యపాలనము చేసి యుండును. ఈ తెలుఁగురాయఁడు ౧౪౨౦ సంవత్సరమునందు సింహాచలయాత్ర చేసి యచ్చట నృసింహస్వామివారి దేవాలయములో నీ క్రింది శాసనము వ్రాయించెను.

"స్వస్తి శ్రీ శకవర్షంబులు ౧౩౫౦ అగు నేఁటి ప్లవసంవత్సరఫాల్గుణకృష్ణ ౭ గురువారానను కన్నడదేసమందుల సంబురాయనికొడుకు తెలుంగు రాయఁడు తనకు అభీష్టార్థసిద్ధిగాను శ్రీనరసింగనాథునికి నిత్యమును సన్నిధిని వెలుంగను అఖండదీపాలు రెండు సమర్పించెను."

శ్రీనాథుఁ డీతనిని ౧౪౩౫-వ సంవత్సర ప్రాంతమునందు దర్శనము చేసి యుండును ఈతని రాజ్యప్రదేశ మేదో సరిగా తెలిసినది కాదు; గాని

శా. ధాటీఘోటకరత్నఘట్టనమిళద్ధాఘిష్ఠకళ్యాణఘం
టాటంకారవిలు ఠలుంఠితమహోన్మత్తాహితక్షోణిభృ
త్కోటీరాంకితకుంభినీధరసముత్కూటాటవీఝూటక
ర్ణాటాంధ్రాధిపసాంపరాయనితెలుంగా ! నీకు బ్రహ్మాయువౌ

అను శ్రీనాథుని పద్యమునుబట్టి చూడఁగా కర్ణాటాంధ్రదేశమధ్యస్థమయిన యేదో యరణ్యప్రాంతరాజ్య మయినట్టు కనపట్టుచున్నది. ఈ తెలుఁగు రాయఁడు కవులకు కస్తూరిదానము చేయుటలోఁ బ్రసిద్ధుఁడు. శ్రీనాథుని యీ క్రిందిపద్య మీ యంశమును తెలుపుచున్నది.

శా. అక్షయ్యంబగు సాంపరాయనితెలుంగాధీశ కస్తూరికా
భిక్షాదానము చేయురా సుకవిరాడ్బృందారకస్వామికిన్
దాక్షారామపురీవిహారవరగంధర్వాప్సరోభామినీ
వక్షోజద్వయకుంభికుంభములపై వాసించు దద్వాసనల్.

శ్రీనాథకవీంద్రుఁ డీ పద్యము జెప్పినప్పటికే తాను దాక్షారామమునకుఁ బోవ నుద్దేశించుకొన్నట్టు కనుపట్టుచున్నది [శ్రీనాథునిచేఁ బ్రస్తుతింపఁబడిన తెలుఁగురాయనిఁగూర్చి శ్రీ ప్రభాకరశాస్త్రులుగారి 'శృంగార శ్రీనాథము'న నిట్లున్నది.

'భీమఖండరచనము తర్వాత, దాక్షారామసమాయోగము గల్గినయాపయి క్రీ. 1435-1440 ప్రాంతమున మన శ్రీనాథునకు మేదినీమీసరగండకటారి

సాళువ సంబురాయని కొడుకగు తెలుంగురాయని యాశ్రయ మేర్పడినది. ఈతని శాసనము శక 1350 నాఁటి దొకటి సింహాచలముమీఁదఁ గలదు. ——— —— ——— నెల్లూరు మండలముననే యాత్మకూరు తాలూకాలోఁ దెలుంగురాయని పురమను గ్రామము గలదు. అది యీ తెలుంగురాయని పేర నేర్పడినదే కావచ్చును. కృష్ణాతీరమున శ్రీకాకుళగ్రామముతోఁ జేరి తెలుఁగురాయని పాలెమను పల్లెయొకటికలదు. కాని, యది శ్రీకాకుళాంధ్ర నాయకస్వామిపేర నేర్పడినదికాని, యీ తెలుఁగురాయనికి సంబంధించినది కాదు. ఈతిని కీ నామము గూడ నా శ్రీకాకుళాంధ్రనాయకుని పేరునుబట్టి వచ్చినదే యగునని నేను తలంచుచున్నాఁడను. ఆ కాలమున నీ తెలుఁగు రాయ లనుపేరు పలువురు పెట్టుకొనుచు వచ్చిరి. శ్రీకాకుళాంధ్రనాయక స్వామి యుత్సవాదులప్పుడు ప్రఖ్యాతముగాజరుగుచుండెడివి. శ్రీకాకుళాంధ్ర నాయకస్వామికిఁ దెలుఁగు రాయఁ డని కూడఁ బేరుండుట తెలియక కొందరీ సంబురాయనికొడుకు తెలుంగురాయఁడు శ్రీకాకుళమునేలినరాజని వ్రాసిరి. ఈ తెలుంగురాయఁడు శ్రీకాకుళమునేలినవాఁ డనుటకు నాధారము మేమియుఁ గానరాదు. అట్లుంట ప్రామాదికమే! ఈ తెలుంగురాయఁడు రాజ్యమెక్కడ యేలెనో ప్రఖ్యాతముగాలేదు. విద్యానగరాధీశ్వరునిక్రింద సేనానాయకుఁడుగా నుండినట్టున్నాఁడు బాపట్ల తాలూకా నూతులపాడుగ్రామమున నీ తెలుంగు రాయని పుత్త్రుఁడు తిరుమలరాయని శాసనములు శా, 1466 నాఁటివి కలవు. తెలుఁగురాయని తండ్రియగు సంబురాయఁడు శా. 1348 నను, నాతని కొడుకగు తిరుమలరాయని శాసనము శా. క. 1466 నను నుండుటచేఁ దెలుఁగు రాయఁడు శా 13‸8 తర్వాత 13 95 దాక నున్నట్లును, సింహాచలశాసనము నాఁటి కాతఁ డిర్వది యేండ్లకులోపడిన వయస్సువాఁ డయినట్లును తలఁపఁ దగును. అతఁ డిప్పటికిఁ బ్రఖ్యాతుఁడుగాక, తండ్రిచాటువాఁ డగుటచేతనే యా శాసనమందు 'కన్నడదేశమండలి సంబురాయని కొడుకు తెలుంగు రాయండు' అని పేర్కొనవలసెను. అతని శాసనము శా. ‸364 నాఁటిది నూతులపాడు గ్రామమునందున్నది.

విజయనగరాధీశ్వరుఁడగు ప్రౌఢదేవరాయనికి లోపడిన యీ తెలుఁగు రాయఁ డాతని దండయాత్రలో సింహాద్రిదాఁక వెళ్లినట్లు శ్రీ చిలుకూరి వీర భద్రరావుపంతులుగారు తలంచుచున్నారు. అది సంగతముగా నున్నది శ్రీనాథుఁ డీ తెలుంగురాయని నా సందర్భముననేని, తర్వాతనేని సందర్శించి యుండవచ్చును' [శృంగార శ్రీనాథము-పుటలు 153 - 155]

తెలుఁగురాయనివలన సంభావనమును బడసి శ్రీనాథుఁ డక్కడనుండి వెడలి మహావిద్వాంసుఁడయి సర్వజ్ఞనామము వహించి రాచకొండసంస్థానము నకు ప్రభువుగా నుండిన సర్వజ్ఞసింగమనీని సందర్శించి సత్కారముఁ బొందుటకయి తదాస్థానమునకుఁ బోయెను. శ్రీనాథుఁడు రాజదర్శనము చేయుటకు ముం దక్కడఁగూడఁ దనకు విజయము కలిగింపవలెనని తన యిష్టదేవత యయిన సరస్వతి నీక్రింది పద్యముతో వేఁడుకొనెనని చెప్పుదురు.

సీ. " దీనారటంకాలఁ దీర్థ మాడించితి
దక్షిణాధీశు ముత్యాలశాల
పలుకుతోడై తాంధ్రభాషామహాకావ్య
నైషధగ్రంధసందర్భమునకుఁ
బగులఁగొట్టించి తుద్భటవివాద ప్రౌఢి
గౌడడిండిమభట్టుకంచుఢక్క
చంద్రశేఖరక్రియాశక్తి రాయలయొద్దఁ
బాదుకొల్పితి సార్వభౌమబిరుద
మెటులు మెప్పించెదో నన్ను నింకమీఁద
రావుసింగమహీపాలు దీవిశాలు
నిండుకొలువున నెలకొని యుండినీవు
సరససద్గుణనికురుంబ ! శారదాంబ !

ప్రౌఢదేవరాయాంధ్రవల్లభాదుల మహాసంస్థానములకుఁ బోయి వారలచే మెప్పొందిన కవిసార్వభౌముఁ డీ సింగమనాయుని చిన్న సంస్థానమునకుఁ

బోయి యచ్చటఁ దనకు పరాభవము కలుగకుండఁ జేయుమని శారదను వేఁడి యుండునా ? యని కొందఱు (?) యొక రీ విషయమున సంశయపడుచున్నారు. దేవరాయాదులు మహారాజు లయినను, వారు పండితజనపరివేష్టితులే గాని స్వయముగా పండితులుగారు; ఇఁక నీ సింగమనాయఁ డన్ననో చిన్నసంస్థానాధిపతి యైనను పండితులవలనఁ గృతులనందుటయేకాక, తానును స్వయముగా కావ్యవిరచనసామర్థ్యముగలవాఁ డయి బహుశాస్త్రములయందుఁ బ్రవీణుఁడయి సర్వజ్ఞబిరుదమును వహించినవాఁడు. అటువంటివానియొద్దఁ దన పాండిత్యమును జూపుటకుఁ బోవునప్పు డెంతటి విద్వాంసుఁడైనను కొంచెము జంకి, తనకు విజయ మియ్యవలసినదని తన యిష్టదైవతమును ముందుగాఁ బ్రార్థించుట యసహజమగునా ? శ్రీనాధునకు సరస్వతి యిష్టదేవతయగుట నైషధమునందు గృతినాయకుఁడైన మామిడి సింగనామాత్యుఁడు తన్ను బిలిపించి పలికినట్లు చెప్పఁబడిన యీ శార్దూలములు ఘోషించుచున్నవి.

శా. 'భారద్వాజపవిత్రగోత్రుని శుభాపస్తంబసత్సూత్రు వి
ద్యారాజీవభవుండు మారయరుఁ బుణ్యాచార భీమాంబకుం
గారామైన తనూజు నన్ననఘు శ్రీనాథాఖ్యునిం బిల్చి స
త్కారం బొప్పఁగ గారవించి పలికెన్ గంభీరవాక్ప్రౌఢిమన్.

శా. బ్రాహ్మీదత్తవరప్రసాదుఁడ వుదుఁత్పజ్ఞావిశేషోదయా
జిహ్మస్వాంతుఁడ వీశ్వరార్చనకళాశీలుండ వభ్యర్హిత
బ్రహ్మాండాదిమహాపురాణచయతాత్పర్యార్థనిర్ధారిత
బ్రహ్మజ్ఞానకళానిధానమవు నీభాగ్యంబు సామాన్యమే ?'

సర్వజ్ఞబిరుదము రావువంశమూలపురుషుఁడైన బేతాళనాయని కేడవతరమువాఁ డయిన సింగభూపాలునికే గాని పదవతరమువాఁ డయిన యీ సింగమనాయనికి లే దనియు, రసార్ణవసుధాకరాది గ్రంథములను రచించినవాఁ డతఁడే కాని యితఁడు కాఁ డనియు, కాలవ్యత్యాసమునుబట్టి సింగభూ

పాలీయాది గ్రంథకర్త యయిన సర్వజ్ఞసింగమనాయనికాలములో శ్రీనాథుఁ డుండి యుండఁజాలఁడనియు, అందుచేత నీ మహాకవి యీ సింగభూపాలుని యొద్ద నపజయము సంభవించునేమో యని భయపడవలసిన పని యుండ దనియు, కాఁబట్టి శ్రీనాథుఁడు సర్వజ్ఞసింగమనాయని యాస్థానమునకుఁ బోయెననుటయే యసత్యమనియు, కొందఱు వాదించుచున్నారు. ఆ విష యము నిచ్చట వించుక విమర్శింతము.

బేతాళనాయనికి నేడవ తరమువాఁడు సర్వజ్ఞసింగమనాయఁ డగుటకు సందే హము లేదు; రసార్ణవసుధాకరాదిసంస్కృతిగ్రంథములను రచించినవాఁ డతఁడే యగుటకును సందేహము లెదు. శ్రీనాథపోతనార్యు లాతని కాలపు వారు కాకపోవుటయు, నందుచేత నాతని యాస్థానమునం దుండకపోవుటయు నిశ్చయమే! అంతమాత్రముచేత బదవ తరమువాఁడైన సింగమనాయఁడు విద్వాంసుఁడును సర్వజ్ఞ బిరుదాంకితుఁడును గాఁ డన్న సిద్ధాంత మేర్పడ నేరదు, ఇద్దఱును విద్వాంసులుకావచ్చును; ఇద్దఱును సర్వజ్ఞబిరుదాంచితులు కావచ్చును; ఇద్దఱును గ్రంథకర్తలు కావచ్చును, ఇద్దఱును కృతిపతులు కావచ్చును. వేదాంతదేశికులు సుభాషితనీవి లోనగు గ్రంథములను బంపిన వాఁడును, వైష్ణవగ్రంథకర్తలు తమ వ్యాఖ్యానములలో సర్వజ్ఞ బిరుద నామముతోఁ బేర్కొనినవాఁడును బేతాళనాయని యేడవ తరమువాఁడయిన మొదటి సింగమనాయఁడే యయి యుండును అయినను పదవతరమువాఁ డయిన సింగమనాయఁడును సర్వజ్ఞబిరుదాంకుఁడే! ప్రౌఢదేవరాయని కాల ములో నుండిన యీ సర్వజ్ఞసింగమనాయని యాస్థానముననే శ్రీనాథకవి సార్వభౌముఁడును, బమ్మెరపోతనామాత్యుఁడును బోయి యాతనిపయిని పద్యములను జెప్పి బహుమానములను బడసిరి. ఈ విషయము వెల్గోటివారి వంశచరిత్రములో నీ క్రింది పద్యమునఁ జెప్పఁబడినది.

సీ. క్షితిలోన సర్వజ్ఞసింగభూపాలుండు
బలవైరిసన్నుతపౌరుషుండు

లలి కావ్యనాటకాలంకారచతురుఁడు
సకలశాస్త్రార్థవిశారదుండు
వలనొప్ప సింగభూపాలీయనామక
గ్రంథంబు రచియించెఁ గౌతుకమున
మును భాగవతమును దెనుఁగు చేసినయట్టి
బమ్మెరపోతన బాగుమీఱ
తనకుఁ జెప్పిన భోగినీదండకమును
వెలయ శ్రీనాథనామకవిప్రవరుఁడు
కోరి చెప్పిన పద్యము ల్గొని ముదా ప్తిఁ
బెంపుతో వారి మన్నించి పేరువడసె.

ఉభయసింగభూపాలురనుగూర్చియు, సింగభూపాలీయములు చేయఁబడినవి కాని రెంటికిని మిక్కిలి భేదమున్నది—మొదటిది రసార్ణవ సుధాకరము; * రెండవది చమత్కారచంద్రిక. మొదటిది సింగభూపాల రచితము; రెండవది సింగభూపాలాంకితము. రెండును నలంకారవిషయకములే ; చమత్కారచంద్రిక యనఁబడెడు రెండవ సింగభూపాలీయము విశ్వేశ్వరకవిచంద్రునిచే రచియింపఁబడినది. అందలి లక్షణముల లక్ష్యములు నరసభూపాలుని పేరఁ జెప్పబడినట్లే సింగభూపాలుని పేరఁ జెప్పఁబడినవి. కవి యీ గ్రంథమునకు సింగభూపాలకీర్తిసుధాసారశీతలనామాంతర * ముంచెను. అందలి విలాసాంత గద్యమును జూడుఁడు.

"ఇతి సరససాహిత్యచాతురీధురీణ విశ్వేశ్వరకవిచంద్ర
ప్రణీతాయాం శ్రీసింగభూపాలకీర్తిసుధాసారశీతలాయాం
చమత్కారచంద్రికాయాం అష్టమో విలాసః."

---

*[రసార్ణవసుధాకరము సింగభూపాలవిరచితము కాదేమో యని శ్రీప్రభాకరశాస్త్రిలు గారు సందేహించుచున్నారు. చమత్కారచంద్రికకు సింగభూపాలీయ మను పేరు అప్రసిద్ధము.]

* ఇది నామాంతరమైనట్లు తోఁచదు. చమత్కారచంద్రిక కిది విశేషణము.

రసార్ణవసుధాకరము మూఁడుల్లాసములను గలది; చమత్కారచంద్రిక యెనిమిది విలాసములను గలది. చమత్కారచంద్రికలోని రెండు శ్లోకముల నిం దుదాహరించుచున్నాను.

శ్లో. కృతి రభిమతకృతిచతురా యది చతురోదాంతనయగుణోదారా,
ఇతి లక్షణకృతిరత్నం రచయే సింగనృపగుణోదాహరణం.

శ్లో. లోకే రాఘవపాండవాద్భుతకథాగ్రంథానుసంథాయినౌ
తౌ గ్రంథా వివ తన్మునిప్రణిహితౌ శ్రీసింగభూపాశ్రయః,
యాయా దాదరణీయతాం కృతధియాం గ్రంథోఽయ మస్మత్కృతీ
నాహం యద్యపి తాదృ శోస్మ్యయ మసౌ రాజా హి తాదృగ్గుణః.

చమత్కారచంద్రిక సింగభూపాలకృతము గాక యన్యకృత మయినందున పయి సీసపద్యములోని మూడవ చరణమునందలి 'రచియించె' నను దానిని గృతి సందెనని మార్చిన పక్షమున సింగభూపాలుని కది సరిపోవును. విల్సన్‌దొరగారు తమ పుస్తకవివరణపట్టికలో ౨౧-వ సంఖ్య గల యీ చమత్కారచంద్రికనుగూర్చి "విశ్వేశ్వరకవిచే రాజమహేంద్రవరముజిల్లాలోని పిఠాపురపుజమీదారీయొక్క చిన్నరాజైన సింహభూపాలునియొక్క పద్యస్తవరూపచరిత్రము ౧౬-వ సంఖ్యచూడుము. (A poetical and panegyrical account of *Sinha Bhupala*, a petty *Raja* of the Zimindari of *Pithapur*, in the Rajahmundry district, by *Visweswara kavi*. See No 16" అని వ్రాసి యున్నారు ౧౬-వ సంఖ్యగల ప్రసంగరత్నావళినిగూర్చి చెప్పుచు దానిలో "౭౭-వ ప్రకరణము విక్రమాదిత్యుఁడు మొదలుకొని మొట్టమొదట కనకగిరిలో చిన్నరాజయి యుండి తన యధికారమును రాజమహేంద్రమండలములోని యొక భాగముపైకి వ్యాపింపఁజేసి పిఠాపురమునో, పెద్దాపురమునో తన రాజధానిని జేసికొన్న సింహభూపుఁడనెడు సర్వజ్ఞసింహనాయఁడు వఱకునుగల ప్రసిద్ధరాజులయొక్క సంక్షిప్తచరిత్రములను కలిగి యున్నది. (The 77th chapter contains short accounts of celebrated Princes from *Vikramaditya* to *Sinha Bhupah* or *Sarvajan Sinha Nayudu* a petty prince originally of *Kanaka-*

*giri* who extended his power over part of the *Raja. mahendri* district and *Pithapur* or *Peddapur* his capital )" అని వ్రాసియున్నారు. దొరగారు రావు సింగ భూపాలుఁ డన్న పేరు చూచి పిఠాపురములో రావువారు సంస్థానాధిపతులుగా నుండుటను బట్టి రాజమహేంద్రమండలమని భ్రమపడి యుందురు దేశికులవారి 'సుభాషితనీవి' వ్యాఖ్యోపోద్ఘాతములో "రాజమహేంద్రవరనగరస్థితసర్వజ్ఞ సింగక్షమావల్లభేన" అని యేల వ్రాయఁబడెనో తెలియరాకున్నది ఈ రెంటినిబట్టి కాఁబోలును వెలుగోటివారి వంశచరిత్రమును వ్రాసినవా రుపో ద్ఘాతములో

"తొమ్మిదవ తరమువాఁడైన లింగమనాయఁడు సింహాద్రి మొదలగు పట్టి నాటిరాజ్యము నాక్రమించి యేలినట్లును మఱియొక శాఖాంతరమునందు ౯-వ తరమువాఁడైన యనపోతనాయఁడు రాజమహేంద్రవరమురెడ్లను గొట్టి యా దేశము నేలినవాఁ డనియు, వంశావళిలో వారి చరిత్రములలో వ్రాయఁ బడి యున్నది .. .. . . .... లింగమనాయఁడు అనపోతానాయఁడుగార్ల చరిత్రములలో వీరు సింహాద్రి రాజమహేంద్రవరము మొదలగు రాజ్యముల నాక్రమించినారనియు..... ..... కాఁబట్టి నిజముగ తొమ్మిదవతరమువా రా దేశముల నాక్రమించి యేలి తమ పుత్రాదుల నచట నిలిపి యుండవలెను" అని వ్రాసి యున్నారు

[రసార్ణవసుధాకర కర్తయగు సింగభూపాలుఁడును, శ్రీనాథాదులచే దర్శింపఁ బడిన సింగభూపాలుఁడును భిన్నులనియు, రసార్ణవసుధాకరకర్తకు సర్వజ్ఞ బిరుదము లేదనియు, అతని మనుమఁడును, శ్రీనాథునికాలపువాఁడునగు సింగభూపాలునికే సర్వజ్ఞబిరుదము కలదనియు శ్రీ ప్రభాకరశాస్త్రిగారి యాశయము. [శృంగార శ్రీనాథము పుట 211] వెలుగోటివారి వంశ చరిత్రలో వీరిరువురికిని సర్వజ్ఞబిరుదమున్నట్లు చెప్పఁబడినది. శ్రీనాథుఁడు కాంచినది మొదటి సర్వజ్ఞసింగభూపతియే యని 'ఆంధ్రకవి తరంగిణి' లో నున్నది (ఐదవ సంపుటము పుట.) 44] డాక్టరు గిడుగు - వేంకటసీతా పతిగారు రసార్ణవసుధాకర నూతనముద్రణపీఠికలో రసార్ణవసుధాకరకర్తను శ్రీనాథుఁడు చూచినట్లు చెప్పియున్నారు ]

ఈ సింగభూపాలుని రాజ్యము రాజమహేంద్ర మండలములోని కొంత భాగము వఱకును కొంతకాలము వ్యాపించినను వ్యాపింపకపోయినను సర్వజ్ఞబిరుద మీతనికిఁగూడ నుండినది. ఈ బిరుదము రెండు విధముల రావచ్చును. ఒకవిధమునఁ దాను స్వసామర్థ్యముచేత సంపాదించు కొన్నదైనను కావచ్చును; డిండిమకవి సార్వభౌములకువలె పూర్వుల నుండి వచ్చినదైనను కావచ్చును ఎట్లు వచ్చినను పదవతరమువాఁడైన యీ సింగభూపాలుఁడు పాండిత్యప్రభావముచేతను పండితజనసమాదరణ చేతను కావ్యప్రియత్వముచేతను సర్వజ్ఞనామమున కర్హుఁడయినట్టు కనుపట్టు చున్నాఁడు శ్రీనాథుఁ డీ రావు సర్వజ్ఞసింగభూపాలుని యాస్థానమునకుఁ బోయి యుండిన కాలములో

క. సర్వజ్ఞనామధేయము
శర్వునకే రావుసింగజనపాలునకే
యుర్విం జెల్లును నితరుని
సర్వజ్ఞం డనుట కుక్క సామజ మనుటే.

అని రాజునుగూర్చి చెప్పెను ఈ పద్యవిషయమయి యిటీవలివా రొక వింతకథను గల్పించియున్నారు పెదకోమటి వేమభూపాలుని యాస్థాన ములో నుండఁగానే శ్రీనాథుఁడు సింగభూపాలునికడకుఁ బోయి యీ పద్య ముచే నాతనిని స్తుతించి మరల స్వస్థానమునకు రాఁగా, వేమభూపాలుఁ డిట్లు చెప్పితి వేమని యడుగఁగా, అదిస్తుతి కాదనియు 'సర్వజ్ఞ నామధేయ మొక్క శర్వునకే కాని సింగభూపాలునికే యుర్వినిజెల్లు ?' నని చేసిన పరిహా సమనియు, సమాధానము చెప్పి కవి తన ప్రభువును సంతోషపెట్టెనఁట. వేమభూపాలుని మరణానంతరమునసే శ్రీనాథుఁడు సింగభూపాలుని యాస్థా నమునకుఁ బోయినవాఁ డగుటచేతఁ దరువాతి ప్రబుద్ధులచే నీ కథ కల్పింపఁ బడుట స్పష్టము శ్రీనాథుఁ డీ పండిత ప్రభువునొద్దకుఁబోయి సమ్మానముఁ బొందినది ౧౪౨౫-వ సంవత్సరప్రాంతము.

తరువాత శ్రీనాథుఁడు మైలారురెడ్డి మొదలైన సామంత సంస్థానప్రభువును గూడ సందర్శించి యర్హసంభావనలు బొంది దేశసంచారము ముగింపవలసిన వాఁ డయ్యెను. ఈ సంచారమును ముగింపకముందే శ్రీనాథుఁడు ధాన్యవాటీ పురమునకో, దారిలో కృష్ణాగోదావరీ మధ్యాంతర్వేదిసీమకోపోయి యచ్చటి యప్పటి సంస్థానాధిపతియైన దంతులూరి గన్నభూపాలునికడఁ గొంతకాల ముండి యాతనికి ధనంజయవిజయ మంకితము చేసినట్లు కనఁబడుచున్నది. ధనంజయవిజయ మెక్కడను గానరాలేదు గాని యీ విషయము గోదావరి మండలములో నుండిన దంతులూరి బాపనృపాలుని పేరట నూఱు సంవత్సర ముల క్రిందట రచియింపఁబడిన మూర్తిత్రయోపాఖ్యానమువలనఁ దెలియ వచ్చుచున్నది. బాపరాజు గోదావరీమండలములో నుండినను నాతనివంశ మూలపురుషుఁడైన హరిసీమకృష్ణుఁడు ధాన్యవాటీపుర ప్రభువయినట్లు మూర్తిత్రయోపాఖ్యానములోని యీ క్రింది పద్యమువలనఁ దెలియవచ్చు చున్నది.

మ. కురియించెఁ బహుధాన్యవర్ష మఖిలక్షోణీప్రదేశంబునన్
హరియించెన్ విమతాంధకారములు బాహాగ్రాసిసూర్యప్రభన్
సిరి మించెన్ నృపవర్యు లెంచ ఘనుఁడై శ్రీధాన్యవాటీపురీ
చిరసామ్రాజ్యమానమాశ్రయమహాసింహాసనాసీనుఁడై.

ఈ హరిసీమకృష్ణునికులమునందు భీమరాజు జనించెనఁట! ఆ భీమరాజు కొడుకు గన్ననరపతి. ఈ గన్ననరపతిని వర్ణించుచు గ్రంథకర్త

సీ. అహితదుర్గాధ్యక్షు లందఱు భయ మంద
గ్రీడికై వడి నిల్చెఁ దాడినాఁడ
నక్షుద్రదానవిద్యాశాస్త్రములచేతఁ
బ్రతి యెవ్వరును లేక ప్రతిభఁ గాంచెఁ
దనకీర్తి దశదిగంతరగీయమానమై
కనుపట్ట ధర్మమార్గంబు నెఱపె
శ్రీనాథసుకవీంద్రుచే ధనంజయవిజ
యం బను సత్కావ్య మంది వెలసె

నృపతిమాత్రుండె నిజపాదనీరజాత
ఘటితకోటీరవైరిభూకాంతమాన
సాంతరభయాపహారి శ్రీదంతులూరి
గన్నభూపాలమౌళి దోర్గర్వశాలి.

అని యతఁడు శ్రీనాథకవీంద్రునిచే ధనంజయవిజయకావ్యము నందెనని చెప్పెను. అప్పటికి గన్ననరపాలుఁడు ధాన్యవాటీపురములోనే యుండెనో తరువాత నాతని సంతతివారు నివాసముగా నేర్పఱుచుకొన్న కృష్ణాగోదావరీ మధ్యసీమకు వచ్చి యుండెనో తెలియదు.

ఇంతటితోఁ జూడఁ దగిన సంస్థానము లన్నియు నయిపోయినవి. పోయిన సంస్థానమునకే మరలఁ బోయిన కార్యము లేదు. ఇఁక నెక్కడనైనను మహదాశ్రయము సంపాదించి యక్కడ స్థిరపడవలెను. అట్టి యాశ్రయ మేదియా యని విచారింపఁగా నప్పటి కనుకూల మయినది రాజమహేంద్ర వరములో రెడ్లసంస్థాన మొక్కటి కనఁబడిన ట్లున్నది.

ఇప్పుడు తన కడపటి యేలిక యైన పెద్దకోమటి వేమనకు గర్భశత్రువుగా నుండిన యల్లాడరెడ్డి మొదలైనవా రంతరించి వారి పుత్రులు రెడ్డిసంస్థానమునకు ప్రభువు లయిరి. అంతకంటెను ముఖ్యముగా తాతనాటినుండియుఁ దన కుటుంబము నెఱిఁగినవాఁడును, బంధువుఁడునైన బెండపూడి యన్నామాత్యుఁడు రాజమహేంద్రప్రభువులైన వేమవీరభద్రారెడ్లకడ మంత్రిగా నుండుట తటస్థించెను. అందుచేత శ్రీనాథుఁడు ౧౪౨౭-౨౮-వ సంవత్సర ప్రాంతమునందు రాజమహేంద్రపురమునకు వచ్చి యన్నయామాత్యు నాశ్రయించి తదనుగ్రహమునకుఁ బాత్రుఁ డయ్యెను. అల్లాడరెడ్డి ౧౪౨౩-వ సంవత్సరమువఱకును రాజమహేంద్రరాజ్యపాలనము చేసి యుండుటచేతను, తదనంతరమున రాజ్యభారమును వహించిన వేమవీరభద్రరెడ్ల రాజ్యకాలములోనే శ్రీనాథుఁడు వారిమంత్రియైన బెండపూడి యన్నామాత్యునికడకు వచ్చుటచేతను, అతఁడు రాజమహేంద్రవరమునకు వచ్చుట ౧౪౨౮-వ

సంవత్సరమునకుఁ బూర్వమయి యుండదు. అప్పుడు శ్రీనాధుని ముఖ్యోద్దేశము బెండపూడి యన్నామాత్యునాశ్రయించి తన్మూలమునఁ దనపూర్వపు ప్రభు వయిన పెదకోమటివేమారెడ్డి శత్రు వయిన యల్లాడరెడ్డి పుత్రుల యనుగ్రహమును సంపాదించి సాధ్యమయినంత శీఘ్రముగా వారి యాస్థానమునఁ బ్రవేశించి యచ్చట స్థిరపడుట. ఈ యభీష్టసిద్ధికయి యతడు మొట్టమొదట నన్నామాత్యునిఁ బొగడి యతని దయను సంపాదింపవలెను; తరువాత వేమవీరభద్రారెడ్లను బొగడి వారిదయకుఁ బాత్రుఁడు కావలెను. ఈ రెండు పనులను నెఱవేఱుటకయి యతఁడు భీమేశ్వరపురాణమును తొందరతొందరగా రచియించి దానిని శివభక్తుఁడైన యన్నయమంత్రి కంకిత మొనర్చెను. ఇతఁడు నైషధమహాకావ్యము నాంధ్రీకరించి పెదకోమటివేముని మంత్రియైన మామిడిసింగన్నమంత్రి కంకిత మొనర్చినప్పుడు

సీ. తన కృపాణము సముద్ధతవైరిశుద్ధాంత
తాటంకముల కెగ్గు దలఁచుచుండఁ
దన బాహుపీఠంబు ధరణీభృత్కూర్మాహి
సామజంబులకు విశ్రాంతి యొసఁగఁ
దన కీర్తినర్తకి ఘనతరబ్రహ్మాండ
భవనభూముల గొండ్లిఁ బరిఢవిల్లఁ
దన దానమహిమ సంతానచింతారత్న
జీమూతసురభుల సిగ్గుపఱుపఁ
బరఁగు శ్రీవేమమండలేశ్వరునిమంత్రి
యహితదుర్మంత్రివదనముద్రావతార
శాసనుఁడు రాయవేశ్యాభుజంగబిరుద
మంత్రిపెద్దనసింగనామాత్యవరుఁడు.

అనియొక్క పద్యములో వేమభూపాలునిమంత్రి యైనట్టు చెప్పి తరువాత కృతిపతివంశాభివర్ణనము చేసెను. ఈ ప్రకారముగానే యీ భీమఖండమును బెండపూడి యన్నయమంత్రికిఁ గృతి యిచ్చునప్పుడు

సీ. ఏమంత్రికుఁ దైవ మిందుశేఖరుఁడు ద
జారామభీమేశుఁ డఖిలకర్త
యేమంత్రియేలిక యిక్ష్వాకుమాంధాతృ
రామసన్నిభుఁ డైనవేమనృపతి
యేమంత్రిసితకీర్తి యేడువారాసుల
కడకొండయవలిచీఁకటికి గొంగ
యేమంత్రిసౌభాగ్య మిగురుఁ గైదువజోదు
లాలిత్యలీలకు మేలుబంతి
యతఁడు కర్ణాటలాటభోటాంగవంగ
కురుకుకురుకుంతలావంతి ఘూర్జరాది
నృపసభాస్థానబుధసన్నిధీయసుగుణ
మండనుఁడు బెండపూడన్నమంత్రివరుఁడు.

అని యొక్క పద్యములో వేమభూపాలునిమంత్రి యైనట్టు చెప్పి, యంత టితో నిలువక తరువాత ననావశ్యకముగా తదనుగ్రహసంపాదనార్థముగా వేమభూపాలుని వంశాభివర్ణనమును నడుమఁ బెట్టి

సీ. పాతాళభువనాధిపతికి శేషాహికిఁ
బ్రియలతో మసకానఁ బెనఁగఁగలిగె
దిక్సింధురములకు దివ్యవాహినిలోనఁ
దేఁటిరాయిడి మాని దేలనాదవె
నుర్వీధరములకు నుదధిలోఁ గాఁపున్న
కులముసామియింట్లఁ గడువనబ్బెఁ
గుహనాకిటికి లక్ష్మికుచకుంభములమీఁది
కుంకుమంబున యును గ్గొనఁగఁగూడె
రామవేశ్యాభుజంగ వీరప్రతాప
భాసి యల్లాడవిభువీరభద్రనృపతి
సర్వసర్వంసహాచక్ర సర్వభరము
పృథుభుజాపీఠమున సంభరించుటయును.

గేనగు పద్యములలో వీరభద్రారెడ్డిని, తదగ్రజుఁడైన వేమారెడ్డిని యథే
ష్టముగా స్తుతించెను. అన్నయమంత్రి తన్నుఁ బిలిపించి

సీ. వినిపించినాఁడవు వేమభూపాలున
కఖిలపురాణవిద్యాగమములు
కల్పించినాఁడవు గాఢపాకంబైన
హర్షనైషధకావ్య మాంధ్రభాష
భాషించినాఁడవు బహుదేశబుధులతో
విద్యాపరీక్షణ వేళలందు
వెదచల్లినాఁడవు విశదకీర్తిస్ఫూర్తి
కర్పూరములు దిశాంగణములందుఁ
బాకనాటింటివాఁడవు బాంధవుఁడవు
కమలనాభునిమనుమఁడ వమలమతివి
నాకుఁ గృపచేయు మొక ప్రబంధంబు నీవు
కలితగుణగణ్య ! శ్రీనాథకవివరేణ్య !

అని వేఁడఁగా,

సీ. ధారాసురత్రాణధాటీసమారంభ
గర్వపాథోరాశికలశజులకు
సప్తమాడియరాజఝూడియక్ష్మాపాల
వందితశ్రీపాదవనరుహంలకు
సింహాద్రిపర్యంతసీమాంధ్రమేదినీ
మండలీపాలనాఖండలులకు
హరిదంతదంతిదంతావళీలిఖ్యమా
నానేకజయశాసనాక్షరులకు

వీరభద్రేశ వేమపృథ్వీధవులకు
ననుఁగుమంత్రి మహాప్రధానాగ్రగణ్యు
బెండపూడన్న జగనొబ్బగండబిరుద
సచివదేవేంద్రుఁ గృతి కధీశ్వరునిఁ జేసి.

భీమేశ్వరపురాణమును రచించినట్టు కవి చెప్పుకొని యున్నాఁడు. పయివాని లోని మొదటి సీసపద్యముయొక్క నాలవచరణమువలనఁ గవి తా నావఱకే దేశాంగణములు తిరిగి కీర్తి నొందినట్లును, రెండవ సీసపద్యములోని మూడవ చరణమువలన వీరభద్రారెడ్డిరాజ్యము సింహాచలము పర్యంతమును వ్యాపించి యుండినట్టును దెలియవచ్చుచున్నది.

ఈకవికి విష్ణుకథలకంటె శివకథలమీఁద నాదర మత్యధికము. అందుచేత నీతడు భీమఖండములో సర్పపురకథయు, శ్రీకూర్మకథయు రెండు సర్గము లలో నున్నను వానిని దెవిగించుటలో నొక్క పద్యముతోను పద్యపాదము తోను సరిపెట్టెను. ఈతఁడు భీమఖండమును జేయుటలో ౩-వ సర్గము నందలి

శ్లో. అహో కి మేత న్మే బ్రూ హి వైవర్ణ్యం వదనే తవ,
దృశ్యతే నేత్రయో ర్దైన్యం మానసవ్యథయానఘః
కశ్చి న్న జాతో వాగ్వాదః లోలార్కేణ సమం తవ,
ఢుంఠీ విఘ్నేశ్వరః కశ్చిత్ న త్వాం ధిక్కృతవా నృషా.
కశ్చిత్త్వం క్షుధితః కాలే విశాలాక్ష్యా న వంచితః,
న కశ్చిత్త్వ య్యనుచితం భైరవేణ కృతం ముధా.
కథం త్యక్తం త్వయా గంగావాహినీసైకతస్థలం,
కథం తత్పరమం స్థానం వ్యసృజ త్క్రోశపంచకం.
కథం త్వంముక్తవా న్ప్రాప్య మవిముక్తవసుంధరాం,
కథం విశ్వేశ్వరం దేవం సతా ముజ్ఝితవాన్ ధనం.

ఈ శ్లోకములను

గీ. ఆననమునందు వైవర్ణ్య మగ్గలించెఁ
గనుఁగవయందు దైన్యంబు గానఁబడియె
నార్తి యేదేని యొకటి నీయంతరంగ
మూని యున్నది యిది యెట్టు లొక్కొ యనఘ!

సీ. లోలార్కునకు నీకు లోలోన నేమేని
పోటు పుట్టదు గదా మాటమాట
వెనకయ్య శ్రీదుంఠివిఘ్నేశ్వరస్వామి
ధిక్కరింపఁడు గదా తెగువ నిన్ను
నాఁకొన్న నిన్ను మధ్యాహ్నకాలంబున
నరయకుండదు గదా యన్నపూర్ణ
నెపమేమియును లేక నీయెడాటమ్మునఁ
బాటి తప్పఁడు గదా భైరవుండు
ఎట్టు పాసితి మిన్నేటి యిసుకతిప్ప
నెట్టు పాసితి వాస్తలం బేనుక్రోసు
లెట్టు పాసితి యవిముక్త హట్టభూమి
యెట్టు పాసితి విశ్వేశు నిందుధరుని."

అని మూలానుసారముగా నెంతో మనోహరముగా తెనిగించినట్లే కొన్ని స్థలములయందు మూలము ననుసరించియే యాంధ్రీకరించినను బహుస్థలముల యందు మూలము నతిక్రమించి తన యిష్టానుసారముగా

శ్లో. 'సప్తగోదావరతట క్రీడాసక్తస్య శీకరైః,
గజాస్యస్య కరోన్ముక్తైః క్లిన్నమార్తాండమండలమ్.'

(సప్తగోదావరతటమున క్రీడాసక్తుఁడయి యున్న గజాననునియొక్క తుండమ్ముచేత వెగఁజిమ్మఁబడిన శీకరములచేత నార్ద్రమైన సూర్యబింబమును గల్లద్ది) అనుదానిని,

"వేదండవదనశుండాకాండచుళికితోన్ముక్తసప్త
గోదావరసలిలధారాఝుణత్కారబృంహిత
బ్రహ్మాండగోళంబు"

అనియు,

శ్లో. సత్సమాగమమన్నామకథాశ్రవణ యోగతః,
పాపక్షయో భవేద్దేవి! మనుష్యాణాం కలౌ యుగే

(దేవీ! సత్సమాగమమువలనను, నా నామకథాశ్రవణమువలనను కలియుగమునందు మనుష్యులకు పాపక్షయ మగును) అనుదానిని

"పాపంబు లోకభంగిఁ బ్రక్షయం బందిన
నామీఁద దృఢభక్తి నాఁటుకొనును"

అనియు, మూలమునకు భిన్నముగా భాషాంతరీకరించుటయే కాక యొకానొక చోట "సమర్థ స్స హి దేవరాట్" అనుదానిని "సంతతము దేవవేశ్యాభుజంగుఁ డతఁడు" అప్పట్లు సభ్యముగానున్నదాని సనభ్యముగాను తెనిఁగించుచు వచ్చి యున్నాఁడు. ఈ కడపటిదానిమూలమును, దాని భాషాంతరమును జూడుఁడు.

శ్లో. కాలకూటోపసంహారీ, త్రిపురాసురమర్దనః,
నిగ్రహానుగ్రహప్రౌఢః సమర్థ స్స హి దేవరాట్.

గీ. కాలకూటోపసంహారకారి యతఁడు
త్రిపురదైత్యాధిపతుల మర్దించె నతఁడు
నిగ్రహానుగ్రహప్రౌఢనిపుణుఁ డతఁడు
సంతతము దేవవేశ్యాభుజంగుఁ డతఁడు.

"దృఢసమర్థుండు చూ దేవదేవుఁ డతడు" అను రీతి నేదో యొక విధముగా మూలానుసారముగాఁ దెనిఁగింపక దేవతావర్ణనలోఁగూడ స్వకపోలకల్పిత

ముగా శృంగారమును జొప్పించుట కవియొక్క శృంగారనాయక సపుణత్వ మును వెల్లడించుచున్నది. శ్రీనాథుఁడు స్త్రీలోలుఁడని లోకములో బలమైన వాడుకయు, తదనుగుణములైన కథలును, పారంపర్యముగ వచ్చుచున్నవి. ఈ పద్యమే కాక గ్రంథములోని యితరపద్యములు సహిత మనేకము లాతని శృంగారనాయికాప్రియత్వమును దెలుపుచున్నవి. భీమేశ్వరపురాణమును మొట్టమొదట ప్రకటించినవారు తమపీఠికలో "పంచారామవధూటీ । పంచాస్త్ర విహారకేళిపాంచాలునకున్" అన్న షష్ఠ్యంతభాగము నుదాహరించి, ఇది యాకృతిపతికేనిఁ బంచారామవాసులగు పుణ్యాంగనలకేని గౌరవజనకంబుగ మాకుఁ దోఁచదు" అని వ్రాసి యున్నారు. ఇది గాక పుస్తకములో దీనిని మించిన పద్యము లున్నవి.

శా. కాంచీకంకణతారహారకటకగ్రైవేయభూషావళుల్
 లంచం బిత్తురు దూతికాతతికి లీలన్ బెండపూఁ డన్ననిఁ
 బంచాస్త్రోపముఁ దారతార కవయం బ్రార్థించి లోలోపలన్
 బంచారామములందుఁ * బల్లెలఁ బురిం బ్రౌఢేందుబింబాననల్.

పంచారామములందు, పల్లెలలోను పట్టములోను గల ప్రౌఢస్త్రీలు తాము తామే బెండపూడి యన్నయను గవయుటకు కాంచీకంకణాదులైన భూషణ ములను తారుపుకత్తెలకు లంచము లిత్తురఁట! అత్యంత శివభక్తుఁడైన బెండపూడిఁ యన్నయ్య నిజముగానే జారుఁడయినను శాశ్వతముగా నుండదఁగి యాతఁడు కృతిపతిగాఁ గల గ్రంథములలో నిట్లుండుట సిగ్గుల చేటు కాదా? ఈ విషయమున శివునకే గతి లేనప్పుడు శివభక్తునిమాట చెప్పనేటికి?

మ. ఎనయఁగల్గిన కూర్మ శృంగిరిటిఁగానీ దుండిఁ గానీ నికుం
 భునిఁ గానీ కెయిదండ పట్టుకొని సంభోగేచ్ఛ నంతఃపురాం
 గనలం గన్నుమొఱంగి యప్పురములోనం గన్నెకాఁడారి ప్రౌ
 ఢ్ఢున భీమేశుఁడు సానివాడ కరుగున్ ధూర్తప్రకారంబునన్.

* [బల్వెలపురిన్ – అనునది సరియైన పాఠము.]

చీఁకటిపడఁగానే భీమేశ్వరస్వామి దాక్షారామములో భృంగిరిటినో మఱి యొకరినో కై దండగొని యంతఃపురస్త్రీలను టక్కువెట్టి సంభోగేచ్ఛతో సానివీధి కరుగునఁట। దీని పయి పద్యములో "దక్షపురిసానికూఁతులఁ దవిలినాఁడు। విశ్వలోకకుటుంబి భీమేశ్వరుండు" అని చెప్పఁబడినది. దీని క్రింది పద్యములో

క. పదునాల్గు మహాయుగముల
ముదుకగు భీమేశ్వరునకు మొగచాలై యుం
డదు సానిపెండ్లి యెప్పుడు
నది దాక్షారామమహిమ మగునో కాదో।

దాక్షారామముయొక్క యీమహిమ యద్భుతమైనది. ఈ మహిమ శ్రీనాథుని కాలమునకే తగినది. ఆ కాలమునందు జారత్వము తప్పుగా గణింపఁబడక పోవుటయే కాక యది కలిగి యుండుటయే ప్రతిష్ఠావహముగాను, పురుషుల కది వర్ణ నీయమైన గుణవిశేషము గాను తలఁపబడుచుండునట్లు శ్రీనాథమహా కవివర్ణనలవలనఁ గనఁబడుచున్నది శ్రీనాథుఁడు కథారంభమునకు ముందు భీమఖండమునందు దాక్షారామపురవర్ణనము చేయుచు నా పురములో సానులు తప్ప బ్రహ్మక్షత్రియవైశ్యశూద్రు లెవ్వరును లేనట్టుగా నొక్క సానులను మాత్రమే యత్యధికముగా బహుపద్యములలో నభివర్ణించెను. సప్తగోదా వరము "దేవగంధర్వాప్సరోవధూటీస్తనస్థానకశ్రీగంధధవళితం" బఁట। ఇందుఁ బేర్కొనఁబడిన గంధర్వాప్సరోవధూటులు సానివారు. వారి నెప్పుడు వర్ణించినను శ్రీనాథుఁడు వారి గౌరవమునకు కొఱఁతరాకుండునట్లుగా సాధా రణముగా నిటువంటి పదములనే వారియెడఁ బ్రయోగించుచుండును. అట్టి దొక్క పద్యము మాత్రము భీమఖండములోని దుదాహరించెదను.

మ. మొరయించున్ వరుఁ డిక్షుచాప మనిశంబుం దక్షవాటీమహా
పురమధ్యంబున ముజ్జగంబు గెలువం బుత్తెంచులీలం బురం
దరవిశ్రాణిత దేవతాభువనగంధర్వాప్సరోభామినీ
చరణాంభోరుహనూపురస్వనములన్ ఝంకించు ఝుంకారముల్.

"గంధర్వాప్సరోభామినీ" శబ్దసామ్యముచేతఁ దెలుగుఁరాయనిఁ గస్తూరి వేఁడిన పద్యము నిచ్చట మరల నుదాహరింప బుద్ధి పుట్టుచున్నది

శా. అక్షయ్యంబగు సాంపరాయని తెనుంగాధీశ ! కస్తూరికా
భిక్షాదానము చేయురా సుకవిరాడ్బృందారకస్వామికిన్
దాక్షారామపురీవిహారపర "గంధర్వాప్సరోభామినీ"
వక్షోజద్వయకుంభికుంభములపై వాసించు నవ్వాసనల్.

ఇది దెలుఁగురాయని కస్తూరి వేడిన పద్యము. ఈ కస్తూరికాభిక్షాదాన మెవ్వరికి? సుకవిరాడ్బృందారకస్వామికి సుకవిరాడ్బృందారకస్వామి యెవ్వరు ? సుకవి రాజేంద్రుఁ డయిన శ్రీనాథకవి కోరబడిన కస్తూరికాఁ దాన మెట్లు సార్థక మగును ? దాక్షారామపురీ విహారపరగంధర్వాప్సరోభామినీ వక్షోజద్వయ కుంభికుంభములపై వాసించుటచేత. ఈ గంధర్వాప్సరోభామిను లెవ్వరు, సానివారు ! ఈ పద్యము సాధారణముగా "సుకవిరాడ్బృందారకశ్రేణికిన్" అని చదువఁబడుచున్నది గాని యది సరియైన పాఠముగాదు; శ్రీనాథుఁడు కస్తూరి వేఁడిన సందర్భమునఁ బొసఁగదు. దీనినిబట్టి శ్రీనాథునకును దాక్షారామగంధర్వాప్సరోభామినులకును గల సంబంధ మేదో బుద్ధిమంతులు సులభముగా నూహించి గ్రహింపవచ్చును. మానవల్లి రామకృష్ణకవిగారు తమ క్రీడారామపీఠికలో "నక్షయ్యంబుగ" అను పద్యము నుదాహరించి యా సందర్భమున "దీనిచే శ్రీనాథునకు దాక్షారామవేశ్యలతో సంబంధముగల దని వేఱుగఁ జెప్పనక్కఱలేదు వీథినాటకములోని చిన్నిపోతియే శ్రీనాథు నకుఁ గూర్చు మగువయో యని సందియము కలుగుచున్నది." అని వ్రాసిరి.

సీ. అలకాపురంబున నంగారపర్ణుఁ డన్
గంధర్వపతికన్య కమలపాణి
యా దివ్యగంధర్వి కపరావతారంబు
మధుమావతోర్గంటిమండలమున

నా సుందరాంగి దాక్షారామమునఁ బుట్టి
భువనమోహిని చిన్నిపోతి యనఁగ—

[క్రీడాభిరామము.]

ఈ భీమేశ్వరపురాణము శృంగారనైషధమువలెనే సంస్కృతపద భూయిష్ఠముగా నున్నను చక్కని లోకోక్తులతోను, భాషీయములతోను నిండియుండి మంచి కవిత్వశైలిని నేర్చుకొనఁగోరువారి కనుకరణీయములైన రచనావిశేషములతోడఁ గూడి రసికజనహృదయంగమముగా నున్నది.
ఎక్కడనుండి యైనఁ గ్రొత్తగా నొక కవీశ్వరుఁడు గాని పండితుఁడు గాని తమపట్టణమునకు వచ్చినప్పు డచ్చటి పండితులు మత్సరగ్రస్తులయి యానూతనవిద్వాంసుని నాక్షేపించుటయుఁ బరాభవింపఁ జూచుటయు సామాన్యములే కదా! శ్రీనాథకవి కర్ణాటకదేశమునుండి రాఁగానే రాజమహేంద్రపురమునందలి పండితులు శ్రీనాథుని కవిత్వమంతయు సంస్కృతభాషయే యనియు, మాటల చమత్కారముచేతఁ దెలుఁగుభాషలాగునఁ గనఁబడు చున్నను నిజముగా కర్ణాట భాషాధోరణియే యనియు, ఆక్షేపింపఁ జొచ్చిరి. ఈ యాక్షేపణములను మనస్సునం దుంచుకొనియే శ్రీనాథుఁడు రాజమహేంద్రపురపండితులమీఁది కోపముచేత కుకవిదూషణ మను నెపముచేత భీమఖండములో నీ క్రింది పద్యములను వేసెను—

గీ. బోధ మల్పంబు గర్వ మభ్యున్నతంబు
శాంతి నిష్పచ్చరంబు మచ్చరము ఘనము
కూపమండూకములఁబోలెఁ గొంచె మెఱిఁగి
పండితంమన్యులైన వైతండికులకు.

గీ. నికటమున నుండి శ్రుతిపుటనిష్ఠురముగ
నడరి కాకులు బిట్టు పెద్దఱచినప్పు
డుదధి రాయంచ యూరక యుంట లెస్స
సైఁప రాకున్న నెందేనిఁ జనుట యొప్పు

గీ. ప్రౌఢిఁ బరికింప సంస్కృతభాష యండ్రు
పలుకనుడికారమున నాంధ్రభాష యందు
రెవ్వ రేమన్న నండ్రుగా * కేమి కొఱఁత ?
నాకవిత్వంబు నిజము కర్ణాటభాష !

ఈ కడపటి పద్యములోనివి. త న్నితరు లాక్షేపించునప్పుడు సమాధాన ముగాఁ జెప్పఁ బడిన పరిహాసగర్భితములైన మాటలేకాని తన కవిత్వము కర్ణాటభాష యని శ్రీనాథుని యభిప్రాయ మెంతమాత్రమును గాదు. ఇట్లన్యాపదేశముగా దూషించుటయే కాక రాజమహేంద్రపండితులను శ్రీనాథుఁడు బహుపద్యములయం దాక్షేపించి యున్నాఁడు—

శా. ... .... . .... .... .... .... .... ....
.... .... .... .... ... .... .... .... వి
ద్వాంసుల్ రాజమహేంద్రపట్టణమునన్ ధర్మాసనంబుండి ప్ర
ధ్వంసాభావము ప్రాగభావము మనుచుం దర్కింతు రశ్రాంతమున్.

మ. శ్రుతిశాస్త్రస్మృతు లభ్యసించుకొని విప్రుం డంత నానాధ్వర
వ్రతుడై పోయి కనున్ బురందరపురారామద్రుమానల్పక
ల్పతరుప్రాంతలతాకుడుంగసుఖసుప్తప్రాప్తరంభాంగనా
ప్రతిరోమాంకురపాటనక్రమకళాపాండిత్యశౌండీర్యముల్.

వ. "కీర్తివిహారఘంటాపథం బైన పంటమహాన్వయంబునఁ బాఁకనాటి దేశంబున భద్రపీఠంబున నధివసించిన — ———— పోలయవే

* నాకేమి — అని పాఠాంతరము

[శ్రీనాథుఁడు తన కవిత్వము సంస్కృతము, తెలుఁగుకాదు; కర్ణాటభాషయని యాక్షేపణరూపముగఁ జెప్పినను 'చెవికింపఁగు మధురమైన భాష (కర్ణ + అట + భాష)' యని సూచించెననుట స్పష్టము. 'ఎవ్వరేమన్న నండ్రుగా కేమికొఱఁత ? అనునదియు పయి యర్థమును సమర్థింపఁగలదు.]

మాన్నపోతాన్న వేమకుమారగిరీశ్వరాదుల ———————— సంబంధ బాంధవ్యంబున వసుంధరాభారధౌరంధర్యంబు నంది——— ——— అల్లాడభూవల్లభుండు రాజమహేంద్రంబు రాజధానిగా సింహాద్రి పర్యంతంబు—— ————విశ్వవిశ్వంభరాభువనమండలంబుఁ దదనంతరంబు.

గీ. రాజరఘురాము లల్లాడరమణసుతులు
ధాత్రిఁ బాలింతు రాచంద్రతారకముగ
వేమభూవల్లభుండును వీరవిభుఁడు
నన్నదమ్ములు హలియును హరియుఁ బోలె.

ఉ. తమ్ముని వీరభద్రవసుధాధిపు విక్రమవీరభద్రునిన్
నమ్మదలీల రాజ్యభరణస్థితిఁ బట్టముఁగట్టి బహూద
ర్పమ్మున వేమభూవరుఁడు వ్రాసె జగద్విజయప్రశస్తివ
ర్ణమ్ములు దిగ్ధురంధరసురద్విపకుంభవిషాణమండలిన్.''

అను భీమపురాణములోని గద్యపద్యములవలన నల్లాడభూపతి కొండవీటి రెడ్డిరాజులతోడి సంబంధబాంధవ్యమువలన రాజ్యలాభమును బొందిన ట్లగపడుచున్నది గాని యా బాంధవ్య మెట్టిదో మాత్ర మీ పురాణమువలన బోధపడదు. కొండవీటిరెడ్డిరాజులతోడి బాంధవ్యమువలన రాజమహేంద్రవరరాజ్యము కాటయవేమారెడ్డికి లభించిన విధము కొంతకాలముక్రిందట చింతామణిలోఁ బ్రకటింపఁబడిన యీ క్రింది మల్లాంబిక (కాటయవేముని భార్య) యొక్క తొత్తరంమూడిదానశాసనమువలనఁ దేటపడుచున్నది.

శ్లో. తత్ర పంటకులం నామ ప్రసూతం బహుశాఖిని,
తరావివ ఫలం రమ్యం వృత్తం సరస ముజ్జ్వలం,
తత్రాసీ ద్వేమభూపాలః కులే విబుధరంజకః,
పయోధావివ సంతానో రాజరత్నోద్భవాకరే,
శ్రీమాన్వేమమహీపతి స్స విదధే పాతాళగంగాతటే
శ్రీశైలే జగనొబ్బగండబిరుద స్సోపానవీథీం శుభాం,

యాసౌ దీవ్యతి దివ్యసీమ నగరారోహోద్యతానాం నృణాం
నిశ్రేణిః పరికల్పితేన నితరా మాబ్రహ్మకల్పస్థిరా.
యస్మిన్నిస్సీమభూదాన ఖ్యాతి సౌభాగ్యశాలిని,
ద్విజైర్న బహుమన్యంతే బలిభౌవనభార్గవాః.
మహాసేనో మహాదేవో దివారాతికులాంతకః
అనపోతమహీపతౌ ధరిత్రీం పరితో బిభ్రతి పన్నగేంద్రముఖ్యాః,
చిరముచ్ఛ్వసితాలఘూకృతే స్వేభరణే జీవసమస్య సంస్తువంతి.
తస్యానుజ స్సుజన నోఽస్తి వసంతరాయో
వీరాన్న వేమనృపతిః ఛురికాసహాయః,
యస్మిన్మహీ మవతి సార్థ మభూ చ్చిరాయః
నామావనే సుమనసాం బహుశో వదాన్యే.
హేమాద్రిదాననిరతే యస్మిన్ననవేమభూపతౌ ముదితాన్,
అవలోక్య భూమిదేవాన్ దేవాః స్పృహంతి భూమివాసాయ.
యస్మిన్ కిరతి వసంతే దిశిదిశి కామోత్సవేషు కర్పూరం,
అధివాసితపరిధానానుభవజ్ఞోఽభూ చ్చిరాయ గిరిశోఽపి.
కుమారగిరిభూపోఽభూ దనపోతవిభో స్సుతః
జయతో వాసవస్యేవ ప్రద్యుమ్న ఇవ శార్ఙ్గిణః.
కొండవీడు రితి ఖ్యాతే పురే స్థిత్వా కులాగతే,
కుమారగిరిభూపోఽయం చిరం భూమి మపాలయత్.
తులాపురుషరత్నస్య శ్రీకుమారగిరేః కుతః,
తులాపురుషముఖ్యాని మహాదానాని యోఽతనోత్,
ఆసీదమాత్యరత్నం కాటయవేమప్రభు స్తస్య.
అతిసురగురుభార్గవమతి రతిభార్గవవిజయవిఖ్యాతిః
సింహాసనే నిధాయాసౌ కుమారగిరిభూవరం,
అతేజయ న్మహాతేజా శ్రీకృష్ణ ఇవ ధర్మజం.
కుమారగిరిభూనాథో యస్మై విక్రమతోషితః
ప్రాదాత్ ప్రాచీభువం రాజమహేంద్రనగరీముఖాం,

నప్తా కాటమహీభుజో గుణగణోదారస్య మార్రప్రభోః
పౌత్రః కాటయవేమభూమిరమణః శ్రీవేమపృథ్వీపతేః.
దౌహిత్రఃపునరన్నపోతనృపతే ర్ధాత్రీశచూడామణి
ర్జామాతా జయతి క్షితిం చిరమవన్ దొడ్డాంబికానందనః
కాటయవేమకటాక్షే ప్రభవతి సదయే చ నిర్దయే చ తదా,
గజపతిముఖనృపతీనాం చిత్రం ముక్తాతపత్రతా భవతి.
భూపాలాన్నమయన్ ప్రజాన్నియమయన్ కాంతాజనం కామయన్
భూదేవాన్ రమయ న్నరీన్విరమయన్ మిత్రాణి విశ్రామయన్.
కీర్తింవిభ్రమయ న్నఘాని శమయన్ ధర్మం సమాయామయన్
సోఽయం వేమమహీపతి ర్విజయతే కాటావనీశాత్మజః
అభూ త్కాటయవేమస్య జాయా మల్లాంబికా సతీ,
అశేషగుణసంపూర్ణ పాతివ్రత్యధురంధరా.
రాజద్రాజమహేంద్రనామనగరే గోదావరీతీరగం
మార్కండేయశివాలయం పతిహితా మల్లాంబికా ధార్మికా,
కృత్వా శుద్ధసువర్ణరత్నఖచితం బ్రహ్మప్రతిష్ఠాస్తదా
సత్రాణ్యధ్వని చ ప్రపాది జయతేఽనేకాన్తటాకానపి,
శ్రీశాకే గుణ రామవిశ్వ గణితే కార్తిక్యహేబ్దే ఖరే
ప్రాదాత్కాటయవేమయస్య వనితా మల్లాంబికా నామతః,
గ్రామం మల్ల వరం నృసింహవిదుషే కాణ్వద్విజాయాదరా
దాచంద్రార్క ముదర్కలాలసమతే సైన్యశ్వర్యభోగాష్టకం.
కోనదేశేఽగ్రహారో యం భాతి మల్లవరాభిధః ।
తీరే చ వృద్ధగౌతమ్యాః పుణ్యే ముక్తీశ్వరాంతికే.

ఈ శాసనమునుబట్టి పంటకులమునందు శ్రీశైలమునకు మెట్లు కట్టించిన వేమభూపాలుఁ డుదయించినట్టును, ఆతని కనపోతభూపాలుఁడును, అనవేమ భూపాలుఁడును పుట్టినట్టును, అనపోతభూపాలుని కుమారుఁడయిన కుమార గిరిభూపాలుఁడు కొండవీటిరాజ్య మేలుచుఁ దన తోఁబుట్టువగు మల్లాంబి

కకు భర్తయుఁ దనకు మంత్రియు నగు కాటయవేమభూపాలునకు రాజ
మహేంద్రవరము మొదలుగాఁ గల తూర్పుదేశము నిచ్చినట్టును, ఆ
మల్లాంబ రాజమహేంద్రవరమున మార్కండేయ శివాలయమును గట్టించి
శాలివాహనశకము ౧౩౩౩-వ సంవత్సరమునకు సరియైన క్రీస్తుశకము
౧౪౧౦ ఖరనామసంవత్సర కార్తికశుద్ధపూర్ణిమనాఁడు కోనసీమలోని మల్ల
వరమును నృసింహశాస్త్రికి దానము చేసినట్టును, తెలియవచ్చుచున్నది.

భీమఖండము ౧౪౩౦-వ సంవత్సరప్రాంతమునం దనఁగాఁ గవి కఱువది
సంవత్సరములు దాఁటిన తరువాతనే చేయఁబడినది. ఈ గ్రంథరచనము
చేసినతరువాతఁ గాని శ్రీనాథుఁడు తన కవిసార్వభౌమ బిరుదాంకాదికథల
నంత బహిరంగముగాఁ జెప్పుకొన నారంభింపలేదు. భీమఖండము తుది
గద్యమునందు "సుకవిజనవిధేయ సకలవిద్యాసనాథ శ్రీనాథనామధేయ
ప్రణీతం" బని మాత్రమే వేసికొనియెను. తాను కవిసార్వభౌముఁడ నని
భీమఖండములో మఱి యెక్కడను జెప్పుకొనలేదు. ఈ భీమేశ్వరపురాణ
రచనముచేత శ్రీనాథునకు రాజాశ్రయము లభించి సంపూర్ణమనోరథసిద్ధి
కలిగెను. అతఁ డప్పటినుండియు రాజానుగ్రహమునకుఁ బాత్రుఁడయి
వేమవీరభద్రారెడ్ల యాస్థానకవి యయి మహాగౌరవపదము ననుభవింపఁ
దొడఁగెను. తరువాత శీఘ్రకాలములోనే శ్రీనాథమహాకవి కాశీఖండమును
తెనిఁగించి దానికి వీరభద్రారెడ్డిని కృతిపతిని జేసి రాజసమ్మానమును బడ
సెను. కాశీఖండము ౧౪౩౫-వ సంవత్సరప్రాంతమునందు రచియింపఁబడి
యుండును. కవి కప్పటికి దాదాపుగా డెబ్బది సంవత్సరములప్రాయముం
డును తన గ్రంథరచనమునుగూర్చి శ్రీనాథుఁడు కాశీఖండములో నిట్లు
చెప్పుకొనెను—

సీ. చిన్నారిపొన్నారి చిఱుతకూకటినాఁడు
రచియించితి మరుత్తరాట్చరిత్ర
నూనూఁగుమీసాల నూత్నయౌవనమున
శాలివాహనసప్తశతి నొడివితి

సంతరించితి విండుజవ్వనంబునయందు
హర్షనైషధకావ్య మాంధ్రభాషఁ
బ్రౌఢనిర్భరవయఃపరిపాకమునఁ గొని
యాడితి భీమనాయకునిమహిమఁ

బ్రాయ మింతకు మిగులఁ గైవ్రాలకుండఁ
గాశికాఖండ మను మహాగ్రంథ మేను
దెనుఁగుఁజేసెదఁ గర్ణాటదేశకటక
పద్మవనహేళి శ్రీనాథభట్టసుకవి.

ఈ పద్యమునందు 'కర్ణాటదేశకటకపద్మవనహేళి' యని తనకు విశేషణము వేసికొని తాను గర్ణాటరాజ్యరాజధానియందు విద్యావిజయము నొంది యచ్చటిపండితులను సంతోషపెట్టితినని సూచించియున్నాఁడు 'కర్ణాటదేశకటకపద్మవనహేళి' యనఁగా కర్ణాటదేశరాజధాని యనెడు పద్మరాజికి సూర్యుఁ డని యర్థము సూర్యుఁ డెట్లు పద్మవనము నలరించునో, యట్లే తానును కర్ణాటకకటకవాసు లైన బుధబృందము నలరించినవాఁడ నని కవి యభిప్రాయము ఇట్లు రాజాశ్రయబలముచే ధైర్యమును వహించి కాశీఖండమునందు తన యాశ్వాసాంతగద్యమున వెనుకటిగద్యములోని 'సకలవిద్యాసనాథ'కు మాఱుగా కవిసార్వభౌమవిశేషణమును దన పేరునకు ముందుఁ బెట్టి 'సుకవిజనవిధేయ కవిసార్వభౌమ శ్రీనాథనామధేయప్రణీతం' బని బహిరంగముగాఁ దాను కవిసార్వభౌముఁడ నని చెప్పుకొన సాహసించెను. అంతేకాక సప్తమాశ్వాసాంతపద్యములలో నొకదానియందుఁ గృతిపతిని సంబోధించుచు

శా. కర్ణాటక్షితిపాలమౌక్తికసభాగారాంతరాకల్పిత
స్వర్ణస్నానజగత్ప్రసిద్ధకవిరాట్సంస్తుత్యచారిత్ర ! దు
గ్ధార్ణోరాశిగభీర ! ప్రాహ్ణముఖమధ్యాహ్నపరాహ్ణార్చితా
పర్ణావల్లభ ! రాజశేఖరమణీ ! పంటాన్వయగ్రామణీ !

అని తాను కర్ణాటాధీశ్వరుని ముత్యాలశాలలోఁ గనకాభిషేకగౌరవమును బొందినకథను గూడ నిశ్శంకముగాఁ జెప్పుకొనెను. దీనిఁబట్టి కొందఱు భీమఖండమును రచించినతరువాతను కాశీఖండమును రచియింపకముందును శ్రీనాథుఁడు కర్ణాటకదేశమునకుఁ బోయి యచ్చటఁ దన పాండిత్యప్రకర్షము చేత డిండిమభట్టు నోడించి కవిసార్వభౌమ బిరుదమును కనకాభిషేకమును గాంచె నని చెప్పుదురు గాని శ్రీనాథమహాకవి రాజమహేంద్రవరమున స్థిర పడినతరువాత దేశాంతరగమనముచేయుట కావశ్యకముకాని యవకాశము కాని కానరాదు. *

అల్లాడరెడ్డి పోలయవేమాదులగు కొండవీటిరెడతోడి సంబంధబాంధవ్యంబున వసుంధరాభారధౌరంధర్యంబు నొందె నని చెప్పఁబడుటయే కాని భీమఖండ ములో నా బంధుత్వ మెట్టిదో వివరింపఁబడలేదు. కాశీఖండములోని యీ క్రింది పద్యమువలన నల్లాడభూపతి యనవేమారెడ్డిపౌత్రి యైన వేమాంబను వివాహమాడి వేమవీరభద్రాదిపుత్రులను బడసినట్టు బాంధవముమాత్రము తేటపడుచున్నది.

మ. అనవేమక్షితిపాలపౌత్రి యగు వేమాంబామహాదేవికిన్
ఘనుఁ డయ్యల్లడభూమిపాలునకు సంగ్రామస్థలీగాండివుల్
తనయుల్ వేమవిభుండు వీరవసుధాధ్యక్షుండు దొడ్డప్రభుం
డును నన్నయ్యయు బాహువిక్రమకళాటోపప్రతాపోద్ధతుల్.

---

* [భీమఖండమును రచించిన వెంటనే శ్రీనాథునకు వేమ, వీరభద్రారెడ్ల యాశ్రయము లభింపలేదనియు, వారికిఁ గొండవీటిరెడ్లయెడఁ గల స్పర్థకొంత తదాశ్రితుఁడగు శ్రీనాథునియెడఁగూడ నుండెననియు, పిదప శ్రీనాథుఁడు ప్రౌఢదేవరాయలు, సర్వజ్ఞసింగభూపాలుఁడు మున్నగువారి యాస్థానములకరిగి, కనకాభిషేకాది సత్కారములను పొందినపిదప నతనియెడ వారికి విశేషగౌరవమేర్పడి శ్రీనాథు నాస్థానకవీశ్వరునిగా గ్రహించిరనియు శ్రీవేటూరి ప్రభాకరశాస్త్రిగారి యభిప్రా యము. [చూ. శృంగారశ్రీనాథము - పుటలు 216, 217.]

అల్లాడరెడ్డి వేమాంబికను వివాహ మాడుటచేత పరణముగా రాజమహేంద్ర వరరాజ్యమును బడసెనేమో యని పయి పద్యమువలన భ్రమ కలుగ వచ్చును గాని పూర్వోదాహృతమయిన మల్లాంబికయొక్క తొత్తరమూడి శాసనమువలన రాజమహేంద్రవరరాజ్య మల్లాడరెడ్డికింగాక కాటయవేమా రెడ్డికి వచ్చినట్టు స్పష్ట మయి భ్రమ కొంతవఱకు నివారణ మగుచున్నది. అయినను దానివలన నా రాజ్య మల్లాడిరెడ్డికిని దత్సంతతివారికిని నెట్లు వచ్చెనో తెలియరాదు. ఈ యంశమును మఱికొన్ని నూతనాంశములును వీరభద్రారెడ్డిభార్య యైన యనితల్లి యొక్క కలువచేఱు శాసనమువలనఁ దెలియవచ్చుచున్నవి. కాఁబట్టి యా శాసనమును చరిత్రాంశములతో సంబంధించినంతవఱకు నిం దుదాహరించుచున్నాను.

శ్లో. కాకత్యాః పరశక్తేః కృపయా కూశ్మాండవల్లికా కాచిత్,
పుత్ర మసూత తదేత త్కుల మనఘం కాకతీయసంజ్ఞ మభూత్ ౨౧
పిత ర్యుపరతే తద్వ దరక్ష దఖిలాం క్షితిం,
వీరరుద్రమదేవీతి దుహితా గుణైః. ౨౨
అథ సా రుద్రమదేవీ ప్రతాపరుద్రే హృతారిన్నపభద్రే.
దౌహిత్రే నుచరిత్రే సర్వా ముర్వీం నిధాయ ముదితవతీ. ౨౩

* * * *

వరాహవ ద్వారిధివారిమగ్నాం ధరా మశేషాం యవనోదరస్థాం,
సముద్ధరన్ ప్రోలయనాయకేంద్ర స్తతః ప్రతిష్ఠాపయతి
[స్మ తద్వత్ ౨౮
స్వర్గాతిథౌ ప్రోలయభూమిపాలే విశ్వేశ్వరాజ్ఞా మధిగమ్య గత్వా.
అపాలయత్కాపయనాయకేంద్ర స్తదీయరాజ్యం తరణిప్రతాపః,
అథ పంచోత్తరసప్తతినాయకసంసేవ్యమానపదపద్మః,
కాపావనీశ్వరః శ్రీవిశ్వేశ్వరకరుణయా క్షితి మరక్షత్. ౩౦
తురుష్కై ర్యే సమాక్రాంతా స్తే చాన్యే కాపభూభుజా,
అగ్రహారాః పున ర్దత్త్వా భూయో భువ మభూషయన్. ౩౧

విశ్వేశ్వరాయ వివిధాం ప్రవివిధాయ సేవాం
యాతే విభౌ దివి చ తత్పదసేవనాయ,
తై ర్న్యాయకైః స్వనగరాణ్యధిగమ్య సర్వై
స్సంరక్షితా గతవిరోధకథైః స్వదేశాః, ౩౨

తేషాం వేమనరేశ్వరః క్షితిభుజాం ధర్మాత్మనా మగ్రణీ
శ్శశ్వ ద్భారతదివ్యపూరుషకథాధౌతాంతరంగ స్సుధీః,
శ్రీమత్పంటకులోద్భవ శ్శివపదద్వంద్వైకసేవాపరో
విప్రాశీర్వచనోన్నతో జితరిపుఃస్ఫూర్జత్ప్రతాపోదయః. ౩౩

ప్రాపైస్యపాతాళగంగాయా మర్పితా వేమభూభుజా,
సా సోపానావళీ చిత్రం స్వర్గంగా _స్త్యధిరోహిణీ ౩౪

పుత్రా ధాత్రీపతే _స్తస్య త్రిమూ_ర్తయ ఇవత్రయః,
అన్నపోతాన్నమాచాన్నవేమనామవిభూషణాః. ౩౫

అన్నపోతవిభోః పుత్రః కుమారగిరి రున్నతః,
శివావానతయా భాతి భూభృత్కులశిరోమణిః. ౩౬

అ_స్తి ప్రశ_స్తగుణభూ రరిజిద్భుజశ్రీః
కీ_ర్తిప్రియో జగతి కాటయవేమభూపః,
భక్త్యై కుమారగిరిభూమిపతే ర్య ఆసే
త్సౌన్వగ్రజానుజసుహృత్సచివాపిరూపః. ౩౭

శ్రీమత్కాటయభూపతే ర్భుజభృతో నప్తా ప్రతాపోన్నతేః
పౌత్రో మారమహీశ్వరస్య తనయ శ్శ్రీకాటయోర్వీవిభోః
జామాతా ప్రభు రన్నపోతనృపతే ర్వేమక్షమాధీశ్వరో
యస్యాసీ త్స కుమారగిర్యధిపతి స్స్యాలః పతి ర్దైవతం. ౩౮

మాలా మమ్లానపుష్పా మివ శిరసి వహన్యస్య భూభ_ర్తు రాజ్ఞా
ముర్వీం ఖర్వీకృతారిక్షితిపతి రఖిలా మప్రతీపప్రతాపః,
జిత్వా సామ్రాజ్యలక్ష్మీమనుపమవిభవాం జృంభయ న్సంభృతశ్రీ
కీ_ర్తి స్సేవాపరో భూ త్కుమరగిరివిభోః కాటయాధీశవేమః. ౩౯

వేమవిభుర్లక్ష్మీవా నంగీకృతసర్వమంగళో జిష్ణుః,
ప్రద్యుమ్నం శక్తిధరం జయంత మయతి స్మ సుతకుమారగిరిం. ౪౦
జాతమాత్రేణ జాతో సౌ సర్వసర్వంసహేశ్వరః.,
ఆదిగర్భేశ్వరః ఖ్యాతః కుమారగిరిభూపతిః. ౪౧
యస్యా వేమనృపాలో జనకో దొడ్డాంబికా తు జనయిత్రీ,
సా దీవ్య త్యనితల్లీ సమూర్తి రివ దేవభూమిదేవశ్రీః. ౪౨
వేమక్షితీశతిలకేఽథ కథావశేషే
భర్తా కుమారగిరి రస్య సుతో భువోఽభూత్,
పశ్చా ద్ధరాధిపతిభావజుగుప్సయేవ
స్వస్థాన ఏవ స కుమారగిరీశ్వరోఽపి ౪౩
అథ వేమేశ్వరబంధు ర్విలసతి భువనప్రశస్తసింధుః,
దొడ్డయయల్లనరేంద్రః ప్రథితమహాసమరకేళినిస్తంద్రః. ౪౪
స్వామిద్రోహపరాయణకునృపతిజలరాశిజలనిమగ్నధరాం,
దొడ్డయయల్లనరేంద్రో హరి రివ సౌకర్యత స్సముద్ధృతవాన్. ౪౫
దురితరహితచిత్తో దొడ్డయాల్లాడభూపో
భువ మరిజనవశ్యాం భూయసాహృత్య దోష్ణా,
విమలగుణయుతాయాం వేమభూపాత్మజాయా
మవనిసురసుధాయా మన్నితల్యాం న్యధత్త. ౪౬
భూలోకభాగ్యోదితకల్పవల్లీ శిష్టాశ్రితానిష్టవిభేదభల్లీ,
పవిత్రచారిత్రవధూమతల్లీ వేమక్షితీశస్య సుతాన్నితల్లీ, ౪౭
తస్యాః పతిః పతి రశేషమహీపతీనాం
వేమాంబికాల్లయనృపాలవరేణ్యసూనుః ?
శ్రీవీరభద్ర ఇతి సర్వగుణైకభద్రః
కీర్తిప్రతాపతులితేశ్వరవీరభద్రః ౪౮
తస్యాగ్రజో జయతి వేమయభూతలేంద్ర
శ్రీ కామినీవివిధచారువిలాససాంద్రః
అన్వాయనభిజ్ఞ సముపాశ్రితరామచంద్రః

ప్రత్యర్థివంశకమలాకరపూర్ణచంద్రః. ౪౯
వినతనరపాలపాళీకనదురుమౌళిప్రగుదితగంధపాదాబ్జా
అనితల్లీ పతిదైవా ఘనసచివీభూతభావుకా భువ మవతి. ౫౦
శాకే శరయుగవిశ్వే వైశాఖే మాసి భువ మవ త్యనితల్లీ,
సురవిప్రక్షేత్రకరం మార్కండేయేశసన్నిధౌ త్యక్తవతీ. ౫౧

.... .... .... ....

శాకాబ్దే శరవేదరామశశభృత్సంఖ్యే శుభే శోభకృ
ద్వర్షే శ్రావణకృష్ణవిష్ణుదివసే శ్రీకల్వచేఱుం శుభం.
గ్రామం దత్తవతీ సతీ పరహితాచార్యా శైలాధిప
శ్రీరామేశ్వరసన్నిధౌ పతిహితశ్రీ రన్నతల్ల్యంబికా. ౬౮
గ్రామస్య కలువచేఱో రన్నవరాఖ్యాం విధాయ నిజనామ్నా,
పరహితభిషజే ప్రాదా దనితల్లీ గ్రామ మష్టభూతియుతం.' ౬౯

ఈ శాసనము శాలివాహనశకము ౧౩౪౫ శోభకృత్సంవత్సర శ్రావణ బహుళ ఏకాదశినాఁ డనఁగా క్రీస్తుశకము ౧౪౨౩-వ సంవత్సరమునందు కలువచేఱుగ్రామమును అన్నవర మనుస్వనామముతో ననితల్లి పరహితాచార్యుఁ డను వైద్యశిఖామణి కగ్రహారముగా నిచ్చిన సందర్భమున వ్రాయఁబడినది. ఈ శాసనమునుబట్టి రాజమహేంద్రవరరాజ్యము కాటయ వేమారెడ్డి యనంతరమున నాతఁడు పుత్రహీనుఁడైన తరువాత నాతనిపుత్రిక యైన యనితల్లికి వచ్చినట్టును, ఆమెపేరనే మొదట మామయయిన యల్లాడరెడ్డియు, పిమ్మట బావయైన వేమారెడ్డియు రాజ్యపాలనము చేసినట్టును, స్పష్టపడుచున్నది. రాజమహేంద్రవరరాజ్యము ననితల్లిపక్షమునఁ దన జీవితకాలములో నల్లాడరెడ్డి ౧౪౧౬-వ సంవత్సరము మొదలుకొని ౧౪౨౬-వ సంవత్సరమువఱకును పాలనము చేసెను. ఈతని పాలన కాలములోనే ౧౪౨౩-వ సంవత్సరమున ననితల్లి పేర దానశాసన ముండుట యితఁ డామెప్రతినిధిగానే భూపరిపాలన మొనర్చినట్లు స్పష్టముగాఁ దెలియు

వచ్చుచున్నది. ౧౪౨౬-వ సంవత్సరము మొదలుకొని భర్తయైనవీరభద్రారెడ్డియు బావయైన వేమారెడ్డియు రాజ్యమేలుట యనితల్లిపక్షముననే యని వేఱుగఁ జెప్పవలసినపనియే లేదు. కాశీఖండమునందు రాజ్య మనితల్లిదే యని కాని, యనితల్లిమూలమున వచ్చిన దని కాని యెక్కడను జెప్పక

సీ. త్రైలోక్యవిజయాభిధంబైన సౌధంబు
  చంద్రశాలా ప్రదేశంబునందు
సచివసైన్యాధీశసామంతనృపవర
  సీమంతినీజనశ్రేణి గొలువ
శాస్త్రమీమాంసయు సాహిత్యగోష్ఠియు
  విద్వత్కవీంద్రులు విస్తరింపఁ
గర్పూరకస్తూరికాసంకుమదగంధ
  సారసౌరభము దిక్పూరితముగ

నిజభుజావిక్రమంబున నిఖిలదిశలు
గెలిచి తను రాజ్యపీఠ మెక్కించినట్టి
యన్న వేమేశ్వరునియంక మాశ్రయించి
నిండుకొలువుండెఁ గన్నులపండువుగను.

అని యొకచోటను,

సీ. ధరియింప నేర్చిరి దర్పకప్రేమాంకు
  లీల మాణిక్యాంగుళీయకములు
కల్పింప నేర్చిరి గంగమట్టియమీఁదఁ
  గస్తూరికాపుండ్రకములు నొసల
సవరింప నేర్చిరి జన్నిదంబుల క్రోలఁ
  దారహారములు ముత్యాలసరులు
చెరువంగ నేర్చిరి శిఖల నెన్నడుములఁ
  గమ్మని క్రొత్త చెంగల్వవిరులు

ధామముల వెండిపై ఁడియుఁ దడఁబడంగ
బ్రాహ్మణోత్తము లగ్రహారములయందు
వేమభూపాలుఁ డనుజన్ము వీరభద్రు
ధాత్రి నేలింప గౌతమీతటమునందు.

అని యింకొకచోటను. అల్లాడభూపతి యగ్రపుత్రుడైన వేమభూపాలుఁడు నిజభుజావిక్రమమున నిఖిలదిశలు గెలిచి రాజ్యపీఠ మెక్కించి యనుజన్ముఁడైన వీరభద్రుని ధాత్రి నేలించెనని మాత్రము శ్రీనాథుఁడు చెప్పియున్నాఁడు భీమఖండమునందు వేమవీరభద్రవరపాలుర రాజ్యము సింహాద్రి వఱకు మాత్రమే వ్యాపించిన దని చెప్పఁబడినను కాశీఖండమునందు

ఉ. ప్రాకటవిక్రమస్ఫురణ రాజమహేంద్రము రాజధానిగా
నేకసితాతపత్రమున నేలెను వీరనృపాలుఁ డుత్తమ
శ్లోకుఁడు వేమశౌరియనుజుండు సమున్నతవైభవాఢ్యుఁడై
చీఁకటియుం గళింగయును జిల్కసముద్రము సింహశైలమున్.

అని వీరభద్రారెడ్డిరాజ్యము చిల్కసముద్రమువఱకును వ్యాపించినట్లు చెప్పఁబడినందున పయి సీసపద్యములోఁ జెప్పఁబడినట్లు ఎల్లాడ తమ్ముని పక్షమున సింహాద్రి మొదలుకొని చిల్కసముద్రమువఱకును గల రాజ్యమును నిజముగానే గెలిచి తమ్మునికిచ్చి యుండును. వీరభద్రారెడ్డి కా రాజ్యము భార్య యైన యనితల్లి మూలమునఁ గాక తండ్రిమూలముననే వచ్చినదనెడుపక్షమున అల్లాడరెడ్డికి జ్యేష్ఠపుత్త్రుఁ డుండగా ద్వితీయ పుత్రునకది వచ్చుటకుఁ గారణముండదు. తన ప్రభువునకు భార్యమూలమునఁ బ్రభుత్వము వచ్చిన దనుట గౌరవలోపమని భావించి శ్రీనాథుఁ డీ సత్యమును మఱుఁగుపఱిచి యుండును. రాజ్యలాభక్రమమును జెప్పకపోయినను కవి యనితల్లి వీరభద్రుని యిల్లా లగుటను మాత్రము చెప్ప విడువక యీ క్రింది పద్యములలో సర్ణించెను.

ఉ. రాజశశాంకశేఖరుఁడు రాజకిరీటవతంస మష్టది
గ్రాజమనోభయంకరుఁడు రాజులదేవర రాజరాజు శ్రీ

రాజమహేంద్రభూభువనరాజ్యరమారమణీమనోహరుం
డాజిఁ గిరీటి కీర్తి నిధి యల్లయవీరనరేంద్రుఁ డున్నతిన్.

మ. మనుతుల్యుం డగు కాటభూవరుని వేమక్ష్మాతలాధీశునం
దనఁ బాణిగ్రహణంబు చేసెఁ బ్రియమొందన్ వీరభద్రేశ్వరుం
డనితల్లిన్ వనితామతల్లి నుదయాస్త్రాదీంద్రసీమావనీ
ఘనసామ్రాజ్యసమర్థసుప్రథమ సాక్షాదిందిరాదేవతన్.

గీ. అట్టి యనితల్లి పుణ్యగుణాభిరామ
దనకుఁ బట్టంపుదేవిగా ధన్యలీల
వసుధ యెల్ల నేకాతపవారణముగ
నేలు నల్లయవీరభద్రేశ్వరుండు.

ఈ కవి యనితల్లివలన రాజ్యప్రాప్తి యయిన కథను విడిచినను, కృతిపతి తన్నుఁగూర్చి చెప్పినను, తాను కృతిపతినిగూర్చి చెప్పినను దాక్షారామాప్సరసలను మాత్రము విడిచినవాఁడు కాఁడు.

శా. ఈ క్షోణి న్నినుఁబోలు సత్కవులు లే రీనేఁటికాలంబునన్
దాక్షారామచళుక్యభీమవరగంధర్వాప్సరోభామినీ
వక్షోజద్వయగంధసారఘుసృణద్వైరాజ్యభారంబు న
ధ్యక్షించున్ గవిసార్వభౌమ ! భవదీయప్రౌఢసాహిత్యముల్.

శా. పారావారపరీతవిశ్వవసుధాభారోద్ధతిప్రక్రియా
ధౌరంధర్య ! సరోరుహేక్షణ ! సమిద్గాండీవకోదండ ! దా
క్షారామప్రమదాకరోరకుచకుంభాభోగసంక్లృప్తక
స్తూరీస్థానకముద్రితస్థగితవక్షోవీథికాభ్యంతరా !

ఈ వీరభద్రారెడ్డి తన రాజ్యపరిపాలనకాలములో చుట్టుపట్ల నున్న కర్ణాటక కటకతురుష్కరాజులతో పరమమైత్రి కలిగినవాఁ డయి యుండినట్టు ద్వితీయాశ్వాసాంతమునందలి యీ క్రింది పద్యమువలన కనఁబడుచున్నది.

మ. బలవద్వారహదొంతిమన్నె ధరణీపాలావరోధాంగనా
　　విలసన్మంగళసూత్రరక్షణకళావిఖ్యాతకారుణ్య! యు
　　త్కలకర్ణాటతురుష్కరాట్పరమమిత్రా! కుండలస్వామికుం
　　డలపూజాపరతంత్రధీవిభవ! పంటక్ష్మాపచూడామణీ!

అనితల్లి శాసనమువల్ల కాటయవేమునకు కుమారగిరిచెల్లెలయిన మల్లాంబ గాక దొడ్డాంబ యను వేఱొకభార్య యుండినట్టును, అనితల్లి దొడ్డాంబిక కూఁతు రయినట్లును దెలియవచ్చుచున్నది. తన సవతితల్లియు, కొండవీటి వారి యాడుఁబడుచును నైన మల్లాంబ తనపేర మల్లవరగ్రామమును బ్రాహ్మణుల కగ్రహారముగా నిచ్చి తొత్తరమూడిశాసనము వ్రాయించి నట్లే యీ యనితల్లి తనపేర నన్నవంమును వైద్యున కగ్రహారముగా నిచ్చి కలువచేఱుశాసనమును వ్రాయించెను. మల్లాంబ కట్టించిన మార్కండే యాలయములోనే యనితల్లి మార్కండేయశివసన్నిధిని ౧౪౩౩-వ సంవ త్సరమునందు దేవబ్రాహ్మణక్షేత్రములమీఁది పన్నును తీసివేసెను. *

* [ఇయ్యెడ 'ఆంధ్రకవితరంగిణి' లో నిట్లున్నది. అని తల్లి భర్తయైన వీరభద్రా రెడ్డి తండ్రి యల్లాడభూపతి, స్వామిద్రోహపరాయణులగు వైరి నృపతులనెడి జలరాశిలో మునిఁగిపోయిన భూమిని శ్రీహరివలె నుద్ధరించినాడనియు, దురిత రహితచిత్తుఁడైన యాతఁడు శత్రువశమునుండి తప్పించి యా రాజ్యాధికారమును గాపయవేమభూపతి కుమార్తెయైన యనితల్లియం దుంచినాఁడనియుఁ, గలువచేఱు శాసనమునందలి ౧౭-౮ శ్లోకములలోఁ జెప్పియుండుటచే, ననితల్లి కీ రాజమ హేంద్రవరరాజ్యము తల్లిమూలకముగా వచ్చియున్నదని భావింపవలయునని శ్రీనాథచారిత్రమునందు శ్రీవీరేశలింగము పంతులుగారు వ్రాసియు, నందే యొక తావున దొడ్డాంబిక యనితల్లికి సవతితల్లి యనియు, సవతితల్లినుండి యా రాజ్య మామెకు సంక్రమించినదనియుఁ జెప్పియున్నారు. రాజమహేంద్రవరరాజ్యమని తల్లిదనుట నిశ్చయమే కాని, యది యెవరిమూలమున వచ్చిన దనుటలోనే వివాద మున్నది. ఆ రాజ్యమును కొమరగిరిరెడ్డి కాటయవేమున కిచ్చెనని తొత్తరమూడి శాసనముచున్నది. అది సత్యమైనచో నా వేమారెడ్డి కనితల్లితప్ప యప్పటికి వేఱు సంతానము లేదు. కావునను, ఆ రాజ్యమున కుత్తరాధికారిణి అనితల్లితప్ప మఱియొకరు లేనందునను, అల్లాడరెడ్డి యా రాజ్యభారము ననితల్లియం దుంచి, తన యుదారాశయమును గనుపఱచి యుండును, (సంపుటము. 5 పుటలు. 71, 72)]

కలువచేఱు శాసనమువలనఁ దెలియవచ్చిన విశేషాంశములలో నొకటి యేక శిలానగరరాజ్యపరిపాలనము చేసిన రుద్రమదేవి గణపతి దేవుని దేవి గాక కూఁతురని స్థిరపడుట. ౧౨౬౦-వ సంవత్సరము వఱకును దేశపరిపాలనము చేసిన గణపతిదేవుని యనంతరమున నాతని రాజ్యమునకు వచ్చి ౧౨౬౧ మొదలుకొని ౧౨౯౪-వ సంవత్సరము వఱకును ప్రజారంజకముగా నోరుగంటిసామ్రాజ్యము నేలిన రుద్రమదేవి గణపతిదేవుని భార్య యని యేలాగుననో యొక వాడుక కలిగినది తరువాతఁ గొంతకాలమున కామెమనుమఁడైన ప్రతాపరుద్రునిపైని విద్యానాథకవిచేఁ జెప్పఁబడిన ప్రతాపరుద్రీయమునకు మఱికొంత కాలమునకు వ్యాఖ్య చేసిన కుమారస్వామిసోమయాజి యట్లో భ్రమపడి మూలవిరుద్ధముగా "పురా కిల కాకతికులసంభూతే, గణపతినామ్ని మహారాజే దుహితృమాత్రసంతానే కదాచి ద్దైవయోగేన కాలపరిపాక ముపేయుషి తన్మహిషీ రుద్రదేవీ నామ రాజ్ఞీ బహూని వర్షాణి తద్రాజ్య మకంటకం పరిపాల్య పరిణతా సతీ దౌహిత్రే ప్రతాపరుద్రే రాజ్యధురాం నిదధే" అని పూర్వము కాకతికులసంభూతుడైన గణపతిమహారాజు పుత్రికామాత్రసంతానము కలవాఁడయి దైవయోగముచేత కాలధర్మము నొందఁగా, నాతనిభార్య రుద్రమదేవి బహుసంవత్సరము లా రాజ్యము నకంటకముగాఁ బరిపాలించి వృద్ధురాలయి రాజ్యభారమును దౌహిత్రుఁడైన ప్రతాపరుద్రునియందుంచె నని వ్రాసెను. ఈ భ్రమ యెంతకాలమునకో వ్యాఖ్య చేసిన కుమారస్వామిసోమయాజికి మాత్రమే కాక రుద్రమదేవి రాజ్యకాలములోనే హిందూదేశయాత్ర చేసిన మార్కోపోలో యను విటలీదేశీయునకును గలిగెను. అతఁడు తన యాత్రచరిత్రములలో రుద్రమదేవి వెనుకటిరాజురాణి యని వ్రాసెను. దీనిని జూచి తరువాతి చరిత్రకారు లనేకులు రుద్రమదేవిని గణపతిదేవుని దేవినిగాఁ జెప్పుచు వచ్చిరి. రుద్రమదేవియొక్క వృద్ధదశలో నామె రాజ్యమునకువచ్చి యామె దౌహిత్రుఁడైన ప్రతాపరుద్రునిపైని. జెప్పఁబడిన ప్రతాపరుద్రీయనామకాలంకారశాస్త్రములో గణపతిదేవుఁడు తనకు పుత్రిక కలుగఁగా నామెను పుత్రప్రతినిధిగా భావించి రుద్రనామము పెట్టెననియు, తదనంతరమునం దామె రాజ్యభారము

వహించి బహుకాలము మహీపాలనము నిర్వహించి కడపట నా భారము నామె దౌహిత్రుఁడైన ప్రతాపరుద్రునియందుఁ బెట్టెననియు, చెప్పఁబడినది వీరరుద్రమదేవి గణపతిదేవుని దుహిత యనియు, ఆ రుద్రమదేవి రాజ్యమును సుచరితుఁడైన దౌహిత్రునకుఁ బ్రతాపరుద్రున కిచ్చెననియు, ఈ శాసనము ఘోషించుచున్నది. కాకతి యనుదేవతదయచేత నొక గుమ్మడి తీగ కొక కుమారుఁడు కలిగెనఁట! ఆ గుమ్మడితీగకొడుకుయొక్కవంశము కాకతీయవంశ మయ్యెనఁట! గణపతిదేవ మహారాజాదులు తద్వంశ సంభవులఁట!

ప్రతాపరుద్రుని యంత్యదశలో యవనాక్రాంతమయిన యాంధ్రరాజ్యమును ప్రోలయనాయకుఁ డుద్ధరించె ననియు, ఆతనియనంతరమున కాపయనాయకుఁడు కొంతకాలము రాజ్యముచేసి కాలధర్మము నొందఁగా నాతనిని గొలుచుచుండిన డెబ్బదియైదుగురు నాయకులు త్రిలింగదేశమును తమలో విభజించుకొని వేఱువేఱుభాగముల నేలుచుండిరనియు, వారిలో పంటకులోద్భవుఁడయి పాతాళగంగకు సోపానములు కట్టించిన వేమారెడ్డి ప్రముఖుఁ డనియు, చెప్పుట యీ శాసనములోని యింకొక విశేషము. ప్రోలయ యవనాక్రాంతమైన యాంధ్రదేశమును తురుష్కులచేతులలో నుండి యుద్ధరించినట్టును, ఆతనియనంతరమునఁ గాపయనాయకుఁ డాంధ్రదేశరాజ్యమును వహించినట్టును, దీనికిఁ బూర్వమునం దుండిన యే శాసనములోను జెప్పబడలేదు. త్రిలింగదేశము యవనాక్రాంతమయిన సన్నిహితకాలములయందు వ్రాయఁబడిన యన్నిశాసనములును, పుస్తకములును తురుష్కులనుండి యాంధ్ర రాష్ట్రము నుద్ధరించినవాఁడు ప్రోలయవేముఁడనియు, అతఁడే శ్రీశైలమున పాతాళగంగకు సోపానములు కట్టించినవాఁ డనియును, ఏకముఖముగా ఘోషించుచున్నవి. నూట యిరువది సంవత్సరములకుఁ దరువాత వ్రాయబడిన యీ శాసనములోఁ జెప్పింపబడిన యీ నూతనకథ విశ్వాసార్హమయినదిగా కనఁబడదు. యవనులు త్రిలింగరాజ్యము నాక్రమించుట ప్రతాపరుద్రుని రాజ్యావసానదశలో ౧౩౨౦-వ సంవత్సరప్రాంతముల

యందు-ఆ రాజ్యమును తురుష్కులనుండి యుద్ధరించుట యటుతరువాత జరిగి యుండవలెను. పోలయవేముని శాసనము లించుమించుగా ౧౩౨౦-వ సంవత్సరమునుండియుఁ గానఁబడుచున్నందున, ఆ సంవత్సర ప్రాంతమునందే యాతని యాంధ్రదేశపరిపాలనకాలమారంభమయి యుండ వలెను పోలయనాయకుఁడు త్రిలింగదేశమును ముష్కర తురుష్కహస్త ములనుండి విడిపించి కొంతకాల మేలుటయు, తదనంతరమునందు కాపయ నాయకుఁ డా రాజ్యభారమును వహించి కొంతకాల మేలి స్వర్గస్థుఁడగు టయు, అతనితరువాత పోలయవేముఁడు ప్రభుత్వమునకు వచ్చుటయు, అంతయు నొక్క సంవత్సరములోపల జరిగెననుట యసంభావ్యము గాన, నిది కల్పితకథ యయి యుండవలెను ఇచ్చటఁ బేర్కొనఁబడిన పోలయ నాయకుఁడు పోలయవేముని తండ్రియే యయి, వేముఁడు ప్రోలయయనంత రముననో కాపయయనంతరముననో రాజ్యమునకు వచ్చుట నిజమయి యుండినయెడల ప్రోలయవేమారెడ్డికే యంకితము చేయఁబడిన హరివంశ మునం దెఱ్ఱాప్రెగడ యీ యంశము నించుకయైన సూచించియుండఁడా? శ్రీనాథవిరచితములయిన గ్రంథములలో నెల్ల కాశీఖండమే కడపటి దయినట్టు కనఁబడుచున్నది. ఇది రచియించునప్పటి కీ కవికి డెబ్బది సంవత్సరము లుండినను, దీనియందు కవితాపటిమ యెంతమాత్రమును కొఱవడక బహు కావ్యరచనచేత నాటితేఱినదానివలెనే చూపట్టుచున్నది. కాశీఖండరచనానంతర మున నల్పకాలములోనే రాజమహేంద్రవరపు రెడ్డిరాజ్యమునకు సహితము వినాశము సంభవించెను.

శ్రీనాథుఁడు లాక్షణికుఁ డయిన గొప్పకవి. ఇతని కవిత్వము సంస్కృతపద భూయిష్ఠమయి రసవంతమయి యుండును మొత్తముమీద నీతనిశైలి సులభమైనది కాదు ఇతఁడు రచియించిన గ్రంథము లన్నిటిలోను నైషధము శృంగారరసప్రధానమై ప్రౌఢముగా నుండును. దీని నాంధ్రకావ్యపంచక ములోఁ బ్రధానమైనదానినిఁగాఁ జెప్పుదురు.

ఇతఁడు శివభక్తుఁడు యౌవనదశయందు శృంగారనాయకుఁ డయి స్త్రీలోలుఁడై తిరిగెనని చెప్పుదురు. అది యెంత నిజమో కాని వయసు

ముదిరినతరువాత శివభక్తుఁడయి యుండెనని యాతఁడు రచియించిన గ్రంథములే సహస్రముఖముల ఘోషించుచున్నవి ఆ కాలమునందు భక్తికిని నీతికిని నంతగా సంబంధ మున్నట్టు కనఁబడదు ఒకఁడఖండ శివభక్తుఁడును గావచ్చును, జారశిరోమణి యయి యఖండవేశ్యాభక్తుఁడును గావచ్చును.

ఇతఁడు మరుద్రాజచరిత్రము, పండితారాధ్యచరిత్రము, శాలివాహనసప్తశతి, నైషధము, భీమపురాణము, కాశీఖండము, శివరాత్రిమాహాత్మ్యము, హరవిలాసము, అను గ్రంధములను జేసెను. వీనిలో పండితారాధ్యచరిత్రమును వేమారెడ్డి సేనానాయకుఁడైన మామిడిపెగ్గదయ్యకును, నైషధము నాతని తమ్ముఁడైన మంత్రి సింగనకును, భీమేశ్వరఖండమును వీరభద్రరెడ్డి మంత్రియైన బెండపూడి యన్నయ్యకును, కాశీఖండమును వీరభద్రరెడ్డికిని, అంకితము చేసెను

శ్రీనాథుఁడు వీధినాటక మనబడెడి యొక యపాత్రపుగ్రంథమును గూడఁ జేసెనని చెప్పుదురుగాని యిప్పుడు ప్రకటింపఁబడియున్న యా పేరిటి చిన్నపుస్తక మాతనిచే పుస్తకరూపమున రచియింపఁబడినది కాదు. అందు శ్రీనాథవిరచితములయిన పద్యములు కొన్ని యున్న వనుటకు సందేహము లేదు. కాశీఖండాదిగ్రంథములలోని పద్యములను గొన్నిఁటిని శ్రీనాథుఁడు దేశసంచారము చేసినప్పు డక్కడక్కడఁ జెప్పిన పద్యములను గొన్నిఁటిని ఏర్చికూర్చి వానికిఁ దోడుగా నసమర్థు లయిన దుష్కవులు చెప్పిన బూతు పద్యములను జేర్చి వీధినాటకమను పేరు పెట్టి యేఁబది యఱువది పద్యములు గల చిన్నపుస్తకము నొకదానిని పలువురు ప్రకటించియున్నారు అందలి పద్యములలో ననేకములు నీతిబాహ్యములుగాను, అసభ్యములు, నశ్లీలములు నగు నవాచ్యములుగాను, ఉన్నవి. దుర్నీతిపోషకములైన యీ యనుచిత పద్యరచనమును శ్రీనాథకవి కారోపించుట యాతని కపకీర్తి కలిగించుట. శ్రీనాథుడు తాను వీధినాటకమును జేసినట్టే గ్రంధములోను జెప్పుకొనలేదు. శ్రీనాథుని భీమేశ్వరపురాణాదులవలన నతఁడఖండశివపూజాధురంధరుఁడని తెలియవచ్చుచున్నది. అటువంటి శివభక్తాగ్రేసరుఁడు తన యిష్టదైవతము

లయిన పార్వతీపరమేశ్వరులను గూర్చి యిటువంటి దూష్యపద్యములను జెప్పి యుండునా? కాళేశ్వరి యనఁబరఁగిన పార్వతీదేవిని గూర్చిన పద్య మిది.

చ. గొఱియల మేఁకపోతులను గొమ్మపొటేళ్ళను గావుఁగొందు వీ,
వరయఁగ సందెకాడఁ దగ వత్తు నటంచు భవచ్ఛిరంబుపైఁ
గర మిడి పోయినట్టి తిలఘాతుకురాలితదీయ
సెఱుకఁగలేవు నీవు నొకభీకరమూర్తివె కాళికేశ్వరీ!

ఒకానొక తిలఘాతుకురాలు వ్యభిచారార్థము సందెకడ వచ్చెద నని కాళికాదేవి నెత్తిమీఁద చేయిపెట్టి బాసచేసి పోయె నఁట! అట్టి ఘోరప్రమాణము చేసియు నట్టి సత్కార్యమునిమిత్త మా తెలికది తానన్నవేళకు రాకుండె నఁట! అందుమీఁద భక్తుఁ డలిగి నీవు గొఱ్ఱెలు మొదలయిన జంతువులను బలిగొనుటయే కాని నీ శిరస్సుపైని జేయివేసి వచ్చెద నని బాసచేసి రాక పోయిన తిలఘాతుకురాలిరోమములు పీకఁగలిగితివా? యని మృదువచన ములతో పార్వతిదెవి నడుగుచున్నాఁడు! ఇట్టి యర్థమును శివభక్తాగ్రేసరుఁ డైన శ్రీనాథునకే కాదు భక్తిహీనుఁడైన సామాన్యహీనమానవున కారో పించుట సహిత మవమానకరమే. అనర్థదాయకమైన యర్థము నటుండనిచ్చి యిఁక నీ పద్యమునందలి పదసౌష్ఠవసౌభాగ్యమును విచారింతము. సందెకడ నని యుండవలసినదానికి సందెకాడనని యున్నది తిలఘాతుకురాలి తదీయశ ములనుచోట సమాసమధ్యమునందున్న తదీయ కర్థములేదు, శ....ము లన్నపదమునకు పామరజనవ్యవహారములోనే కాని సంస్కృత మునఁ గవి యుద్దేశించిన యర్థము లేదు. ఈ పద్యమే శ్రీనాథుని దనెడు పక్షమున నాతనికి శబ్దజ్ఞానము లేదు, వ్యర్థపదప్రయోగశంకిలేదు, అశ్లీల భయము లేదు. రేఫశకటరేఫజ్ఞానము లేదు అని చెప్పవలసి వచ్చును ఈ పద్యమునఁ బ్రాసస్థానములైన గొఱియలలో నిది శకటరేఫము; అరయఁగలో నిది రేఫము ఈ పుస్తకములోని పార్వతీనాథుఁ డయి గరకకంఠుఁ డనఁబరఁగెడు పరమేశ్వరునిఁ గూర్చిన పద్య మిది.

గీ. కాలకంధర! యీశాన! గరళకంఠ!
విసము మెసవినఁ గలుగునక్కసటు వోవఁ
గొమ్మ మేడూరికమ్మచకోరనేత్ర
పననతొనవంటితలము చుంబనము గొనుము.

ఇందు గరళము తిన్నచేఁదు పోఘనట్లుగా మేడూరికమ్మపడుచుయొక్క తియ్యనిగోప్యాంగమును నాకు మని భక్తాగ్రగణ్యుండు శివునికి హితబోధ చేయుచున్నాఁడు. మాంసము తినువాఁ డయినను, ఎమ్ముకలను మెడను గట్టుకొని తిరుగఁడు కదా! శ్రీనాథుఁడు జారుఁడే యైనను తన యిష్టదైవత ములనుగూర్చి యిటువంటి దూష్యములయిన బూతులఁ బ్రయోగింప సాహసించునా! ఈ పుస్తకమునిండను 'గొంతుకూర్చొని' 'భాగోతుల బుచ్చిగానికి' 'కుల్లాయెట్టితి' అని వ్యాకరణదుష్టములైన గ్రామ్యపద ప్రయోగములు కానఁబడుచున్నవి. కూరుచుండి, భాగవతులు, పెట్టితి, అనుటకు మాఱుగా సకలలక్షణవేత్తయైన శ్రీనాథుఁడు కూర్చొని, భాగోతులు, ఎట్టితి, అని యపలక్షణప్రయోగములు చేయునా? ఇందలి కడపటిదైన 'యెట్టితి' యనుచోట 'పెట్టితి' యని పెట్టి, 'కుళ్ళాయ' కు 'కుళ్ళా' యన్న రూపాంతర మున్నందున సాధు ప్రయోగముగాఁ జేయవచ్చును.

లయగ్రాహి. బంగరపుచెక్కలఁ జెలంగు చవుకట్టులమె
ఱుంగు బలుచుక్కలపయిం గినిసి జంగల్,
చంగునఁ గొనన్ సరిగ రంగు గలకుట్టుపస
కంగులఁ గడల్కొసన యంగిపయి దోర
త్నాంగదము కుంకుమతరంగముల గుప్ప జిగి
పొంగుబురుసాపని బెడంగు గల కుళ్ళా,
నింగికిఁ దళత్తళ లొసంగ నతఁ డంత నృప
పుంగవుహజారమునకుంగదలి వచ్చెన్. అ. ౨

అని రాజవాహనవిజయప్రయోగము.

శ్రీనాథుని వీథినాటక మని ప్రకటింపఁబడినదానికి వీథీరూపకలక్షణమే ఁట్టదు. వీథిలక్షణము ధనంజయవిరచితమైన దశరూపకము నం దిట్లు చెప్పఁబడినది.

శ్లో. వీథీ తు కైశికీ వృత్త్యా సంధ్యంగాంకై స్తు భాణవత్.
రస స్సూచ్య స్తు శృంగారః స్పృశే దపి రసాంతరమ్. ౬౨
యుక్తా ప్రస్తావనాఖ్యాతై రంగై రుద్ఘాత్యకాదిభిః,
ఏవం వీథీ విధాతవ్యా ద్వ్యేకపాత్రప్రయోజితా. ౬౩

దీనివలన వీథి కైశికీవృత్తియందు రచియింపఁబడి, భాణమునందువలె సంధ్యంగాంకములను గల దయి, అధికముగా శృంగారరసమును కొంచెముగా నితరరసములను గలిగి, ఉద్ఘాత్యకాద్యంగములతో ప్రస్తావనను గలిగి, పాత్రముల నొకటి రెంటిని గల దయి యుండవలెనని యేర్పడుచున్నది. విశ్వనాథవికృతమైన సాహిత్యదర్పణమునందు వీథిలక్షణ మీ క్రింది రీతిని వివరింపఁబడి యున్నది.

శ్లో. వీథ్యా మేకో భవే దంకః కశ్చి దేకోఽత్ర కల్ప్యతే,
ఆకాశభాషితై రుక్తై శ్చిత్రాం ప్రత్యుక్తి మాశ్రితః
సూచయే ద్భూరిశృంగారం కించి దన్యాన్ రసా నపి,
ముఖనిర్వహణే సంధౌ అర్థప్రకృత యోఖిలాః.
అస్యా స్త్రయోదశాంగాని నిర్దిశంతి మనీషిణః,
ఉద్ఘాత్యకావలగితే ప్రపంచ స్త్రిగతం ఛలమ్.
వాక్కే ళ్యధిబలే గండ మవస్యందిత నాళికే.
అసత్ప్రలాప వ్యాహార మృదవాని చ తాని తు.

ఏకాంకసంయుత మయి, ఆకాశభాషితములచేత చిత్రప్రత్యుక్తులాడుపాత్ర మును గల దయి; విస్తారముగా శృంగారమును కొంచెముగా నన్యరసము లను ముఖనిర్వహణసంధులను గల దయి. ఉద్ఘాత్యకము, అవలగితము, ప్రపంచము, త్రిగతము ఛలము వాక్కేళి, అధిబలము, గండము, అవస్యందితము, నాళికము, అసత్ప్రలావము, వ్యాహారము, మృదవము

అనుక్రమమోదశాంగసహిత మయి వీథి యుండవలె నని సాహిత్యదర్పణము విధించుచున్నది.

"వీధ్యాం కల్పిత మితివృత్తం ధీరోద్ధతో నాయకః"

అని ప్రతాపరుద్రీయము వీధియందితివృత్తము కల్పితముగాను ధీరోద్ధతుఁడు నాయకుఁడు గాను ఉండవలెనని విధించుచున్నది నాయిక పరకీయగా నుండవలెననుట లోనుగాగల యితర లక్షణముల నితరలక్షణగ్రంధములు బోధించుచున్నవి ఈ పేర్కొనఁబడిన లక్షణములేవియు నీ యల్పకావ్యము నందు లేవు. ఇందు నాయకుఁడు లేఁడు; నాయిక లేదు. ప్రస్తావన లేదు, పాత్రములు లేవు, సంధులు లేవు, ఇతివృత్తము లేదు; వీథి కుండవలసిన యంగము లేవియు లేవు. ఈ పుస్తకము వలన శ్రీనాథమహాకవి దశరూపక జ్ఞానములేని యపండితుఁడని యాతని కపయశము కలుగుచున్నది ఇందులో నున్న శృంగారమంతయు నశ్లీలమయి జారత్వవిషయమైన బూతుప్రసంగము, శృంగారనాయకుఁ డిందు శ్రీనాథమహాకవియే.

గీ. చెమటచేఁ దిరునామంబు చెమ్మగిల్ల
హాళిగాఁ జేత విడియంబుఁ గీలుకొలిపి
రంగపురిరాజవీధిఁ గానంగ నయ్యె
నాదుమదిఁ గోర్కె లూర వైష్ణవవధూటి.

ఈ యసభ్యగ్రంధముయొక్క కర్తృత్వము నూరక యారోపించి మనవారు కొందఱు శ్రీనాథుని ముంపదలఁచుకొన్న దుర్యశఃపంకమునుండి యతఁడిది శ్రీనాథకవికృతము కాదని సిద్ధాంత మయినప్పుడే లేచి బైలఁబడి గట్టెక్కి కృతార్థుఁడు కాఁగలుగును *

మాకు దొరకిన శ్రీనాథవిరచితములయిన గ్రంధములనుండి కొన్ని పద్యముల నుదాహరించి యీ కవిచరిత్రము నింతటితో ముగించుచున్నాము.

* [శ్రీనాథ రచితమైన 'వీథినాటకము' కానరాదు కర్తృత్వము కల్పితము కావచ్చును. కాని యిందలి పద్యములు చాల వఱకును శ్రీనాథునివి చేరియుండ వచ్చునని కొందఱి యభిప్రాయము ]

౧. శృంగారనైషధము—

చ. అటు తగునే సురేశ్వరునియంతటివాఁ డఖిలాప్సరోఽంగనా
విటుఁ డొక మర్త్యభామినికి వేడుకచేయుచు నున్నవాఁడు, వి
స్ఫుటబహురత్నభూషణవిభూషితు లయ్యెడు రాచవారికిన్
గటకట! యారకూటకటకంబు రుచించునొ కాక యొక్కెడన్.

ఉ. నీ చరితంబు చూడ నతినిష్ఠుర మయ్యెడు లోకపాలదు
ర్వాచికసూచికాంకురపరంపర దూర్చెదు మాటిమాటికిన్
నా చెవులందు; నీకుఁ దగునా యిటు చేయఁగఁ దప్పు దన్న బా
ధాచరణంబు నైజమెకదా తలపోయఁ గృతాంతదూతకున్.

చ. అడిగితి నొక్కనాఁడు కమలాసనుతేరికి వారువంబనై
నడచుచు నుర్విలో నిషధనాథున కెవ్వతెయొక్కొ భార్య య
య్యెడు నని చక్రఘోషమున నించుక యించుక కాని యంత యే
ర్పడ విన నైతి నీ వనుచుఁ బల్కిన చందము తోఁచె మానినీ

ఉ. నైషధుఁ డంతరంగమున నవ్వుచు నుండు విరోధు లాడు దు
ర్భాషణముల్ వినిన్ వినని భంగిన యట్టి విద్విషన్మృషా
దోషగుణాధిరోపణ మదోషతఁ దెల్పుచు నుండుఁ గానఁ ద
ద్దూషణ మెప్డు విన్నఁ బరితోషము నొందు మనీషి యాత్మలోన్.

శా. లాలామూత్రపురీషఘర్మజలకీలాలాత్మిక ల్కాంతలం
చేలా రోఁతలు పుట్ట నాడుదురు యోగీంద్రుల్? వృథాలాపముల్
లాలామూత్రపురీషఘర్మజలకీలాలాత్మలో? తా రహో
ప్రాలేయాంబుపటీరపంకఘనసారక్షోదదివ్యాంగులో?

౨. భీమఖండము—

ఉ. జాదరజాదురంబు మృదుచర్చితగీతులు వారుణీరసా
స్వాదమదాతిరేకములఁ జంద్రిక గాయఁగ దక్షవాటికా
వేదులమీఁదటం గనకవీణలు మీటుచు బాడి రచ్చరల్
మోద మెలర్పఁగా భువనమోహనవిగ్రహు భీమనాథునిన్.

శా. రక్షోనాయకులార! నిర్జరవరవ్రాతంబుచేతన్ సుధా
భిక్షాపాత్రము పోయె నంచు మదిలో బెగ్గిల్లఁగా నేటికిన్?
రక్షార్థంబు భజింప రాదె యభవుం ద్రైలోక్య కుక్షింభరున్
దాక్షారామపురాధినాథుని సుధాధామార్ధచూడామణిన్?

గీ. పువ్వు ముడిచిన పురవీథిభూమియందుఁ
గట్టై మోవంగ వలసిన కారణమున
వీరభద్రునిచే దైన్యవృత్తి నొందె
దక్షుఁ డట్టి మహాధ్వరస్థానమునను.

మ. జగతీమౌళి వతంసభూషణము విశ్వఖ్యాతముం గాశికా
నగరంబుం బెడఁబాసి నీకును జగన్మాన్యైకచారిత్ర యీ
చిగురుంబోడికి నాకునుం గటకటా! చేడ్పాటు వాటిల్లెనే
ముగురిం గూర్చిన ముండదైవమునకు న్మోమాట లేదే సుమీ!

శా. కాశీస్థాన నివాసులన్ యతుల భిక్షావృత్తులం గాంచి పా
రాశర్యం డెటఁ బోయె నంచు నడుగన్ బ్రహ్మవిహీనాత్మకుం
డా శౌర్యం డెటఁ బోయెనో యెఱుఁగమయ్యా మీరు పోపొండు వి
శ్వేశద్రోహి నెఱుంగ నేమిపని? వాఁ డెచ్చోటికిం బోయెనో?

౩. కా శీ ఖం డ ము—

చ. కొసరి వసంతకాలమునఁ గోయిల క్రోల్చినభంగి నేడ్చె న
బ్జసరుహనేత్ర కొండచఱిఁ బెద్దయెలుంగున వెక్కివెక్కి వె
క్కసమగు మన్యువేగమునఁ గాటుకకన్నులనీరు సోనలై
యుసిరికకాయలంతలు పయోధరముల్ దిగఁబాఱుచుండఁగన్.

ఉ. ఎట్టు పురాణము ల్పదియు నెమ్మిదిఁ జెప్పితి వెట్టు వేదముల్
గట్టిగ వేర్పఱించి నుడికారమునొం పెసలార భారతం
బెట్టు రచించి తీవు? ఋషి వె ట్టయి? తొక్కదినంబుమాత్రలోఁ
బొట్టకు లేక తిప్పైదవు పుణ్యగుణంబులరాశిఁ గాశికన్.

చ. బిసరుహపత్రలోచన! కృపీటములందు మునింగి యాడవే
మొసళులు మీలు కర్కటకముల్ గమఠంబులు? వాని కబ్బునే
యసదృశమైన తీర్థఫల? మట్టి విధంబు సుమీ తలంప మా
నసమగు తీర్థ మాడవిజనంబులకుం బహుబాహ్యతీర్థముల్.

చ. విడువక నీవు పట్టణమువీధుల వీధుల వెఱ్ఱివాఁడవై
చెడుగులఁ గూడి ధౌర్త్యములు చేయ మహీరమణుం డెఱింగెనే
న్విడుచును; సోమయాజి మనువృత్తులు చేకొను నెల్ల వెంటలన్
జెడుదుము గాదె నీకతనఁ జీరయుఁ గూడును లేక పుత్త్రికా!

శా. ఆకంఠంబుగ నీవు మాధుకరభిక్షాన్నంబు భక్షింపఁగా
లేకున్నం గడు నంగలార్చెదవు; మేలే? లెస్స! శాంతుండవే?
నీకంటె న్మతిహీనులే కిటకటా! నీవారముష్టింపచుల్
శాకాహారులు కందభోజులు శిలోంఛప్రక్రముల్ తాపసుల్?

౪. శివరాత్రిమాహాత్మ్యము—

శా. ఏలా వచ్చెదు? డాయ నెవ్వఁడవు? నీ వెచ్చోటికిం బోయె దీ
వేలా మ్రొక్కవు నాకు? గర్వ మిఁక నెంతో నోర్వకుందుం జుమీ!
త్రైలోక్యాధిపతిన్ సురాసురశిరోరత్నప్రభామండలీ
వ్యాలీఢాంఘ్రిశిరోరుహుండ విడు గర్వారంభసంరంభమున్. ఆ ౧

మ. జవ మేపారి మురారిపద్మజభుజాచక్రీభవచ్చార్ఙ్గగాం
డివకోదండవినిర్గతప్రబలసందీప్తాస్త్రసంఘాతముల్
భువనక్రోడము నిండి భానుకిరణంబుల్ దూఱనీకుండఁ గన్
బవలుం బర్వె మహాంధకారములు పైపై సూచినిర్భేద్యముల్.

శా. ఆ వింధ్యాచల మేలు మేటి శబరాధ్యక్షుండు హేమాంగదుం
డా వార్ధిద్వితయద్వయావధిగ, జక్రాధీశ్వరు ల్గొల్వ నా
నా వేదండఘటాకపోలతలమూర్ఛద్దానధారాజల
ప్లావప్రక్రమసంవిశుద్ధబహుళప్రస్ఫూర్తిమత్కీర్తియై. ఆ ౨

ఉ. సంపదపేరి కట్టిఁడిపిశాచము సోఁకిన మానవుండు పూ
జింపఁ డభీష్టదేవత భజింపఁడు సజ్జను లైనవారి మ
న్నింపఁడు మిత్ర బంధుల గణింపఁడు ధర్మరహస్యము ల్విచా
రింపఁడు (మేలు మాన్యుల) భజింపఁ డహంకరణంబు పెంపునన్.

చ. అరుణగభస్తిబింబ ముదయాద్రిపయిం గనుపట్టె గిన్నెలోఁ
బెరుగును వంటకంబు వడపిందియలుం గుడువంగఁ బెట్టు ని
ర్భరకరుణాధురీణ యగు ప్రాణముప్రాణము తల్లి యున్నదే?
హరహర! యెవ్వ రింకఁ గడుపారఁగఁ బెట్టెద రీప్సితాన్నముల్?

మ. వసుధానిర్జరుఁడున్ మహాసరసిలో వార్వీచులం దేలెఁ ద్రా
వె సుధాసన్నిభమైన వారితటపృథ్వీజావళిచ్ఛాయలన్
వసియించెన్ లహరీసమీరమున సద్యశ్శాంతిఁ బోకారిచెన్
బిసకాండంబుల మేన గుంజె వలువ ల్నిర్మోకసంకాశముల్. ఆ ౩

చ. కలఁగఁగఁబాఱె నాతనియఘంబులు పంచహృషీకసంభవం
బులు బహుకాలసంకలితముల్ దవవహ్ని చిటచ్చిటధ్వనిం
గలఁగఁగఁబాఱు పక్షులప్రకారమునన్ దొలుఁజాముపూజకై
కలపటహమ్ము ధ మ్మనుచు గర్భనిగేహమునందు మ్రోసినన్.

చ. కమలవనాళి కాకణిశకంటకకోటులచేతఁ జూడ్కి కిం
పలవడిచెన్ ధరిత్రి తుహినాగమవేళఁ దటాకసారణిన్
సలిలము పాఱి పండిన యజాంగలసీమము లెన్ని యన్నిటన్
దలముగ సీతుపేర్మి గరుదాల్చిన భావము ప్రస్ఫుటంబుగన్. ఆ ४

౨. హ ర వి లా స ము——

చ. వికవిక నవ్వి యక్కపటవిప్రకుమారుఁడు మేలులెస్స! వా
నికినయి రాగబంధమును నిల్పె మదిం దరళాయతాక్షి మీ
సకియ వివాహవేళఁ బురశాసనుపాణి పరిగ్రహించుచో
ఘుకమున బుస్సుమంచు నహిగ్రమెగ్గిన నెట్లు భయంబునొందునో,

ఉ. మంచిగ మేనయత్తలు సమాదరణం బడరంగఁబెట్టి పు
త్తెంచిన మంచికజ్జములు తేనియ నేతను దోఁచి తోఁచి భ
క్షించుచుఁ దల్లిఁ దండ్రిఁ దన చిన్నికరాంగుళి వంచివంచి యూ
రించుచు నాడె మిన్న గమిరేడుకుమారకుఁడింటిముంగటన్.

ఉ. పెగ్గలమైన మోపు గడు వీఁకునఁ నెత్తగఁబోయి ముందటన్
మ్రొగ్గతిలంబడెం జెమట మోమునఁ గ్రమ్మఁగఁదా ద్విజోత్తముం
డగ్గణముఖ్యుతోడ నొకఁడై సరియాచకులన్ భరింపఁ దా
దిగ్గన వచ్చె శంకరుఁడు దెప్పరమైన వడిం జెమర్చుచున్. ఆ ౧

శా. అయ్యారాధ్యవంశసంభవుని నేకామ్రాదినాధార్చకా
శయ్యామందిరనిర్మలాత్మకుని భిక్షావృత్తిజంగం బొకం
డొయ్యం జేరఁగ వచ్చి మా శివుని నేఁ డోలార్చెదంగాని తే
వయ్యా! యిక్షురసంబు తూమెఁ డనుచుం బ్రార్థించి నేమించినన్

చ. ముసురుదినంబులందు మన మోసలపంచయరుంగుమీఁదటన్
భసితవిభూషణుల్ పరమపావనమూర్తులు శైవసంహితా
వ్యసనపరాయణుల్ గిరిశభక్తు లనేకులు నిండి యుంద్రు నేఁ
డసితసరోరుహాక్షి! యొకఁడైనను లేఁ డిది యేమిచోద్యహో?

ఉ. మాటలు వేయు నేమిటి? మంగళలక్షణలక్ష్మి యైన యీ
జోటికి భర్త గాఁగలఁడు సోమకిరీటుఁడు సర్వదేవతా
కోటికిరీటకోటిపరికుంచితభవ్యమణిద్యుతిచ్ఛటా
పాటలపాదపీఠుఁ డగు పట్టి కృతార్థుఁడ వైతి భూధరా! ఆ ౩

ఉ. కమ్మని యూర్పుగాడుపులగందము గ్రోలఁగ వచ్చి యోష్ఠబిం
బమ్ముసమీపదేశమునఁ బాయక యాడెడి తేఁటిఁ దోలెఁ బ
ద్మమ్మున మాటిమాటికి సముంచితసంభ్రమలోలదృష్టియై
యమ్మదిరాక్షి చారుదరహాసవికస్వరగండపాళియై ఆ ౩

చ. అరుదగు నీ తపంబునకు నమ్ముడుపోయితి నేలుకొమ్మ నీ
వరువుఁడ నంచు శూలి ప్రియవాక్యములం దగ గౌరవించినన్
ధరణిధరేంద్రనందన యుదగ్రతపోమహనీయవేదనా
భర మఖిలంబు వీడ్కొలిపి భావమునం బరితోష మొందుచున్.

మ. అని దేవర్షి బహుప్రకారమధురవ్యాహారసందర్భముం
బనిగొంచుండఁగఁ దండ్రిపార్శ్వమున సద్భావంబు లజ్జాభరం
బును మౌగ్ధ్యంబును దోఁప నమ్రవదనాంభోజాతయై గౌరి య
ల్లన లెక్కించుచునుండెఁ బాణి నవలీలాపద్మపత్రంబులన్. ఆ ౪

ఉ. ఎంచి నుతింప శక్యమె యహీశ్వరునంతటివానికైన ర
త్నాంచితరోచిరుద్గమనిరస్తరవీందుమరీచిజాలమున్
గాంచనకందరాయవనికాయుతవారిధరాంతరాళని
ర్వంచిత దేవతామిథునవాంచితమూలము శీతశైలమున్. ఆ ౫

శా. ఆయా వేళల మౌనిభార్యలు గృహవ్యాపారలీలాభవ
త్కాయక్లేశము లుజ్జగింతురు లసత్కర్పూరరంభాతరు
చ్ఛాయన్ శీతలచంద్రకాంతమణిపాషాణప్రదేశంబులన్
వాయుప్రేరణఁ బచ్చకప్పురము పైవర్షింప నక్కోనలోన్. ఆ ౫

మ. వికటభ్రూకుటిఫాలభాగుఁడును ఘనస్వేదాంబుపూర్ణాఖిలాం
గకుఁడుం బాటలగండమండలుఁడునై కల్పాంత సంహారరు
ద్రకఠోరాకృత దుర్నిరీక్షుఁ డగుచుం దట్టించి దుర్వాసుఁడు
గ్రకటాక్షంబున నింద్రుఁ జూచి పలికెన్ గాఢాగ్రహవ్యగ్రతన్. ఆ ౬

చ. జలధరమంతమై కరటిచందము గైకొని సూకరాకృతిన్
నిలిచి పికంబుతో దొరసి నేరెడుపండును బోలుపుట్టువై
కలశపయోధిమంథనముఖంబునఁ బుట్టిన యమ్మహాహలా
హలము క్రమంబునన్ శివుని హస్తసరోరుహ మెక్కె వింతమై.

ఉ. చక్కనివాఁడ వెంతయును జల్లనివాఁడవు భాగ్యరేఖఁ బే
రెక్కినవాఁడ వీ విపిన మెక్కడ ? సుకుమారతాగుణం
బెక్కడ ? ఘోరవీరతప మీ యెలప్రాయమునందుఁ జేయు నే
యక్కట ! యెవ్వఁడైన సుకృతాత్ముఁడ వీ వొకరుండు తక్కఁగన్.

చ. అతులితధైర్యశౌర్యమహిమాద్భుతసాహసులై మహోగ్రతా
ప్రతతనిశాతనిష్కృపకృపాణ విదారితదేహులై రణ
క్షితిఁ బడి వత్తురై దుపది చేయక నాకయి యిట్టి నన్ను నీ
పితరులఁబోలెఁ గైకొనక యెంచెద విప్పుడు పాండునందనా. ఆ ౩

## ౬౦. పల్నాటివీరచరిత్రము

ద్వి. పేరె బాలుఁడు గాని బిరుదుమగండఁ
బగవారిఁ గొట్టని బాలత్వ మేల?
తలిదండ్రులను బ్రోవ దనయుఁడె కర్త
మానాభిమానముల్ మగఁటిమి మించఁ
బ్రబలింపఁగలవారు బాలురె సుమ్మ!
బాలురె పెద్దలు బల్లిదు లావారె
బాలురకే బుద్ధి పరికించి చూడఁ
బెద్దలు మతి చెడి పిఱికిపాఱుదురు
పాంచభౌతికదేహపటిమ క్షీణించు
ధైర్యంబు తగ్గు నుత్సాహంబు లుడుగు
వయసు మీఱినవేళ వచ్చునా బలిమి?
కీర్తికైనను నపకీర్తికినైన
బాలురపై నుండు భార మంతయును. ౧

* * * *

ద్వి. కుటిలాత్మురాల! నీ గుణములు తెలిసె
మటుమాయచేఁ జిక్కి మానము ధనము
నీపాలు చేసితి నేఁ గాన నైతిఁ
గామాంధకారంబు కష్టపువిద్య
నీతి మాలినచర్య నేటికిఁ దెలిసె
వింటిలో భోజనం బిచ్చుకు రాక
పరులయెంగిలి కాసపడితిని నేను.

* * * *

వారకాంతలరీతి వర్ణింపరాదు
బిడ్డ కొసంగక ప్రియురాలి కీక
చీమలు గూర్చినచెలువునఁ గూర్చి

ధనవంతు లగువారి ధనమెల్ల దోఁచి
ముంజికాంధ్రను జేసి మురిప మడంప
వ్యర్థులై విటవృత్తి వసుమతిమీఁదఁ
బోయిరి బ్రతికెడుపొందిక లేక.

*　　*　　*　　*　　*

**ద్విపద.** నినుఁబాసి భువిమీఁదఁ నిల్వ నోపుదుమె
వనజాక్షి! నీవెంట వత్తు మటంచు
నెరి బ్రాహ్మపుత్రుఁడు నీవిధి యనుచుఁ
గరియాన లిరువంకఁ గదిసి చల్లఁగను
భామ లందఱు గూడి పలుదెఱంగులను
గోమలిచరణంబు కొంత గై సేయఁ
జిలికికప్పిన మూర్ఛ తెలిసి శీఘ్రముగఁ
దలవంచి తనకాలు తప్పక చూచి
యిది యేరి బంగరం బింతచక్కనిది
యిది యెవ్వరిదె యమ్మ యీవులవెండి &c

*　　*　　*　　*　　*

ఘనుఁడైన శ్రీనాథకవిరాజరాజు
చెన్నునికృపచేతఁ జిత్త ముప్పొంగి
బాలుని విక్రమప్రౌఢి యంతయును
విరచించె జనులకు విశదంబుగాను.

శ్రీనాథుఁడు పల్నాటివీరచరిత్రమును రచియించిన తరువాతనో రచియింపక ముందో యొకసారి పల్నాటిసీమకుఁ బోయినట్టు తెలియవచ్చుచున్నది. అప్పు డాతఁడు స్వానుభవమునుబట్టి చెప్పిన పద్యములఁ గొన్నిటి నుదాహరించుచున్నాను.

**క.** రసికుఁడు పోవఁడు పల్నా
డెసఁగంగా రంభ యైన నేకులు వడుకున్
వసుదేవుఁ డైన దున్నును
గుసుమాస్త్రుిండైన జొన్నకూడే కుడుచున్.

ఉ. అంగడి యూర లేదు వరియన్నము లేదు. శుచిత్వ మేమి లే
దంగన లింపుగాదు ప్రియమైన వనంబులు లేవు నీటికై
భంగపడంగ * దొడ్డప్పుడు కృపాపరు లెవ్వరు లేరు దాత లె
న్నంగను సున్న; గానఁ బలనాటికి మాటికిఁ బోవ నేటికిన్ ?

ఉ. దోసెఁడుకొంపలోఁ బసులత్రొక్కిడి మంచము దూడరేణమున్
పాసిన వంటకంబు పసిబాలురశౌచము విస్తరాకులన్
మాసిన గుడ్డలున్ దలకుమాసిన ముండలు వంటకుండలున్
రాసెఁడు కట్టెలుం దలపరాదుపురోహితునింటికృత్యముల్.

గీ. చిన్న చిన్న రాళ్ళు చిల్లరదేవళ్లు
నాగులేటినీళ్లు నాఁపరాళ్లు
సజ్జజొన్నగూళ్లు సర్పంబులును దేళ్లు
పల్లెనాటిసీమపల్లెటూళ్లు.

క. జొన్నకలి జొన్నయంబలి
జొన్నన్నము జొన్నపిసరు జొన్నలె తప్పన్
సన్నన్నము సున్నసుమీ
పన్నుగఁ బల్నాటిసీమప్రజలకు నెల్లన్.

క. గరళము మ్రింగితి నంచున్
బురహర ! గర్వింపఁబోకు పోపోపో నీ
బిరు దింకఁ గాన వచ్చెడు
మెరసెడి రేనాటిజొన్న మెతుకులు తినుమీ !

ఈ కవిచేతనే రచియింపఁబడిన నందనందనచరిత్రములోని దన్న పద్యము నొక లక్షణగ్రంథమునందుఁ జదువుటయే కాని నాకు గ్రంథము లభించినది కాదు. పేరునుబట్టి చూడగా శ్రీనాథుఁ డట్టి గ్రంథమును రచియించి యుండునని తోఁచెను. భీమఖండాదిశైవపురాణములలోనే విష్ణుకథ వచ్చి

* [బాల్పడు — పాఠాంతరము.]

నప్పుడు విడిచిపెట్టిన మహానుభావుఁడు కేవలకృష్ణకథ యైన నందనందన చరిత్రమును రచించి యుండునా? * శ్రీనాథుఁడు తన కాశ్రయులైన వేమారెడ్డియు, వీరభద్రారెడ్డియు మరణము నొందినతరువాతఁగూడఁ గొంత కాలము బ్రతికి యుండెను. ఆ కాలమునందతఁడు కృష్ణాతీరమునందు బొడ్డుపల్లె యను నొక గ్రామము గుత్తచేసి నదీప్రవాహము వలన సస్యము పోఁగా గుత్తధనము రాజునకుఁ గట్టలేక వారిచేత బహువిధములయిన బాధలను పొంది తుదకు మిక్కిలి బీదతన మనుభవించెను. ఈ సంగతులను మెకన్జీదొరవారు సేకరించిన స్థానికచరిత్రములలో నుదాహరింపఁబడిన శ్రీనాథకృతములైన యీ క్రింది పద్యములవలన నెఱుఁగవచ్చును.

సీ. కవిరాజుకంఠంబుఁ గౌఁగిలించెనుగదా
పురవీధి నెదురెండ పొగడదండ
సార్వభౌముని భుజాస్తంభ మెక్కెనుగదా
నగరివాకిట నుండు నల్లగుండు
ఆంధ్రనైషధకర్తయంఘ్రియుగ్మంబునఁ
దగిలియుండెనుగదా నిగళయుగము
వీరభద్రారెడ్డివిద్వాంసుముంజేత
వియ్య మందెనుగదా వెదురుగొడియ
కృష్ణవేణమ్మ కొనిపోయె నింత ఫలము
బిలబిలాక్షులు తినిపోయెఁ దిలలుఁ బెసలు
బొడ్డుపల్లెను గొడ్డేటి మోసపోతి
నెట్లు చెల్లింతు టంకంబు లేడునూర్లు.

---

* [శ్రీనాథుఁడు నందనందనచరిత్రమును రచియించి యుండలేదని శ్రీ ప్రభాకరశాస్త్రిగారును, ఆంధ్రకవితరంగిణికారులును కూడ వ్రాసియున్నారు.]

'పురవీథి నెదురెండ పొగడదండ' అను నెడల పొగడదండకు బదులుగా 'బొగడదండ' అని యుండవలయుననియు, ఇనుపబొగడలతోఁగూడిన దండయే శిక్షాసాధనమగును గాని 'పొగడదండ' శిక్షాసాధనము కాఁజాలదనియు నిర్ణయింపఁబడియున్నది. దీనిని సహృదయులందఱు నంగీకరించి యున్నారు.

[చూ. భారతి - డిసెంబరు 1936]

సీ. కాశికావిశ్వేశుఁ గలిసె వీరారెడ్డి
రత్నాంబరంబు లేరాయఁ డిచ్చుఁ
గైలాసగిరిఁ బండె మైలారువిభుఁ డేఁగి
దినవెచ్చ మేరాజు తీర్పఁగలఁడు?
రంభఁ గూడెఁ దెనుంగురాయరాహుత్తుండు
కస్తూరి కేరాజుఁ బ్రస్తుతింతు?
స్వర్గస్థుఁ డయ్యె విస్సనమంత్రి మఱి హేమ
పాత్రాన్న మెవ్వనిపంక్తిఁ గలదు?

భాస్కరుఁడు మున్నె దేవునిపాలి కరిగెఁ
గలియుగంబున నింక నుండఁ గష్ట మనుచు
దివిజకవివరుగుండియల్ దిగ్గు రనఁగ
నరుగుచున్నాఁడు శ్రీనాథుఁ డమరపురికి.

అవసానదశయం దిట్టి కష్టముల కెల్లను గారణము యౌవనదశయందుఁ గామవశముచేత స్వేచ్ఛగా విహరించి దేహమును ధనమును జెడఁగొట్టుకొన్న పాపఫలము తక్క వేఱొక్కటి గాఁ రాదు. నే నీవాక్యమును వ్రాసినందునకుఁ గినుక వహించి చిలుకూరి వీరభద్రరావుగారు తమ యాంధ్రుల చరిత్ర మూఁడవ భాగములో "కామోద్రేకము కలిగించు విధమున మిక్కిలి పచ్చిగా స్త్రీవర్ణనములఁ గావించి రసికజనమనోరంజనము గావించెడు కవులను, లోకములోని విటపురుషుల దుర్వర్తనముల హాస్యప్రబంధరూపముననుఁ బ్రహసనరూపముగను వెల్లడించెడు కవులను, కామపరవశు లనియు వ్యభిచారులైన మహాపాపులనియు .. చెప్పవలసి వచ్చునుగదా!" అని ద్వేషబుద్ధితో దురభిమానపూరితములైన యుక్తిరహితదూషణభాషణములను వ్రాసియున్నారు ఇట్టి వాక్యరత్నము లుపేక్షణీయములు రసికజనమనోరంజనము సర్వకళాశాలవారిచే ప్రథమశాస్త్రపరీక్ష (F. A.) కును, శాస్త్రోపాధ్యాయపరీక్ష M A ) కును పఠనీయగ్రంథముగా నిర్ణయింపబడె

ననియు, అందలి శృంగారము శ్రీనాథుని దాక్షారామాప్సరోభామాదులదానివలె జారస్త్రీపురుషసంబంధ మయినది గాక యనింద్యమైన భార్యాభర్తృసంబంధ మయినదనియు, ప్రహసనములలోని విటపురుషదుర్వర్తనప్రకటనము వీథి నాటకములోనిదానివలె దుర్నయపోషణమునకుఁ గాక దుర్నయశోషణము నకును నీతిభంజనమునకుఁగాక దుర్నీతిభంజనమునకును ఉద్దేశింపఁబడె ననియు, మా మిత్రు లెఱుఁగుదురుగాక! శ్రీనాథునిపై మోపఁబడిన దోషము స్త్రీవర్ణనములు చేసినందునకును, విటపురుషుల దుర్వర్తనముల వెల్లడించినందునకును గాదు; స్త్రీలోలుఁడయి వయఃకాలమున విచ్చలవిడిగాఁ దిరిగి కాయమును, ధననికాయమును జెడఁగొట్టుకొని కష్టదశలసి వృద్ధ దశను దెచ్చుకొన్నందునకు. శ్రీనాథుఁడు వేశ్యాప్రియుఁడని యాతనిని గూర్చి వ్రాసినవా రందఱును నైకకంఠ్యముతోఁ జెప్పుచున్నారు. వేశ్యలపొందు ధనైకలభ్యమని యెల్లవారును నెఱుఁగుదురు. శ్రీనాధుడు మహారాజులయొద్ద నాస్థానకవి యయి యపరిమితధనము నార్జించుటయే కాక, వివిధ దేశాధీశుల సభల కరిగి కనకాభిషేకాదులను బొందిన మహానుభావుఁడు. కనకాభిషేకము సామాన్య మయినది కాదు. జలమువలె శిరస్సుపైని కనకకలశములతో సువర్ణముద్రలతో స్నానము చేయించిన ధనమే బహుసహస్రరూప్యముల గలదయి యుండును. కనకాభిషేకము చేసిన మహారాజు కవిశిరోమణిశిరస్సు పయిని గుమ్మరింపఁబడిన సువర్ణసహస్రములను కవి కియ్యక తాను మరలఁ గైకొని యుండఁడు. రసికశిఖామణి యయినకవి కియ్యఁబడిన యటువంటి ధనరాశి వేశ్యల వలలలోఁ దగులుకొన్నప్పు డల్పకాలములో నదృశ్యమగుట వింతకాదు. వేశ్యల యింటిబంటులైన లక్షాధికారులు నిమిషములో భిక్షాధికారు లగుచుండుట మనము లోకములో నాలోకించు చుండలేదా? పండితుడు చేసినను, పామరుఁడు చేసినను దోషము దోషమే! పండితుఁడు చేసినది యొప్పిదమును, పామరుఁడు చేసినది తప్పిదమును గానేరదు. శ్రీనాధుని కవితాచమత్కారమును నాంధ్రసారస్వతమునకుఁ జేసిన మహోపకారమును మెచ్చి యానందించువారిలో నెవ్వరికి నేను దీసిపోవువాఁడను గాను అయినను సత్యము నపేక్షించియు పక్షపాతాభి

వృద్ధిని గాంక్షించియు, నిష్టములేకయే పెద్దలనుగూర్చిన యప్రియమైన సత్యమును బలుకవలసినవాఁడ నైతిని. విద్యావివేకసంపన్నులైనవారు నన్ను మన్నింతురుగాక ! *

---

* [శ్రీనాథమహాకవి తన యవసానదశలోఁ గష్టపడుటకు శ్రీ వీరేశలింగము పంతులుగారు చెప్పిన కారణము సరియైనది కాదనియు, ద్రవ్యమును నిలువచేయు తలంపాతనికి లేకుండుటయే కారణమనియుఁ బలువురి యభిప్రాయము, శ్రీ ప్రభాకర శాస్త్రిగారును, శ్రీ చాగంటి శేషయ్యగారును శ్రీ వీరేశలింగముపంతులుగారి యభిప్రాయము సరికాదని తెలిపియున్నారు.]

# బమ్మెర పోతరాజు

ఈ కవి శాలివాహనశకము ౧౩౦౦-వ సంవత్సరమునం దనఁగా హూణ శకము ౧౩౭౮ వ సంవత్సరమునందు జనన మొందినట్లు తెలుఁగు భాగవతమును ముద్రించినవారు పీఠికయందు వ్రాసియున్నారు. కాని యది సరియైన సంవత్సరమని తోఁచదు. పోతన మఱి యిరువది సంవత్సరముల తరువాత ననఁగా హూణశకము ౧౪౦౦ వ సంవత్సర ప్రాంతమున జనన మొంది యుండును. ఈతని నివాసస్థలము నైజాము రాజ్యములోని ఓరుగల్లు ఇదియే భాగవతమునం దేకశిలానగర మని చెప్పఁబడి యున్నది. ప్రథమమున భాగవతమును ముద్రింపించినవారు బమ్మెర పోతనార్యుని వాసస్థలము కడపమండలములోని యొంటిమెట్ట యనియు, అదియే భాగవతమునందుఁ బేర్కొనఁబడిన యేకశిలానగర మనియు, అతని చరిత్రమును దెలుపు పురాతనగ్రంథ మేదియో తమకు లభించినదనియు, పీఠికలో వ్రాసియుండుటచేత గతానుగతికు లయి జనులా కథనే మొన్నమొన్నటివఱకు నమ్ముచు వచ్చిరి. ఇటీవల విమర్శకులు కొందఱు సత్యమును శోధించి పోతనామాత్యుని వాసస్థాన మోరుగల్లు గాని యొంటిమెట్ట కా దని సహేతుకముగా లోకమునకు వెల్లడించుటచేత మహాజను లిప్పుడు కన్నులు తెఱచి తమ తొంటి ప్రమాదమును దెలిసికొని పూర్వాభిప్రాయమును మార్చుకొనుచున్నారు. అయినను స్థలాభిమానముచేతఁ గొంద ఱిప్పటికిని పోతన జనన భూమి కడపమండలమే యని వాదించువా రందందుఁ గనఁబడు చున్నారు. అందుచేత నట్టివారి భ్రాంతినివారణార్థముగా బమ్మెర పోతననివాస మోరుగల్లని స్థాపించుటకుఁ దగిన హేతువులను గొన్నిఁటి నిందుఁ జూపుచున్నాను. ఇంటిపేరునుబట్టి పోతనపితృపితామహాదుల వాసస్థానము బమ్మెర యను గ్రామమయినట్లు సులభముగా తెలిసికోవచ్చును. అతఁ డా గ్రామములోనే పుట్టినవాఁ డయినను, ఓరుగల్లు రాజనివాస మయిన మహాపట్టణ మయి యుండుటచేత భాగవతరచన కాలమున కక్కడఁ జేరి యుండును. ఈ బమ్మెర గ్రామ మోరుగంటిని రమారమి మూఁడామడల దూరములో నల్లగొండమండలమునం దున్నది. బమ్మెర యను పేరుగల యూ రేదియు

నొంటిమెట్టచేరువను గాని తుదకుఁ గడపమండలములో నెక్కడనైనను గాని లేదు. అందుచేత భాగవతమునందుఁ జెప్పఁబడిన యేకశిలానగరము నైజాము రాజ్యములోని యోరుగల్లే కాని కడపమండలములోని యొంటిమెట్ట కా దని యూహింపవచ్చును. భాగవతముద్రితపుస్తకములలో షష్ఠస్కంధ మేర్చూరి సింగనయు, నేకాదశ ద్వాదశస్కంధములు వెలిగందలనారయయుఁ దెలిఁగించిన ట్లున్నది. సింగనగృహనామ మయిన యేర్చూరు గోలకొండదేశములోని నల్లగొండమండలములోను, నారయగృహనామ మయిన వెలిగందల కరీంనగరమండలములోను, రెండును బమ్మెరకు సమీపమున నిప్పటి నైజామురాజ్యములోనే యున్నవి. భాగవతము నాంధ్రీకరించిన పోతనామాత్యునియొక్కయు, శిథిల మయిన షష్ఠస్కంధమును పూరించిన సింగనయొక్కయు, ఏకాదశ ద్వాదశస్కంధములను దెనిఁగించిన పోతన శిష్యుఁడైన నారయ యొక్కయు, ఊళ్ళు మూఁడును పూర్వ మోరుగల్లు రాజధానిగాఁ గర్ణాటరాజ్యములోనివే యగుట చేత పోతన చెప్పిన యేకశిలానగర మోరుగల్లే యని యించుమించుగా నిశ్చయింపవచ్చును. ఓరుగ ల్లిప్పటి కర్ణాటరాజ్యములోనిది. కర్ణాటభాషలో "ఓరు" అనగా "ఒక్క" "కల్లు" అనఁగా "రాయి" అని యర్థము ఒకరాయి యని యర్థ మిచ్చెడి ఓరుగల్లునకు సమానార్థక మయిన సంస్కృతపద మేకశిల, అందుచేత నేకశిలానగర మనఁగా నోరుగల్లుపుర మనుట స్పష్టము. ఒంటిమెట్ట యెప్పుడును నేకశిలానగరము కాఁజాలదు. మెట్ట యనుదానికి శైల మర్థ మగును గాని శిల యర్థము కాదు ఒంటిమెట్టయన్నచో నేకశైలగ్రామము కావచ్చును గాని యేకశిలానగరము గాదు. అది గాక యొంటిమెట్ట యొక చిన్న గ్రామమే గాని యెప్పుడును నోరుగంటివలె నగరమయినది కాదు. ఒంటిమెట్టకుఁ బూర్వకాలమునందుఁ గాని మఱి యేకాలమునందు గాని వ్యవహారమునందును గ్రంథములయందును గూడ నేకశిలానగర మన్న పేరు లేదు. ఇఁక నోరుగంటి కన్ననో భాగవతరచనమునకుఁ బూర్వమునందు సహితము "రాజన్నేకశిలానగరాధీశ" అని విద్యానాథుఁడు ప్రతాపరుద్రీయమునందు చెప్పినట్లుగా నేకశిలానగర వ్యవహార ముండినది దీనిని బట్టి యేక

శిలానగరము సుప్రసిద్ధమయిన యోరుగల్లే గాని యప్రసిద్ధమయిన యొంటి
మెట్ట గాదని నిస్సందేహముగా సిద్ధాంత మగుచున్నది శబ్దార్థము నటుండ
నిచ్చి యిఁక వాస్తవార్థమునకు వత్తము.

బమ్మెర పోతనార్యుఁడు తాను భాగవతంబు రచింపఁబూనుటకుఁ గారణము
నాగ్రంథములోనే యీ క్రింది వాక్యములలోఁ దెలిపియున్నాఁడు.

"మదీయపూర్వజన్మసహస్రసంచితతపఃఫలంబున శ్రీమన్నారాయణకథా
ప్రపంచవిరచనాకుతూహలుండనై యొక్క రాకానిశాకాలంబున సోమోప
రాగంబు రాక గనుంగొని సజ్జనానుమతంబున నభ్రంకష శుభ్రసముత్తుంగ
భంగ యగుగంగకుం జని క్రుంకులిడి వెడలి మహనీయమంజులపులినప్రదే
శంబున మహేశ్వరధ్యానంబు సేయుచుఁ గించిదున్మీలితలోచనుండనయి
యున్నయెడ.........మెఱుఁగు చెంగట నున్న మేఘంబుకైవడి ... . ..
విపులభద్రమూర్తియైన రాజముఖ్యుఁ డొక్కరుఁడు నా కన్నుఁగవకు నెదురఁ
గానఁబడియె. ఏను నారాజశేఖరుం దేఱిచూచి భాషింపయత్నంబు సేయునెడ
నతండు నే రామభద్రుండ మన్నామాంకితంబుగా శ్రీమహాభాగవతంబుఁ
దెలుఁగుచేయుము, నీకు భవబంధంబులు తెగునని యానతిచ్చి తిరోహితుం
డయిన సమున్మీలితనయనుండనయి వెఱఁగుపడి చిత్తంబున.... .
ఇట్లు భాసిల్లెడు శ్రీమహాభాగవతపురాణపారిజాతపాదపసమాశ్రయంబున
హరికరుణా విశేషంబునఁ గృతార్థత్వంబు సిద్ధించె నని బుద్ధి నెఱింగి లేచి
మరలి కొన్నిదినంబుల కేకశిలానగరంబునకుం జనుదెంచి యందు గురు
వృద్ధబుధబంధునానుజ్ఞాతుండనై" ఇతఁడు మొదటినుండియు శైవుఁ డయి
యుండియు నొక చంద్రగ్రహణసమయమునందు గంగాస్నానమునకుఁ
బోయినప్పు డక్కడ నాకస్మికముగా స్వప్నమున రామచంద్రుండు ప్రత్యక్ష
మయి తన్నామాంకితముగా శ్రీ మహాభాగవతమును దెలుఁగుచేయు మని
యానతిచ్చుటచేత భాగవతరచనము నకుఁ బూనెను. ఇతఁడు చంద్రగ్రహణ
స్నానమునకుఁ బోయినగంగ యీతని నివాసగ్రామమునకు సమీపముగా
నుండి యుండవలెను. సాధారణముగా భాగీరథిని గంగ యందురు; గౌతమిని

సహితము గంగయనుట గలదు. ఇట్లు రెండు గంగలకును భేదము తెలి యుట కయి యుత్తరమున నున్న గంగను (భాగీరథిని) ఉత్తరగంగ యనియు, దక్షిణమున నున్న గంగను (గోదావరి యనఁబడెడు గౌతమిని) దక్షిణగంగ యనియు వ్యవహరింతురు. పోతన్న స్నానార్థము పోయినది యిం దే గంగ యయి యుండును? కొన్ని దినముల ప్రయాణములో నుండక బహుదూరమున నా కాలమునఁ గొన్నిమాసముల ప్రయాణములో నుండినదగుటచేత నుత్తరగంగ యయి యుండదు. అది తప్పక కొన్ని దినముల ప్రయాణములో నున్న దక్షిణగంగ యనఁబడెడు గోదావరి యగు టకు సందేహము లేదు. ఒంటిమెట్టకు సమీపమున గోదావరీనది లేకుండు టయు గోదావరీనది యోరుగంటికి సమీపముననే యుండుటయు విచారింపఁగా, బమ్మెరపోతనామాత్యుని వాసస్థానమైన యేకశిలానగర మోరుగల్లే కాని యొంటిమెట్టకాదని నిశ్చయ మగుచున్నది. గోదావరికి గంగ యన్నపేరు లోకవ్యవహారమునందు మాత్రమేకాక పూర్వకాలమునుండియు గ్రంథముల యందుసహిత ముండిన ట్లీక్రింది నిదర్శనములవలన దెలిసికొనవచ్చును.

౧. "దక్షిణగంగ నాఁ దద్దయు నొప్పిన గోదావరియు జగదాదియైన" అని భారతాదిపర్వమున నన్నయ భట్టారకుఁ డర్జునుని తీర్థయాత్రాసంబంధమున గోదావరిని దక్షిణగంగ యని చెప్పెను.

౨. సీ. ఉండు నే వీట మార్కండేయముని నాథ
సజ్జలింగ మనంగ శాసనుండు
ప్రవహించు నే వీటిపశ్చిమప్రాకార
మొరసి గంగమ్మ సాగరముకొమ్మ
యావిర్భవించినాఁ డే వీటికోటలో
బలభేది మదనగోపాలమూర్తి
పాలించు నే వీటిప్రాగుదక్కోణంబు
నుమప్రోది శ్రీమల్లగూరిశక్తి

ప్రబలధారాసురత్రాణభద్రజాతి
కరిఘటాసైన్యదుస్సాధకనకలోహ
గోపురద్వాఃకవాటప్రదీపిత మతి
సాంద్రవిభవంబు రాజమహేంద్రపురము.

అని శ్రీనాథుఁడు పోతనామాత్యుని కాలమునందే కాశీఖండములో రాజమహేంద్రపురమును వర్ణించుచుఁ బయి పద్యములో గోదావరిని గంగ యని చెప్పియున్నాఁడు

౩. సీ. గంభీరపరిఖనాగస్త్రీల కశ్రాంత
కేళీవిహారదీర్ఘిక యనంగ
నుత్తాలసాలమన్యుల కుబ్బి దివిఁ బ్రాఁకఁ
జేసిన దీర్ఘ నిశ్రేణి యనఁగ
చతురచాతుర్వర్ణ్యసంఘ మర్థులపాలి
రాజితకల్పకారామ మనఁగఁ
బ్రాంతసుస్థిత మైన భవజూటవాహిని
ముక్తిభక్తిప్రదస్ఫూర్తి యనఁగ

నెప్పుడును నొప్పు రాజమహేంద్రవరము
ధరణిఁ గల్పించె నే రాజు తనదుపేర
నట్టి రాజమహేంద్రుని యనుఁగుమనుమఁ
డెసఁగుఁ జాళుక్యవిశ్వనరేశ్వరుండు.

అని నన్నయకుఁ దరువాతను శ్రీనాథునికిఁ బూర్వమునందును నుండిన విన్నకోట పెద్దన్న కావ్యాలంకారచూడామణిలో రాజమహేంద్రవరవర్ణనమున గోదావరిని "భవజూటవాహిని (గంగ)" యని చెప్పి యున్నాఁడు.

ఆ ప్రాంతములయందు గంగ యని వ్యవహరింపబడెడు గోదావరి యేకశిలానగరమునకు నాలుగయిదు దినముల ప్రయాణములో పదియామడల దూరమున నున్నది. ఆ పుణ్యనదీ ప్రవాహమునందు స్నానముచేయువా

రక్కడనుండి యా నదీతీరమున నున్న మంథెనకుఁ బోవుదురు.

పోతనామాత్యుఁడు తన కవిత్వారంభదశలో గోలుకొండసీమలోని రాచకొండ దుర్గాధీశ్వరుడైన (రేచర్ల) రావు సింగభూపాలుని ప్రేరణముచేత రచియించిన భోగినీదండకము కూడ నీ మహాకవి యోరుగల్లు ప్రాంతములవాఁ డని దృఢీకరించుచున్నది. ఇతఁ డీ దండకమును ౧౪౩౦-వ సంవత్సరప్రాంతమున నిరువదియైదేండ్లలోపలి వయస్సులోఁ జేసియున్నట్టు కనఁబడుచున్నది. పోతన ౧౪౦౫-వ సంవత్సరప్రాంతమున జనన మొంది ౧౪౭౦-౧౪౮౦ సంవత్సరములవఱకును జీవించి యుండును. ఈతని కాలమును నిర్ణయించుటకు వేంకటగిరిసంస్థానమునకు మూలపురుషుఁడైన భేతాళనాయనికిఁ బదవతరమువాఁడయి ౧౪౨౩ మొదలుకొని ౧౪౪౬-వ సంవత్సరమువఱకును కర్ణాటరాజ్యపరిపాలనము చేసిన ప్రౌఢదేవరాయల కాలములో నుండిన సింగభూపాలునికథ మాత్రమే కాక పోతనామాత్యుని మునిమనుమలగు కేసనమల్లనకవులచేత రచియింపఁబడిన "దాక్షాయణీవివాహము" కూడ కొంత తోడుపడుచున్నది. ఈ దాక్షాయణీవివాహము గురుజాల మల్లనసోమయాజి కంకితము చేయఁబడినది కవులు కృతిపతియైన మల్లనసోమయాజి తమ్ముఁ బిలిపించినట్లీ క్రింది పద్యమునఁ జెప్పుకొని యున్నారు.

సీ. శ్రీరామలింగాంఘ్రిసేవావరప్రౌఢిఁ
గవితాచమత్కృతు ల్గాంచువారి
నప్పల బ్రహ్మయమంత్రి కాత్మజుల ప్రౌఢస
రస్వతికిని గన్నప్రజ్ఞవారి
కౌండిన్యగోత్ర విఖ్యాతి బమ్మెరభవ్య
వంశాఢ్యులై సిరి వఱలువారి
నివటూరి ముక్తి నాగేశసద్గురుభక్తి
నాదిమశైవు లైనట్టివారి

కేసకవిమల్లకవినామకీర్తి పరుల
మమ్ముఁ బిలిపించి మన్నించి మదిఁ దలంచి

ఘనత నుచితాసనంబుల నునిచి వేడ్క
వినయనయవాక్యములచేత నెనయఁ బలికె

ఈ పద్యమునుబట్టి పోతనయు నాతనిసంతతివారును పరమశైవులని స్పష్ట మగుచున్నది. గోలకొండదేశములో వాడుకలో నున్న యీ క్రింది పాట యీ యంశమును మఱింత స్థిరపఱుచుచున్నది.

"పాలకుర్తినిలయా సోమలింగా పాదములకు శరణు॥"
వురవుగ బమ్మెరపోతరాజుకు మీరు కోరిన వరములు
కృపచేసినా రఁట "పాలకుర్తినిలయా" &c.

దాక్షాయణీపరిణయకృతికర్తలు తమ గ్రంథములోఁ గవిస్తుతి నిట్లు చేసి యున్నారు

చ నెరి గుఱిగల్లు నన్నయమనీషినిఁ దిక్కన శంభుదాసునిన్
బరువడి మత్పితామహుని బమ్మెరపోతన భాస్కరాహ్వయున్
వరకవిసార్వభౌముని నవారితభక్తి నుతింతు మెప్పుడున్
గురుకరుణాఢ్యు లంధ్రకవికుంజరులం దగ భూతి శోభిలన్.

పయి పద్యములోఁ గవులు బమ్మెర పోతనామాత్యునిఁ దమ పితామహుఁ డని చెప్పుకొన్నను నాశ్వాసాంతగద్యములనుబట్టి యతఁడు ప్రపితామహుఁ డయినట్టు తెలియవచ్చుచున్నది

"ఇది శ్రీమద్భవానీశంకరపర్వతాలగురుప్రసాదాసాదితసారస్వత బమ్మెరకుల పవిత్ర కౌండిన్యమునిగోత్ర పోతయామాత్యపౌత్ర మల్లయామాత్య పుత్ర సంస్కృతాంధ్ర భాషాచమత్కారకవితాధురీణతాబుధవిధేయ ప్రౌఢ సరస్వతికవినామధేయవరతనూభవ కేసనక విమల్లనకవి ప్రణీతంబైన దాక్షాయణీవివాహం బను మహాప్రబంధంబునందు"

పయి గద్యమునుబట్టి బమ్మెర పోతనామాత్యుని కుమారుఁడు మల్లయ; మల్లయామాత్యుని కుమారుఁడు ప్రౌఢసరస్వతి; ప్రౌఢసరస్వతికుమారులు కేసనమల్లనలు ఇంతమాత్రము తెలియుటచేత పోతనకాలమును నిర్ణయిం చుట కాధారము కానరాలేదు, దాక్షాయణీవివాహకృతిపతియైన మల్లనసోము

యాజిమనుమనిమనుమఁడైన పేరమంత్రికి శివరామాభ్యుదయనామకద్వ్యర్థి కావ్యకర్తయైన పోడూరి పెదరామకవి శాలివాహనశకము ౧౬౭౮ అనగా హూణశకము ౧౭౫౬ ధాతసంవత్సరాశ్వయుజశుద్ధ దశమీ సోమవారము నాఁటి కొక తాటాకుల ప్రతిని దాక్షాయణీవివాహమును వ్రాసియిచ్చి దాని యడుగున నీ క్రింది సీసపద్యములు వ్రాసెను.

సీ. ధాతాశ్వయుజకృష్ణదశమీందువారంబు
 వఱకు దాక్షాయణీపరిణయంబు
తత్కృతినాథుఁడై తనరిన గురుజాల
 చినమల్లసోమయాజికిఁ దనూజుఁ
డగు లింగఘనసుతుఁడు డైనట్టి యజ్ఞన
 త్సభునకుఁ దనయుఁడౌ పార్వతీశ్వ
రునకుఁ దిమ్మమకుఁ బుత్రు డయి షోడశమహా
 దానము ల్సప్తసంతానములును
జేసి వంశవర్ధనుఁ డయి సిరులవెలయు
పేరమంత్రీశ్వరునకుఁ బోడూరిపెద్ద
రాముఁ డెనుబది సంవత్సరములనాఁటి
ప్రతి విమర్శించి వ్రాసిచ్చెఁ బక్షమునకు.

పోడూరి పెదరామహస్తలిఖితమైన యీ పురాతనతాళపత్రపుస్తకమును సంపాదించి యీ నడుమను నాకు బాలాంత్రపు వేంకటరావుగా రిచ్చిరి దీనినిబట్టి చూడఁగా దాక్షాయణీవివాహకృతిపతియైన మల్లనసోమయాజి కుమారుఁడు లింగన్న; లింగన్నకుమారుఁడు యజ్ఞన్న; యజ్ఞన్నకుమారుఁడు పార్వతీశ్వరుఁడు, పార్వతీశ్వరునికుమారుఁడు పేరమంత్రి. ఈ పేరమంత్రి ౧౭౫౬-వ సంవత్సరమునం దుండెను. పోతనమునిమనుమనికాలములో నుండిన మల్లనసోమయాజికిని. పేరమంత్రికిని నడుమ నాలుగు పురుషాంతరములును, మల్లనసోమయాజికిని పోతనకును నడుమ మూఁడు పురుషాంతరములును మొత్తము ౧౭౫౬-వ సంవత్సరమునం దుండిన గురజాల పేరమంత్రికిని బమ్మెరపోతనామాత్యునికిని నడుమ నేడు పురుషాంతరములు

గడిచినందున నొక్కొక్కతరమునకు నలుబదేసి సంవత్సరముల చొప్పునఁ జూచినచో నేడు నలుబదు లిన్నూటయెను ఏదిసంవత్సరములు ౧౪౮౫ నుండి తీసివేయఁగా ౧౪౩౫-వ సంవత్సరప్రాంతమువఱకును బమ్మెర పోతనార్యుఁడు జీవించి యుండవలెను. ఇందులోనుండి పది పదునేను సంవత్సరములు త్రోసివేసినను పోతన ౧౪౫౦-వ సంవత్సరము వఱకైనను జీవించి యుండ వలెను అతఁ డఱు వదిసంవత్సరములు జీవించె ననుకొన్నచోఁ బోతనజన్మ దినము ౧౪౦౦ సంవత్సరప్రాంతమునందయి యుండును. ప్రౌఢసరస్వతి యను బిరుదందిన కేసనకవి (పోతనమనుమఁడు) యొక్క దౌహిత్రుఁడు అజ్జరపు పేరయలింగము తెలుఁగున నొడయనంబివిలాస మను కావ్యమును జేసెను ఈతనితండ్రి కేసన; తల్లి లక్కమ్మ; కొడుకు మల్లన. ఇతఁడు కౌండిన్యగోత్రుఁడు; నియోగిబ్రాహ్మణుఁడు, ఇతనికి శ్రీనాధకవి బావమఱఁది యనిచెప్పుదురు. పోతన శ్రీనాధునిమఱఁది యైనను, కాకపోయినను వీరిరువు రును గొంతవఱ కేకకాలమువా రయి యుండిరనుటకు సందేహము లేదు. *

---

* [బమ్మెర-పోతన శ్రీనాధుని సమకాలీనుఁ డని శ్రీవేటూరి-ప్రభాకరశాస్త్రి మున్నగువారు తెల్పియున్నారు. 'ఆంధ్రకవి తరంగిణి' కారులు పోతన శ్రీనాధుని సమకాలికుఁడు కాఁడనుచున్నారు. పోతనామాత్యుండు శ్రీనాధుని బావమఱఁది కాఁడనియు, 'బాలరసాలసాల నవపల్లవ-' ఇత్యాది పద్యము పోతన చెప్పినది కాదని వారి యాశయము. పోతనకును, పేరమంత్రికిని నడుమ నాలుతరములున్న వనియు, శ్రీ వీరేశలింగం పంతులు గారేడు తరములున్నవనుట సరికాదనియు, తర మునకు 30 లేక 33 సంవత్సరములు లెక్కింపవలసి యుండగా పంతులుగారు నలు వది సంవత్సరములు లెక్కించుట సరికాదనియు నందుఁ దెలుపఁబడినది. (చూ, ఆంధ్రకవి తరంగిణి-ఆఱవసంపుటము. పుట 173)

మఱియు పోతన రసార్ణవసుధాకర్త యగు సింగభూపాలుని కాలములోని వాఁడు కాఁడనియు సర్వజ్ఞ బిరుదాంచి తుడఁయి, పదవ తరమువాఁడగు సింగ భూపాలుని కాలమున నుండిన వాఁడనియుశ్రీ ప్రభాకర శాస్త్రిలుగారుమున్నగువారి యభిప్రాయము.

పోతన గ్రంథమును సింగభూపాలుఁడు పాతిపెట్టించెనను వదంతి నమ్మరాద నియు, విద్వాంసుఁడు, ఉదారుఁడునగు నాప్రభు వట్టి పనిచేసి యుండఁడనియు, కూచిమంచి తిమ్మకవి లోకమునందలి వాడుక ననుసరించి యట్లు వ్రాసి యుండవచ్చు ననియు, వెలిగందల నారయ మున్నగు వారిరచనలు కేవల శిథిల భాగపూరకములు కాక భాగవత శేష పూరకములే యనియు విద్వజ్జనుల యాశయము.]

పోతన శ్రీనాథునికంటె నిరువది ముప్పదియేండ్లు చిన్నవాఁడు. వేంకటగిరి ప్రభువులకుఁ బూర్వుఁడయి యీ కాలమునందు రాచకొండదుర్గాధీశ్వరుఁడయి యుండినసర్వజ్ఞసింగమనాయఁడు భాగవతమును దన కంకితము చేయుమని కోరఁగా బమ్మెర పోతరాజు నిరాకరించె నన్న కథకూడఁ బయి కాలమును స్థాపించుచున్నది. కాఁబట్టి పోతరాజు హూణశకము ౧౪౩౦ వ సంవత్సరమువఱకును జీవించి యుండును. అంతకాలము జీవించియున్న పక్షమున మరణకాలమునం దతనికి డెబ్బదియైదు సంవత్సరములప్రాయ మయి యుండును. ఏ హేతువు చేతనో బమ్మెర పోతరాజవిరచిత మైన యాంధ్రభాగవతము విశేషభాగము నశింపఁగా వెలిగందల నారయ, గంగన మొదలైనవారాయా భాగములను పూరించినారు. కాని గ్రంథ మట్లు నశించుటకు కారణ మిదియే యని నిశ్చయించుటకుఁ దగిన ప్రబలాధారము లేవియుఁ గానరావు. బమ్మెర పోతరాజు వ్యాసవిరచితభాగవతపురాణము నాంధ్రీకరించె నన్న వార్తను సర్వజ్ఞసింగమనాయఁడు విని యా కవిని తన యాస్థానమునకు రప్పించి గ్రంథమును కృతి యిమ్మని యడిగెననియు, అతఁడు తన గ్రంథమును నరాంకితము చేయనని రాజుప్రార్థన నంగీకరింపకపోఁగా రాజు రోషముతో నాతని గ్రంథమును భూమిలో గోయి తీయించి పాతిపెట్టించెననియు, శ్రీరామమూర్తి యా రాజుభార్యయొక్క స్వప్నములో వచ్చి భర్తను వేఁడుకొని భాగవతపురాణము లోకములో వ్యాపింపఁజేయ నియ్యకొల్పుమని యామెతోఁ జెప్పి పోయెననియు, ఆమె తన స్వప్నవృత్తాంతమును భర్తకు విన్నవించి పాతిపెట్టిన పుస్తకమును పయికి తీయింపఁగా నందలి తాళపత్రములు పురుగులు తిని బహుభాగములు శిథిలమయి పోయి యుండెననియు, పిమ్మట గంగనాదికవులు చెడిపోయిన భాగములనెల్లఁ బూరించి రనియు, కొందఱు చెప్పుచున్నారు. లక్షణసారసంగ్రహమునందుఁ

గూచిమంచి తిమ్మకవి చెప్పిన యీ క్రింది పద్య మీ కధ కుపబలముగా నున్నది.

సీ. ఘనుఁడు పోతనమంత్రి మును భాగవతము ర
చించి చక్రికి సమర్పించునెడల
సర్వజ్ఞసింగయక్ష్మావరుం డది తన
కిమ్మని వేఁడఁగా నీయకున్న
నలిగి యా పుస్తకం బవనిఁ బాతించినఁ
జివికి యం దొకకొంత శిథిల మయ్యెఁ
గ్రమ్మర నది వెలిగందల నారప
రాజును మఱి బొప్పరాజు గంగ
రాజు మొదలగు కవివరుల్ తేజ మెసఁగఁ
జెప్పి రా గ్రంధములయందె తప్పు లొదవెఁ
గాని పోతన కవీంద్రుని కవితయందు
లక్షణం బెందుఁ దప్పునా ? దక్షహరణ ,

వేంకటగిరిరాజు లయిన వెలుగోటివారికి మూలపురుషుఁడైన బేతాళరెడ్డి కేడవతరమువాఁడైన సింగమనాయనికే కాని పదవతరముఁవాడైన యీ సింగమనాయనికి సర్వజ్ఞబిరుదము లే దని కొంద ఱనుచున్నారు. పోతరాజు భాగవతమును రచించి దానినెవ్వరికిని జూపక పదిలముగా దేవతార్చన పెట్టెలోఁ బెట్టిఁ పూజించుచుండినట్లును, అవసానకాలమునం దఁతడు తన కుమారునిఁ బిలిచి తా నార్జించిన యీ ధనమును కాపాడుమని చెప్పి కాల ధర్మము నొందినట్లును, తదనంతరమున కుమారుఁడు దానిని విప్పి శోధిం పఁగా బాణ మను పురుగుచే గ్రంధపత్రములు తినబఁడి యున్నందున వెలి గందల నారయాదుల సాహాయ్యమున గ్రంథమును పూరింపించినట్లును, మఱికొందఱు చెప్పుచున్నారు. ఈ కడపటి వృత్తాంతమే కొంత మార్పుతో భాగవత పీఠికయందును వ్రాయఁబడి యున్నది. అందుఁ బోతనామాత్యుని పుత్రుండు కూడ నీపైతృకధనమును ముట్టక కాపాడి తనయవసాన కాలము నందు వెలిగందల నారయకు జెప్పఁగా నతఁ డనంతర మా గ్రంథమును

విప్పి చదివి భ్రష్టములైన భాగములను పూరించెనని చెప్పఁబడి యున్నది. ప్రౌఢకవి మల్లనయే పోతనామాత్యునిపుత్రుఁ డయిన పక్షమున మహాకవి యైన యతఁడు తండ్రి రచియించిన పుస్తకమును విప్పియైనఁ జూడకుండె ననుట యంత విశ్వాసార్హముగా నుండదు. పోతరాజునకు మల్లన యను కుమారుఁడు గలఁడు ఆ మల్లనయే ప్రౌఢకవి మల్లన యనుటనుగూర్చి యింకను విచారింపవలసి యున్నది. ఏది యెట్లయినను పోతరాజకృతభాగవతము కొంతవఱకు ప్రభ్రష్టమగుటయు దాని నీ గంగనాదులు పూరించుటయు మాత్రము వాస్తవము.

పోతన సంస్కృతాంధ్రములను తాను గురుముఖమునఁ జదువక స్వయంకృషి వలననే యనర్గళమైన యుభయభాషాపాండిత్యమును సంపాదించిన వాఁడు. ఈ యొక్క యంశమే యీ కవియొక్క ప్రతిభావిశేషమును వేయినోళ్ళఁ జాటుచున్నది. గురుముఖమున విద్య యభ్యసింపకపోవుట చేతనే యితఁడు గద్యమునందు "సహజపాండిత్య" యని వేసికొన్నాఁడు. సహజపాండిత్యుఁ డగుటచేత నీతని కవిత్వమునం దక్కడక్కడఁ గొన్ని వ్యాకరణాదిదోషములు కానవచ్చుచున్నవి. కాని కవిత్వముమాత్రము నిరుపమానమయి నదయి సర్వజనశ్లాఘాపాత్రముగా నున్నది. పోతన చిన్నతనములో గోవులను మేపుకొనుటకై గ్రామసమీపమున నున్న యడవికిఁ బోయినప్పుడు చిదానందుఁ డను యోగి యాతనికి రామమంత్రము నుపదేశించినట్లును, దానినిబట్టియే సమస్తవిద్యలును నిరవద్యకవిత్వమును వచ్చినట్లును కొందఱు చెప్పుచున్నారు. అయినను "శ్రీపరమేశ్వరకరుణా కలిత కవితా విచిత్ర" యను భాగవతగద్యమునుబట్టియు వీరభద్రవిజయమునుబట్టియు విచారించి చూడఁగా శివప్రసాదమువలన నీతనికిఁ గవిత్వ మలవడుట కవి యభిప్రాయ మయినట్టు స్పష్ట మగుచున్నది. శ్రీరామమూర్తి భాగవతమును తెనిఁగింపవలసినదని చెప్పినట్టు స్వప్నము రాఁగా నితఁడు శ్రీరామాంకితముగా భాగవతపురాణమును తెనిఁగించెను.

ఈ కవి ధనికుఁడుగాక రాజుల నాశ్రయింపక కృషికర్మచేఁ గాలము గడుపుచుండెను. ఇతనిఁ మహత్త్వాదులనుగుఱించి యిటీవలివా రనేకకథలను

గల్పించినారు. వానిలోఁ గొన్నిటి నిందుఁ జెప్పుచున్నాను. పోతనామాత్యుని బావయైన శ్రీనాథుఁడు భాగవతమును తనయేలికయైన కర్ణాటప్రభున కంకితము చేయింపవలెనని పల్లకిమీఁద నోరుగంటికి వచ్చి, ఊరిబయలి పొలములో పోతన యరక కట్టించి కుమారునిచేత దున్నించుచుండఁగాఁ దన మహత్త్వమును వారికి జూపనెంచి పల్లకి మోచుచున్న బోయీల నొక ప్రక్కబొంగు వదలివేయుఁ డని యాజ్ఞాపించెనఁట ! మోచువారు లేకయే పల్లకి నడుచుచుండుట చూచి పోతన పుత్రుఁడయిన మల్లన తండ్రితోఁ జెప్పఁగా నతఁడు నాగలికాడికిఁ గట్టిన యొక దున్నపోతును విప్పుమని యాజ్ఞాపించెనఁట ! ఒకప్రక్క దున్నపోతు లేకయే యరక సాగుచుండుట చూచి శ్రీనాథుఁడు రెండవదండిని కూడ విడువుఁడని బోయీల కాజ్ఞాపించి పల్లకిని నడిపింపుచుండఁగా పోతన రెండవప్రక్కనున్న దున్నపోతునుకూడ విప్పించి నాగలి సాగునట్లు చేసెనఁట ! అటుపిమ్మట శ్రీనాథుఁడు పోతనను సమీపించి 'హాలికులు సుఖముగా నున్నారా?' యని పరిహాస పూర్వకముగా కుశలప్రశ్నము చేయఁగా నతఁడు

ఉ. బాలరసాలసాలనవపల్లవకోమలకావ్యకన్యకన్
గూళల కిచ్చి యప్పడుపుకూడు భుజించుటకంటె సత్కవుల్
హాలికులైన నేమి ? గహనాంతరసీమలఁ గందమూలకౌ
ద్దాలికులైన నేమి నిజదారసుతోదరపోషణార్థమై ?

అని ప్రత్యుత్తరము చెప్పెనఁట ! అందుకు శ్రీనాథుఁడు మనసులో లజ్జ పడియు పైకి తోఁపనీయక ముఖమున లేని వికాసము తెచ్చుకొని బావమఱఁదుల మేలమున కాడిన మాటకుఁ గోపగింపఁజెల్లునా ? యని సమాధానపఱిచెనఁట ! తరువాత మల్లన ముందుగా నింటికిఁ బోయి భోజన పదార్థముల నిమిత్తమై ప్రయత్నము చేసి లభ్యములు కాక విచారముతో నూరి వెంటఁ దిరుగుచుండఁగా విష్ణుమూర్తి పోతనరూపమున వచ్చి పంచభక్ష్య పరమాన్నములతో విందు చేయుటకు తగిన సమస్త పదార్థముల నిచ్చి

పోయెనcట! భోజనము లయిన పిమ్మట శ్రీనాథుఁడు పోతనయొక్క దారిద్ర్యవిషయమును ప్రస్తావించి భాగవతము * నొక రాజునకో ధనికునకో యంకితము చేయున ట్లొడఁబఱుచుటకయి ప్రయత్నించు చున్నప్పుడు సర స్వతి యెదుట నిలిచి కన్నీరు పెట్టుకొనుచున్న ట్లాతనికిఁ బొడకట్టఁగా పోతన

ఉ. కాటుకకంటినీరు చనుకట్టుపయిం బడ నేల యేడ్చె దో
కైటభదైత్యమర్దనునిగాదిలికోడల! యో మదంబ యో
హాటకగర్భురాణి! నిను నాఁకటికిం గొనిపోయి యల్లక
ర్ణాటకిరాటకీచకుల కమ్మఁ ద్రిశుద్ధిగ నమ్ము భారతీ!

అని సరస్వతి నూఱార్చెనcట. ఈ పద్యములోఁ గర్ణాటకిరాటకీచకులని చెప్పుట శ్రీనాథుఁడు తన గ్రంథములను రాజులకును, కోమటులకును, దుష్టు లకును, ధనమున కాశించి యమ్ముకొనె నని యాతని నాక్షేపించుట యని కొందఱ అభిప్రాయపడుచున్నారు. ఆ కాలమునం దాంధ్రరాజులను కర్ణాట రాజు లని చెప్పుచు వచ్చిరి. అందుచేతనే శ్రీనాథుఁడు భీమఖండమునందు

గీ. ప్రౌఢి పరికింప సంస్కృతభాష యండ్రు
పలుకు నుడికారమున నాంధ్రభాష యందు
రెవ్వ రేమన్న నండ్రు నా కేలకొఱఁత?
నాకవిత్వంబు నిజము కర్ణాటభాష.

అని తన తెనుఁగుకవిత్వమును గర్ణాటభాషగాఁ జెప్పియుండెనcట! ఇట్లు చెప్పుటకు వేఱు కారణము గలదు. అంతట శ్రీనాథుఁడు విఫల ప్రయ త్నుఁడై మరలఁ దన యూరు చేరెనcట! పోతన తన గ్రంథమును నరాంకి తము చేయకపోవుటను గొప్పగా భాగవతమునం దీ క్రింది పద్యముచేతఁ జెప్పుకొన్నాఁడు.

* శ్రీనాథుఁడు భాగవతమును సర్వజ్ఞ సింగభూపాలున కంకితమీయ వలె నని పోతనను గోరినట్లు కొందరు చెప్పుదురు.

ఉ. ఇమ్మనుజేశ్వరాధముల కిచ్చి పురంబులు వాహనంబులున్
సొమ్ములుఁ గొన్ని పుచ్చుకొని సొక్కి శరీరము వాసి కాలుచే
సమ్మెట ద్రెబ్బలం బడక సమ్మతి శ్రీహరి కిచ్చి చెప్పె నీ
బమ్మెరపోతరా జొకఁడు భాగవతంబు జగద్ధితంబుగన్.

పోతరాజు తృతీయస్కంధమును తెనిఁగించునప్పుడు విష్ణుమూర్తి శ్వేత వరాహరూపమున నాతనివాకిటఁ బరుండుచు వచ్చెననియు, భాగవతము తన కంకితము చేయనన్నాఁ డన్న కోపముచేత కవిని బాధించి కట్టి తెచ్చుటకై పంపిన కర్ణాటాధీశ్వరుని భటులను పాఱఁదోలె ననియు, మఱియొక కథ చెప్పుదురు పోతరా జష్టమస్కంధములోని గజేంద్రమోక్షకథను వ్రాయుచు "అలవైకుంఠపురంబులో నగరిలో నామూల" యనువఱ కొక పద్యమును వ్రాసి పైభాగము తోఁచక చింతిల్లుచు వెలుపలికిఁ బోయినప్పుడు విష్ణువు వచ్చి "సౌధంబుదాపల" యని వ్రాసి పోయె ననియు, ఇంకొక కథ చెప్పుదురు భాగవతమును రచియించునప్పుడు కవి చెప్పిన సంగతి యెల్లను ప్రత్యక్షముగా జరుగుచు వచ్చెననియు, రుక్మిణీకల్యాణమును రచించుచు "దేవకీసుతుకోర్కి తీ గలు వీడంగ" నను పద్యములో 'బాలకమరె' యను భాగమును జెప్పునప్పు డాతని కుమార్తె కుంపటిలోఁబడి కమరిపోయె ననియు, "పద్మనయనువలనఁ బ్రమదంబు నిండారె" నను భాగమును జెప్పఁగానే మరల లేచి యథాప్రకారముగా నా చిన్నది సుఖముగా నుండె ననియు వేఱొకకథ చెప్పుదురు. చెప్పఁబూనినచో నిటువంటి కథల కంత ముండదు. అయినను మఱియొక చిన్నకథను మాత్రము వ్రాసి వీని నింత టితో పరిసమాప్తి నొందించెదను పోతన గజేంద్రునికథఁ జెప్పుచు గజేంద్రుఁడు ప్రాణసంశయదశలో నున్నప్పుడు శ్రీమహావిష్ణువు

మ. సిరికిం జెప్పఁడు శంఖచక్రయుగముం జేదోయి సంధింపఁ డే
పరివారంబును జీరఁ డభ్రగపతిం బన్నింపఁ డాకర్ణికాం
తరధమ్మిల్లము చక్క నొత్తఁడు వివాదప్రోద్ధత శ్రీకుచో
పరిచేలాంచలమైన వీడఁడు గజప్రాణావనోత్సాహియై

అని వ్రాయఁగాఁ జూచి శ్రీనాథుఁడు విష్ణుమూర్తి మకరమును జంపి భక్తుని ప్రాణములఁ గాపాడఁబోవునప్పుడు 'చక్రాద్యాయుధములను వెంటఁగొనక కఱువఁబోయెనా? గిల్లఁబోయెనా? లేక వేడుకచూడఁ బోయెనా?' యని యాక్షేపించె ననియు, పోతన యప్పు డేమియుఁ బ్రత్యుత్తరము చెప్పక భోజనకాలమునందుఁ దన కేదో పని యున్నదని చెప్పి ముందుగా లేచి పోయి శ్రీనాథునికొమారు నెక్కడనో దాఁచి వచ్చి నూతిలోఁ పెద్దఱాయి వేసి శ్రీనాథునికొమారుఁడు నూతిలోఁ బడెనని కేక వేసెననియు, శ్రీనాథుఁ డా కేక విని తాను తినుచున్న పెరుగన్నమును విడిచి యెంగిలిచేతితో పరు గెత్తుకొనివచ్చి విచారముతో నూతిలో తొంగి చూచుచుండఁగాఁ జూచి బావా! త్రాళ్ళును. నిచ్చెనయు దిగు మనుష్యులును లేక నూతిచుట్టును గంతులువేయ వచ్చినావా? వేడుక చూడ వచ్చినావా?' యని యడిగి, 'నీ కున్న పుత్రవాత్సల్య మిప్పు డెట్లు పరికరములమాట విచారింపనీక నిన్ను పరుగెత్తించినదో, విష్ణుమూర్తికున్న భక్తవాత్సల్య మట్టే యాతనిని పరికర ములమాట విచారింపనీక పరుగెత్తునట్లు చేసిన' దనియు, 'కావలసినప్పుడు పరికరము లన్నియు వెనుక వచ్చు' ననియు, ప్రత్యుత్తరము చెప్పెనఁట॥

పోతనకవిత్వమునందుఁ గొన్ని లక్షణవిరుద్ధములైన ప్రయోగము లుండుట చేత వెల్లంకి తాతంభట్టు మొదలయిన పూర్వలాక్షణికులు దానిని సలక్షణ గ్రంథముగా నంగీకరించినవారు కారు అట్లంగీకరింపకపోవుటకుఁ గారణము రేఫఱకారములకు యతిప్రాసములందు మైత్రి యుండుట యని వా రెక్క డను జెప్పి యుండలేదు రేఫఱ కారములకు మైత్రి యుండఁగూడ దని నన్నయభట్టారకాదుల యభిప్రాయ మగునా? యనియు సంశయింపవలసి యున్నది. నన్నయభట్టు రేఫములనుగాఁ బ్రయోగించినవానినిఁ గొన్నిఁటిని శకటరేఫములనుగాను శకటరేఫములనుగాఁ బ్రయోగించినవానిని గొన్నిఁటిని రేఫములనుగాను తిక్కన ప్రయోగించి యున్నాఁడు అయినను రేఫశకట రేఫముల విషయమయి పెనఁగులాడువారు వాని కన్నిఁటికిని ద్విరూపములు కల వని చెప్పుదురు అట్లనిన పక్షమున రేఫములకును ఱాలకును మైత్రి లేదను తమవాదము పడిపోవు నన్న భీతిచేత పన్నిన * పన్నుగడ కాని

* (ఇది పన్నుగడయో, భాషాతత్త్వ పరిశీలన దృష్టితోఁ జేయబడినదో విమర్శ కులు నిర్ణయింపఁ దగుదురు.)

యిది మాటియొకటి కాదు ఒక పదమునందలి యొక అక్షరము రేఫమును శకట రేఫము నగు ననుటవలనఁ బ్రైత్రికూడ దను వాదమునకే దౌర్బల్యము కలిగించునని నా యభిప్రాయము ఒకపదమునందలి రేఫము అకారముగా మాఱు నప్పుడు ప్రత్యేకముగా రేఫఱకారములకు మైత్రి కలిగియున్న నేమి బాధ కలుగునో నే నూహింపఁజాలకున్నాను. తెలుఁగుపదములం దివితాలని నిర్ధారణ చేయుటకు వారి కేమి యాధారములున్నవో మొట్టమొదట నాకుఁ దెలియకున్నవి. కవిత్రయమువారి ప్రయోగములందుసంస్కృతపదములతో యతిప్రాసములయందుఁ జేసినవాని నన్నిఁటిని శకటరేఫములనుగా నిర్ణయించి యున్నారు రేఫములను గలిగియుండియుఁ దెలుఁగుపదములు యతిప్రాసములయందు భారతాదులలో సంస్కృతపదముతోఁ జేరక యుండరాదా? "నాన్యేషాం వైధర్మ్యం లఘ్వలఘూనాం రయోస్తు నిత్యం స్యాత్" అని వాగనుశాసనుఁడు చెప్పియుండుటచేత లఘ్వలఘురేఫములకు మైత్రి కూడదందురేమో! ఆంధ్రశబ్దచింతామణి నన్నయభట్టు చెప్పిన దయి యుండదని యాతని చరిత్రమునందు నిదర్శనపూర్వకముగాఁ జూపఁబడి యున్నది కాఁబట్టి రేఫఱకారవైరము నన్నయభట్టుమతము కాదని సందేహింప వలసి యున్నది. ఈ భేద మావశ్యక మని చెప్పిన బాలసరస్వతి సహిత మీ భేదమును గనిపెట్టలేక తన చంద్రికాపరిణయమునందు రేఫఱకారములకుఁ బ్రాసమైత్రి చేసియున్నాఁడు రేఫఱకారమైత్రి కూడదని పూర్వకాలము నందుఁ గొందఱిమత మైనను, కూడుననియు పలువురమతమై యున్నది. భారతాదుల నామూలాగ్రముగాఁ బరిశోధించి యుభయభాషలయందును సర్వతోముఖపాండిత్యము గలవారైన బమ్మెరపోతన పిల్లలమఱ్ఱి పినవీరభద్రుఁడు, పింగళి సూరన, అల్లసాని పెద్దన, మొదలయిన తొంటికవు లనేకులు రేఫఱకారమైత్రి నంగీకరించినపక్షమువారు

క. న ణ లను రెండక్షరముల
కును వడిఁ బ్రాసంబుఁ బెట్టుకొనవచ్చుఁ గృతిన్,
విను ర ఱ ల కట్ల పెట్టఁ
జను ల ళ ల కభేద మరయ సర్వజ్ఞనిధీ!

అని కవిజనాశ్రయమునందు రేఫఱకారములకు మైత్రి చెప్పఁబడి యున్నది. రేఫఱకారములు ప్రాసలయందు మైత్రిఁ జెందగూడకున్నను యతులయందుఁ జెందవచ్చు నని కొందఱి యభిప్రాయము.

గీ. చఛజఝులకును మొదలియూష్మములు మూడు
సరసవడి నిల్పఁగా నేకజాతిమైన
బండిఱాకు రేఫము వడి కుండరాదె?
ప్రాసవర్ణంబులకుఁ గూర్పరాదు గాని.

అని శారదాదర్పణమునందుఁ జెప్పఁబడి యున్నది. కాని యిటీవలివారంద ఱును రేఫఱకారమైత్రి నన్నయభట్టమతము కా దని భ్రమించి రేఫఱకార మైత్రిని దూషించి యా మత మవలంబించినవారిని కుకవులని దూషించి యున్నారు అట్లు దూషించినవారిలో నొకఁ డయిన కాకు నూర్యప్పకవి రేఫఱకారముల ప్రాముఖ్యమును స్థాపింప నెంచి భాగవతమును బూర్వలాక్షి ణికులు లాక్షణికగ్రంథమునుగా నంగీకరింపకపోయినందుకు రేఫఱకారములు ప్రాసలయందు మైత్రి చెందుట యొక్కటియే కారణ మని యీ క్రింది పద్యముచేతఁ జెప్పియున్నాఁడు

ఉ. బమ్మెరపోతరాజకృత భాగవతంబు సలక్షణంబు కా
కిమ్మహి నేమిటం గొదవ? యెంతయు నారసిచూడఁగాను రే
ఫమ్ములు ఱాలునుం గలిసి ప్రాసము లైన కతంబునం గదా
యిమ్ముల నాదిలాక్షణికు లెల్లను మాని రుదాహరింపఁగన్.

ఇట్లు రేపఱకారముల నిమిత్తమయి యింతగాఁ బెనఁగులాడిన యప్పకవియే తన కా భేదము తెలియక వానికి యతిప్రాసములయందు మైత్రికూర్చి తానును తా నభివర్ణించిన కుకవిసమూహములోనే చేరినందున కోగినాల రంగనాథకవీశ్వరుఁడు ద్విరేఫ దర్పణమునం దుదాహరించిన యప్పకవి పద్యముల రెంటిని మాత్ర మిందుఁ జూపుచున్నాను.

క. కేరుచు నొయ్యన డగ్గఱి
జేరుచు నురుముష్టిహతికిఁ జిక్కక వేగం
దాఱి చహంకృతిఁ గ్రమ్మఱ
దూఱి చధోక్షజుఁడు మల్లుఁ ద్రుంచె ననంగన్.

మ. పురిటింటం బసిబిడ్డచందమున వాపోవంగ నాఁ డాత్మలో
మురువొప్ప న్విషదుగ్ధయుక్తకుచయై ముద్దాడు రాకాసి గు
త్తెఱిఁ గిష్టంబుగఁ బాలు ద్రావు మిషచే నిర్వైన కాలంబునం
ధరణిం గూల్చిన నందపుత్త్రువలనం దార్కొఱ ధర్మస్థితుల్.

ఇట్లొక్కయప్పకవి మాత్రమే గాక రేఫఱకారములకు యతిప్రాసమైత్త్రి కూర్చిన యితర మహాకవుల పద్యములను గూడ సర్వలక్షణసారసంగ్రహమునందుఁ గూచిమంచి తిమ్మకవి చూపినవానిలోఁ గొన్నిటి నిందుదాహరించుచున్నాను.

౧. అల్లసాని పెద్దన మనుచరిత్రమునందు—

శా. శ్రేణుల్గట్టి నభోంతరాళమునఁ బాఱెం బక్షు లుష్ణాంశుపా
షాణవ్రాతము కోష్ణమయ్యె మృగతృష్ణావార్ధు లింకెం జపా
శోణం బయ్యెఁ బతంగబింబము దిశాస్తోమంబు శోభాదరి
ద్రాణం బయ్యె సరోజషండములు నిద్రాణంబు లయ్యెం గడున్.

౨. కృష్ణరాయలు, ఆముక్తమాల్యదయందు—

మ. ఇలకు న్వేఁగగుఁ బండు తీరవనపుండ్రేక్షుచ్ఛటల్ తీపు ల
గ్గలమై వ్రాల నురుస్వనంబు లెసఁగఁగాఁ ద్రిప్పు రాట్నంపుగుం
డ్రలునాఁ దేనెకొలంకులం బొరలి పాఱన్విచ్చుపంకేరుహం
బుల నాడెం దొలుసంజఁ దేటివలయంబు ల్హారఝుంకారముల్.

౩. పింగళి సూరన్న ప్రభావతీప్రద్యుమ్నమునందు—

క. గ్రక్కునఁ జని వాలుదునో
ఱెక్కలుఁ గట్టుకొని దివిజరిపుమేడలపై
నక్కొమ్మఁ జూచు టెపు డెపు
డొక్కొ? యనునంత తమక మున్నది మదిలోన్.

४. అయ్యలరాజు రామభద్రుఁడు రామాభ్యుదయమునందు—

ఉ. సైరిభవారిభద్విరదశాసఖడ్గఖరాధిరూఢులై
తారలు బూరగొమ్ములును దప్పెటలుం బటహంబులుం బదు
ల్పూఱులు వేలు మ్రోయఁ గవను ల్వడి హత్తి యుత్తర
ద్వారకవంకఁ దాఱ కిరువంకలఁ బోఁజులు దీర్చి రయ్యెడన్.

౫. పిల్లలమఱ్ఱి పినవీరన్న-జైమినిభారతమునందు—

ఉ. తూరుపు తెల్లవాఱుటయుఁ దోడనె మంగళపాఠకస్తుతుల్
మీఱఁ దదీయరాగముల మేల్కొని కాల్యసముచితక్రియల్
దీఱిచి పాండుపుత్రు వసుదేవసుతుల్ ప్రమదంబు మోములం
దేరఁగ వేడ్కతో నరుగుదెంచి సభాస్థలి నిల్చి రయ్యెడన్.

౬. సంకుసాల నృసింహకవి-కవికర్ణరసాయనమందు—

గీ. వనధి సర్వంకషంబయ్యు వలయుపనికి
తేపులనెకాని దొరసాని రీతిదనరి
విశ్వరూపకుఁడయ్యు శ్రీ విభుఁడు కూర్మ
రూపమున సేవ్యుఁడగు నారురుషులకును.

తిమ్మకవి చూపినట్లు రేఫఱకారముకు మైత్రి చేసిన మహాకవు లింతమంది యుండఁగా వీరినందఱిని లాక్షణికులనుగా నంగీకరించి వీరి పద్యముల నుదాహరించిన యప్పకవియొక్క బమ్మెర పోతరాజును మాత్రము రేఫఱకారములకు యతిప్రాసములయందు పొత్తుగలిపె నన్న హేతువు చేత నేల నిరాకరింపవలయునో యూహించుట మానసగోచరము కాకున్నది. ద్విరేఫ భేద విషయమున నిప్పటివారు పూర్వపువారిని మించినారు. పూర్వులలోఁ గొందఱు తద్భవమున శకటరేఫము లే దన్నారు తాతంభట్టు కవిలోక చింతామణియందు "అచ్చతెనుఁగులను దీర్ఘముల మీఁద బండఱాను లేదు పద్మనాభ!" యని చెప్పియున్నాఁడు. ఇప్పటివా రన్నిచోట్లను బండిఱాలు కని పెట్టినారు.

గీ. అరయ గురురేఫ హల్లుతో బెరసినపుడు
ప్రాసముల విశ్రమముల రేఫములతోడఁ
గలసి యుండును సుకవిపుంగవుల కృతుల
జగదవనసూత్ర! గిరితనూజాకళత్ర! *

అని తిమ్మకవి సార్వభౌముఁడు లక్షణము వ్రాసి యీ క్రింది పద్యములను లక్ష్యములనుగాఁ జూపియున్నాఁడు.

ఉ. నూఱ్వురు నొక్కచందము మనోగతి సైరణ చేసి నన్ను నా
సర్వకులంబు నుత్తమయశంబున నుంచితి రమ్మలార మీ
కుర్విని సాటియే యబల లొండులు దేవతలుం బటుక్షమా
నిర్వహణం బొనర్చుటకు నేరరు మర్త్యులఁ జెప్పనేటికిన్—

ఎఱ్ఱాప్రెగడ రామాయణము.

క. కాఱ్చిచ్చు గవిసి మృగముల
నేర్చుకరణి నేఁడు భీష్ముఁ డేచినకడిమిం
బేర్చి మనభీముఁ డొదవె శ
రార్చుల నవ్వీరుఁ గన్నులారఁగఁ గంటే　　భీష్మపర్వము.

క. చెలఁగి పటుసింహనాదం
బులు బంకెలుగాఁగ వారు పొలిచిరి వృషభం
బుల క్రియ నొండొరులకు మా
ఱ్మలయుచుఁ దాకుచు నుదాత్తరభసోజ్జ్వలులై　　ద్రోణపర్వము.

మనవారు కొందఱిప్పుడు సంయోగమునందు ఱకారము రేఫముగా మాఱు నని చెప్పుచున్నారు మఱికొందఱు భారతమునందుగూడ.

* (వేఱొక హల్లుతోఁ గూడినపుడు శకటరేఫము లఘురేఫమే యగునని యాధునిక లాక్షణికుల యాశయము.)

క. తెంపును బెంపును గదుర ని
 లింపులు వెఱఁ గంది చూడ రిపుసైన్యములం
 గంపింపఁ దమబలంబులు
 అంపిలి బిట్టార్వ సింధురాజుం దాఁకెన్.

ఇత్యాది స్థలములలో గురులఘురేఫముల మైత్రి యంగీకరింపఁబడినదని చెప్పుచున్నారు. ఒకవేళ నిప్పటివా రెవ్వరయిన అంపిలుశబ్దమునకు ద్విరూపములు గలవని చెప్ప వత్తురేమో ! ఈ ద్వైరూప్యమువలని ప్రయోజన మేమో నాకుఁ దెలియరాకున్నది. కవిత్రయమువా రొక్కపదములోని యొక అక్షరమునే యొకప్పుడు రేఫముగాను, మఱియొకప్పుడు శకటరేఫముగాను ప్రయోగించుటచేతనే వారి కా భేదమంత సమ్మతము కాదని స్పష్టపడుచుండలేదా ? అప్పకవి లోనైనవా ద్విరూపములను నడుమఁ దెచ్చిపెట్టినారు మఱియొక హల్లుతోఁ జేరి యున్నప్పుడు బండిఱా రేఫముతో యతిప్రాసలయందు మైత్రి చెందుచుండఁగా, రేఫము సవర్ణములు గాని ఋకారముతోను, లకారముతోను మహాకవి ప్రయోగములందు యతిప్రాసల మైత్రిని బొందుచుండఁగా సవర్ణమయిన బండిఱాతో నేల మైత్రిచెందరాదో తెలియరాదు. అనావశ్యకము లయిన నిర్బంధములను దీసివేసి భాషను సుసాధ్యముచేయుట పరమప్రయోజనకర మగుటచేతను, రేఫ ఱకారభేదము వలన భాష కొక ప్రయోజనము కలుగకుండుటచేతను, పూర్వకవు లనేకులు వానిమైత్రి కంగీకరించి యుండుటచేతను, మన పండితులు దుర్గ్రాహ్యమయిన యీ భేదమును పాటింపక భాషచిక్కు కొంత వదల్ప సమ్మతింతురని నమ్ముచున్నాను పదములు రేఫభేదమును గలిగియున్నచో నర్థభేదము కూడఁ గలిగియుండు నందురేమో, మన లక్షణవేత్తలు చేసిన నిర్ణయమును బట్టియే యెన్ని పదములు సమానార్థములు గలవై యుభయరేఫములుగా నుండలేదు ? అర్థభేదమును నిర్ణయించుటకు ప్రకరణసాహచర్యాదులు సాధనములు గాని వ్రాయఁబడిన రూపము కాదు.

రేఫ ఱకారముల ప్రాసమైత్రిని బట్టి పూర్వలాక్షణికులు భాగవతమును నిరాకరింపలేదనియు, వారు దాని నుదాహరింపకపోవుట కితరదోషములే

కారణమనియు నా యభిప్రాయము. కొందఱు భాగవతమును తప్పుల కుప్పఁగా నెంచఁగా మఱికొందఱు భాగవతమునందు దోషములే లేవని సాధింపఁ జూచుచున్నారు ఈ కడపటితెగవారిలో కూచిమంచి తిమ్మకవి సర్వలక్షణసారసంగ్రహమునందు

సీ. అఖిలవేదాంతవిద్యారహస్యవిదుండు
　　సహజపాండిత్యవిశారదుండు
మత్తక్షితీశాధమస్తోత్రవిముఖుండు
　　శంభుపదాబ్జపూజారతుండు
పటుతరకవితావిభాసితప్రముఖుండు
　　సకలాంధ్రలక్షణచక్రవర్తి
రఘుకులేశనిదేశరచితమహాభాగ
　　వతపురాణుఁడు పుణ్యవర్ధనుండు

బుధజనహితుండు బమ్మెర పోతసుకవి
యెన్న రేఫఱకారంబు లెఱుఁగఁ డనుచు
నజ్ఞు లొకకొంద ఱాడుదు, రామహాత్ము
కవిత కెందును లోపంబు గలుగ దభవ!

అని వ్రాసి, "పోతరాజు చెప్పినవి ప్రథమస్కంధమును, ద్వితీయస్కంధము కొంతయు షష్ఠస్కంధము, సప్తమాష్టమ నవమస్కంధములును, దశమ పూర్వభాగంబు కొంతయు నున్న" దని చెప్పి. యీ భాగములలో రేఫఱ కారముల మైత్రి లేనందున కుదాహరణము లిచ్చి యున్నాఁడు. అంతేకాక వెలిగందల నారయాదుల కవిత్వమునందు రేఫ ఱకారమైత్రి యున్నందుకు ద్వితీయస్కంధము నుండియు, తృతీయస్కంధమునుండియు చతుర్థస్కంధ మునుండియు, పంచమస్కంధమునుండియు, దశమోత్తరభాగమునుండియు పద్యముల నుదాహరించి యున్నాఁడు. ముద్రింపఁబడిన భాగవతమునందలి షష్ఠస్కంధకృత్యాదినిబట్టియు, నాశ్వాసాంతగద్యములనుబట్టియుఁ జూడఁగా

షష్ఠస్కంధము సింగయకవిచేఁ జెప్పఁబడినట్లు స్పష్టముగాఁ దెలియవచ్చు చున్నది. ద్వితీయతృతీయచతుర్థస్కంధములు పోతనార్యవిరచితము లయినట్టే కనఁబడుచున్నవి. అయినను మన మే భాగము పోతనకవి విరచితమో యే భాగము తచ్ఛిష్యవిరచితమో యే యే పద్యములు శిష్యజన పూరితములో యేవి యెవరి దోషములో దృఢముగా నిర్ధారణము చేయఁజాలము. పూర్వ లాక్షణికు లందఱు నంగీకరింపని పోతనకవిత్వమునందుఁ బొత్తిగా దోష ములే లేవని సాధింపఁ జూచుటకంటె భాగవతమునకు తరువాత రచించిన * వీరభద్రవిజయమునందుఁ గూడఁ గొన్ని దోషములు కనుపట్టుచుండుటచేత పోతనకృతభాగవతమునందును గొన్ని దోషములున్న వని యొప్పుకొనుటయే న్యాయము. షోడశకళాపరిపూర్ణ మయిన చంద్రబింబమునందుఁ గొంచెము కళంకమున్నట్టుగా సర్వజనసమాదరణీయమయిన యీతని కవితాసుధా సముద్రమునందుఁ గొన్ని నెఱసు లున్నను, దాని కొక కొఱఁత గలుగఁ బోదు.

పోతనకవిత్వము భక్తిరసప్రధాన ప్రధానమయినది; పదలాలిత్యము గల దయి, యమకాదిశబ్దాలంకారభూయిష్ఠమయి, శ్రావ్యముగా నుండును. ఇతఁడు భారతమును రచించిన కవులవలెఁ గాక తన భాగవతమును మూల గ్రంథమునకంటెఁ బెంచి వ్రాసెను మూలమైన సంస్కృతభాగవత గ్రంథ సంఖ్య యిరువది వేలుగా నున్నను, ఇతఁడు రచించిన తెలుఁగుభాగవతము ముప్పదివేల గ్రంథము కలదిగా నున్నది.

భగవద్గుణవర్ణనాదులు వచ్చినప్పుడు తనభక్తి తేటపడునట్లుగా స్వకపోల కల్పితవర్ణనలు గూర్చియు, భాగవతములో లేని విష్ణుపురాణాదులలోని కథ లను జేర్చియు, కొన్ని స్థలములలో గ్రంథమును బెంచినను తక్కిన భాగ మంతయు విషయభేదము లేక వ్యాసవిరచిత మూలగ్రంథమునకు టీకవలె నుండును. భాగవతములో లేని సత్యభామయుద్ధాదులు విష్ణుపురాణమునుండి గ్రహింపఁబడినవి.

---

* [భాగవత రచనకు ముందే వీరభద్రవిజయము రచింపఁబడి యుండునని విమర్శ కుల యాశయము.]

తెలుఁగు పురాణములలో భాగవతము మిక్కిలి జనసమ్మతమైన పుస్తకము. అందలి రుక్మిణీకల్యాణము, గజేంద్రమోక్షము మొదలైన కథలను సమస్త జనులును జదువుదురు. ఈ కవి భాగవతము రచించిన తరువాత వీరభద్ర విజయమను మఱియొక గ్రంథమును రచించెను. భాగవత చతుర్థస్కంధము నందలి దక్షయజ్ఞకథలో "అనయంబు లుప్తక్రియాకలాపుఁడు మానహీనుఁడు మర్యాదలేనివాఁడు మత్తప్రచారుఁ డుగ్రత్వప్రియుఁడు" అనియు, "వసుధ నెవ్వారు ధూర్జటి వ్రతులువారు వారి కనుకూలు రగుచు నెవ్వారు వార లట్టి సచ్ఛాస్త్రపరిపంథులైనవారు సవనిఁ బాషండులయ్యెద" రనియు శివదూషణము విశేషముగాఁ జేయఁబడి యుండుటచేఁ, దత్పాపపరిహారార్థ మయి వీరభద్రవిజయమును జేసిన ట్లా పుస్తకములోని యీ క్రింది పద్యమునందుఁ జెప్పఁబడి యున్నది

ఉ. 'భాగవతప్రబంధ మతిభాసురత న్రచియించి దక్షకృ
　　ద్యాగకథాప్రసంగమున నల్పవచస్కుఁడనైతిఁ, దన్నిమి
　　త్తాగమవక్త్రిదోషపరిహారతకై యజనైకశైవశా
　　స్త్రాగమవీరభద్రవిజయంబు రచించెద వేడ్కతోడుతన్.'

['భాగవతప్రబంధ' మను నీ పద్యము కొన్ని తాళప్రతులలో మాత్రమే కలదు; విలేఖకు లెవరో యీ పద్యమును రచించి యందుఁ జేర్చియుందురు కావున నీ పద్యమును విడిచివేసి, పోతనామాత్యుండే వీరభద్రవిజయకర్త యనియు, భాగవతమునకు ముందు దీనిని రచించెననియు నిశ్చయింపవలసి యున్నది' (ఆంధ్రకవి తరంగిణి ఆఱవ సంపుటము. పుటలు 192, 193)

వీరభద్రవిజయముంగూర్చి యందే యిట్లు చెప్పబడియున్నది.

"ఇప్పుడు ముద్రితమైయున్న వీరభద్ర విజయమందలి నాల్గవ యాశ్వాసవ పోతనామాత్య విరచితము కాదనియు, నెవరో రచించినభాగము నిందెవ్వరో చేర్చిరనియు శ్రీ మానవల్లి-రామకృష్ణకవిగారు భారతి పత్రికలో (పుష్యం: జల్ధి - రక్తాక్షి - ఆషాఢము) నీ క్రింది విధముగా వ్రాసి యున్నారు

'నాల్గవ యాశ్వాసములోని పద్యములు కొంచెము నీరసములుగా నున్నవి. ఇది యేమని యాలోచించుచుండ వీరభద్రవిజయము తాటియాకుల ప్రతి యొకటి లభించె. దానిఁ బరికించి చూడ నాల్గవ యాశ్వాసము ముద్రితపార ముకంటె సర్వదాభిన్నమయి శివపార్వతీకైలాసవిహారవర్ణనమును కుమార జననమును, దారకాసురసంహారమును దెలుపు కథాభాగము విస్తరించు నదిగా నున్నది. నూతనముగా లభించిన యీభాగమునను పూర్వాశ్వాసము లలో వలెనే మహర్షులకు వాయుదేవుఁ డీ కథ చెప్పినట్లున్నది. ఆశ్వాసాం తమునఁ గొన్ని పత్రములు లేనందున నీ భాగము పోతనకృత మగునా ? కాదా ? యనునంశము స్పష్టముగాఁ జెప్పుటకు వీలులేకపోయినను. గవిత్వ ధోరణి ననుసరించియుఁ గథానుస్యూతత్వమును జూచియు నిదిపై మూఁడా శ్వాసములకు సంబంధించి యేకకవికృతమని తోచుచున్నది. ముద్రితమగు భాగము పరకవిపూరితమగుటచేఁ గాఁబోలు నుత్పలమాలతోఁ బ్రారంభింప బడియె. .... ... ... "

శ్రీకవిగారి యొద్దనున్న తాళపత్రప్రతిని నేను జూచుట తటస్థింపలేదు ముద్రితప్రతిలోని నాల్గవ యాశ్వాసమునకు బదులుగా నీ తాళపత్రప్రతియం దున్న గ్రంధము నాల్గవ యాశ్వాసముగా నుండఁదగుననియు. ముద్రిత ప్రతియందలి నాల్గవ యాశ్వాస మైదవయాశ్వాసము గాఁదగుననియు నిశ్చ యింపవలసి యున్నది. అట్లు కాదేని గ్రంథమునకు వీరభద్రవిజయమను పేరు సార్థకముగాకపోఁగాఁ గుమారసంభవమని పేరుపెట్టవలసియుండును. ముద్రిత ప్రతియందలి నాల్గవ యాశ్వాసమును దీసివైచినచోఁ దక్కిన గ్రంధములో వీరభద్రప్రశంసయే యుండదు ముద్రితప్రతి నాల్గవ యాశ్వా సములోని పద్యములు నీరసములుగా నున్నవని శ్రీకవిగా రనుచున్నారు. కాని నా కట్లు తోఁచుటలేదు. భాగవతములోని కవిత్వమునుబట్టి చూచినప్పు డిది కొంత నీరసముగాఁ గనుపట్టినను, వీరభద్రవిజయమందలి తక్కిన భాగములతోఁ బోల్చి చూచినప్పుడిది నీరసముగాఁ గాన్పింపదు."]

[కవితరంగిణి సం. 6, పుటలు. 193, 194]

ఈ కవియొక్కయు భాగవతమును పూరించిన యితరకవులయొక్కయు శైలి తెలియుటకయి కొన్ని పద్యము లుదాహరించి యీ చరిత్రమును ముగించుచున్నాను.

౧. బమ్మెరపోతరాజు - భాగవతము.

ఉ. త్రిప్పకుమన్న మా మతము దీర్ఘములైన త్రివర్గపారముల్
దప్పకుమన్న నేఁడు మన దైత్యవరేణ్యునిక్రోల మేము మున్
జెప్పినరీతిఁగాని మఱిచెప్పకుమన్న విరోధిశాస్త్రముల్
విప్పకుమన్న దుష్టమగు విష్ణుచరిత్ర కథార్థజాలముల్ - సప్తమ స్కంధము.

ఉ. పుణ్యుఁడు రామచంద్రుఁ డటుపోయి ముదంబునఁ గాంచె దండకా
రణ్యముఁ దాపసో త్తమశరణ్యము నుద్ధతబర్హిబర్హలా
వణ్యము గౌతమీవిమలవాఃకణపర్యటన ప్రభూతసా
ద్గుణ్యము నుల్లసత్తరునికుంజవరేణ్యము నగ్రగణ్యమున్.

నవమస్కంధము.

వీరభద్ర విజయము

శా ఏరా దక్ష ! యదక్షమానస ! వృథా యీ దూషణం బేలరా ?
ఘోరీ ! పాపము లెల్లఁ బో విడువురా యుగ్రాక్షుఁ జేపట్టురా
వైరం బొప్పదురా శివుం దలఁపురా వర్ణింపురా రాజితోం
కారాత్మం డగు నీలకంఠుఁ దెగడంగా రాదురా దుర్మతీ ! ఆ. ౧.

శా. వీరాంభోనిధి నేఁడు మీ యలుకకు న్వీరెంతవారయ్య స
త్కారుణ్యంబునఁ గాతుగాక యని యా కష్టాత్ములం బోరిలోఁ
గారింపం గబళింప నీ ప్రమథుఁ డొక్కండైనఁ జాలండె దు
శ్చారు ల్దివ్యులు వీరి నెన్నక మదిన్ సైరించి రక్షింపవే. ఆ. ౪

౨. గంగన - పంచమస్కంధము.

మ. పటుతాటంకరథాంగయుగ్మమునకుం బల్మాఱు భీతిల్లుచుఁ
నటనం బందెడు కన్నుమీనములలో నాపన్నలీలామహో
త్కటభృంగావళితో ద్విజావళిలసత్కాంతి న్విడంబించు మా
రటకాసారముఁబోలి నెమ్మొగము దా రంజిల్లు నత్యున్నతిన్.

మ ధనవంతుండగు మానవుండు గడఁకన్ ధర్మోపకారంబులన్
ఘనతం జేయకయుండెనేని యమలోకంబందు సూచీముఖం
బను నా దుర్గతిఁబట్టి త్రోచి యిది కాపై యున్నభూతం బటం
చును బాశంబులఁ బట్టి కట్టి వడితో నొప్పింతు రత్యుగ్రులై. ఆ. ౨.

౩. ఏర్చూరిసింగన, షష్ఠస్కంధము.

మ. కనియెఁ బ్రాహ్మణుఁ డంత్యకాలమున వీకన్ రోషనిష్ఠ్యూతలం
ఘనపీనోద్ధవికాసవక్త్రవిలసద్గర్వేక్షణోపేతులన్
జనసంత్రాసకరోద్యతాయతసుపాశశ్రేణికాహేతులన్
హననవ్యాప్తివిభీతులఁ ముపుర నాత్మానేతలన్ దూతలన్.

ఉ. నెట్టనఁ బాపకర్మమున నేరమి చేసితి రేమి చెప్ప మీ
పుట్టిననాఁటనుండియును బుద్ధులు చెప్పి జగంబు లేలఁగాఁ
బట్టము కట్టి పెంచిన కృపానిధి బ్రహ్మకళావిధిజ్ఞుఁ జే
పట్టక గుట్టు జాఱి సిరిపట్టునఁ దొట్టిన పొట్టక్రొవ్వునఁ.

౪. వెలిగందలనారయ, ఏకాదశ ద్వాదశస్కంధములు.

ఉ. మూఁకలు గూడి యాదవులు ముందటఁ బెట్టుక యార్చి నవ్వుచున్
బోకలఁ బోవుచుఁ మునిసమూహము కొయ్యన సాగి మ్రొక్కుచుఁ
బ్రాకట మైన యీ సుదతిభారపుగర్భమునందుఁ బుత్రుడో
యేకతమందు బాలకియొ యేర్పడఁ జెప్పు డటన్న నుగ్రులై.

ఏకాదశస్కంధము

చ. మృతియును జీవనంబు నివి మేదినిలోపల జీవకోటికిఁ
సతతము సంభవించు; సహజం బిది చోరహంతాశసర్పసం

హతులను దప్పి నాఁకటను బంచత నొందెడునట్టి జీవుఁడున్
వెతలను బూర్వకర్మభవవేదన లొందుచుఁ గుందు నెప్పుఁడున్.

ద్వాదశస్కంధము.

బమ్మెరపోతరాజు నైజామురాజ్యములోని రాచకొండసంస్థానమునకు ప్రభు వగు సర్వజ్ఞసింగమనాయని యాస్థానమునకుఁ బోయి యాతని యిష్టాను సారముగాఁ గవిత్వము చెప్పినందునకుఁ బోతరాజప్రణీతమయిన భోగినీ దండకము సాక్ష్య మిచ్చుచున్నది. ఈ దండకము సర్వజ్ఞ సింగమనాయఁ డుంచుకొన్న వేశ్యవిషయమయి చెప్పఁబడినది. దాని కవిత్వ మించు మించుగా భాగవతమును బోలి యుండును. ఈ సర్వజ్ఞ సింగమనాయఁడు ౧౪౨౨ వ సంవత్సరము మొదలుకొని ౧౪౪౭ వ సంవత్సరమువఱకును విజయనగరాధీశ్వరుఁడుగా నున్న ప్రౌఢదేవరాయనితో సమకాలికుఁడు. భోగినీదండకములోని కొంతభాగము నిందు వ్రాయుచున్నాను—

కామానలజ్వాలల న్వేఁగి చింతాభరభ్రాంతయై యున్న యింతిం
బరీక్షించి తన్మాత మాయాపరాభూతజామాత మిథ్యానయోపేత
విజ్ఞాతనానావశీకారమంత్రౌషధవ్రాత లోకైకవిఖ్యాత వారాం
గనాధర్మశిక్షాధిసంఖ్యాత సమ్మోహితానేక రాజన్యసంఘాత వా
చాలతాబద్ధనానామహాభూత యేతెంచి కూతుఁన్ బరీక్షించి నీతి
న్విచారించి బుద్ధి న్వివేకించి బాలన్ మిళత్కుంతలవ్రాతఫాలన్
గరాంభోజరాజత్కపోలన్ సముందోష్ణనిశ్వాసతాలన్ విపర్యస్త
సన్యాసచేలన్ మహాందోళనప్రేంఖితస్వర్ణడోలన్ మృగేంద్రావ
లగ్నన్ దయావృష్టిమగ్నన్ మనోజాగ్నిభగ్నన్ . . .. ... ...
విలోకించి లోనం బరాయత్తయై చిత్తజాతాసిధారాచలచ్చిత్తయై
విన్నయై ఖిన్నయై భిన్నయై యున్న భావంబుభావించి నెయ్యంబు గావించి
బాలాజితత్వంబు మేలా విచారింపవేలా వినోదింపనేలా వయోధర్మ
మున్ రిత్తగాఁ బుచ్చ సీవృత్తికి న్మెత్తురే వత్తురే కాముకుల్

డాయఁ గాయంబు విద్యున్నికాయోపమేయంబు ప్రాయంబు ధారాధరచ్ఛాయ మెన్నే నుపాయంబులన్ విత్త మాయత్తముం జేయుమా రిక్థవారంబు వేరంబు గా దీ విచారంబు వంశానుచారంబు సంసారసారంబు లాభాధికారంబు........

దండకము తుద నీక్రింది పద్యము చేర్పఁబడి యున్నది—

ఉ. పండితకీర్తనీయుఁడగు బమ్మెర పోతన యాసుధాంశుమా
ర్తాండకులాచలాంబునిధితారకమై విలసిల్ల భోగినీ
దండకము రచించె బహుదానవిహర్తకు రావు సింగభూ
మండలభర్తకు న్విమతమానవనాథమదాపహర్తకున్.

చిలుకూరి వీరభద్రరావుగారు ౧౯౧౬ వ సంవత్సరమునందుఁ ప్రకటించిన యాంధ్రుల చరిత్రము మూఁడవభాగమునందు "ఈపై నుదాహరింపఁబడిన పద్యము బమ్మెరపోతన రచించినది గాక మఱియొకరు రచించినట్టు "పండితకీర్తనీయుఁ డగు బమ్మెరపోతన" యని ప్రథమ పురుషములో నుడివిన పలుకే సాక్ష్య మిచ్చుచున్నది. పండితకీర్తనీయుఁడ నని బమ్మెర పోతనవంటి భక్తాగ్రేసరుఁడగు కవి యాత్మ శ్లాఘనీయమగు విశేషణము వ్రాసికొనునా? యని సంశయింపఁదగి యున్నది" అని వ్రాసిరి. భోగినీ దండకము బమ్మెర పోతరాజకృతము కా దని చూపఁదలఁచినవారయి తమ యభిప్రాయమును సాధించుట కయి వీరభద్రరావుగారు రెండు హేతువులను జూపిరి. వానిలో నొకటి పద్యములో బమ్మెర పోతన యని ప్రథమ పురుషములో నుడువుట, రెండవది పండితకీర్తనీయుఁడని యాత్మశ్లాఘన ముండుట. ఈ రెండును హేతువు లని చెప్పఁదగినవే కావు. కంఠోక్తిగాఁ జెప్పఁబడిన యంశమును కా దని కొట్టివేయుటకు నమోఘములైన ప్రబల హేతువు లుండవలెను గాని దుర్బలములయిన హేత్వాభాసములు పనికిరావు. కవులు తమ్ముఁగూర్చి ప్రథమపురుషములోఁ జెప్పుకొనుట సర్వసాధారణ మని భాషాజ్ఞానము గల బాలురకు సహితము తెలియును. ఈ క్రింది యుదాహరణములను జూడుఁడు

సీ. తనకులబ్రాహ్మణు..................నిత్యసత్యవచను, మత్యమరాధిపా
చార్యు సుజను నన్నపార్యుఁ జూచి''

అని భారతాదిపర్వములో నన్నయభట్టారకుఁడు తన్నుఁగూర్చి 'నన్నపార్యు' నని ప్రథమపురుషములోఁ జెప్పుకొనలేదా ?

''ఎఱ్ఱనార్యుండు..........అరణ్యపర్వశేషము పూరించెఁ గవీంద్ర కర్ణపుట పేయముగాఁ''

అని భారతారణ్యపర్వాంతమున నెఱ్ఱాప్రెగడ తన్నుఁగూర్చి ''యెఱ్ఱనార్యుఁడు పూరించె'' నని ప్రథమపురుషములోఁ జెప్పుకోలేదా ? ఎవ్వరెవ్వరినో చెప్ప నేటికి ? బమ్మెరపోతన్ననే చూతము.

ఉ. ''ఇమ్మనుజేశ్వరాధముల కిచ్చి పురంబులు వాహనంబులుఁ
సొమ్ములు కొన్ని పుచ్చుకొని సొక్కి శరీరము వాసి కాలుచే
సమ్మెటవ్రేటులం బడక సమ్మతి శ్రీహరి కిచ్చి చెప్పె నీ
బమ్మెరపోతరా జొకఁడు భాగవతంబు జగద్ధితంబుగఁ.''

అని భాగవతప్రథమస్కంధములో బమ్మెర పోతనామాత్యుఁడే తన్నుఁ గూర్చి ''బమ్మెరపోతరా'' జని ప్రథమపురుషములోఁ జెప్పుకొనలేదా ? బమ్మెరపోతరా జని ప్రథమపురుషములోఁ నుడువుటచేత భాగవతము పోతన రచించినది గాక మఱియొకరు చెప్పినదని చెప్పి కంఠోక్తిగాఁ జెప్పఁబడిన దాని నంతను వీరభద్రరావుగారు కొట్టివేయుదురా ?

ఇఁకఁ బండితకీర్తనీయుఁ డన్నదానిలోఁ గలదన్న యాత్మశ్లాఘయు నిటువంటి దుర్బలమైన హేతువే. భోగినీదండకములోని రచనభాగవత రచనమువలెనే పండితశ్లాఘాపాత్రముగా నుండలేదా ? ఉన్న దానిని జెప్పు కొనుట సత్యమే యగును గాని యాత్మస్తుతి కానేరదు. ఒకవేళ నిందుఁ గొంచెము స్తుతి యున్నదనుకొన్నను పయి పద్యములో ''నిత్యసత్యవచను మత్యమరాధిపాచార్యు'' నని నన్నయభట్టు చేసికొన్నదానిలో నిది యెన్నవ పాలు ? ''కవీంద్రకర్ణపుటపేయముగా'' నని యెఱ్ఱాప్రెగడ చెప్పుకొన్న దానిలో నింతమాత్రపు స్తుతి లేదా ? పోతరాజు చెప్పిన పద్యములోనే

“శ్రీహరి కిచ్చి చెప్పె నీబమ్మెర పోత రా జొకఁడు భాగవతంబు జగద్ధితంబుగ” ననుచోట నించుక యాత్మ స్తుతియు, “ఇమ్మనుజేశ్వరాధముల కిచ్చి” యనుచోట నించుక పరనిందయు, కనఁబడుచుండలేదా ?

బమ్మెర పోతరాజువంటి భక్తాగ్రేసరుఁ డొకరా జుంచుకొన్న వేశ్యనుగూర్చి దండకము చెప్పునా ? యన్నది మూఁడవ హేతువు ! ఈ దండకము చెప్పు నాటికి పోతన్న భక్తాగ్రేసరుఁడు కాఁడు. చంద్రోపరాగపర్వదినమున గంగాస్నానమునకుఁ బోయినప్పుడు రామభద్రుఁడు స్వప్నములో సాక్షాత్కరించి శ్రీమద్భాగవతమును దెనిఁగింప నియోగించినతరువాత నీతనివిష్ణుభక్తి యారంభ మైనది. తోడనే యితఁడు భాగవతరచన కుపక్రమించెను.

పోతన బాల్యమునుండియు విశేషవిత్తవంతుఁడు కాకపోవుటచేతను, సహజ పాండిత్యము గలవాఁ డగుటచేతను, నిరుపమానకవిత్వ నైపుణి గలవాఁ డగుటచేతను, రాజాశ్రయమును సంపాదించి తన పాండిత్యమును బ్రకటించి విత్త మార్జించి పేరుపొందవలె నన్నయపేక్షతో మహావిద్వాంసుఁడని పేరొంది సమీపరాజ్యపదస్థుఁడై యున్న సింగమనాయని దర్శించుటకయి యౌవనారంభదశలోఁ బోయి యుండును ఆ ప్రభువు తన ప్రియురాలిపైని దండకమును జెప్పి నీ కవననైపుణిని జూపు మని నియమించినప్పుడు యువజనస్వాభావికదౌర్బల్యముచేతనో, దాక్షిణ్యముచేతనో పాండిత్యప్రకట నాభిలాషచేతనో రాజు కోరిక చెల్లించి యుండును.

భోగినీదండకము పోతనవిరచితము కా దని చెప్పుటయే మనస్సులో నా కిష్ట మయినను భాగవతకవిత్వముతో భోగినీదండకకవిత్వమును బోల్చి చూచి నప్పుడు నా మనస్సట్లు వ్రాయుట కొప్పినది కాదు మొట్టమొదట భోగినీదండకమును ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారములోఁ జూచినప్పుడు నా కత్యాశ్చర్యము కలిగినది. ఆవల కెవ్వరైనను పోతన్న భోగినీదండక మును జేసె నని చెప్పుచు వచ్చినప్పుడు నేను వారిని నమ్మక యబద్ధమని నిరాకరించుచు వచ్చితిని. దండకమును బ్రత్యక్షముగా జూచినతరువాతను దాని కవిత్వము పోతనదే యని దృఢముగా తోఁచినతరువాతను పరు లాతని

పేరు పెట్టి కల్పించి యుందురని నమ్ముటకుఁ దగిన హేతువులు కనఁబడక పోవుటచేతను నేను సత్యమని నమ్మినదానిని నా కవుల చరిత్రములోఁ బ్రకటింపవలసినవాఁడనైతిని. నా పుస్తకము ప్రకటింపఁబడఁగానే యప్పుడు ప్రభుత్వము చేయుచుండి యిప్పుడు కీర్తిశేషులైన వేంకటగిరిరాజుగారు సర్వజ్ఞ సింగమనాయఁడు వేశ్యాగమనదోషదూషితుఁడు గాని యకళంక చరిత్రుఁడయిన విద్వాంసుఁడనియు, నట్టి మహనీయునిపయిని వేశ్యా సంపర్కదోషమారోపించుట తమ కవమానకరమనియు నాపేర వ్రాసిరి. ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారములో నున్న భోగినీదండకమును దెప్పించి చూచి యా విషయమునఁ దృప్తిపొందవలసినదని నేను బదులు వ్రాసితిని. అందుపైని వారు తమ పురాతనగ్రంథములను వెదకింపఁగాఁ వానిలోఁ దమ యాస్థానమునందే యా గ్రంథము దొరకినదని కొంతకాలమునకు మరల వ్రాసిరి. ఎటువంటి మహాపురుషులకును నవస్థాభేదము లుండును. ప్రథమావస్థలోని దోషములు తదనంతరావస్థలయందు నివారణము లగును ప్రథమదశలోని యనుభవమునుబట్టి కడచిన ప్రమాదమునకు పశ్చాత్తప్తుఁ డయి పోతనార్యుఁడు ముందు రాజాస్థానములకుఁ బోఁగూడదనియు, రాజు లకుఁ గృతులియ్యఁగూడదనియు నియమము చేసికొని యుండును కర్ణాట రాజులచేత నెప్పుడయిన నవమానితుఁడయి పోతన్న రాజులను ద్వేషించువాఁ డయియు నుండవచ్చును. భ్రమప్రమాదములు మనుష్యస్వభావము లగుట చేత నెటువంటి విద్వాంసులకును నొకానొకప్పుడు ప్రమాదము సంభవింప వచ్చును. అటువంటిది పూర్ణచంద్రునిలోని కళంకమువలె మహనీయుల కీర్తిచంద్రికకు మాలిన్యము తీసికొని రాఁజాలదు.

శేషాద్రిరమణకవులు కృష్ణాపత్రికలో నెల్లూట్ల నారాయణకవిని గూర్చి వ్రాయునప్పుడును, తత్పూర్వమున, నెల్లూట్ల నృసింహరావుగారిని గూర్చి వ్రాసినప్పుడును వారు బమ్మెర పోతరాజువంశమువారని వ్రాసి యున్నారు.

ఈ కథ యెంతమాత్రమును విశ్వాసార్హమయినది కాదు. బమ్మెర పోతనా మాత్యుని సంతతివా రాఱువేలనియోగిశాఖవారు, నెల్లూట్ల వారు గోలకొండ

వ్యాపారిశాఖవారు; బమ్మెరవారు శైవులు; నెల్లుట్లవారు వైష్ణవులు. పదునాఱవ శతాబ్దమునకుఁ గడపటిభాగముననో, పదునేడవశతాబ్దారంభముననో యుండిన నారాయణకవిపూర్వులు మొదట రాజభండారమువా రయి తరువాత నెల్లుట్లవా రయిరఁట! ౧౬౩౬ వ సంవత్సరప్రాంతమునం దుండిన యజ్జరపు పేరయ లింగము (ఒడయనంబివిలాసకర్త) బమ్మెర పోతరాజునకు నాలవతరమువాఁ డయిన కేసనకవి యొక్కకూఁతు రైన యెల్లమను వివాహమాడుటచేతఁ బోతన సంతతివారు పదునేడవ శతాబ్దారంభమునందుఁ గూడ నెల్లుట్లవారుగా మాఱక బమ్మెరవారుగానే యుండిరనియు, శైవులతో సంబంధములు చేసికొనుచుండిరనియు నొడయనంబివిలాసములోని యీ క్రింది పద్యము వలన స్పష్టముగాఁ గనఁబడుచున్నది —

ఉ. బమ్మెరవంశమందునను బ్రౌఢసరస్వతిపద్దు గాంచి తా<br>
నెమ్మెదలిర్పఁ గేసనకవీశ్వరుఁ డప్పమనామసాధ్వియం<br>
దిమ్మహిఁ గూర్మిఁ గన్న సుత యెల్లమయందును దేరయాఖ్యుఁడ<br>
సమ్మతిఁ గంటి వీరనరసమ్మను గంగనమంత్రియుగ్మమున్.

బమ్మెరపోతనామాత్యుఁడు భాగవతరచనాప్రారంభకాలముననే బమ్మెరను విడిచి యేకశిలానగరమును జేరెను. బమ్మెరవారికిని నెల్లుట్లవారికిని కౌండిన్యగోత్రసామ్య మొక్కటి దక్క వేఱు సంబంధ మేదియు లేదు. పదునాఱవ శతాబ్దాంతమునందు బమ్మెరప్రౌఢసరస్వతిపుత్రుఁడు కేసన్న రచియించిన హైమవతీవివాహోవతారికవలన సహిత మీ యంశములు దేటతెల్ల మగును.

# నిశ్శంక కొమ్మన్న

ఈ కవి శివలీలావిలాసమును రచించెను. ఈ గ్రంథములోని మొదటి రెండాశ్వాసములు మాత్రమే శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారి యొద్ద నున్నవి. అందు మొదటి రెండవ పత్రములు లేవు: మిగిలిన పత్రములు సహితము మిక్కిలి శిథిలము లయి యున్నవి. ఈ కవిచే శివలీలా విలాసము వేమవీరభద్రారెడ్ల తమ్ముఁడును నల్లాడరెడ్డి పుత్రుఁడును నయిన దొడ్డారెడ్డి కంకితము చేయఁబడినది. పుస్తకావతారికయం దల్లాడరెడ్డి పెదకోమటి వేమారెడ్డిని, గజపతిని జయించినట్టు చెప్పఁబడినది. కాటయవేముని యనంతరమున రాజమహేంద్రవర రెడ్డిరాజ్యము నాక్రమించుకోవలెనని యావల కొండవీటిరాజయిన పెదకోమటివేమారెడ్డియు నీవల కటకాధీశ్వరుఁ డైన గజపతియుఁ బ్రయత్నించిరి. కాని వా రల్లాడరెడ్డియొక్క నిరంతర జాగరూకతవలనను పరాక్రమమువలనను విఫలప్రయత్ను లయి పరాజితులై వెనుక మరలవలసిన వా రయిరి. వీరభద్రారెడ్డి రాజయిన తరువాత నాతని యగ్రజుఁడైన వేమారెడ్డియు ననుజుఁడయిన దొడ్డారెడ్డియు మహాబాహుపరాక్రమశాలు లయి శత్రురాజులతో యుద్ధములు చేసి సోదరుని రాజ్యమును పెంపుచెందించిరి. ఈ యిరువురి పరాక్రమములును కాశీఖండము నం దిట్లు వర్ణింపఁబడెను

మ. కొనియెం గంచుకముల్ సముద్భటనటద్ఘోటీభటప్రౌఢిఁగై
కొనియె న్వేడుక జీడికోట యహితక్షోణీశు లల్లాడఁ జే
కొనియె న్మాకవరంబు వీఁక మదవద్ఘోరారిసంహారియై
ఘనుఁ డల్లాడమహీశు వేమన నిరాఘాటైకధాటీగతిన్.

శా. ఔరా! యల్లయరెడ్డి దొడ్డవసుధాధ్యక్షుండు ధాటీచమూ
భేరీభాంకృతిఘోర ఘోషమున నిర్భేదించె నొడ్డాది శృం
గారంకోటయు లోఁతగ ర్తయును నుద్ఘాటించె నత్యుద్ధతిన్
* క్షీరాంభోధితటంబున న్నిలిపె దిక్సీమాజయ స్తంభముల్.

వీరి తండ్రి యైన యల్లాడరెడ్డి భీమనరపాలకునిపుత్రియైన వేమాంబికను వివాహ మాడినట్లు శివలీలావిలాసములో నీ క్రింది పద్యమునఁ జెప్పఁ బడినది

మ. భరితశ్రీనిధి యొప్పుమీఱ రమణుఁడొప్పన్ జోళభ క్తిక్షితీ
శ్వరసూనుండగు భీమలింగమనుజేశశ్రేష్ఠుసత్పుత్రి భా
స్వరకారుణ్యదశాజనావనవిధాసంధాత్రి వేమాంబికన్
పరిణయించెం బతిభక్తిగౌరవదృఢవ్యాపారసత్యాంబికన్.

ఈ వేమాంబ యనవేమారెడ్డి దౌహిత్రి. అల్లాడభూపాలపుత్రుల కీ రాజ్యము పితృపితామహపరంపరాగత మయినది గాక వీరభద్రారెడ్డి భార్య (కాటయ వేమునిపుత్రి) యైన యని తల్లిమూలముననే లభించినదైనను

ఉ. తమ్ముని వీరభద్రవసుధాపవు విక్రమవీరభద్రునిన్
సమ్మదలీల రాజ్యభరణస్థితిఁ బట్టముగట్టి బాహువ
ర్గమ్మున వేమభూవరుఁడు వ్రాసె జగద్విజయప్రశస్తివ
ర్ణమ్ములు దిగ్ధురంధరసురద్విపకుంభవిషాణమండలిన్.

అని భీమేశ్వరపురాణములోఁ జెప్పినట్లే

ఉ. తేజ మెలర్ప నవ్వసుమతీధవశేఖరుఁడొప్పు సర్వధా
త్రీజనరక్షణక్రమధురీణుని దమ్ముని వీరభీమణిన్
రాజమహేంద్రనామనగరంబునఁ బట్టము గట్టె నంచిత
శ్రీజయకీర్తిసౌరభవిశేషవిజృంభితదిక్సమేతుఁడై.

* [క్షీరంభోధితటంబునన్—సరియైన పాఠము. క్షీరాంభోధి యనఁగా చిల్కా సముద్రము.]

అని శివలీలావిలాసములోను, వేమభూపాలుఁడు తమ్ముఁడైన వీరభద్రుని దయదలంచి సింహాసనముపైనిఁ గూర్చుండఁ బెట్టినట్టు చెప్పఁబడినది. శివలీలావిలాసములోని యాశ్వాసాంతగద్య మిట్లున్నది

"ఇది శ్రీమదష్టభాషాకవితాప్రవీణ బుధజనస్తుత్య నిశ్శంక కొమ్మనా మాత్యప్రణీతంబయిన శివలీలావిలాసంబునందు"

శివలీలావిలాసము ౧౪౩౫వ సంవత్సరప్రాంతమునందు రచియింపఁబడి యుండును. అందుచేత నిశ్శంక కొమ్మనామాత్యకవి ౧౪౩౦వ సంవత్సరము మొదలుకొని ౧౪౭౦వ సంవత్సరప్రాంతమువఱకును కవియై యుండి యుండును. ఈ కవిచేఁ రచియింపఁబడినవీర మాహేశ్వరములోనివని యనేక పద్యము లాంధ్రపరిషత్పత్రికవారి యుదాహరణగ్రంధమునం దుదాహరింపఁబడి యున్నవి. ఈ శివలీలావిలాసమునకే వీరమాహేశ్వరమన్నది నామాంతరమో, యది వేఱు గ్రంథమో తెలియరాదు. గ్రంథము దొరకు వఱకును వీరమాహేశ్వరము ప్రత్యేకగ్రంథ మనియే భావింతము. కృతిపతి వంశజులు కొండవీటిరెడ్డివంశజులవలెనే దేసటివారు. ఇరువురును పంట కులమువా రయి దాయాదు లయి యుందురు. శివలీలావిలాసములో వీరు దేసటివా రయిన ట్లీ పద్యములోఁ జెప్పఁబడినది

ఉ. అందు జనించి మించిరి సమగ్రనిరూఢిఁ గ్రమక్రమంబువన్
మందరధీరు లాగతసమస్త (విచా) రులు సంతతప్రజా
నందనకార్యకారులు గుణస్ఫుటహారులు ధర్మరక్షణా
మందవిచారు లంగజితమారులు దేసటు లత్యుదారులై.

కొమ్మనామాత్యుని కవిత్వ మనర్గళధార కలదయి బుధజనమనోరంజకముగా నుండును. శైలి తెలియుటకయి యీతని గ్రంథములలోని పద్యములఁ గొన్నిటిని నిం దుదాహరించుచున్నాను

ఉ. శ్రీవిభుసెజ్జ మేదినికిఁ జెల్వగు పుట్టము దివ్యనవ్యర
త్నావళిమక్కపట్టు దివిజారులదుర్గము వాహినీపతుల్
భావముగట్టురావు బడబాజ్వలనంబున (వంటయిల్లు) నాఁ
గా విలసిల్లు నా వనధిగాథమహత్త్వము చెప్ప నొప్పగున్.

చ. వరయశుఁ డింకఁ గల్గుఁ గురువంశమునన్ జనమేజయుండు నాఁ
బరఁగి పరీక్షితాత్మజుఁడు పాయక యాతఁడు సర్పయాగ ము
ద్ధురమతిఁ జేయునప్పు డతిదుస్సహతద్దహనార్చులందు నో
దరహితపుత్రపౌత్రసహితంబుగ ద్రగ్గుఁడు మీర లందఱున్.

ఉ. ఆశ్వముజాడ గానక భయంపడి యా సగరాత్మనందనుల్
నిశ్వసనాహుతిన్ వదననీరజము ల్గమలంగ మొత్తమై
యాశ్వనురూపయానమున నక్కడ కక్కడ కేఁగి యేఁగి యీ
విశ్వవసుంధరాస్థితి గవేషణ చేసిరి పెక్కుభంగులన్.

ఉ. తన్మదిరాక్షివిభ్రమము దక్కక కన్నులఁ గ్రోలఁ జొచ్చెఁ బ్రే
మ న్మరుచే బిట్టడరి మానస మాకుల మయ్యె నిట్లు గ
న్ను న్మనసున్ వశంబులయి నూల్కొనమిన్ బహిరంతరంబులన్
దన్మఱచెం గరం బజుఁడు దందడి వేడ్కలు సందడింపఁగన్.

పయి పద్యములు శివలీలావిలాసములోనివి. ఈ క్రింది పద్యములు వీర మాహేశ్వరములోని వని యుదాహరింపఁబడినవి

సీ. పులుఁగురాయఁడు తమ్మికొలఁకులచెలికాని
బండిబోయనితోడిపాలివాఁడు
పన్నగస్త్రీలకుఁ బాలిండ్లపనవాస
మగడింప నోపిన మగలమగఁడు
దంభోళి కొకయీఁకఁ దాఁకు కానిక చేసి
యమృతంబుఁ దెచ్చిన యవఘళుండు

వినతముద్దులపట్టి వనధిచెంగట బోయ
పగకు నాఁకలి గొన్నభవ్యబలుఁడు
పక్షములు దాల్చి వచ్చిన పసిఁడికొండ
యట్టు విలసిల్లమేటి వాహనము గాఁగ
నడచె హతశేషదైత్యసైన్యములు దాను
నసురకులమర్దనుండు జనార్దనుండు.

సీ. తల్లిదండ్రులతోడితగు లొల్ల కుండియుఁ
దల్లిదండ్రులతోడి తగులు వలచి
కందర్పుమీఁది యక్కటికంబు చెల్లియుఁ
గందర్పుమీఁదియక్కటిక మొదవి
సంసారకేళిప్రసక్తి వోఁ దట్టియు
సంసారకేళిప్రసక్తి కలిగి
సగుణవిశేషయోజనము లభించియు
సగుణవిశేషయోజనము మరిగి
సగము పురుషుండు కంజాక్షి సగము గాఁగ
నర్ధనారీశ్వరాకృతి ననువుపఱిచి
హరుఁడు తల్లింగమధ్యంబునందు నుండి
హరివిరించుల కంతఁ బ్రత్యక్ష మయ్యె.

శా. ఆజ్ఞాసిద్ధికరంబు ముక్తిదము చిత్తానందసంధాయిశై
వజ్ఞానాంకురశిష్టబీజము ప్రభావప్రౌఢసంచిత్కళా
జిజ్ఞాసావిభవప్రదాయకము లక్ష్మీకారణం బూర్జితో
పజ్ఞామూలము భక్తలోకమునకుం బంచాక్షరం బిమ్మహిన్.

సీ. కమలజాండంబులు కందుకంబులు చేసి
యొండండ తాటింప నోపువారు
విలయవహ్నులఁ బట్టి వెస దండలుగఁ గ్రుచ్చి
యురమున ధరియింప నోపువారు

తివిరి సంహారభైరవుసైనఁ బొలివోవ
నొకమాత్ర వసి మాల్ప నోపువారు
కాలచక్రక్రియాఘటనంబు ద్రిప్పి యొం
డొకలాగు గావింప నోపువారు

ప్రమథవీరులు వివిధరూపములతోడ
హసన.........ద్వ్యలఘుగతులు
వెలయఁ గోటానకోటులు గొలిచి వచ్చి
రతఁడు హరుఁ గొల్వ నేతెంచునవసరమున.

సీ. కఱకుచీఁకటులమూఁకల నుగ్గు నూచగ
నఱిచి నూఱక ద్రాగు నెఱతనంబు
హొట్టేటిరాయనిబొళయంబు గదలించి
వాహ్యాళి గదలెడి వైభవంబు
క్రతుభాగములు తెచ్చి కైతప్పు గాకుండ
వేల్పుల కందించు వెరవుసొంపు
మూఁడుమూర్తులు దాల్చి మురువుతో జన్నంపు
వేదిపైఁ గొలువుండు విభ్రమంబు

నీక చెల్లు నొరుల నీతోడిసాటికిఁ
బేరుగ్రుచ్చి యెన్న లేరు జగతి
వశమె నిన్నుఁ బొగడ స్వాహావధూకుచా
భ్యున్నతప్రకాశ! యో హుతాశ!

## వెలిగందల నారయ

ఇతఁ డాంధ్రమహాభాగవతమునందలి యేకాదశ, ద్వాదశ స్కంధములను, దశమస్కంధోత్తరభాగములోని చివఱిభాగమును రచించెను. స్కంధముల చివఱి గద్యలనుబట్టి యితఁడు పోతనామాత్యుని శిష్యుఁడైనట్లు తెలియు చున్నది. ఇతఁడు దశమస్కంధోత్తరభాగము చివఱి గద్యలో మాత్రము తన గురువునందలి గౌరవముచే, పోతనామాత్యుఁడే వ్రాసినట్లు చెప్పెను.

భాగవతమును పూర్తిగా పోతన రచించెననియు, నందలి భాగములు కొన్ని శిథిలము లగాఁగా, నారయాదులు పూరించిరనియుఁ గొంద అందురు. అది సరికాదు. పోతన విడిచిన భాగమునే యీతఁడు రచించెనని తెలియుచున్నది. హరిభట్టు రచించిన పద్యములు కొన్ని యీతని ఏకాదశ, ద్వాదశస్కంధము లలోఁ గానవచ్చుచున్నవి. లేఖకుల ప్రమాదమున నవి యిందు చేరి యుండును.

## సదానందయోగి

ఇతనిం గూర్చి 'ఆంధ్ర కవితరంగిణి' లోఁ గొంత వ్రాయబడిఁ యున్నది. దానిని బట్టి యీతఁడు నవ్యతంభోగి శ్రీ సదానందయోగి' అను మకుటముతో నొక శతకమును వ్రాసినట్లును, ఇతఁడు ఫణిభట్టునకు గురువై యుండ వచ్చునని యూహింపవీలున్నట్లును తెలియుచున్నది. శతకకవుల చరిత్ర వ్రాసిన శ్రీ వంగూరి సుబ్బారావుగారు నిట్లే యూహించినారు.

# గంగనార్యుఁడు

ఈ కవి భాగవతమునందలి పంచమస్కంధము నాంధ్రీకరించెను. ఇతఁడు తన గ్రంథభాగమును శ్రీకృష్ణున కంకితము చేసెను. ఆశ్వాసాంతగద్యలలో 'ఇది శ్రీ సకల సుకవిజనానందకర బొప్ప నామాత్యపుత్ర గంగనార్య ప్రణీతంబైన-' అని మాత్రము చెప్పియుండుటచే నితనిం గూర్చిన విశేషము లేమియును దెలియరాకున్నవి. ఇతఁడు పోతన, నారయలకుఁ దర్వాతి వాఁడనియు, ఏర్చూరి సింగన సమకాలికుఁడనియు, నిజాం రాష్ట్ర నివాసి యనియు 'ఆంధ్ర కవితరంగిణి' లోఁ గలదు. [సం. 6 పుట 21]

పంచమస్కంధమును దాను పూర్తిగా వ్రాసినట్లు గంగనార్యుఁడు చెప్పి కొనినను, పంచమాశ్వాసమునఁ బోతనామాత్యుని కవిత చాలగా నున్నదని 'ఆంధ్ర కవితరంగిణి' కారు లభిప్రాయపడుచున్నారు.

(సం. 6 పుట. 212)

# శ్రీధరుఁడు

శ్రీధరుఁ డొక ఛందస్సును రచించినట్లు తెలియుచున్నది. లక్షణగ్రంథము లలో శ్రీధర ఛ్ఛందస్సులోని పద్యములు, దీని ప్రస్తావన కానవచ్చుచున్నవి. అప్పకవి శ్రీధరుని బేర్కొనుటచే నితఁ డప్పకవికంటెఁ బూర్వుఁడనవలెను. శ్రీధరచ్ఛందస్సునకు పిన్నయ సోమభూపాలుఁడు కృతిపతియని యొక పద్యము వలనఁ దెలియవచ్చుచున్నది. గౌరన తన లక్షణదీపికలో శ్రీధర ఛ్ఛందస్సునుండి యుదాహరించినట్లొక వ్రాఁతప్రతి వలనఁ దెలియవచ్చు చున్నది. అది వాస్తవమైనచో నితఁడు 14 శతాబ్ది చివర నుండెనని తలంప వచ్చును. లేదా 15 శతాబ్దిలో నుత్తరార్థమున నుండెనని యనుకొనవచ్చును.

## కృష్ణమాచార్యుఁడు

వైష్ణభక్తాగ్రగణ్యుఁడగు నీకవి సింహాచలక్షేత్ర నివాసి; సింహగిరి వరాహ నరసింహస్వామి పేర పెక్కు సంకీర్తములను, వచనముల నీతఁడు రచించెను. ఇతఁడు ప్రథమాంధ్ర వచనకవి. ఇతఁడు రెండవ ప్రతాపరుద్ర చక్రవర్తి కాలమున నుండెనఁట ; పదునైదవ శతాబ్దిలో నుండిన శ్రీ తాళ్లపాక అన్నమయ్యగా రీతనిని పేర్కొనియుండుటచే నితఁడు ౧౪వ శతాబ్దిలో నుండెననుట సత్యము. కృష్ణమాచార్యుని సింహగిరి నరహరి వచనములు ప్రసిద్ధములు. ఈ కవిని గూర్చి శ్రీ నిడదవోలు వేంకటరావుగారు పార్థివ-భాద్రపద భారతిలో వివరముగాఁ దెల్పియున్నారు. ఈతఁడు రచించిన ప్రసిద్ధమైన 'జో అచ్యుతానంద ! జోజో ! ముకుందా !' అను లాలిపాటను శ్రీ తిమ్మావజ్ఝల కోదండరామయ్యగారు 1948 సెప్టెంబరు 8వ తేదీ ఆంధ్ర వారపత్రికలోఁ బ్రకటించి యున్నారు.

## అయ్యలరాజు తిప్పయ్య

ఈ కవి అయ్యలరాజు రామభద్ర కవికిఁ బ్రపితామహుఁడని యనుచున్నారు. ఇతఁడు (ఒంటిమెట్ట) రఘువీర శతకమును రచించెను. ఈ కవి గృహ నామము రాయకవివారైనట్లు తెలియుచున్నది. ఈతఁడు కర్ణాటక మండలాధిపతి యొద్ద ఆస్థానకవిగా నుండినట్లు శతకమునందలి యొక పద్యము వలన దేలుచున్నది. ఆ ప్రభువు సంగమవంశములోనివాఁడైన రెండవ దేవరాయలై యుండునని 'ఆంధ్ర కవితరంగిణి' (సం. 6 పుట. 13) లోఁ గలదు.

# ఏర్చూరి సింగన

ఇతఁడు భాగవతమునందలి షష్ఠస్కంధమును రచించి శ్రీకృష్ణున కంకిత మొనర్చెను. ఇతఁడు తన వంశమునకు మూలపురుషుఁ డేర్చూరి యెఱ్ఱన ప్రెగ్గడ యని చెప్పికొన్నాఁడు. ఇతఁడు కవిత్రయములోని యెఱ్ఱాప్రెగ్గడ కంటె భిన్నుఁడు. ఏర్చూరి యెఱ్ఱనకవిగాఁ బ్రసిద్ధుఁడు కాఁడు. షష్ఠ స్కంధమునంతను ఇతఁడు రచింపలేదనియు, పోతన రచింపఁగా శిథిలమైన షష్ఠస్కంధభాగములను పూరించెననియుఁ గొందఱు తలంచుచున్నారు. కొన్ని పద్యములు పోతన పద్యములవంటి విందుఁ గానవచ్చుచున్నవి. సింగనకవి కువలయాశ్వచరిత్రమను ప్రబంధమును గూడ వ్రాసెనని తెలియుచున్నది. అందలి పద్యములు కొన్ని పెదపాటి జగ్గన్న ప్రబంధ రత్నాకరమునఁ గానవచ్చుచున్నవి. కువలయాశ్వచరిత్రము లభింపలేదు.

# పిడుపర్తి బసవన - 1

ఇతఁడు పాలకురికి సోమనాథుని శిష్యుఁడైన శివరాత్రి కొప్పయ్యయ్యకు మనుమని మనుమఁడు ఇతఁడు క్రీ.శ. 1420 ప్రాంతమున జన్మించెనఁట. గురుదీక్షా బోధ, పిల్లనైనారు కథ, బ్రహ్మోత్తరఖండము మున్నగునవి. యీతని రచనలు. పద్యబసవపురాణకర్తయగు సోమనాథుని కీతఁడు తండ్రి. ఇతని ప్రోత్సాహముననే సోమనాథుఁడు పద్యబసవపురాణమును రచించెనఁట

## తాళ్లపాక అన్నయాచార్యులు

ఈతఁడు నందవరీక బ్రాహ్మణుఁడు; తిరుపతి నివాసి, శ్రీ వేంకటేశ్వరస్వామి భక్తుఁడు; ఇతనికి అన్నమాచార్యుఁడు; అన్నమయ్య, అన్నమయ్యంగారు అను పేర్లు ప్రసిద్ధములు. ఇతఁడు వైష్ణవమును పుచ్చుకొనెను. ఇతఁడు పెక్కు సంకీర్తనములను, శృంగారమంజరి, శృంగారలక్షణము, వేంకటేశ్వర శతకము మున్నగు గ్రంథములనురచించెను. ఈ శతకమునుండి పద్యములను పెదపాటిజగన్నాథకవి తన ప్రబంధరత్నాకరమున నుదాహరించి యున్నాఁడు. ఈతఁడు క్రీ. శ ౧౪౦౮ వ సం. న జన్మించి, ౯౫ సంవత్సరముల ప్రాయమున క్రీ. శ. ౧౫౦౩ లోఁ గీర్తిశేషుఁడయ్యెనని తెలియవచ్చుచున్నది. ఇతని నివాసము తొలుత కడపమండలములోని రాజంపేట తాలూకాయందలి తాళ్లపాక గ్రామ మనియు, ఆ గ్రామమును బట్టియే వీరి గృహనామ మేర్పడినదనియుఁ జెప్పుదురు.

## రేవణూరి తిరుమల కొండయాచార్యుఁడు

ఇతఁడు తాళ్లపాక అన్నయాచార్యుల కల్లుఁడు. శకుంతలా పరిణయకర్త రేవణూరి వేంకటాచార్యుల తండ్రి. శకుంతలా పరిణయగద్యను బట్టియే యితఁడు రామచంద్రోపాఖ్యానమను ప్రబంధమును వ్రాసినట్లు తెలియుచున్నది. ఆ గ్రంథ మిప్పుడు లభించలేదు.

## పిడుపర్తి నిమ్మనాథుడు

ఇతనికి నిమ్మయార్యుఁడనునది నామాంతరము ఇతని తండ్రి పినసోమయ్య. పద్యబసవపురాణకర్త పిడుపర్తి సోమనాథున కీతఁడు పెదతాత మనుమఁడు. ఇతనిని సోమనాథుఁడు తన పద్యబసవపురాణమునఁ బ్రశంసించి యున్నాఁడు. ఇతని రచనలేమో తెలియలేదు. ఇతఁడు 1390-1440 మధ్య నున్నవాఁడు. 'నిజలింగ చిక్కయ్యకథ' యీతని రచన యని ప్రాచ్యలిఖితపుస్తక భాండాగార పుస్తకపట్టికలోఁ గలదు. కాని యా నిమ్మనాథుఁడు పర్వత లింగయ్య పుత్రుఁడు; కావున నతఁడు వేఱు

## ప్రోలుగంటి చెన్నశౌరి

ఇతఁడు ప్రౌఢరాయల వద్ద దండాధికారిగా నుండిన తిప్పనకుఁ బ్రపౌత్రుఁడు; నాగశౌరి దేవమాంబలకుఁ బుత్రుఁడు; ఇతని గ్రంథము లేవియు లభింప లేదు. హరిభట్టు రచించిన నృసింహపురాణములో నీతని ప్రశంస కలదు. దానిం బట్టి యీతఁడు నరసింహపురాణమును ద్విపదకావ్యముగను, బాలభారత మును వచనకావ్యముగను సౌభరిచరిత్రమును యక్షగానముగను రచించినట్లు తెలియుచున్నది. ఈ కవి పదునైదవశతాబ్దియం దుత్తరార్ధమున నుండెనని చెప్పవచ్చును.

[పయి కవులం గూర్చిన చరిత్రములకు 'ఆంధ్ర కవితరంగిణి' ఆధారము.]

# గౌరన మంత్రి

ఈ కవి హరిశ్చంద్రోపాఖ్యానమును నవనాథచరిత్రమును ద్విపదకావ్యము లనుగా రచించెను. ఇతఁడు హరిశ్చంద్రోపాఖ్యానమునందుఁ దన్నుఁగూర్చి యిట్లు చెప్పుకొనియెను.

ద్వి. సింగనమాధవక్షితిపాలమణికి
మంగళమూర్తికి మంత్రియై జగతిఁ
బొగడొందు పెద్దనపోతరాజునకుఁ
దగిన తమ్ముఁడు యశోధనుఁ డెల్లమంత్రి
చెట్ట పట్టంగ నోచినభాగ్యవతికిఁ
జుట్టాలసురభికి సుందరీమణికి
ఘనుఁడు వల్లభమంత్రి గంగాంబ గోరి
కనిన పోచంబకు గారాబుసుతుఁడ
ధరణి నమాత్యరత్నంబనఁబరఁగు
ధరణిమంత్రికిఁ గూర్మితమ్ముఁడ ఘనుఁడ
భూతనాయకపాదపూజాభిరతుఁడ
గౌతమగోత్రుండ గౌరనాహ్వాయుఁడ.
సరససాహిత్యలక్షణ * విచక్షణుఁడ
బిరుదవిఖ్యాతిచేఁ బెం పొందువాఁడ

ఇచ్చట నెల్లమంత్రికిని పోచాంబకును బుత్రుఁ డయినట్లు చెప్పఁబడినను పుస్తకాంతమునందు

---

* [చక్రవర్తి — అని పాఠాంతరము, అదియే సరియైనది.]

మతిమంతుఁ డయ్యలమంత్రిపుంగవుని
సుతుఁడు గౌరనమంత్రి సుకవిశేఖరుఁడు
కవు లెన్న నుత్తరకథ రచియించె.

అని యయ్యలమంత్రిసుతుఁ డయినట్లు చెప్పఁబడి యున్నది. అయ్యల యని పొరపాటున నెల్లనకు మాఱుగా పడియుండును. మొదట నున్న దాని నయ్యల యని దిద్దుటకు వలనుపడదు. ఎల్లనామము రెండు చోట్లను సరిపడును. [గౌరనమంత్రి తండ్రి అయ్యలుమంత్రి; కాని, ఎల్లమంత్రి కాఁడు. 'యశోధనుఁ డెల్లమంత్రి' యనుచోట 'యశోధనుఁ డయ్యమంత్రి' అని యుండదగును. లక్షణదీపికయందలి 'ఆసీత్తస్యమహామాత్యః స్వామి కార్యధురంధరః, పోతరాజ ఇతి ఖ్యాతో రాజనీతివిశారదః॥ మంత్రి చూడా మణే స్తస్య సోదరస్యాయ్యలు ప్రభోః గౌరనార్య ఇతిఖ్యాత స్తనయో నయ కోవిదః।' అను శ్లోకములను బట్టియు నీయంశమే తెలియుచున్నది. '....శ్రీమదయ్యలు మంత్రిశేఖర రత్నాకర రాకాసుధాకర శ్రీగౌర నామాత్య విరచితాయాం ..' అను లక్షణదీపికాపరిచ్ఛేదాంతగద్యయు గౌరనతండ్రి అయ్యలుమంత్రి యనియే తెల్పుచున్నది.] ఈ ద్విపదకావ్యమును మొట్ట మొదట ముద్రింపించిన బ్రౌణుదొరవారీ కవి ౧౬౦౦ వ సంవత్సరప్రాంత మునం దుండినట్లభిప్రాయపడి తన పెదతండ్రియైన పెద్దనపోతరాజు సింగనమాధవక్షితిపాలునిమంత్రి యైనట్టు కవి చెప్పెను గాని యీ పుస్తక మునుబట్టి యీ మాధవక్షితిపాలుఁ డెవ్వఁడో యే కాలమునం దుండినవాఁడో తెలియదు. ఈ కవియే సంస్కృతమున 'లక్షణదీపిక' యను ఛందశ్శాస్త్రము నొకదానిని రచియించెను. దానియందీ మాధవక్షితిపాలుని గూర్చి యీ క్రింది శ్లోకములోఁ గొంత వివరముగాఁ జెప్పెను.

శ్లో. అస్తి ప్రశస్తావనిపాలమౌళిరత్నావళీరంజితపాదపీఠః,
రేచర్లవంశార్ణవపూర్ణచంద్రో మహాబల స్సింగయమాధవేంద్రః.

పయి శ్లోకమునందు రేచర్లగోత్రము చెప్పఁబడి యుండుటచేత నీ మాధవ క్షితిపాలుఁడు బేతాళరెడ్డి కెనిమిదవ తరమువాఁ డయిన రావు సింగయ

మాధవనృపాలుఁడని తేటపడుచున్నది ఈ మాధవనృపాలునికి పెద్దన సుతుఁడైన పోతరాజు మంత్రి యైనట్లు వెలుగోటి వంశచరిత్రమునం దుదాహరింపఁబడిన యొక శిలాశాసనములోని యీ క్రిందిశ్లోకముల వలనఁ దెలియవచ్చుచున్నది.

శ్లో. శ్రీమతో మాధవేంద్రస్య రాజ్యాంగైకధురంధరః,
మంత్రీ పోత నామాసీత్ సర్వశాస్త్రవిశారదః
య స్యామాత్యశిఖామణేః కవివరస్తోత్రైః పాత్రీకృతాం
మత్వా వాక్పతి రిద్ధనీతి సుభగాం వాగ్వైఖరీం లజ్జతే,
సో౽యం పెద్దనమంత్రి వర్యతనయః శ్రీపోతరాజో౽న్వహం
దేవస్యాస్య మహోపకారరచనాం సమ్య క్సుదాచీకరత్.

రాచకొండ కీశాన్యమూలను రెండు క్రోసుల దూరములోనున్న నాగార గ్రామమునందలి మాధవనృపాలుని భార్య శాసనములో

శ్లో. శాకాఖ్యే నిధివార్ధిరామశశిగే౽ప్యబ్దే ప్లవంగే శుభే
మానే చాశ్వయుజే రఘూద్వహపదే యోరాఘవీయాహ్వయామ్,
టీకా మర్థపటుప్రబోధఘటనా మాణిక్యపుష్పాంజలిం
కృత్వా౽రాజతి రావు మాధవనృపో రామాయణస్య శ్రియే.

అని శాలివాహనశకము ౧౩౪౯ ప్లవంగసంవత్సరాశ్వయుజమాసమువ నఁగా క్రీస్తుశకము ౧౪౨౭వ సంవత్సరమునందు రావు మాధవనరపాలుఁడు శ్రీమద్రామాయణమునకు రాఘవీయమను టీకను జేసెనని చెప్పఁబడినది. ౧౪౨౭వ సంవత్సరమునం దుండిన రావు మాధవనృపాలుని మంత్రిగా నుండిన పోతరాజుతమ్మునికుమారుఁడైన మన గౌరనకవి ౧౪౪౦-౫౦వ సంవత్సరప్రాంతములం దుండి యుండవలెను. అందుచేత గౌరనమంత్రి శ్రీనాథకవి యొక్క యంత్యకాలములోను, తదనంతరమునను నుండినందుకు సందేహము లేదు. [గౌరన పేర్కొనిన రావు సింగయ మాధవభూపాలునిఁ గూర్చి యభిప్రాయభేదము లున్నవి ఇతఁడు బేతాళరెడ్డి కెనిమిదవ తరము వాఁడని శ్రీ వీరేశలింగముపంతులుగారు రభిప్రాయపడినారు. శ్రీనాథుఁడు

పేర్కొనిన సర్వజ్ఞ సింగభూపాలుని కుమారుఁడనియు, అందువలన గౌరన కాలము 15 వ శతాబ్దిపూర్వార్ధమనియు 'నవనాథచరిత్ర' పీఠికలో శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు చెప్పియున్నారు. ఈ మాధవనృపాలుఁడు గౌరన పెదతండ్రి మంత్రిత్వమును నెఱపిన మాధవనృపాలునకుఁ బితామహుఁడని శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు భైరవకవికృత 'శ్రీరంగమాహాత్మ్యము' పీఠికలోఁ దెల్పియున్నారు. వెలుగోటివంశ చరిత్రమునం దుదాహరింపఁబడిన (ఉమామహేశ్వర) శాసనమునందలి 'శాకాఖ్యే' అను శ్లోకమునఁ బేర్కొనఁబడిన మాధవనృపాలుఁడు తాతయు, నాగారవు మాధవనృపాలుఁడు మనుమఁడు నగుదురనియుఁ ఉమామహేశ్వర శాసనకర్తయగు మాధవ నృపాలుని యొద్దనే పోతరాజు క్రీ శ ౧౩౭౭ ప్రాంతమున మంత్రిగా నున్నందున, నాతని తమ్ముని కుమారుఁడగు గౌరనమంత్రి ౧౩౮౫ మొదలు ౧౪౪౫ వఱకు నుండి యుండునని విశ్వయింపఁదగియున్నదని శ్రీ చాగంటి శేషయ్యగారు [ఆంధ్ర కవితరంగిణి' లో [సంపుటము 4, పుటలు 252, 263] తెలిపియున్నారు.]

గౌరనమంత్రి చేసిన రెండు ద్విపదకావ్యములలోను హరిశ్చంద్రోపాఖ్యాన మొకటి యైన ట్లీవఱకే చెప్పఁబడెను గదా? హరిశ్చంద్రుని కథ వేదముల నాఁటినుండియు సుప్రసిద్ధమయి యీ భరతఖండమునం దంతటను పండితులు మొదలుకొని పామరులవఱకును వ్యాపించి యున్నది ఈ కథ సంస్కృత మున మార్కండేయపురాణములోను, స్కాందపురాణములోను జెప్పఁబడి యున్నది. కథ కొంతవఱకు రెండు పురాణములలోను సమానముగానే యున్నను గొన్నిచోట్లఁ జరిత్రాంశములలో మాత్రమేకాక పేరులయందు సహితము భేదించి యున్నది మార్కండేయపురాణములో హరిశ్చంద్రుని భార్య పేరు శైబ్య యని యున్నది; స్కాందపురాణములో చంద్రమతి యని యున్నది. మార్కండేయపురాణములో హరిశ్చంద్రుఁడు భార్యాసహితముగా మృతపుత్రుని చితిలోఁ బడి చావఁబోవుచుండగా దేవతలు ప్రత్యక్షమయిన ట్లున్నది; స్కాందపురాణములో హరిశ్చంద్రుఁడు భార్య శిరస్సును చేతి ఖడ్గముతో నఱకఁబోవుచుండఁగా దేవతలు ప్రత్యక్షమయిన ట్లున్నది.

౧. శ్లో. స్వపత్న్యాచ శైబ్యయా సార్థం బాలకేనాత్మజేన చ,
ప్రజితో సర్వతో రుధ్వా పంథానం ప్రాహతం మునిః

[మార్కండేయపురాణము]

"వ. ఇట్లు వర్జితాశేషవిభూషణుండై తరువల్కలంబులు ధరియించి
యన్నరేంద్రుఁడు శైబ్యయైన ధర్మపత్నియుం దనయుఁడును దాను
నిలు వెడలు సమయంబున నమ్మునికుంజరుం డతవి కడ్డంబు
వచ్చి". [మారనకృతాంధ్రమార్కండేయపురాణము]

౨. శ్లో. శ్రుత్వా రాజా తదావాదీ దేవమస్తు శుచివ్రతేః
తతః కృత్వా చితాం రాజా చారోప్య తనయం స్వకమ్,
భార్యయా సహిత శ్చాసౌ బద్ధాంజలిపుట స్తదా,
చింతయన్పరమాత్మాన మీశం నారాయణం హరిమ్.

[మార్కండేయపురాణము]

క. అనవుఁడు నొడఁబడి విభుఁ డిం
ధనములు సొదగా నొనర్చి దానిపయిఁ దనూ
జుని విడి భార్యయుఁ దనపిఱుఁ
దన నిలువం గేలు మొగిచి తత్పరమతియై.

.... .... .... .... .... ....

క. నారాయణుఁ బీతాంబరు
శ్రీరమణీరమణు భక్తచింతామణి దు
ర్వార విపద్ద్వీపకుంభవి
దారణనిపుణాభిధానదై వతసింహుణా.

సీ. తలఁచుచునున్న యా ధరణీశునొద్దకు
ధర్ముండు మొదలుగాఁ దక్షణంబ
...............................వచ్చి రపుడు.

[మారయకృతమార్కండేయపురాణము]

౧. శ్లో. భార్యాం చంద్రమతీం ప్రాహ దుస్స్వప్నపరిపీడితః
మయి నిద్రాముపగతే దుస్స్వప్న స్సమజాయత.

[స్కాందపురాణము]

౨. శ్లో. తతో రామ మహేష్వాసో నిశితేన వరాసినా,
జఘాన తచ్ఛిర స్తీవ్రం పశ్యతాం త్రిదివౌకసాం.
పున రాదాయ తం ఖడ్గం తచ్ఛిరః ఛేత్తుముద్యతః,
తస్యాశ్శిరసి తత్ఖడ్గః పపాత సుమదామవత్,
తత్రాంతరే సర్వదేవా హాహేతిప్రియవాదినః.
తత్రాగత్య ముదావిష్టా స్తత్కరం జగృహు స్తతః.

[స్కాందపురాణము]

ఈ రెండు కథలలో మార్కండేయపురాణములోనిది యుత్తరహిందూస్థానములోను, పశ్చిమ హిందూస్థానములోను వ్యాపించి యున్నది. స్కాందపురాణములోనిది దక్షిణహిందూస్థానములో వ్యాపించి యున్నది. ఈ స్కాందపురాణములోని హరిశ్చంద్రకథనే మొట్టమొదట గౌరనకవి ద్విపదకావ్యముగాఁ దెనిగించెను. తరువాత శంకరకవి, శరభకవి, మల్లారెడ్డి మొదలైనవారు దీనిని పద్యకావ్యములనుగా జేసిరి. గౌరనకవి ద్విపదకావ్యము మృదుమధురపదసంఘటిత మయి లోకోక్తిస్వభావోక్తి సంయుతమయి ప్రౌఢమయి హృదయంగమముగా నున్నది. ఈతని భాషాంతరీకరణకౌశలమును తదితరకవులకు నితనికిం గల తారతమ్యమును దెలుపుటకయి రెండు, మూఁ డుదాహరణము లిచ్చుచున్నాను.

౧. ద్వి ఓజ దధ్యాజ్యశాల్యోదనమాంస
భోజనంబులు పరిపూర్తిగా మెసఁగి
మత్తులై వర్తిల్లు మానవేశ్వరులు
సత్తుగా బొంకుట సత్య మెయ్యెడను;
జనపతుఁ లే యూరు? సత్య మే యూరు?
వినఁగూడ దీ మాట విడుపుము చాలు. [గౌరనమంత్రి]

శ్లో. శాల్యన్నం సఘృతాపూపం భక్షయిత్వా వదత్యసౌ,
నిర్వాహ్య మేవ వక్తవ్యం సభాయాం దేవసత్తమ,
క్వ రాజానః పాపకృత్యాః? క్వసత్యం దేవదుర్లభమ్　[స్కాందము.]

ఉ. ఒత్తుగ మాంసము న్మడుగుటోగిరమున్ ఘృతశర్కరాదులున్
గుత్తుకబంటిగా మెసఁగి క్రొవ్వి వధూరతితంత్రలీలలన్
మత్తిలి దేహము న్మఱచి మాటికి బొంకు నృపాలకోటికిన్
సత్తు దలంప నెక్కడిది? సంయమి నీ కిటు పల్కఁ బాడియే.
[శంకరకవి.]

ఉ మోదముతో నిరంతర మపూపఘృతప్లుతశాకమాంసశా
లోదనము ల్భుజించి వివిధోరువధూరతితంత్రలీలచే
మాదృశు లెవ్వ రంచుఁ గడు మత్తిలి యున్న నరేంద్రకోటికిన్
బాదుకొనంగ నేర్చునె శుభప్రదసత్యవిశేషవిహ్వాముల్?　[శరభకవి.]

౨ ద్వి. ఆటదానికి వశమమ్మ యీమేటి
కోటలు దాటి యీగోడలు దాటి
తాళంబు లెడలించి తలుపులు దెఱచి
కేళిమై రొప్ప జాగిలముల మొఱఁగి
దాది వాకట్టి భూతలనాధుపట్టి
నాదట నీరీతి సత్త్వోత్తి చంప?　[గౌరనమంత్రి.]

శ్లో. మానుషీ చేత్కథం కుర్యాదియం ప్రాకారలంఘనం?
కథం గచ్ఛతి భూపాలసదనం జనరక్షితం
ఆయుధైః కీలకైర్వ్యాఘ్రాన్ కవాటపిహితాన్ బహూన్,
ఉత్పాట్యాంతఃపురం గత్వా కథం పుత్రం హనిష్యతి.　[స్కాందము.]

మ. జలజాతాక్షికి శక్యమే మనముసం జర్చింప నిర్భీతిఁ గో
టలు లంఘించి కవాటము ల్దెఱచి చండస్ఫూర్తిమై నుండు కు
క్కల వాకట్టి నృపావరోధగృహభాగంబు ల్ప్రవేశించి ని
శ్చలత న్సాహసలీల రాకొమరు నాశ్చర్యంబుగాఁ జంపఁగన్.　[శంకరకవి

౩ ద్వి అంతుగా నాబోతు అంకె వేసినను
గంతులు దక్కునే కంఠీరవంబు ?
కల్లజంజాటంబు కౌశిక ! యిచటఁ
జెల్లదుసుమ్ము వసిష్ఠుఁ డుండంగ
నురగకంకణుతోడ నూరజోగులను
సరిచేసి యెన్నినచందాన నీవు
సమితసత్యవ్రతుండగు హరిశ్చంద్రు
సమముగా నృపపిశాచముల లెక్కింతు. [గౌరన.]

చ. క్రమ మెఱుఁగంగలేక ఫణికంకణుతోడుత నూరజోగులన్
సమముగఁ జూచిన ట్లమితసత్యచరిత్రు జగత్పవిత్రు దు
ర్దమరిపురాజికాననవిదాహసముజ్జ్వలవీతిహోత్రు స
ద్విమలవిచిత్రగాత్రుఁ బృథివీజనచారుసరోజమిత్రునిన్.

క. నిరతప్రతాపజితభా
స్కరుఁడు హరిశ్చంద్రసుగుణసాంద్రునితోడన్
గురు తెఱుఁగలేని కతమున
సరిచూతురె నృపపిశాచసంఘమునెల్లన్. [శరభకవి.]

౪. ద్వి. నీ వొకండవె కావు నినువంటి మునులు
వేవురు గూడి వేవేలచందముల
మాయలు పన్నిన మరులుకొల్పినను
పాయని యిడుమలపాలు చేసినను
జననుతుఁడగు హరిశ్చంద్రభూవిభుఁడు
మనసున వాక్కున మఱి చేతలందుఁ
గలలోన నైనను ...... ... ... ..
........తా నాడినమాట బొంకండు. [గౌరన.]

ఉ. భూతలమందుఁ జేరి నినుఁబోలు మునిప్రవరుల్ సహస్రసం
ఖ్యాతశతాయుతంబు లధికంబుగ మాయలు పన్ని దుఃఖసం
జాతమనస్కుఁ జేసిన నిజంబుగ నెమ్మది నిల్పఁ డెన్న ని
ర్ధూతకళంకుఁ డాతఁ డనృతోక్తులు దాఁ గలలోన నేనియున్. [శరభకవి]

౨. ద్వి. వరుస నిక్ష్వాకుభూవరునాఁటనుండి
పరిణామ మెసఁగ మీ పదములచెంతఁ
జల్లగా మహి చెల్లచనువులు మాకుఁ
జెల్లగా నుంటిమి, చెల్లఁబో నేఁడు
మదిలోన నిటు దయమాలి కుంబ్రడఁగ
వదలక యీ మునివ్యాఘ్రంబువాతఁ
బొదివి త్రోచెదు పశుపుంజంబుపోలె

* * * *

గజిబిజి నొంది యిక్కడఁ దల్లి లేని
ప్రజలమై బాములఁ బడఁజాల మేము. [గౌరన.]

మ. అలఘుప్రాభవ! మమ్ము మీర లిది పర్యంతంబు సత్ప్రేమచేఁ
దలిఁదండ్రిన్ మఱపించి పెంచి వటులోద్యత్క్రోధివై నేఁడు బె
బ్బులివాతం బడఁద్రోచి పోవఁదగునే? భూనాథ! మానేర మే
వలనం జూచితి? వైనఁ గావఁ దగదే వర్ణింప మమ్మాటికిన్.

[శంకరకవి.]

౧. ద్వి. అనఘాత్మ! నీకోమలాంఘ్రిపద్మమ్ము
ఘనవజ్రమకుటసంగత మైనయట్టి
నా మస్తకంబు మిన్నక సోఁకి నొచ్చె
నేమి తప్పొదవె నాయెడఁ జెప్పుమనిన
గిటగిట పండ్లను గీటి కౌశికుఁడు
చిటచిట మిడుగుర్లు చెదర వీక్షించి
తలపోయ నొక పాదతల మస నేల?
కలయంగ నిఖిలాంగకంబులు నొచ్చె. [గౌరన.]

చ. అనఘచరిత్ర! మీ మృదుపదాబ్జము మామకరత్నయుక్త కాం
చనమకుటంబుతో నొరసి చాలఁగ నొప్పి వహించె; నే నొన
ర్చిన యపరాధ మేది యిటు చేయఁగ? నానతియిందు నావుడున్
మునికులముఖ్యు డిట్లనియె మో మరుణాంబుజకాంతి నీనఁగన్.

క. ఒకపాద మనఁగ నేటికి?
సకలాంగంబులును నొచ్చె సాహసవృత్తిన్
మొకమోడక నీచేసిన
సకుటిలకృత్యముల మాకుఁ జర్చింపఁగన్. [శంకరకవి]

శ్లో. పీడితో య స్మహాభాగ! పాద స్తే నీరజోపమః,
కరినోజ్జ్వలపాషాణ కిరీటే వినియోజితః,
తత స్తం ప్రాహ కుపితో విశ్వామిత్రో మహాతపాః,
న మే ఖిన్నం పాదమాత్రం సర్వాంగం త్వద్విచేష్టితైః

[స్కాందము]

గౌరనకవి రచియించిన రెండవ ద్విపదకావ్యము నవనాథచరిత్రము ఈ శివ కథలలోని మూడవ యాశ్వాసములోని ముఖ్యకథ ఒక బ్రాహ్మణుఁడు సౌందర్యవతియు, యౌవనవతియు నైన రాజపుత్రిని గామించి మాయోపాయముచేత నామెను దక్కించుకోఁ దలఁచి యా రాజపుత్రి రాజమందిరమునం దుండుటవలన రాజ్యమును, రాజవంశమును నిర్మూలమగుననియు, ఆ యాపద తొలగించుటకయి యామెను స్వర్ణరత్నాభరణపూర్ణ మయిన యొక మందసయం దుంచి తలుపులు మూసి దాని నొక తెప్పమీఁదఁ బెట్టి నదీప్రవాహములో విడువవలయుననియు, చెప్పి రాజును నమ్మించి యొప్పించి, రాజా ప్రకారముగాఁ జేసినపిమ్మట నేటివాలునఁ బడి కొట్టుకొని పోయెడి పెట్టెను బట్టుకొని యొడ్డునఁ బెట్టి మఱుఁగుస్థలములోఁ బదిల పఱుపుఁడని ముందుగానే శిష్యులను నియమించి యుంచెను జ్యోతిషఫలము నందు మూఢవిశ్వాసము గల యా రాజశిఖామణి విప్రవాక్యమును వేదవాక్య

ముగా విశ్వసించి తన కన్నకూఁతురును ప్రజాహితార్థముగా మందసలోఁ బెట్టి దుఃఖముతో నేటినీటఁ ద్రోయింపఁగాఁ బ్రవాహవేగమునఁ గొట్టుకొని పోవుచున్న యా పెట్టెను పరిసరారణ్యమునందు వేఁటాడి డస్సి దప్పితీర్చు కొనుటకయి యేటియొడ్డునకు వచ్చిన యొక రాజకుమారుఁ డొడ్డునకుఁ బట్టించి తలుపులు తెఱచి దానిలో రెండవ రతీదేవివలెఁ బ్రకాశించుచున్న యా రాచకన్నెను చూచి వలచి తద్వృత్తాంత మడిగి తెలిసికొని స్వర్ణాలంకార సహితముగా గాంధర్వవివాహమున నామెను పరిణయమయి యా మందసలోఁ దాను వేటాడి పట్టుకొన్న భల్లూకము నొకదానిని బెట్టి తలుపులు వేయించి యథాపూర్వముగా మందసను నదీప్రవాహమునఁ దోపించెను. పెట్టె నెదురు చూచుచు నేటియొడ్డున దిగువను వేచియున్న శిష్యులు తమవంకకు వచ్చుచున్న పెట్టెను దరికి లాగి యొక సురక్షితస్థలమునఁ జేర్చి గురువురాకకు ప్రతీక్షించుచుండఁగా, నింతలో సంధ్యాసమయమున బ్రాహ్మణుఁ డక్కడకు వచ్చి చూచి సంతోషించి శిష్యులను శ్లాఘించి శిష్యులకు వేఱు పనులు కల్పించి వారి నందఱిని సాగనంపి తా నొంటిగా మందసను తెఱచునప్పటి కందులో నున్న యెలుఁగుగొడ్డాతనిమీఁదఁ బడి కఱచి కండ లూఁడదీసెను. ఈ కథలోనిభాగము లక్కడక్కడివి కొన్ని యిం దుదాహరింపఁబడుచున్నవి.

ద్వి. చెడితిరా నిఁక నేమి చేయుదుఁ ననుచుఁ
గడుపును బిసుకుచుఁ గటకటా ! యనుచు
నిలిచినచో నొక నిమిషార్ధమైన
నిలువనోపక కూడు నీళ్ళను బాసి
కడుజాలిఁ బొందుచుఁ గన్నంబులోన
వడి తేలు కుట్టినవానిచందమున
వెడఁగురీతిని కడు వేదనఁ జాల
నడరుచు నొక యుపాయమును జింతించి.

* * * *

విను వినకుండుము వివరించుకొనుము
కొనకుండు మనుచును గుటిలాత్ముఁ డతని
చెవి డాసి కూఁతురుచేఁ బ్రాఁతఫలము
వివరించి చూచితి విను మీ కుమారి
నీయింట నుండిన నీవు నీప్రజలు
నీయేలు దేశంబు నిర్మూల మగుదు
రన విని భీతితో నతఁ డాడుమాట
తనకు నంతకుమున్న తారార్కు-ణ యగుట
తలపోసి యక్కటా! తల్లి పెంచినది
యెలమి నీబాలిక నేగతి విడువ
నొడఁబడు బుద్ధి నీయుపిదయె నాకుఁ
గొడు కైనఁ గూఁ తైనఁ గూర్మి నెక్కున్న.

* * * *

వెఱతుము నీమాట వేరెఱుఁ గడవ
నెఱిఁగింపు మీ పాప నేమి చేసెడిది?
నావుడు సిద్ధించె నాకోరి కనుచు
భావంబులోపలఁ బ్రమదంబు నొంది
యాతఁ డిట్లనె వసుధాధిప! మిగుల
చాతురిగా మందసంబును జేసి
యా లోన మణికనకాంబరాభరణ
జాలంబుతోడ నీ చపలాక్షి నునిచి
తలుపులు వదలించి తగుతెప్పఁమీదఁ
బొలుపొంద నునిచి యుప్పొంగుపెన్నేట
వెసఁ బాఱవిడిచిన వేవేగ శుభము
లెసఁగు మీకెల్లను నెలనాగభాగ్య

.... .... .... .... .... ....

నృపతి యాకన్యపాణిగ్రహణంబు
విపులసమ్మదమున వెలయఁ గావించి
మనమార మొదల నమ్మందస మున్న
ఘనమైన వస్తువుల్ గైకొని యందుఁ
బూని తా నంతకు మున్ను వేటాడి
బోనిలోఁ దెచ్చిన భూరిభల్లుకముఁ
జొరఁగొట్టి తలుపు లచ్చులు వదలించి
తిరముగాఁ దొల్లిటి తెప్పపై నునిచి
యేటఁ బో విడిచి యా యింతిఁ దోడ్కొనుచు
ఘోటకభటదంతికోటులతోడఁ
దనపురి కేఁగెను దదనంతరంబ
యనువునఁ జనుచున్న యా మందసంబు
వడుగులు గని యుబ్బి వడిఁ గుప్పిగంతు
లిడుచు నొండొరుల బల్విడిఁ గేక లిడుచుఁ
గొట్టి అంకెలు వేసికొనుచుఁ జెలంగి
పట్టి మందసఁ దెచ్చి పరఁగ నయ్యేటి
పొంత ప్రబ్బినప్రబ్బపొదలలో నునిచి
సంతసం బెసఁగ నొజ్జలరాక కెదురు
చూచుచునుండ నచ్చోటను విప్రుఁ
డే చేటుపాటుఁ దా నెఱుఁగక దక్క
రాచకూఁతురు మనోరథసిద్ధి యెసఁగె
నాచపలాక్షిఁ జయ్యనఁ బొందకున్న
నేచిన యీ మనం బె ట్లాపవచ్చు ?

.... ... .... .... ....

చలమున బ్రహ్మరాక్షసుఁడనై నిన్నుఁ
బొలియింప కిఁక నెటుఁ బోవనీ న్నమ్మ

మలయజగంధి నామాటకు మాఱు
పలుకవు సక్కిళ్ల పడియెనో చెవుడు
తొడరెనో పెనుమద్ద దురిగిరో నోర
నెడదవ్వులను మాట లేల మా కనుచు
వెలుపల దోవతి వేసి లోపలికిఁ
దలయెత్తి మోకాళ్ళు తడవుచుఁ జొచ్చె.

.... .... .... .... ....

నలుపారు నెఱుఁగుతిన్ననితోఁకఁ జూచి
ప్రీతిమై రాకొమారితవేణి యనుచుఁ
జేతఁబిగ్గరఁబట్టి చేరఁ దివ్వటయు
గొటగొట గోంద్రించి కోఱ లొండొంటిఁ
గటకటఁ దాఁకింప గర్భంబు గలఁగి
హా తాత ! హా మాత ! యనుచు మోచేతు
లూఁతగా వెనుకకు నొరిగి వెలికలఁ
బడి పాఱుకొని గుండె బలువిడి నడిచి
పడఁగ నెఱుంగని బాతశింపఁగను
నత్తటి విప్రుపై నదరంట నుఱికి
క్రొత్తనెత్తురు లొత్తఁ గ్రొవ్వాడిగోళ్ళ
జిల్లులు వోవంగ శిరమును నురము
గుల్లలతిత్తిగాఁ గొట్టియు మెడయుఁ
జరణయుగంబుఁ గక్షములు నురంబుఁ
గరములు బిగిబిగిగా నొగిలించి
విడిచె నంతటితోడ విటశిఖామణికి
నడఁగెఁ దొల్లిటివిషయపువేధ లెల్లఁ;
గెరలి భల్లూక మీ క్రియఁ దన్నుఁ గఱువ
హరిహరి ! గోవింద ! యయ్యరో యనుచుఁ

దఱియంగఁబడియె నంతయుఁ బోలఁ జూచి
మఱి వచ్చి వడుగులు మందసఁ గదిసి
వగచుచుఁ జేరి మీవంటి పెద్దలకుఁ
దగిలె నీదురవస్థ దైవయోగమున. *

---

* [గౌరవమంత్రి సారంగధర చరిత్రమను ద్విపద కావ్యమును రచించెనని కొందఱు తలంచుచున్నారు. సారంగధరుని కథ నవనాథ చరిత్రమునందే వచ్చుచున్నది. దానిని జూచియే కొందఱు గౌరన సారంగధర చరిత్రను ప్రత్యేకముగా వ్రాసినట్లు భ్రాంతిపడి యుండవచ్చును ]

# దగ్గుపల్లి దుగ్గయ్య

ఈ కవి భారతానుశాసనికపర్వములోఁ జెప్పఁబడిన కధ ననుసరించి * నాచికేతూపాఖ్యానమును రచియించి యనంతామాత్య గంగన కంకితము చేసెను. దుగ్గయకవి శ్రీనాథమహాకవిశిష్యుఁడును, మఱియు నయి యుండెను; శ్రీనాధుని భార్యతమ్ముఁ డనియు నాతనియొద్దనే యుండి చిన్న తనమునందు విద్యాభ్యాసము చేసెననియు తోఁచుచున్నది. ♦ నాచికేతూ పాఖ్యానాశ్వాసాంతగద్య మి ట్లున్నది.

గద్య ఇది శ్రీమత్కమలనాభపౌత్ర మారయామాత్యపుత్రకవిసార్వ భౌమ సకలవిద్యాసనాథ శ్రీనాధమహాకవీంద్ర ప్రసాదలబ్ధకవి తావిశేష దగ్గుపల్లి తిప్పనార్య ప్రియతనూజ దుగ్గననామధేయ ప్రణీతంబైన నాసికేతూపాఖ్యానంబను మహాప్రబంధంబునందు &c

కృతిపతి కవి నుద్దేశించి యిట్లనియెను.

క హితమతివి సకలవిద్యా
చతురుండవు చాటుపద్యజాలంబుల నా
కతులితకీర్తులు కలిగిం
చితి దుగ్గనకవివరేణ్య! శివకారుణ్యా!

---

* [దుగ్గయకవి గ్రంథము 'నాసికేతోపాఖ్యానము' గాఁ బ్రసిద్ధము.]

♦ [దుగ్గయకవి నివాసమైన దగ్గుపల్లి యేదియో నిశ్చయింపఁ జాలమనియు, కృష్ణాజిల్లా. బందరు తాలూకాలోను, గుంటూరు జిల్లా తెనాలి తాలూకాలోను కూడ దగ్గుపల్లి కలదఁట! బాపట్ల తాలూకాలోఁ గల దగ్గు బాడయినను, ఇతని నివాసము కావచ్చునఁట! (ఆంధ్రకవి తరంగిణి సం. 6 పుట 101)]

సీ. సంస్కృత ప్రాకృతశౌరసేనీముఖ్య
భాషాపరిజ్ఞానపాటవంబు
పన్నగపతిసార్వభౌమభాషితమహా
భాష్యవిద్యాసమభ్యాసబలము
నక్షపాదకణాదపక్షిలోదీరిత
న్యాయకళాకౌశలాతిశయము
శ్రుతిపురాణాగమస్మృతిసాంఖ్యసిద్ధాంత
కబళనవ్యుత్పత్తిగౌరవంబు

పూర్వకవిముఖ్యవిరచితాపూర్వకావ్య
భావరససుధాచర్వణప్రౌఢతయును
గందళింపంగఁ గాశికాఖండనైష
ధప్రముఖవివిధప్రబంధము లొనర్చి.

సీ. కవిసార్వభౌముఁడై కర్ణాటవిభుచేతఁ
గనకరత్నాభిషేకములు గనిన
శ్రీనాథసుకవి కూరిమిచేయు మఱఁదివి
దుగ్గయకవిరాజ! దగ్గుపల్లి
తిప్పనార్యునకు సతీమణి యెఱ్ఱమ
కును దనూజుఁడవు పోతనకు నెఱ్ఱ
నామాత్యవరునకు ననుఁగుఁదమ్ముండవు
శాండిల్యగోత్రుఁడౌ సరసమతివి

చెప్పనేర్తువు కృతులు సుస్థిరముగాఁగఁ
గాన నీవు రచింపంగఁ గడఁగియున్న
నాసికేతుచరిత్రంబు నాదుపేర
నంకితముసేయు కవిరాజ యాదరింప.

ఉ. మా పినతండ్రి గంగయయమాత్యశిఖామణి తత్తనూభవుం
డై పెనుపొందు దేవసచివాగ్రణి కిచ్చితి వంధ్రభాషఁ గాం
చీపురనాధు దివ్యకథ చిత్రతరంబుగ విస్తరించి నీ
వోపుదు వార్యహృద్యమధురోక్తుల సత్కృతు లొప్పఁ జెప్పఁగన్.

ఇతఁడు తన విద్యాగురువును, బావయు నైన శ్రీనాథునిపాండిత్య ప్రభావ మును వర్ణించుచు నాతఁడు కర్ణాటవిభునిచేత కనకరత్నాభిషేకమును పొందిన వృత్తాంతమును గూడఁ జెప్పి యున్నాఁడు. కవి దగ్గుపల్లి తిప్పనార్యువకును నెఱ్ఱమకును పుత్రుఁడు; శాండిల్యగోత్రుఁడు; పోతనకును నెఱ్ఱనకును దమ్ముఁడు ఈ గ్రంథమును రచియించుటకు ముందే యీ కవి కాంచీపుర మాహాత్మ్యమును రచియించి కృతిపతి పినతండ్రి కుమారుఁ డైన దేవయా మాత్యున కంకిత మొనర్చెను. కృతిపతియైన చెందలూరి గంగామాత్యుఁడు మాధవవర్మవంశమువాఁడైన తమ్మరాజుయొక్క కుమారుడగు బసవ నృపాలున కాప్తసచివుఁ డైన ట్లీ క్రింది పద్యమునఁ జెప్పఁబడెను.

సీ. చతురంగబలము విజయవాడదుర్గాంబ
వరమునఁ బడసి దుర్వారలీల
జగతీస్థలం బెల్ల సాధించి జయశాస
నములు దిగ్దంతిదంతముల సలిపి
పేదబాలునకుఁగాఁ బ్రియసుతమోహంబు
పట్టక బెజవాడపాడి నిలిపి
కలయంగఁ బురమునఁ గాంచనవర్షంబు
గురియించి దేవతాకోటి పొగడ

వసుధ నెగడిన మాధవవర్మవంశ
వర్ధనుండగు తమ్మభూవరుని బసవ
పార్థివున కాప్తుఁడై కృపాపాత్రుఁ డగుచు
ఘనత మెఱసె ననంతయగంగవిభుఁడు.

విశాఖపట్టణమండలములోని విజయనగరసంస్థానాధిపతులగు పూసపాటివారు తా మీ మాధవవర్మసంతతివార మని చెప్పుకొందురు. కృతిపతియైన గంగామాత్యుడొకనాడు కొలువుండి

"క. సరసులు సుకవీంద్రులుఁ దను
బరివేష్టింపంగఁ గావ్యబంధురగోష్ఠీ
పరుఁ డగుచు నుండి యస్మ
త్సరసవచోవైఖరుల హృదయమునఁ దలఁచెన్

వ తలఁచి యప్పుడు పరమానందంబున సామాజికులం జూచి యిట్లనియె

చ శ్రుతుల విహారదేశములు సుస్థిరవాక్యపదప్రమాణశా
స్త్రతతులయిక్కలాగమపురాణచయమ్ముల కేళిసద్మముల్
స్మృతులనివాసముల్ కవిసమీహితసత్కవితాగుణప్రసా
దితములు దగ్గుపల్లికవితిప్పయదుగ్గని గద్యపద్యముల్."

అన్నట్లు కవి కృత్యాదిని జెప్పెను. దుగ్గన శ్రీనాథునికాలములో బాల కవియయి యాతని యనంతరముననే కాంచీమాహాత్మ్యమును, నాచికేతూపాఖ్యానమును జేసినట్టు కనఁబడుచున్నాఁడు కృతిపతికాలమును బట్టి విచారింపఁగా నీకవి ౧౪౫౦ వ సంవత్సరప్రాంతమువఱకు నుండి కావ్యరచనము చేయుచుండినట్టూహింపఁదగి యున్నది. నంది మల్లయ్యయు, ఘంటసింగయ్యయుఁ గలిసి తాము రచించిన ప్రబోధచంద్రోదయ పద్యకావ్యము నీ గంగయామాత్యునకే యంకితము చేసిరి. అటు తరువాత నీ కవులే తమ వరాహపురాణమును ౧౫౦౩ వ సంవత్సర ప్రాంతమునందు రాజ్యపాలనము చేయుచుండిన కృష్ణదేవరాయని తండ్రియైన నరసింహదేవరాయనికిఁ గృతి యిచ్చిరి గంగయామాత్యుఁడు సాళువ నరసింహరాయని కాలములో నుండక తత్పూర్వమునందే యుండినవాఁ డనుకొన్నను ౧౪౫౦ వ సంవత్సరప్రాంతమువఱకైన నుండి యుండవలెను. ఆ వఱకే కాంచీపురమాహాత్మ్యమును రచియించి తరువాతనే నాచికేతూపాఖ్యానమును రచియించి

యుండుటచేత నీ కడపటి పుస్తకము ౧౪౭౦వ సంవత్సరప్రాంతముల యందు రచియింపఁబడి యుండును. నాచికేతూపాఖ్యానములోని మొదటి మూడాశ్వాసములు మాత్రమే యిప్పుడు కనఁబడుచున్నవి గాని సంపూర్ణ గ్రంథ మెక్కడను లభింపకున్నది. ఈతఁడు రచియించిన కాంచీపుర మాహాత్మ్యమును జదువఁగల భాగ్యము నాకు లభింపలేదు.*

దుగ్గనకవిత్వము సలక్షణమయి సరసమయి సకలజనాదరణీయముగా నున్నది. ఈతని కవిత్వశైలి తెలియుటకయి యీతని పుస్తకములలోని కొన్నిపద్యముల నిం దుదాహరించు చున్నాను

మ. మకరందంబులఁ దొప్పఁదోఁగి వికచన్మందారమాకంద చం
పకసౌరభ్యముఁ బూని లేఁజిగురుజొంపంబు ల్మ్రగిం జొచ్చి పా
యక మందానిలుఁ డెందుఁ గ్రుమ్మఱుఁ దపోవ్యాప్తిశ్రమత్తాపసీ
సకలాంగోదితఘర్మవారికణికాజాలంబు వింకించుచున్. ఆ ౧.

ఉ. ము న్నొకనాఁటిరాత్రి కనుమూసినచోఁ గల వచ్చి వేడుకన్
నన్ను దృఢోపగూహనమునం గరఁగించి మొఱంగి చన్న యా
పిన్నది గాదె యీ యువతి పెక్కువ నొందిన దిప్ప నాఁటికిం
గన్నియ గానఁ బ్రాయ మిది గామి నెఱుంగఁగరాదు గ్రక్కునన్.

ఉ. కోమలి వింటివే యతఁడు కూరిమిపుత్త్రుఁడు నాకు మున్ను పెం
దామరమొగ్గలోన విదితంబుగ డాచినయట్టి తేజము
మామక మించుకేని యనుమానము లే దిది తథ్య మిమ్మెయిన్
దామరసప్రసూతిచెయిదంబులు వ్రటిలె నిట్టిచందముల్.

చ. బిలిబిలిముద్దుచేఁతలకు సిగ్గులవిగ్గులు వన్నెవెట్ట వే
నలి యరపీడుచుండఁ జరణంబులు తొట్రిలఁ గ్రాలుఁగన్నులం
దొలఁకెడు మందహాసములు తొంగలిఱెప్పలలోన డాఁగఁగా
నలికులవేణి యోసరిలె నల్లన పయ్యెద నోసరించుచున్.

---

* [కాంచీపురమాహాత్మ్యమింతవఱకును లభింపలేదు.]

ఉ. సౌహృద మొప్పఁగా గురుని సమ్మతి నాథుఁడు వేలిపింప వై
వాహిక వహ్నికీలముల వామవిలోచన లీల వేల్చలా
జాహుతి చూడ నొప్పెసఁగె నప్డు కళాధరఖండభృజ్జటా
వ్యూహములోపలం దొరుగుచుండెడు వేలుపుఁటేటికై వడిన్.

ఆంధ్రపరిషత్పుస్తకభాండాగారములోని యుదాహరణగ్రంథములో దగ్గుపల్లి దుగ్గన శివకంచిమాహాత్మ్యములోనిదని యీ క్రింది పద్య ముదాహరింపఁ బడినది.

సీ. బంధూక మెఱమించెఁ బరువయ్యె గేదంగి
కడిమి పుష్పిత మయ్యె గ్రంథి పూచె
నర్జునం బలరారె నరవిందములు గ్రుస్సె
భూస్థలి నేరులు పుక్కిలించె
గండూపదము లుబ్బెఁ గలఁగె హంసచయంబు
నటియించెఁ గప్పలు నమిలి చెలఁగె
చాతకంబులు మించె సాగరం బెడయించె
హరిగోపములతోడ నాటె వేళ్ళ

మత్తభృంగములకుఁ దేనె రిత్త యయ్యె
గండుఁగోయిలకూఁతలు కట్టువడియె
చూలుకొనె స్వాతి కొక్కెరజూటిఁ బొదవె
విష్ణునకు నిద్రవోయెడువేళ యయ్యె.

ఆ పుస్తకమునందే విష్ణుకంచిమాహాత్మ్యమును ఆంధ్రకవి రామయ్యచెప్పినట్టిందులోనిపద్యము ఉదాహరింపఁబడినవి.*

* [శివకాంచీమాహాత్మ్యములోని వేఱొక సీసపద్యముదాహరణ శ్రీ ప్రభాకర శాస్త్రిగారు కూర్చిన 'ప్రబంధ రత్నావళి' లోఁ గలదు.]

# భైరవకవి

ఈ కవి శ్రీరంగమహత్త్వమును, రత్నశాస్త్రమును, కవిగజాంకుశమును జేసెను. వీనిలో శ్రీరంగమాహాత్మ్యము ప్రధానమైనది. ఈ గ్రంథము చాగయామాత్యుని పుత్రుఁడైన రాఘవమంత్రి కంకితము చేయఁబడినది. రామామాత్యుఁ డని నామాంతరము గల యీ రాఘవమంత్రి మాధ్వుఁడని తోచుచున్నది. ఇతఁ డే కాలమునందుండెనో యే రాజుమంత్రియో పుస్తకమువలనఁ దెలియరాదు. అయినను కృతిపతి యన్న విఠ్ఠలేశ్వరుఁ డీ విధముగా వర్ణింపఁబడెను.

సీ. చండదిగ్వేదండకాండధూర్వహమహీ
మండలోద్ధరణసమర్థ మగుచు
దుర్వారవైరిపంథిసర్వసంపద్గర్వ
నిర్వాపణక్రియానిపుణ మగుచు
వేదాదివిద్యావినోదవిద్వజ్జనా
మోదాతిశయసముత్పాది యగుచు
జంభజిన్మదకుంభికుంభీనసాధీశ
శంభుభూభృద్ద్యుతిస్వచ్ఛ మగుచుఁ
బరఁగు నే మంత్రిభుజబలప్రకటశౌర్య
దానసత్కీర్తు లప్రతిమానమహిమ
నాతఁ డిమ్మడిసైపఖానాధిరాజ్య
భారధుర్యుడు విఠ్ఠల ప్రభువరుండు.

ఇం దిమ్మడి యనియు, సైపఖా ననియు, రెండు పేరు లుదాహరింపఁబడి యున్నవి. ఈ రెంటిలో నిమ్మడి యనునది ప్రౌఢ దేవరాయని నామాంతరము. ఇమ్మడిదేవరాయ లనఁబడెడు ప్రౌఢదేవరాయలు ౧౪౨౩ మొదలుకొని ౧౪౪౭ వ సంవత్సరమువఱకును రాజ్యపాలనము చేసెను. ఈ విఠ్ఠల

ప్రభుఁ డిమ్మడికి సామంతుఁడుగా నుండిన సైఫఖానునొద్దనో యిమ్మడిసైఫఖాను లిద్దఱియొద్దనో కొలువుండి రాజ్యభారమును తీర్చుచుండి యుండును. * అందుచేత విర్దలప్రభుని తమ్ముఁడైన రాఘవమంత్రి ౧౪౫౦-౬౦ సంవత్సర ప్రాంతములయం దుండెనని యూహింపవలసి యున్నది. చతుర్థాశ్వాసాంతమునందలి యీ క్రింది పద్యమువలనఁ గృతిపతి సైఫఖానునొద్దనే కొలు వుండినట్లు తోఁచుచున్నది.

శా. ఖాటీవిభ్రమజృంభమాణనిజయోధవ్యూహబాహాధను
ర్జ్యాటంకారవిశంకటధ్వనివిశేషధ్వస్తనిస్తంద్రక
ర్ణాటోదీర్ణబలార్ణవార్భటితురంగారోహహేవోదారలీ
లాటోపార్కతనూజ చాగవిభురామామాత్యచూడామణీ.

కృతిపతి యైన రాఘవమంత్రి సభామండపంబునఁ గొలువుండి తన్నుఁ బిలిపించి "శ్రీరంగమహాత్త్వంబు మదంకితంబుగా నాంధ్రభాషాకౌశలంబు పచరించి రచియింపవలయు నని యభ్యర్థించి" నట్లు చెప్పుచోఁ గవి తన్నిట్లు చెప్పుకొనెను.

మ. కృతవిద్యాఖరశీపరిశ్రమకళాకేళీవిలాసున్ జన
స్తుతచారిత్రుని గౌతమాన్వయపవిత్రుఁ గౌరనామాత్యస
త్పుత్రుఁ గళ్యాణకవిత్వలక్షణసమర్థున్ సూక్తిముక్తాఫలా
తతకాంతిస్ఫుటచంద్రికోల్లసితవిద్వత్కైరవుఁ భైరవున్.

అని తాను గౌతమగోత్రుఁడననియు. గౌరనామాత్యపుత్రుడననియుఁ జెప్పుకొని యుండుటచేత భైరవకవి హరిశ్చంద్ర నవనాథచరిత్రములను రచించిన

* ['చండదిగ్వేదండ—' అను పద్యములోని 'ఇమ్మడి సైఫఖానాధిరాజ్య' అనుచోటఁ గల 'ఇమ్మడి' పదము ఇమ్మడి దేవరాయలనెడు ప్రౌఢదేవరాయలను తెల్పదనియు, ఇమ్మడి సైఫఖానన రెండవ సైఫఖానని యర్థమనియు 'ఆంధ్రకవి తరంగిణి' లో చెప్పఁబడినది. (సం. 5. పుట 219)]

గౌరనమంత్రిపుత్రుఁ డేమో యని యూహా కలుగుచున్నది. గౌరనమంత్రి గౌతమగోత్రుఁ డగుటయు, ప్రౌఢదేవరాయలకాలములో నుండుటయు నీ యూహను మఱింత బలపఱుచుచున్నవి గాని నిజముగా తనతండ్రి గొప్ప కవీశ్వరుఁడై యుండినపక్షమున భైరవకవి యా విషయమును దనగ్రంథ మునందుఁ జెప్పఁడా యని సందేహము పొడముచున్నది. ఈ సందేహము మాట యటుండఁగా గౌరనామాత్యుఁడు భైరవామాత్యునికుమారుఁ డనుట కొక గొప్ప యాక్షేపణ కనఁబడుచున్నది. భైరవుఁడు కవిగజాంకుశమును రచించెను గదా! గౌరనమంత్రి తాను రచించిన లక్షణదీపికలో కవిగజాం కుశములోని పద్యముల నుదాహరించెను తండ్రి తాను జేసిన గ్రంథములో కుమారుఁడు ముందు చేయఁబోయెడు గ్రంథములోని పద్యముల నుదాహ రించుట సంభావ్యము కాదుగదా? అందుచేత లక్షణదీపికలో నుదాహరింపఁ బడిన కవిగజాంకుశము భైరవునిది గాక మఱియెవ్వరిదైనఁ బూర్వకవిదయి యైన నుండవలెను; లేదా, గౌరనమంత్రి కీ భైరవుఁడు కుమారుఁడైనఁ గాకుండవలెను. లక్షణదీపికలో నుదాహరింపఁబడిన కవిగజాంకుశ మిది గాక యెప్పటిదో పూర్వపుదనియు, వివిధదేశములనుండి సంపాదించిన తమ యొద్ది నాలుగు (భైరవకవికృత) కవిగజాంకుశప్రతులలోను లక్షణదీపికలో నుదాహృతములైన పద్యములు లేవనియు శ్రీమానవల్లి రామకృష్ణకవిగారు చెప్పుచున్నారు. అల్పకాలములోనే కవిగజాంకుశనామము గల గ్రంథములు రెండు పుట్టె ననుటయు, నంత నమ్మఁదగినదిగా లేదు దీనికి సమాధాన ముగా నొకటి కవిగజాంకుశ మనియు నింకొకటి కవిరాడ్గజాంకుశ మనియుఁ జెప్పుదురు ఇది యంతతృప్తికరమయిన హేతువు గాదు. అయినను గౌరనభైరవకవుల కాల మించుమించుగా సరిపోవుచున్నది గనుకను, ఇరు వురును గౌతమగోత్రులే యగుటచేతను. భైరవకవితండ్రి యెవ్వరో గౌర నయే యగుటచేతను ప్రమాణాంతరములవలన నన్యథా సిద్ధాంత మగువఱ

కును భైరవకవితండ్రి హరిశ్చంద్రోపాఖ్యానాదులు రచించిన గౌరన మంత్రియే యని యంగీకరింతము.*

'ఇది శ్రీమద్భ్రమరాంబావరప్రసాదలబ్ధసిద్ధసారస్వతగౌరన" అని శ్రీరంగ మాహాత్మ్యమునందును,

క. భ్రమరాంబికామహావర
　సముదితనిరవద్యహృద్యసాహిత్యకళా
　క్రమవిమల ప్రతిభాసం
　క్రముఁడ మతిశాలి యైనగౌరనసుతుఁడన్.

అని రత్నశాస్త్రమునందును,

క. శ్రీమత్పరమశివానన
　తామరసవికాసలీలఁ దనరినభ్రమరాం
　బామధుమత్తభ్రమరిక
　నామానససరసిరుహమునన్ వసియించున్.

అని కవిగజాంకుశమునందును, భ్రమరాంబావరప్రసాదమువలనఁ దనకుఁ గవిత్వసంపద గలిగినట్టు కవి చెప్పుకొని యున్నాఁడు. ఈతని కవిత్వము పీఠికయందు పొగడినంత యుత్తమమైనది కాకున్నను గంగాప్రవాహము వలె ననర్గళధార కల దయి, యుభయభాషాపాండిత్యాతిశయసంసూచకమయి

* [భైరవకవి హరిశ్చంద్ర, నవనాథచరిత్రముల కర్తయైన గౌరనపుత్రుఁడని యూహించుటకుఁ జాలినన్ని యవకాశము లున్నను, కవిగజాంకుశములోని పద్యములు లక్షణదీపికయం దుదాహరింపఁబడుటచే, - కుమారుని పద్యములు తండ్రి యుదాహ రించుట అసంభావ్యముగాన - ఇర్వురును తండ్రి, కుమారులని తలఁచుట కుదరదని కొందఱి యాశయము. లక్షణదీపికలో 'కవిగజాంకుశము' లోని పద్యము లుదాహ రింపఁబడుట వాస్తవమే! అయినను, గుణగ్రాహియగు తండ్రి కుమారుని గ్రంథము నుండి యుదాహరించుటయు, కుమారుఁడు చిన్నతనముననే రచయిత యగుటయు నసంభావ్యములు కానేఱవని తోఁచుచున్నది. ఇట్టి పద్ధతి సంస్కృత వాఙ్మయము నను గానవచ్చుచున్నది ]

హృదయంగమముగా నున్నది రత్నశాస్త్రమగస్త్యుఁడు సంస్కృతమున రచించిన మణిలక్షణమునకుఁ దెనుఁగని యీ పద్యమువలనఁ దెలియవచ్చు చున్నది.

క. తన్నుఁ బ్రియమార వేఁడిన
మున్ను మునీంద్రుల కగస్త్యముని చెప్పిన యా
సన్నుతమణిలక్షణములు
చెన్నుగఁ గ్రోడీకరించి చెప్పెదఁ దెలియన్

ఈతని గ్రంథములలో నొక్కొక్కదానినుండి రెండేసి పద్యముల నిందుదా హరించుచున్నాను.

1. శ్రీరంగమాహాత్మ్యము.

చ. తలపులు నిక్క నిక్కపుముదమ్ములఁ దమ్ముల సంచలించు ప
ద్యలులకు లోఁగి లోఁ గినుకనందెవ నందెద వేల చంపకా
వలి వలి నున్న మొగ్గ లనివారణ వారణయాన కోయు మిం
పలరఁగ దానఁ దేఁటి రస మానదు మానదు లేఁతపూవులన్.

ఉ. ధీరులు దోషదూరులు సుధీజనసంస్తవనీయసద్గుణో
దారు లుదారు లాహవజితప్రతివీరు లపూర్వనిత్యశృం
గారులు శూరు లక్షీణవికారులు వార్ధిగభీరు లంగనా
మారులు శక్తినిర్జితకుమారులు రాజకుమారు లప్పురిన్.

2. రత్నశాస్త్రము.

ఉ. నీరదము ల్దిగంతముల నిండి తటిద్ఘనగర్జితంబు లిం
పార మహోగ్రవృష్టి కురియం బ్రభవించు నితాంతకాంతితో
నారయఁ గుక్కుటాండసమమై పడు ముత్యము లంతరిక్షసం
చారులు పట్టుకొందురు వెసన్ వసుధం బడకుండ నేర్పునన్.

ఉ. చేత ధరింప మానవులచెంతను జేరవు భూతకోటు లే
రీతిని దుష్టవిద్య లొనరించిన నెక్కవు క్రూరజీవముల్
ఘాతము సేయలేవు సతిగర్భము మోప సుఖప్రసూతి యా
నాతతఖ్యాతితోఁ బ్రతిదినంబును బ్రీతి యొనర్పుఁ గేతువుల్.

3. కవిగజాంకుశము.

క. ఒదుగుచు లక్షణ మెఱుఁగక
గొదుకుచు బ్రాసంబు వడియుఁ గూడక మీఁదుల్
వెదకుచుఁ బదసంధులు చెడ
నదుకుచు వెడకవిత చెప్పునతఁడుం గవియే?

క. కమలహితుఁ డున్న నక్ష
త్రము మొదలుగ నేడు దోషతమములు నడుమన్
బ్రమాదప్రదములు పంద్రెం
డమరఁగ నళభములు తొమ్మి దగుఁ బద్యాదిన్.

# పిల్లలమఱ్ఱి - పినవీరన్న

పిల్లలమఱ్ఱి పినవీరన్న యనెడి యీ కవి నియోగిబ్రాహ్మణుఁడు; గాద యామాత్యునకును, నాగాంబకును పుత్రుఁడు; పెదవీరన్నతమ్ముఁడు; భారతీ తీర్థుల శిష్యుఁడు; నిరుపమానమైన కవిత్వధార గలవాఁడు. ఇతఁడు తాను రచియించిన జైమినిభారతాశ్వమేధపర్వమునకు సాళువగుండ నృసింహనృపా లుని నాయకునిఁగాఁ జేసెను. అతఁడు కృష్ణదేవరాయల పూర్వులయిన బుక్కరాజాదుల సంతతివాఁ డయినట్టును, బళ్ళారిమండలములోని యానే గొంది సంస్థానమును పాలించుచుండినట్లును తెలియవచ్చుచున్నది. సాళువ గుండరా జొకఁడు హూణశకము ౧౩౯౦ వ సంవత్సరము మొదలుకొని ౧౩౯౩ వ సంవత్సరమువఱకును రాజ్యపాలనము చేసినట్టును, రెండవ సాలువ గుండరాజు ౧౪౭౧ వ సంవత్సరము మొదలుకొని ౧౪౭౮ వ సంవత్సరమువఱకును రాజ్యము చేసినట్టును బళ్ళారిమండలచరిత్ర సంగ్రహ మువలనఁ దెలియవచ్చుచున్నది. ఈ కడపటఁ జెప్పఁబడిన సాళువ గుండ రాజునకు జైమినిభారతము కృతి నందిన నరసింహభూపాలుఁడు పుత్రుఁ డైనట్టు కానఁబడుచున్నది గనుక, పిల్లలమఱ్ఱి పినవీరన్న ౧౪౭౮ వ సంవత్సరమునకుఁ దరువాతనే యున్నట్టు స్పష్ట మగుచున్నది. సాళువ గుండనరసింహరాజు ౧౪౫౬ మొదలుకొని ౧౪౮౬ వ సంవత్సరము వఱ కును రాజ్యముచేసిన విరూపాక్షరాయని సేనానాయకుఁడుగానుండి ౧౪౮౬ వ సంవత్సరమునం దాతనిరాజ్యము నాక్రమించుకొని ౧౪౮౭ వ సంవత్సరము వఱకో ౧౪౯౩ వ సంవత్సరమువఱకో స్వతంత్రముగా రాజ్యముచేసెనని చరిత్రకారులు చెప్పుచున్నారు ౧౪౮౭ వ సంవత్సరము మొదలుకొని * తుళువ నరసింగరాయని శాసనములు కనఁబడుచున్నందున నప్పటితోనే యీతని రాజ్యసమాప్తి యయి యుండును. సాళువ నరసింహరాజు పూర్వులు సహితము బుక్కరాజాది కర్ణాటాధీశ్వరుల దండనాథులయి

* [ఇతఁడు నరసరాజనియే ప్రసిద్ధుఁడు.]

యుండి ప్రభుదత్తసంస్థానపరిపాలకులయి యుండిరి. పిల్లలమఱ్ఱి పినవీరన్న ౧౪౮౦ వ సంవత్సర ప్రాంతమున జైమినిభారతము నీతని కంకితముచేసి యుండును వరాహపురాణమునందలి యవతారికనుబట్టి సాళువ గుండ నరసింహునికాలము స్పష్టముగాఁ దెలియవచ్చుచున్నది కృష్ణదేవరాయల తాతయైన యీశ్వరరాజీనరసింహనృపాలునియొద్ద దండనాథుఁడుగా నున్నట్లా పురాణపీఠికయందుఁ జెప్పఁబడినందున. సాళువ గుండ నరసింహరాజును తదాస్థానకవీశ్వరుఁ డయిన పిల్లలమఱ్ఱి పినవీరభద్రుఁడును క్రీస్తుశకము ౧౪౫౦-౮౦ వ సంవత్సరప్రాంతముల యందున్న ట్లేర్పడుచున్నది. ఈ కవికాలమును నిర్ణయించుట కొక విధమైన యాధార మింకొకటి కానఁబడుచున్నది. శ్రీనాథుఁడు రాజమహేంద్రపురెడ్ల యాస్థానములోఁ జేరకమునుపు సాంపరాయని కుమారుఁ డయిన తెలుఁగురాయనివద్దకుఁ బోయి కస్తూరి వేఁడిన ట్లీ క్రిందపద్యము తెలుపుచున్నదిగదా?

శా. అతియ్యంబుగ సాంపరాయని తెలుంగాధీశ కస్తూరికా
    భిక్షాదానము చేయురా సుకవిరాడ్బృందారకస్వామికిన్
    దాక్షారామపురీవిహారవరగంధర్వాప్సరోభామినీ
    వక్షోజద్వయకుంభికుంభములపై వాసించుఁ దద్వాసనల్.

ఈతెలుఁగురాయనితండ్రి యగు సాంపరాయనికి జైమినిభారతకృతిపతియగు నృసింహరాజుయొక్క ముత్తాత యగు సాళువమంగరాజు రాజ్యప్రతిష్ఠాపనము చేసినట్లు జైమినిభారతములో నీ క్రింది పద్యమునఁ జెప్పఁబడినది.

సీ. దురములో దక్షిణసురతాను నెదిరించి
        కొనివచ్చి సాంపరాయనికి నిచ్చి
    సామ్రాజ్యమున నిల్పి సాంపరాయస్థాప
        నాచార్యబిరుదవిఖ్యాతి గాంచె
    శ్రీరంగవిభుఁ బ్రతిష్ఠించి యర్వదివేల
        మాడ లద్దేవు నమ్మడికి నొసఁగె
    మధురాసురత్రాణు మడియించి పరపక్షి
        సాళువబిరుదంబు జగతి నెరపె

గర్వితనమునఁ దేజి మొగంబు గట్టి
తఱిమి నగరంపుగవఁకులు విఱుగఁద్రోలి
తాను ద్రవేసిన గౌరు నుద్దవిడిఁ దెచ్చె
సాహసంబున నుప్పొంగు సాళ్వమంగు.

ఈ సాళ్వమంగు వీరబుక్కరాయని పుత్రుఁడైన కంపరాయఁడు తండ్రి యాజ్ఞానుసారముగా ౧౩౬౭వ సంవత్సర ప్రాంతమున దక్షిణదిగ్విజయ యాత్ర వెడలినప్పుడు సేనానాయకుఁడుగా నుండెను. నృసింహరాజుయొక్క ముత్తాతచే రాజ్యమున నిలుపఁబడిన సాంపరాయఁడు నృసింహరాజుతాత కాలములోఁగూడ రాజ్య మేలి యుండును అప్పు డాతని పుత్రుఁడగు తెలుగుఁరాయఁ డీ నృసింహరాజుయొక్క తండ్రి తాతల కాలములో నుండి యుండుటకు సందేహ ముండదు. యౌవనదశలోఁ దెలుఁగురాయనివద్దకుఁ బోయి కవిత్వము చెప్పి యాతనిని మెప్పించిన శ్రీనాథుఁడు నృసింహరాజు యొక్క తండ్రికాలములోనే కాక కొంతవఱ కీనృసింహరాజుయొక్క రాజ్య కాలములోఁ గూడ నుండి యుండును. కాఁబట్టి కృతిభర్త యైన యీ సాళువ నృసింహరాజును. కృతికర్త యైన పినవీరన్నయు శ్రీనాథుని యంత్యకాలములోను, తదనంతరకాలములోను జీవించియుండిన ట్లిందువలనఁ దేలుచున్నది. ఈ మహాకవి ౧౪౭౦వ సంవత్సరప్రాంతమువఱకును జీవించి యుండవచ్చును గనుక, శ్రీనాథకవి వార్ధకదశలో నున్నప్పు డితఁడు యౌవనదశయం దుండి యుండును. దానినిబట్టి చూడఁగా శ్రీనాథుఁడు తా నాంధ్రీకరించిన నైషధమును గొనిపోయి యిప్పుడు జను లనుకొనునట్లు కవిజనాగ్రగణ్యుఁడని యభినవముగాఁ బే రొందుచుండిన మహావిద్వాంసుఁ డయిన పినవీరన్నకుఁ జూపి యుండును పినవీరభద్రుని జీవితకాలములోనే శ్రీనాథుఁ డాతనికిఁ బూర్వకవి యయినందున శృంగారశాకుంతలకృతిపతి యయిన వెన్నమంత్రి "సీ. శ్రీనాథభట్టభాషానిగుంభంబుల పరిమళంబులఁ గూడఁ బఱవ నేర్చు" నని పినవీరనకవిత్వమును శ్లాఘించెను. ఈ వీర భద్రకవి యా కాలమునందు మిక్కిలి సుప్రసిద్ధుఁ డయినట్లు నరసింహ

రాజుతో నాతని యాస్థానమునందలి పండితు లన్నట్లు జైమినిభారతము నందుఁ జెప్పఁబడిన యీ క్రింది పద్యమువలనఁ దెలియవచ్చుచున్నది.

క. తాతయుఁ దండ్రియు నగ్ర
భ్రాతయునుం దాను భువనభాసురకృతిని
ర్మాతలు పిల్లలమఱివి
ఖ్యాతునిఁ బినవీరుఁ బోలఁగలరే సుకవుల్.

సీ. అమృతాంశుమండలం బాలవాలముగాఁగ
మొలచె నొక్కటి జగన్మోహనముగఁ
జిగురించె విలయసింధు గతకైతవడింభ
శయనీయవరపలాశములతోడఁ
బితృదేవతలకు నంచితసత్రశాలయై
చెట్టు గట్టెను గయాక్షేత్రసీమ
నిలువ నీ డయ్యె నిందీవరప్రియకళా
కోటీరునకు భోగికుండలునకు

మఱ్ఱిమాత్రంబె పిల్లలమఱ్ఱి పేరు
పేరువలెఁ గాదు శారదాపీఠకంబు
వారిలోపలఁ బినవీరువాక్యసరణి
సరసులకు నెల్లఁ గర్ణరసాయనంబు

శ్రీనాథాదులకుఁ దరువాతి కాలములో నుండిన వెల్లంకితాతంభట్టను లాక్షణి కుఁడు తన కవిలోకచింతామణియందుఁ బినవీరనపద్యముల నుదాహరించుట కూడ నీ మహాకవి యించుమించుగా శ్రీనాథాదుల కాలమువాఁ డనుటను స్థాపించుచున్నది. కాఁబట్టి యిప్పటి కితఁడు నాలుగు వందల నలువది సంవత్సరముల క్రిందట నున్నవాఁడని చెప్పవచ్చును

ఈ కవిమహిమలనుగూర్చి కొన్ని కథలు చెప్పుదురు. ఈతని యన్న నిష్ఠా పరుఁ డయి జపతపములయందుఁ గాలక్షేపము చేయుచుండఁగా నితఁడు

స్నానసంధ్యాదులు లేక నోట మెతుకులు పడుటయే తడవుగాఁ బోయి
వేశ్యలయింటఁ గూరుచుండుచు వచ్చెననియు. అన్నగారు జపసమయము
నందు దన భార్య కాభరణములు చేయించుట కాలోచించుచుండఁగా- తమ్ముఁ
డది గ్రహించి యాతనికోసర మెవరో వచ్చి 'మీ యన్నగా రేమి చేయు
చున్నా' రని యడిగినప్పుడు 'మా యన్నగారు భార్య కాభరణములు చేయిం
చుటకయి యాలోచించు చున్నాఁ'డని యుత్తర మిచ్చె ననియుఁ జెప్పుదురు.
అంతేకాక రాజు జైమినిభారతమును జేయుటకై పినవీరభద్రున కాజ్ఞ
యిచ్చి పంపునప్పు డతఁడు గడువులోపల సావకాశముగాఁ బుస్తకము రచి
యింపక యుపేక్ష చేసి యహోరాత్రములు భోగభామినుల యింట కాల
క్షేపము చేయుచు వచ్చె ననియు. మితిదినమునాఁటికి గ్రంథమును జేసి
సమర్పింపనియెడల రాజుచేత మాటవచ్చునని యన్నగా రెన్నివిధముల
హితోపదేశము చేసినను, లక్ష్యముచేయక యాతని మాటలు పెడచెవులఁ
బెట్టి యథేష్టముగాఁ దిరుగుచు వచ్చె ననియు, పుస్తకము ముగింపవలసిన
దినము తే పనఁగా నాఁటిరాత్రి తనగది యలికించి లోపల దీపము పెట్టించి
పెందలకడ భోజనము చేసి గదిలోఁ బ్రవేశించి తలుపు లోపల వేసికొనఁ
గానే పదిమంది చేరి లోపల పుస్తకము వ్రాయుచున్నట్లు గంటముచప్పుడు
వినఁబడె ననియు, అద్భుతజనకమయిన యా చప్పుడు విని మనసు పట్టలేక
పెదవీరన్న తలుపుసందునుండి తొంగి చూడఁగా సర్వాభరణభూషితురాలై
దీపము వెలుతురున శరవేగముగ వ్రాయుచున్న యొకస్త్రీ బావగారు చూచు
చున్నారని చివాలున లేచి తొలఁగిపోయెననియు, అటుపిమ్మటఁ బుస్తక
మునఁ గొంచెము భాగము మిగులఁగాఁ బినవీరన్న దానిని పూర్తిచేసి మఱు
నాఁడు రాజసభకుఁ గొనిపోయె ననియు, అతఁడు "వాణి నారాణి" యని
పంతము పలుకఁగాఁ గొలువులోనివారు సహింపక యాతని నిరాకరించి
నప్పుడు వాణి నవరత్నఖచితము లయిన కంకణములు గదల తనహస్తము
తెరలోనుండి పయికిఁ జాఁపి చూపి యాతనిమాట సత్యమని యశరీర
వాక్కునఁ బలికె ననియుఁ జెప్పుదురు అతఁ డాశుధారగా కవిత్వము చెప్పఁ
గలవాఁ డనియు, వాణి యతనికి వశ్య యనియు, చూపుటకై యీ కథ

కల్పింపఁ బడినది. ఈ కవి తనకు భారతీతీర్థగురుకృపావిశేషముచేతఁ గవిత్వము వచ్చినట్లు జైమినిభారతమునం దీ పద్యముచేతఁ జెప్పినాఁడు.

సీ. పరగంగ మల్లమాంబాకుమారునకు సో
మకులాంబునిధిపూర్ణిమావిధునకు
భరతకీర్తికిఁ దులాపురుషాదిదానాంబు
జంబాలితాస్థానసాధునకును
బరరాజభీకరధరణీవరాహాన
కాత్రేయగోత్రపవిత్రునకును
గుండయనరసింహమండలేశ్వరునకు
నభ్యుదయపరంపరాభివృద్ధి
కరముగా భారతీతీర్థగురుకృపాస
మృద్ధసారస్వతుఁడు సత్కవీంద్రసఖుఁడు
సుకవిమల్లకపోల్లసత్కులిశహస్త
పల్లవుఁడు చెప్పెఁ బినవీరభద్రసుకవి.

ఈ కవి యనేక గ్రంథములను రచించెను గాని వానిలో నీ జైమినిభారతము గాక శృంగారశాకుంతల మొక్కటిమాత్రమే యిప్పుడు కానఁబడుచున్నది. కవి యా వఱకుఁ జెప్పిన గ్రంథములు శృంగారశాకుంతలములోఁ గృతిపతి కవిని గూర్చి చెప్పిన యీ క్రింది పద్యమునఁ బేర్కొనఁబడినవి.

సీ. రచియించినాఁడవు రమణీయవాగ్రీతి
* నవతారదర్పణం బభినవముగఁ
బలికినాఁడవు తేటపడఁజేసి నారదీ
యము సత్కవిశ్రేణి యాదరింపఁ
జెప్పినాఁడవు శేముషీవిశేషంబున
మాఘమాహాత్మ్యంబు మంజుఫణితిఁ

* [కొందఱు 'నవరస దర్పణం' బను పాఠమును గ్రహించిరి. కాని యా పాఠము సరియైనది కాదు ]

గావించినాఁడవు ఘనబుద్ధి మానసో
ల్లాససారము సముల్లసితళయ్య
భారతీతీర్థయతిసార్వభౌమగురుకృ
పాతిశయలబ్ధకవితావిభూతి గలిగి
గౌరవము గాంచినాఁడవు కవులచేత
విపులచాటూక్తినిర్ణిద్ర ! వీరభద్ర !

ఈ పద్యమును జూచియే కాఁబోలును నిన్నూతేండ్లకుఁ దరువాత సీమంతినీ కళ్యాణ మను సోమవార వ్రతకథను రచియించిన యీ తనివంశపువాఁ డగు సోమనామాత్యుఁడు పినవీరభద్రుని పుస్తకములను గూర్చి తన కావ్యములో నీక్రింది పద్యమును జెప్పెను.

సీ. అవతారదర్పణం బన్న కావ్యముఁ జేసె
నారూఢి నారదీయంబు పలికె
మహనీయమగు మాఘమాహాత్మ్యము రచించె
శాకుంతలముఁ జెప్పె సరసఫణితి
నొక్క రాత్రియందు నొనరించె మధురవా
క్ప్రౌఢిచే జైమినిభారతంబు
లలితమౌ మానసోల్లాససారం బన్న
కబ్బంబు భాషించె నబ్బురముగ
మఱియు బహురూపకావ్యనిర్మాణనిపుణుఁ
డగుచు నుతిఁగాంచె సకలదిగంతరములఁ
గుకవిజనగర్వతిమిరసంకోచకృత్ప్ర
భాతరవి యైన పినవీరభద్రసుకవి

ఇందులోని యొక్కరాత్రిలో జైమినిభారతము రచియించె ననుట మొద లయినవి వాడుకలోనున్న కట్టుకథల ననుసరించి వ్రాయఁబడి యుండును. ఈ కవియే తన పుస్తకమునందుఁ బినవీరభద్రునితండ్రియైన గాదిరాజు చిరకాలము సంతానము లేనివాఁ డయి కడపట వీరభద్ర ప్రసాదము వలన

విరువురు కవలబిడ్డలను గాంచి, వారికి వీరభద్రనామములు పెట్టెనవియు, వారిలోఁ బెదవీరభద్రుఁడు కర్ణాటరాజుల మంత్రి యయ్యె ననియుఁ, బిన వీరభద్రుఁడు కవి యయ్యెననియు నీక్రిందిపద్యములలోఁ జెప్పెను

క. ఆ గాదిరాజువనిత మ
హాగుణవతి పరమసాధ్వి యన విశ్రుతయౌ
నాగాంబ రూపలీలా
భోగాఢ్యులఁ గవలవారిఁ బుత్రులఁ గాంచెన్.

సీ. అతిలాలితాకారు లాకుమారులు పెద
వీరభద్రుఁడు పినవీరభద్రుఁ
డన్న నామములచే నధిక ప్రసిద్ధులై
యభివృద్ధి గాంచి రనంతరమునఁ
బెదవీరభద్రుడు పృథ్వీ ధీనుతకార్య
దక్షుఁడై కర్ణాటధరణి కరిగి
వాసిగా రాయసింహాసనమున నుండి
యధికులౌ రాయదాయాదులకును

మఱియు డెబ్బదివేల సామంతులకును
దానె యధికారియై మహాస్థానములందు
సకలమంత్రి వరేణ్యులు సన్నుతింప
భూనుతంబైన కీర్తివిస్ఫూర్తిఁ గనియె

సీ. మహనీయపిల్లలమఱ్ఱివంశభవుండు
గాదిరాజసుతుండు ఘనయశుండు
వీరేశ్వరుని యవతారమై యిలలోన
జను లెన్నఁదగిన సౌజన్యశాలి

పినవీరభద్రుఁడు పిన్నప్రాయమునంద
యఖిలశాస్త్రంబులు నభ్యసించి
కాళిదాసాదిసత్కవులకు హెచ్చుగా
బహుకావ్యవిరచనప్రౌఢిఁ గాంచె
వాణి యిల్లాలుగాఁ గవిశ్రేణి కెల్లఁ
బృథుతరాశ్చర్యకరమైన బిరుదు పూనె
తుహినగిరిరాజరామసేతువులనడుమ
నితని కెనయైన కవివరుం డెందుఁ గలఁడు

పూర్వోదాహృతపద్యములోఁ జెప్పఁబడిన యవతారదర్పణము, నారదీయము, మాఘమాహాత్మ్యము, మానసోల్లాససారము, అను నాలుగు పుస్తకములును గాక పిల్లలమఱ్ఱి పినవీరభద్రకవి "పురుషార్థసుధానిధి" యను వేఱొక పుస్తకమును గూడ రచియించిన ట్టాంధ్రసాహిత్యపరిషత్తువారి పుస్తక భాండాగారములో నున్న యుదాహరణగ్రంధమునం దుదాహరింపఁబడిన యీ క్రింది పద్యములవలనఁ దెలియవచ్చుచున్నది.

సీ. కాశకర్పూరనీకాశగా భావింపఁ
గవితానిరూఢి ప్రఖ్యాతి నెసఁగు
యావకారుణదేహయష్టిగాఁ జింతింప
మదకుంభియానల మరులుగొలుపు
నీలజీమూతసన్నిభగా విలోకింప
సకలమాయాప్రపంచంబు నడచు
కనకచంపకదామగౌరిగా శీలింప
నంహస్సమూహంబు సంహరించు

శంభుదేవి విశాలాక్షి సదనుకంప
యోగిజనసేవ్య యోగపయోదశంప
శ్రీకరకటాక్షలేశరక్షితనిలింప
మజ్జగంబును మొలపించు మూలదుంప.

సీ. భర్గభట్టారకపర్యాయమూర్తికి
షాణ్మాతురుని కూర్మిజనకునకును
మేషరాజము నెక్కి మేటిరౌతున కసు
రాధీశు పొరుగుదిశాధిపతికి
హరిణవాహనుని నెయ్యపుసంగడీనికి
సామిధేనీప్రియస్వాంతునకును
యాయజూకులయిండ్లయనుఁగుజుట్టమునకు
స్వాహాస్వధాప్రాణవల్లభునకు
దండములు పెట్టెదము మోడ్చెదము కరములు
సేవ యొనరించెదము మమ్ముఁ గావఁ బ్రోవ
యాగవేదికి విచ్చేయు మారగింపఁ
బ్రథమజన్ములయింటి కల్పద్రుమంబ.

శృంగారశాకుంతలము నెల్లూరు మండలములో బిట్రగుంటకు సమీపము నం దున్న సోమరాజుపల్లినివాసుఁడును, భూస్వామియు, ధనసంపన్నుఁడు నైన చిల్లరవెన్నమంత్రి యనఁబడెడు నియోగిప్రభువున కంకితముచేయఁబడెను. శాకుంతలములో సోమరాజుపల్లి యిట్లు వర్ణింపఁబడెను.

సీ. లవణాబ్ధివేలహేలాకాంచి యగు నంధ్ర
ధరణీమండలికి ముత్యాలజల్లి
సంగ్రామపార్థరాజన్యరాజశ్రీకిఁ
బెంపుమీఱిన జగజంపువెల్లి
దాతలు సముదంచిత ప్రసూనములుగాఁ
గామితార్థములిచ్చు కల్పవల్లి
యఱువదినాల్గు విద్యలకు నపూర్వఘం
టాపథంబైన పట్టణమతల్లి
పంటనృపకౌస్తుభములకుఁ బాలవెల్లి
కదనజయలక్ష్మితొలుచూలు గన్నతల్లి
విపులభుజగర్వదర్పితవిమతరాజ
రాజహృద్భల్లి ధర సోమరాజుపల్లి.

పైతామహంబైన సోమరాజుపల్లియం దుండిన

సీ. సకలభూపాలకాస్థానసౌధంబుల
వర్ణింతు రే మంత్రివాగ్విభూతి
సంతానసురధేనుచింతామణులపెంపు
దట్టించు నే మంత్రిదానమహిమ
యాశాంతదంతిదంతాఘాటములమీఁద
విహరించు నే మంత్రివిమలకీర్తి
సుకవిగాయకబహుస్తుతిఘోషణంబున
నలరు నే మంత్రిగేహాంగణంబు
వాఁడు కౌండిన్యగోత్రాభివర్ధనుండు
మదవదరిసైన్యపతిమానమర్దనుండు
నాగయామాత్యతనయుండు నయవిశేష
విజితసురమంత్రి చిల్లర వెన్నమంత్రి.

కవినిగూర్చి

సీ. నన్నపార్యుఁడు ప్రబంధప్రౌఢవాసనా
సంపత్తిసొంపు పుట్టింప నేర్చుఁ
దిక్కనయజ్వవాగ్భక్కికామోదంబు
చెలువు కర్ణముల వాసింప నేర్చు
నాచిరాజుని సోమువాచామహత్త్వంబు
సౌరభంబులు వెదచల్ల నేర్చు
శ్రీనాథభట్టుభాషానిగుంభంబుల
పరిమళంబులఁ గూడఁ బఱప నేర్చు
మహితగుణశాలి పిల్లలమఱ్ఱి పీర
నార్యుఁ డా యింటఁ బైతామహం బగుచును
వెలయుచున్నది నేఁడు కవిత్వలక్ష్మి
యఖిలసత్కవినికరంబు లాదరింప.

అని విచారించి, కవిని బిలిపించి సంబోధించి

గీ. కలదు చాలంగఁ బ్రేమ నీవలన నాకు
వేడ్క నడిగెదఁ గవులెల్ల వేడ్కపడఁగ
షట్సహస్రకులోద్భవసచివులందు
సుకృతిగాఁ జేయు నా కొక సుకృతిఁ జేసి.

.... .... .... ....

సీ. సరసపువ్వులుగ మాలకరి పెక్కుతెఱఁగుల
విరుల నెత్తులుగఁ గావించునట్లు
కర్పూరకస్తూరికావస్తువితతిచే
శ్రీఖండచర్చ వాసించునట్లు
ఒడికంబుగా గందవొడికి నానాసూన
పరిమళంబులు గూడఁ బఱచినట్లు
సరఘలు వివిధపుష్పమరందలవములు
గొనివచ్చి తేనియఁ గూర్చినట్లు
భారతప్రోక్తకథ మూలకారణముగఁ
గాళిదాసుని నాటకక్రమము కొంత
తావకోక్తికి నభినవశ్రీ వహింపఁ
గూర్మిఁ గృతిచేయు నాకు శాకుంతలంబు.

అని ప్రార్థించెను. "వినుతక్ష్మాపాలకామాత్యవేదండానీకమృగేంద్ర" అని ప్రథమాశ్వాసాంతపద్యమునను, "శీతశైలాబ్ధివేలామధ్యక్షితిపాలమంత్రి మకుటాలంకారహీరాంకురా" అనియు, "సదాస్వామికార్య ప్రియచారనీతి క్రియా" అనియు తృతీయాశ్వాసాంతపద్యములయందును, కృతిపతియైన వెన్నమంత్రి సమస్త రాజమంత్రులను మించినట్టును, స్వామిహితకార్య తత్పరుఁడైనట్టును కవి యెంత వర్ణించినను వెన్నయామాత్యుఁడే రాజున కమాత్యుఁడో, యెక్కడను జెప్పలేదు. ఈ కృతిపతినిబట్టి రెండవ కృతిపతి

యైన సాళువ గుండనృసింహరాజునుబట్టి తెలియవచ్చినట్లు కవికాలనిర్ణయాదులైన చరిత్రాంశము లేవియుఁ దెలియరావు. ఈ నరసింహరాజు కృతిభర్త యగుటయే కాక కృతికర్తసహితమయి సంస్కృతమున రామాభ్యుదయమను గ్రంథమును జేసెను. శ్రీనాథుని కాలములో నుండిన గౌడడిండిమకవిసార్వభౌమబిరుదాంకితుని కుమారుఁ డగు రాజనాథుఁ డను తృతీయడిండిమకవిసార్వభౌముఁ డీ సాళువగుండ నరసింహానినాయకునిగాఁ జేసి సంస్కృతమున సాళువాభ్యుదయ మను కావ్యమును జేసెను. ఈ సాళువ నరసింహరాజు మహాప్రసిద్ధుఁ డగుటచేత నాతనిమీఁదఁ గవు లనేకులు పద్యములు చెప్పిరి. అట్టి పద్యములలో రెంటి నిం దుదాహరించెదను

సీ. దినదినంబును నెల్లడవిరాజులఁ బోషించుఁ
గైరవబంధుఁ డే కార్యకాంక్ష?
అప్పటప్పటికి లోకాంధకారము మాన్చు
నినుఁ డేమి లాభంబు నిచ్చగించి?
సచరాచరంబైన జగతి యెల్ల భరించు
ఫణిపతి యే ఫలప్రాప్తిఁ జూచి?
అదనున వర్షించి యఖిలజీవులఁ బ్రోచు
జలధరం బే ప్రయోజనముఁ గోరి?

పరహితం బాత్మహిత మని పరమపుణ్యు
లన్యు లాచరించు మేలు తా మాసపడరు
సకలభాగ్యోదయ! కరారి సాళువాంక
గుండభూపాలనరసింహమండలేంద్ర!

సీ. బంగారునకు సౌరభము జనించినయట్టు
కులజుఁ డుత్తమగుణకలితుఁ డేని;
కస్తూరి నికరంపుఁగాంతిఁ జెందినయట్టు
లుత్తమోత్తముఁడు శ్రీ నొందెనేని;
భావింపఁ జెఱకునఁ బండుపండినయట్టు
నెఱదాత ప్రియవచోనిరతుఁ డేని;

అలరుగందపుఁబ్రమాన నలరు పూచినయట్టు
　　　　శ్రీమంతునకు గీర్తి చెందెనేని;
భవ్యగుణసాంద్ర! సకలవైభవసురేంద్ర!
సహజదానశిబీంద్ర! భాషాఫణీంద్ర!
సాళువక్షోణిపతివంశజలధిచంద్ర!
గుండభూపాలనరసింహమండలేంద్ర!

ఇతనికవిత్వ మనర్గళధారగాఁ బ్రవహించుచు, నాతికఠినమయి రసపుష్టి కలిగి యుండును కవిత్వశయ్య బోధపడుటకయి కొన్ని పద్యము లిం దుదాహరింపఁబడుచున్నవి

౧ జైమినిభారతము.

ఉ. కాఁక నెదిర్చి సంగరముఖంబున హెచ్చిన రాజవంశముల్
గూఁకటివేళ్ళతోఁ బెఱికి గోత్రవధంబును జేసినట్టి యా
వ్రేఁకపుఁగీడు గాక ప్రజ వేఁచఁ దలంచిన గోరుచుట్టుపై
రోఁకటిపోటుచందముగ రోసి జను ల్నినుఁ జూచి తిట్టరే.

ఉ. క్రమ్మెడు చిమ్మచీఁకటులు కాఱ్కొను మాఱ్కొనుచోఁ బరస్పరా
స్యమ్ములు గానరాక విరసమ్ముగఁ గైకొనునట్టి సాంపరా
యమ్మునఁ జెంగలించి లవుఁ డన్నకుఁ దోడయి దీప్తబాణజా
లమ్ముల నంధకారపటల మ్మఖిలమ్ము ఖిలమ్ము చేయుచున్.

ఉ. పట్టిన కార్య మీశ్వరుఁడు పట్టి పెనఁగినఁ జేరనీక చే
పట్టుట రాజధర్మ మని పల్కెడునీతిఁ దొలంగి కీర్తికిం
బట్టగు సాహసంబు నిజబాహుబలంబును వీటఁబుచ్చి యీ
పట్టిన వాహముం దిరుగఁ బంపిన నవ్వరె తోడిభూపతుల్.

మ. నను నే మన్నఁ గొఱంత లేదు సభలోనం బుణ్యచారిత్ర మ
జ్జననిం దప్పుఁగ నాడి తీ నికృతికిన్ సైరింపఁగా నేర నా
వినయం బింతకుఁ దెచ్చెఁ జాలుఁ బలుకు ల్వేయేల నే క్షత్రియుం
డనొ వైశ్యుండనొ చూడుమంచు మగిడెన్ సంగ్రామసంరంభియై

౨. శకుంతలాపరిణయము.

మ. జననం బొందితి దుగ్ధవారినిధి నా సర్వేశుజూటంబుపై
జను లేప్రొద్దుఁ బ్రశంస నేయ నవతంసం బైతి నీప్రాభవం
బునకుం బాంథ జనాపకారి యగు నా పూవిల్తునిం గూడి వా
రని దుష్కీర్తిగఁ దిట్టులం బడకు చంద్రా! రోహిణీవల్లభా!

మ. నవలావణ్యపయోధిఁ జిత్త మను మంథానాద్రికిం జంద్రికా
పవనాళిం దరిత్రాడుగాఁ బెనఁచి యజ్ఞాతాస్యనుం దేర్చినన్
రపళిం గోకిలకీరము ల్గరువ నా రత్నాకరంబందు ను
ద్భవముం బొందిన లక్ష్మి గావలయు నప్పద్మాక్షి వీక్షింపఁగన్.

చ. కొనకొని తావి మూర్కొనని క్రొవ్విరి యెయ్యెడ వజ్రసూచి రా
యని రతనంబు జిహ్వ చవియానని తేనియ గోరు మోపి గి
ల్లని చిగురాకు లాలితవిలాసని కేతన మీ లతాంగి తా
ననుభవకర్త యే ఘనుఁడొ యా విధి యత్నమెఱుంగ నయ్యెడున్.

ఉ. నాపయిఁబూర్మి తద్గురుజనంబులపై నిడి మౌనికన్యకా
స్థాపితవృత్తి బంధువనితాతతియందు ఘటించి యిష్టస
ల్లాపములందు నిచ్చటుఁ దలంపక నిచ్చలుఁ బ్రాణనాథ నే
వాపరతంత్రవై యెటులు వచ్చియఁ దెచ్చెదొ నాకుఁ బుత్రికా!*

---

* [పినవీరన నివాసము నెల్లూరు జిల్లా చిట్టగుంట సమీపమందలి సోమరాజు పల్లెగాఁ దోఁచినను, నిజాము రాష్ట్రమునందలి పిల్లలమఱ్ఱియే నివాసమై యుండవచ్చునని శ్రీ చాగంటి శేషయ్యగారు తెల్పుచున్నారు. ఇతఁడు నియోగియనియు, భారద్వాజ గోత్రుఁడనియు శ్రీ శేషయ్యగారు నిర్ణయించి యున్నారు. (ఆంధ్రకవి తరంగిణి, సం. 6, పినవీరన్న చరిత్ర) శ్రీ సాళ్వ నరసింహరాయని పేర నవరత్నములు, రాజ్యాంగ పద్ధతులు రచింపఁ బడినవని, వానికర్త పినవీరన్న కావచ్చునని శ్రీ ప్రభాకర శాస్త్రిగారు వ్రాసినారు.]

# నంది మల్లయ్య, ఘంట సింగయ్య

ఈ యిరువురు కవులును కలిసియే గ్రంథములను జేయుచు వచ్చిరి. వీరు చేసిన గ్రంథములలో ప్రధానములైనవి ప్రబోధచంద్రోదయమును, వరాహపురాణమును. వీనిలో ప్రబోధచంద్రోదయము ననంతామాత్యుని పుత్రుఁడైన గంగయ్యమంత్రికిని, వరాహపురాణమును కృష్ణదేవరాయలతండ్రియైన నృసింహరాజునకును, వీ రంకితము చేసిరి. ఈ యిరువురు కవులలో మొదటివాడయిన నంది మల్లయ్యకు రెండవ కవియైన ఘంట సింగయ్య మేనల్లుడు. ఘంటసింగయ్యకు మలయమారుతకవి యని బిరుదాంకము గలదు. వీ రిరువురకును గల బంధుత్వాదులు ప్రబోధచంద్రోదయములోని యీ క్రింది పద్యమువలనఁ దెలియ వచ్చుచున్నవి.

సీ. కలరు కౌశికగోత్రకలశాంబురాశిమం
దారంబు సంగీతనంది నంది
సింగమంత్రికిఁ బుణ్యశీల ఘోతమ్మకు
నాత్మసంభవుఁడు మల్లయమనీషి
యతనిమేనల్లుఁ డంచితభరద్వాజగో
త్రారామచైత్రోదయంబు ఘంట
నాగధీమణికిఁ బుణ్యచరిత్ర యమ్మలాం
బకుఁ గూర్మితనయుండు మలయమారు

తాహ్వయుఁడు సింగనార్యుడు నమృతవాక్కు-
లీశ్వరారాధకులు శాంతు లిలఁ బ్రసిద్ధు
లుభయభాషల నేర్పరు లుపమరులు న
మర్థు లీ కృతిరాజనిర్మాణమునకు.

వీరు తమ యాశ్వాసాంతగద్యములలోఁ గూడ నుభయునామములను జేర్చుకొని

"ఇది శ్రీమదఘోరమహేశ్వర వరప్రసాదలబ్ధసారస్వతాభినందిత నంది సింగయామాత్యపుత్ర మల్లయమనీషితల్లజ మలయమారుతాభిధాన ఘంట నాగయప్రధానతనూభవ సింగయకవిపుంగవ ప్రణీతంబయిన"

అని వ్రాసికొని యున్నారు. వీ రిరువురును షట్సహస్రనియోగిబ్రాహ్మణులు. వీరిలో మొదటివాఁ డయిన నందిమల్లయ్య కౌశికగోత్రుఁడు; ఆపస్తంబసూత్రుఁడు; దక్షిణామూర్తి గురుశిష్యుఁడు. రెండవవాఁడయిన ఘంట సింగయ్య భరద్వాజగోత్రుఁడు; ఆపస్తంబసూత్రుఁడు; అఘోరశివశిష్యుఁడు. ఈ యంశములనే కవులు తమ వరాహపురాణమునం దిట్లు చెప్పుకొనిరి.

సీ. అపుడు సభావేదికాగ్రస్థితులమైన
మమ్ము వాగీశ్వరీమంత్ర రాజ
సిద్ధిపారగులఁ గౌశిక భరద్వాజగో
త్రుల మహాదేవాంఘ్రిజలజభక్తి
పరతంత్రమతుల నాపస్తంబసూత్రుల
గురుదక్షిణామూర్త్య ఘోరశివుల
శిష్యుల నతిశాంతచిత్తులఁ దనకు నా
శ్రితుల భాషాద్వయకృతినిరూఢ
శేముషీభూషణుల నందిసింగనార్య
తనయుమల్లయకవికులోత్తముని. ఘంట
నాగధీమణికూర్మినందనుని మలయ
మారుతాంకితు సింగయమంత్రిఁ జూచి.

ప్రబోధచంద్రోదయకృతిపతి యైన యనంతామాత్యగంగయ్య తమ్మ రాజపుత్త్రిఁ డయిన వీరబసవనృపాలునకు మంత్రియయి మన్ననలఁ బొందిన ట్లీ క్రింది పద్యమునఁ జెప్పఁబడినది.

సీ. మాధవవర్మభూమండలేశ్వరవంశ
జలధికి నే రాజు చందమామ
యే రా జుదయశైల మెలమి విభేదించె

గపటాహితమదాంధకార పతంగ
గజపతిసురధాణిగడిదుర్గముల కెల్ల
నే రాజు వజ్రంపుబోరుతలాపు
మహిమచే నే రాజు మఱపించె నలభగీ
రధపృధుమాంధాతృరఘురమణుల

నట్టి గుణశాలి తమ్మరాయనికుమార
వీరబసవపక్షీంద్రచక్రవిభునిచేత
మన్ననలఁ గాంచి మించిన మహితుఁ డితఁడు
మనుజమాత్రుండె గంగయామాత్యవరుఁడు.

గంగయామాత్యునిప్రభువయిన బసవన్నపాలుఁడు కొండపీటిరాజ్యమును గజపతు లాక్రమించుకొన్నతరువాత వారిగడిదుర్గముల కధ్యక్షుఁడయి పదునైదవ శతాబ్దోత్తరభాగమున నుండిన సామంతరాజు. బసవమహీశుని సచివుఁడైన గంగయామాత్యుఁడు ప్రబోధచంద్రోదయము కృతినందకముందే దగ్గుపల్లి దుగ్గయ్యచేత రచియింపఁబడిన నాచికేతూపాఖ్యానమును గృతి నందెను. ప్రబోధచంద్రోదయముయొక్క చతుర్థాశ్వాసాంతమునందలి కృతిపతిసంబోధనమయిన యీ క్రింది పద్యము వలన నీయంశము తేటపడుచున్నది.

క. ప్రఖ్యాతనాచికేతూ
పాఖ్యానమహాప్రబంధపరిమళితసుధీ
వ్యాఖ్యానశ్రవణోదిత
సౌఖ్యా! సంఘటితచిత్తశంకరసఖ్యా!

౧౪౭౫ వ సంవత్సరప్రాంతమునందు శ్రీనాథుని ముద్దుమఱఁది యైన దుగ్గకవిచేత నాచికేతూపాఖ్యాన మీతని కంకితము చేయఁబడెను. అటు తరువాత ౧౪౮౦-౮౫ సంవత్సరప్రాంతమున నీ జంటకవులు ప్రబోధ చంద్రోదయము నీతని కంకిత మొనర్చిరి. [ప్రబోధచంద్రోదయరచనా కాలముంగూర్చి "ఆంధ్రకవి తరంగిణి" (సం. 6 పుట 131) లో నిట్లున్నది.

కృతిపతియైన గంగనామాత్యుని ప్రభువగు బసవనృపాలుఁడు దూబగుంట నారాయణకవి చేతఁ బంచతంత్రమును కృతినందియుండెను. బసవనృపాలుని కాలమును శాసనసహాయమునఁ దెలిసికొని నారాయణకవి చారిత్రమున నిర్ణయించి యున్నారము. దానిని బట్టి నాచికేతూపాఖ్యాన రచనాకాలము క్రీ. శ. ౧౫౨౦ ప్రాంతమని దుగ్గయకవి చారిత్రమునఁ జెప్పియుంటిని. ఈ ప్రబోధ చంద్రోదయముకూడ ఇంచుమించుగ ౧౫౨౦ ప్రాంతమున రచింపఁబడి యుండును '] పెసరువాయాన్వయవంశాబ్ధి చంద్రుఁడైన మన గంగయామాత్యుఁడు ముందు జైమినిభారతకృతిపతియైన సాళువ నృసింహనృపాలుని సచివుఁడై యుండినట్టు ప్రబోధచంద్రోదయద్వితీయాశ్వాసాదిపద్యమువలన నెఱుఁగవచ్చును.

క శ్రీకరవీక్షణ ! దాన
శ్రీకర ! నరసింహనృపవశీకర నయవి
ద్యాకరణ ! చతుర్దశవి
ద్యాకర ధీరంగమతి ! యనంతయగంగా !

[పయి పద్యమునుబట్టి గంగయామాత్యుఁడు కొంతకాలము సాళువ నృసింహనృపాలుని సచివుఁడైనట్లు చెప్పుటకు వలను పడదనియు, 'నరసింహ నృప వశీకర నయవిద్యాకరణ' అను విశేషణముచే నృసింహరాయలను జీవగ్రాహముగాఁ బట్టించు గంగనామాత్యుని నయవిద్యాకరణ మహత్త్వమే వ్యక్తమగుచున్నదనియు, గంగనామాత్యుఁడుదయగిరి దుర్గాధిపతి యగు పురుషోత్తమ గజపతికి సామంతుఁడగు బసవనృపాలుని మంత్రియై యుండి తన ప్రభువుతోఁబాటు పురుషోత్తమ గజపతికి సాళువ నృసింహనృపాలునిఁ బట్టుకొనుటలో మిక్కిలి సాయపడి యుండుననియును శ్రీచాగంటి శేషయ్యగారి యభిప్రాయము. శ్రీ ఉకుమళ్ళ అచ్యుతరావుగారును శ్రీ వీరేశలింగము పంతులుగారి యభిప్రాయముతో నేకీభవించలేదు ]

ప్రబోధచంద్రోదయ కర్తలు కొంతకాలము పిల్లలమఱ్ఱి పినవీరభద్ర కవిశిఖామణితో సమకాలీనులు. వీరు తమ ద్వితీయగ్రంథమైన వరాహపురాణమును కృష్ణదేవరాయలతండ్రి యైన తుళువ నరసింహరాయని కంకిత

మొనర్చిరి [ఈ నరసింహరాయఁడు "నరసింహ విజయపురాణము, వరలక్ష్మీ కల్యాణము" అను రెండు గ్రంథములను కృతినందెనని యు, ఆ కవులెవ్వరో ఆ గ్రంథములనుగూర్చిన విశేషము లేమియో తెలియరాలేదనియు, నరసింహ విజయ పురాణములను నరసింహరాయల విజయగాథలే వర్ణింపఁబడి యుండవచ్చుననియును 'ఆంధ్రకవి తరంగిణి' లోఁ జెప్పఁబడి యున్నది. (సం. 6 పుట 121)] ఈ యీశ్వర నరసింహరా జప్పటికి రాజుగాక జైమినిభారతకృతిపతియైన సాళువ గుండనృసింహరాయని దండనాథుఁడుగా నుండెను. ఈశ్వరనరసింహరాయలు ౧౪౨౭ వ సంవత్సరమునందు కర్ణాట రాజ్యాధీశ్వరు డయ్యెను. అతఁడు రాజు కాకముందే వరాహపురాణ మతని కంకిత మొనర్పఁబడినందున ౧౪౨౭ వ సంవత్సరమునకుఁ బూర్వమునం దనఁగా ౧౪౨౦-౨౫ సంవత్సరప్రాంతములయందు వరాహపురాణము రచియింపఁబడి యుండును. కవు లీ క్రింది సీసపద్యభాగమున శ్రీనాథునిఁ గూడఁ బూర్వకవులలోఁజేర్చి పొగడిరి

గీ. నన్నపాచార్యునకు వందనంబు చేసి
తిక్కయజ్వకు మ్రొక్కి కీర్తితములైన
శంభుదాసుని వాగ్విలాసములు నెమ్మ
నంబులోపల నిలిపి శ్రీనాథుఁ బొగడి.

కృతిపతి యయిన నరసింహరాయఁడు నిండుకొలు వుండి తమ్ముఁ జూచి వరాహపురాణమును తన కంకితము చేయుఁ డని కోరినట్లుగా కవు లీ క్రింది పద్యములలోఁ జెప్పి యున్నారు.

సీ. అష్టభాషాకవిత్వాబ్జసంభవులైన
　　సుకవిపుంగవులు సంస్తుతులు చేయ
సంకీర్ణరాగరంజకులైన గాణల
　　గములు గీతప్రబంధములు పాడ
కలకంకణక్వాణకరసరోరుహలైన

రమణులు వింజామరములు వీవ
వరబలాధికులైన శరణాగతారాతి
సామంతు లుభయపార్శ్వములఁ గొలువ

కూర్మితనయుఁడు నరసయ్య గుణనిధాన
మంతికంబున సేవింప నలఁదికొన్న
సురభికాశ్మీరగంధంబు సోడుముట్ట
నుండెఁ బేరోలగము నయనోత్సవముగ.

*  *  *  *

క మీ రిరువురు నెప్పుడును శ
రీరప్రాణముక్రియఁ జరింతురు మిగులం
గూరిమిఁ గృతిఁ బ్రతిపద్యముఁ
జారుగతిం జెప్పఁగలరు చాటువుగాఁగన్.

క. కావున మీరు దలంచిన
శ్రీవారాహంబు మంచికృతి మా పేరం
గావింపుఁ డనుచు సుముఖుం
డై వీడ్యముఁ గప్పురంబు నర్పించుటయున్.

ఇందలి మొదటి సీసపద్యమువలన నరసింహరాయని కొడుకైన (వీర) నరసింహరాయఁ డప్పటికే పెద్దవాఁడయి సభలో జనకుని సమీపమున నుండినట్టు తెలియవచ్చుచున్నది.

ఈ కవులు వరాహపురాణమునందు గృతిపతియైన నరసింహరాయని ప్రభువగు సాళువనృసింహరాజుయొక్క వంశాభివర్ణనము చేయుచు, చంద్రవంశపురాజయిన గుండరాజునకు సాళువ మంగరాజును, సాళువ మంగరాజునకు గౌతరాజును, గౌతరాజునకు గుండరాజును, గుండరాజునకు జైమినిభారతమును కృతి నందిన నరసింహరాజును పుట్టిరట్టును. ఆ నృసింహరాజువద్ద

వరాహపురాణమునకుఁ గృతీశ్వరుఁ డైన నరసింగరాజుతండ్రి యైన యీశ్వరరాజు సేనానాయకుఁ డయి యుండినట్టును, వీరిది తుళువాన్వయ మయినట్టును, చెప్పి యున్నారు. ఈ నృసింహరాజునే నరసింగరాయఁ డనియుఁ పుస్తకములయందు వాడుదురు ఈ యంశమును దెలుపు పద్యాదులలోఁ గొన్నిటిని వరాహపురాణమునుండి యిం దెత్తి చూపుచున్నాను.

సీ. తుహినాంశువంశపాథోరాశిమాణిక్య
మష్టదిగ్గాజభయంకరుండు
కర్ణాటరాజ్యరక్షణదక్షబాహాసి
వరవసంతత్యాగవైభవుండు
శివరాత్రిసమయసంశీలతాగుణశాలి
ధరణీసుపర్వనిస్తారకుండు
విరచితాతులతులాపురుషదానవిభూతి
సమదరాయకటారిసాళువంబు

గుండవిభు నారసింహమండలేశ్వ
రుండు గణుతింప రాజమాత్రుండు గాఁడు
కిన్నరస్త్రీసమూహగేగీయమాన
వర్తనంబులు గల చక్రవర్తి గాని.

.... .... .... ... .... ....

వ. అట్టి నరసింగరాజరత్నంబుచేత మన్నన వడసి సైన్యనాయకపట్ట భద్రత్వంబున నిర్నిద్రవిజయలక్ష్మీమహత్వంబున మదవదభియాతి భయదసత్వంబున దీర్ఘాయురైశ్వర్యభుష్యండైన యీశ్వరనాయకునకుఁ బ్రియతనూభవుండు, నరసవసుధాధ్యక్షుండు నిర్వంచి తాను గ్రహంబునం బరిగ్రహించిన యిమ్మహాప్రబంధంబునకు శృంగార విభూషణంబుగా తదీయవంశావతారంబు.

సీ. ఉదయాద్రి భేదించె హత్తరి నిర్జించె
గండికోటపురంబుఁ గదలఁ ద్రవ్వెఁ

పెనుగొండ సాధించె పెంగుళూరు హరించెఁ
గోవెల గుంటూరు గుంటుపఱిచెఁ
గుందాణి విదళించె గొడుగుచింత జయించె
బాగూరు పంచము పాడుచేసె
నరుగొండ పెకలించె నామూరు మర్దించె
సీరంగపట్నంబు బారిసమరె

రాయచౌహత్తిమల్లధరావరాహ
మోహనమురారి బర్బరబాహుసాళ్వ
నారసింహప్రతాపసన్నాహనుఁ డగుచుఁ
విశ్వహితకారి తిమ్మయ యీశ్వరుండు.

.. .. . ..

గీ. ఇట్లు తుళువాన్వయాగ్రణి యీశ్వరుఁడు
పూర్వజన్మతపఃఫలంబునఁ గులంబు
ధన్యత వహింపఁ గన్నపుత్రకులలోనఁ
బ్రభుత గైకొనె నరసింహపార్థివుండు.

... .. ... ..

సీ. చర్చించి చూచిన సరసజ్ఞతాపటు
ప్రౌఢిమ మరువంబుపరిమళంబు
పరికించి చూచిన నిరుపమత్యాగల
క్ష్మీవిలాసము దేవతావరంబు
భావించి చూచిన బహుమానసమ్యగ్ద
యావిశేషోక్తి శిలాక్షరంబు
తర్కించి చూచిన ధర్మసంపాదన
క్రీడావివేకంబు తోడుసీడ

దుర్మదారాతిహరణచాతుర్యధైర్య
వీర్యగాంభీర్యగుణములు వెన్నతోడఁ
బెట్టినవి సాటి చెప్పుట యెట్లు నృపుల
నీశ్వరప్రభునరసపృథ్వీశ్వరునకు.

పైని జెప్పఁబడిన తిమ్మయయీశ్వరరాజు సాళ్వగుండ నరసింహజునకు సేనానాయకుఁ డగుటయేకాక దాయాదుఁడు కూడ నయి యుండుటచేత నుభయుల యనంతరమును నీశ్వరరాజుపుత్రుఁడుగు సాళ్వగుండ నృసింహరాయని యప్పటిసేనాధిపతియు నైన బలవంతుఁడగు తుళువ నరసింహరాయఁడు సంతానహీనుఁడయి కాలధర్మము నొందిన తన ప్రభువుయొక్క రాజ్యభారమును వహించినట్టు తోఁచుచున్నది. [సాళువ, తుళువవంశములు వేర్వేఱు వంశములనియు, సాళువ వంశీయులు చంద్రవంశ క్షత్రియులు, తుళువ వంశీయులు శూద్రులనియును 'ఆంధ్రకవి తరంగిణీ' కారుల యభిప్రాయము (సం. 6 పుట 12)

సాళువ నరసింహరాయలు సంతానహీనుఁడయి కాలధర్మము నొందలేదనియు అతని కిద్దఱో, ముగ్గురో కుమారు లుండిరనియుఁ గొంద అభిప్రాయపడు చున్నారు. ఈ సాళువ నరసింగరాయల కిరువురు కుమారులనియు, వారిరువురు యుక్తవయసు రానివా రగుటచే నరసింహరాయలు తన యవసాన కాలమున వారిని తన దండాధిపతియు సమర్థుఁడు నగు తుళువ నరసనాయకున కప్పగించి వీరిని జాగ్రతగఁ గాపాడి వారికి యుక్తవయసు వచ్చిన పిమ్మట రాజ్యమును, ధనమును వారి స్వాధీనము చేయుమని వేఁడుకొనెననియు, నందుఁ బెద్దవానిని తిమ్మరసు అను నాతఁడు చంపెననియు, నందుచే రెండవ వానిని సింహాసన మెక్కించి నరసనాయకుఁడు రాజ్యభారమును దాను వహించి నడపెననియు న్యూనిజు అను పాశ్చాత్య చరిత్ర కారుఁడు వ్రాసియుండెననియుఁ జెప్పుచున్నారు .... తిమ్మరాజు అను పేరుగల శత్రురాజు (పెద్దవానిని) చంపియుండెననియు నభిప్రాయ పడిరి. ఇదియే సత్యమై యుండును తుళువ నరస నాయకుఁడే యతనిని జంపించెనని యొక యపవాదము కూడ కలదు. ఈ యపవాదమునకు భయపడి నరస నాయకుఁడు విశేష సమర్థుఁ డయ్యెను, నిజముగాఁ గర్ణాట రాజ్య సింహాసనము నధిష్ఠింపఁ గోరికయు, శక్తియుఁ గలవాఁ డయ్యెను. నర సింగరాయల కుమారుని సింహాసన మెక్కించి, నామ మాత్రమున కాతనిని రాజుగా నుంచి తానే సర్వాధికారియై రాజ్యము చేయుచుండెను కొన్ని

శాసనములలో సాళువ వంశ బిరుదములు తాను ధరించుటయు, దానే రాజు నని ప్రకటింప యత్నించుటయుఁ జూడ నరస నాయకుని రాజ్యకాంక్షయు, స్వాతంత్ర్యా భిలాషయు స్పష్టమగును కాని లోకాపవాదమునకు భయ పడియో, తన ప్రభువున కవసాన కాలమున, జేసిన వాగ్దానము నిలుపుకొన వలయు ననియో, నరసింగరాయల కుమారునిఁ దాను జీవించి యున్నంత కాలము కర్ణాట రాజ్యాధిపతిగా నంగీకరించెనను మాట మాత్రము యథా ర్థము. ('ఆంధ్రకవి తరంగిణి' సం. 6 పుటలు 123, 124)]

వరాహపురాణమును కృతినందిన నరసింహరాయని కాలము మనకుఁ దెలి యును గనుక, ఇంచుమించుగా నీ కవుల కాలమును దెలియును. కృష్ణదేవ రాయల తండ్రియైన యీ నరసింహదేవరాయలు క్రీస్తుశకము ౧౪౮౭ వ సంవత్సరము మొదలుకొని ౧౫౦౮ వ సంవత్సరమువఱకును రాజ్యపాల నము చేసినట్లు శిలాశాసనాదులవలనఁ దెలియువచ్చుచున్నది కంచిలో నున్న దేవాలయములలో నొకదానిమీఁద శాలివాహనశకము ౧౪౦౯-వ సంవత్స రమునం దనఁగా హూణశకము ౧౪౮౭ వ సంవత్సరమునం దీ నరసింహ దేవరాయలు భూదానము చేసిన ట్లొక శిలాశాసనమువలనఁ దేటపడుచున్నది. ఇంతకుఁ బూర్వమునం దీతని పేరు శిలాశాసనాదులలో నెక్కడను ఉదా హరింపఁబడి యున్నట్లు కానఁబడదు అందుచేత నితఁ డా సంవత్సమునందే రాజ్యమునకు వచ్చిన ట్లూహింపఁబడుచున్నది. అనంతపురమండలములో పెన్నేటి యొడ్డున నున్న రామపురమునందలి రామేశ్వరస్వామియాలయపు గోడ మీఁద నరసింహదేవరాయలు శాలివాహనశకము ౧౪౧౯-వ సంవత్స రమునకు సరియైన క్రీస్తుశకము ౧౪౯౭-వ సంవత్సరమునందు రాజ్యము చేయుచుండినట్టు శిలాదానశాసన మొక్కటియున్నది. ఈ ప్రకారముగా నీతనిదానశాసనములు ౧౫౦౮-వ సంవత్సరమువఱకును గానఁబడుచున్నవి. ఆ మఱుసటి సంవత్సరమునందు కృష్ణదేవరాయలరాజ్యారంభమైనది. ఈ నరసింహరాయని యనంతరమున నాతనిజ్యేష్ఠ పుత్త్రుఁడు వీరనరసింహరాయఁ డైదు సంవత్సరములు రాజ్యముచేసి ౧౫౦౮-వ సంవత్సరమునందు మృతి నొందెననియు, అందుచేత కృష్ణదేవరాయల తండ్రి నరసింహరాయలు

౧౫౦౩-వ సంవత్సరమువఱకే రాజ్యపాలనము చేసె ననియు, తండ్రికొడుకుల పేరు లొక్కటియే యగుటచేత శాసనపరిశోధకు లిద్దఱు నొక్కరే యని భ్రమపడిరనియు, కొందఱు చెప్పుచున్నారు సత్య మిదే. కృష్ణదేవరాయలు జనకుని యనంతరమునఁ గాక యగ్రజుఁడైన వీరనరసింహరాయుని యనంతరముననే రాజ్యమునకు వచ్చినట్లు మనుచరిత్రలోని యీక్రింది పద్యములు తెలుపుచున్నవి.

క. వీరనృసింహుఁడు నిజభుజ
దారుణకరవాలపరుషధారాహతవీ
రారి యగుచు నేకాతప
వారణముగ నేలె ధర నవారణమహిమన్.

క అవిభుననంతరంబ ధ
రావలయముఁ దాల్చెఁ గృష్ణరాయఁడు చిన్నా
దేవియు శుభమతి తిరుమల
దేవియునుం దనకుఁ గూర్చుదేవేరులుగన్.

కాఁబట్టి నరసింహదేవరాయలకాలములో నున్న యీ కవులు హూణశకము ౧౪౮౦ వ సంవత్సరమునకును ౧౪౮౫-వ సంవత్సరమునకును మధ్య కాలమునందు వరాహపురాణమును రచియించి యున్నారు. ప్రబోధచంద్రోదయము నంతకుముందే ౧౪౭౦-౭౫ ప్రాంతములందు రచించిరి. వరాహపురాణము కృతి నందు నాఁటి కింకను నరసింహరాయఁడు సాళువ గుండ నరసింహరాయని దండనాథుఁడుగానే యుండినట్లు కృతినాయకుని సంబోధించిన వరాహపురాణములోని యీ క్రింది యాశ్వాసాంతపద్యములు తెలుపుచున్నవి.

క. తుళ్వకులజలధికల్పక
సాళ్వశ్రీనారసింహజనపాలన్ప్ర
ధ్వాళ్విబకంఠీరవ ! మణి
గాల్వతులాకోటిరుచివికస్వరచరణా ! ఆ ౪.

క. బుధవినుత! సాళ్వనరసిం
గధరాధవదండనాథ! కొంతాపంచా
యుధ! సుమన స్తరుసుమనో
మధురసమధురిమధురీణమంజులఫణితీ! ఆ ౬.

క. ధరణినుత దేవకీపుర
వరనిలయశ్రీగిరీశవనసంపన్నే
శ్వరవిభుతనయా! సాళువ
నరసింహనృపాలదండనాయకతిలకా! ఆ ౧౧.

ఈ యిరువురు కవులును గ్రంథరచన చేసినట్లు చెప్పఁబడియున్నను వీరిలో మలయమారుతకవి యనఁబడెడు ఘంట సింగన్నయే ప్రసిద్ధుఁడైన మంచి కవి యైనట్టు గ్రంథాంతరములవలనఁ దెలియవచ్చుచున్నది. ఈ సింగన్న తండ్రిపేరు నాగయ్య; తల్లిపే రమ్మలాంబ; పారిజాతాపహరణమును రచి యించిన నందితిమ్మకవి యీ మలయమారుతకవికి మేనల్లుఁడు నంది మల్లయతండ్రిపేరు సింగన్న. తల్లిపేరు పోతమాంబ సాధారణముగా ముక్కుతిమ్మన్న యనఁబడెడు నందితిమ్మకవి యీ మల్లయకవికి మనుమఁ డని చెప్పుదురు. కాని పారిజాతాపహరణమునందు కవి తన వంశమును జెప్పుచో నీ క్రింది పద్యమునందా సంగతిచెప్పి యుండలేదు.

సీ. కౌశికగోత్రవిఖ్యాతుఁ డాపస్తంబ
సూత్రుఁ డార్వేలపవిత్రకులుఁడు
నంది సింగామాత్యునకును దిమ్మాంబకుఁ
దనయుండు సకలవిద్యావివేక
చతురుండు మలయమారుతకవీంద్రునకు మే
నల్లుఁడు కృష్ణరాయక్షితీశ
కరుణాసమాలబ్ధఘనచతురంతయా
నమహాగ్రహారసన్మానయుతుఁడు
తిమ్మయార్యుండు శివపరాధీనమతి య
ఘోరశివగురుశిష్యుండు పారిజాత

హరణమను కావ్యమొనరించె నంధ్రభాష
నాదివాకరతారాసుధాకరముగ

మల్లయసింగయకవులలో నెవ్వరికవిత్వ మేదో యుభయుల రచనలకును గల తారతమ్యమెట్టిదో నిర్ణయించుట కాధారము లేవియుఁ గానరావు. అక్కడక్కడఁ గొన్ని యపూర్వప్రయోగములు గానంబడుచున్నను మొత్తముమీఁద కవనము రసవంతముగాను, నాతికఠినముగాను, శ్రావ్యముగాను ఉన్నది. కవిత్వరీతి తెలియుటకయి కొన్ని పద్యముల నిందుదాహరించుచున్నాను.

ప్రబోధచంద్రోదయము.

మత్తకోకిల

ఏను మున్నొకనాఁడు పద్మజునింటి కేఁగినఁ గొల్వులో
మౌను లెల్లరు లేచి రప్పుడు మమ్ముఁ జూచి పితామహుం
డానవెట్టి ప్రియంబు చెప్పుచు నంబుగోమయమార్జితం
బైనయట్టి నిజోరుపీఠికయందు నిల్పఁడె నావుడున్. ఆ ౨.

మత్తకోకిల.

ఓరి భిక్షుక! చెప్పురా నిను నొక్క శాస్త్రరహస్య మేఁ
జేరి వేఁడెద నన్ను బౌద్ధుఁడు చిట్టుముట్టు మటంచు నో
రోరి జైనపిశాచ! నగ్నుఁడ! యోరి దుష్కులభాండ! నీ
కూరకేటికి శాస్త్రగర్వము లోరి కాణులు మానురా. ఆ ౩.

ఉ. మెత్తని దుప్పటంబులను మెత్తిన కస్తురికప్పురంబులన్
ముత్తెపుఁబేరులన్ సురభిపూరితపుష్పములన్ వృథా వెలిన్
హత్తిన వేడ్కఁజూతు రహహా! మతిహీనులు లో నెఱుంగ కీ
భిత్తరివారనారు లను పేరిట జంగమనారకంబులన్. ఆ. ౪.

మ. ధన ముద్యన్నిధనంబు దేహము విపత్సంతానగేహంబు భా
మ నితాంతంబు ననర్థసీమ విషయోన్మాదంబు ఖేదంబు గ
న్గొన లోకంబున శోక మిట్టిటులఁగి నూల్కొలేరు ప్రాణు ల్కటా!
యనవద్యాత్మసమేధమానసుఖపథ్యాహృద్యసంచారముల్. ఆ ౫.

వరాహపురాణము

ఉ. చూచె నృపాలునెమ్మొగము చూపు సరోజగతాళిసన్నిభం
బై చరియింపఁ జూచి హృదయ... రాధివిభేదనార్థమై
చూచె నిజార్చితాంగజునిఁ జూపు మహీవిభు నేయనిచ్చు నా
రాచముకై వడిఁగా మెఱయ రాజకుమారిక ఘర్మవారియై. ఆ. ౩.

చ అతివిశదప్రభావిలసనాస్పదమైన పదాంగుళీనఖ
ప్రతతి వెలుంగు నా హిమధరాధరపుత్రికిఁ బద్మనేత్రకుఁగా
గతజననంబునం దమకు గాదిలిసోదరి గాన భక్తితో
సతతముఁ గొల్వ దక్షతనుజాతలు తారలు వచ్చెనోయనన్ ఆ. ౬.

ఉ. కమ్మని తేనియల్ తఱుచు కాలువలై ప్రవహింప మీఁద ఝం
ఝుమ్మని మ్రోయు తుమ్మెదలజొంపము మళ్ళకు నీళ్ళు కట్టుచో
బమ్మినవేడ్కఁబాడు వనపాలకబాలకదంబకంబుచం
దమ్మున నొప్పు నప్పురము నాలుగువంకలఁ బువ్వుతోఁటలన్ ఆ. ౮.

ఉ. ఆ లలనావతంసముల నమ్మనులం గని జారరానల
జ్వాలభరంబు నేత్రములఁ జీఁకటి గొల్పఁగ నాట లేల యీ
యాలతు లేటికిం జెవుల నంతకుపల్కులు వోవ నిన్నియుం
జాలును దుఃఖితే మనసి సర్వ మసహ్యమటం చెఱుంగవేః ఆ ౧౨.

నందిమల్లన్న ఘంటసింగన్న కవులు మదనసేనము, షష్ఠస్కంధము, భారతము, బలరామవిజయము చేసిరని యొకరు వ్రాసియున్నారు. మలయ మారుత సింగన్నకవుల షష్ఠములోనిదని శ్రీమానవల్లి రామకృష్ణకవిగారు కుమారసంభవటిప్పణములో నీక్రింది పద్యము నుదాహరించి యున్నారు——

సీ

వారిధిశయనుఁ జేయారఁబూజింపని ఖలుఁ బట్టి పెడకేలు గట్టి తెండు;హరి మందిరమున కత్యాశఁజై నడవనిహీనాత్ముఁ గొల్పట్టి యీడ్చి తెండు;వలవదు భయంబు వారెంతవారలైన నట్టివారలు మన కగ్గ మైనవారు;వారు నిరయం బునకుఁ గాఁపు వచ్చువారలనుచు బుద్ధిగఁ జెప్పె మార్తాండసుతుఁడు;

# దూబగుంట నారాయణకవి

ఇతఁడు పంచతంత్రమును పద్యకావ్యమునుగా రచియించి తమ్మభూపాలుని పుత్రుఁడైన బసవభూపాలుని కంకితము చేసెను కృతిపతి పిలిపించి తన్నుఁ గూర్చి పలుకుట మొదలైన విషయములను పుస్తకములో కవి యిట్లు చెప్పుకొని యున్నాడు.

చ. హరిహరభక్తు నార్యనుతు నాంధ్రకవిత్వవిశారదు న్మహే
శ్వరవరమాననీయుఁ గులవర్ధను శాంతుఁ బ్రబంధవాచకా
భరణము నాగమాంబికకు బ్రహ్మయమంత్రికి నాత్మసంభవుః
సరసుని దూబగుంటపురశాసను నారయనామధేయునిన్.

క. తలఁపించి హితులు చెప్పఁగఁ
బిలిపించి కవిత్వగోష్ఠిఁ బ్రియ మెసఁగంగాఁ
బలుకుచు నితాంతకాంతిం
దళుకొత్తంగ నంకురించు దరహాసమునన్.

క. తన ముఖచంద్రమరీచులు
జననయనచకోరపఙ్క్తులకు సాంద్రానందం
బొనరింప వేడ్క నన్నుం
గనుఁగొని యిట్లనియె వినయగౌరవ మెసంగః.

చ. సురుచిరమైన నీ కవిత సూరిసభాంతరయోగ్యతామనో
హరసరసార్ధగుంభనల నందము గావున నారనార్య సు
స్థిరమతిఁ గీర్తి నన్నారయఁ జేసి సమస్తజగత్ప్రసిద్ధిమైఁ
బరఁగుచునుండ మాకొక ప్రబంధ మొనర్పు ప్రియం బెలర్పఁగన్.

గీ. పంచతంత్రి యనఁగ నంచితగీర్వాణ
భాషనున్న చెప్పఁబడినయట్టి
కావ్యమాంధ్ర భాషఁ గర్ణామృతంబుగాఁ
గూర్పవలయు నీదునేర్పు మెఱయ.

కృతిపతితియింటిపే రేమో యే కాలమునం దుండినవాఁడో యీ గ్రంథ మునుబట్టి తెలియరాలేదు; గాని యితరగ్రంథములనుబట్టి తెలియవచ్చు చున్నవి కృతిపతి యయిన బసవక్షితీశ్వరుఁడు శ్రీరాముని కుమారుఁడగు కుశునివంశమువాఁడగు మాధవవర్మసంతతివాఁ డయినట్లు చెప్పె. కవి మాధవవర్మ నిట్లు వర్ణించి యున్నాఁడు—

చ. మును బెజవాడ దుర్గమున మగ్ధుతనంబున మెచ్చఁజేసెఁ బెం
  పున రథదంతివాజిభటభూరిబలంబులచేఁ గళింగభూ
  జనపతిఁ ద్రుంచి చేవఁ దన సంతతికై మహిఁ బాడి నిల్పి గ
  మ్మనఁ జిరకీర్తులం గనిన మాధవవర్మనిజాన్వయంబునన్.

పూసపాటివారు మొదలైన యీ ప్రాంతములయందలి క్షత్రియసంస్థానాధి పతు లందఱును దా మీ మాధవవర్మ సంతతివార మనియే చెప్పుకొను చున్నారు. ఈ మాధవవర్మవంశమునందు కొమ్మావనీశుఁడు పుట్టినట్టును, అతని కబ్బలదేవుఁ డుద్భవించినట్టును, అతనికి సింగభూపాలుఁ డుదయించి నట్టును, అతనికి తమ్మరాజు కలిగినట్టును, అతనికిఁ గృతిపతి యైన బసవ ధరాధి నాధుఁడు జనియించినట్టును చెప్పఁబడి

మ. మనుమార్గుఁడగు తమ్మభూపతికి దేమాజాంబకుం బుత్రుఁడై
  జనియించెన్ బసవేంద్రుఁ డర్థిజన భాస్వత్కల్ప భూజాతమై
  వనితామన్మథుఁడై వివేకనిధియై వారాశిగాంభీర్యుండై
  యనతారాతి మహాంధకారపటలీహంస ప్రతాపాఢ్యుఁడై

సీ. రమణీయదానధారాప్రవాహంబులు
      పాథోధి కతివిజృంభణముగాఁగ
  నిరుపమాన ప్రభానిర్మలసితకీర్తి
      త్రిభువనసాంద్రచంద్రికలు గాఁగ
  నతులవిక్రమబలోద్యత్ప్రతాపస్ఫూర్తి
      పరులకు నుగ్రాతపంబుగాఁగ
  సమధికశృంగార సౌందర్యరేఖ దాఁ
      దరుణీలతావసంతంబుగాఁగ

రామరఘురంతిసగరధర్మజదిలీప
భోజసర్వజ్ఞపోమేళరాజసరణి
ధాత్రిఁ బాలించెఁదమ్మభూధవసుతుండు
శాశ్వతంబుగ బసవభూమీశ్వరుండు

ఇత్యాది పద్యములతో గ్రంధమునందుఁ గృతిపతి వర్ణింపఁబడెను. నెల్లూరి మండలములోని యుదయగిరియందు * కుంటమరాజు వల్లభయ్య కుమారుఁడు తమ్మరాజు ౧౪౽౦ వ సంవత్సరమున గోపాలకృష్ణదేవాలయము కట్టించినట్టొక శిలాశాసనమువలనఁ దెలియవచ్చుచున్నది ఈ తమ్మరాజే మనకృతిపతితండ్రియైన తమ్మరాజని తోఁచుచున్నది. అతఁడే యితఁడయినపక్షమునఁ బసవనృపాలుని యింటిపేరు కుంటమరాజు వారనియు బసవనృపాలునికాలము ౧౪౭౦-౮౦ సంవత్సరప్రాంతమనియు స్పష్టమగుచున్నది. ఈ బసవనృపాలునిమంత్రి యనంతయ గంగామాత్యుఁడు

గీ వసుధ నెగడిన మాధవవర్మవంశ
వర్ధనుండగు తమ్మభూవరునిబసవ
పార్థివున కాప్తుఁడై కృపాపాత్రుఁడగుచు
ఘనత మెరసె ననంతయగంగవిభుఁడు.

అని దగ్గుపల్లి దుగ్గనకవి రచియించి గంగనామాత్యున కంకితముచేసిన నాచికేతూపాఖ్యానమునందుఁ జెప్పఁబడినది ఈ దుగ్గనకవి శ్రీనాథ మహాకవి మఱఁది యగుటచేత నాచికేతూపాఖ్యానకర్తయు, భర్తయు పదునైదవ శతాబ్ది యుత్తరార్థమున నుండి యుండవలెను. ఈ యనంతయ గంగామాత్యునకే ౧౪౮౦-౯౦ సంవత్సరప్రాంతము నందుండిన నరసింహరాయనికి వరాహపురాణ మంకిత మొనర్చిన నంది మల్లన ఘంట సింగన కవులు ప్రబోధచంద్రోదయము నంకితము చేసిరి. ప్రబోధ చంద్రోదయమునందు

[* కంఠమరాజని ఆంధ్రకవి తరంగిణి. (సం. 4 పుట 91) పేరు పూసపాటివారని శ్రీ శేషమళ్ళ అచ్యుతరావుగారు]

గీ. అట్టి గుణశాలి తమ్మరాయనికుమార
వీరబసవక్షమాచక్రవిభునిచేత
మన్ననలు గాంచి మించిన మహితుఁ డితఁడు
మనుజమాత్రుండె గంగయామాత్య వరుఁడు.

అని చెప్పఁబడినది. ౧౪౬౦-మొదలు ౧౪౯౦-వ సంవత్సరమువఱకు నుండిన యనంతయామాత్యుని కొత్తప్రభువైన తమ్మయ బసవభూపాలుఁడు ౧౪౭౦-౮౦ సంవత్సరప్రాంతములయందు దప్పక యుండినవాఁడు. అందుచేత తమ్మయ బసవభూపాలునికి పంచతంత్రము నంకితమొనర్చిన దూబగుంట నారాయణకవి ౧౪౭౦-౮౦-వ సంవత్సర ప్రాంతములయందుండె ననుటకు సందేహములేదు. నారాయణకవి దూబగుంటకరణము; * అపస్తంభసూత్రుఁడు; మైత్రావరుణగోత్రుఁడు, బ్రహ్మయామాత్యపుత్రుఁడు; ఆఱువేలనియోగికులపవిత్రుఁడు, ఈతని పంచతంత్రము వేంకటనాథుని పంచతంత్రమంతటి రసపుష్టి కలది కాకపోయినను, సలక్షణమయి చక్కని లోకోక్తులతోను మృదువులయిన తెలుఁగుపదములతోను నిండి తేనెలొలుకునదిగా నున్నది. ఈతని పంచతంత్రమునుండి కొన్ని పద్యముల నిందు దాహరించు చున్నాను

చ. శరనిధి దాఁట నావయును సంతమసం బడఁగింప దీపముం
బరకరిశిక్ష కంకుశము వాయువుఁ గూర్పఁగఁ దాళవృంతముం
బెరవునఁ జేసె బ్రహ్మపదివేలవిధంబుల మూర్ఖచిత్తవి
స్ఫురణ మడంపలేక తలపోయుచు నిప్పుడు నున్నవాఁ డొగిన్

మిత్రభేదము.

---

[* నారాయణకవి యింటిపేరు 'దూబగుంటవా'రని చెప్పుట కవకాశములేదనియు, 'హరిహరభక్తి-' నను పద్యమునుబట్టి 'వాచకాభరణము'గాని, 'ప్రబంధవాచకాభరణము' అని కాని యింటిపేరై యుండవచ్చుననియు, ఒకవేళ 'ప్రబంధవాచకాభరణము' కవివిశేషణమైనఁ గావచ్చుననియు, 'ఆంధ్రకవి తరంగిణి' (సం. 6 పుట 86]

చ. మిగుల హితుండు నావలన మేలును బొందె నితండు నాయెడం
బెగఁడని ధూర్తునమ్మి చెడుఁ డెల్లము సజ్జనశబ్దమాత్రమే
నెగడును గాని యిప్పు డవనిన్ సుజనుం డనువానిఁ గాన ని
మ్మఁగ ధనలేశమాత్రమున మోహనిబద్ధము లోకమంతయున్

సుహృల్లాభము.

చ. అతులితసత్త్వతాపమహిమాస్పదుఁడైన విరోధి దూరసం
స్థితుఁ డగునేనిఁ దద్విపులతేజముఁ దా నడఁగించు; నల్పుఁడా
యతశితశస్త్రహస్తుండయి యొద్దలదగ్గఱ నుండె నేనియున్
జతురుఁడు గాఁడు వైరిజన సంహరణంబునకు న్నిజంబుగన్.

సంధివిగ్రహము.

ఉ. గుండియ పుచ్చి పెట్టుకొని కొమ్మపయిఁ బదిలంబు చేసి నే
నుండుదు నట్టిభారమున కోర్వక యెప్పుడు; నేఁడు నే నభా
గ్యుండను నీకు నక్కఱకుఁ గూర్చిన సొమ్మని మున్నెఱింగి తే
కుండుటఁజేసి యేమని ప్రియోక్తులు పల్కెదు? నేమి చేయుదున్.

లబ్ధనాశనము.

ఉ. అక్కఱలెల్లఁ దీఱవు నృపాగ్రణికిం బొడచూపకున్న నా
కిక్కడ వెన్నపాపనికి నెవ్వరు కాఁ పిఁక వేళ దప్పెఁబో
నక్కడనే ప్రయోజనము లబ్బు మనంబున మానవుండు దా
నొక్కటి చింత చేయ విధి యొక్కటి వేఱ తలంచు నక్కటా. *

అసంప్రేక్ష్యకారిత్వము.

[* వైచరాజు. వెంకటనాథుఁడు శిష్టు కృష్ణమూర్తిశాస్త్రి; భానుకవికూడ పంచతంత్రమును పద్యకావ్యములుగా వ్రాసినట్లు తెలియుచున్నది.]

# వెన్నెలకంటి-సూరన్న

ఈ కవి విష్ణుపురాణమును తెనిఁగించెను. ఇతఁడించుమించుగా పదునేనవ శతాబ్దాంతము నందుండినట్లు తోఁచుచున్నది. విక్రమార్క చరిత్రమును కృతినందిన సిద్ధన్న మంత్రికి పెద్దతండ్రి యయిన వెన్నెలకంటి సూరయ్య యనుకవి యొకఁడు వేమారెడ్డికాలములో నున్నట్లు విక్రమార్క చరిత్రము లోని యీ క్రిందిపద్యమువలనఁ దెలియవచ్చుచున్నది.

ఉ. వెన్నెలకంటి సూర్యుఁడు వివేకగుణాఢ్యుఁడు వేదశాస్త్రసం
పన్నుఁడు రెడ్డివేమనరపాలకుచేత మహాగ్రహారముల్
గొన్న కవీంద్రకుంజరుఁ డకుంఠితతేజుఁడు పెద్దతండ్రిగా
సన్నుతిఁగన్న సిద్ధనకు సంతత దానకళా వినోదికిన్.

ఇందుఁ జెప్పఁబడిన రెడ్డివేముఁడు ప్రోలయవేముఁడు, విష్ణుపురాణమునందు కవిచే ని కపిని గూర్చియే యీ క్రింది పద్యమునందు వ్రాయఁబడి యున్నది.

ఉ. ఈ నిఖిలంబు మెచ్చ నమరేశ్వరదేవుఁడు చూడఁ గృష్ణవే
ణీనది సాక్షిగా ననికి నిల్చిన రావుతుఁ గేసభూవిభుం
గానకుఁ దోలి వెన్నడిచి కాచిన వేమయయన్న పోతభూ
జానికి సత్ప్రబంధము లొసంగిన వెన్నెలగంటివారిలోన్.

ఈ రెండు పద్యములలోను వర్ణింపఁబడిన వెన్నెలగంటిసూతఁ డొక్కఁడే యనుటకు సందేహము లేదు మొదటి పద్యములో "వేమనరపాలకుచేత మహాగ్రహారముల్ గొన్నకవీంద్రకుంజరుఁ" డనియు, రెండవపద్యములో "వేమయ యన్నపోతభూజానికి సత్ప్రబంధము లొసంగిన వెన్నెలగంటివా" రనియుఁ జెప్పఁబడి యున్నను, వేమారెడ్డియు, నాతని పుత్రుఁడైన యన పోతరెడ్డియు నేకకాలమునందే యుండినందున వెన్నెలకంటి సూరయ్య

దండ్రికొడుకుల కిద్దఱిని ప్రబంధము అంకితముచేసి బహుమానములొంది యుండవచ్చును. అంతేకాక యనపోతరెడ్డి దండనాథుఁడుగా నుండి తండ్రి జీవితకాలములోనే ప్రసిద్ధి చెందియుండెనని యెఱ్ఱాప్రెగడ హరివంశము నందు స్పష్టముగాఁ జెప్పఁబడి యున్నది. వేమారెడ్డి హూణశకము ౧౩౨౦-వ సంవత్సరము మొదలుకొని ౧౩౪౯-వ సంవత్సరము వఱకును. ఆతని పుత్రుఁడైన వేమయయనపోతారెడ్డి ౧౩౫౦-వ సంవత్సరము మొదలుకొని ౧౩౭౧-వ సంవత్సరమువఱకును, రాజ్యము చేసినందున వారి యాస్థానము నందుండిన కవి వెన్నెలకంటి సూరన్న యా కాలమునందే నిస్సంశయముగా నుండినవాఁడు. ఈ కవి రచియించి యనపోతరెడ్డి కంకితముచేసిన ప్రబంధములేవో తెలిసినవి కావు. మనలో సాధారణముగా తాత పేరు మనుమనికి పెట్టుచుండుట యాచారమయినందున, విష్ణుపురాణమును రచించిన యీ సూరన్న పయి సూరన్నకు మనుమఁడో, మనుమని మనుమఁడో యయి యుండవలెను. ఈ కవి తాను అనపోతరెడ్డికి ప్రబంధములొసంగిన వెన్నెలకంటివారి వంశజుఁడ ననియు; వెన్నెలకంటి సూర్యుని మనుమఁడ ననియు, వేఱువేఱుగాఁ జెప్పుకొనుటచేత నీతఁడు వేమారెడ్డి కాలములో నున్న సూరన్నకు మనుమని మనుమఁడగుట స్పష్టము. కవి మొదటిసూరన్న కయిదవతరము వాఁడగుటచే నిరువురకును నూఱు సంవత్సరములకంటె నెక్కువ వ్యత్యాసముండి యుండవలెను. కాబట్టి యీ కవి ౧౪౭౦-వ సంవత్సరమునకు ౧౪౮౦-వ సంవత్సరమునకును నడిమికాలములో నుండినట్లు నిశ్చయింపవలసియున్నది. * [ఇయ్యెడ 'ఆంధ్రకవితరంగిణి' లో (సం. 8 పుట 213,214) నిట్లున్నది- 'పంతులుగారు వ్రాసిన యీ యంశము లన్నియు నూహాజనితములేకాని, యొక యాధారముననుసరించి వ్రాసినవికావు. పంతులుగారి యూహ సత్యమైనను కావచ్చును. అట్లు కాక వారిరువురును వేఱువేఱు వ్యక్తులైనను కావచ్చునని. విష్ణు పురాణకర్త అనపోతారెడ్డికి సత్ప్రబంధము లొసంగిన వెన్నెలకంటివారని మాత్రమేచెప్పెను. కాని వేమారెడ్డియొద్ద నగ్రహారములను గైకొనిన సంగతినిగూర్చి

యేమియుఁ జెప్పలేదు. వారొక్కరేయైనను, నిర్వురైనను విష్ణుపురాణ కర్తయైన సూరనార్యునికి తాతగాని, యాతని తాతగాని పై పద్యముల లోని సూర్యులలో నెవఁడును గాఁడు. వీరు వారికంటె భిన్నులు; ........ ఒకప్పుడీ సూరన యాతని వంశ పరంపరలోనివాఁడు కాక వెన్నెలకంటి వారని గృహనామము గల మఱియొక వంశీయుఁడైనఁగావచ్చును. ........ (పుటలు 216,217) వేమారెడ్డి, అనవోతారెడ్డి ప్రభువుల కాలములో నున్న వెన్నెలకంటి సూర్యునిఁబట్టి కాలనిర్ణయముచేయుచు, గురుజాడ శ్రీరామ మూర్తి పంతులుగారు కవికాలము క్రీ. శ. 1378-1428 అనియును, వీరేశ లింగము పంతులుగారు 1460-1480 అనియును నిర్ణయించియున్నారు. కాని, ఆ నిర్ణయము సరియైనదికాదు. .... .... (పుట 221) ఈ సూరనార్యుఁడు పదునారవ శతాబ్దియందున్న వాఁడని స్పష్టము.]

ఈ కవి విష్ణుపురాణమునందు తన్నుఁగూర్చి చెప్పుకొన్న పద్యము నిం దుదాహరించుచున్నాను.

సీ. భవ్యచరిత్రు నాపస్తంబమునిసూత్రు
శుద్ధసారస్వతస్తోత్రపాత్రు
హరితగోత్రపవిత్రు నాంధ్రభాషాకావ్య
రచనాభినయవిశారదుఁ ప్రబంధ
కర్తను వెన్నెలకంటి సూర్యునిమను
మనిఁ జెఱుకూరి యమరయమంత్రి
సత్పుత్త్రు నాశువిస్తారవిచిత్రమా
ధుర్యకవిత్వచాతుర్యశీలు

నిజకులాచారమార్గైకనిపుణుఁ బరమ
సాత్త్వికోదయహృదయ వైష్ణవపురాణ
వేది సారస్యవిద్యాప్రవీణు సుకవి
మాననీయుని సూరనామాత్యవరుని.

ఈ విష్ణుపురాణ మలసాని పెద్దన్న ప్రబంధరచనకు దారితీయుటకుఁ గొంత కాలము ముందుగా పదునైదవ శతాబ్దాంతమునఁ జేయఁబడినది గా నున్నది. ఈ కవి శ్రీనాథాదులను దన పుస్తకమునందుఁ బూర్వకవులను గా స్తుతింపక.

ఉ. మున్నిటికాళిదాసకవిముఖ్యులకుం బ్రణమిల్లి వారిలో
నెన్నికగాఁ బ్రబంధపరమేశ్వరుఁ దిక్కనసోమయాజినిన్
నన్నయభట్టు భాస్కరుని నాచనసోముని రంగనాధునిన్
వెన్నెలగంటిసూర్యుఁ బదివేలవిధంబుల గొల్చి భక్తితోన్.

అని వెన్నెలగంటి సూర్యునికాలమువఱకు నున్నకవులను మాత్రమే స్తుతించినను. ఇతఁడు శ్రీనాథాదుల కాలమునకుఁ దరువాతివాఁ డయినట్టు విష్ణుపురాణకృతిపతియైన రావూరి రాఘవరెడ్డి కృతు లందిన తన పూర్వులను గూర్చి చెప్పిన యీక్రింది పద్యమువలన తేటపడుచున్నది.

క. అనవేమమండలేశ్వరుఁ
డును నశ్వయవీరభద్రుఁడును మొదలుగఁ గ
ల్గినతొంటిరెడ్డిరాజులు
ఘనకీర్తులు గనిరి కృతిముఖంబున ననుచున్.

శ్రీనాథునిచేఁ గాశీఖండము కృతినంది ౧౪౩౫ వ సంవత్సరప్రాంతములం దుండిన వీరభద్రరెడ్డిని తన పూర్వులలో నొకనిగా కృతిపతియైన రాఘవ రెడ్డి చెప్పుటచేత విష్ణుపురాణము రచియింపఁబడినకాల మటు తరువాత నేఁబది యఱువది సంవత్సరములయిన నయి యుండవచ్చును. కృతిపతియైన రాఘవరెడ్డి యనవేమారెడ్డి వంశజుఁడని చెప్ప నుద్దేశించిన పద్యము లీ విష్ణు పురాణములోఁ గొన్ని కలవు.

ఆ. అట్టి పంటకులమునందు నేడవ చక్ర
వర్తి యన్నవేమవసుమతీశుఁ
డుద్భవించి కీర్తియును సత్ప్రతాపంబు
నెసఁగ భూమి యెల్ల నేలుచుండె.

క. తన బ్రతుకు భూమిసురులకుఁ
దన బిరుదులు పంటవంశధరణీశులకున్
దన నయము భూమి ప్రజలకు
ననవేమన యిచ్చెఁ గీర్తి నధికుం డగుచున్.

ఈ పద్యములతరువాత సంబంధ మేమియుఁ దెలుపకయే లింగారెడ్డి తేఁబడి తదాదిగా కృతిపతియైన రాఘవరెడ్డివఱకును వంశము చెప్పఁబడినది. కృతి పతిని సంబోధించెడి చతుర్థాశ్వాసాంతమునందలి యీ క్రింది పద్యమునందు బసవయరాఘవరెడ్డి సరిగా ననవేమభూపాలుని వంశమువాఁడనియే చెప్పఁబడినది.

మ. అనవేమక్షితిపాన్వయోత్తమ! సముద్యద్వైభవోపేంద్ర! కాం
చనభూమీధరధైర్య! శాశ్వతయశస్సంపన్న! దైతేయశా
సనపూజాపరతంత్ర! నామితరిపుక్ష్మాపాలకోటీర! కాం
తనవప్రాభవ! సత్కవీంద్రకవితాతాత్పర్య! శౌర్యోన్నతా!

కృతిపతియైన రాఘవరెడ్డిపైని జెప్పఁబడినట్లన వేమక్షితిపాన్వయుఁడే యయిన పక్షమున, అనవేముఁడు పురుషసంతానము లేనివాఁ డగుటచేత నాతనిపుత్రసంతతివాఁడు గాక దుహితృసంతతివాఁడయి యుండవలెను. లేదా యనవేముని పినతండ్రి సంతతిలోనివాఁడయి జ్ఞాతివర్గమునఁ జేరిన వాఁడయి యుండును. కృతిపతిజనకుఁడైన తమ్మయబసవరెడ్డియుఁ దరువాత నీరాఘవరెడ్డియు ప్రౌఢదేవరాజాదులగు కర్ణాటకచక్రవర్తులచేత నుదయగిరి రాజ్యపరిపాలకులుగా నియమింపఁబడి చిన్న సంస్థానమునకు ప్రభువులయి యుండినట్టు కనుపట్టుచున్నది.

క. వారలలోపల బసవ
క్ష్మారమణుఁడు పేరుపెంపుగల మన్నీఁడై
భూరిప్రతాపజయల
క్ష్మీరతుఁడై వెలసె నుదయగిరిరాజ్యమునన్.

సీ. కటకాధిపతియైన గజపతిరాజుచేఁ
ప్రతిలేనిపల్లకిపదవి నొందె
మహిమచేఁ గర్ణాటమండలాధిపుచేత
గడలేని రాజ్యభాగములు గాంచెఁ
బ్రౌఢపౌరుషమున రాజిల్లి మెఱయఁగా
మలకవజీర్ల కుమ్మరికఁ జేసెఁ
దెలుగాణభూములఁగల మన్నెవారిచే
బలవంతమునను గప్పములు గొనియెఁ

జాటుధాటీనిరాఘాట ఘోటకావ
శీఖురోద్ధూతనిబిడధూళీవిలిప్త
మండితాశాంగనాకుచమండలుండు
బాహుబలశాలి తమ్మయబసవవిభుఁడు.

రాఘవరెడ్డి విష్ణుపురాణషష్ఠాశ్వాసాంతపద్యములలో నొకదానిలో నిట్లు సంబో ధింపఁబడెను.

ఉ. చాటుతరప్రబంధకవిసన్నుత! సంగరపార్థ! ధీరతా
హాటకశైల! నిత్యవినయప్రతిభావిభవాఢ్య! భూమిభృ
త్కూటగుహావహిత్థ నృపకుంజర! సంగడిరక్ష! క
ర్ణాటనరేంద్రదత్త సముదంచితశాశ్వతరాజ్యవైభవా!

ఈ రావూరి రాఘవరెడ్డికి గుడ్లూరు రాజధానిగా నుండిన ట్లీ క్రింది పద్యము లోఁ జెప్పఁబడినది.

సీ. గౌరిసమేతుఁడై గరిమతో నే వీట
నేపాఱు నీలకంఠేశ్వరుండు
వారాశికన్యతో వర్తించు నే వీట
గిరిభేదిసుతుఁడైన కేశవుఁడు
యోగినీసహితయై యొప్పారు నే వీటఁ

బసిఁడిపోలేరమ్మ భవునికొమ్మ
పాపవినాశయై ప్రవహించు నే పీట
మన్నేఱు మిన్నేటిమార టగుచుఁ
గుంజరములు వేయి కొలువంగ నే పీటఁ
గొడగుచక్రవర్తి పుడమి యేలె
నట్టి రాజధానియై యొప్పు గుడ్లూరి
వానర నేలుచుండి యొక్కనాఁడు.

సీ. వేదాంతవిదులైన విద్వాంసు లొకవంక
నుభయభాషాకవు లొక్కవంక
సకలాప్తబాంధవ సంబంధు లొకవంక
నుద్భటులున్న కొమారు లొక్కవంక
నీతికోవిదులైన నెఱమంత్రు లొకవంక
నుద్దండరణశూరు లొక్కవంక
సంగీతసాహిత్యసర్వజ్ఞు లొకవంక
జొక్కంపుబరతజ్ఞు లొక్కవంక

రాజురాజులు పంచిన రాయబారు
లొక్కవంక విలాసిను లొక్కవంక
బలసికొలువంగ నతులవైభవముతోడ
రమణఁ గొలువుండి బసవయరాఘవుండు.

ఈ పద్యములపయి గద్యమునందు రాఘవరెడ్డి "రావూరిపురాధీశ్వరుఁ" డని చెప్పఁబడినది. రావూరు గుంటూరునకును, కొండవీటికిని మధ్యను గుంటూరుమండలమునం దున్నది. గుడ్లూరు నెల్లూరుమండలములో పాక నాటిసీమలోని కందుకూరుతాలూకాలో నున్నది.

కృతికర్తయైన వెన్నెలగంటి సూరన్నకవి యించుమించుగా ౧౫౮౦-౯౦వ సంవత్సర ప్రాంతములయందు విష్ణుపురాణమును జేసెనని చెప్పవచ్చును.

ఈ కవికాలమును నిర్ణయించుటకు విష్ణుపురాణమునందింకొక చిన్నయాధారముకూడఁ గానఁబడుచున్నది కృతిపతియైన రాఘవరెడ్డికి తిరుమల తాతాచార్యులమనుమఁడైన సింగరాచార్యుఁడు గురు వయినట్లీ క్రింది పద్యమునందుఁ జెప్పఁబడియున్నది.

సీ. వేదాంతవిద్యావివేకి షడ్దర్శన
పారంగతుఁడు పరాపరరహస్య
వేది బహ్మాండాదివివిధపురాణజ్ఞుఁ
డసమాన ధర్మశాస్త్రాభినేత
తుళలుండు పరమార్థకోవిదు డఖిలాధ్వ
రక్రియానిపుణుఁ డవక్రకావ్య
నాటకాలంకారనానాకళాభిజ్ఞుఁ
డుభయభాషాకవితోజ్జ్వలుండు
పరమవైష్ణవమార్గతత్పరుఁడు కీర్తి
ధనుఁడు తిరుమలతాతయ్యమనుమఁడైన
సింగరాచార్య గురువుఁగా సేవచేసి
రమణఁ జెలువొందె బసవయరాఘవుఁడు.

ఈ పద్యములో రాఘవరెడ్డి తిరుమలతాతాచార్యుని మనుమఁడైన సింగరాచార్యునికి శిష్యుఁడని చెప్పంబడినను షష్ఠ్యంతపద్యములలో నొక్కటియైన యీ పద్యమునందు సరిగా తిరుమలతాతాచార్యుని శిష్యుఁడేయని చెప్పఁబడెను

క. తిరుమలతాతయదేశిక
వరశిష్యున కనుపమేయవైదుష్యునకుణ్
బరభూపాల తమస్సం
హరణాదిత్యునకుఁ బల్లవాదిత్యునకుణ్.

రాఘవరెడ్డి బాల్యమున వృద్ధుఁడైన తిరుమల తాతాచార్యునకును తదనంతరమునఁ దత్పౌత్రుఁడైన సింగరాచార్యునకును గూడ శిష్యుఁ డయి యుండ

వచ్చును ఇది యిట్లుండఁగా గళాపూర్ణోదయమునందు నంద్యాల కృష్ణ రాజునుగూర్చి చెప్పఁబడిన షష్ఠ్యంతపద్యములలో

క. విశ్రుతతిరుమలతాతా
ర్యశ్రేష్ఠాన్వయసుదర్శనాచార్యతనూ
జశ్రీనివాసగురుచర
ణాశ్రయణసమార్జితాఖిలాభ్యుదయునకున్.

అని పింగళసూరన్న ౧౫౭౦ వ సంవత్సర ప్రాంతములయందుండిన కృష్ణ రాజునకు తిరుమల తాతాచార్యవంశజుఁడయిన సుదర్శనాచార్య పుత్రుఁడగు శ్రీనివాసాచార్యుఁడు గురువయినట్లు చెప్పుటచేత సరిగా తిరుమల తాతా చార్యునకును, నాతని మనుమఁడైన సింగరాచార్యునకును శిష్యుఁడైన రాఘవరెడ్డి యంతకుఁ బూర్వము డెబ్బది యెనుఁబది సంవత్సరములు పూర్వుఁడయి యుండవలెను పయిని జెప్పఁబడిన రెండు మూఁడు హేతువులను మొత్తముమీఁద విమర్శించి చూడఁగా విష్ణుపురాణకర్తయగు వెన్నెలకంటి సూరన్న హూణశకము ౧౪౮౦-౯౦ సంవత్సర ప్రాంతములం దున్నవాఁడని నిరాక్షేపముగా నిరూపింప వచ్చును.

వెన్నెలకంటి సూరన్న నియోగిబ్రాహ్మణుఁడు; అమరమంత్రి కుమారుఁడు. ఈతని కవిత్వము మృదుమధురపదభూయిష్ఠమయి ద్రాక్షాపాకమయి యనర్గళధార కలిగి ప్రవహించుచున్నది. ఇతనిది సలక్షణమయిన మంచి కవిత్వము. ఈతనికవనధోరణిఁ జూఁపుటకయి కొన్ని పద్యములవిష్ణుపురాణములోనివాని నిం దుదాహరించుచున్నాను

ఉ. ఆపద లెల్ల మాన్చి సుఖమైన పదంబులఁ బూన్చి యాత్మసం
తాపము లెల్లఁ బుచ్చి విదితంబగు సంపద లిచ్చి భక్తులం
దేవయుఁబోలె దుఃఖజలధిం బడకుండఁగఁ దేల్చి ప్రోవ ల
క్ష్మీపతి యున్నవాఁడు మదిఁ జింత దొఱంగుము పాకశాసనా. ఆ. ౧.

ఉ. అందని పంటి కేమిటికి నఱ్ఱు నిగిడ్చెదు ? విష్ణుఁడున్న యా
కందువ చందమా మగుటకల్ వినుమి పని కట్టిపెట్టి నా
డెందములోని యుమ్మలిక డిందుపడం జనుదెమ్ము పోవ మిం
పొంద సమస్తభోగములఁ బొందెదు తండ్రికి వేడ్కచేయఁగన్. ఆ. ౨.

చ. ఎనిమిది మాసముల్ రవి మహీవలయంబునఁ గల్గుతోయమున్
తన కిరణంబులందుఁ గొని తక్కిన మాసచతుష్టయంబునన్
ఘనతరవృష్టిరూపములుగా జలము ల్గురియింప లోక మె
ల్లను బరితృప్తిఁ బొందును జలంబును నన్నముఁ గల్గి పెంపుతోన్.

మ. పరకాంత న్మదిలోన నైనఁ దలఁపం బాపంబు దుఃఖంబునున్
బరివాదంబును నొంది ఘోరనరకప్రాప్తవ్యథల్ పెక్క వ
త్సరముల్ చెందుదు, రట్టి యన్యవనితా సంభోగదోషంబు దా
నరనాథోత్తమ ! యింత యంత యని యెన్న న్వచ్చునే యేరికిన్;

ఉ. కారుమెఱుంగులో మెలపు గైకొని నేర్చిన పైఁడిబొమ్మలో
మారునిదీపములో కలికిమాటలచంద్రికలో చెలంగుశృం
గారరసాధిదేవతలొ కమ్మని క్రొవ్విరితీగెలో యనన్
వారిజపత్రలోచనలు వచ్చిరి మోహవిలాసమూర్తులై. ఆ. ౫.

ఉ. కాయజుచేత గాసిపడి గౌతముభార్యకుఁ బోయి కొక్కొరో
కో యని కోఁడికూఁత లొగిఁ గూసి మునీంద్రునిచేత శప్తుఁడై
పోయిన వజ్రి మేటిదొరపోలె బృహస్పతిపత్నికై ననున్
రోయఁగ నాడ నేల తన రోఁతలు లోకమువారు నవ్వఁగన్ ఆ. ౬.

ఉ. ఈ యవివేకపుంబనుల కెల్ల తొడంగితి వొప్పు దింత య
న్యాయము గాలిపోయెడు దురాగతిముల్ విని పాపబుద్ధి న
య్యో ! యిటువంటి ముద్దులసహోదరి ముందల పట్టి యీడ్చి కో
కో యని కూయఁగాఁ గుతిక కోసిన లోకమువారు తిట్టరే ?- ఆ. ౩

మ. మదిరాపానముచేత నొక్కసతి తా మత్తిల్లి వేరొక్కతెన్
హృదయేశుండని కౌఁగిలించె; నది దానిం బ్రాణనాథుం డటం
చొదవన్ గమ్మని మోవి యిచ్చె, నటు లన్యోన్యప్రవృత్తక్రియల్
ముదిత ల్కొందఱు చూచి నవ్వి సరసంబు ల్పల్కి రత్యంతమున్

# ఫణిభట్టు

ఈ కవి పరతత్త్వరసాయనమను నైదాశ్వాసముల వేదాంత గ్రంథమును రచించెను. ఇందు ప్రథమాశ్వాసమున కర్మయోగప్రకారము, ద్వితీయాశ్వాసమున ననాత్మవివేకము, తృతీయాశ్వాసమున నాత్మవివేకము, చతుర్థాశ్వాసమున యోగత్రయలక్షణము, పంచమాశ్వాసమున రాజయోగప్రకారము చెప్పఁబడినవి. శ్రీ మహాభారతమునందు భీష్ముఁడు ధర్మరాజున కుపదేశించినట్లున్న హరసనత్కుమారసంవాదమునే తాను ప్రబంధరూపముగా రచించినట్లు కవి చెప్పెను గాని భారతమునందలి హరసనత్కుమారసంవాదములో నిందలి యుపదేశములు గానరావు. ఈ కవి సకలవేదాంత సిద్ధాంతమైన యద్వయ బ్రహ్మవిద్యారహస్యమును తన కుపదేశించిన సదానందయతి కీ కావ్యము నంకిత మొనర్చెను, సదానందయోగి తన గృహమునకు విచ్చేసి తనవలన నర్ఘ్య పాద్యాదిసంపూజనముల నొంది తనకు వేదాంతోపదేశము చేసినట్లు కవి చెప్పుకొన్నాఁడు.

గీ. ఏ మునీంద్రుని కరుణామయేక్షణంబు
లాశ్రితాఘౌఘరోగరసాయనంబు
లాతఁ డలరసదానందయతి యనంగ
నవనిఁ బేరొందు భువనత్రయంబుఁ బొగడ

.... .... .... ....

గీ. తనదుసల్లాపరుచి పాన్థ జనులశ్రుతుల
దప్పి దీర్పంగ వేంచేసెఁ దగ మదీయ
మందిరంబున కల సదానందమౌని
విభుఁడు మత్పూర్వభవపుణ్య' భవమునను.

ఈ కవి తన వంశము నిట్లు చెప్పుకొనెను—

క. శ్రీకరకవిత్వవిద్యా
సాకల్యం బఖిలశాస్త్ర చతురము నిగమ

వ్యాకీర్ణ మీశ్వరాన్వయ
మాకల్ప యశోభిరామ మై ధర వెలయున్.
ఈ శ్రోత్రియవంశమునందు
సీ. సురుచిరాపస్తంబసూత్రుఁ డీశ్వరవంశ
పాత్రుఁడు గార్గ్యసగోత్రుఁ డఖిల
వేదశాస్త్రపురాణవిఖ్యాతుఁ డభినవ
వ్యాసుండు సద్యశోభాసురుండు
ఫణిపతిభట్టనఁ బ్రఖ్యాతుఁ డతనికి
లక్ష్మమ్మ యను శుభలక్ష్మణాంగి
పరమపాతివ్రత్యగరిమచే గిరిజాత
యన నుతిగన్న యయ్యతివ పత్ని

.... .... .... ....

క. ఆ దంపతులకుఁ బుట్టెను
మేదిని వెలుఁగొందు విబుధమిత్రుం డనఁగా
వేదవిదుం డీశ్వరభ
ట్టాదరమున నరణులందు నగ్నియపోలెన్.

గీ. విద్యలకు బ్రహ్మ ప్రావీణ్యవిభవమునకు
విష్ణుఁ డమలత కీశుండు వేదవిత్త్వ
మున కల వసిష్ఠుఁ డగు జ్ఞానమునకు గురుఁడు
వక్తృత కహీశుఁ డీశ్వరభట్టు జగతి

గీ. అతని కొసఁగెను దోర్బలచతురుఁ డనఘుఁ
డమలవాధూలగోత్ర తిరుమలభట్టుఁ
డఖిలవిదుఁ డల లక్ష్మమ్మ యందుఁ గనిన
కన్య రామమ్మ నధికసౌజన్య నెలమి

క. ఆ మిధునమునకుఁ బుట్టితి
మేము త్రిమూర్తులను బోలె నిల ముగ్గుర ము
ద్దామయశుఁడు కొండయ శో
భామణి నారాయణయ్య ఫణితిప నేనున్.

పయి పద్యములయం దీశ్వరాన్వయమున నాపస్తంబసూత్రుఁడును గార్గ్య సగోత్రుఁడును నయిన ఫణిభట్టు పుట్టినట్టును, తద్వంశమున జనించిన యీశ్వరభట్టునకును తత్పత్నియైన రామమ్మకును తానును తనయన్నలైన కొండుభట్టును నారాయణభట్టును జనన మొందినట్టును కవియైన ఫణిభట్టు చెప్పుకొనెను. పుస్తకమునం దాశ్వాసాంతగద్య మిట్లున్నది.

> "ఇది శ్రీమదద్వయబ్రహ్మవిద్యారహస్యావబోధననిపుణతాధురీణ సాక్షిన్మహేశ్వర శ్రీసదానందసద్గురురాయపట్టభద్రకరుణాతరంగిణీ రంగత్తుంగాభంగతరంగహోలాందోళిత హంసడింభాయమానేశ్వరాన్వయసంభూతేశ్వరభట్టతనూజ ఫణిభట్టప్రణీతంబైన పరతత్త్వరసాయనంబను మహాకావ్యంబునందు ... పంచమాశ్వాసము"

కృతికర్తవంశానువర్ణనమునుబట్టి గాని కృతిభర్తవర్ణనమునుబట్టి గాని కవికాలమును నిర్ణయించుటకు నాకాధార మేదియుఁ గానరాలేదు. అందఱు నీతఁడు పూర్వకవి యనుచున్నారు గనుక కాఁ డనుటకుఁ దగినకారణ మేదియుఁ గనఁబడనందున నేనును నీతనిఁ బూర్వకవిగానే పరిగణించెదను. శ్రీమానవల్లి రామకృష్ణకవిగారు ముద్రింపించి ప్రకటించిన పరతత్త్వరసాయనము యొక్క పీఠికలో వారు కవికాలనిర్ణయమును జేసి యుందురన్న భ్రమతోనే నా పుస్తకమును సంపాదించుటకు బహు ప్రయత్నములు చేసితిని గాని యింతవఱకును నా కృషి సఫలముకాలేదు. *

* రామకృష్ణకవిగారు ౧౯౧౦ వ సంవత్సరము ఏప్రియల్ నెలలో ప్రకటించిన నీతిశాస్త్రముక్తావళియొక్క యాచ్ఛాదనపత్రముపైని దీనివెల మూడణాలయినట్టు ప్రచురించిరి; ౧౯౧౨ వ సంవత్సరము జూన్ నెలలో ప్రకటించిన శ్రీరంగమహాత్త్వము తుదిపుస్తకప్రకటనములో పరతత్త్వరసాయనము యొక్క వెలను మూడణాల నుండి పండ్రెండణాలకు పెంపుచేసిరి, తరువాత ౧౯౧౪ వ సంవత్సరము ఆగష్టు నెలలో ప్రకటించిన నన్నెచోడుని కుమారసంభవము ద్వితీయభాగముయొక్క యాచ్ఛాదనపత్రముపైని దానివెల పండ్రెండణాల నట్టే యుంచిరి. పరతత్త్వరసాయన సంపాదకులు గాని, ముద్రాపకులు గాని, ముద్రితగ్రంథమును గొని తమయొద్ద నుంచుకొన్నవారుగాని నాకొక ప్రతిని వీ-పీగాఁ బంపి నా కృతజ్ఞతకుఁ బాత్రు లగుదురు గాక !

కవికాలనిర్ణయమునకు గ్రంధములోని యీ కవిస్తుతిపద్యమే ముఖ్యాధార మని చెప్పుచున్నారు.

సీ. ప్రథమకవిత్వహేవాకిని వాల్మీకి
　　　భారతాదికథావిభాసు వ్యాసుఁ
గావ్యత్రయీప్రవికాసుఁ గాళీదాసు
　　　హరికథాదళితమహాఘు మాఘు
వివిధప్రబంధవాగ్విశ్రాణు బాణుని
　　　సారార్థవిజ్ఞానధీరుఁ జోరు
సఖిలవిద్యామనోహరు మయూరుని
　　　సన్నుతకవివర్యు నన్నపార్యుఁ

దిక్కయజ్వాదిపూర్వ ప్రథితకవుల ను
తించి యేతత్కవీంద్రుల నెంచి భావి
కావ్యకరుల బహుక్రియాకలన నుంచి
పూని చేసెదనొక కృతి పుణ్యనియతి.

దీని నాధారము చేసికొని కవి నన్నయతిక్కనలను మాత్రమే స్తుతించి నందున మిక్కిలి ప్రాచీనకవి యనియు, తిక్కయజ్వాదిపూర్వప్రథిత కవులనుటచేతఁ దిక్కనాదులకుఁ దరువాతఁ గొంతకాలమున కుండెననియు చెప్పుదురు కర్తృకాలమును నిర్ణయించుట కిట్టివే యాధారములైనయెడల తమ పుస్తకములలోఁ గవిస్తుతులను జేయని వారందఱును నన్నయాదు లకే పూర్వు లని చెప్పవలసి వచ్చును. * ఫణిభట్టారకుని కవిత్వము

* [పరతత్త్వ రసాయనమున బమ్మెర పోతురాజుయొక్క పోలికలు కానవచ్చు చుండుటచే ఫణిభట్టు పదునేనవ శతాబ్ది చివఱనుండి యుండవచ్చునని, దాని ముద్రిత ప్రతి పీఠికలో శ్రీపాద లక్ష్మీపతి శాస్త్రిగారు తెలిపియున్నారు ]

మొత్తముమీఁద రసవంతమయి పండితజనశ్లాఘాపాత్రముగా నున్నది. ఈతవిశైలి తెలియుటకయి పరతత్త్వరసాయనములోని పద్యములఁ గొన్నిటి నిందు క్రింద నుదాహరించుచున్నాను.

మ చిరమై నిర్మలమై మహావిభవమై చిన్మాత్రమై సత్యమై
పరమై సంతతసంయమీశ్వరమనఃప్రత్యక్షమై నిత్యమై
దురితారణ్యదవార్చియై మదిని భక్తుల్గోరునర్థంబునై.
స్థిరభావంబునఁ దోఁచు బ్రహ్మము మదిన్ సేవింతుదత్త్వార్థినై.

చ. అవికలభక్తి నెవ్వని మహాత్ములు చిత్తములందుఁ జేర్చి బా
హ్యవిరతిఁ బూని సత్కృతి సమర్పణ లొప్పఁగ నర్థిఁ జేయుచుం
దవిలి సమాధియోగములఁ దత్పరులై భజియించి మృత్యుపా
శవిరహులై సుఖింతు రనిశంబును నా హరి కేను మ్రొక్కెదన్.

మత్తకోకిల

పాయరాని యపాయమున్ బహుపంకహేయ మమేయదో
షాయనంబు విషాదసంహత మంతికస్థితమృత్యు వీ
కాయ మేమి నిజంబు? నమ్మఁగఁ గాదు దీనిని బంచలం
బేయెడన్ సతమండ్రు బుద్ధివిహీనచిత్తులు మూఢతన్ — ఆ ౨.

చ. మదమున దుర్జనుం డితరుమాన మెఱుంగక నిందసేయుఁ బెం
పు దఱుఁగు కిల్బిషక్రియలఁ బూని యొనర్చును సాధుసేవకుం
గుదురఁడు సద్గుణాళి మదిఁ గూరఁడు దుర్విషయాభిలాషలం
బొదలెడిఁ గాని సద్గురుసుబోధితమార్గము నంటఁ డెన్నఁడున్

ఉ ఓ మహితాత్మ! నీకరుణ నుజ్జ్వలమైన వివేక మాత్మకై
మామకచిత్తసన్నిహితమంజులమై మది గల్గె దేఱ లోఁ
దామసవృత్తి మానె హరితత్పరమౌచు మనంబు గోరెడిన్.
నీ మహనీయవాత్సలభినిర్గతదేవమహత్త్వతత్త్వముల్ ఆ. ౩,

చ. అలయక నాసికాగ్రమున నంటఁగఁ జూపులు గూర్చి ధ్యానమం
డలగత చిత్ప్రకాశ మచటం గని చిత్తము తద్గతంబుగా
నిలిపి నిరంకుశక్రమవినిర్గతవాయునిరోధనంబునం
దొలఁగక యోగి పొందుఁ బరితోషమహామృతవార్ధి మగ్నతన్.

మ. అతితేజోమహనీయు నాత్మహృదయాభ్యంతస్థు నీశున్ సుని
శ్చితబుద్ధిం గురుబోధచే నెఱింగి పూజింపందగుం గానిచో
హితబుద్ధిం దృఢలోహమృచ్ఛిలల నూహింపగ నొంటన్ మనో
హితమూర్తిన్ రచియించి పూజ లిడు టౌ నెన్నంగ నీశార్చనల్.

మ. పరమబ్రహ్మమె సద్గురుం డగుఁజుమీ భావింప నెట్లన్న దు
స్తరమాయాంధులలో నొకం డెఱిఁగి తత్పాదాశ్రయుండైనచోఁ
గరుణ న్వానికి నొక్కయుక్తినె మహాకల్పంబులంబోని దే
హరతిం ద్రోసి భవంబుఁ ద్రుంచి ఘనమోహచ్ఛేదముం జేసెడిన్.

చ. ఇది యది యిందు నం దపుడు నిప్పుడు నా నెడలేక పట్టుటల్
వదులుట లేమి లేక తన వర్తన లేరి కెఱుంగనీక పెం
పొదవు వినోదలీలల మహోత్సవము ల్వెలయించుచుండఁగా
సదమలమూర్తి పూర్వభవసంచితపుణ్యసమాధి పూర్ణుఁడై. ఆ. ౨

చ. అనఘ! యనేకజన్మసముపార్జితమైన వివేకసంపదం
గననగుఁ గాని యీనెఱి వికల్పమతిం బహువేదశాస్త్రముల్
పనివడి యారయన్ మదికిఁ బట్టగునే సుకరంపుఁదెల్వి దా
దినకరుఁబోలె సద్గురుఁడు తెల్పినఁగాక యవిద్యఁ ద్రోయుచున్.

ఉ. నే నను నాకు నే నన ననిత్యశరీరము తోఁచు భ్రాంతిచే
నే ననునేన నే ననిన నిర్మితనిత్యత గల్గుగావునన్
నే ననుదాని కాది యగునేగద! యాత్మన దానిఁ గన్గొనన్
బూని యొనర్చుయోగమునఁ బొందఁగవచ్చు సమాధిసౌఖ్యమున్:

♦ ♦ ♦ ♦

# మనుమంచిభట్టు

ఈ కవి హయలక్షణసారమను నైదాశ్వాసముల గ్రంథమును రచించి కుమార కంపభూపాలున కంకితము చేసెను. ఇతఁ డాశ్వాసముల కధికారము లని పేరు పెట్టెను. ఈ గ్రంథమునందు గుఱ్ఱముల మంచి చెడుగులును, వాని రోగలక్షణములును, రోగచికిత్సలును ఆవర్తవిశేషములును, గతిస్వరవివరణములును చెప్పఁబడినవి ఇవి యన్నియు శాలిహోత్రునిసంస్కృతహయలక్షణానుసారముగాఁ జెప్పఁబడినట్టు కవి యీ క్రింది పద్యముచేఁ దెలిపియున్నాఁడు.

చ. అనఘుఁడు శాలిహోత్రుఁడు హయంబులకు న్మును చెప్పినట్టి యా
యనుపమలక్షణంబులు పయఃపరిమాణము రోమజంబులుం
దెనుఁగున నెల్లవారలకుఁ దేటపడన్ రచియింతు సత్కవుల్
విని కొనియాడ దానగుణవిశ్రుత ! కంపయమేదినీశ్వరా !

ఈ గ్రంథము మూఁడధికారములును నాలవయధికారములో నిరువదియైదు పద్యములును గల తప్పులతడిక యొకటి ముద్రింపఁబడియున్నది. గ్రంథాది నుండి పంచమాశ్వాసమున ౧౦౩ పద్యములవఱకును గల ప్రతి యొకటి చెన్నపురిలో దొరతనమువారి ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారమునందున్నది. ఈ రెండు ప్రతులలోను గూడ గ్రంథావతారికలేదు. అందుచేతఁ గృతిపతి కాలమునుగాని కృతికర్తకాలమునుగాని నిర్ణయించుటకుఁ గలఁ యాధారములు గ్రంథములో నంతగాఁ గానరావు.

క. క్రోడావర్తతురంగము
వేడుక నెక్కంగఁ గోరువెట్టికి సూఱుం
మూడుట విక్రమ మని ము
న్నాడిరి హయశాస్త్రవేదు లౌబళకంపా !

ఇత్యాది పద్యములలోఁ గృతిపతి యౌబళునిపుత్రుఁ డయినట్టు చెప్పబడెను. కృతిపతియైన కంపనరపాలుఁడు సాళువవంశజుఁడే యయినను గొన్నిస్థలము

లలో 'చాళుక్యచూడామణీ' అని చళుక్యవంశజుఁడయినట్టు సంబోధింపఁబడెను ఇతఁడు చళుక్య రాజులకడ దండనాథుఁడయినందున ఈకంపమహీపాలునకు సాళువవంశమువారికిఁ గల బిరుదము లన్నియు నున్నందునను చళుక్య వంశజులబిరుదము లంతగా లేనందునను కంపనృపాలుఁడు సాళువ వంశజుఁడే యని నిశ్చయింపవలసియున్నది * జైమినిభారతమునందు

గీ ఔర ! మీసరగండకటారిసాళ్వ !
పంచఘంటానినాదాదిభయదబిరుద !
కాహళారావసంపాతకంపితారి
దీప్తిబలసీరి ! సాళువతిప్పశౌరి !

అని సాళువ తిప్పరాజును

క. ధరణివరాహునకు బ ! ర్బరబాహునకు .. ...

క. ...భీకరచౌహత్తిమల్లబిరుదాంకునకున్.

క మీసరగండనికిఁ గటా ! రీసాళువమునకు .. .

అని సాళువ గుండ నరసింహరాజునకును, మీసరగండ కటారిసాళ్వ, ధరణీవరాహ, బర్బరబాహ, చౌహత్తిమల్ల, మొదలైన బిరుదము లుపయోగింపఁబడినవి ఈ క్రింది పద్యములలో నిందుమించుగా నీ బిరుదములే కృతిపతియైన కంపభూపతికిని ప్రయోగింపఁబడినవి.

గీ ఇట్లు చెప్పినపాటిని నెల్లసుఖ్య
విలిచెనేనియుఁ దమతముఫలము నిచ్చు
నట్లు గాకుండు నం దల్ప మధికమైనఁ
జండభుజబల ! మీసరగండ ! కంప ! ఆ. ౨.

* [సాళ్వ వంశీయులు చాళుక్యులనుట సరిపడకున్నది ఈ విషయమై పరిశోధన జరుగవలెను.]

క. ఘోటంబుల సుళ్ళుండిన
ఘోటంబులు పతుల మీఱి కుశలము నడచున్
పాటించుచుండి సడచుచు
టించిరి శాస్త్రవిదులు బర్బరబాహో! అ ౩.

గీ. అశ్వరత్నంబుమును జెప్ప హయమునడిమి
పళ్ళు తురగముకడపటి పళ్ళకడను
క్రమముతో నవమాదివర్ణములమూట
హరిణ విలసిల్లు రాయచౌహత్తమల్ల! ఆ. ౪

క నిరుపమతేజోవిభవా
కరమునఁ గడు నొప్పమీఱు గంధర్వము దాఁ
బరికింప నింద్రపత్త్యము
ధరణీరమణీయబాహా! ధరణివరాహా!

ప్రభువుల బిరుదములను దండనాథులైన పాలకులును వహించుట యాచారమయినందుకు సాళువ గుండరాజాదుల బిరుదములను వారిదండనాథులైన తుళువనరసింహరాజాదులు వహించినట్టుగా వర్ణింపఁబడిన వరాహపురాణములోని యీక్రింది వాక్యములే సాక్ష్యమిచ్చుచున్నవి.

వ చాళుక్యనారాయణుండును .. ... ... బర్బరబాహుండును నగు నరస వసుధాధీశ్వరుండు,

గీ. రాయచౌహత్తమల్ల ధరావరాహ!
మోహనమురారి! బర్బరబాహు సాళ్వ!
నారసింహ ప్రతాపసన్నాహనుఁ డగుచు
విశ్వహితకారి తిమ్మయయీశ్వరుండు

ఈ కడపటి వాక్యములోని బిరుదములు సాళ్వనరసింహరాజువే యన్ననన వచ్చును. ఇందలి మోహనమురారిబిరుదము మూఁడవ యధికారమునందు కంపభూపాలుని విషయమునను వాడఁబడినది.

కాన నందదోషంబులు గానవచ్చు
హరుల నేలంగవలదు మోహనమురారి.

ఈ కంపనృపతి దండనాయకుఁ డైన ట్లీక్రింది పద్యమువలన దెలిసికో వచ్చును.

క. కకుదంబున నలికంబునఁ
బ్రదికమున సంధులను సుళ్ళు తిరమై యున్నన్
బ్రకటితదోషం బగు నిది
నకులాదులమతము దండనాయకతిలకా! ఆ ౧.

ఈ కంపభూపాలుఁడు దక్షిణమధురాపుర విజయయాత్రకయి ౧౩౬౯ వ సంవత్సర ప్రాంతమునఁ బంపఁబడినట్లు మధురవిజయములోఁ జెప్పఁబడిన కంపభూపాలుఁడు కాఁడు ఆ కంపభూపాలుని తండ్రి వీరబుక్కరాయలు; ఈ కంపభూపాలుని తండ్రి యౌబళరాయఁడు ఆ కాలమునందు సాళువ వంశమున నౌబళభూపాలుఁ డొకఁ డుండెను సాళ్వ మంగ నృపాలున కగ్ర భ్రాతయు, గుండభూపాలునకు ద్వితీయపుత్రుఁడును వీరయౌబళుఁ డయినట్లు జైమినిభారతములోని యీ క్రింది పద్యము తెలుపుచున్నది.

మ. జననం బందిరి గుండభూవిభునకున్ సంధాకబంధారిగా
తనయుల్ శ్రీనిధి వీరయౌబళుఁడు నుద్యత్కీర్తి మాదయ్యయున్
ఘనతేజోనిధి గుండబమ్మఁడును సంగ్రామస్థలీపార్థస
జ్జనమందారులు సాళ్వమంగనృపుఁడున్ సావిత్రిమంగాంకుఁడున్.

కృతిపతియైన కంపపృథ్వీపతి యీ యౌబళుని కొడు కయినను, కావచ్చును; లేదా, మనుమనికొడు కయినను కావచ్చును. కొడుకేయైన పక్షమునఁ గృతి పతియుఁ గవియు, పదునాల్గవ శతాబ్దాంతమున నుందురు; కాకున్నయెడల పదునైదవ శతాబ్దాంతమున నుందురు ఇది యూహయే కాని నిశ్చయ మని తలనుపడదు మనుమంచిభట్టారకు నందఱును పూర్వకవులలోనివాఁ డను

చున్నారు. * ఈకవి బ్రాహ్మణుఁడు; భైరవాచార్యుని పుత్రుఁడు. ఈతని యాశ్వాసాంతగద్య మిట్లున్నది

'ఇది సకలసుకవిజనసంస్తూయమానకవితాచాతురీధురీణ నిఖిలభాషా ప్రవీణ భైరవాచార్యపుత్ర పరమపవిత్ర మనుమంచిభట్ట ప్రణీతంబైన హయలక్షణవిలాసంబునందు'

ఈతని కవిత్వము చక్కఁగానే యున్నది కాని యేహేతువుచేతనో లక్షణ విరుద్ధము లయినప్రయోగము లనేకములు కానఁబడుచున్నవి. కవిత్వరీతిని దెలుపుటకయి హయలక్షణవిలాసములోని పద్యములఁ గొన్నింటి నిం దుదాహరించుచున్నాను.

ఉ. దూరము పోవునప్పుడును దుర్దమశత్రునృపాలసైన్యముం
బోరుల గెల్చునప్పుడును బొంకముగా మృగయావినోదవి
ద్యారతిఁ దేలునప్పుడు నరాధిపకోటికి వాజులట్ల పెం
పార జయాదికారణము లారసి చూడఁగఁ గల్గ నేర్చునే? ఆ. ౧.

చ. అరయఁగ సర్వలక్షణసమంచితమైన తురంగరత్న మే
నరునిగృహంబునం దొక దినంబుననుం దగురీతి నుండు నా
పరమపవిత్ర గేహమునఁ బాయక నిల్చుర మా వధూటి శ్రీ
ధరునియురస్థలింబలె ముదం బెసలారఁ బ్రసన్నచిత్తయై. ఆ. ౧.

చ. తిరముగ రోచమానమును దేవమణిం దగఁ గూడి యున్నయ
త్తురగము పూర్వభాగకృతదోషము లన్నియుఁ ద్రెంచు, నెంచఁగాఁ
బరఁగినయట్టి మేఖలిక పశ్చిమభాగము దోషరాసులన్
బొరిఁబొరిఁ ద్రుంచుమాడ్కి మఱి భూవరగర్వముఁ దక్క నన్నిటిన్,

* [కర్నూలుజిల్లా పెద్దచింతకుంట శాసనమును బట్టియు, తిరుపతియందున్న కంపభూపతి శాసనమును బట్టియు మనుమంచిభట్టు కాలము క్రీ॥ శ॥ 1442 - 1459 ప్రాంతమని నిశ్చితమగుచున్నదని శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు తెల్పుచున్నారు (చూ. భారతి - విరోధి - ఆషాఢము)]

ఉ. తిన్నని కుక్షిమూలములఁ దేరిన రంధ్రయుగంబు క్రిందటన్
ప్రన్నని దీప్తితోడ నుపరంధ్రము లుండు తురంగజాతికిన్
బన్నుగ గండపార్శ్వములఁ బైకొని వన్నెలు నిల్చుఁ జూడఁగా
సన్నుతచాళుకీతిలక! సాళువకంపనృపాలమన్మథా! - ఆ. ౪.

మ. హరిరత్నంబున కుత్తమాంగభుజమధ్యస్థానసంప్రాప్తమై
కర మొప్పారును గ్రీవ గ్రీవకముపై గంఠంబుపై-?
సరికేశాళిశిరంబుసంధి వెనుకం జె న్నొందుఁ గేశాంతముల్-?
సరసోదారకుమారకంపనృపతీ! చాళుక్యచూడామణీ! - ఆ. ౩.

చ. కవ లగుచున్ హయంబులు తగన్ జనియించినవానియిల్లు దా
నవనితలంబుమీఁదఁ జటులానలరోచులఁ జూచి చూచి వా
చవి గొనుఁ గానఁ దక్కిన విచారము చేయక దేవతామహీ
దివిజుల కిచ్చు టొప్పు నని ధీరులు చెప్పిరి శాస్త్రపద్ధతిన్. ఆ ౪.

శా. వేణుక్రౌంచమృదంగదుందుభిలసద్వేదండనాగోల్లస
ద్వీణావారిదమంజునాదములకు న్వియ్యంబులై యొప్పు ని
క్వాణంబు ల్గల వాజి యిచ్చు బతికిం గళ్యాణముల్ కంపన
క్షోణీపాలక! సుప్రతాప! శుభముల్ స్తోత్రైక పాత్రంబుగన్. ఆ. ౪.

చ తులసియు వావిలాకు కరుదూపము కుందిరియుఁ దెల్లనైనయా
వలు వస యుప్పు మాగడియు వారకయొక్కటియున్ సమంబుగాఁ
దుల నిడి యావుపంచితముతో మృదు వారఁగ వత్తిఁ జేసి వా
జులగుదమూత్రరంధ్రములఁ జొన్పిన శూలలు మాను భూవరా!

# కేతనమంత్రి

ఇతడు బాణభట్టకృతమైన కాదంబరి కావ్యమును తెనుఁగున రచియించెను. కేతనకృత మయిన కాదంబరిలోని దని రంగరాడ్ఛందమునందీ పద్యముదాహరింపఁబడి యున్నది

ఆ వె. జనవరేణ్యుఁ గాంచి సాష్టాంగ మెరఁగిన
నా విభుండు వాని లేవనెత్తి
కౌఁగిలించి వానిఁ గనుఁగొని కేయూర
కాభిధాన మొసఁగెఁ గడుముదమున.

ఈకేతనకవి దశకుమార చరిత్రమును రచియించిన కేతనకవి కాఁ డనియు, భాస్కరుని కేతన యనియు కొట్టరువుకేతన యనియు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారును శ్రీ మానపల్లి రామకృష్ణకవిగారును వ్రాయుచున్నారు. ఈ పుస్తకము నాకు లభింపలేదు. ఇదియే నిజమయిన పక్షమున కేతనకవి తిక్కనసోమయాజికిఁ బెదతండ్రి యయి యుండవలెను. అప్పు డతని కాలము ౧౨౨౦-౫౦ ప్రాంతము లగును కేతనప్రెగడ విరచితమైన కాందబరిలోని దని యుదాహరణ గ్రంథములో నీక్రిందిపద్య ముదాహరింపబడినది *

సీ. దీనిలోపలఁ గొన్నిదినము లుండిన నుష్ణ
కరుఁడైన నట శీతకరుఁడు గాఁడె
దీనిపెం పెఱిఁగినఁ దా నంబురాశిలోఁ
గాదని జలశాయి కాఁపు రాఁడె
దీని తియ్యనినీరు దివిజులు ద్రాగి చూ
చినఁ దమయమృతంబు చేఁదు గాదె
దీనితోయము తలపైఁ జల్లినంతనె
పాపాత్ములును మోక్షపరులు గారె

---

* పెదపాటి జగ్గన కూర్చిన 'ప్రబంధరత్నాకరము'న నిది యుదాహృతము

యనుచుఁ గొలని యిట్టియతిశీతలత్వంబుఁ
బరపుఁ బెంపుఁ దీపుఁ బావనతయుఁ
గడుమునంబుఁ బెంపఁగా వాజి బడివాగె
త్రాపఁ దిగిచికొనుచుఁ దటికుఁ జొచ్చె *

ఈ యుదాహృత గ్రంథములోనే కేతన ప్రెగడ కువలయాశ్వచరిత్రము లోని దని యీ పద్య ముదాహరింపఁబడినది

ఉ కోటతనర్చుఁ జూడ్కుల కగోచర మయ్యెను దేరిమీఁద బ
ల్మాటున నేగుచోటఁ దగులం బడమిన్ రవిమండలంబు నీ
పాటిదయన్ తలంపునకుఁ బట్టగు చున్నది గాక దీనికిం
బాటి యనంగ గుజ్జనఁగఁ బట్టవె యయ్యుదయాస్తశైలముల్. ♦

♦ ♦ ♦

* [మూలఘటిక కేతన వ్రాసిన 'దశకుమార చరిత్రము'నుబట్టి, యీ కేతన తిక్కన తాతయగు మంత్రి భాస్కరుని పెద్దకుమారుఁడనియు, తిక్కనకుఁ బెదతండ్రి యనియుఁ దెలియుచున్నది. భాస్కరుని కేతనయేకొట్టరువు కేతన. ఇతని మనుమఁడు వేఱొక కేతన కలఁడు. అతఁడు కవిగా ప్రసిద్ధిలేదు ]

♦ [కువలయాశ్వ చరిత్రమును రచించిన కేతన తిక్కన పెదతండ్రికంటెను, దశ కుమార చరిత్ర కర్తకంటెను భిన్నుఁడు ఇతఁడు నందురి కేతనయో, వేఱొకఁడో యయి యుండవచ్చునని 'ఆంధ్రకవి తరంగిణి' కర్త యభిప్రాయము.] (చూ రెండవ సంపుటము పుట 134)

[కాదంబరీ కావ్యరచన క్రీ.శ. 1260 ప్రాంతమునకు ముందుగానే జరిగియుండును నని 'తెనుఁగు కవులచరిత్ర' లోఁ గలదు. (పుట 286)]

# కవిభల్లటుఁడు

ఈ కవి యొక లక్షణగ్రంథమును, విక్రమార్క చరిత్రమును రచియించె నని చెప్పుచున్నారు ఈ గ్రంథములు నాకు లభింపలేదు. ఈతఁడు సంస్కృతమున నిఘంటువులు రచియించెను, ఇతని పదమంజరియందీ శ్లోకమున్నది

శ్లో. లక్ష్మీరుబద్ధనృపాలేన యం ప్రాప్తా కవిభల్లటమ్
తేన కావ్యదృశా ప్రోక్తా సప్రాసా పదమంజరీ

దీనినిబట్టి యితఁడు బుద్ధనృపాలుని కాలములో ననఁగా ౧౨౩౦ వ సంవత్సర ప్రాంతముల రంగనాథరామాయణకాలములో నుండినట్లు తెలియవచ్చుచున్నది.*

"శ్రీమద్దాక్షారామభీమనాథవరప్రసాదలబ్ధసకలభాషాకవితానిర్వాహకకవిభల్లటవిరచితా గణమంజరీ సమాప్తా"

అని యీతని గణమంజరి కడపట నున్నందున నితఁడు గోదావరీమండలములోనివాఁ డనియు, తన పుస్తకములను దాక్షారామ భీమేశ్వరస్వామి కంకితము చేసెననియు తెలిసికొనవచ్చును ఈ క్రిందిపద్యము కవిభల్లటుని విక్రమార్క చరిత్రములోని దఁట,

ఆ. వె. చెప్పకున్న నీవు జీవంబు విడుతువు
జెప్పినపుడు తనకు జీవహాని
చెప్పి మున్న నీకు జీవంబు విడిచెద
నీవు చన్న వెనుక నిలువలేను,

[* ఈ బుద్ధరాజు గోన బుద్ధరాజని చెప్పుట కాధారములు లేవు. కొండ పడమటి బుద్ధరాజని 'తెనుఁగు కవులచరిత్ర' (పుట 306)

'ఆంధ్రకవి తరంగిణి' కారులు కవి భల్లటుని గూర్చిన విద్వాంసుల యభిప్రాయములను విపులముగఁ జర్చించి - చివఱ కితని గ్రంథములను గూర్చియు, కాలమును గూర్చియు నేమియు నిశ్చయింపక విడిచిరి.]

[ఈ కవినిగూర్చి 'తెనుఁగుకవుల చరిత్ర' లో నిట్లున్నది-''తెలుగున ప్రాచీన కవుల నామములను పరిశీలించిన నవి కొన్ని ప్రసిద్ధసంస్కృత కవుల నామములని తెలియఁదగి యున్నది. అవి బిరుదములైనను - బిరుదనామముతో వ్యవహార ముండుటవలన నా యా వ్యక్తుల నిజనామములు మఱుగుపడి యున్నవి.........వారిలో నీ కవిభల్లటుఁడు నొకఁడు. ఈతఁడు సంస్కృతమున భల్లట శతకమును రచించి కాశ్మీర దేశమున ప్రఖ్యాతికెక్కిన కవిభల్లటుని పేర వెలసినవాఁడు. తెలుఁగు భల్లటకవి శూద్రకరాజ చరిత్రమును, బేతాళ పంచవింశతిని రచించినట్లు లక్షణగ్రంథములు చెప్పుచున్నవి. ఈతఁడే రచించిన 'పదమంజరి' యను సంస్కృత గ్రంథమునుబట్టి యీతని కాలము 1060-70 ప్రాంతమని చెప్పవచ్చును.] (పుట. 306.)

## కవిరాక్షసుఁడు

ఇతఁడును దాక్షారామ నివాసుఁడే. ఇతఁడు కవిభల్లటునివలెనే నన్నయభట్టునకును తిక్కన సోమయాజికిని నడిమికాలమునం దుండినవాఁడు. ఇతఁడే వేములవాడ భీమకవి యని కొందఱనిరి గాని యీత డాతఁడు గాక కవిరాక్షసీయమును రచించిన వేఱొకకవియయి యున్నాఁడు, ఈతని గూర్చి యప్పకవి యీ క్రిందికథను వ్రాసెను.

ఉ. ఆదిని శబ్దశాసన మహాకవి చెప్పినభారతంబులో
నేది వచింపఁగాఁబడియె నెందును దానినె కాని సూత్రసం
పాదనలేమిచేఁ దెలుఁగుఁబల్కు మఱొక్కటి కూర్చి చెప్పఁగా
రా దని దాక్షవాటికవిరాక్షసుఁడే నియమంబు చేసినన్.

క. ఆ మూడు పర్వములలో
నామాన్యుఁడు నుడువుతెనుఁగు లరసికొని కృతుల్
తాము రచించిరి తిక్కన
ధీమణి మొదలైనతొంటితెలుఁగు కవీంద్రుల్.

కవి రాక్షసుని యాదినారాయణచరిత్రములోని దని యొకానొక లక్షణ గ్రంథములో నీక్రింది పద్య ముదాహరింపఁబడినది.

ఉ. శ్రీయుతలోచనోజ్జ్వలమరీచులు భానుమరీచివిస్ఫుర
త్తోయజకాంతితోడ దులఁ దూఁగెడుపచ్చనిపట్టు గట్టియ
త్యాయతశంఖచక్రరుచిరాసిగదాధరుఁ డేఁగుఁదెంచె నా
రాయణుఁ డార్తరక్షణపరాయణుఁ డాకరిరాజుపాలికిన్.

[కవిరాక్షసుఁడనునది బిరుదమువలెఁ గానవచ్చుచున్నది. ఆంధ్రమునందే కాక సంస్కృతమున నొక కవిరాక్షసుఁడున్నాడు. అతఁడు 'షడర్థ నిర్ణయ'

మను సంస్కృత నిఘంటువు నొకదానిని వ్రాసి యున్నాఁడు. ఆంధ్రకవి కంటె నీఁతడు భిన్నుఁడు.

రంగరాట్ఛందములో 'కవిరాక్షసీయము' లో నిదిగాఁ జెప్పఁబడిన పద్యము అనంతుని ఛందము (ఛందోదర్పణము) లో ననంతునిదిగాఁ గాన వచ్చు చున్నది ఇతని గ్రంథములు లభ్యములు కాకుండుట నెట్లు నిశ్చయించుటకు వలనుకాకున్నది.

వెన్నెలకంటి జన్నయ్య రచనగాఁ బ్రసిద్ధమైన 'దేవకీ నందన శతకము' లోని యొక పద్యమునుబట్టి యది 'కవిరక్షః శ్రేష్ఠప్రణీత' మనియు పదివేల పద్యములలో నేర్చి నూటపది పద్యములీశతకముగా నర్పించెననియుఁ దెలియు చున్నది కాని యీపద్యము ప్రక్షిప్తమని తలఁపఁబడుచున్నది.]